# విషయసూచిక

# యుద్ధమల్లుని బెజవాడశాసనము.

ఈశాసనము కృష్ణామండలములోని బెజవాడలో నున్న శ్రీమల్లేశ్వరస్వామి యాలయములో భద్రపఱుపఁబడియున్న యొకనాఁపరాతి (పాలరాతి) మీఁదఁ జెక్కఁబడి యున్నది ఈరాతిని 1892-వ సంవత్సరమున శాసనాధికారులు (Government Epigraphist) కనిపెట్టిరి. అప్పు డది యాలయప్రాకారమధ్యమున నున్నమంటపాలముందు వసారాయడుగున నితరములగు రాతిపలకలతోఁబాటు స్థాపింపఁబడియుండినది పిదప దాని నచ్చటనుండి తీసి యాయాలయప్రాకారమధ్యముననే యొకగదిలో భద్రపఱిచియున్నారు. శాసనాధికారులును నామిత్రులు నగు రావుసాహేబు హోసూరి కృష్ణశాస్త్రులుగా రీశాసనమునకు సరియయిన ప్రతిబింబ మొకటి తీసి నాకుఁ బంపిరి

ఇటీవల నే నాశాసనస్తంభమును బ్రత్యక్షముగాఁ జూచినాఁడను. శాసనము స్తంభముయొక్క యెదుటిప్రక్కను, ఎడమప్రక్కను, కుడిప్రక్కను గొంతవఱకును జెక్కఁబడియున్నది. ఎడమప్రక్కమాత్ర మడుగునుండి పైకిఁ జదువవలయును ఇట్లు క్రిందినుండి మీఁదికిఁ జెక్కఁబడినవి ప్రాచీనశాసనములలో మఱికొన్ని గూడఁ గలవు ఎడమవైపు 3-4-5-6 పంక్తులలో మొదటి యక్షరములు మాత్రము పోయినవి. మిగిలినశాసన మంతయు సురక్షితముగా నున్నది అక్షరము లించుమించు చదరపుటంగుళము ప్రమాణము గలిగి సువ్యక్తములుగా నున్నవి. పంక్తికిఁ బంక్తికి నడుమ నొకటియు నరయంగుళ మెడము కలదు. కుడిప్రక్కశాసన మొకపద్యపాదమధ్యమున నిలిచిపోయినది దీనియడుగున 1087-వ శకసంవత్సరమున నుత్తరాయణసంక్రాంతి నిమిత్తమున మహామండలిక బంగయనాయఁకుని గురువును గుమ్మనూరు వాస్తవ్యుఁడు నగు నీశ్వరభట్టసోమయాజులు బెజవాడ శ్రీమల్లేశ్వరస్వామికి నఖండదీపమునకుఁగాను 55 గోవుల నర్పించిన ట్లొకతెలుఁగుశాసనమును, వెనుకప్రక్కను ప్రథమకులోత్తుంగచోళుని రాజ్యకాలము 41-వ సంవత్సరములో "రాజేంద్రచోళ తెంకణ్ణైనాట్టు మూవేందవేళార్" అను నామాంతరముగల "అణ్ణైసూరుడైయర్ వేళార్ కావేరివల్లవర్" అను నతఁడు రాజేంద్రచోళపుర

మను రెండవపేరుగల విజయవాడలో వేంచేసియున్న "శ్రీమల్లేశ్వరముడైయ మహాదేవర" యాలయములో నఖండదీప మాచంద్రార్కముగా నుంచుటకై దొడ్డయ్య యనువానిపరముగా 50 గొఱ్ఱెల నిచ్చినట్టులు మఱియొకశాసనము నున్నది.

ఈశాసనములోఁ జేర్కొనఁబడిన యుద్ధమల్లునినాఁటి శాసనము లిది వఱకేవియుఁ బ్రకటింపఁబడి యుండలేదు. కాని, యీసమీపకాలములోని వాఁడైన ప్రథమచళుక్యభీమరాజునాఁటి శాసన మొకటి Epigraphia Indica పత్రికలోఁ (సం. 5 పు. 127) బ్రకటింపఁబడి యున్నది. ఆశాసనపు లిపియు, నీబెజవాడశాసనపు లిపియు నొక్కరూపముగానే యున్నవి. కావున, నీ రెండు శాసనములు నించుమించుగా నేకకాలమునందుఁ బుట్టినవియే యని యూహింపఁ దగును. భాషవలెనే లిపియుఁ గాలక్రమమున మాఱినది. కనుకఁ బూర్వశాసనములకాలము నిర్ణయించుట కాశాసనముల లిపి యొక ముఖ్యసాధన మగుచున్నది.

## లిపి

ఇప్పటిలిపికినిఁ బ్రస్తుతశాసనలిపికిని భేద మధికముగా నున్నట్టులు స్థూల దృష్టికే గోచర మగుచున్నది. ఎట్లన —

### అచ్చులు.

తలకట్టుగీఁత యిప్పటిగీఁతకంటె వెడలుపుగను హ్రస్వముగను నున్నది. ఇది అకారచిహ్నము. అక్షరములతలకుఁ గట్టఁబడును, అనఁగాఁ దగిలింపఁబడును గానఁ దలకట్టనుపేరు వచ్చినది. ఈ తలకట్టు, కుడివైపునకుఁ బొడిగించి కొన క్రిందికి వంచివేసినయెడల నది ఆకారచిహ్నమగును. ఆధునిక లిపిలో నీవంపు నున్నగా మాఱినది. ఒకానొకప్పుడీవంపు నక్షరముక్రిందికి సాఁగఁదీసి యెడమవైపుగాఁ బొడిగించుటయుఁ గలదు. హల్లులమీఁదవచ్చు ఇకారమునకుఁ దెలుఁగులో గుడి యనిపేరు. ఈనామమున కనుగుణముగా శాసనములోని యికారచిహ్నము కేవలచక్రాకారముగా నున్నది. ఈనాఁటి యికారచిహ్నమునకు గుడియను సంజ్ఞ చెల్లదు. ఎడమవైపున నారంభించి గుడి చుట్టునపుడు కొనల రెంటినిఁ గలపవలసి వచ్చినప్పు డట్టులు కలపక మీఁదికొన కొంచెము లోపలకు వంచినయెడల నది ఈకారమగును. దీనికే గుడిలోదీర్ఘ మనిపేరు. ఈచిహ్నము మన మిప్పుడు హ్రస్వేకారచిహ్నముగా

గ్రహించి దీర్ఘకారము సూచించుటకు దానిపై నింకొకగీటు గీయుచున్నా
రము. ఇది గుడిమీఁదదీర్ఘ మగును, గాని, గుడిలోదీర్ఘము కాదు. ఉకార
చిహ్నమునకుఁ దెలుఁగులోఁ గొమ్మనిపేరు. ఈపేరునకుఁ దగినట్లు శాసనము
లోని యుకారచిహ్న మావుకొమ్మునుబోలి యున్నది. ఇప్పటికొమ్ములోఁ
గుడివైపుగీటు పొడవుగాను నెడమవైపుగీటు పొట్టిగను నుండుటకు మాఱుగ
సాధారణముగ రెండును సమానములుగా నుండును కొమ్మునకు దీర్ఘ మీయ
వలసినపు డాకారచిహ్నమును మన మిప్పుడు చేర్చుచున్నారము పూర్వ
మట్లు కాదు కుడిగీటుకొన కుడివైపునకు వంచుటచే దీర్ఘ మగుచుండెను పూ
ర్వము సాధారణముగ హ్రస్వరేఖలకు వంపుపెట్టుటచేత దీర్ఘము లగుచుండె
నని చెప్పవచ్చును. ఎకారముయొక్కయు, ఒకారముయొక్కయు రూపము
లలో హ్రస్వదీర్ఘభేదము లేదు సంస్కృతభాషలో నీయక్షరములకు దీర్ఘోచ్చార
ణమే కాని హ్రస్వోచ్చారణము లేదు. తెలుఁగులోనికి వచ్చినపిదప నా
రూపములకే హ్రస్వోచ్చారణముకూడ సందర్భోచితముగఁ గల్పింపఁబడినది.
రానురాను మొదటి దీర్ఘరూపములను హ్రస్వములుగా గ్రహించి, దీర్ఘోచ్చా
రణముం దెల్పుటకై నెత్తిమీఁద వేఱొక గీటును గల్పించినారు. ఈకల్పన
ప్రస్తుతశాసనకాలము వఱకుఁ గాని, యిటీవల మఱికొంతకాలమువఱకుఁ గాని
పుట్టి యుండలేదు కేవలాధునికముగాఁ గనఁబడుచున్నది. ఒకానొకపు
డెత్వరేఖ యక్షరమున కడుగునఁ జేర్పఁబడును. (పం 22 బె) ఒకారరేఖకు
మాఱుగా నొకానొకప్పు డెకారరేఖయుఁ గొమ్మును మనమిప్పుడు వ్రాయు
చున్నారము. పూర్వము కొమ్మునకు మాఱుగా దీర్ఘాకారరేఖ వాడుచుండిరి.
(పం. 10. గొ. కొ.) ఆధునిక లిపియం దనుస్వారరేఖ యగుచున్న యక్షరము
కుడివైపునఁ బ్రత్యేకముగఁ గన్పట్టుచున్నది. పూర్వ మట్లు గాక కుడివైపు
వర్ణముతలమీఁద నెడమప్రక్కను వ్రాయుచుండెడివారు.

## హల్లులు.

ట, డలరూపములలో భేద మంతగా లేదు. ణ యనునక్షర మొకార
ముతోఁగూడిన నకారమును బోలియుండును. త యనునక్షరమునకు నెడమ
వైపున గుడి లేదు. తకారమునకును తాయొత్తునకును తలకట్టు తప్ప వే ఱేమి
యు భేదము లేదు ధ యిప్పటి ద ను బోలి యున్నది. కుడివైపుగీటులోఁ
గొంచెము మొత్తి యున్నయెడల నది ద యగును. బ, భలకు రూపభేద

మధికముగా నున్నది ఒత్తక్షరముల యడుగున నిలువుగ గీటు గీయునాచార మీశాసనములోఁ గనఁబడదు శకటరేఫము తెలుచుగఁ గన్పట్టుచున్నది. ఒకానొకప్పుడు ఱ్ఱకు మాఱుగ శకటరేఫమే ప్రయోగింపఁబడియున్నది. (పం 14 గొంఱ్ఱ, పం 24 చేంబ్రోల) శవర్ణరూపములో నిప్పటికి నప్పటికి భేద మత్యధికముగా నున్నది

## అనుస్వారము.

అనుస్వారప్రయోగమం దిప్పటికి నప్పటికి భేద మెక్కువగా నున్నది. అర్ధానుస్వార ముండవలసినచోటఁ గూడఁ బూర్ణానుస్వారమే ప్రయోగింపఁబడి నది ఈయాచారము ప్రాచీన శాసనములందేమి తాటియాకుఁబుస్తకములందేమి యధికముగాఁ గనఁబడుచున్నది ఈశాసనమం దింకొక్కవిశేషము. ద, డలకుఁబూర్వ మనుస్వారము వచ్చినప్పు డది పూర్ణానుస్వారమైనను నర్ధానుస్వారమైనను సరే యాయుచ్చారణముం దెలుపుటకు బిందువును బ్రయోగించుటకు బదులుగా వర్గాంత్యానునాసికాక్షరము ప్రయోగింపఁబడియున్నది. ఇం కొకచిత్రము, పది, యిరువదియెనిమిది పంక్తులలో మరంబు, ఇరువదియవ పంక్తిలో ఫలంబు, లింగంబు అను నీశబ్దములలో మధ్యాక్షరములు లఘువులుగా నుండవలయును. లేనిచో ఛందోభంగము గలుగును. ఆయక్షరములు లఘువులు కావలసినచో శబ్దములు మరము, ఫలము, లింగముననియుండవలయును. వీని నన్నింటిని బట్టిచూడఁ దెనుఁగునం దనుస్వారము వర్గాంత్యానునాసికోచ్చారణము గల దనియు, నది యూఁదిపలికినప్పుడు పూర్ణానుస్వార మనియుఁ దేల్చిపలికినప్పు డర్ధానుస్వార మనియు సంజ్ఞలు గలిగె ననియుఁ, బూర్ణోచ్చారణము స్వతస్సిద్ధ మనియు, సౌలభ్యముకొఱ కర్ధోచ్చారణ మంగీకరింపఁబడిన దనియు, వికల్పముగా ననుస్వారమునకు రెండురూపము లున్నశబ్దములలో నర్ధానుస్వారరూపమె సిద్ధము, పూర్ణానుస్వారరూపము సాధ్యము ననిచెప్పు నాధునికలాక్షణికుల మతము సరికా దనియు, లేఖనసౌకర్యాపేక్షచే ననునాసికాక్షరమునకు మాఱుగ బిందువు గ్రహింపఁబడిన దనియు,(౧) నిప్పుడు సర్వసాధారణముగాఁ బ్రయోగింపఁబడు నర్ధబిందురేఖ యిటీవలఁ గల్పింపఁబడినది గాని పూర్వము లే దనియుఁ

(౧) ఈకారణముచేత నిండుసున్నకు బదులుగా ననునాసికాక్షరమే వ్రాయవలెననుటది శుష్కవాదము.

దెలుచున్నది మఱియు ఫలము మొదలగు శబ్దములకు మూఁడురూపము లున్నవి అవి యేవి యన - ఫలము, ఫలమ్ము, ఫలంబు ఫల మనురూపము ప్రకృతిసిద్ధ మనియు, మకారము ద్విగుణించుటవలన ఫలమ్మనురూపమును రెండవమకారము బకారముగా నుచ్చరించుటచే ఫలంబు అనురూపమును గల్గిన వనియు నిప్పటి యాంధ్రలాక్షణికులమతము ఇది సరియని తోఁపదు రూపభేదములు గలశబ్దముల రూపములలో నిండురూపమే ప్రథమరూపమనియు, నలసతచేస్పష్టముగా నుచ్చరింపక పోవుటచే వర్ణ య వర్ణలోపములు గలిగి క్రమముగా భిన్నరూపములు పుట్టె ననియు శబ్దశాస్త్రజ్ఞులమతము ప్రస్తుతశాసనముగూడ నీమతమునే స్థిరపఱుచుచున్నది "ఫలంబు" అనియుండఁగా ననుస్వారోచ్చారణమున కనుగుణముగ బకారము మకారముగ నుచ్చరించుటచే "ఫలమ్ము" అనురూపమును, దానినే తేల్చిపలుకుటచే "ఫలము" అనురూపమును బుట్టినవి. కావుననే, "ఫలము" అనిపలుకుచు "ఫలంబు" అనివ్రాసినాఁడు దీనిం బట్టి యుచ్చారణమున కనుగుణముగ వర్ణక్రమము శాసనకాలమువఱకు మాఱలే దని తేలుచున్నది ఫల మనురూపమే ప్రథమరూపమైనచో లేఖకుఁ డారూపమునే వ్రాసియుండును ఉచ్చారణవర్ణక్రమములకు భేద మిప్పుడు తెలుఁగులో నంతగా లేదు. ఈభేద ముండుట శాసనప్రాచీనతకొకప్రమాణము కాకమానదు

## ఛందస్సు.

29-వ పంక్తిలోఁ గపపటి నాలుగక్షరములును, 30-36 పంక్తులును గాక తక్కినశాసనమంతయుఁ బద్యరూపముగా నున్నది ఈపద్యములు మధ్యాక్కరములు మొదటి రెండుప్రక్కలను గలసి నాలుగుపద్యములును, మూఁడవప్రక్క నొకపద్యము నింకొకపద్యములోని ప్రథమపాదములో విశ్రమస్థానము వఱకునున్నవి.

పద్యములు, వృత్తములు జాతులు నని రెండువిధములు. జాతులు సాంస్కృతికములు దేశ్యములు నని రెండువిధములు. అక్కరలు దేశ్యజాతులలోనివి ఇవి యైదువిధములు. శాసనపుఁబద్యములకుఁ దెనుఁగులో మధ్యాక్కర లనిపేరు. వీనినే కన్నడములో "దొరెయక్కరలు," అనఁగా, సమానాక్కర లందురు పాదమున కాఱేసి గణము లుండును. రెం డింద్రగణములు నొకసూర్యగణముఁ గూడిన నర్ధపాద మగును. ద్వితీయార్ధముగూడ నట్లే. ఉదాహరణము.——

(భ) (ర) (హ) (భ) (భ) (హ)
స్వస్తినృ - పాంకుశా - త్యంత । వత్సల - సత్యత్రి - జేత్ర

పాదమును రెండు సమానభాగములుగా విభజింపవచ్చును, గాన, నీ పద్యమునకు సమానాక్కర యనుపేరే యన్వర్థముగా నున్నది యతిప్రాసము లున్నవి. ఆధునికలాక్షణికుల మతముప్రకారము యతి చతుర్థగణాది నుండవలయును, గాని, శాసనములో నైదవగణము మొదట నున్నది నన్నయభట్టారకునిమతముకూడ నిదియే ఈవిషయ మింకను ముందు చర్చింపఁబడును (౨)

## శాసనవిషయము.

మొదటిపద్య మంతయు యుద్ధమల్లుఁ డను చాళుక్యరాజు ప్రశంసతో నిండినది ఈ యుద్ధమల్లుఁడు బెజవాడలోఁ గుమారస్వామికి గుడియు దానికిఁ జేర్చి యొకమఠమును గట్టించె ననియు, నీమఠములో శైవులే కాని యితరులు నివసింపఁ గూడ దనియు, నివసించినచోఁ గాశిలో హత్యచేసినపాపముం బొందుదు రనియు రెండవపద్యములో నున్నది ఈయొట్టును మన్నింపక శైవేతరులు మఠములో బసచేసినయెడల, దేవస్థానాధికారులును, రాజును వారల వెడలఁగొట్టవలయు ననియు, నట్లు వెడలఁగొట్టుటవలన నశ్వమేధము చేసిన ఫలమును, నుపేక్షచేయుటవలన లింగముం బగులఁగొట్టినపాపమును గలుగు ననియు మూఁడవపద్యము భావము కుమారస్వామి చేఁబ్రోలను గ్రామము నుండి యొకానొకసమయమందు బెజవాడ జాతరచూచుటకు వచ్చెననియు, నాప్రకారము వచ్చినప్పు డెల్లచోటులకంటె బెజవాడ యధికనివాసయోగ్యమని తోఁచి స్వామి యచ్చట నావిర్భవించెననియు, నిది తెలిసి యుద్ధమల్లుఁడు గుడియు మఠమును గట్టించె ననియు నాలుగవపద్యమునందు రెండవపద్యములోఁ జెప్పఁబడినదానికే వివరణముగాఁ జెప్పఁబడియున్నది. ఈ పద్యముతరువాత నేడెనిమిదిపంక్తులగ్రంథ మున్నది. వీనిలో 31 మొదలు 36వఱకుఁగల పంక్తుల మొదటి యక్షరములుపోవుటంబట్టియు, మిగిలిన యక్షరములలోఁగూడఁ గొన్ని స్పష్టముగా లేకపోవుటం బట్టియు గ్రంథము స్పష్టముగా లేదు ఈ భాగము పద్యమో గద్యమో కూడఁ దెలియకున్నది వీనితో నెడమప్రక్క (రెండవ వైపు) గ్రంథము పూర్ణమైనది. మూఁడవప్రక్కనున్న యైదవపద్యములో బెజ

(౨) అక్కరలస్వరూపము సమగ్రముగఁ దెలియఁగోరువా రాంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడిన కవిజనాశ్రయముం జూడవలయును.

వాడ కలంకారముగాను, రక్షగాను తనతాత మల్లపరాజు కట్టించిన(గుడికి) కలశ మెత్తించినట్లు యుద్ధమల్లుఁడు ముఖమండపమో లేకగోపురమో కట్టించె ననియున్నది ఈధర్మమును బరిపాలించువారికిఁ బుణ్యమును జెఱచువారికిఁ బాపమును వచ్చు నని చెప్పఁదలఁచికాఁబోలు "తనధర్మువొడఁబడి కాచు నృపులకు" అని యంతవఱకుఁజెక్కి యంతట నేహేతువుననో గాని లేఖకుఁడు విడిచిపెట్టినాఁడు

ఈగ్రంథమంతయు సమన్వయము చేసి చూడఁగాఁ దొలుతఁ జేబ్రోలనుగ్రామమునందుఁ గుమారస్వామి యాలయమొకటి యుండె ననియు, నాదేవుఁడే పిదప బెజవాడలోఁ బ్రత్యక్షముకాఁగా యుద్ధమల్లుఁ డనుచాళుక్యరాజు స్వామికి గుడియు, దానిని జేర్చి భక్తులు దిగుట కొక మఠమును గట్టించె ననియు, నీగుడికే యాయుద్ధమల్లుని మనుమఁ డగు మఱియొక యుద్ధమల్లుఁడు ముఖమండపమో గోపురమో కట్టించె ననియుఁ దేలుచున్నది.

ఇదియంతయు నొక్కశాసనమా లేక రెండా యని యాలోచించిచూడ మొదటి ముప్పదియాఱుపంక్తులు నొక్కశాసన మనియు, మూఁడవప్రక్కను జెక్కఁబడియున్న పదిపంక్తులు నింకొకశాసన మనియుఁ బొడకట్టుచున్నది ఏలయన —యుద్ధమల్లుఁడు బెజవాడలో షణ్ముఖున కాలయమును దానికిఁ జేర్చి మఠమును గట్టించె ననియు, మఠములో శివభక్తులుతప్ప నితరులు దిగఁగూడ దనియుఁ జెప్పుటయే శాసనముయొక్క ప్రయోజనము ఈకార్యము మొదటి ముప్పదియాఱుపంక్తులలోనే నెఱవేఱినది. సర్వసాధారణముగా శాసనములు ఫలశ్రుతితో నంతమందును ఈశాసనమునం దట్టిఫలశ్రుతి గూడఁ గలదు. మఱియు, రెండవప్రక్క చివరిపంక్తిలో మఱికొన్ని యక్షరములు చెక్కుట కవకాశమున్నది ఐదవపద్యము పూర్వశాసనశేషమే యైనచో లేఖకుఁ డాపద్యమును రెండవప్రక్కనే యారంభించి యుండును, గాని, యది విడిచి మఱియొకవైపున నారంభించియుండఁడు ఈ హేతువులను బట్టి మొదటి రెండువైపులనున్నది సమాప్తశాసనమే యని యూహింపఁ దగియున్నది.

యుద్ధమల్లుఁ డనురాజు తనతాత మల్లపరాజు కట్టించిన గుడికి గోపురము కట్టించె నని రెండవశాసనమునందుఁ జెప్పఁబడినది మల్లపరా జనునది యుద్ధమల్లునకు వాడుకపేరై యుండవచ్చును ఈమల్లపరాజే కార్తికేయునకు గుడికట్టించిన యుద్ధమల్లుఁ డనియు, నాగుడికే యతని మనుమఁ డగు నింకొక యుద్ధమల్లుఁడు గోపురము కట్టించె ననియు నూహించుట యసమంజసము కాదు.

మొదటిమూఁడుపద్యములు నొకశాసన మనియు, నాల్గవపద్యమును దరువాతిగద్యమును నిం కొకశాసన మనియు రావుసాహెబు కృష్ణశాస్త్రిగా రభిప్రాయపడుచున్నారు, గాని, యది సరి కాదని నామతము కవి చెప్పఁ దలఁచిన ముఖ్యవిషయము సంగ్రహముగా మొదటి మూఁడుపద్యములలోనే చెప్పివేసినను, దానికే వివరణముగ నాల్గవపద్యముఁ జెప్పవలసివచ్చెను. అట్లు కాదేని, యిద్దఱు యుద్ధమల్లులు రెండుకార్తికేయాలయముల నేకకాలమున నేకగ్రామమునఁ గట్టించి రని చెప్పవలసివచ్చును. అట్టియన్వయము సమంజసముగ నుండదు మఱియు, నాల్గవపద్యము మొదటిశాసనములోఁ జేరినది కానియెడల లేఖకుఁడు దానిని తృతీయపద్యశేషముగ లిఖించియుండఁడు. కావున, మొదటి ముప్పదియాఱుపంక్తులు నొకశాసన మనియుఁ, దరువాతిపది పంక్తులు నింకొకశాసన మనియుఁ జెప్పవలసియున్నది.

## కాలనిర్ణయము

శాసన మెప్పుడు పుట్టినదియు నిర్ణయించుటకు ముఖ్యాధారములు రెండు కలవు. అక్షరములపోలిక యొకటి, శాసనమునందుఁ బేర్కొనంబడిన యుద్ధమల్లు లెవ్వరైనదియు నిరూపించుట యొకటి. ముందుగా నీయుద్ధమల్లు లెవ్వరో చూతము మొదటిశాసనములోని యుద్ధమల్లుఁడు చళుక్యరాజని (రాజసల్కిభూవల్లభుండు) చెప్పఁబడినది. చళుక్యరాజైనయెడలఁ బూర్వచాళుక్యరాజవంశములోనివాఁడు గావలయును ఈవంశములో నిద్దఱు యుద్ధమల్లు లున్నట్లితరశాసనములవలనఁ గన్పట్టుచున్నది. 766-వ శకసంవత్సరము మొదలు 810-వ సంవత్సరము వఱకు రాజ్యముచేసిన గుణగవిజయాదిత్యుని తమ్ముఁడగు యుద్ధమల్లుఁడొకఁడు కలఁడు (3) ఈతని కొడుకు తాడరాజు ఈతాడరాజుకొడుకు యుద్ధమల్లుఁడు ఈయుద్ధమల్లుఁడు విక్రమాదిత్యుని కుమారుఁడగురాజభీముని నిర్జించి 848-వ శకాబ్దము మొదలు 855-వ సంవత్సరమువఱకు నేడువత్సరములు వేంగీదేశమును బాలించెను చాళుక్యవంశములో తాతామనుమలిద్దఱు యుద్ధమల్లులు పేరిగపడుచున్నారు వీరే శాసనములోఁ జెప్పఁబడినయుద్ధమల్లు లని నామతము దీని కొకయాక్షేపము తోఁపవచ్చును అది యేది యన — మొదటిశాసనములో యుద్ధమల్లుఁడు చళుక్యరాజ్యము పరిపా

---

(3) మాఁ కలుచంబఱ్ఱుశాసనము Epigraphia Indica Vol. 7 pp 177. oft.
వల్లియపూండిశాసనము. Epigraphia Indica Vol 9. pp. 47. oft.

లించినప్రభు వయిన ట్లున్నది తాడరాజు తండ్రి యైనయుద్ధమల్లుఁడు స్వతంత్రముగా రాజ్యము చేసియుండలేదు, గావున మొదటి యుద్ధమల్లుఁ డాతఁడై యుండఁ డని కొందఱనవచ్చును కాని, యిది యొకయాక్షేపముగాదు. ప్రథమయుద్ధమల్లుఁడు పేరునకు రాజు కాకపోయినను, అన్న యగుగుణగవిజయాదిత్యునితో సమానముగ రాజ్యభారము వహించిన ట్లగపడుచున్నది. కావున నొకానొకశాసనములో గుణగవిజయాదిత్యుఁడు తమ్మునితోఁ గూడి ప్రజాపరిపాలనము చేసినట్లు వ్రాయఁబడియున్నది (౪) ఈహేతువుచేతనే ప్రస్తుతశాసనమున నీయుద్ధమల్లుని వర్ణించుటలో రాజవిశేషణములు కవి ప్రయోగించి యుండును. రెండవయుద్ధమల్లుఁడే గుడికట్టించినవాఁ డనియు, గోపురము కట్టించినది యాతనికుమారుఁ డగుమఱియొకయుద్ధమల్లుఁ డయియుండవచ్చు ననియు నూహించిన నూహింపవచ్చును, గాని, రెండవయుద్ధమల్లునకు యుద్ధమల్లుఁ డనుపౌత్రుఁ డున్నట్లు మనకుఁ దెలియదు, గావున, మొదటిశాసనము ప్రథమయుద్ధమల్లునికాలమునందును, రెండవది ద్వితీయయుద్ధమల్లునికాలము నందును బుట్టియుండు ననుటయె సిద్ధాంతముగాఁ గనఁబడుచున్నది. అట్లయినచో మొదటిశాసనము గుణగవిజయాదిత్యుని రాజ్యకాలావసానదశయందు, అనఁగా 890 క్రైస్తవాబ్ద ప్రాంతమందును, రెండవది దీనికి నలువది యేఁబది సంవత్సరములకుఁ బిదపను బుట్టి యుండవలయును. నన్నయభట్టారకుఁడు 1022 వక్రైస్తవాబ్దమునఁ బట్టాభిషిక్తుఁ డైనరాజరాజు నాస్థానకవిగాన నీశాసనములు వాగనుశాసనుకాలమునకంటెఁ బూర్వము పుట్టినవియే యగును

శాసనకాలము నిర్ణయించుట కక్షరస్వరూప మింకొకసాధన మని పైనిఁ జెప్పియుంటిమిగదా. దానివలన నేమి తేలునో విమర్శింతము. లిపి కాలక్రమమున మాఱునని పూర్వశాసనములం బరిశీలించినవారికిఁ దెలిసిన విషయమే. ఈ మార్పు లెట్లు గలుగునో యది Burnell s South Indian Palaeography అనుగ్రంథములోఁ గొంతవఱకు వివరింపఁబడినది. లిపినిబట్టి యేశాసన మేకాలమునఁబుట్టినదో యించుమించుగాఁ జెప్పవచ్చును ఆంధ్రదేశమందలి పూర్వశాసనముల లిపిలో సామాన్యదృష్టికి రెండురీతులు (కత్తులు) పొడకట్టుచున్నవి. అడ్డు కత్తొకటియు, గుండ్ర కత్తొకటియు. మొదటిది రాజరాజు కాలమునకుఁ బూర్వము పుట్టినశాసనములలోఁ గనఁబడుచున్నది. రాజరాజునాఁ డీయక్షరములపోలిక యేహేతువుచేతనో గాని మాఱినది. ఆంధ్రసా

(౪) చూ. శక్తివర్మ పఘుబట్టుశాసనము. ఆం సా ప. పత్రిక సం. 2.

హిత్య పరిషత్పత్రిక ప్రథమసంపుటములోఁ బ్రకటింపఁబడిన నందంపూఁడిశాసనములో నీరెండుపోలిక లున్నవి శక్తివర్మరాజుకాలమువఱకుఁ గలవృత్తాంతము చెప్పినపూర్వభాగము లిపి వేఱు తరువాతిభాగము లిపి వేఱు. మొదటిదానిలోనియక్షరములు నాగరలిపినిఁబోలి కొంచె మణ్డముగా నున్నవి. రెండవదానిలోని యక్షరము లిప్పటి తెలుఁగులిపినిఁబోలి కొంతవఱకు వట్రువులై యున్నవి పూర్వభాగము శక్తివర్మకాలములోఁ జెక్కి నిలువచేసిన ట్లగపడుచున్నది. ఉత్తరభాగము కవిత్వము నన్నయభట్టారకుని దనిశాసనమునందే యున్నది ఈభాగము రాజరాజుకాలములోఁ జెక్కియుండవలయును. రాజరాజుకాలమునందుఁ గాని, దానిపిదప నేఁటివఱకుఁగాని పుట్టినశాసనములలోఁ బూర్వలిపి యెక్కడను నాకుఁ గనఁబడలేదు క్రమక్రమముగా గుండ్రన హెచ్చినది (౫) ప్రస్తుతశాసనముల లిపి పూర్వోక్తపూర్వలిపినిఁ బోలి యున్నది. కావున, లిపినిఁ బట్టి చూచినను బ్రస్తుతశాసనము నన్నయభట్టారకుని కాలముకంటెఁ బూర్వమే పుట్టినట్లు తేలుచున్నది.

ఈ వాదమున కొకయాక్షేపము పుట్టినది. అదియేదియన — అక్కరఛందస్సుపూర్వము కన్నడమునందే యుండె ననియుఁ, బ్రప్రథమమున నాఛందస్సును దెనుఁగులోనికిఁ దెచ్చినవాఁడు నన్నయభట్టారకుఁడనియుఁ, గావున మధ్యాక్కరలతో రచియింపఁబడిన యీశాసనము నన్నయభట్టునకుఁ దరువాతిదై యుండవలయు ననియుఁ గొంద ఱందురు. కర్ణాటకచ్ఛందోంబుధిలోని యీదిగువపద్య మీయాక్షేపమున కంతకు నాధారము

> అర్ణవజాతాననె సం, పూర్ణతెయిం సకలవిషయభాషాదిగళం
> నిర్ణయ మాగిసి పెఱె నాం, కర్ణాటకభాషెయందమం కేళ్ పేళ్వెం

దీనికి సరియైన తెనుఁగు.

"అర్ణవజాతాననా! సంపూర్ణముగా సకలవిషయభాషాదులను నిర్ణయముగా నే నెఱింగించితిని కర్ణాటకభాషయందము విను చెప్పెదను"

వృత్తములు జాతులు నని ఛందములు రెండువిధము లనియు, వృత్తములు సంస్కృతభాషయందుఁ బుట్టె ననియు, జాతులలోఁ గొన్ని సాంస్కృతికములుఁ గొన్ని దేశ్యములు ననియు నిదివఱలోఁ జెప్పియున్నారము. వృత్తలక్ష

(౫) నందంపూఁడి శాసనపీఠికలో నీవిషయము చర్చింపఁబడినదిగాన నది చూడవలయును.

ణములును సాంస్కృతికజాతిలక్షణములును జెప్పి దేశ్యజాతులం జెప్పఁబోవుచు నాగవర్మ పైపద్యములోని ప్రతిజ్ఞ చేసెను. సందర్భమునుబట్టి మూఁడ "సకల విషయభాషాదు" లనఁగా (భరతఖండమునందలి) సకలదేశములందుఁ బ్రచారము గల సంస్కృతచ్ఛందస్సులనియుఁ, "గర్ణాటకభాషయందు" ననఁగా దేశ్యచ్ఛందస్సు లనియుఁ గవిహృదయమైనట్లు తోఁపకమానదు. కవిత్వవిషయములో సాంస్కృతికపద్ధతి యనియు, దేశ్యపద్ధతి యనియు రెండువిధము లున్నవి. వీనినే పూర్వకవులు కొందఱు మార్గపద్ధతియనియు, దేశిపద్ధతి యనియు వ్యవహరించిరి ఈసంప్రదాయమునే యనుసరించి ముందుగ మార్గపద్ధతిం జెప్పి పిదప దేశిపద్ధతిం జెప్పఁదలంచి నాగవర్మ పైపద్యమును జెప్పెను. అతనియుద్దేశము, తాను జెప్పఁబోవు ఛందస్సులు సంస్కృతమునుండి గ్రహింపఁబడినవి కావని చెప్పుటయె గాని, యాఛందస్సు లితరదేశభాషలలో లేవని చెప్పవలయు నని కాదు ఈమార్గమునే యవలంబించి వృత్తములు సాంస్కృతిక జాతులును జెప్పి దేశ్యజాతులఁ జెప్పఁదలఁచి కవిజనాశ్రయకర్త—

క. వెలయంగఁ దెనుంగుబాసకుఁ, దలమయ్యెడు సీసములును దర్వోజలు గీ
తులు నక్కరలును ద్విపదలుఁ, బొలుపొందఁగ రేచఁ డిష్టమున నొనరించున్.

అని ప్రతిజ్ఞ చేసెను. దీనినిబట్టి యక్కరలు కర్ణాటకభాషయందు లేవని వాదింపవచ్చునా?

చాళుక్యవంశరాజులలో నొకశాఖవారు పిఠాపురప్రాంతమున రాజ్యము చేసినట్లును, వారిలో మల్లప యనుపేరు గలవార లిరువురు తాతయు మనుమఁడు నుండి రనియు, రెండవమల్లప 1202-వ క్రైస్తవాబ్దము జూనునెల 16-వ తేది నభిషిక్తుఁ డయ్యె ననియుఁ బిఠాపురము కుంతీమాధవస్వామి యాలయములోనున్న యొకశాసనములో నున్నది (౧) ఈమల్లపయే ప్రస్తుతశాసనములోఁ జెప్పఁబడిన మల్లపరాజును యుద్ధమల్లుఁడు నయియు నుండవచ్చునని కొందఱకుఁ దోఁపవచ్చును. కాని, యీపిఠాపురపుశాసనలిపికిని, బెజవాడశాసనలిపికిని భేద మధికముగా నున్నది. కావున, రెండు నేకకాలమునందుఁ బుట్టియుండుట పొసఁగదు కాఁబట్టి, యేవిధమునఁ జూచినను బెజవాడశాసనము నన్నయభట్టారకుని కాలముకంటెఁ బూర్వమే పుట్టియుండు ననువాదమే

(౧) చూ. Epigraphia Indica. Vol. IV pp 226.

సిద్ధాంతముగాఁ గనఁబడుచున్నది దీనిని బూర్వపక్షము చేయఁజాలు నాధారము లేకముందు లభించిన లభించుఁగాక!

పద్యములలోని యతిస్థానము గూడ శాసనము ప్రాచీన మని తెలుపుచున్నది యతి యైదవగణము మొదట నున్నది. నన్నయభట్టకృతభారతములోఁ గూడ నిట్లేయున్నది తిక్కనసోమయాజి కవిత్వములో మధ్యాక్కరలు నాకుఁ గనఁబడలేదు ఎఱ్ఱాప్రెగడ రచియించిన యారణ్యపర్వశేషమునందున్నవి. వానిలో యతి నాల్గవగణము మొదట నున్నది ఆధునిక లాక్షణికులమతముకూడ నిదియె. ఈమార్పు నన్నయభట్టు కాలమునకుఁ బిదపను, శంభుదాసునికాలమునకుఁ బూర్వమునుఁ బుట్టియుండవలయును. ఈ విషయముగూడ శాసనము ప్రాచీనమయిన దని సూచించుచున్నది

## కార్తికేయాలయము

శాసనమునకు సంబంధించిన కార్తికేయాలయ మిప్పుడు బెజవాడలోఁ గనఁబడదు ఆనకట్టకుఁ బైని నదీతీరమున నొక ప్రాచీనదేవాలయ మున్నది అదియే పూర్వము కుమారస్వామి గుడిగా నుండె నని కొంద ఱందురు. అం దిప్పు డావిగ్రహము లేదు. శాసనస్తంభ మేమో మల్లేశ్వరస్వామి యాలయములో నున్నది. అదియే ప్రథమమునఁ గుమారస్వామి గుడిగ నుండె ననియు, నిటీవల శివలింగ మందుఁ బ్రతిష్ఠింపఁబడియె ననియు, యుద్ధమల్లునిచేఁ బ్రతిష్ఠింపఁబడుటచే మల్లేశ్వరస్వామి యనుపేరు వచ్చినదనియుఁ గొంద ఱందురు. మల్లేశ్వరప్రతిష్ఠ యుద్ధమల్లునిచేఁ జేయఁబడియుండిన నుండవచ్చును, గాని, కుమారస్వామియాలయమె మల్లేశ్వరాలయముగ మాఱిన దనుటకుఁ దగినసాధనములు లేవు.

పూర్వ మర్జునుఁ డిచ్చట శివునితో మల్లయుద్ధము చేసి యాదేవునివలనఁ బాశుపతాస్త్రము వడసె ననియు, నాయుద్ధసమయమందు శివుని విగ్రహాకారముగఁ బూజించె ననియు, మల్లయుద్ధకాలమునఁ బ్రతిష్ఠింపఁబడెను గాన యుద్ధమల్లుఁ డనుపేరు దేవునకు వచ్చె ననియు మల్లేశ్వరాలయములో నున్న యొకశాసనములోఁ జెప్పఁబడియున్నది. కాని, యీవ్యుత్పత్తి యంత విశ్వసనీయము గాదు బెజవాడకుఁ జేరి యింద్రకీలపర్వత మనునొకకొండ గలదు దానిమీఁద శాసనస్తంభ మొకటి యున్నది. అర్జునునకును శివునకును జరిగిన మల్లయుద్ధ మిందు సంస్కృతభాషలో వర్ణింపఁబడినది. ఆయుద్ధక్రమమును

దెలుపు విగ్రహములు కూడఁ జెక్కఁబడియున్నవి ఈశాసనపు లిపియు యుద్ధమల్లుని శాసనపులిపియు నొక్కవిధముగ నున్నది అజ్ఞానుఁడు పాశుపతాస్త్రము సంపాదించినచోటు బెజవాడయే యనుప్రతీతి యీనాఁడేకాక వేయిసంవత్సరములకు ముందుఁగూడ నుండె నని యీ శాసనమువలనఁ దెలియవచ్చుచున్నది

చేఁబ్రోలునందున్న కుమారస్వామియే బెజవాడలో వెలసె నని శాసనమునం దున్నది ఈ చేఁబ్రోలు గుంటూరునకుఁ దొమ్మిదిమైళ్లదూరమున బాపట్లతాలూకాలో నున్నది. అచ్చటనుండు శాసనములంబట్టి పూర్వ మా గ్రామమునందు సుప్రసిద్ధమైన షణ్ముఖాలయ ముండిన ట్లగపడుచున్నది ఈ యాలయమునుబట్టియే గ్రామమునకు షణ్ముఖపుర మనునామాంతరము గూడఁ గలిగెను ఇప్పు డాగుడి లేదు, కాని, కాకతీయగణపతిదేవరాజు రాజ్యకాలమునందు, అనఁగా 1135-వశకసంవత్సరమందు గుడియున్న ట్లొకశాసనము వలనఁ దెలియుచున్నది. అంతకుఁబూర్వమె చాలుక్యరాజైన యుద్ధమల్లుఁ డావిగ్రహమును దీసికొనిపోయి బెజవాడలోఁ బ్రతిష్ఠించినచోఁ దదనంతరకాలమందుఁ జేఁబ్రోలులో నెట్లుండు నని శంక తోఁపకమానదు. దీనికి రెండు విధములుగ సమాధానము చెప్పవచ్చును చేఁబ్రోలులోని విగ్రహమునె యుద్ధమల్లుఁడు బెజవాడలోఁ బ్రతిష్ఠించె ననియుఁ, జేఁబ్రోలునివాసులు దానిని మఱికొంతకాలమునకుఁ దిరిగి తమగ్రామమునకుఁ గొనిపోయి రనియుఁ జెప్పవచ్చును. లేదా, యుద్ధమల్లుఁడు ప్రతిష్ఠించినది నూతనవిగ్రహ మనియు, దానియందు జనులకు భక్తి హెచ్చుటకై సుప్రసిద్ధమైన చేఁబ్రోలు దేవునిసత్త్వమే యీనూతనవిగ్రహమందుఁ బ్రవేశించె నని చెప్పుటయే శాసనోద్దేశ మనియుఁ జెప్పవచ్చును. ఇదియె సత్య మని తోఁచుచున్నది ఏదైన నొకయర్చావిగ్రహమునందు జనులకు భక్తివిశ్వాసములు గాఢమైనప్పు డావిగ్రహమును బోలినవిగ్రహము లాపేరుననే యితరగ్రామములయందుఁ బ్రతిష్ఠించుట యిప్పటికిని వాడుక కలదు. తిరుపతివేంకటేశ్వరస్వామినిబట్టి యనేకులు వేంకటేశ్వరులు దేశమందు వెలసినారు అన్నవరపు (తుని సమీపమునందున్నది) సత్యనారాయణస్వామికిఁ బ్రతిగా ననేకసత్యనారాయణులు గోదావరీమండలమునందు వెలయుచున్నారు. కాశీవిశ్వనాథునిఁబోలిన విశ్వనాథు లనేకులు భరతఖండమందుఁ గలరు.

## వ్యాకరణవిషయము

శాసనపులిపికి నాధునికాంధ్రలిపికిని భేద మధికముగా నున్నది. వర్ణక్రమములోఁ గూడ నప్పటికి నిప్పటికిని వ్యత్యాస మున్నది కాని, భాషాలక్షణమందు, అనఁగా వ్యాకరణవిషయములో భేద మంతగా లేదు. యతిస్థానవిషయములోఁ దప్ప ఛందస్సునందుఁ గూడ నభేదమే దీనినిబట్టి యాంధ్రభాషాలక్షణము, ఛందస్సు నప్పటికే చాలవఱకు స్థిరపడినట్లు కనఁబడుచున్నది ఇవి యప్పటికప్పుడు పుట్టి వెంటనే గూఢ మగునవి కావు కాలక్రమమున మాటిమాటి చిట్టచివరకు సత్కవులచేఁ మహాగ్రంథములందుఁ బ్రయోగింపఁబడినప్పుడు స్థిరపడును ఇది భాషాస్వభావము మనకుఁ దెలిసినంతవఱకు నన్నయభట్టారకుఁడే యిట్టి ప్రథమాంధ్రసత్కవి. అంతకుఁబూర్వము పుట్టినగ్రంథము లేవియు నింతవఱకుఁ బైటఁబడలేదు, గాని, కవిత్వము బొత్తిగా లేక యుండలే దని ప్రకృతశాసనమే తెల్పుచున్నది ఆంధ్రదేశము పరిపాలించిన సుప్రసిద్ధరాజులలో నాంధ్రవంశ్యులే ప్రథములు వీరు క్రీస్తు పుట్టుట కించుమించుగా రెండువందలసంవత్సరములకుఁ బూర్వము, అనఁగా నిప్పటికి రెండువేలయేండ్లకుముం దారంభించి రమారమి నాల్గువందలయేండ్లొక తెనుఁగుదేశమేగాక మగధ, కర్ణాట, మహారాష్ట్రదేశములుగూడ నేకచ్ఛత్రముగా నేలిరి వీరిది బౌద్ధమతము బౌద్ధులకుఁ బ్రాకృతభాష ముఖ్యము. ఆంధ్రవంశ్యరాజులశాసనము లెచ్చటను బ్రాకృతమునందే యున్నవి. ఆంధ్రులపిదపఁ బల్లవు లీదేశమును బాలించిరి పల్లవులు బౌద్ధులు కాకపోయినను బ్రాకృత మదివఱకు రాజభాషగా నేర్పడి యుండుటంబట్టి కాఁబోలు వారి శాసనము లనేకము లాభాషలోనే యున్నవి. ఇటీవలిశాసనములు కొన్ని సంస్కృతభాషలోనున్నవి. ఆసంస్కృతమైనను దుష్టముగాను, బ్రాకృతపదభూయిష్ఠముగాను నుండును. ఆంధ్రులకాలమందుఁ గాని పల్లవులకాలమందుఁ గాని తెనుఁగుభాషలో రచింపఁబడిన శాసనము లింతవఱకు బైటఁబడలేదు. కాఁబట్టి యాకాలమం దాంధ్రభాష యేరూపముగానుండెనో తెలిసికొనుట కాధారములు లేవు. పల్లవులయనంతరము చాళుక్యులు రాజ్యమునకు వచ్చిరి. వీరియేలుబడి 6-వ శతాబ్దమం దారంభమై రమారమి యాఱువందలసంవత్సరములు గడచినది చాళుక్యులు వైదికమార్గానువర్తులు వీరిశాసనము లనేకములు సంస్కృతభాషలో నున్నవి. ఇటీవలఁ బుట్టినవి కొన్ని తెలుఁగులో

నున్నవి రాజరాజకాలమునకుఁ బూర్వము పుట్టినశాసనములలోఁ దెలుఁగులో నున్నది యీయుద్ధమల్లునిశాసనము తప్ప మఱియొకటి యింతవఱకుఁ గనఁబడలేదు, కాని, సంస్కృతశాసనములు కొన్నిటిలో గ్రామసీమాదులు వివరించునప్పుడు తెలుఁగుమాటలు ప్రయోగింపఁబడినవి. రాజరాజకాలమునుండియుఁ దెలుఁగుశాసనము లనేకములు పుట్టినవి దీనినంతను బట్టిచూడ నాంధ్రరాజులకాలమందును, బల్లవులకాలమందును బ్రాకృతమే రాజాశ్రయము కలిగియుండినట్లు తేలుచున్నది తెలుఁగులో నున్న తద్భవశబ్దము లనేకములు ప్రాకృతద్వారమున వచ్చినవి. అవి యాకాలమునందే వచ్చియుండును చాళుక్యరాజులకాలములో సంస్కృతముతోఁబాటు - దేశభాషలకుఁ గూడ గౌరవము హెచ్చినది.

క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయమునఁ, జనచాళుక్యరాజు మొదలుగాఁ బలువురున్,

అని నన్నెచోడుఁడు చెప్పినది సత్యమే చాళుక్యరాజ్యముతోడ నాంధ్రభాషయు దినదినప్రవర్ధమానమై రాజరాజునాఁటికున్నతస్థితికి వచ్చినది. కవికులతిలకుం డగునన్నయభట్టారకుఁడు భారతరచనయందుఁ బ్రయోగించుటచే నీభాష పావనమై భావికవులకుఁ బరమప్రమాణ మైనది. ఆమహాకవిని "వాగనుశాసనుఁ" డనుట కిది యొక్కటి చాలును

జయంతి రామయ్య

# మూలము.

## యథామాతృకము.

— * మొదటిప్రక్క * —

౧. స్వస్తి నృపాంకుశాత్య న్తవత్స
౨ ల సత్యత్రినేత్ర। విస్తరశ్రీయుద్ధ
౩. మల్లుణ్డానవద్య విఖ్యాత కీర్త్తిః।
౪. ప్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభు
౫. వనాభరనుణ్డుసకల। వస్తుస
౬. మేతుణ్డు రాజసల్కి భూవల్లభు
౭ ణ్డ త్రిణ్ణ్॥ పరగంగ బెజవాడంగొమ
౮. రస్వామికి భక్త్తిన్గుడియు। ని
౯ రుపమమతి నృపధాముణ్డొత్తిచ్చె
౧౦ నెగిదీచ్చెణమరంబు। గొరగ(౧)ల్గాకొరు
౧౧. లిన్డు విడిసి బృన్దంబుగొనియు
౧౨ ణ్డువారు। ×(౨)రిగాక యబ్బార
౧౩. నాసి వ్రచ్చినపాపంబు గొ
౧౪. ణ్డు॥ వెలయంగ నియ్యొట్టు డస్సి
౧౫. మలిన్నురై విడిసినబ్రో
౧౬ ల। గలతానపతులు నురా
౧౭. జు పట్టంబుగట్టిన పతి

— * రెండవప్రక్క * —

(మాతృకలోఁ గ్రిందినుండి పైకిఁ జదువవలయును)

౧౮. యు। నలియంబయ్యారల
౧౯. వెల్వఱించిన నశ్వమేధంబు

(౧) ఈగణమునం దొకమాత్రయెక్కువయైనది.
(౨) ఇక్కడియక్షరము పోయినది

౨౦. ఫలంబుపేక్షించి నాలింగబ
౨౧. డిసినపాపంబు దమకు ॥ జ
౨౨ (స) నుత చేబ్రోల నుణ్ణి బెజ
౨౩. వాడ జాత్రకువచ్చి । త్రిణ
౨౪. యనునుతుణ్డొణ్డు సోటుమె
౨౫ చ్చక తివిటే యిన్నెలవ । యనఘు
౨౬ ణ్డు సేసొని యిన్దు ప్రత్యక్ష
౨౭. బయన్న నిచ్చు । గనిమల్లక్షి
౨౮ త్తించె గుడియు మఠంబు
౨౯ నుం గార్తికేయునకు ॥ దీనిం జేంబ్రో
౩౦ లు యేలెడు రతిరబేలు
౩౧. × రొణ్డు సోటి గోరగ
౩౨. × నుబెట్టి వేరుగనుజ
౩౩ × యిస్తితి సేకొశికాచు
౩౪. × ర దీనిన్దారు నిల్పినవారు
౩౫. × తి దప్పియడిపుటవా
౩౬. × బుగాగ.

— * మూడవప్రక్క * —

౩౭ రమనతో బెజవాడకెల్ల
౩౮. బెడంగును రత్నయుంగాను ।
౩౯. ద్దమతత మల్లపరాజువే (౧)
౪౦. రడు దానుంగట్టించె ।౦ గ్రమ
౪౧. ౦బున దానికి కలశ బిడ్డ
౪౨. ట్లుగా గమొగమాడు । వమ
౪౩ రంగ శ్రీయుద్ధమల్ల డ్డైత్తి
౪౪. ౦చె నమిత తేజుణ్డు ॥ తన
౪౫. ధమ్మున వొడంబడి కాచున్నపు
౪౬ లకున్ద

(౧) ఈశబ్దము సందేహాస్పదముగా నున్నది.

— * మూలము * —

ఇప్పటి వర్ణక్రమము ననుసరించి పాదమొక్కపంక్తిగా వ్రాసినది.

౧. స్వస్తి నృపాంకుశాత్యంతవత్సల - సత్యత్రినేత్ర
విస్తరశ్రీయుద్ధమల్లుఁ డనవద్య - విఖ్యాతకీర్తి
ప్రస్తుతరాజాశ్రయుండు త్రిభువనా - భరణుండుసకల
వస్తుసమేతుండు రాజసల్కిభూ - వల్లభుండర్థి.

౨. పరఁగంగ బెజవాడఁ గొమరసామికి - భక్తుఁడై గుడియు
నిరుపమమతి నృపధాముఁ డెత్తించె - నెగిదీర్చె మరము
గొరగల్గాకొరులిందు విడిసి బృందంబు - గొని యుండువారు
× రిగాక యవ్వారణాసిప్రచ్చిన - పాపంబుగొంద్రు.

౩. వెలయంగ నియ్యొట్టు డస్సి మలిన్పరై - విడిసినఁబ్రోలఁ
గలతానపతులును రాజు పట్టంబు - గట్టినపతియు
నలియఁ బైవారల వెల్వరించిన - నశ్వమేధంబు
ఫలము పేక్షించిన లింగమడిసిన - పాపంబు దమకు.

౪. జ(న)నుత చేఁబ్రోలనుండి జెజవాడ - జాత్రకువచ్చి
త్రినయనుసుతుడుఁ డొండుపోటుమెచ్చక - తివిరియున్నెలవ
యనఘుండు సేకొని యిందుఁ బ్రత్యక్ష - మైయున్ననిచ్చఁ
గనిమల్లఁ డెత్తించె గుడియు మరమును - గార్తికేయునకు.

(దీనిశేషము రెండవప్రక్కనున్నది యస్పష్టము)

౫. రమణతో బెజవాడ కెల్లబెడఁగును - రక్షయుంగాను
దమతాతమల్లపరాజు వేరదు - దానుగట్టించెఁ
గ్రమమున దానిక కలశ మిడ్డట్లు - గామొగమాడు
వమరంగ శ్రీయుద్ధమల్లుఁడెత్తించె - నమితతేజుండు.

౬ తనధర్మువొడఁబడి కాచునృపులకుఁ - ద

ఈశాసనమందుఁ బ్రయోగింపఁబడిన కొన్ని శబ్దముల యందలి విశేషాంశము లీక్రిందఁ దెలుపఁబడును.

సల్కి—(పంక్తి ౬) ఇదిచళుక్యశబ్దభవము.

నా వద్దఉన్న చళుక్యభీమునినాఁటి తామ్రశాసనమొకదానిలో ''తత్పూనుర్విజయాదిత్యో భీమసల్కి నామాసన్ తత్ప్రక్షదక్షిణ గంగ బలంచనిర్జిత్య'' యనిప్రయోగమున్నది.

నెగిదీర్చెన్—(పం. ౧౦)=నెగయఁదీర్చె నెగయు=ఎగయు, తీర్చు=ఏర్పఱుచు, కట్టించెనని భావము

గొరగలు—(పం ౧౦.)శైవమతావలంబు లగు భిక్షుకులు.

సీ గొరగనై మైలారుఁగొని యాడునొక వేళ నొసటిపైబండారు పసుపు దాల్చి (శ్రీనాథుని కాశీఖండము ఆ ౭)

వీరలను గన్నడభాషలోఁ గొరవలందురు ''గొరగల్గాక'' యనినప్పుడు గకారముగురువైనందున ఛందోభంగము కలిగినది దిద్దుట కవకాశము కనఁబడదు కన్నడఛందస్సులో రేఫలవర్ణములు తేల్చి పలికినపుడు తత్పూర్వాక్షరము (హ్రస్వమైనచో) లఘువే యగును ఆసంప్రదాయము ననుసరించి కవి యీప్రయోగము చేసియుండనోపును.

బృందంబుగొని—(పం ౧౧)=కూడికొని, సమావేశమై.

బారనాసిన్వచ్చిన—(పం. ౧౨. ౧౩)=వారణాసియందు వధచేసిన

డస్సి—(పం. ౧౪) డయ్యుధాతువు క్త్వార్థకరూపము. ఇచ్చట సకర్మకముగాఁ బ్రయోగింపఁబడినది ఇయ్యెట్టు డస్సి యనఁగా నీయొట్టును క్షీణింపఁ జేసి, పాటింపక యని యర్థము ఒట్టుతప్పియనియుఁ జెప్పవచ్చును.

మలినురై (పం. ౧౫) ఇచ్చట రేఫము విశేషము.

తానపతులు. (పం ౧౬)=స్థానికులు, దేవాలయ ధర్మకర్తలు.

రాజుపట్టంబు. (పం. ౧౬. ౧౭)=రాజచిహ్నమైనపట్టము. పట్టమనఁగా రాజ్యాభిషేకకాలములో నొసటఁ గట్టెడు పట్టె (శబ్దరత్నాకరము). పట్టంబుగట్టిన=పట్టంబుగట్టుకొనిన.

అలియన్: (పం. ౧౮.)=అలయన్. శ్రమపడునట్లు

వెల్వఱించు (పం. ౧౮)=వెలువఱుచు. వెడలఁగొట్టుట యనిభావము.

చేబ్రోలనుండి—(పం ౨౨)=చేఁబ్రోల్ + ఉండి. చేఁబ్రోలునందుండి. ఇచ్చట నుండి యను నది యుండుధాతువు క్త్వార్థకరూపమనియు, నది

యె కాలక్రమమున విభక్తి ప్రత్యయముగాఁ బరిణమించిన దని యు గ్రహించునది. శకటరేఫప్రయోగము విశేషము 29వ పంక్తిలో నీశబ్దమే చేంబ్రోలు అనియున్నది

జాత్ర (పం ౨౩) ఇది సంస్కృతయాత్రాశబ్దప్రాకృతరూపము దీనివల ననే జాతరయను తెనుఁగుమాట పుట్టినది

ప్రత్యక్షము—(పం ౨౬) వకారము తప్పు బిందు పూర్వకబకార ముండ వలయును.

అడిసిన—(పం. ౨౦. ౨౧)=అడిచిన, పగులఁగొట్టిన. పూర్వ మిది యడియు ధాతువుగా నుండె నేమో, అరవములో. అడి=కొట్టు

తాను- -(పం. ౪౦) మల్లపరాజు తానుగట్టించె, ననఁగా, మల్లపరాజుకట్టించె నని యే యర్థము తాను శబ్దమున కిట్టిప్రయోగము ప్రాచీనగ్రంథ ములందుఁ గనఁబడుచున్నది. పూర్వకాలమునం దాంగ్లేయభాషలో The King came అనుటకు మారుగా The King he came అనుచుం డెడివారు.

ఇష్టట్లుగ—(పం ౪౧. ౪౨) ఉంచినట్లులు.

మొగమాడువు—(పం. ౪౨)=మొగనుండు మాడువు. మొగయనఁగా నగ్ర భాగము. ముఖశబ్దభవము. మాడువు=మేడ,హర్మ్యము మొగ సాల యనునప్పుడు గూడ మొగశబ్దమున కిదియే యర్థము.

ఒడఁబడి (పం—౪౫)=సమ్మతించి.

S N. Press, Choolai, Madras—1917

కారణంబుననో మఱి యేకారణంబుననో గ్రంధకర్తలను "మంగలరంగఁడు మాదిగమల్లఁడు చాకలి చెన్నుగాఁ" డని యును "నిరక్షరకుక్షి" యనియును నిందించుచున్నవారు. ఈ విమర్శనతత్త్వ మిట్టి కష్టనిష్ఠురములలోఁ జిక్కినది. ఐనను భాషాభివృద్ధికి విమర్శన లావశ్యక మనుటకు సందియ్యము లేదు కర్తవ్య మెద్ది యనునది విచారణీయము ఒక్కవిమర్శకునికరమునఁ గృపాణ మిడి గ్రంథ కర్తలను రక్షించుటకును శిక్షించుటకును భూషించుటకును దూషించుటకు నధి కార మొసఁగుట యనపేక్షణీయము. సుస్వభావు లగునైదుగురు పండితుల నేర్పఱిచి గ్రంధములు విమర్శింపఁజేసినచో భాషాభివృద్ధికిఁ గారణ మగును. ఆపండితులును గాశీవిద్వాంసులబలె శలాకన్యాయ మనుసరింపక గ్రంధమామూలా గ్రముగఁ బరిశోధించి వివరముగ నభిప్రాయ మీయవలెను. ముఖ్యముగ భాషా భివృద్ధి దేశాభివృద్ధికిఁ గారణ మనియును, దేశభాషాభివృద్ధు లైకమత్యముపై నాధారపడినవనియుఁ, గావున నైకమత్యమునకు నేరీతిగను భంగము కలుగనీయ రా దనుతత్త్వము మనమున నుంచికొని విమర్శకులు శాంతమృదువచనముల గ్రంధములు విమర్శించుట సమంజసము. దిక్కులేక చచ్చిన గ్రంథకర్తలగ్రంధము లపై గౌరవమువదలి వారి గ్రంధములు చింపి చెండాడినను నాడనింపు. చచ్చిన వారు దయ్యములయి విమర్శకులను బట్టరు. బ్రదికినవారిపైన మాత్రము ధ్వజ మెత్తవలదు. ఎత్తినను స్నేహభావగుంభితము లగుపదము లుపయోగింపవలెను. ఇది పాశ్చాత్యనాగరకతాభ్యుదయపధము.

## వ్యుత్పత్తి.

ఇది యాంధ్రసాహిత్యపరిషత్తువారికి మఱి యొకకష్ట మగుపని. ఇప్పని నొనర్చుటకు సాహసింపకమున్ను "అక్షరముల సంయోగ వియోగ వికల్ప వ్యత్యాస స్వరూపనాశన"విధము లన్నియు నాంగ్లేయభాషలో గ్రిమ్సులా రీతిగ విభ జించి యాయావర్గము లేర్పఱిచి యావిధులనుబట్టి యుక్తము లగునూహలు చేయనగును గాని యిచ్ఛానుసారము శబ్దోత్పత్తిక్రమ మూహించుట తగదు. దీని నాంగ్లేయులు "Congectural philology" యని పిలిచెదరు. పైనిఁ గట్టఁబడుగృహమును శ్లాఘనీయముగ భద్రపఱుప మనవారు యత్నింతురు గాని యస్తిభార మిసుకపై నిలిచినదియే యని యాలోచింపరు. శబ్దముయొక్క మూలతత్త్వ మేమయినది చూడక దానిపై నుద్భవించిన క్షయాభివృద్ధులను గుఱించి లాక్షణికన్యాయవాదము లనేకములుగఁ జేసి నిర్ధారింతురు. ఒకశబ్ద

మొకరూపముననే మూఁడునాలుగుభాషలలో నుండినచోఁ దమయూహకుఁదోఁచిన యెద్దియో యొకభాషనుండి మఱియొకభాషకుఁ దీసికొనినపద మని నిఘంటువు లొనరించువారు వ్రాయుదురు. ఇట్టియూహాలు గొన్ని చక్కఁగనే యుండును. కొన్నిశబ్దముల వ్యుత్పత్తులు మాత్రము తృప్తికరములుగ నుండవు. ఈనావాక్యములు స్పష్టముగ నున్నవియో లేవో యని నాకే సందియము కలిగి దృష్టాంత పూర్వకముగ నాయభిప్రాయముస్పష్టపఱిచెద. ఆర్యులభాషలోఁ గొన్నిశబ్దములు వారిస్థలములు, వారిమర్యాదలు, వారినడవడికలు, వారిగుణములుఁ దెలియఁజేయు నర్థములు గలవిగ నున్నవి. మనమట్టిశబ్దముల నెదుటనుంచికొని వానికిఁ గల నానార్థములను గుఱించి దీర్ఘాలోచన సేయునెడ నెద్దియో యొకయుక్తియుక్త మగుభావముఁ దోఁపకమానదు. బ్రహ్మక్షత్రియవైశ్యు లగునార్యు లెల్లరును గోత్రములు గలవారుగదా? ఆగోత్రముల నంటికొని ప్రవర యొకటి యున్నది కదా? వధూవరులగోత్రము లేమి ప్రవర లేమి యని యడుగుచున్నాము గదా? ఏల? ఈప్రశ్నకు బదు లిడవలె ననిన గోత్రశబ్దముయొక్క వ్యుత్పత్తి చక్కఁగ నూహించి నిర్ధారింపవలెను. గోత్రశబ్దమునకు నర్థములు నామలింగానుశాసనము రీతిగ "అద్రి గోత్రము గోగణము భూమి" యనియున్నవి.

గోత్రప్రవరల వ్యుత్పత్తి.

గోత్రము పర్వతార్థమునందు లింగాభట్టీయములో నొక్కరీతిగ వ్యుత్పత్తి వ్రాయఁబడినది. గోత్రార్థమునందు.—

"గూయతే శబ్ద్యతే గార్గ్యో వసిష్ఠ యితి గోత్రం" అనియున్నది. అద్రి-భూమియనుగోత్ర శబ్దము మనము ప్రారంభించిన విషయమునకు సంబంధపడదు. ఇంక గార్గ్యవసిష్ఠాదిఋషులనామములచే గోత్రము లెట్టులేర్పడె నని యడుగన గును. సర్వశబ్దసంబోధిని యనునిఘంటువులో గోత్రశబ్దమునకు "గోరక్షక" యను నర్థము వ్రాయఁబడినది. దీనిపై గోగణమును రక్షించుస్థాన మని యర్థము సేయనగును. అట్టిస్థానము కంచెకోటయగును. ఋగ్వేదకాలములో నేమి, బ్రాహ్మణములకాలములో నేమి ముఖ్యుఁడగు గొప్పప్రసిద్ధఋషి యొకఁడు యజమానుఁడుగ నుండుటయు వానిసంతతివారును, శిష్యులును నాఋషిపోష్యవర్గము లోనే యుండుటయుఁ బద్ధతిగ నుండినది. యజ్ఞాదులందు వీరి కిడుదక్షిణ గోగణసంపదయే, ఆగోసముదాయము నంతయును రక్షింపఁ గంచెకోటను గట్టుచుండిరి.

ఆకంచెకోట ముఖ్యఋషినామమునఁ బ్రసిద్ధికెక్కెను. ఆస్థలమున ముఖ్య ఋషియొక్కయు వానిసోదరశిష్యవర్గముయొక్కయు గోవు లుంపఁబడుచుండెను. ఆగోత్రనామము ముఖ్యఋషినామముపైని నా కంచెలోఁ జేరినయితరులు ప్రవర యనునామవర్గమునఁ జేరినవారుగను రూఢియయ్యెను. కావున వీరందఱకు సామీప్యబాంధవ్య ముండుటచే, వీరిలో వివాహాదిసంబంధములు గలయఁగూడ దనువిధి యేర్పడెను. ఇదియ గోత్రప్రవరల వ్యుత్పత్తి యనుటె యుక్తియుక్త ముగ నుండు నని నాకుఁ దోఁచుచున్నది. ఇట్టివ్యుత్పత్తి వంశార్థమునందు సైత మూహింపనగును. మాతృ, పితృ, భ్రాతృ, దుహితృ శబ్దములు సైతము పురాతనార్యుల కర్మవిధుల ననుసరించి యున్నవని తెలియనగును. "మాక్సముల్లరు గారు" (Chips from a German Work-shop, Vol. I & II ) యనుగ్రంథములోఁ గొన్నిసంస్కృతశబ్దముల వ్యుత్పత్తుల వ్రాసి యాశబ్దముల ధాతువుల నుండియే, యితరదేశభాషాపదములు గొన్ని రూపములు గొనిన వని వ్రాసినారు. ఇట్టివ్యుత్పత్తులు గనిపెట్టుటకు మనకు ననుకూలకాలము లేకయున్నది. ప్రతిమనుజుఁడును దనజీవయాత్ర జరపికొనుటయందే కాలమెల్ల వినియోగించుసమయ మిది కావున హెచ్చుపనులకుఁ బోవ ననుకూలము చాలదు. కావున వ్యుత్పత్తులువ్రాయువా రాసమయమునకుఁ దోఁచిన యెద్దియో యొకయూహను వ్రాయుదురు. వ్రాఁతగ నుండుకారణంబున శాశ్వతముగ నిలుచును. ఇట్టి వ్యుత్పత్తులు మాత్రము చింతనీయములుగ నుండును. ఆంద్రియాకన్ నుండి యాంధ్రులు పుట్టిరని యొకానొకవిద్వాంసుఁడు నిండుసభలో నుపన్యాసం బిచ్చెను. దానిని నేనపుడే యెదిరింపవలసివచ్చెను. మనస్తాపము బలమాయెను. కాని ఫలము లేదాయెను. ఉపన్యాసకుఁడు తాను ద్రావిడియనియు నాంధ్రుఁడు కాఁడనియుఁ దెలిసినకారణంబున నింతటివిరుద్ధవాక్యములకుఁ గారణంబాయెను. వెయ్యాలు సంవత్సరములుగ ద్రవిడదేశంబుఁ జేరి ద్రావిడసంప్రదాయములు గొన్ని యవలంబించిన కారణమున వారార్యులు కారైరా? ఆంధ్రబ్రాహ్మణులు కారైరా? ద్రావిడబ్రాహ్మణు లెప్పుడేగాని యుత్తరప్రదేశములనుండి వచ్చినట్టే చరిత్రలు పలుకవుగదా. ఈవిషయ మాయుపన్యాసకులకుఁ దెలిసియుండినచో నాంధ్రశబ్దమునకు నట్టియసహ్య మగువ్యుత్పత్తిని నిండుసభలో ధైర్యమునఁ బలుకుచుండలేఁడు. కొన్నిశబ్దముల వ్యుత్పత్తినిఁ గనుంగొనుట కష్టసాధ్యముగనున్నది, గాని, యసాధ్యముకాదు. కావున వ్యుత్పత్తులు గనిపెట్టవలెనన్న

నపేక్ష గలలాక్షణికులు సర్వశాస్త్రములను శోధించి, శబ్దతత్త్వమెఱింగి యిప్ప నికి సాహసింపవలెను.

ద్రవిడ మళయాళశబ్దములను గుఱించి నానావిధ మగువ్యుత్పత్తి బహువిధములుగఁ దోఁచుచున్నది. ఐనను దానియాథార్థ్యము నాలోచింపక వెలిపెట్టుట సాహస మని వదలినాను ద్రవిడము ద్రవానిలము (Moist air) నుండి పుట్టినదనియు మళయాళము మలయానిలమునుండి పుట్టిన దనియు నాకుఁదోఁచినది. ద్రవ + అనిల, మలయ + అనిల-యీశబ్దములలో "అని" యనునక్షరము లుచ్చారణదోషమున బహుకాలమునకు మున్నే లోపింప "ద్రవల మలయాల" రూపము లేర్పడె నదియు "ద్రవల" శబ్దములోని "ల" కారము "డ" కారమై ద్రవడమైన దనియు దానిసంబంధమే ద్రావిడ మైన దనియు నాకుఁ దోఁచినది. ఈవ్యుత్పత్తిని గుఱించి యాంధ్రపరిషత్సభ్యు లాలోచింతురుగాత. ప్రాక్పశ్చిమ దేశభాషావిశారదుఁ డగునొకపండితుఁ డీభాషారహస్యమును గుఱించి యీరీతిగ వ్రాసినాఁడు.

భాషామర్మము.

" Whatever may be the deeper nature of speech in its outward manifestation as human language it is an organism, a growth, a terrestrial evolution. It contains, indeed, a constant psychological element, and is therefore more free, flexible, consciously self-adaptive than purely physical organisms. Its secret is more difficult to seize, its constituents yield themselves only to more subtle and less trenchant methods of analysis " *** " The profundities of things, their real truth, can best be discovered by penetration into hidden things that the surface of phenomena conceal, into that past development of which the finished forms present only secret and dispersed indications, into the possibilities from which the actualities we see are only a narrow solution A similar method applied to the earlier forms of human speech can alone give us a real science of Language." *** -

The error of philology which prevented it from arriving at a more satisfactory result in this direction was its pre-occupation in the physical parts of speech with the exterior morphology of language and in its psychological parts with the equally external connections of formed vocables and of grammatical inflexions in kindred languages. But the true method of science is to go back to the origins—the embryology—the elements—and more obscure process of things.—(Arya 341 January 1915.)

వ్యుత్పత్తిక్రమము స్థిరమగుసిద్ధాంతముపై నాధారపడవలెను. అట్టిసిద్ధాంతము నేర్పఱుచుట కష్టముగ నున్నది.

## వార్తాపత్రికలు.

ఆంధ్రభాషాభివృద్ధికి వార్తాపత్రికలు ముఖ్యాంగములుగ నున్నవి. అవి చక్కఁగఁ జదివినవారికిఁ బ్రాపంచికవార్త లన్నియును గరతలామలకముగ నుండుట యే గాక భాషాభివృద్ధియు నగుననుటకు సందియములేదు. వార్తాపత్రికాధికారు లొకరిరువురు వక్తలను నియమించి గ్రామగ్రామునకును బోయి వార్తాపత్రికలను జదివినఁ గలుగునుపయోగములను బోధించి వారుచందాదారులగు నటులు చేసి యాగ్రామమున నుండు బడియయ్యవారైనను రెడ్డికరణాలైనను జదువురానివారికి నవ్వార్తలు చదివి వినిపించులాగున నేర్పాటొనరింపవలెను చదువురానివారికినిఁ జదువువచ్చినయాఁడువారికిని మనోరంజకములుగ నొకటిరెండుచిత్రకథలును గట్టుకథలును వార్తాపత్రికలలోఁ జేర్చిన జనసామాన్యుల మనము లాకర్షించును.

## నవలలు.

కొన్నిదినములక్రిందట నాంధ్రపత్రికలో హాస్యకరమైన కొన్నివాక్యములుండెను. నవలాచక్ర మతిత్వరితగతిఁ దిరుగుచున్నదనియును రెండుముక్క లక్షరములు వచ్చినతోడనే స్త్రీలుసైతము నవలలు వ్రాయనారంభింతు రనియును నర్థమిచ్చులాగున వ్రాయఁబడియుండినది ఎవరిచే వ్రాయఁబడినను నవలాభివృద్ధి మనదేశమునకు మంగళదాయకముగదా ? భూమ్యాకాశములకు ముడివేయు కల్పనాశక్తి గలస్త్రీలేమి, పురుషులేమి - యొకచిన్న నవల తమకల్పనాశక్తివలన రచించుట యేమికష్టము ? హిందూస్త్రీలు రాత్రిందివములు తమలోఁ దాము చెప్పుచు వినుచు నుండుపకల్పనాకథలు వ్యర్థమగునా ? వానికి వన్నెవెట్టి చక్కని శైలిని వ్రాసి ప్రకటించునది కనిన మనహిందూదేశమునకు నిదియే శుభసూచక మని నేనెన్నెద. పురుషులు కొందఱు చరిత్రనవలలను వ్రాయుచున్నవారు ఆనవలలలో నొకటి నేఁ జదివినాను. చరిత్రముఖ్యాంశము లన్నియును దప్పులుగనుండెను. నవల లవియని చరిత్రాంశములు తాఱుమాఱుసేయుట గొప్ప తప్పని నేనెన్నెద. చరిత్రనవలలు వ్రాయువా రీయంశమునుఁ జక్కఁగ గమనింతు రని ప్రార్థించెద. చరిత్రముఖ్యాంశ మొకటిబీజముగ నుంచికొని దానిని వ్యక్తపఱుచు నుపాంగములెల్ల విశ్వామిత్రసృష్టిగ నుండనగును గాని మూలతత్త్వమునే తలక్రిందుగఁ జేయుట శ్లాఘనీయము గాదు.

## అలంకారములు.

మానవప్రపంచంబంతయును నలంకారాబ్ధిలో మునిఁగి తేలుచున్నది. భాషాస్వరూపమే యలంకారము. ప్రపంచములోని యన్నిభాషలు నలంకారయుక్తములేను. అలంకారరహితముగ నుండునది విడిమాటలగును గాని భాష కాదు. మనపురాతనగ్రంథమగు ఋగ్వేద మలంకారమయము. అలంకారరహితముగ నొకచిన్నవాక్యమైనను రాదు. వాక్యము రాదనువాక్యములోనే యలంకారమున్నది. గానిగయాడుచున్నది, నాఁగేలు దున్నుచున్నది, యివియలంకారములు గావా? అలంకారములు వలదని యాంగ్లేయభాషాప్రావీణ్యు లగు కొందఱు హిందువు లందురు. అది యనాలోచితవాక్యమని నాకుఁ దోఁచుచున్నది. ఆంగ్లేయభాష సైత మలంకారమయము. ఉపమ, రూపక, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి యనిన, వారికిఁ దలనొప్పిగ నుండును. Simile, Metaphor, Hyperbole, అనిన వారికి శ్రావ్యముగ నుండును. ఆంగ్లేయభాషలో నలంకారశాస్త్రమునకు (Rhetorics) అనిపేరు. వక్తలు గాఁగోరు వారెల్ల రీశాస్త్రమును గళాశాలలో నేర్తురు. భాష యవ్యక్తముగను భావయుక్తముగను మనసులోనే యడఁగి యుండినపుడు తనప్రకృతినైజస్వరూపముననే విడిమేనున నుండునేమోగాని వెలికివచ్చునపుడు మాత్రము సర్వాలంకారభూషితయై సమయానుసారముగ వ్యక్తయయి విహరించుచుండును. అంతయేల. మనయనుభవమే మనకుసాక్ష్యము. మనమింటనుండునపు డేరీతిగనుండుము? సభలకువచ్చునపు డేరీతిగనుండుము? సభలకువచ్చునపు డంగరేకలేల? తలగుడ్డలేల? మంచిగుడ్డ కట్టనేల? మర్యాదకుఁ గదా? అశాశ్వతుల మగుమనకే యంతటిమర్యాద కావలసినపు డమర్త్యమై సర్వమాన్య యగుభాషకు మర్యాద వలదా? ఇఁకఁ ప్రబంధకావ్యములోని వర్ణనలు గొన్ని యసంగతము లని కొన్ని యశ్లీలములని కొందఱుమతము. అలంకారము లన్వయించుశాస్త్రములు నేర్చినవారికి నవి యెన్నఁటికి నసంగతములుగఁ దోఁపవు. రాకాచంద్రముఖి యనిన స్త్రీముఖము మండలాకారముగ నుండెనా యనువారికి నావర్ణన యసంగతమేను. చిఱునవ్వును వెన్నెలఁ బ్రసరింపఁజేయుచుఁ జూచువారి మానసమునకు నాహ్లాదదాయకముగ నుండె నని యర్థముంజేసికొనువారికి నావర్ణన యెంతమాత్ర మసంగతము గాదు. ఇఁక నశ్లీల మనునది చదువువారి మనోభావముపై నాధారపడినది. నాకు నశ్లీలముగ నుండునది పరులకు మనోహరముగనే యుండును. కావున నావిషయ

మంతగఁ జర్చించుటయనావశ్యకము. డార్విన్ గారియైదవగాస్పెల్ చదువుఁడి, ప్రబంధకవులు గొన్నివర్ణనలు సేయవలె నని నిబంధనలున్నవి. అట్లు వారు సేయకున్నా ప్రబంధమునకె లోపము కలుగును గావున నట్టివర్ణనలు గలప్రబంధకథాధోరణి యించుమించుగ నొక్కవిధముగ నుండును. ప్రబంధములలో వర్ణనలు ముఖ్యముగాని కథాచమత్కృతి యంత ముఖ్యముగాదు. ఆంధ్రప్రబంధకవిత్వ ప్రథమకర్తయును గారకుఁడును గృష్ణదేవరాయఁ డేను. ప్రబంధములకు మార్గదర్శకుఁ డాతఁడే యని చెప్పనగును మిగతవారు ప్రబంధములలో నలంకారము లే ముఖ్యమని వానిని హెచ్చించి వారు చూపినపద కాఠిన్యమును వదలిరి, ప్రబంధములువ్రాసిన కాలమునందు జనులయభిరుచి యారీతిగనే యుండె నని యావర్ణనలపై మనము తెలియనగును మఱియుఁ గవి పరస్త్రీయంగాంగములు వర్ణించుచుందురు. ఇది సహజమేనా ? కవిచూచినపు డా స్త్రీ యంతటినిర్లజ్జగ నిలుచునాయని ప్రబంధకవులను గొంద ఱిక్కాలమున నాక్షేపించుచున్నవారు. ఈయాక్షేపణకుఁ గారణ మేమాత్రమును లేదు. మానవులు దేవతాస్త్రీల సౌందర్యవిభవాతిశయములు వర్ణించుట ప్రపంచములో సర్వలకావ్యగ్రంథములందు సహజముగ నుండును గదా ? మనుజు లాదేవతాస్త్రీలనుఁ జూచివర్ణించియుందురా ? Paradise Lost అనుగ్రంథములో "Eve" యనుసౌందర్యవతిని నగ్నగ నుండినటుల మిల్టన్ కవి వర్ణించినాఁడుకదా ? అంధుఁ డగుమిల్టన్ యావనుస్త్రీ యాస్థితిలో నుండునది చూచినాఁడా ? ఇట్టి వర్ణనలు గలగ్రీకు రోమన్ గ్రంథము లున్నవి కదా ? "Grecian beauty" యని యనేకపాశ్చాత్యకవు లిప్పటికిని దమగ్రంథములలో వర్ణించుచుందురు గదా ? ఈకవు లాపురాతనగ్రీష్యన్ స్త్రీసౌందర్యములను గనినారా ? లక్ష్మి, సరస్వతి, రంభ, ఊర్వసి, శకుంతల, యీమొదలగుదివ్యస్త్రీలరూపము లంగాంగములు దిద్దిదిద్ది చిత్రకారుఁడు పటములు వ్రాయును. శిల్పియాజాతిస్త్రీల విగ్రహము లొనర్చును. ఆదేవతాస్త్రీలను వారు చూచినారా ? అట్లే కవులవర్ణనలని తెలియఁగూడదా ? సౌందర్యపరిమితి యింత యని మనమున నూహించి యట్టిసౌందర్యాకృతికి నేయంగ మెటులుండవలెనో యనునది నిర్ధారించి కవులు స్త్రీసౌందర్యమును వర్ణింతురు. వారట్టి స్త్రీలను గన్నులారఁ జూడవలె నను నియమము లేదు. బహుపురాతనకాలములోనే వాత్స్యాయనాది ఋషులు స్త్రీజాతిని నాల్గువిధములుగ విభజించి యందే జాతిస్త్రీ యెటులుండును, దానిగుణము లెవ్వి, యనువిషయములు చక్కఁగ వివ

రించి సూత్రములును గళాశాస్త్రమును వ్రాసియుంచినారు. కవులు సర్వకళాభిజ్ఞులు కావున నట్టిశాస్త్రబలమునఁ బద్మినీజాతిస్త్రీని ప్రబంధములలో వర్ణించుచుందురు. చిత్రలేఖకుఁడు భోజరాజుగారిభార్యయొక్క చిత్రపటమును లిఖించియుండ సర్వకళావేత్తయు సాముద్రికశాస్త్రప్రవీణుఁడును నగుకాళిదాసమహాకవి యాచిత్రమునుఁ జూచి తొడపై నొకమచ్చయుంచె నఁట. ఇట్టిది కవుల యపరోక్షజ్ఞాన మని పలికినను బలుకనగును. కావుననే రవి కానని చోటుఁ గవికాంచు ననులోకోక్తి యేర్పడినది. ఇంతకును గవులకుఁ గవిసమయము లని కొన్ని నియమము లున్నవి. వాని నతిక్రమించినచో మురారికవు లగుదురు. మఱియొక యంశమును సూచించి యీవిషయము విరమించెద. విరహిణు లున్మత్తలై యుక్తాయుక్తములు తెలియక ప్రేలుచుందురు. అట్టివి యాక్షేపణీయములు కావు షేక్సుపియరుకవిచే రచింపఁబడిన Antony & Cleopatra యను నాటకము చదువనగును శ్రీరాములంతటిధీరులే విరహోన్మాదమునఁ బ్రేలుచుండిరనిన స్త్రీ లేకాంతమున విరహతాపమునఁ బ్రేలుట యేమియచ్చెరువు ? కావున భాషకు నలంకారముల భూషించుటయే శ్రేయము. విడిమేనున వదలుట హేయము. పైని వ్రాయఁబడిన యలంకారములు విషయమునందలి నాయభిప్రాయ మాంగ్లేయభాషాప్రావీణ్యము గలనామిత్రులు కొందఱు నన్నుఁ బ్రశ్నించి నపుడు నేనిచ్చిన సమాధానములు, శబ్దార్థాలంకారములు భాషాభూషణములనుటకు సందియము లేదు గాని యవి సమయోచితములుగను స్థలోచితములుగను నుండినచోఁ గాంతి హెచ్చును, రసహీనవస్తువులకు నలంకారము లిడుటయు ననర్హస్థలము లలంకరించుటయు వికారములుగ నగపడును. కావున నట్టివికారాలంకారములను గవులు పరిత్యజించుట శ్లాఘనీయము. ఈయలంకారములం దేమి విచిత్రమహిమ యున్నదియో తెలియుట కష్టముగ నున్నది. దత్తమండలము వారును ధార్వాడ బెంగుళూరు దిక్కువారును (ముఖ్యముగ వైశ్యులు) మణువులకొలఁది బంగరుసొమ్ములుఁ దొడిఁగికొనియెదరు. వీరినిఁ జూచి "వీరేమి పోతులా ? ఇంతగ బరువుమోసినా" రని మద్రాసువారు హేళిసేయుదురు. మనవారు మద్రాసువారినిఁ జూచి "అయ్యో" మంగళకరమైన ముంగరయును, బంగరునగయును ధరింపక తాళ్ళుమోసికొని బ్రదుకు గ్రహచారము వీరికేమి వచ్చె నని పరిహసించుచుందురు. ఎట్టి యలంకారములను జేపట్టక యుండు నాంగ్లేయాంగనను జూచి "ఇదియేమి విధవయా" యని మనవా రడిగెదరు. ఎట్టి

యలంకారధారణము మానసమునకు రూఢిగ నలవడియుండునో యట్టియలం
కారములు లేనపు డావస్తువు వికారముగఁ దోఁచుచుండును. బహుదినములుగ
నలంకారపూరిత కావ్యరసాస్వాదనముచే నానందించు హైందవమానసము
తద్విరుద్ధాభిరుచినిఁ గోరునా? ఇంతకును నొకనికిం బ్రీతికర మగురుచి మఱి
యొకనికిఁ గటువుగ నుండును. భిన్నరుచులకు నలవడినమనుజులనెల్ల నొకవిధ
ముగ నానందింపఁజేయ బ్రహ్మకైనను వశముకా దనిన, నిఁకఁ, బ్రబంధకవులకు
శక్యమా? మఱి యొకరహస్య మింకున్నది. ప్రబంధములందిన రాజు లలం
కారప్రియు లైనందునను, బండితకవులు తమపాండిత్యప్రభావముఁ బ్రకటింప
నపేక్షగలవారుగ నుండినందునను, సహజాలంకారము లిప్పటిపేదముత్తయిదువుల
వస్త్రాలంకారములరీతి సామాన్య మైనందునను నప్పటిసరసాగ్రగణ్యు లగురసిక
జనులు నవీనచిత్రవస్త్రాద్యలంకారములఁ గోరుచుండినందునను బ్రబంధకవులి
చ్ఛానుసారముగ వస్తువర్ణనములు సలుపనారంభించిరి. ఇట్టివిషయము లెల్లను
బ్రాపకులయొక్కయు జనులయొక్కయుఁ జిత్తవృత్తులపై నాధారపడియుం
డును. ప్రభువులు వేదాంతులైరేని కవులగ్రంథములు వేదాంతపుంజములుగ
నుండును. ప్రభువులు సరసవిటాగ్రగణ్యులైరేని కవులు సరసరసాలంకారము
లనే హెచ్చుగఁ గల్పించుచుందురు. భాషయాయాకాలము జనుల స్వాభావిక
గుణములను దెలియఁజేయుననుటకు నీయలంకారవిషయ మొకనిదర్శనముగఁ
దీసికొననగును. ముఖ్య మలంకారరహితముగ వ్యావహారికభాషయు, వ్యాకర
ణాదిశాస్త్రభాషయు నుండనగునుగాని, గ్రాంథికసాహిత్యభాష, యలంకారర
హితముగ నుండుట సామాన్యము, వస్త్రాద్యలంకారములును జందనచర్చలును
మనుజుఁడు ప్రయత్నమున ధరించును గాని యవి తనంతటఁ దానే దేహమునంటు
ననునది లోకానుభవము, కావునఁ, గవితాకన్యకుఁ గవు లలంకారము లుచి
తానుసారముగఁ దొడుగవలెను.

## నాటకములు.

నాటకములు భాషోన్నతికి ముఖ్యాధారములు. నాటకప్రదర్శనములు
ప్రేక్షకులమానసములను జెడుదారికి నీడ్చునని కొందఱందురు. అట్టిమైనము
బలె మెత్తనిచిత్తవృత్తిగలవారు పుష్పకోమలులంబలె గృహములలోఁ దపసు
లంబలె గుహలలోను దాఁచికొని, ప్రపంచవ్యవహారములఁ జూచినచో మానస
వైకల్యము గలుగునేమో యని భీతిలుచుండవలెను గాని వెలికి రాననర్హులు.

మనకుఁ దోఁపనివిషయ మాలోచింపవలెను. కానని విషయముఁ గనుటకు యత్నింపవలెను. తెలియని విషయము వివేకబలమునఁ దెలిసికొనవలెను. ఇది వివేకుల లక్షణము.

శాస్త్రములపునరుజ్జీవనము, కళాకౌశల్యాభివృద్ధి, భాషోత్కర్షత, సంఘసంస్కరణము, మహనీయుల గోష్ఠివలననే కలుగునని పెద్దలు వచించిరి. అట్టితఱి తటస్థించుటకు నిట్టిసభలే ముఖ్యకారణములు. రెండవకారణము నాటకప్రదర్శనము.

మన మెల్లరము కళాశాలలలోఁ జదువుచున్నాము. ఉపాధ్యాయులు మనల శిక్షించుచున్నవారు. ఆశిక్షయొక్క లాభము బుద్ధిమంతులకుఁ గలుగును. వర్తమానపత్రికలు చదువుట మనుజునకు రెండవశిక్ష. ఆలాభము చదువువారికిని వినువారికిని గలుగును. సర్వజనులకును ననాయాసముగఁ గలుగు ప్రత్యక్షశిక్ష యొక్క లాభము లభింపఁజేయునది నాటకప్రదర్శనమేను. బడిశిక్షగాని, వర్తమానపత్రికలశిక్ష గాని గ్రంథవిలోడనజనితజ్ఞానసాధనమునకుఁ గారణ మగును గాని సంపూర్ణజ్ఞానమునకు సాధనముగాదు. అట్టిసాధనము దేశాటన మగును గాని యదిసులభసాధ్యము గాదు. రెండవది నాటకప్రదర్శనమే యగును గావున మనపెద్దలు "కావ్యేషునాటకంశ్రేష్ఠ" మ్మనియు "నాటకాంతం సాహిత్య" మ్మనియుఁ బలికిరి. పుస్తకవిద్యాప్రావీణ్యము వివాదలాభము. నాటక మనుభవ లాభము. పుస్తకవిద్య బుద్ధ్యభివృద్ధికిఁ గారణము. నాటకము జ్ఞానాభివృద్ధికిఁ గారణము

బుద్ధిమంతుని దీర్ఘవిచారఫలము జ్ఞానము అనఁగా విచారసంయోగ బుద్ధియే జ్ఞానమని యర్థము. ప్రస్తుతస్థితిలో నుండుకళాశాలశిక్ష కొందఱకు దరపోషణసాధనము. కొందఱకు బుద్ధిచమత్కారవృద్ధికి సాధనము వీనికన్నిటికినిఁ బైమెట్టుగనుండు జ్ఞానమార్జింపసాధనము గాదు. సత్యాసత్యములస్వరూపము, ధర్మాధర్మములమర్యాద, వ్యవహారవీధిలో మాయామందిరమందు జరుగుద్రోహవ్యాపారధోరణి వాలు తెలుసుంగుటకు బడిశిక్షసాహాయ్యపడదు. నేర్చినను మానసమంటదు. లోకవ్యవహారవ్యాపారాదులు, దాని గుణదోషములు లోపాలోపములు నన్నియును నున్నవియున్నటుల వారివారిముందఱనుంచి "మీరు మీరు కనులారఁ జూచి యనుభవమునకుఁ దెచ్చికొనుఁడి" యని యెదుట నుంచునది నాటకప్రదర్శనమేను. కావ్యశాస్త్రవినోదములు బుద్ధిమంతునకు

నాహ్లాదకరములు. నాటకములో ప్రబుద్ధునకును నప్రబుద్ధునకును నప్రయోగశిక్ష గఱపుచు నానందదాయకము లగును. కావున నాటకముల మూలోద్దేశము విచారణీయము, నాటకాంగము మనోరంజకత్వ మనుటకు సందియములేదు. ఆగుణ మొకటియే, ప్రధాన మని యెంచినచో నది సకలురకు స్వాభావికలక్షణ మగునుగాని హెచ్చుగాదు. నాటకములో మనోరంజకత్వము తప్ప హెచ్చుగుణము వలదను దిదృక్షువులు కొంద ఱుందురు. అట్టివారి తలంపు నాటకాంగములలో నొక్కటి యగునుగాని సంపూర్ణాకృతిగాదు. పార్శీ హిందూస్థానీనాటకములు నవీనములు ప్రాచీనములు కావు. విధిబద్ధములు కావు. కథానియమబద్ధములు కావు. స్వేచ్ఛానుశాసనములు. నేపథ్యాభిశోభితములు. కాన ప్రాధాన్యములు. హైందవనాటకములలోఁ బై విషయములు మనోరంజకసాధనములు గాఁ గొనినను విధివిధానబద్ధములై యుండును. ఇప్పటివిప్రులు కొన్నివిధిక్రమము లతిక్రమించినను విప్రులే యైనరీతిగ, నిప్పటి కాలములో, సంఘదోషమువలననో, సంఘసామీప్యదోషమువలననో కొన్ని నాటకనియమము లతిక్రమింపఁబడినవి, యైనను నవి హిందూనాటకములేను. కావున నుపదేశార్థ మగుగుణము లనేకము లుండవలెను. నీతి - రాజభక్తి - రాజద్రోహఖండన - దైవభక్తి - మాతాపితృభక్తి - పతిభక్తి - అధ్యాత్మజ్ఞానము దేశాభివృద్ధి - యైకమత్యము - సంఘసంస్కరణము - సత్యాసక్తి - దుష్టదూషణము - శిష్టపరిపాలనము, ఈమొదలగు దేశార్థ మగునీతిసారము లుండవలెను. ఇట్టి యుపదేశములు నాటకములలో సమయోచితముగ నుండవలెను. వర్తమానకాలస్థితిగతులు వానికిఁ గారణములు. చిత్రలేఖలరీతిఁ జిత్రించి నాటకములలోఁ బ్రదర్శింపఁబడవలెను. ఫిలిప్ లిటన్ గారొత్తిపలికినరీతిగ నాటకకర్తలు నడిచికొనినయెడల నాటకములకు నేకుందును రాదు. వారియుపదేశవాక్యమేమనిన "Every play is a problem which tries to answer one of those moral questions that concern nearly all of us" పలువురు నాటకకర్తలు పై రీతిగ నైతికనాటకములనే వ్రాయుచున్నారు. నాటక మొకసిద్ధాంతచిత్రలేఖగ నుండవలయును. వర్తమానపత్రికలకు వ్రాయువారికిని నాటకకవులకును భూమ్యాకాశములంతటి దవ్వున్నది. పత్రికాలేఖకులు పరస్థితిబద్ధులు. కవులు ముక్తులు. లేఖకులు లోకసంఘాభిప్రాయవిషయలంపటులు. కవులు విషయాలిప్తులగు స్వతంత్రులు. పత్రికాధి

కారులు దినగ్రాసమునకు వార్తలువెదకువారు. కవులు నెమ్మదిగ నాలోచించు వారు. మొదటివారు సమవిషమభావగ్రస్తులు కావునఁ బక్షపాతులు. తత్కార ణంబున వారికి మిత్రులు శత్రులు నుందురు. ఇది యనుభవవేద్యము. కవులు సదాకాలము సమరూపులు. కావున నిరభిమానులు. కావున లోకమిత్రులు. వార్తాపత్రికలు పలుపురిచేఁ జెక్కంబడిన యశాశ్వతవిగ్రహములు. నాటక ములు కవిధ్యానయోగబలమున ఫలించిన చిన్మయస్వరూపములు. కవు లిట్టివారుగ నుండుటయే వారిలక్షణము కావున వారొనరించు నాటకములా రీతిగ నైతికవిషయభాషోపయుక్తములై యుండవలెను.

## నాటకభాష.

ఆంధ్రనాటకభాష కఠినముగ నుండరాదని కొందఱమతము. పేలవముగ నుండరాదని కొందఱమతము. అంతకఠినముగను నంతపేలవముగను నుండరా దని మధ్యస్థులమతము. మూలతత్త్వమునుఁ దెలియక యభిప్రాయములు భాషా విషయమున స్వేచ్ఛగ నిచ్చుచున్నారని నామతము. వాక్యసౌలభ్యకాఠిన్యములు విషయాధీనములు, విషయములు రసాధీనములు. రసము లితివృత్తాధేయములు. ఇతివృత్తములు కవిస్వాధీనములు. శృంగారమునందుఁ గాఠిన్యమును బౌరుషసమ యమున మృదుపదములును గలవాక్యములు పనికిరావు. హాస్యమపుడు గొప్ప సమాసపదములు పనికిరావు. పశ్చాత్తాపదూషణములందు మృదుపదములు పని కిరావు. భరింప నోపనిదుఃఖమున నాత్మత్యాగ మొనర్ప సమకట్టినపుడు సమా సయుక్తములగు గొప్పవాక్యములు చెల్లును. పట్టరాని యాగ్రహము వచ్చిన పుడు స్పష్టముగ నుచ్చరింపనివాక్యము గాని కొన్నిపదములులోపములైన వాక్య ములుగాని యొకముఖ్యశబ్ద ముచ్చరించి తనభావము దెలియఁజేయుచు నిలుపుటయ గాని యుండవలెను. ఇటులే యాయారసపోషణము నకై యాయా గుణములకుం దగిన శైలి నవలంబింపవలెను. శృగారసంబోధనలందు సమాస పదవాక్యము లుంట శ్రావ్యము. నిండుచందురునిం బోలుమొగముదానా? తళుకుచెక్కులదానా? యనుటకు మాఱుగ రాకాచంద్రవదనా! ముకురకపోలా! యనుట శ్రావ్య మని నేనెన్నెద. అది యలంకారశోభితము. ఇంక నన్యదేశ పాత్రములు రంగస్థానములఁ జేరినపు డాంధ్రభాషయే యాయావేషవిశేషములనుఁ బట్టి వాడవలెను. హామిలెట్టు డచ్చిదేశమువాఁడు. ఆంగ్లేయరంగస్థానముఁ జేరి నపు డాంగ్లేయభాషతో మాటలాడును. ఫ్రెంచిరంగస్థానముఁ జేరినపుడు ఫ్రెంచి

భాషతో మాటలాడును. శాకుంతుల ముద్రారాక్షసము లాంగ్లేయరంగస్థానమునఁ బ్రదర్శింపఁబడునపుడు హైందవపాత్రము లాంగ్లేయభాషలో మాటలాడుచుందురు. హిందువులని తెలియుటకు హైందవవేషములు మాత్రము ధరింతురు. గ్రామ్యభాషకు నియమము లేనికతంబునఁ గవు లాభాషను దమయిష్టానుసారము మార్చను హెచ్చక్షరములు జేర్పను నున్నయక్షరములు లోపింపను శబ్దములు దలక్రిందు చేయను స్వతంత్రులయి యుందురు, హాస్యము నర్మమర్మగర్భితముగ నుండవలెను. బందుబూతుల నిండరాదు. మహాజనులారా! మన దేశభాషా నాటకములనేఁ బొగడనేలా? జగమెఱింగిన బాఁపనికి జందెమేల? అన్యదేశ నాటకభాషావిషయ మించుక సూచించెద. పురాతనగ్రీకులభాష నాటకభాషయేను. ప్రాచీనరోమక్ వారిది నాటకభాషామయమేను, జర్మనుభాష నాటకభాషతో నిండినది, ఫ్రెంచిభాష మొలేర్ మొదలగువారి నాటకభాషతోఁ దాండవమాడుచుండును. ఆంగ్లేయభాష నాటకభాషయే యనిచెప్పినఁ దప్పుగాదు. కావుననే యాంగ్లేయభాషను గుఱించి యొకపండితుఁ డభిప్రాయమిచ్చుచు, "The pride of the English is their language and the pride of the English language is its Shakespere", అని వ్రాసినాఁడు. కావున నాటకభాషాభివృద్ధిచే భాషౌన్నత్యము గలుగు ననుట నిస్సందేహము, మనలోఁ బురాణనాటకములు హెచ్చుగ నున్నవి. చరిత్రనాటకములు సంఘసంస్కరణ నాటకములు గృహకృత్యనాటకములు వేదాంతనాటకములు బహుస్వల్పముగ నున్నవి. ఇట్టినాటకములు వ్రాయునపుడు విషయభిన్నత నుండి శైలి భిన్నించుచుండును. కవులకు శైలిని భిన్నించుసౌలభ్యము కలుగును. దానినుండి భాషాసౌష్ఠవము హెచ్చును, మనభాషలో సులభముగఁ జేరఁదగిన మహారాష్ట్రాదిదేశ భాషానాటకములు గుణవంతములుగ నుండెనేని వానిని భాషాంతరీకరింపవచ్చును.

కళాశాలశిక్ష.

కలాశాలలలో నుపాధ్యాయు లాంధ్రులు గానే యుందురు. కావున వారు భాషాభిమానులై బాలురు సలక్షణముగ మాటలాడులాగునను వ్రాయులాగునను జేయుటకై శ్రద్ధపుచ్చికొనినచో-నారీతిగ శిక్షింపఁబడిన బాలురు భవిష్యత్కాలమున భాషాభవనమునకు మూలస్తంభములై యుందురనుటకు సందియము లేదు. కళాశాలలో ఆంగ్లేయ భాషాపాఠములుఁ దప్ప మిగతపాఠము లెల్ల

మాతృభాషతో బోధింప నిపుడుండుస్థితిలో సాధ్యము కాదని నాకుఁదోఁచుచున్నది. తెనుఁగునకుఁ జేరిక హిందూదేశచరిత్ర మొకటి మాతృభాషతో బోధించినం జాలును. మిగతమార్పు లిపు డగుట సాధ్యముకాగు. ఆంధ్రుల యిష్టానుసార మాంధ్రవిశ్వవిద్యాలయము దైవానుగ్రహమున నేర్పడినచో నీమార్పు లన్నియును నప్పుడు ప్రవేశపెట్టనగును.

## గృహభాష.

హిందూస్త్రీలు విద్యాప్రావీణ్య లగునంతవఱకు నింటిభాష గ్రామ్యముగనే యుండును. వారితో నిపుడు వ్యాకరణయుక్తముగ సలక్షణభాషతో మాటలాడుట హాస్యాస్పదముగ నుండును. బ్ర. మహామహోపాధ్యాయు లగుకొక్కొండ వేంకటరత్నము పంతులవారు తమభార్యనుఁ జూచి "భార్యా! జలపూరిత భాండమ్ముఁ దెమ్మా, లెమ్మా, వేగమ్మె రమ్మా" యనినది చూచి నవ్వితిని. వారు గృహములో సైత మారీతిగ మాటలాడుచుండిరి. పులినిఁ జూచి నక్క వాఁత వేసికొనినరీతిగ నేనును గోర్టులో నారీతిగ మాటలాడఁగ, సరివారు నవ్వసాగిరి. కావున సత్యధర్మమైనను దానిని నేవదలితిని. బాలికాపాఠశాలలందుపాధ్యాయినులు తమశిష్యవర్గమును సలక్షణభాషతో మాటలాడ నభ్యసింపఁ జేయుట శ్రేయస్కరము. స్త్రీలతోఁ బెంపఁబడిన భాష వెంటనే వృద్ధికివచ్చునను నిస్సందేహము.

## పరిషచ్ఛబ్దార్థము.

మహాశయులారా! ఆంధ్రసాహిత్యపదములు రెంటికి నాకుఁ దోఁచినరీతిగ నెద్దియో యొకటి వ్రాసితిని. ఇఁకఁ బరిషత్తనుశబ్ద మొక్కటి నిలిచెను. ఉపనిషత్తన రహస్యముగ బోధించువిద్య యనియుఁ బరిషత్తన బహిరంగముగఁ బ్రకటింపఁజేయు విద్యామహిమ యనియు నేను బూర్వ మొకతూరి పలికినాను. వ్రాసినాను. ఈ పరిషత్పద్ధతి ఋగ్వేదకాలమునుండి వచ్చినది. ఋగ్వేదములోనేమి బ్రాహ్మణములోనేమి వివరింపఁబడిన గొప్పవా రొనరించుయాగములందు దిగ్దేశములనుండి ఋషులు కవులు విద్వాంసులు వచ్చుచుండిరి. యజ్ఞశాలయే పరిషద్భవనముగ నుండెను. పండితులు తాము నూతనముగ రచించిన ఋక్కులు ప్రసిద్ధిపఱచుచుండిరి. రాజులు తా మరుల జయించి యేయేదేశములు సాధించినదియు విద్వాంసులతోఁ బొగడింపఁ జేయుచుండిరి. విద్యావివాదములు జరుగుచుండెను. బౌద్ధయుగమునందు సైతమిట్టి పరిషత్తులు

(Councils) జరుగుచుండెను. పుష్పమిత్రుని కాలమున నిట్టిసభలు జరుగుచుండెనని చరిత్రలు పలుకుచున్నవి. నవద్వీపములోను కాశీలోను పునా బరోడా దేశములలో నీసభలు జరుగుచుండె నని సర్వవిదితము. మైసూరు గద్వాల వనపర్తి మొదలగు రాజ్యములలో నిప్పటికిని బరిషత్తులు జరుగుచున్నవి. మధ్వమతోద్వాహినిసభ యనుమతపరిషత్తు పద్మసరోవరములో జరుగుచున్నది. ఇటులే రాజకీయ పరిషత్తులు మనమిపుడు జరిగించునది సాహిత్య విద్యాపరిషత్తు. ఈ పరిషత్తు ప్రవర్ధిల్లినచో మిగతపరిషత్తులు దీనిలో లీయమగునవియేను. ఈ సాహిత్య పరిషత్తు లేనిచో నితరపరిషత్తులు తలలెత్తఁ జాలవు.

సోదరసోదరీమణులారా !

బుద్ధిపూర్వకముగ విశేషప్రయత్న మొనరించి నేనలసితిని. హాయిగ నుండుమిమ్మలయించితిని. వెలలేని కాలంబు వ్యర్థపుచ్చితిని. కటుపదములు బలాత్కారముగ మీకు సేవింపఁజేసితిని. మీరిపుడు పాయసమపేక్షించువారుగ నున్నవారు. "ప్రకృతమనుసరామః పాయసం భక్షయామ" అనినరీతిగ నిపుడు మీకుఁ బండితవరుల యుపన్యాసామృతంబు లభించును. తనివిదీఱ దానినిఁ గ్రోలి సుఖమున నుండుఁడీ. నేనును దత్సేవనచేఁ గృతకృత్యుఁడ నయ్యెద.

మద్రాసుమండలము విద్యానిలయము.

పండితోత్తములారా ! విశ్వవిద్య పెక్కువేలసంవత్సరములక్రిందటఁ గాశ్మీర పంజాబుదేశములలోనుండెను. క్రీస్తుశకాదివఱకు నచటనే భద్రముగనిలిచెను. పిదప నారాష్ట్రికర్మానుభవ మంత్యమైనందునఁ గాఁబోలు నావిశ్వవిద్య మనమద్రాసుమండలముం జేరెను ఇచటఁ జక్కఁగ నభివృద్ధిఁ జెంది ప్రపంచమెల్ల వ్యాపించెను. దీనికి మూలకారణు లగుమహాత్ములు మద్రాసుమండలమువారేను. ఆదిని శ్రీశంకరాచార్యులవారు మద్రాసుమండలములోని మళయాళమువారు. ద్వితీయపురుషు లగుశ్రీరామానుజాచార్యులవారు, మద్రాసుమండలములోని పెరుంబూదూరువారు మూఁడవవారగు శ్రీమధ్వాచార్యులవారు మద్రాసుమండలములోని పాచకక్షేత్రమువారు వీరు మతవిద్యాభివృద్ధినొనరించినవారనుటకు సందియములేదు. మద్రాసుమండలి యేడవశతాబ్దమునుండి యిప్పటివఱకు విద్యానిలయముగ నిలిచినది. మనమండలము విద్యానిలయ మని దృఢ

ముగ నమ్మిగదా దివ్యజ్ఞానసమాజమువా రీమండలములోనే తన భవనమును స్థాపించి వేదాంతవిద్యను వ్యాపింపఁజేయుచున్నవారు. మన మద్రాసుమండలమునందు విద్యామహిమ యవ్యక్తముగ నుండి యర్హులగు కొందఱు మహాత్ము లందు వ్యక్తపడుచుండు కారణంబునఁ గదా యిట్టిసాహిత్యపరిషత్తులు వెలయుచున్నవి. అట్టిమహాత్ములను మేమెంతగఁ బొగడినను దకుౘవగదా? వారొనరించు పని మనదేశాభివృద్ధికిఁ గదా? కావున మన మెల్లర మీ "ఆంధ్రసాహిత్యపరిషత్తు" నేర్పఱిచిన వారికిఁ గృతజ్ఞులమై త్రికరణశుద్ధిగ వందనంబు లర్పింపవలెను.

కోలాచలము శ్రీనివాసరావు.

బాహ్యాభ్యంతరసంయోగములు :—భూమినుండి శుక్రుని జూచినయెడల భూమి స్థిరముగ నుండునట్లును శుక్రుడుమాత్రము కదలునట్లును గాన్పించు నని చూచియుంటిమికదా ? ప్రకృతము సూర్యునిసమీపమున శుక్రుఁ డెట్లు కదలుచుండున ట్లగపడునో చూచెదము శుక్రుఁడు భూసూర్యులమధ్య నుండుకాలమున మనవిమర్శనము నారంభించెదము. ఆసమయమున భూశుక్రసూర్యులు సమప్రదేశమున నుండిరేని శుక్రబింబము సూర్యబింబమున నొకనల్లని ఛాయవలె నగపడును. శుక్రకక్ష్య భూకక్ష్యతో సమానప్రదేశమున లేనందున నిది యపురూపము. (సూర్యగ్రహణమున విచారించినహేతువు లన్నియు నిచట నూహింప నగును). కావున నాసమయమున సూర్యబింబమున నల్లనిఛాయవలె శుక్రబింబము కాన్పింపనియెడల, నదిసూర్యునిపైఁగా నైనను, గ్రిందుగా నైనను బోవున ట్లుండును. సూర్యరశ్మిజ్వాలలలో నది దృగ్గోచరము కానేరదు. కొన్నిదినములకుఁ బిదప నది సూర్యునకుఁ బశ్చిమమునఁ గాన్పించును. అప్పుడు సూర్యునికి ముందుగా నుదయమయి సూర్యునికి ముందుగానే యస్తమించుచుండును. కావున నాకాలములలో నరుణోదయసమయమునఁ దూర్పున వెలుఁగుచుండును. ఇట్లు పటములో, ' క ' అని చూపియుండుచోటునకుఁ బోవువఱకు శుక్రుఁడు క్రమక్రమముగ సూర్యునకుఁ బశ్చిమమున దూరముగఁ బోవున ట్లగపడును. పిదప ' క ' అను చోటునుండి సూర్యునకు వెనుకఁ బోవువఱకును సూర్యునికిఁ బశ్చిమమున నతఁడు సూర్యుని సమీపించుచుండున ట్లుండును. సూర్యునకు వెనుక నుండునపుడు సూర్యునితోఁగూడ నుదయాస్తమయము లగుచుండుటచే మనదృష్టికి గోచరము కాక యుండును. సూర్యుని వెనుకనుండి పటములో ' ఖ ' అని చూపియుండుచోటునకు వచ్చువఱకు సూర్యునికిఁ దూర్పునఁ గ్రమక్రమముగ దూరముననుండున ట్లగపడును. ఆసమయమున సూర్యునికి వెనుక నుదయమై సూర్యునకు వెనుక నస్తమగుచుండుటచే సాయంకాలమున సూర్యాస్తమయానంతరము పడమటిదిక్కున వెలుఁగుచుండును. ' ఖ ' అనుచోటునుండి తిరుగ భూసూర్యులమధ్య వచ్చువఱకు సూర్యునికిఁ దూర్పునఁ గ్రమక్రమముగ నాతని బింబమును సమీపించునట్లు కాన్పించి తుదకు సూర్యబింబముతో నుదయాస్తమయములు చేయుచుండును. సూర్యున కిరుప్రక్కల నిట్లు భూమినుండి చూచునపుడు శుక్రుఁడు పరమావధి 45°ల యంతరము (maximum elongation) గలిగియుండునట్లు కా

న్పించును. అందుచే భూమిపై మన ముందుచోట శుక్రుఁడెన్నఁడు నర్ధరాత్రమున నగపడఁడు.

శుక్రుఁడు సూర్యునిచుట్టు దిరుగునపుడు రెండుచోట్ల సూర్యునితో సంయోగ మందును. భూమికి సమీపమున సంయోగ మాభ్యంతరసంయోగ మనియు (inferior conjunction) దూరమున సంయోగము బాహ్యసంయోగ మనియు (superior conjunction) ననఁబడును.

వస్తుతత్త్వమున శుక్రుఁడు సూర్యునిచుట్టు నొకభగణముచేయుచుండినను మనదృష్టికి మాత్రము సూర్యున కిరుప్రక్కల నూఁగులాడున ట్లుండును.

**వక్రసౌమ్యగతులు** :—ఇఁక నక్షత్రమండలిలో శుక్రుఁ డెట్లుపోవున ట్లుండునో విచారింతము. ఒకభిత్తి సమీపమున నొకవస్తువునిడి దూరమున నుండి యావస్తువును జూచితిమేని యది యాభిత్తిమీఁద నానుకొనియుండునట్లు కనఁబడును. ఆవిధముననే భూమినుండి చూచుమనకు గ్రహము లన్నియుఁ దారామండలి నానుకొని కదలునట్లు కాన్పించును. వస్తుతత్త్వమున గ్రహమండలికిని దారామండలికి నెన్నియో కోట్లమైళ్లు దూర ముండును. గ్రహము లన్నియుఁ దారామండలిలోఁ బ్రాఁకున ట్లుండుటచేతనే గ్రహముల చారములను మనము నిర్ణయింపఁ గలిగినారము.




10. పటము.

భూశుక్రులు సమానకాలములలో వానివానికక్ష్యలలో సమానధనూరేఖల (arcs) నిర్మించును. భూవేగమునకంటె శుక్రవేగ మధిక మగుటచే శుక్ర

కక్ష్యలోని ధనూరేఖలు (arcs) భూకక్ష్యలోని ధనూరేఖలకంటె గొప్పవి. పటములో భూశుక్రులకక్ష్యలయందు సమానకాలములలో నిర్మించిన కొన్ని ధనూరేఖలు చూపఁబడియున్నవి, పటము పైభాగమున మూఁడవవృత్తము తారామండలిలో శుక్రమార్గమును దెలుపుచున్నది. శుక్రభూకక్ష్యలలో వానిచోట్లను గొన్నిసంఖ్యలు తెలుపుచున్నవి. ఆసంఖ్యానుగుణముగఁ దారా మండలిలో భూమికి నగపడుశుక్రునిస్థానములు కొన్నిసంఖ్యలచేఁ దెలుపఁబడి యున్నవి శుక్రుని యాభ్యంతరసంయోగస్థానము 4 చేఁ దెలుపఁబడియున్నది, ఈస్థానమునుండి విమర్శనము నారంభించితిమేని 5, 6 వఱకు శుక్రుఁడు తారామం డలిలోఁ బ్రదక్షిణముగఁ బోవునట్లు కనఁబడుచున్నది. అనఁగా శుక్రుఁడు వక్ర గతి (retrograde motion) నవలంబించియున్న ట్లున్నది. 7-వ స్థానమున సౌమ్యగతిగనే (direct motion) యున్నాఁడు. ఇట్లు బాహ్యసంయోగమును దాఁటి తుదకు నాభ్యంతరసంయోగమునకు ముందు 1, 2 చోట్లవఱకును సౌమ్యుఁడుగనే యున్నాఁడు. తిరుగ 2, 3, 4...లో వక్రించుచున్నాఁడు. కావున నాభ్యంతరసంయోగమునకు ముందు వక్రించుట కారంభించి యాసంయోగ మును దాఁటి కొంతవఱకును వక్రగతిగనె యున్నాఁ డని తెలియుచున్నది. వక్ర గతినుండి సౌమ్యగతికి మాఱునప్పుడును, సౌమ్యగతినుండి వక్రగతికి మాఱున ప్పుడును గొన్నిదినము లొకచోటుననే నిలిచి యుండునట్లు కాన్పించును.

కళాప్రసక్తి:—చంద్రబింబమునఁ గళాక్షయమును గళావృద్ధియు నుండునట్లు శుక్రబింబమునఁగూడ నుండును. శుక్రబింబమునఁబూర్ణకళావృద్ధి శుక్రుఁడుసూర్యుని వెనుక నుండునపుడు కలుగును. ఆసమయమున భూశుక్రులయంతర మధికతమము. కావున శుక్రబింబము చాలస్వల్పముగఁ గాన్పించును. పూర్ణకళాక్షయము శుక్రుఁడు భూసూర్యులమధ్య నుండునపుడు సంభవించును. ఆసమయమున భూశుక్రులయంత రము స్వల్పతమము. కావున శుక్రబింబము చాలగొప్పదిగఁ గాన్పించును. ఇట్లు కళాక్షయమున బింబాధిక్యమును, కళాధిక్యమున బింబక్షయము నుండుటచే నెల్లప్పుడును శుక్రునిప్రభ యొకరీతిగనే యుండును.

సంయోగాభిముఖ్యములు :—ఇఁక బాహ్యగ్రహగతుల విమర్శింతము. బృహస్పతి సూర్యునిచుట్టు తనకక్ష్యలోఁ బోవువేగమునకంటె భూమి తనకక్ష్య లో నధికతరవేగమునఁ బోవుచున్న దని మనము చూచియుంటిమికదా ? భూశు క్రులగమనమును విచారించునపుడు శుక్రుఁడె సూర్యునిచుట్టు నప్రదక్షిణముగఁ

(from west to east) దిరుగునట్లు గాన్పించు ననియుఁ జూచియుంటిమి కదా? ఆసమయమున శుక్రునిమీఁదనుండి భూమినిఁ జూచిన నెట్లు లుండునో తెలియునా? శుక్రుఁడు స్థిరముగ నుండునట్లును భూమి సూర్యునిచుట్టుఁ బ్రదక్షిణముగఁ (from east to west) బోవునట్లు గాన్పించును. ఆరీతినె భూమినుండి బాహ్యగ్రహమును జూచునపుడు భూమి స్థిరముగ నుండునట్లును, బాహ్యగ్రహములు సూర్యునిచుట్టుఁ బ్రదక్షిణముగఁ బోవునట్లు నుండును.

సూర్యుఁడు బృహస్పతికిని భూమికిని మధ్య నుండుకాలమున ననఁగా బృహస్పతిసంయోగకాలమున (conjunction) మనవిమర్శనము నారంభించితిమేని కొన్నిదినములకుఁ బిదప బృహస్పతి సూర్యునికిఁ బశ్చిమమునఁ గాన్పించును. ఆస




భూమినుండికనఁబడు సూర్య బృహస్పతుల యంతరము.

11. పటము.

మయమున సూర్యునిముందు నుదయమై సూర్యునిముందు నస్తమించును. కావునఁ బ్రాతఃకాలమునఁ దూర్పుదిక్కున వెలుఁగుచుండును. ఇట్లుసూర్యునికిని బృహస్పతికిని గనఁబడునంతరము (elongation) వృద్ధియగుచుండును. 180 డిగ్రీలయినప్పుడు సూర్యబృహస్పతులు భూమికి నిరుప్రక్కల నుండురు. అనఁగా సూర్యోదయబృహస్పత్యస్తమయములును, సూర్యాస్తమయబృహస్పత్యుదయములును సమకాలమున సంభవించును. అది బృహస్పతి కాభిముఖ్యకాలము (time of opposition.) సూర్యబృహస్పతులయంతరము 180 డిగ్రీలనుండి క్రమక్రమముగ 360 డిగ్రీలవఱకు వృద్ధియగుచునే యుండును. ఆసమయమున నాతఁడు సూర్యాస్తమయ మయినవెనుక వెలుంగుచుండును. భూమినుండి చూచినయెడల నాభ్యంతరగ్రహ మగుశుక్రునకును సూర్యునికిని గలయంతరపరమావధి సుమారు 45 డిగ్రీలు మాత్రమె యని మనము చూచియుంటిమి. బాహ్యగ్రహమునకును సూర్యునికి నీయంతరపరమావధి 360 డిగ్రీలు. అందుచే

బాహ్యగ్రహము లాభ్యంతరగ్రహములవలెఁ గాక రాత్రియం దెపుడైనఁ గానఁగును

వక్రసౌమ్యగతులు :—ఇఁక నక్షత్రమండలిలో బృహస్పతి యెట్లుచరించు నట్లుండునో చూచెదము. ఆకాశమున గ్రహాదులఁజూచునప్పు డవి తారామండలి నానుకొని ప్రాకుచుండునటు లుండు నని మనము చూచియుంటిమి. భూమినుండి చూచునపుడు బృహస్పతి తారామండలిలో నగపడురీతి నీక్రిందిపటము చూపుచున్నది







12. పటము.

భూబృహస్పతులకక్ష్యలలో నవి సమానకాలములలో నిర్మించుధనుస్సు (arcs) లీపటములోఁ జూపఁబడియున్నవి భూమి బృహస్పతికంటె వేగమునఁ బోవుచుండుటచే భూధనుస్సులు (arcs) బృహస్పతిధనుస్సులకంటె గొప్పవి. భూమినుండి బృహస్పతిని జూచుమార్గములు కొన్ని శరచిహ్నములతోఁ (arrow marks) జూపఁబడియున్నవి భూగమనము మనకుఁ దెలియనందున బృహస్పతినిమాత్ర మాయాశరచిహ్నములు చూపునక్షత్రమండలిలోఁ జూచుచున్నా

రము. పటములోఁ గ్రిందనుండుగొప్పవృత్తము ఖగోళమును దెలియఁజేయుచున్నది. అందు 1, 2, 3, మొదలగుస్థానములు నక్షత్రమండలియందు బృహస్పతిస్థానములఁ జూపును ఇవి భూమినుండి బృహస్పతిని జూపుశరచిహ్నములు క్రమక్రమముగ నక్షత్రమండలిని సంధించుచోటులు.

ఈనక్షత్రమండలిలో బృహస్పతి యాభిముఖ్యదశనుండి (from the time of his opposition) యాతనిబింబమును జూచితిమేని, మొదటఁ జూచిన-చోటునుండి కొంతవఱకుఁ (అనఁగా 4, 5, 6, చోటుల) ప్రదక్షిణముగఁ (retrograde motion) బోవుచుండునట్లును, దర్వాత, తిరిగి యప్రదక్షిణముగనే (direct motion) 6, 7 చోటులఁ బోవుచుండునట్లును దెలియును. అనఁగా 4, 5, 6 చోటుల వక్రించి తుదకు 6, 7...చోటుల సౌమ్యముగనె పోవుచుండునటు లగపడును. ఇట్లు సంయోగకాలమును దాఁటి (beyond the time of conjunction) కొంతదూరమువఱకు బృహస్పతి సౌమ్యముగ నుండును. తిరుగ నాభిముఖ్యదశకు (opposition) వచ్చుటకుఁ గొంతకాలమునకు మునుపు వక్రించుట కారంభించును. (పటములో 1, 2, 3వఱకు సౌమ్యమై 3, 4...చోటుల వక్రించియున్నది.)

కావున బాహ్యగ్రహము లాభిముఖ్యదశకు వచ్చుటకుఁ గొంతకాలమునుండి యాదశను దాఁటి కొంతకాలమువఱకు వక్రించియుండును. వక్రదశనుండి సౌమ్యదశకు వచ్చునపుడును, సౌమ్యదశనుండి వక్రదశకు వచ్చునపుడు నివియు నాభ్యంతరగ్రహములవలెఁ గొంతకాల మొకచోటుననే స్థిరముగ (stationary) నుండునట్లు కాన్పించును.

ప్రత్యేకగ్రహములు :—గ్రహములసంచారవిషయకచర్చలు కొంతముగిసినవి కావున నికఁ బ్రత్యేకగ్రహముల పరిమాణాదులఁ గనుంగొందము.

బుధుఁడు :—సూర్యునకు మిగుల సమీపమున నుండునది బుధుఁడు. భూమినుండి చూచునపుడు సూర్యబుధులయంతరపరమావధి (maximum elongation) మిగుల స్వల్ప మగుటచే బుధుఁ డెన్నఁడును సూర్యునిసమీపముననె యుండును. కావున సూర్యరశ్మిజ్వాలలలో మునిఁగియుండుటచే బుధుఁడు ప్రాయికముగ దృగ్గోచర మగుట దుర్లభము. బుధుఁడు సూర్యునుండి సుమారు 360 లక్షల మైళ్లదూరమున నుండును. బుధమండలవ్యాసము 3000 మైళ్లు. ఇతఁడు సుమారు 88 దినములలో నొకభగణము (revolution) చేయును.

ఇతని భ్రమణకాల మంతగఁ దెలియదు. అదియును సుమారు 88 దినములని కొందఱయూశయము. అటు లుండెనేని బుధుఁ డెన్నఁడును సూర్యునివంక నొకభాగమునె త్రిప్పుచుండవలయును. బుధుని కుపగ్రహము లెవ్వియు లేవు. బుధకక్ష్యకును భూకక్ష్యకును మధ్య 7° మితిగలకోణ మేర్పడుచున్నది.

శుక్రుఁడు :—అభ్యంతరగ్రహవిచారమున శుక్రునిగుఱించి మన మిదివఱకే కొన్ని యంశములఁ గనుంగొంటిమి. ఇతనికిని సూర్యునకును సుమారు 670 లక్షలమైళ్లుండును. ఇతనిబింబవ్యాసము 7600 మైళ్లు. కావున నితఁ డించుమించుగ భూమండలమునకు సమ నై యుండును. సుమారు 225 దినములలో నితఁడొకభగణముఁ బూరించును. ఇతనిభ్రమణకాలము(Period of revolution) నిర్ధారితముగఁ దెలియదు 24 గంటలలో నొకభ్రమణము చేయుచున్న దను వారును, 225 దినములలో నొకభ్రమణము చేయుచున్న దనువారును గలరు. శుక్రునకుఁగూడ నుపగ్రహము లెవ్వియు లేవు. శుక్రభూకక్ష్యలమధ్య సుమారు 3½°మితిగలకోణ మేర్పడుచున్నది.

భూమి :—గ్రహములవరుసలో భూమియొక్కస్థాన మిదియే. భూమిని గుఱించి ప్రత్యేకముగఁ జర్చించినందున నిచ్చట పునశ్చర్చ యనావశ్యకము.

అంగారకుఁడు :—సూర్యునుండి గ్రహకక్ష్యలను దాఁటి వెలువడుచుండునపుడు మార్గాగతము లగు బాహ్యగ్రహములలో నంగారకుఁడు ప్రథముఁడు. సూర్యునకు సుమారు 1420 లక్షలమైళ్లదూరమున నితఁ డుండును. ఇతనిమండలవ్యాసము 4300 మైళ్లు. సుమారు 24½ గంటలకాలమున నొకభ్రమణము చేయును. ఇతనిభగణకాలము 687 దినములు, ఇతని యుపగ్రహములు రెండు. అంగారకభూకక్ష్యలమధ్య 2°లకంటెఁ దక్కువపరిమితి గలకోణ మేర్పడుచున్నది.

అంగారకమండల మొకవేళ వాసయోగ్యముగ నుండు నేమో యని యాధునికసిద్ధాంతులు విమర్శింప నారంభించిరి. దూరదర్శిని యంత్రసాహాయ్యమునను ఛాయాపటసాహాయ్యమునను బరీక్షింపఁ దొడఁగిరి. అంగారకమండలములోని దక్షిణోత్తర ధ్రువములచుట్టు ననేకక్రోశములవఱకుఁ దెల్లనిప్రదేశము లుండునట్లును, ఈప్రదేశములనుండి యంగారకనిరక్షరేఖాభిముఖముగ (towards its equator) పొడవైనరేఖ లనేకము లుండునట్లును దలంచుచున్నారు. దక్షిణోత్తరధ్రువములచుట్టుఁ దెల్లనిభూప్రదేశములు సూర్యాభిముఖమై యుండునపుడు వైశాల్యమునఁ గొంచెము తగ్గుచున్న వనియు, మరల సూ

ర్యునకుఁ బరాఙ్ముఖ మై యుండునపుడు కొంచెము హెచ్చుచున్న వనియుఁ జెప్పుచున్నారు. అందుచే నీతెల్లనిప్రదేశములు భూమండలములో దక్షిణోత్తర ధ్రువములచుట్టు నుండు మంచుగడ్డలవలె నచ్చోటను గూడ మంచుగడ్డలే యనిశంకించుచున్నారు. ఈప్రదేశములనుండి నిరక్షరేఖాభిముఖముగఁ బోవు నల్లనిరేఖలు వ్యవసాయమునకై యతికౌశల్యమున నిర్మింపఁబడి యుండుకాలు వలుగ నుండవచ్చు నని యూహించుచున్నారు. అంగారకమండలము వాస యోగ్యముగనే యున్న దనియు నందునఁ బ్రాణులనివాసచిహ్నములఁ గనుఁ గొనవచ్చు ననియుఁ గొందఱు నమ్ముచున్నారు.

గ్రహముల నివాసయోగ్యతను జర్చించుచు, బుధుఁడు సూర్యునకు మిగుల సమీపమున నుండుటచే నత్యుష్ణముగ నుండు ననియు, శుక్రభ్రమణ మొకవేళఁ గొందఱుశంకించుచుమాదిరి 225 దినము లయినయెడల నాతనిమండ లమున నివాసానర్హము లైనయతిదీర్ఘదినరాత్రు లుండు ననియు, బృహస్పతి, శనైశ్చరులఘనత (density) భూఘనతకంటె మిగుల స్వల్పముగ నున్న దనియు వీని నతిక్రమించి యుండుగ్రహములగుఱించి యధికముగ నేమియుఁ దెలియ దనియు, నందుచేఁ బ్రస్తుత మంగారకమండల మొక్కటియే నివాసార్హముగ నుండవలయు నని యనేకు లభిప్రాయపడియున్నారు.

గ్రహపోతములు :—అంగారకమండలమునకును బృహస్పతిమండలము నకును మధ్య గ్రహము లెవ్వియు లే వని పూర్వు లభిప్రాయపడిరి. 19-వ శతా బ్దిలోఁ జిన్ననక్షత్రములవలె నుండు మూర్తములు (bodies) కొన్ని మహత్త రము లైనదూరదర్శినియంత్రముల సాహాయ్యమునఁ గనుఁగొనఁబడినవి. ఇవి నక్షత్రమండలిలోఁ బ్రాఙ్ముఖముగఁ గదలుచుండుటయుఁ దెలిసినది. కావున నివి చిన్నచిన్నగ్రహములుగ నుండవలయు నని సిద్ధాంతులు తీర్మానించిరి. వీనిని మనము గ్రహపోతము లని (Asteroids) పిలిచెదము. రానురాను గ్రహపోతము లెన్నియో కాన్పించినవి. 1891, వ సంవత్సరమున నీగ్రహపోతములు 321 యుండినవి. ఇంక నెన్నియో యుండవచ్చు నని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఇవి యంత్రసాహాయ్యము లేనియెడల దృగ్గోచరము కానేరవు. అంగారకబృహస్ప తులమధ్య నొకగొప్పగ్రహ ముండియుండు ననియు నది యే కారణముననో భగ్న మై యుండు ననియు, నందుచే నీగ్రహపోతము లుద్భవించి యుండు ననియుఁ గొంద అభిప్రాయపడిరి కాని యాయభిప్రాయ మసాధు వనియే యనే కులు నమ్ముచున్నారు.

## జ్యోతిశ్శాస్త్రము.

| | | | |
|---|---|---|---|
| 2 | అష్టకవర్గము | ... | |
| 1 | కాలచక్రము | ... | |
| 1 | కాలజ్ఞానము | ... | |
| 1 | ఘంటాప్రహారి | ... | |
| 1 | జాతకగ్రంథము | ... | |
| 1 | జ్యోతిషము | ... | |
| 1 | జ్యోతిషగ్రంథము (వచనము) | ... | |
| 1 | జ్యోతిషపద్యములు | ... | భీమకవి. |
| 1 | జ్యోతిషపుస్తకము | ... | |
| 3 | జ్యోతిషరత్నాకరము | | హనుమన్నయ్య. |
| 1 | తుమ్మ్మచూచులక్షణము | ... | |
| 1 | దృగ్దృశ్యవివేకోత్తరభాగము | ... | |
| 1 | నవగ్రహచింతామణి | . | |
| 1 | నవగ్రహప్రశ్నము | ... | |
| 2 | ప్రశ్నపుస్తకము | ... | |
| 1 | బృహజ్జాతకము | ... | |
| 1 | రామప్రశ్నపుస్తకము | . | |
| 2 | రెట్టమతము | ... | అయ్యలభాస్కరుండు |
| 1 | వర్షఫలము | ... | |
| 1 | సర్వతోభద్రచక్రము | ... | |
| 2 | సస్యానందము | ... | |
| 2 | సాముద్రికశాస్త్రము | . | |

---

## గణితశాస్త్రము.

| | | | |
|---|---|---|---|
| 1 | అంగపాతాళసంఖ్యలు | ... | |
| 1 | ఖాతగణితము | ... | మల్లన. |
| 1 | దశవిధగణితములు | ... | |

| | | |
|---|---|---|
| 11 | పావులూరిగణితము ... | మల్లన. |
| 1 | భూమికొలత ... | |
| 1 | యుగకాలసంఖ్య ... | |
| 1 | లీలావతి, సాంధ్రవ్యాఖ్యానము ... | |
| 2 | వాస్తుసారసంగ్రహము ... | గణపయామాత్యుఁడు. |
| 1 | సూత్రగణితము ... | |
| 2 | క్షేత్రగణితము ... | |

---

## వివిధశాస్త్రములు.

| | | |
|---|---|---|
| 1 | కొక్కోకము ... | ఎఱ్ఱన. |
| 1 | ఖడ్గలక్షణము . . | |
| 1 | గానవిషయము ... | |
| 1 | చిత్రబంధలక్షణము-(అలంకారము) .. | |
| 1 | పంచపదమహావాక్యములు-(వేదాంతము) | |
| 3 | పంచీకరణము-(వేదాంతము) ... | |
| 1 | ప్రయోగరత్నావళి (నృత్యశాస్త్రము). | |
| 1 | భాగవతార్చనము-(వేదాంతము) ... | |
| 1 | రత్నపరీక్ష-(రత్నశాస్త్రము) | భైరవకవి. |
| 1 | రతిరహస్యము ... | ఎఱ్ఱన. |
| 1 | విజ్ఞానేశ్వరీయము-(ధర్మశాస్త్రము) ... | కేతనకవి |
| 2 | శృంగారరసమంజరి | సురతాణి కోదండకవి. |
| 1 | సంగీతము | |
| 1 | స్వరాలతోఁబదములు-(సంగీతము)... | |
| 1 | సహదేవపశుశాస్త్రము ... | |
| 2 | హయలక్షణవిలాసము-(అశ్వశాస్త్రము) | మనుమంచిభట్టు. |
| 1 | మంత్రశాస్త్రము . | |

## పద్యప్రబంధములు

| | | |
|---|---|---|
| 1 | అంగజవిజయము | ... అనుమకొండ పురుషోత్తముఁడు. |
| 1 | అనసూయావిలాసము | ... మారెళ్ల సుబ్బారాయదాసకవి. |
| 4 | అనిరుద్ధచరిత్రము | ... కనుపర్తి అబ్బయామాత్యుఁడు. |
| 2 | అహల్యావిలాసము | |
| 1 | అహల్యాశక్రసంయోగము | . (భాస్కరరామాయణములోనిది). |
| 2 | అహల్యాసంక్రందనము | ... వేంకటకృష్ణప్పనాయఁకుఁడు |
| 1 | ఆచార్యసూక్తిముక్తావళి | ... నంబూరి కేశవాచార్యులు. |
| 13 | ఆముక్తమాల్యద | ... శ్రీకృష్ణదేవరాయలు. |
| 1 | ఉదాహరణపద్యములు-(సంకలితప్రబంధము) | |
| 2 | ఋశ్యశృంగచరిత్రము | ... నాగుల రామకవి |
| 1 | ఏకశిలానగరమాహాత్మ్యము | ... రామదాసప్రధాని |
| 1 | కంసపిజయము (అచ్చతెనుఁగు) | ... పాటిబండ పురుషోత్తమకవి. |
| 1 | కపోతవాక్యము(రాజనీతిరత్నాకరము) | కొప్పోలు జగన్నాథదాసకవి. |
| 1 | కవిరాజమనోరంజనము | ... కనుపర్తి అబ్బయామాత్యుఁడు. |
| 1 | కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి. |
| 1 | కార్తికమాహాత్మ్యము | కుందుర్తి వేంకటాచలము. |
| 1 | కాళహస్తిమాహాత్మ్యము | ధూర్జటికవి. |
| 1 | కాశీఖండము- | శ్రీనాథకవి |
| 10 | కుచేలోపాఖ్యానము | గట్టుప్రభువు. |
| 1 | కుబ్జాకృష్ణవిలాసము | అక్కన ప్రెగ్గడ హరిదాసు. |
| 1 | కులశేఖరమహీపాలచరిత్రము | శేషము రఘునాథకవి. |
| 2 | కువలయాశ్వచరిత్రము | సవరము చిననారాయణకవి. |
| 1 | కృష్ణవిలాసము | విశ్వేశ్వరబుధాగ్రణి. |
| 3 | కృష్ణార్జునసంవాదము | ఓబయమంత్రి. |
| 1 | గరుడాచలవిలాసము | మారెళ్ల సుబ్బరాయదాసకవి. |
| 2 | గరుడాద్రివిలాసము | నందవరమువారు. |
| 1 | గాథేయోపాఖ్యానము | అనంతామాత్యుఁడు. |
| 1 | చంద్రభానుచరిత్రము. | మల్లన. |

| | | |
|---|---|---|
| 4 | చంద్రాంగదచరిత్రము ... | పెడిమట్టి వేంకటపతి |
| 1 | చమత్కారమంజరి | సింహాద్రి వేంకటకవి |
| 1 | చారుచంద్రోదయము | చెన్నమరాజు శేషామాత్యుఁడు. |
| 1 | జగన్నాథమాహాత్మ్యము | సూరయ్య |
| 1 | జాహ్నవీవిలాసము | మారెళ్ల సుబ్బరాయదాసకవి. |
| 1 | తపతీసంవరణోపాఖ్యానము | కొట్ర నృసింహకవి |
| 1 | తారాశశాంకవిజయము | శేషము వేంకటపతి |
| 1 | త్రిపురవిజయము | |
| 1 | తొండమాన్ వంశావళి | సుదురుపాటి వేంకనార్యుఁడు. |
| 3 | దశరథరాజనందనచరిత్రము | మరింగంటి సింగరాచార్యుఁడు. |
| 2 | దశావతారచరిత్రము | ధరణిదేవుల రామమంత్రి. |
| 1 | దక్షయజ్ఞము | |
| 1 | దేవాంగచరిత్రము | |
| 1 | ధనుర్విద్యావిలాసము | కృష్ణమాచార్యులు. |
| 1 | నలచరిత్రము | నరహరికవి. |
| 1 | నలచరిత్రము | సిరిప్రెగడ ధర్మన్న. |
| 1 | నిజలింగచిక్కయ్యకథ | |
| 2 | నిరోష్ఠ్యనలచరిత్రము | తిరుమలరాజు. |
| 2 | నిర్ణయసింధువు | వేఁగినాటి కొండయ్య. |
| 1 | నీతిసంగ్రహము | |
| 1 | నీలాసుందరీపరిణయము | కూచిమంచి తిమ్మకవి. |
| 4 | పంచతంత్రము | వేంకటకవి, నారాయణకవి. |
| 1 | పరతత్త్వరసాయనము | ఫణిభట్టు. |
| 1 | పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణుఁడు. |
| 1 | పార్వతీపరిణయము | తొండమాన్ రఘునాథమహీపాలుఁడు. |
| 5 | పారిజాతాపహరణము | తిమ్మకవి |
| 1 | పృథుచరిత్రము | సరస్వతీసోమయాజి. |
| 2 | ప్రద్యుమ్నచరితము | ముప్పిరాల సుబ్బరాయకవి. |
| 1 | ప్రబంధరాజవిజయవేంకటేశ్వరవిలాసము ... | వేంకటకవి. |

| | | |
|---|---|---|
| 2 | బిల్హణీయము | ... సాంబశివకవి. |
| 2 | బిల్హణీయము | .. కృష్ణస్వామి |
| 5 | బేతాళపంచవింశతి | |
| 1 | భద్రాద్రిక్షేత్రమాహాత్మ్యము | మారెళ్ల సుబ్బరాయదాసు. |
| 7 | భానుమతీపరిణయము | రెంటూరి రంగరాజు |
| 1 | మదనానందము | |
| 14 | మనుచరిత్రము | పెద్దనామా [illegible]డు. |
| 1 | మహాలక్ష్మీపరిణయము | శేషాచలేశుడు. |
| 1 | మానసపూజ | |
| 1 | మార్కండేయవిలాసము | . మారెళ్ల సుబ్బరాయదాసు |
| 2 | మిత్రవిందాపరిణయము | .. కుందుర్తి వేంకటాచలము. |
| 2 | మీనకేతనాభ్యుదయము | . పెరియన్న. |
| 2 | ముకుందవిలాసము | కాణాద పెద్దనసోమయాజి. |
| 1 | మైరావణచరిత్ర | . మాడయ్య. |
| 1 | ముక్తిచింతామణి | మల్లికార్జునకవి. |
| 1 | మూర్తిత్రయోపాఖ్యానము | దంతులూరి బాపరాజు. |
| 1 | మోక్షసారము | |
| 4 | యామునాచార్యచరిత్రము | |
| 1 | యువజనహృదయానందము | బద్దెపూడి యెఱ్ఱనృపాలుడు. |
| 1 | రంగమంజరి | మారెళ్ల సుబ్బన్న. |
| | రంగరాయచరిత్రము | దిట్టకవి నారాయణకవి. |
| 1 | రఘునాథీయము | ... నుదురుపాటి వేంకనార్యుడు. |
| 2 | రసికజనమనోభిరామము | ... కూచిమంచి తిమ్మకవి. |
| 12 | రాఘవపాండవీయము | ... పింగళిసూరన. |
| 1 | రాఘవయాదవపాండవీయము-(టీక) | బాలసరస్వతి. |
| 1 | రాజనీతికావ్యము | .. బద్దె భూపాలుడు. |
| 1 | రాజశేఖరచరిత్రము | ... కూచిమంచి తిమ్మకవి. |
| 4 | రాధామాధవసంవాదము | ... వెలిదండ్ల వేంకటపతి. |

| | | |
|---|---|---|
| | రాధాముకుందము | మల్లయ్య |
| 1 | రాధికాసాంత్వనము | వేంకటకృష్ణప్పనాయఁకుఁడు |
| 1 | రాధికాసాంత్వనము | ముద్దుపళని |
| 1 | రామకృష్ణవిలాసము | శేషభట్టరు అప్పలాచార్యులు. |
| 1 | రామకృష్ణవిలాసము | తిరువెంగళదాసు |
| 1 | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రకవి. |
| 1 | రామేశ్వరమాహాత్మ్యము | ఏనుఁగు లక్ష్మణకవి. |
| 1 | రాసక్రీడలు | కొలనుపాక వేంకటకవి. |
| 1 | రుక్మవతీపరిణయము | కోదండరామకవి. |
| 10 | రుక్మాంగదచరిత్రము | మల్లన. |
| 2 | రుక్మిణీపరిణయము | కొప్పర్తి నరసకవి |
| 1 | వజ్రాభ్యుదయము | నారాయణకవి. |
| 34 | వసుచరిత్రము | రామరాజభూషణుఁడు. |
| 1 | వాసవదత్త | వక్కలంకవీరభద్రకవి. |
| 1 | విక్రమార్కచరిత్రము | జక్కన. |
| 1 | విజయనందనవిలాసము | మంగళగిరి ఆనందకవి. |
| 22 | విజయవిలాసము | చేమకూర వేంకటకవి. |
| 1 | విప్రనారాయణచరిత్రము | చదలువాడ మల్లయ్యకవి. |
| 5 | వీరభద్రవిజయము | పోతన |
| 1 | వృద్ధాచలమాహాత్మ్యము | అనంతాచార్యుఁడు |
| 1 | వేంకటాచలమాహాత్మ్యము | తరిగొండ వెంగాంబ. |
| 1 | వేంకటాద్రినాథీయము | వేంకటాద్రినాథుఁడు. |
| 1 | వేంకటేశ్వరమాహాత్మ్యము | బుచ్చయ్య. |
| 2 | వైజయంతీవిలాసము | తమ్మయకవి. |
| 2 | శివలీలావిలాసము | తిమ్మకవి. |
| 1 | శివరాత్రిమాహాత్మ్యము | శ్రీనాథకవి. |
| 1 | శ్రీకృష్ణలీలావిలాసము(సంకలితము). | శ్రీకుమారాచ్యుతరామరాజు. |
| 2 | శ్రీకృష్ణవిజయము | తమ్మభూపాలుఁడు. |
| 1 | శ్రీకృష్ణలీలావిలాసము | |

1 శ్రీముష్ణమాహాత్మ్యము ... రేపూరి అనంతయజ్వ.
1 శ్రీశైలమాహాత్మ్యము .. శేషనాథార్యుఁడు.
2 శుకచరిత్రము .. లింగమూర్తి.
1 శుకసప్తతి . .
10 శృంగారనైషధము . శ్రీనాథుఁడు
1 షణ్ముఖసహస్రము ... నందిగామ సీనయ్య
1 సంభవకాండము . వీరభద్రకవి.
2 సత్యభామాసాంత్వనము . సత్యవోలు కామేశ్వరకవి.
1 సరసహృదయానురంజనము. ... పాపయారాధ్యుఁడు.
2 సర్పపురమాహాత్మ్యము .. కూచిమంచి తిమ్మకవి.
1 సానందోపాఖ్యానము ... కోట శివరామయ్య.
3 సారంగధరచరిత్రము చేమకూర వేంకటకవి.
1 సింధుమతీవిలాసము ... గోపకవి.
1 సీతావిజయము ... మద్దనకవి.
1 సీతావిజయము . . కృష్ణామాత్యుఁడు.
1 సుదంతాపరిణయము, .. మళుఘురకవి.
1 సుధీరంజనము ... జీగిరాలరంగనాథకవి.
10 సురాభాండేశ్వరము గట్టుప్రభువు.
1 సేతుమాహాత్మ్యము .. భాస్కర వేంకటాచలకవి.
1 హంసవింశతి ... నారాయణకవి.
1 హరభక్తివిలాసము .. పాపయ్యకవి.
3 హరివంశము ... ఎఱ్ఱాప్రెగడ.
12 హరిశ్చంద్రోపాఖ్యానము ... శంకరకవి.
1 హరిశ్చంద్రనలోపాఖ్యానము ... రామరాజభూషణుఁడు.
1 హరిశ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్య .... గండికోట అనంతయ్య.
1 హరిశ్చంద్రవిలాసము ... మారెళ్ల సుబ్బరాయదాసు.
1 హాలాస్యమాహాత్మ్యము . శ్రీపతి రామభద్రకవి.

## గద్యప్రబంధములు.

| | | | |
|---|---|---|---|
| 1 | అణిమాద్యష్టసిద్ధులు | | |
| 1 | ఆచార్యసూక్తిముక్తావళి | ... | |
| 1 | ఉత్తరగోపురవచనము | ... | |
| 1 | ఎంబెరుమాళ్లు తెచ్చిన యెనుఁబది రెండువార్తలు. | | |
| 1 | గజారణ్యమాహాత్మ్యము | | |
| 1 | గోవుచరిత్రము | | |
| 1 | గోవ్యాఘ్రిచరిత్రము | | |
| 1 | చిలుక చెప్పినకథలు | | |
| 2 | జైమినిభారతము | | వెంకటకృష్ణప్ప నాయఁకుఁడు. |
| 5 | తిరునామములు | | |
| | ము | | |
| 1 | తెనాలిరామునికథలు | | |
| 1 | తోఁటవారిచరిత్రము | | తోఁట గజేంద్రుఁడు. |
| 5 | ద్వాత్రింశత్సాలభంజికకథలు | | ఏకామ్రనాథుఁడు. |
| 1 | నవకృతోపదేశము | ... | |
| 6 | పంచతంత్రము | ... | |
| 1 | ప్రతాపచరిత్రము | .. | ఏకామ్రనాథుఁడు. |
| 1 | పాండవులయశ్వమేధవృత్తాంతము | | |
| 1 | మంత్రార్థము | . | |
| 1 | మాఘమాహాత్మ్యము | | విజయరంగ చొక్కనాథుఁడు. |
| 1 | ముప్పదిరెండుమంత్రులకథ. | . | |
| 3 | మైరావణచరిత్రము | ... | |
| 1 | భట్టివిక్రమార్కులకథ | ... | |
| 3 | భాగవతము | ... | |
| 2 | భారతము | ... | |
| 5 | భారతసావిత్రి | . | |
| 1 | యథావాక్కుల అన్నమయ్యగారిచరిత్రము. | | |
| 2 | రామాయణము | ... | సింగరాజు దత్తాత్రేయులు. |

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత గ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడియాళ్వారుచరిత్రము. కవిత్రయములోని ఎఱ్ఱాప్రెగడ "చిన్నిమనుమఁ" డగు చెదలువాడ మల్లయకవిచే రచింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁ దగినది. వైజయంతీవిలాసముకన్న మిన్న. ౪ ఆశ్వాసములు ౬౮. పుటలు. సవిమర్శమైన ౧౮ పుటల పీఠిక. వెల రు. ౦-౮-౦.

## (2) ఆంధ్రవచనజైమినిభారతము.

రెండువందలసంవత్సరముల క్రిందట మధురాపురీశ్వరుం డగు విజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుఁడు నయిన సముఖము వేంకట కృష్ణప్పనాయఁకునిచే రచియింపఁబడినది. భాష సలక్షణము, శైలి మనోహరము, ధార యనర్గళము. ఆంధ్రభాషాపరిచయు లందఱు ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు ౦-౧౨-౦

పరిషత్సభ్యులకు గ్రంథములు సగము వెలకే యీయఁబడును.

1917-18 సం॥ ఇంటరుమీడియేటుపరీక్షకు పఠనీయగ్రంథము.

తపాలాన్వయములు కొనువారే భరింపవలయును.

## (3) కవిజనాశ్రయము.

కొలఁది దినములలో సిద్ధమగును. వెల 0-10-0.

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, 12, అరుణాచల నాయఁక వీథి, చింతాద్రిపేట, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 12 అరుణాచల నాయఁకవీథి, చింతాద్రిపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రచురింపఁబడియెను.

చందా సం॥కు రు. 3—0—0.　　　　విడిసంచిక రు. 0—5—0

సంపుటము 6. | పింగళనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. | సంచిక. 3.4.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ప్రతిమాసమునఁ గడపటివారములోఁ బ్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక.

# ఉపసంహారోపన్యాసము.

(కార్యసభ. అగ్రాసనాధిపతి)

భ్రాతృవరులారా :—

పండితవరుల యుపన్యాసపాయసంబుఁ జవిచవిగ మీరు గ్రోలినకతంబునఁ దద్భిన్నరుచిని నిపుడు మరల నపేక్షించుచున్నవారు తీపును భక్షించువా రపుడపుడు కారముపదార్థ మించుక నంజుకొన నపేక్షించుచుందురు కావున నే నాకారముపచ్చడి నిపుడు మీకు వడ్డించెద

బ్రహ్మశ్రీ నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు శ్రీనాథకవివిషయములో నొసఁగినయుపన్యాసం బతిశ్లాఘనీయముగ నున్నది ఆంధ్రభాషాప్రపంచమున శ్రీనాథుఁడు గొప్పకవి యనుటకు సందియము లేదు. భారత, భాగవత, రామాయణాదికవులు కేవలపురాణశైలిని గ్రంథములు వ్రాసిరి. కావున వారికి భాషాంతరీకరణ మంతగఁ గష్ట మని తోఁచియుండదు మీఁదుమిక్కిలి వా రాంధ్రీకరించిన సంస్కృతగ్రంథములు కఠినపదార్థక్లిష్టములు గావు శ్రీనాథుఁడు భాషాంతరీకరించిన సంస్కృతనైషధ, కాశీఖండములు లన్ననో యినుపగుగ్గిళ్లు ఒకటి "నైషధంవిద్వదౌషధ"మ్మని పే రందినది రెండవది "కాశీఖండ మయఃపిండ"మ్మని ప్రసిద్ధి కెక్కినది. ఇట్టికఠినశబ్దార్థాలంకారగుంఫిత మగు సంస్కృతగ్రంథములను జక్కఁగ నాంధ్రీకరించిన శ్రీనాథుఁడు శ్రీనాథాంశజనితుఁడేను. ప్రౌఢదీర్ఘసమాసములచే నాంధ్రభాషను జెడఁగొట్టె నని రామలింగకవి శ్రీనాథుని దూషించె ననునెచటిదియో యొకపద్యము జనులు వచించుచుందురు. ఎట్టిసందర్భమునఁ గవి యట్టిదీర్ఘసమాసము లుంచె ననునదియు నాలోచింపక యాపద్యము వాడుచున్నవారు. ఆదీర్ఘసమాసములను దీసివేసి విడిమాటలు చేర్చియైనను, చిన్నసమాసములను జేర్చియైనను, సంతటియర్థస్వారస్య మిచ్చునదిగను, సంస్కృతశ్లోకమునకు సమంజసముగ నర్థ మిచ్చునదిగను, బద్య మల్లుట సాధ్య మేమో కవిపుంగవు లాలోచింపనిండు ఇంతకును శ్రీనాథుని నైషధములోఁ గొన్నిపద్యములుమాత్రమే దీర్ఘసమాసములతో నిండినవి. ప్రతిగ్రంథములోను నట్టిపద్యము లుంట సహజము. అట్టిపద్యములు "ఓజ"

మనునలంకారములో వచ్చునవి. దిలీపప్రబంధగ్రంథకర్త "మృదుపదాచ్ఛాది తత్రిభువనుశ్రీనాథు" అని శ్రీనాథుని వర్ణించినాఁడు.

మఱియు నొకవిషయము. స్త్రీలసహజరూపమును, గుణావగుణములను నున్నవి యున్నటులు చిత్రరేఖలు వ్రాసినరీతిగఁ బద్యముఖంబున వర్ణించుసామర్థ్యము శ్రీనాథకవికిఁగాక మఱి యేకవికిఁ గాని లేదని చెప్పనగును. ఆకవి వీథినాటకమే దీనికి సాక్ష్యము. ఇది శ్రీనాథుఁడు చెప్పినది కా దనుట సాహసము.

అది యేమిపాపమోఁగాని హిందువులయభిరుచి తమసహజాభిరుచికినిఁ జెడినది, ఆంగ్లేయాభిరుచికినిఁ జెడినది. రసవంతము లన్నియును నీరసము లైనవి. "పయోధర" పదమే యశ్లీల మై యసహ్యకర మైనది. "రజనికరానన పీనపయోధర" అనునన్నయగారి భారతప్రయోగముపై నాగ్రహము పొడమి దానినిఁ దొలఁచివేయునంతవఱకును మనవారికిఁ గలకోపాగ్ని యాఱదాయెను. ఇట్టివా రాంగ్లేయభాషనైనఁ జక్కఁగఁ జదువువారు కా రైరే యని నేఁ జింతిల్లెద. ఈరీతిగ మనవారికిఁ "గటికవోరువుల"పై నసహ్యత జనించెనేని ప్రపంచముగతి యేమి? అలంకారశాస్త్రములగతి యేమి? హిందూగ్రంథములగతి యేమి! మనభాషాయోషామణికి మనమె శత్రువులమైతిమి. పాశ్చాత్యులగ్రంథములలో "The Commedies of Aristophone, The Restoration Dramas, The Dramas of Dryden and Ottway, "Antony and Cleopatra" The Veuus and Adonis, The Ovids Art of Love" ఈ మొదలగుగ్రంథములు చదువుఁడి అవి యశ్లీలకరములగునో కావో చూడుఁడి అవి యాంగ్లేయస్వర్ణదీనారములంబలెఁ బ్రతిగృహమునందును భాసిల్లుచున్నవి. వానికి నారోపితముగాని దూషణము వీథినాటకమున కేల వచ్చెనో? ఇది యాగ్రంథముయొక్క గ్రహచారమో? చచ్చి స్వర్గమున నున్నశ్రీనాథకవి గ్రహచారమో? గాక మనగ్రహచారమో? ఏది యెటు లుండినను నాదికవి యగువాల్మీకిగతి యే మని నేఁ జింతిలుచున్నాను. ముం దిట్టివారు పుట్టుదు రని యామహానుభావునకుఁ దెలిసియుండినచోఁ గిష్కింధాకాండాంతర్గత శరత్కాలవర్ణనలలో నీక్రిందిశ్లోకము వ్రాయుచుండ లేదు

"దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః
నవసంగమసవ్రీడా జఘనా నీవ యోషితః" ॥

పైశ్లోకమును బండితులు సైతము నిత్యమును బారాయణముఁ జేయు చుందురు.

ఇట్టివి యశ్లీలము లనియో నీతిబాహ్యము లనియో యెంచినచో హిందూగ్రంథము లగు భారత భాగవత రామాయణాదు లామూలాగ్రముగఁ బరశురామప్రీతి కావలసియుండును. రతిరహస్యము, కొక్కోకము, సింగభూపాలీయము, విద్యాధరుని కేళీరహస్యము, కళాశాస్త్రము, అనంగరంగము మొదలగు గ్రంథములు వాత్స్యాయనసూత్రములతోఁ దుదిముట్టవలసినదేను. ఉషానిరుద్ధ, తారాశశాంక, అహల్యాసంక్రందన, బిల్హణీయగ్రంథములు రౌరవాదినరకములపాలగునుగదా? కళాపూర్ణోదయ కవికర్ణరసాయ నాదిపుస్తకములు పాతాళమున డాఁగవలసినదేను. హంసవింశతి యెపుడో యెగిరిపోవును చంద్రికావిలాప మరణ్యరోదన మగును. అయ్యో; హిందువు లందఱు శృంగారవిహీనులయి, సన్న్యాసులు గావలసివచ్చునే! దీనినుండి నా కేమియుఁ జింత లేదుగాని రసికు లగుయావనాఢ్యులుమాత్రము తమధనమును గోల్పోయినవారివలెఁ జింతింతురు: ఈ "కచకుచోరు" విషయముల హిందువులకును నాంగ్లేయులకును భేద మే మనిన, హిందువు లాపదములఁ జూచి యానందింతురు. ఆంగ్లేయు లన్ననో, నాట్యస్థానముననను, నాటకరంగమునందునను బ్రత్యక్షముగ నాశృంగారాంగములఁ జూచి యంతరంగమున నాహ్లాదింతురు. పదములను జూచినమాత్రన మానసవైకల్యమును జెందుహిందువు లెంతటిధీరులోగదా! భవిష్యత్కాలమున హిందువుల కిదియొకకుందగుట నిస్సందేహము.

నన్నయగారి "రజనికరానన-పీనపయోధర" యనుపద్యములోని శృంగారవతిని శుష్కస్తనిని జేసినను జింత లేదు. మేచకకుంతలఁ జేసెరి. అదియును జేయక విగతకుంతలను జేసి "భస్మవిలేపన"యని మార్చియుండినచో నా "రజనికరానన" గతి బ్రాహ్మణవిధవగతి యగుచుండెను. అటు కానందులకు మనము సంతసింపవలెను.

శ్రీనాథునిశృంగారవర్ణనలఁబట్టి యాతని నీతిబాహ్యుఁ డని నిందించుట యసమంజసము. దీనికి నిదర్శనములు వాల్మీకిభీష్ములేను. వీరికి శృంగారానుభవము లేకున్నను, స్త్రీసంభోగానందమును వీరు విశేషముగ వర్ణించినారు. నాకుఁ దెలిసినరీతిగ గొప్పపండితు లగురచ్చమర్రి త్రివిక్రమశాస్త్రులవారు పరనారీపరాఙ్ముఖులు, గొప్ప వేదాంతులు. అయినను "పంచాయుధప్రపంచ"మనుభాణ

మును రచించి యందున సకలవిధము లగుశృంగారవర్ణనలు సేసియున్నారు. నామిత్రులును, గొప్పపండితులు నగు“అవధూత మద్దుకృష్ణాచార్యులవారు” “ఈహామృగి”యనుగ్రంథములోఁ బచ్చిపచ్చిగ శృంగారవర్ణనము సేసియున్నారు. వారు సకలవిధముల నీతిపరు లని నేను సాక్ష్య మీయఁగలను. కావున గ్రంథములోనివర్ణనలనుబట్టి కవులనడతలను నిర్ధారించుట న్యాయవిరుద్ధము.

ఆంధ్రవాల్మీకి లని పేరువడసినబ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బరావుగారును, నేరేళ్లపల్లె రామకృష్ణశాస్త్రిలవారును నుపన్యసించినపోతనామాత్యకవివిషయము బహుశ్లాఘనీయముగ నున్నది ఆమహానుభావుఁడు వరకవి ఆకవివరుని భాగవతముఁ జదువునపు డెంతటినాస్తికుఁ డైనను మిగుల నాస్తికుఁ డైదైవభక్త్యతిశయమునఁ బై మఱచు ననుటకు సందియ ములేదు. ఇతరగ్రంథములలోని శృంగారవర్ణనము మానసవైకల్యముకలిగించునేమో గాని భాగవతములోనివర్ణనము చిత్తవృత్తిని వైరాగ్యమూల మగుశాంతవృత్తిలో నిలుపును కావుననే భాగవతమునందు దైవసాన్నిధ్య మున్న దనుట నిస్సందేహము తత్కారణంబుననే పండితులును బామరులును దానిని నెడతెగక పారాయణముఁ జేయుచుందురు. స్త్రీలుసయితమందులోని గజేంద్రమోక్షము, రుక్మిణీకళ్యాణము, ప్రహ్లాదచరిత్రము, సదాపఠించుచుందురు.

భాగవతభాష విశేషముగ సంస్కృతమయము, కొన్నిస్థళములుదీర్ఘప్రౌఢసమాసములతో నిండినవి ఐనను దానిని జదివినపుడు వినుచుండుపామరుఁడు సైతము సర్వమును దెలిసికొనినవానింబలెఁ దలయూఁచుచుండును. ఆంధ్రభాషాప్రపంచమునఁ బండితపామరరుచ్యములగుగ్రంథము లు భాగవతము, రంగనాథరామాయణము, ఉత్తరరామాయణమును. మిగతగ్రంథములు కేవలపండితరంజకము లైనవి.

ఒంటిమిట్టగ్రామము, పోతనామాత్యునివాసస్థాన మగునా కాదా యనువిషయము బహుదినములుగ వివాదాంశముగ నున్నది. బ్రహ్మశ్రీ జయంతిరామయ్యపంతులవా రనేకశాసనములను శోధించి ఒంటిమిట్టయనునది పోతనామాత్యునివాసస్థానము కా దనియు నతనినివాసస్థానము “ఓరుగల్లు”నియుఁగొన్ని యాధారములనుఁ జూపుచు నిర్ధారించిరి. భాగవతములోఁ బలుకంబడిన “ఏకశిలానగరము “ఒంటిమిట్ట” యనునది యగునా కాదా యనువిషయము విచారణీయముగ నున్నది. ఈవాదము రెండుశాఖలుగ నేర్పడినది. ఓరుగల్లువాద

మనియు, ఒంటిమిట్టవాద మనియు, నావాదనులసంకేతనామములుగఁ దెలియవలెను. పైరెండుశబ్దములును "ఏకశిలా" యనుపదమునకు సమానార్థ మిచ్చునవియేను ఓరుగల్లునకు నేకశిలానగర మనుట రూఢి. ఏకశిలానగరము కాకతీయరాజులముఖ్యపట్టణము ప్రొఫెసర్ త్రివేదిగారు "ఏకావళీ" యనునలంకారగ్రంథమునకు నీదిగువఁ బలికినరీతిగఁ బీఠికవ్రాసినారు.

"The illustrative verses in the former (Pratapa Rudra Yasobhushana by Vidianatha) are all composed in honor of Pratapa Rudra or Rudra, worshipper of Kakati God, who ruled at Ekasilanagara" కాకతీయరాజులకు ముఖ్యపట్టణము ఓరుగల్లని తెలియవచ్చును Madras Manual of Administration Vol. III లో ఓరుంగలు విషయమున నీరీతిగ వ్రాయఁబడినది. "From (Oru Tam Single, kal Tam Stone) or, (Sanscrit name Varnakula, meaning caste + collection, (Ekashilanagari) meaning one stone city, from the single stone wall round the town (Vontimittah) Ancient capital of the Andhram The Hyderabad territory"

పైవ్రాఁతనుబట్టి "ఒరుంగల్లు"కు నేకశిలానగర మనియును "ఒంటిమిట్ట"యనియును పేళ్లు గల వని తెలియవచ్చుచున్నది. దీనింబట్టిచూడ "ఒంటిమిట్టకు నేకశిలానగర మని మారుపే రున్నటు లర్థ మగును" సర్వజ్ఞసింగమనాయనియాస్థానకవులు పోతనశ్రీనాథు లని నెల్లూరుజిల్లాచరిత్రములో వ్రాయఁబడినది. కడపజిల్లా "ఒంటిమిట్ట" వేంకటగిరిసంస్థానమునకు సమీపము. కావునఁ బోతనామాత్యుఁ డీయొంటిమిట్టవాఁ డనునూహ కలుగుచున్నది. ఒంటిమిట్టలు రెండు నుండినవేమో తెలియదు.

బ్రll రామకృష్ణశాస్త్రులుగారు "ఒంటిమిట్టయ పోతనామాత్యునివాసస్థానమని స్థాపించుటకునై యనేకనిదర్శనములు చూపిరి బహుకాలాగతప్రవాద మొకటి, పోతనామాత్యునిగుఱించినగాథలు రెండు, పోతనామాత్యునివిగ్రహ ముండుట మూఁడు, ఒకపొలముపై రాకవిపేర నుండుట నాల్గు, కడపమండలాధివాసులకు నాకవిపైఁ గలగౌరవాతిశయ మైదు, భాగవతభాష కడపమండలమునందుఁ బ్రచారముగలభాష యనునది యాఱు ఇవి యన్నియును బోతనామాత్యుఁడు కడపమండలాధివాసుఁ డని యూహఁ గలుగఁజేయుచున్నవి. ముఖ్యముగ శాస్త్రులవారు చూపినకొన్నిపదములు దత్తమండలదేశీయపదము లనుటకు సందియములేదు. నాచే రచింపఁబడిన సునందనీపరిణయములో "నూకు" యనుపద

ముపయోగించియుంటిని. బ్ర॥మండపాక పార్వతీశ్వరశాస్త్రులవారాపద మశ్లీలమని వచించిరి. మఱియొకగ్రంథమున "తాకు" యనుపద ముపయోగించియుంటిని. ఆపద మశ్లీలార్థము నిచ్చున దని రాజమహేంద్రనగరమువా రనిరి "దొబ్బు" యనుపదప్రయోగముచే నాబంధువు లగుదాక్షిణాత్యస్త్రీలవలన నాకొకసమ యమున ముఖభంగము కాఁబడినది ఈశబ్దములు దత్తమండలదేశీయములు. ఈపదములు విశేషముగ దత్తమండలమువారే యుపయోగించుచుందురు. పైరీతిగ నూకు. దొబ్బు లనుపదములవిషయమున నాక్షేపింపఁబడి యిటీవల "నెట్టు" యనుపద ముపయోగించుచున్నాను శాస్త్రులవారు చూపినమిగతపదములును దత్తమండలదేశీయములేను పైకారణమునుఁబట్టి పోతనామాత్యుఁడు కడపమండలమునకుఁ జేరిన "ఒంటిమిట్ట" నివాసులుగ నుండి రని యూహించుటకు మార్గమున్నది ఈయూహ మార్చుటకుఁ బ్రబల మగుసాక్ష్యము కావలెను. బ్ర॥ జయంతి రామయ్యపంతులువారు పురాతనచరిత్రాంశములు పరిశోధించుటయందుఁ బ్రవీణులు. కావున నీవివాదముయొక్క యాగాములు స్థాపించుభారము వారిపైఁ ద్రోసినయెడల వారెట్లైనను శ్రమపడి నిర్వివాదార్హ మగు సాక్ష్య మన్వేషించి తెత్తు రని నేనమ్మినాను.

బ్రహ్మశ్రీ రాళ్లపల్లె అనంతకృష్ణశర్మగారు సంకుసాలనృసింహకవినిగుఱించి యుపన్యసింపఁదగినదిగ నుండెను. వారు రానందున నావిషయము లోపముగ నుండరా దని యెంచి యావిషయము సంక్షేపముగఁ బలుకయత్నించెద. ఈకవియొక్క గ్రంథముపేరు కవికర్ణరసాయనము. అది క్షీరసాగరభట్లబలెఁ గాక యన్వర్థాభిధానముగ నున్నది. మనుచరిత్రముతోఁ బోల్పఁదగినగ్రంథ మది యని జనులవాడుక యున్నది, గాని, నా కటులు దోఁపదు. ఈగ్రంథములో నలంకారములు హెచ్చుగ నున్నవి. యుద్ధవర్ణన మపరిమితముగ నున్నది. స్త్రీవర్ణనము మేరమీఱినది. వేదాంతవిషయ మగువచనములు హెచ్చుగనున్నవి, అన్నియు నిజము గాని మనుచరిత్రముఁబోలె రసపూరితకథాచమత్కృతి గలది కా దది. కొందఱు పండితులు మనుచరిత్రతో వసుచరిత్రమునుఁ బోల్చి యభిప్రాయము లిచ్చుచున్నారు. రెండును సద్గ్రంథము లనుట నిజ మగునుగాని యొకటి కొకటి పోల్పఁ దగినగ్రంథములు కా వవి. ఆరెండుగ్రంథములలోను పాకభిన్నతయును, శైలిభిన్నతయును, విషయభిన్నతయును, గవిహృదయభిన్నతయును విశేషముగఁ గనఁబడుచుండును. రసపూరితకథాచమత్కృతిగలది మను

చరిత్ర. అలంకారభూయిష్ఠ మై శ్రేష్ఠమైనశ్లేషకావ్యము వసుచరిత్ర. వసుచరిత్రను సురభిమాధవరావురాజుగారి చంద్రికాపరిణయముతోఁ బోల్చినను బోల్పనగును ఆంధ్రప్రపంచమున మనుచరిత్రముతోఁ బోల్పఁదగినగ్రంథ మొకటి కలదని నేఁ జూపఁ జాలను. దానికి సమానమదియేను. ముద్దు లొలుకుపలుకులచే రస ముప్పతిలఁజేయువిజయవిలాసములోని కొన్నిపద్యములు పోల్చినను బోల్పనగును. నృసింహకవి గ్రంథములోనిరెండు పద్యములుమాత్రము జనులనోటిలో నాడుచుండును. అందున నొకటి విశేషముగఁ బ్రసిద్ధికి నెక్కినది.

ఒత్తికొని వచ్చుకటికుచోద్వృత్తిఁ జూచి
తరుణితనుమధ్య మెచటికో తలఁగిపోయె
నుండెనేనియుఁ గనఁబడకున్నె యహహ,
యుద్ధతులమధ్యమునఁ బేద కుండఁ దరమె

ఎద్దియో యొకవిషయవర్ణనముఁ జేయుచుఁ దుదకు సాధారణధర్మకథనము ఫలితార్థముగఁ బలుకుట యొకవిధ మగునలంకారము. ఇట్టియలంకారములు కవికర్ణరసాయనమునం దనేకము లున్నవి. అయినను మనుచరిత్రమువలె భావగుంఫిత మైనట్టియు రసపూరిత మైనట్టియు గ్రంథము కా దది. పెద్దన రసజ్ఞుఁడు, రసజ్ఞుఁ డని చూపుటకు మనుచరిత్రలో ననేకము లగుపద్యములు నిదర్శనముగ వ్రాయనగునుగాని సమయము కా దిది. అయినను మాదిరికి నొకపద్యంబు వ్రాసెద.

"ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్నజవరాండ్ర నెపం బిడి పల్కరించులా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవచొప్పు నీ
కింత భయంబు లే కడుగ నెల్లిద మైతిమె మాట లేటికిన్"

"అని నర్మగర్భంబుగఁ బలికి క్రమ్మర ని ట్లనియె" అనియున్నది. పై పద్యమునుఁ జదివి పెద్దన్నగారెంతటిరసజ్ఞు లెంతటియభినయశాస్త్రవిదు లెంతటి స్త్రీస్వభావలక్షణవేత్త లెంతటిలోకానుభవముగలవా రనునదియుఁ జదువరు లూహింతురుగాత.

"ఇంతలుకన్నులుండ" యనుపద్యమును జదివినవెంటనె వరూధిని ముగ్ధావస్థను మిాఱి ప్రౌఢావస్థలోఁ బ్రవేశించిన దని యూహ కలుగుచున్నది. ప్రవరాఖ్యునిసౌందర్యాకృతినిఁ జూచి వానిని వరూథిని కామించినను దానిని వెలిపెట్టక

కోప మించుక సూచించుదానిఁబలె "ఇంతభయంబు లేకడుగ నెల్లిద మైతిమె మాట లేటికిఁ" యని భావగుంభితముగఁ బలికి స్త్రీజాతిస్వభావమును వెలిపెట్టెను.

"ఏకాంతమునందు నున్నజవరాలు" అనువాక్యములో దా నొంటరిగ నున్నదాననని యు, తనసరస నెవరును లే రనియుఁ, బ్రవరాఖ్యుఁడు స్వేచ్ఛగ నుండనగు ననియు, సూచించుచున్నది. "భూసురేంద్ర" యనువాక్యప్రయోగము భోగానుభవేచ్ఛ కలవాఁడా యనియు "ఇంతలుకన్నులుండ" యను వాక్యముచే విశాలనేత్రములు గలసుందరాంగుఁడా యని ప్రవరాఖ్యుని సంబోధించుచున్నటు లర్థముఁ దోఁపఁజేయుచున్నది. "ఏకాంతమునందు నున్నజవరాండ్ర నెపంబిడి పలుకరించులా గింతియ కాక" యనువాక్యములోఁ బెద్దన్నగారు తమయసమాన లోకానుభవమును వెల్లడించినారు రసికు లగువిటులు సౌందర్యాతిశయాంగనను జూచి దానితో మాటలాడుటకు నేదియో యొకకపటసందర్భమును గల్పించు కొని మాటలాడించుట సహజముగదా ? ప్రవరాఖ్యుఁడు వరూధినిని బల్కరించినది కపటవ్యాజ మనుటకుఁ దగుకారణము సహితము వక్కాణింపఁబడినది. "ఇంతలుగఁగన్నులుండియు నీవెఱుఁగవే మున్నువచ్చినత్రోవచొప్పు" అని యాక్షేపించుటచే బ్రవరాఖ్యునిప్రశ్న, జవరా లగుతన్ను మాటలాడింపవలె ననుమిష యని నిర్ధారించి యాఁడువారా మగవారికి దారిఁ జూపువా రని యర్థాంతరముగ నధిక్షేపించుచు నిజముగ నీయుద్దేశము వేఱుగ నున్న దని తెచ్చికోల్కినుకఁ జూపుచుఁ బ్రవరాఖ్యునిమనమునందు మోహాంకురంబు నాట వరూధిని సాహసించెను ఇట్టివిషయము వర్ణింపవలె ననిన లోకానుభవము హెచ్చుగ నుండవలెను. "ఇంతభయంబు లేకడుగ నెల్లిద మైతిమె" నేనేమి సామాన్యస్త్రీని గాను, ఉత్తమస్త్రీ నని పలికినది "మాట లేటికిఁ" కార్యము ముఖ్యము-మాటలతో నేమిప్రయోజన మని ఫలితార్థమునే తెచ్చినది. అన్యభాషలం దేభాషలో నింతటి రసవంత మగుపద్య మున్నదియో చూపనింపు.

పైపద్య మంతయును భరతశాస్త్రజ్ఞులకు నభినయయోగ్యముగ భాసిల్లుచున్నది. ప్రవరుఁడు నవమన్మథుఁడైనను ఛాందసుఁడు కావున శబ్దాంతర్గతగూఢ భావంబుఁ దెలియక బాహ్యార్థమునే గ్రహించి వెళ్లిపోవునేమో యని వరూధిని భయపడి క్రమ్మర నిట్లనియె, నని పలుకఁబడినది. అంతరార్థ మున్న దని చదువరులు దెలిసికొనవలెనని నర్మగర్భముగాఁ బలికె నని వచనమున సూచింపఁబడినది. వ్యాఖ్యానము వ్రాయువారు "ముక్కస్య ముక్కార్థః" అనినరీతిగ "నర్మ

గర్భముగా" అనఁగాఁ బ్రేమాభిప్రాయపూర్వకముగ నని యీడ్చివేసినారు. ఇట్టి పద్యము లనేకములు మనుచరిత్రములో నున్నవి. ఇట్టిరసవంతము లగుపద్యము లాగ్రంథములో నున్నవి యని కదా యెవరిని మెచ్చని కవిచౌడప్ప పెద్దన్నను మాత్రము మెచ్చెను.

క. పెద్దనబలెఁ గృతి పలికినఁ
బె ద్దనవలెఁ గాని పరులఁ బెద్దనవలెనా ?

అని పెద్దనగారిని నుతించినాఁడు. ఇట్టిమహాకవి, కవికర్ణరసాయనము కృష్ణదేవరాయఁడు చూచినచోఁ దన్నుపై గౌరవము తప్పు నని యెన్ని యుండు నా ? ఇది యెచ్చటిదియో పిట్టకథ.

ఉపన్యాసంబు లన్నియును ముగిసినపిదప సాయంకాల మూఁడుగంటలకు బ్ర॥ అనంతకృష్ణశర్మగారు వచ్చిరి. మైసూరునుండి వారు వచ్చినకతంబునఁ గ్రమవిరుద్ధ మైనను బదినిమిషములు వారియుపన్యాసంబునకు నవధి యీయఁ బడెను వా రాయవధికాలము మీఁఱనటులు నృసింహకవి యేకాలమువాఁ డనునది సకారణముగ స్థిరపఱచిరి. నేఁ బలికినకథ పిట్టకథ యని స్థాపించిరి. "మూర్తి కొంచె మైనను గీర్తి బల" మనులోకోక్తికి వీరు నిదర్శనము. వీరికి విమర్శనశక్తి హెచ్చుగ నున్నది. కవిత్రయస్థానమునుండి నాచనసోముని గ్రింది మెట్టుకుఁ ద్రోసినవారు వీరేను. అభిప్రాయభేదమునకు మన మేమిసేయఁగల ము ? వీరికి నాంగ్లేయభాష వచ్చునో లేదోనాకుఁ దెలియదుగాని వీరివిమర్శ నములను జక్కఁగఁ జూచినచో వీరికి నాంగ్లేయభాషాప్రావీణ్యముఁ గలవారిశిష్యు యయిన దని తెలియవచ్చుచున్నది.

బహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు పద్యకావ్యములను గుఱించి యుపన్యసింపవలసినదిగ నుండెను వారు రారైరి. వీ రుపన్యసింపఁదగినవిషయము బ్ర॥ పంచాగ్నుల దక్షిణామూర్తిశాస్త్రిగా రొసఁగినకావ్యరహస్యోపన్యాసములోఁ గొంతవఱకు మిళిత మైనదేను. ఈవిషయమున హెచ్చుగఁ బలుకఁ దగినది యేమి యు లేకయున్నను మమ్మటునికావ్యప్రకాశికలో నీవిషయ మెటువర్ణింపఁబడి యుండునదియు నించుక వ్రాసెద.

బ్రహ్మసృష్టి ప్రకృతివిధులకు లోఁబడినది. సుఖదుఃఖమయ మైనది. మాయా విమోహిత మైనది. నిమిత్తోపాదానకారణబద్ధ మైనది. కవిసృష్టి యట్టిది కాదు. యశోరూపమున వెలుఁగుచిన్మయాకృతి. బ్రహ్మసృష్టి షడ్రసభరితము - కవిసృష్టి

నవరసభరితము - కవికృత మగుకావ్యము యశముఁ దెచ్చును. ధనమార్జించును - జ్ఞానము లభింపఁజేయును. చెడుగులు మాన్చును - సుఖము హెచ్చింపఁజేయును. కాళిదాస - ధావక - శ్రీహర్ష - మయూరాదులే దృష్టాంతములు. కావ్యముఖ్యలక్ష్యము రస ముప్పతిల్లఁజేసి యానందము కలిగించుటయే. కవిత్వవంశ పురుషలక్షణము మేధాబోధితము, సర్వశాస్త్రజ్ఞానఫలము, చిరకాలాభ్యాసజనితము. కొందఱయందుమాత్రము కవిత్వము పూర్వజన్మ సంస్కారఫలముగ నుండును.

ధ్వనిప్రధాన మైనదియే యుత్తమకావ్యము. దానిలో రసప్రాధాన్య మైనచో నాహ్లాదము. దానిలోనలంకారము లుండెనేని రసికజనమనోహరము. ఇట్టికావ్యము మృదుపదమాధుర్యము కలిగియుండెనేని పామరులకున్నైతము హృదయంగమము. నవరసములలో శృంగారము ప్రధాన మని కొందఱమతము. కరుణము ప్రధాన మని లాక్షణికులమతము. "రసేషుకరుణోరసః" యని వ్రాసినారు. కవి ముఖ్యముగ లక్షింపఁదగినది పాకము. అది చక్కఁగ లేనిచోఁ గడుపు నిండదు. ఏయేవిషయమునం దేయేరస మెంతవఱకు నుపయుక్తమో యాయారస ముప్పతిలఁజేయునదియే పాకవైలక్షణ్యము. పాక మనఁగా నర్థగాంభీర్య మని ప్రతాపరుద్రీయములో వ్రాయఁబడినది దానికిఁ జేరికగ నభిరుచి యని నాయభిప్రాయము. ఈపాకమునుఁ ద్రివిధముగ విభజించి యొకకవి యాంధ్రంబున నీదిగువఁ బలికినపద్యంబును వ్రాసినాఁడు.

ఘనతరగూర్జరీకుచయుగక్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యటుచాఁ టగునాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవఁబోలెఁ దేటయును జాఁటుఁదనంబునుఁ జాలఁగాంచకుం
డిన నదిపో గవిత్వ మని నిల్చు నగిం చటుగాక యుండినన్.

ఈపద్యంబున నారికేళపాకమునుగుఱించియు, ద్రాక్షాపాకమునుగుఱించియుఁ, గదళీపాకమునుగుఱించియుఁ బలుకుచుఁ గదళీపాకమును మెచ్చఁబడినది. క్లిష్టపదములచేఁ గప్పంబడి యర్థగాంభీర్యము గలిగి యెంతకష్టపడి యాలోచించినను ఫలము లభింపకను లభించినను గష్టమునకుఁ దగినఫలముగాకను నుండునది నారికేళపాక మనఁబడును. ఏకష్ట మేమాత్రమును లేక సులభముగ నర్థమిచ్చుచుఁ బేలవముగ నుండుకవిత్వము ద్రాక్షాపాక మనఁబడును. సులభముగ విచ్చి

కొనుపై పట్టవదల్చినచో మధురఫల మనుభవింపనిచ్చునట్టి కదళీపాకముబలెఁ గవిత్వ ముండవలె నని యాశయము.

పైరీతిగఁ బాకవిభజనము సేయంబడినది. ద్రాక్షాపాకము పామరరంజకము. నారికేళపాకము పండితకవులకు నాహ్లాదకరము. కదళీపాకము సర్వజన రంజకము.

ఇత్యాదిలక్షణములు గలకావ్య మతిశ్లాఘ్యము. ఆంగ్లేయులు బేకను మొదలగువారు మనకావ్యలక్షణములను జూచి తాము నాలక్షణములను గొన్నిటిని గ్రహించినారు.

శబ్దశాస్త్రప్రసంశ :— భాషలలోనివ్యుత్పత్తులపోలిక యను విషయమున బ్ర॥ వరదాచార్యులవా రుపన్యసించి భాషలలోఁ దమకు గలజ్ఞానము వెల్లడించిరి. ఇది కష్టతమ మగువిషయ మని నేను మున్ను పలికినాను, కాల్డ్వెల్‌దొరగారు విశేషముగ శ్రమించి గొప్పగ్రంథము నీవిషయమున వ్రాసినారు. వారి శ్రమ శ్లాఘనీయముగ నున్నది గాని ఫలము తృప్తికరముగ లే దని నే నెన్నెద. ప్రపంచమును జుట్టుముట్టినభాషార్ణవమునే వా రీదసాహసించిరి. ధ్వన్యర్ణవము నీదనారంభించి యక్షరార్ణవమున నర్ధాయువుఁగోల్పుచ్చి శబ్దాబ్ధిలో మునింగి తేలిరి. తుదకు, ద్రావిడధ్వనులు, ద్రావిడాక్షరములు, ద్రావిడధాతువులు సంస్కృతమునకు సాహాయ్యపడిన వని ఫలితార్థమును నిర్ధారించిరి. ఇది యెంతవఱకు నిజమో సర్వభాషాప్రావీణ్యము గలలాక్షణికులు నిర్ధారింపవలెను. దేశ్యభాషలలోనిపదములకు వ్యుత్పత్తులుగని పెట్టుట సులభసాధ్యము గాదు. దేశ్యభాషలో ననేకపదములు సామాన్యముగ నున్న వనియు, గొన్నిపదములలో నక్షరలోపము లున్నవనియుఁ, గొన్ని పదములలో నక్షరాధిక్యము లున్న వనియుఁ, గొన్ని పదములనులోమవిలోమావస్థ లందిన వనియుఁ దెలుప నగును. అయినను, ప్రారంభపద మిది యనియు నది జనని యనియు మిగతమూర్పుపదములు బిడ్డ లనియు నివి యన్నియును నొకకుటుంబములోఁ జేరిన వనియు వ్రాయుట సాహసము. సమష్టికిఁ జూచినచో నన్నిభాషలలో నన్నిపదములును వాక్కుటుంబములోఁ జేరిన వనుటకు నేసందియమును లేదు. వ్యుత్పత్తిశాస్త్రమును వ్రాయువారాంధ్రదేశ్యపదములవ్యుత్పత్తినిఁ జూచాయగ సూచించి యాంధ్రభాషలో నుండు తద్భవ, తత్సమపదములకు వివరముగ వ్యుత్పత్తులు వ్రాయసమకట్టుట సమంజసము. ఇప్పటినిసైతము శ్రమసాహసములకు లోఁబడినదేను. శబ్దముయొక్క

కరు పూర్వరూప మేమి? యుత్తరరూప మేమి? సంయోగ మేమి? సంయోగకారణ మేమి? ఇవియన్నియును, జక్కఁగ నాలోచింపవలెను. వీనిలోను గొన్ని శబ్దభేదము లగపడును. అవి (1) శ్రావ్యము (2) ఉచ్చారణము (3) ధ్వని (4) గ్రామ్యము (5) అక్షరములమార్పు. ఇవి శబ్దములలోఁ గలుగుకొన్నిభేదములు.

(1) శ్రావ్యము = బ్రహ్మకు బమ్మ, విష్ణువునకు వెన్నుఁడు, విఘ్నేశ్వరునకు వెనుకయ్య.

(2) ఉచ్చారణము = గ్రంథమునకు గ్రంధము, వీథికి వీధి, బ్రహ్మకు బ్రంహ, సింహమునకు సిహ్మము, జిహ్వకు జింహ, కహ్లారమునకుఁ గల్హారము. శబ్దములకు ద్విరూపములువచ్చుటకుఁ గారణములిట్టివి యేను.

(3) ధ్వని = ఇది యన్యదేశజులనుండికలిగి శబ్దములు మార్చుచుండును. మనకు నాంగ్లేయధ్వని రాదు. ఆంగ్లేయులకు నాంధ్రధ్వని రాదు. దీనిని నాంగ్లేయులు Intonation అని పిలిచెదరు. మనవారే కొందఱు దక్షిణదేశస్థులు ప్రతిశబ్దమును దీర్ఘములుతీసి మాటలాడుచుందురు. కొనవిఱుపులలో హెచ్చుగ భేదముండును.

(4) గ్రామ్యము = విశ్వేశ్వరయ్య, విసేసయ్య: మాయయ్య అగ్గొగ్గ యిమండేసు, మనబార్య నీరాడింది = రాల్యా: పోల్యా.

(5) అక్షరభేదము = ఇదిస్త్రీలు, బాలురు, విద్యారహితులై శబ్దశుద్ధి తెలియనికతంబున వచ్చునది. కొందఱుస్త్రీలు వివాహములకుఁ బూర్వము పానకము పంచుట మర్యాద. ఆపానకమునకు గుడోదక మనిపేరు. స్త్రీలకు శబ్దశుద్ధిలేకను దానియర్థము తెలియకను "డో" యనునక్షరమును "దో"గ మార్చి యశ్లీలముగఁ బలుకుచుందురు.

ఏమే తలకుఁ బోసికొన లే దనినచో "అయ్యో మన్నే పోసికొంటి" నని యసహ్యకరముగఁ బలుకుదురు.

ఈరీతిగ శబ్దము లనేకములు రూఢిలోనికి వచ్చినవి. వ్యుత్పత్తులు వ్రాయువారీమార్పులుసైతము గనిపెట్టవలెను.

ఈయుపన్యాసకులు వయసునఁ జిన్నవారైనను బుద్ధిని గొప్పవారు. వీరుపన్యసించినభాగము కొంచెమైనను బహ్వర్థశోభితముగ నుండెను. కొన్ని యాంధ్రప్రత్యయములు స్వతంత్రము లగుపదములన్నియు ధాతువు లుత్తమమధ్యమాధమపురుషలందు సర్వనామములస్వరూపమునుఁబట్టి యెట్లు మాఱునదియు

బలికిరి గాని యీవిషయము వివరముగ వ్రాసియుంచినచో సర్వులకుఁ జక్కఁగఁ దెలియుచుండెను. శబ్దోత్పత్తి మానవకృత మని పలికినది మాక్సుముల్లరు మొదలగు నాంగ్లేయులాక్షేపకులమత మగును గాని హిందూమతసమ్మతము గాదు. ఆమతమే సిద్ధాంత మైనచో మన వేదములు మానవకృతములని పలుక వలసివచ్చును. అటులయినచో మనపూర్వమీమాంసాసిద్ధాంతులు దానికి సమ్మతింతురా? బహుసంవత్సరములుగ వచ్చినవాదమే యిది. ఆచార్యులవా రుపన్యసించినది సకారణముగ నున్న దని నాకుఁ దోఁచుచున్నది ఇట్టివిషయములే సభలో ముచ్చటింపఁదగినవి.

శబ్దోత్పత్తినిగుఱించి యాంగ్లేయభాషాప్రావీణ్యముగలసంస్కృతవిద్వాంసుఁ డొకఁడు వ్రాసినవిషయ మీదిగువ వ్రాసినాను.

"My researches convinced me that words, like plants, like animals, are in no sense artificial products, but growths,—living growths of sound with certain seed-sounds as their basis. Out of these seed-sounds develop a small number of primitive root-words with an immense progeny which have their successive generations and arrange themselves in tribes, clans, families, selective groups each having a common stock and a common psychological history. For the factor which presided over the development of language was the association, by the nervous mind of primitive man, of certain general significances or rather of certain general utilities and sense-values with articulate sounds The process of this association was also in no sense artificial but natural, governed by simple and definite psychological laws

In their beginnings language-sounds were not used to express what we should call ideas, they were rather the vocal equivalents of certain general sensations and emotion-values It was the nerves and not the intellect which created speech To use vedic symbols, Agni and Vayu, not India, were the original artificers of human language. Mind had emerged out of vital and sensational activities; intellect in man has built itself upon a basis of sense-associations and sense-reactions. By a similar process the intellectual use of language has developed by a natural law out of the sensational and emotional. Words, which were originally vital ejections full of a vague sense-potentiality, have evolved into fixed symbols of precise intellectual significances.

In consequence, the word originally was not fixed to any precise idea. It had a general character or quality (guna), which

was capable of a great number of applications and therefore of a great number of possible significances And this guna and its results are shared with many kindred sounds At first, therefore, word-clans, word-families started life on the communal system with a common right to all of them ; their individuality lay rather in shades of expression of the same ideas than in any exclusive right to the expression of a single idea The early history of language was a development from this communal life of words to a system of individual property in one or more intellectual significances. The principle of partition was at first fluid, then increased in rigidity, until word-families and finally single-words were able to start life on their own account The last stage of the entirely natural growth of language comes when the life of the word is entirely subjected to the life of the idea which it represents For in the first state of language the word is as living or even a more living force than its idea , sound determines sense In its last state the positions have been reversed , the idea becomes all-important, the sound secondary "

" కవిత్వతత్త్వము" బ్రహ్మశ్రీ, చింతలపల్లె నరసింహశాస్త్రిలగారు, కవిత్వతత్త్వమునుగుఱించి కడుముచ్చటగ నుపన్యసించిరి. అది యించుక కటువుగ నుండినను విషయ మట్టిదిగ నుండెను గావున వా రంతకంటెను దగ్గించి యుపన్యసింప సాధ్యము కాకపోయినది. వారు గొప్పపండితు లైనను, నాంగ్లేయభాషాప్రావీణ్యమునఁ గలుగునాగరకత నార్జించినవారు కారు. కవిత్వతత్వగ్రంధమును జదివి దానిలోని మనపెద్దలదూషణలను జూచి సహింపఁజాలక యత్నముమీఱి తాముసు నించుకకఠినముగ వ్రాసినారు. ఆకవిత్వతత్త్వగ్రంధమునుఁ జూడక వీరి కాఠిన్యముఁ జూచినఁ బ్రయోజనము లేదు. ఆకవిత్వతత్త్వము వ్రాసినవారు ప్రాక్పశ్చిమభాషాప్రావీణ్యము గలవారు. గొప్ప యధికారమును వహించినవారు. జ్ఞానాధికు లని ప్రసిద్ధిం జెందినవారు. అయినను నాకవిత్వతత్త్వములోఁ గొన్ని స్థళములందుఁ దమకలమునకు నేయంతరాయమునుఁ గలుగనీయకను నాలోచనమునకు నెడమీయకను విశృంఖలముగ మన పూర్వకవులను దూషించినారు. పాలుపోంగారనివారును, పూర్వాచారపరాయణులు నగుపండితులును, దానిం జూచి యించుక మనంబున నొవ్వకపోరు. అట్టిదానిని గొందఱు సహింతురు, కొందఱు సహింపరు. కవిత్వతత్త్వములోని దూషణవాక్యములు త్రోసివేసినచో మిగతభాగము సమంజసముగనే యున్నది. నే నిపుడు వారముక్రిందట నాపుస్తక

మును జదివితిని. నామానసమించుక నొచ్చెను గాని యీవయస్సున వివాదము నుండి లాభము లేదని వదలితిని కవిత్వతత్త్వములో దిక్కనగారిభారతశైలి మెచ్చఁబడినది కాని కొన్నివిషయములు దూషణీయము లని యాగ్రంథకర్తలు పుంఖానుపుంఖములుగ వ్రాసినారు.

కొందఱు కవులను గొన్నివిషయముల దూషించినారు, కొన్నివిషయముల భూషించినారు. వా రాంగ్లేయవిద్యానిపుణులు కావున విమర్శనతత్త్వమును జక్కఁగ నెఱింగి దూషింపఁ దగినవిషయమును దూషించుచు భూషింపఁ దగిన విషయములను భూషించుచు గొప్పగ్రంథమును వ్రాసినారు. అది మాకు రుచింపకపోయినది వారితప్పు కాదు. భిన్నరుచి గలమనుజులకు ననుకూలముగ గ్రంథము వ్రాయవలె ననుట గ్రంథకర్తలకు సాధ్యము కాదు. కవులు వ్రాయు నపుడు తమగ్రంథములను జదువుజనులయోగ్యత యింత యనియు వారి యోగ్యతకుఁ దగినట్టు గ్రంథములు వ్రాయవలె ననియు నాలోచనము చేయుట సాధ్యము కాదు. కవులు వ్రాసినగ్రంథములు కొందఱకు రుచించును, కొందఱకు రుచింపవు. దానికి గ్రంథకర్త లేమిచేయఁగలరు. కవిత్వతత్త్వమునుగుఱించి నృసింహ శాస్త్రిలవారు తమయభిప్రాయానుసారముగ వ్రాసినవ్రాఁతలోని గొన్నికటు శబ్దములఁ దొలఁగించినచో మిగతవిషయము శ్లాఘనీయముగ నున్నది. గ్రంథ ములు విమర్శించువారు శాంతమూర్తులుగ నుంట యపేక్షణీయము.

పండితవరులారా!

మనలోఁ జరిత్రములు వ్రాయువాడుక లే దని పాశ్చాత్త్యులు మనలను దూషించెదరు. ఇది వట్టిదూషణము, మనలోఁ జరిత్రము లనేకము లున్నవి. పాశ్చాత్త్యులు వానినిఁ జదివినను బిచ్చికూఁత లని నమ్మరు. అతిపురాతనచరి త్రము ఋగ్వేదము. రెండవచరిత్రము బ్రాహ్మణములు, మూఁడవచరిత్రము పదు నెనిమిదిపురాణములు, ఇతిహాసములు. నాల్గవచరిత్రము బౌద్ధగ్రంథములు. అయి దవది స్థళమహిమలు. ఆఱవచరిత్రము శాసనములు. ఈశాసనములు మూఁడు నాల్గువిధములుగ నున్నవి.

శబ్దశాసనము, మృచ్ఛాసనము, అనేకసహస్రవత్సరంబులక్రిందటనే భూమి లోఁ బూఁడిపోయినయిటికలపై నక్షరములతోఁ జరిత్రములు వ్రాసియుంచిన విధ మిపుడిపుడు వెలువడుచున్నది. మూఁడవవిధ మగుశాసనము లోహరూప ముగ నుండును. ఇవి యిండియాలో ననేకులయిండ్లలో నున్నవి. కొన్ని పోయి

నవి. నాల్గవది శిలాశాసనరూపముగ నుండును. ఇప్పటిపత్త్రశాసనములుగాని మృచ్ఛాసనములుగాని లోహ మనఁగాఁ దామ్రశాసనములుగాని శిలాశాసనములుగాని గొప్పయాపదలకు నిలుచునవి కావు కావుననే పురాతనార్యులు తమప్రాచీనచరిత్రమును వాఙ్మూపమునఁ దమయందే యుంచికొని వంశపారంపర్యముగ నాచరిత్ర శాశ్వతముగ నిలుచులా గొనరించిరి. మతవిరోధులదౌష్ట్యమున శిలాశాసనములేగాక యితరశాసనములుసైతము ఖిలాక్షరము లయ్యెను. అటులైనను బెక్కుశాసనములు హతశేషములై దాఁచికొనియుండెను. ఫ్లూలర్, విన్సెంట్‌స్మిత్, రాబర్టుస్యూయల్, హంటర్, మొదలగువారు భరతఖండనివాసులమూల్యము లగుశాసనములను భద్రపఱచికొని యుపయోగింప లేరని తలంచి తాఁబోలు సకలవిధశాసనములను సేకరించి వానియాధారముపైఁ బురాతన హిందూచరిత్రము లని గొప్పగ్రంథములు వ్రాయుచున్నవారు. వ్రాయనిండు మనకది క్షేమమేను భరతఖండము వసుమతిగ నున్నది. ఎవరేవస్తువు లెన్నితీసికొని పోయినను నేకొదవయును లేదు. కొన్నివిధము లగుశాసనములు భూమిలోఁ బాఁతఁబడినవి. కొన్నిమూలమూలలలో దాఁగినవి. కొన్ని హిందువుల దేవతార్చనపేటికలలో భద్రపడినవి. వాని నిపుడు మనవా రన్వేషించుచున్నవారు. అట్టివారిలో బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులవా రొక్కరు. ఉండియును మనకంటికి నిపు డగపడనిసకలశాసనములు దొరకినచో మనపురాతనచరిత్ర మంతయును గగతలామలక మగు నని నానమ్మకము. శాసనసాక్ష్యము లేక మన మేమి వ్రాసినను బాశ్చాత్త్యులు సమ్మతింపరు. పాశ్చాత్త్యుల దేశాభిమాన మెంతయో చెప్ప నలవికాదు హెలన్ అనుగ్రీకుసుందరినిఁ బారిస్సను యువానుఁ డెత్తికొనిపోయినకారణంబున ట్రాయియుద్ధము జరిగిన దని మేము నమ్మవలయు నఁట. సీతను రావణుఁ డెత్తికొని పోయినకారణంబున రామరావణయుద్ధమైనది తాము నమ్మరఁట. రామాయణములోని యాకాశమార్గయుద్ధము, పాతాళలోకయుద్ధము పిచ్చి వాఁడు వ్రాసినవ్రాఁత యఁట. మనవిమానశాస్త్రమళీకమఁట. ధర్మోపత్ ఆజన్‌కోర్టుయుద్ధములు నిజమఁట. భారతయుద్ధ మబద్ధమఁట ఈయుద్ధములనుగుఱించి తాము వ్రాసినది చరిత్రయఁట. మనపురాణములు పుక్కిటికథలఁట. ఈవిచిత్ర మేమో నాకుఁ దెలియదు మఱియొక విశేషమేమన, మనయార్యు లతిపురాణపురుషులనియు వారిమతగ్రంథము లతిపురాతనములనియు స్థాపించుటకు మనము యత్నించుచున్నాము. ఆర్యులంతటిపురాతన

ము వారు కారనియు, వారిగ్రంథము లంతటిప్రాచీనములు కావనియు స్థాపించుటకుఁ బాశ్చాత్యులు సాహసించుచున్నవారు. ఈవాదముల నిజస్థితులు స్థాపింప శాసనములుతప్ప మఱి యేవిధ మగుసాక్ష్యము దొరకదు. కావున నేయేకాలమునందు భాష యెటులుండినదియు, దేశ మెటులుండినదియు, రాజులెవరుండినదియు వారే యేరాజ్యములు సాధించినదియుఁ, దెలుపుటకు శాసనము లమూల్యసాక్ష్యము లని మన మెన్నఁదగును. ఇట్టియమోఘామూల్యము లైనశాసనములను బెకలించి యెద్దియో యొక్కస్థానమునఁ జేర్చినచోఁ బిదప వానిస్థలనిర్దేశమును స్థిరీకరించుట కష్ట మగుటయ కాక, యాస్థలమహిమ తక్కువ యగును. స్థలమునుఁ జూచి శాసనమును జదివినపుడు మానసమందుఁ గలుగుముదము, శాసనమాత్రము చదువుటయందుఁ గలుగదు. శాసనములు లేనిస్థలములమహిమ లచ్చటివారి నోట వినినను, విశ్వాస మంతగ జనింపదు. ఓరంగల్లును, నచ్చటిదేవాలయములను నచ్చటికోటలను, గొండనుఁ జూచి యచ్చటిశాసనములు చదివినతోడనే ప్రతాపరుద్రునిచరిత్ర మంతయును గంటికిఁ గట్టినట్టుండును. విరూపాక్షమునకుఁ బోయి, యచటిదేవాలయములను, బాడుపట్టనమునుఁ జూచి యచటిశాసనములు చదివినపుడు కృష్ణదేవరాయలయొక్కయు వారివంశజులయొక్కయు విజయచరిత్ర మంతయు నెదుట నిలిచినట్టగపడి మానసమం దెద్దియో యొక విధ మగుతలంపు జనించును. కావున శాసనము లెచటివి యచటనే యుంచుటయందు స్థలచరిత్రమునకు వన్నెఁబెట్టి వెల హెచ్చించినట్టగు ననుటకు సందియము లేదు.

పండితవరులారా :—

"అదితి" యెటులు మేరలేనిది యైనదియో యటులే సాహిత్యభాషార్ణవమును మేరఁగానక పొంగి బ్రహ్మాండమునిండి పొర్లుచున్నది. దానిలో నొక బిందు వైనను నాది యని పలుకఁజాలను. దైవానుగ్రహమువలనను సభ్యు లగు మీయనుగ్రహాతిరేకమువలనను నెద్దియో యొకవిధముగఁ దీరముఁ జేరితిని. చిలుకపలుకులంబలెఁ బలికిననాపలుకుల శాంతమూర్తులై వినుకతంబుననే నన్నాదరించినసభ్యు లగుమీకుఁ ద్రికరణశుద్ధిగ వందనము లర్పించెద. ఏమియుఁ దెలియనిన న్నొకపెద్దవానిఁగ నొనర్చి యింతటిసభకు నధ్యక్షునిఁగఁ జేసి, చేసినతప్పునుగాపాడుటకై నన్ను రక్షించినయీ "ఆంధ్రసాహిత్యపరిష" త్సభ్యులకు మనఃపూర్వకముగ నమస్కరించుచు వారిని సదా సంస్మరించుచుం

జెద. దుర్బలుఁ డగునన్నొకనినేగాక, యతిథుల నెల్ల, నెల్లవిధముల సత్కరించి తమసనాతనధర్మంబుఁ గాపాడికొని కృతకృత్యులైనయీకడపమండలాధివాసులను వారిసమ్ముఖముననే పొగడుట ముఖస్తుతి యగును గావున మానసముననే తలంచెద.

మహాశయులారా :—

స్వేచ్ఛగఁ బెద్దలకు శుశ్రూష యొనరించుచు మనలనెల్ల రక్షించుచుండు నీబడిబాలురు మీదీవెనల నిరీక్షించుచున్నవారు. సంవత్సరములుగఁ బిత్రార్జిత ధనము వంతయును వెచ్చపెట్టి యహోరాత్రములు గుండె త్రుళ్లులాగునఁ గంటిలో వత్తినిడికొని చదివి ప్రశ్నపత్రికలు వచ్చినపుడు వానింజూచి నిశ్చేష్టత నంది నిరాశు లగుటయ కాక కొందఱు నిరసువు లగుచున్నవార మనియు, వేయఁబడు ప్రశ్నలు బాలురు చదువుకొనినారా లేదా యనిపరీక్షింపఁదగినవిగ నుండవలెను గాని ముక్కులోనివెండ్రుకలు పీఁకునట్టివిగ నుండరా దనియు మనవిఁ జేయుచున్నవారు. అట్టిఫలార్థులై మిమ్ము నాశ్రయించినారు. ఎట్లైనను బాలురమనోరథము సిద్ధింపఁజేయవలె నని మిము వేఁడుచున్నవారు. కావుననే మిము నాశ్రయించినారు. వారికోరికి నెఱవేర్పఁజేయునది మీభారము.

ఈయెండవేఁడిమినుండి సర్వులను బ్రాణంబున రక్షించినసర్వేశ్వరునకు సాష్టాంగప్రణామంబు లాచరించి మీయనుజ్ఞచే నిపుడీసభాకార్యంబుఁ జాలించెద.

కోలాచలము శ్రీనివాసరావు.



శ్రీమదొంటిమిట్టకోదండరామస్వామినేనమః.

# ఒంటిమిట్ట—పోతనామాత్యుఁడు.

(1917 సం॥రం ఏప్రెల్ 8-ది కడపలోఁ జదువఁబడిన యుపన్యాసము.)

## ప్రథమభాగము.

ఆ సత్యధర్మమూర్తి సత్యధర్మప్రతి
ష్ఠాపకుండు రామచంద్రవిభుఁడు
నాదువాక్కునందు నయమారఁగానిల్చి
సత్యవచను నన్ను సలుపుఁగాత!

మహాశయులారా!

శ్రీమదాంధ్రభాగవతము రచియించిన పోతనామాత్యుఁ డేగ్రామమం దుండి యామహాపురాణమును దెనిఁగించె ననువిషయ మీవ్యాసమునఁ జర్చింపఁబడును.

### (1) వ్యాసరచనకుఁ గారణము.

1. సత్య మెఱిఁగినపూర్వమహనీయులు పోతనామాత్యుఁ డొంటిమిట్ట యని తెనుఁగునను, ఏకశిలానగర మని సంస్కృతమునను బేరుగన్న గ్రామమున నుండె నని వ్రాసిరి. పురాణము హయగ్రీవశాస్త్రులవారు లోనగువారీకోటిలోనివారు,

తరువాతివారు కొందఱోరుగంటికిని నొంటిమిట్టకును నేకశిలానగర మనిపే రుండుటచేత భాగవతమునఁ జెప్పఁబడిన యేకశిలానగర మేదియో యిదమిత్థమితివక్తవ్యతామూఢులై ద్వాపరబుద్ధులై యెటు చెప్పఁజాలక సందిగ్ధముగా వ్రాసిరి. ఆవెనుక నొంటిమిట్టవిషయ మేమియు నెఱుఁగనివారు ప్రతాపరుద్రీయమున నోరుగంటికి నేకశిలానగర మని యుండుట క్రొత్తగాఁ గాంచి వారు చదివినపుస్తకములలో నెందును నొంటిమిట్టకు నేకశిలానగర మనుపేరు లేకుండుటచే లోకమున నేకశిలానగర మొక్కటియే యని భ్రాంతులై బోడితలలకు మోఁకాళ్లకు ముడిపెట్టినట్టులు వేనికో వేనికో ముడిపెట్టి పత్రికలయందు నూతనముగఁ దా మొక గొప్పవిషయము కనిపెట్టినట్లు విజృంభించి వ్రాసిరి.

ఈకడపటి రెండు తెగలవారును మూఁడవయేకశిలానగర ముండుట యెఱుంగరు అది యెఱింగియుండిన మఱేమి చిత్రములు వ్రాసియుందురో.

ఆంధ్రవాల్మీకిరామాయణమున బమ్మెర పోతనామాత్యుఁ డొంటిమిట్టవాఁడని వ్రాయఁబడియుండుటఁగాంచి యావాదిప్రతివాదులలోఁ గొందఱు నాకుఁ గలయాధారములను దెలుపఁగోరిరి గాని వివాదప్రీతి లేనివాఁడ నగుటచే నే నెవ్వరికిఁ బ్రత్యుత్తర మీయనైతిని. ప్రాజ్ఞుఁ డెవఁడైన సత్యమును స్థాపింప యత్నింపఁడా యని యూరకుంటిని.

నాకు నుత్తరములు వ్రాసినవా రంద ఱీవ్యాసమునే తమయుత్తరములకుఁ బ్రత్యుత్తరములుగ భావించి నన్ను క్షమింతురుగాక.

2. ఇట్లుండ బొమ్మెర, యేర్పూరు, వెలిగందల యనుగ్రామములు గోలకొండదేశములో నున్నవని తెలిసికొని బ్ర॥శ్రీ॥ జయంతి రామయ్యపంతులవారా పేరిగ్రామము లాంధ్రదేశమున మఱెందు లేవా యని విచారింప తొందరపడి తమపూర్వాభిప్రాయమును దటాలున మార్చుకొని యీవిషయము కొంత చర్చించి “ నేఁజెప్పిన హేతువుల నొక్కటొకటిగా విడఁదీసి పరిశీలించి నచోఁ గొన్ని యిటు కొన్ని యటు మ్రొగ్గవచ్చును, కాని యాధారముల నన్నిటి సమష్టిగా నిష్పక్షపాతబుద్ధితో విమర్శించినయెడల నోరుగంటివారి వాదమే నిలుచు నని నాయభిప్రాయము.” అని రాక్షసనామసంవత్సర మాఘఫాల్గునముల యాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందుఁ దమయభిప్రాయమును బ్రకటించిరి.

వీరు పండితులు, గ్రంథశాసనశోధకు లని ప్రసిద్ధులు. న్యాయవాదిపరీక్షయం దుత్తీర్ణులై న్యాయాధిపతిపదవి నలంకరించి యుండువారు. కావుననే చమత్కారోక్తుల యుక్తుల సమర్థులు. ఇట్టివా రిట్టియభిప్రాయ మిచ్చినపు డొంటిమిట్టవారివాద మడుగంటినట్టు లయ్యెను. కావున నామిత్రు లనేకులు నన్నుఁ బ్రేరించుటచేతను, నేను సత్య మని నమ్మినది యసత్యముచే బాధపడుచుండుటను, ఆంధ్రవాల్మీకిరామాయణమున వ్రాయఁబడినది యవిచారమూలకము గా దని తెలుపుటకును, నొంటిమిట్టవారిపక్షమునఁ జెప్పవలసిన కొన్ని విషయములు చెప్పక యోరుగంటివారిపక్షము క్లిష్టకల్పనలచేతను, నపోహముల చేతను సమర్థించి యుండుటచేతను, నాకుఁ దెలిసినంతవఱకు సత్యమును స్థాపించుటకు నే నీవ్యాసము వ్రాయవలసివచ్చెను.

**3.** ఆర్యులారా ! యింతవఱకు బమ్మెరపోతరా జొంటిమిట్టవాఁడా యోరు
గంటివాఁడా యనియే కొందఱు సందేహించుచుండిరి. పంతులవారు తమవ్యాస
మునకు ననుబంధములఁ గొన్ని ప్రకటించిరి. ఈయనుబంధములు గోల్కొండదేశ
మందు బొమ్మెర, యోరుగల్లు, రెండు నున్నవనుటకు నాధారము లగును గాని
తక్కినవిషయముల నోరుగంటివారి వాదమునకుఁ బ్రతిబంధకములే. వానివలన
బొమ్మెరగ్రామమువారు పోతనామాత్యుఁడు తమగ్రామమం దుండెనని చెప్పు
చున్నట్లు లేర్పడుచున్నది. అనుబంధములందలి విషయములు సత్యము లైనచో
నోరుగంటివారివాదము కూడ మూలఁబడుచున్నది. అక్కడైశ్వర్యమును జూచి
చెల్లెలు చేయివిఱుగఁబడె నన్నట్టులు బొమ్మెరవారివాదమును బురస్కరించుకొని
యోరుగంటివాదులు తమపక్షము జయించె ననుకొనుటే వింతగానున్నది. బ్రll
శ్రీll రామయ్యపంతులవా రావిషయమై యేమియు వ్రాయక విడుచుటే కాక
బొమ్మెరవారివాదమును దమయోరుగంటివారివాదమున కుపబలముగఁ బరిగ్ర
హింప సాహసించిరి.

ఇప్పుడు పోతనామాత్యుఁ డొంటిమిట్టయం దుండెనా, యోరుగంటియం
దుండెనా, బొమ్మెరయం దుండెనా యని విచారింపవలసియున్నది. ఇంతవఱకు
నాకీవిషయమై సందేహ ముండినను బంతులవారి వ్యాసమును జదివినపిమ్మట
నాసందేహము లన్నియుఁ దీరెను. పోతనామాత్యుఁ డొంటిమిట్టయం దుండె
ననుటే సమష్టిమీఁదఁ జూచినను, వ్యష్టిమీఁదఁ జూచినను సమంజస మని
నిశ్చయించుకొంటిని. కావున నొక్కొక్క గ్రామమువారివాదమును విమర్శిం
చెదను. ఉభయవాదముల నిరసూయబుద్ధి పరిశీలించిన నిష్పక్షపాతులే సత్యము
స్థాపింప సమర్థులు. ఇట్లనుటచే నోరుగంటివాదు లెవ్వరేని తమయందు నేను బక్ష
పాతదోష మారోపించితి నని భ్రమింపఁ గారణము లేదు. ఉన్నవిషయమును
విపర్యస్తముచేసి నూతనవిషయము నొకదానిని గనిపెట్టి భ్రాంతిమంతమైన
యాంధ్రలోకమునకు వాస్తవము నెఱిఁగించి భ్రాంతిఁ దొలఁగించితి మనుమమ
తాహంతలును గీర్తికాంక్షయును వారికి మనస్సులో నుండిన నుండవచ్చును
గాని నాకట్టి యాశ పుట్టఁ గారణమును లేదు. పోతనామాత్యుఁడు గోల్కొండ
దేశమువాఁ డని గోల్కొండవేపారుల పూర్వుఁ డని చెప్పుటచే గోల్కొండదే
శము వాఁడను గోల్కొండవేపారియు నగునాకు నోరుగంటివాదులు వంద్యులే.
అయినను సత్యమునకు విరోధముగ నుండు దేశాభిమానము గాని జాత్యభి

మానముగాని శ్లాఘ్యము గాదు. పోతన గోల్కొండవాఁ డని యేర్పడిన నాకును సంతోషమే. అయినను దెలిసినవిషయము దాఁపరాదుకదా.

(2) బొమ్మెరవారివాదము.

4. బొమ్మెర యనుగ్రామ మోరుగంటికి 14 కోసుల లో ననఁగా రమా రమి 35, 40 మైళ్లలో నున్నదఁట. పోతరాజుగారి బమ్మెర యీబొమ్మెర(?)యే యఁట. ఈబొమ్మెరయందుఁ బోతరాజుగా రుండి రఁట. ఆగ్రామవాసులు వారి ప్రతిబింబముగా నొకరాతిని నిలిపి దానిని బోతరా జందు రఁట. ఇది గ్రామదే వత కాదఁట. బొడ్డురాయి యఁట, గ్రామదేవత వేఱే యున్నదఁట. ఈగ్రామ మందే బమ్మెర పోతరాజుగారు భాగవతము రచించుకాలమునఁ బొలము దున్ను చుండఁగా శ్రీనాథుఁడు వచ్చి బోయలు లేకుండఁ బల్లకి మోయింపఁగాఁ బోత రాజుగారు దున్నపోతులు లేకుండ మడక దున్నించినారఁట ఈగ్రామమునందుఁ బోతరాజుగారు భాగవతము "చెప్పినట్టున్నదఁట." వీరివంశమువారు రామభక్తు లఁట. వా రిప్పు డాగ్రామమున కధికారులుగ నున్నారఁట. వారి యింటిపేరు నల్లుట్లవారఁట. ఈవంశములోని కడపటిపురుషుఁడు వికారిసంవత్సరములో మర ణించెనఁట. వీరు గోలకొండ వేపారులఁట. వీరియింట జీర్ణదశమస్కంధముమాత్ర మున్నదఁట. తక్కిన భాగవతముపుస్తకమును లేదఁట. ఇది యనుబంధముల సారాంశము.

5. ఈయనుబంధములను నమ్మితిమేని బమ్మెర పోతరాజుగారు బొమ్మెర యం దుండియే భాగవతమును రచించినట్టు లేర్పడుచున్నది. కాని దీనిని బం తులవారు గూడ నంగీకరింపలేదు. వారు భాగవతవాక్యమునే ప్రమాణముగఁ గొని యేకశిలానగరమందే కృతి రచింపఁబడె నని తీర్మానించిరి. బొమ్మెరవారి వాదమునకనుకూలముగ భాగవతమం దొకవాక్యము గాని శబ్దము గాని లేదు. "బమ్మెర పోతరాజొకఁ"డని మాత్రము కానవచ్చుచున్నది. బమ్మెర యనునది గృహ నామము కావున నాగ్రామమందే యాయన యుండెననుట కాధారము కాఁజా లదు. ఈ కారణముచే బొమ్మెరవారివాదము నిరాధార మగుచున్నది

6. పోతరాజుగారు బొమ్మెరవాసులై, యం దుండియే గ్రహణస్నాన మునకు భాగీరథికిఁ గాని యాగ్రామజనులు చెప్పునట్లు, 140 మైళ్లదూరములో నుండు గోదావరికిఁ గాని పోయి యుండిరా మరలి వచ్చుచో నడిత్రోవలో నేక

శిలానగరమున నిలువఁగారణము లేదు. ఈ కారణమును దెలుపుభారము బొమ్మెర వారియం దున్నది. పోతరాజుగా రేకశిలానగరమునఁ గృతిరచించితి ననినమాట యసత్య మని బొమ్మెర. .రు సిద్ధాంతము చేయువఱకు వారివాదమును లోకము విశ్వసింపదు.

7. "పోతరాజుగారికాలంలో బొమ్మెరవా" రని యున్నట్లు వెల్లంభట్ల రామకృష్ణయ్యగారు వ్రాసియిచ్చిన యనుబంధపత్రమున నున్నది. వీరే "య. రామకృష్ణశాస్త్రి" యనుపేర వేఱొకయుత్తరము వ్రాసియిచ్చిరి. పోతరాజు గారివంశ్యులు నెల్లుట్లనుండి బొమ్మెరకువచ్చిన కారణముచే నెల్లుట్లవా రనిపిలు వఁబడుచున్నారఁట. వీరికి రాయబండారువారికి నేమి సంబంధమో వా రేగ్రా మవాసులో తెలియలేదు. వీరికిఁ బూర్వులు పోతరాజు గారఁట. వారు "బొమ్మె ర" యందుండిరఁట. వారు "బొమ్మెరయం దుండఁగానే బమ్మెరవా రనుపేరు గలవా రైరఁట. వీరో వీరివంశ్యులో బొమ్మెర విడిచి నెల్లుట్ల కేలపోయిరో యె ప్పుడు పోయిరో తెలియలేదు. వారు మరల బొమ్మెర కేలవచ్చిరో బొమ్మెరవా రనుపేరు మాసిపోవఁ గారణ మేమో. ఈవిషయము లేవియుఁ బంతులవారు చర్చింపరైరి.

8. బొమ్మెరగ్రామమం దుండఁగాఁ బోతరాజుగారికి బమ్మెరవా రనుపేరు వచ్చిన దనుట విశ్వసనీయము గాదు. ప్రబలకారణములేక వచ్చినపేరు పోయిన దనుటయు నమ్మఁదగినదికాదు. ఒకకుటుంబమువా రొకగ్రామములో నివసించుచుం డువఱకు నాగ్రామముపేరు వారియింటిపేరుగా నుండుట యరుదు వా రాగ్రా మము విడిచి వేఱొకగ్రామమునకుఁ బోయియచ్చటఁ గుదిరినపుడే వారిస్వగ్రామ నామము గృహనామముగా నగుచుండుట యెల్లవారికి విదితము. ఇది లోకాను భవసిద్ధము. ఏపట్టనమందుఁ గాని పల్లెలయందుఁగాని విచారించినచో నాపట్టన గ్రామనామము లింటిపేరుగఁ గలవారు పదివేల కొక రెండైన నుందురో యుండరో. ఒకకుటుంబమువారు తమగ్రామము విడిచి వేఱుగ్రామములఁ గొన్ని నాళ్లుండి యక్కడ స్వగ్రామనామము గృహనామముగా రూఢిపడినపిమ్మట మరల నేదేని కారణముచే స్వగ్రామమునకు వచ్చి వసింపఁగలిగిరేని యప్పుడు వారి గృహనామము గ్రామనామము నొక్కటిగ నుండును, కావున, బమ్మెరపోతరాజు గారు బమ్మెర(బొమ్మెర కాదు) గ్రామమందుండు వఱకు వారికి బమ్మెరవా రను పేరు వచ్చి యుండదు. కావున వారు గ్రామాంతరవాసు లయినపిమ్మటనే భాగ

వతమును రచియించి యుండవలయును. ఈవిధముగఁ జూచినను బొమ్మెరవారి వాదము నిలువదు.

9. సమీపగ్రామములలో నిరువురు ముప్వురు ప్రసిద్ధులు పోతరాజు లుండిరేని యందొకరిని గుర్తించుటకు బమ్మెర పోతరా జని లోకులు పిలిచి యుండిన నుండవచ్చును. ఇది స్థాపించుభారము బొమ్మెరవారియం దున్నది. ఒకవేళ నటులుండెనేని వాదమునకై యూహింతమన్నను బోతనామాత్యుఁడు తన్ను బమ్మెరపోతరా జని వ్రాసికొని యుండఁడు.

ఆంధ్రులలో నింటిపేరు లేనివారు లేరు. కావునఁ దనవంశమున కప్పటి కున్నపేరే పోతన వ్రాసికొని యుండును. ఎట్లనః. పొత్తపి యనుగ్రామమునకుఁ బెంచలయ్య యనునాయన కరణముగా నుండినవో లోకు లాయనను బొత్తపి పెంచలయ్య యనివాడుట కలదు గాని యాయన తనపేరు వ్రాయవలసివచ్చి నప్పుడంతయుఁ దనయింటిపేరు పెట్టి మల్లవరపు పెంచలయ్య యనియే వ్రాయును. గాని పొత్తపి పెంచలయ్య యని వ్రాసికొనఁడు.

ఈవిధముగఁ జూచినయెడల రామకృష్ణశాస్త్రిగారిమాటలు నమ్మరాని వని యేర్పడుచున్నది.

10. ఇఁకఁ బోతరాజు శిలను గుఱించి యాలోచింతము. ఇది గ్రామమునకు బొడ్డురాయియఁట. ఈకాలికిఁ బోతరాజకవి వరేణ్యుపేరు పెట్టినారఁట. ఈవిషయమున రామకృష్ణశాస్త్రిగారి వాక్యముల ననువదించుచున్నాను. "ఇక్కడ పోతరాజు అనేది గ్రామదేవత కాదు. గ్రామదేవత గ్రామమధ్యమున నుంట్టుంది. దీనికి బొడ్డురాయి అని అంటారు దీనికి బ్రాహ్మణులు పూజచేయరు. వెనుకటినుంచి పోతరాజుకు ప్రతిబింబం అని అనుకోవటం వాడుక." విజ్ఞులారా! ఈవాక్యములను మీరు హెచ్చరికతో నన్వయింపవలయును. "దీనికి బొడ్డురాయి" అనుచో, దీనికి అనఁగాఁ బోతరాజశిల కని యన్వయించితిని. దీనికి బ్రాహ్మణులు పూజచేయ రనుచో, దీనికి ననఁగాఁ, బోతరాజశిల కని యన్వయించితిని. ఈయన్వయము తప్పని యీశిల బ్రాహ్మణులచేఁ బూజింపఁబడుచున్న దని యది మఱియేదో వాక్యముతో నన్వయింపవలయు ననిరి. అది బొడ్డురాయి యే యయి పూజగొనక పోయెనా యది పోతరాజు బింబము కానేరదు నేను జేసిన యన్వయము తప్పో యొప్పో మీరే యాలోచింపఁ గోరెదను.

ఆరసిచూడ నీశిల పోతురాజుశిలయై యుండవచ్చును. బమ్మెర బొమ్మెర యైనట్టు పోతురాజు పోతరాజై యుండవలయును. ఈపోతురాజు విగ్రహములు గంగమ్మ, పోలేరమ్మ లోనగు గాలిగంగల సంవత్సరోత్సవములలో మెఱవడి చేయు ట మీరంద ఱెఱింగినవిషయమే. దీనినే వాడుకలోఁ బోతరా జందురు. నామ సామ్యమునుబట్టి బొమ్మెర పోతురాజు భాగవతగ్రంథకర్త యైన బమ్మెర పోత రాజై యుండవచ్చును. అవురా గాని యదృష్టము. శిలాభోగమన నిట్టిదేమో.

ఈవిషయమున రామయ్యపంతులవారు "ఈదేవతనుబట్టియే కవికా నామము కలిగిన దనుట యెక్కువ యుక్తముగా నుండును" అని బొమ్మెర వారి మాటను దలక్రిందుచేసిరి. వీరియూహయందు విపరీత మేమియు లేదు. కావున నంగీకరింపవచ్చును. కాని పోతరాజులు గ్రామగ్రామమున నుండుటచే నేయూరిపోతరాజును బట్టియైనఁ గవి కాపేరు వచ్చియుండవచ్చును. బొమ్మెర లోని రాతినిబట్టియే కవి కాపేరు వచ్చిన దని పంతులవా రెట్లు స్థాపింపఁగలరో.

11 తొలుత బొమ్మెరయే బమ్మెర యనునది యెంతనిశ్చయమో. బమ్మెర యను గ్రామము మఱొకటి యాంధ్రదేశమున నున్నట్టు లేదు, అని పంతులవారే సందేహముగాఁ జెప్పిరికదా. తా 'మధికారపదవి నలంకరించిన మండలమందుం డిన యేల్చూరే యేర్చూరని పంతులవారు తెలిసికొనఁజాలక యుండియు నెందో యుండిన బొమ్మెరయే బమ్మెర యని సాధింపఁజూచుటయు బమ్మెర యనునది యాంధ్రలోకమున లే దని వ్రాయసాహసించుటయు వింతగొల్పెడి. ఆంధ్ర ప్రపంచమున నుండు పల్లెలపే ర్లన్నియుఁ దెలిసిన సర్వజ్ఞుఁ డీమాటచెప్ప నర్హుఁడు. 400 సంవత్సరముల కీవల నెన్నిగ్రామములు నామావశిష్టము లైనవో యెన్ని పే రైనను వినరాకపోయినవో యెవఁడు చెప్పఁగలఁడు. కావున నాలుగువందల సంవత్సరములకుఁ బూర్వము బమ్మెర యనుగ్రామము వేఱుగ లే దనియు నీబొ మ్మెర యే పూర్వము బమ్మెర యనియు నిట్టిట్టికారణములచే నిట్టుమాఱె ననియు నేర్చూరికి నేను గనఁబఱిచినట్లు కనఁబఱుచు వఱకుఁ బంతులవారిమాట పాటిం పరాదు.

ఆయూరివారి వాక్యము విశ్వసించి తాము చెప్పుచున్నా మని పంతులవారందు రేని "వేములవాడ భీమకవి విశ్రుతవాక్యము దీనినమ్ముఁడీ" యను చాటువు, దక్షా రామభీమేశనందనుఁడఁగ" అనుగ్రంథస్థవాక్యము, జనశ్రుతి నిన్నిటిని నిరసించి వేములవాడ భీమకవి గాఁడు, లేములవాడభీమకవి యని సాధింప యత్నించు

వీరీవిషయమునఁ దగినవిమర్శము చేయక గ్రామజనులవాక్యము నమ్ముట ఋజు పద్ధతి గాదని చెప్పవలసివచ్చును. లేములవాడను బొరపాటున వేములవాడ యని పఠించి భీమకవి యచ్చటి వాఁడని లోకులు భ్రాంతిపడుచున్నా రని పంతుల వారెట్లు తలంచుచున్నారో యట్లే బొమ్మెరను బమ్మెర యనుకొని వారు భ్రాంతు లగుచున్నా రని యొంటిమిట్టవాదు లనుచున్నారు. రెండు నొకటే యని సప్రమాణముగ స్థిరీకరింప వలసినభారము పంతులవారియం దున్నది.

ఓయీ! కంఠసౌష్ఠవము లేని యన్యదేశజులచేతను, వారిననుకరించుట గొప్పతనమనుకొను స్వదేశమూఢులచేతను, జదువురాని "సర్వే"వారిచేతను, బీఠాపురము, పిఠ్ఠాపురమని, రాజమహేంద్రివరము రాజమండ్రియని పులివెందల పులివెండ్ల యని యిట్లుపేర్లువికారములు పొందుచుండుట యెఱింగిన నీవేల బమ్మెర బొమ్మెర గా మాఱియుండుటను సందేహించెద వని మీఁరడుగవచ్చును.

మాఱిన మాటియుండవచ్చును గాని వివాదవిషయమున నెదుటివారు మనల నెట్టిప్రమాణములు గోరెదరో యట్టిప్రమాణములను మనము వారిని గోరుట తప్పా? అంగీకరించినఁ బ్రమాదము లేనిచో నంగీకరింపవచ్చును గాని యది యనర్థమునకుఁ గారణ మగునేని నిర్విచారముగ నంగీకరింపరాదు. కించిద్భేదముతో రూపసామ్యము గలనామములు గలగ్రామము లంధ్రదేశ మునఁ బెక్కులు గలవు. అందుఁ గొన్ని విన్నవించెదను.

| | | | |
|---|---|---|---|
| ఏకనాపురము | ... | ... | కాంచీపురముతాలూకా |
| నేకనాపురము | ... | ... | సిద్ధవటముతాలూకా |
| రావులకోలను | | ... | ప్రొద్దుటూరుతాలూకా |
| రావులకొల్లు | | ... | సిద్ధవటముతాలూకా |
| కడప | ... | ... | కడపతాలూకా |
| కుడప | ... | ... | తిరువూరుతాలూకా |
| కదిరి | ... | ... | కదిరితాలూకా |
| కుదిరి | ... | ... | పోలూరుతాలూకా |
| పులివెందర | ... | .. | పోలూరుతాలూకా |
| పులివెందల | ... | ... | పులివెందలతాలూకా |
| అలిమేలుమంగాపురము | | ... | చంద్రగిరితాలూకా |
| అలివేలుమంగాపురము | | ... | వేంకటగిరితాలూకా |

| | | | |
|---|---|---|---|
| కంపసముద్రము | ... | .. | రాజంపేటతాలూకా |
| కెంపసముద్రము | . | ... | హొసూరుతాలూకా |
| తిడ | ... | ... | అనకాపల్లితాలూకా |
| తడ | ... | ... | నెల్లూరుజిల్లా |
| జయతి | ... | ... | గజపతినగరముతాలూకా |
| జయంతి | ... | ... | నందిగామతాలూకా |
| గోల్కొండ | ... | ... | నిజామురాష్ట్రము |
| గొల్లకొండ | ... | | విశాఖపట్టనముజిల్లా |
| వావిలపాడు | ... | . | శృంగవరపుకోటతాలూకా |
| వావిలిపాడు | ... | | చంద్రగిరితాలూకా |

ఇట్టివి పెక్కులు గలవు. బమ్మెర - బొమ్మెర యిట్టివై యుండవచ్చును. ఇన్నాళ్లవఱకు బొమ్మెర తెలియరానట్టే యిప్పటికి బమ్మెరయునికి తెలియరాకుండవచ్చును. అట్టిది యుండి నామావశేషమై యుండవచ్చును. ఇన్ని సందేహము లుండుసందర్భములో బమ్మెర బొమ్మెర యొక్కటియే యని యెట్లు తటాలున నంగీకరింపవచ్చును.

**12.** పోతనామాత్యుని వంశమువారు బొమ్మెరయం దున్నారఁట. వారు పోతనవంశ్యులో వారియన్నగారివంశమువారో లేక జ్ఞాతులో యెట్లెఱుఁగనగు? పోతనామాత్యునుండి నేఁటివఱకు నాయనవంశవృక్షము నవిచ్ఛిన్నముగా వ్రాసియుంచినవా రెవరో! మాయింటిపేరి గ్రామమందు మాబంధువు లున్నారు, మే మిందున్నారము. ఈమాత్రముచేతనే నేను వావిలికొలనిగ్రామనివాసి నని చెప్పనగునా? ఇట్టిసంబంధమే బమ్మెరను బోతరాజుగారికి నుండవచ్చును బొమ్మెరవారి వాదవిషయమున సందేహింపఁదగినవి యింకను గలవు గాని యవి యిప్పు డప్రస్తుత మగుటచే నింతతో దాని విచారము మాని యోరుగంటివారివాదమును బరిశీలించెదను.

3 ఓరుగంటివారివాదము.

**12.** ఏకశిలానగర మని పోతరాజుగారు చెప్పుటయు నేకశిలానగర మని యోరుగంటికిఁ గూడఁ బే రుండుటయుఁ దప్ప వీరివాదమున కితరాధారమేదియు లేదు. పోతరాజుగారివిషయమున బొమ్మెరయందును, నొంటిమిట్టయందును, గలలోకప్రవాదము లోరుగంటిలో లే వని యనుబంధములవలన

ను (బ్ర॥శ్రీ॥ రామయ్యపంతులవారివ్యాసమువలనను స్పష్టపడుచున్నది. ఓరుగంటి వాస్తవ్యులు శ్రీమాన్ విద్వాన్ అమరవాది నారాయణాచార్యులవారు "గోదావరిని గంగయని వాడుక మిక్కిలి యిక్కడ వాడుక కలదు. ఏకశిలానగర మను నది వరంగల్ ప్రతాపరుద్రీయగ్రంథమందు నాటకప్రకరణమందు వైతాళికవాక్యమంగు "రాజ న్నేకశిలానగరాధీశ" యని సంబోధనవాక్యముచేతఁ బ్రతాపరుద్రుఁ డేలినవరంగల్ అని చెప్పవల్సినది. పోతరాజువిగ్రహము పోతరాజు ప్రతిబింబమే యని వీరివంశస్తులు చెప్పఁగా వినియున్నాను" అని వ్రాసియిచ్చిరి గాని పోతరాజునకు నోరుగంటికి నీష త్తైన సంబంధ మున్నట్టు వారు చెప్పినవారు గారు. ప్రతాపరుద్రుఁ డేలినది యోరుగల్లు గా దని యెవరు చెప్పిరి. వారివాదము బొమ్మెరవారివాదమున కుపకరించుచున్నది గాని యోరుగంటి వారివాదమునకుఁ బ్రయోజనపడదు. బమ్మెరపోతనవిషయమై యత్కించిత్ప్రమాణ ముండినను నంతటి విద్వాంసులకుఁ దెలియకుండునా? తెలిసియుండినఁ జెప్పకుందురా? ఒకవేళ వారికిఁ దెలియకుండినను నోరుగంటివారివాదము స్థాపింప నిన్నియనుబంధముల సంపాదించినవారైనఁ దద్విషయము తెలిసినవారి యొద్ద వ్రాయించుకొని తేకుందురా? వా రొకవేళ నుపేక్షించి రనుకొన్నను నిదే కార్యముగ నోరుగంటికిఁ బోయి యేడెనిమిదిదినము లుండి యీవిషయ మంతయు విచారించి పూర్వాభిప్రాయము మార్చుకొనిన పంతులవా రైన నట్టి విషయ మేమైన నుండినఁ జెప్పక గంగను గోదావరిగఁ జేయ వ్యర్థముగ శ్రమింతురా? తమవాదమున కైదవయాధారము జనశ్రుతి యని వ్రాసినవా రోరుగంటివిషయమై యొకమాట యయిన వ్రాయకుందురా? కావున నోరుగంటికిఁ బోతరాజుగారిభాగవతమునకు సంబంధము లే దనియు నీకమీఁద నట్టిపత్రములు సృష్టింపఁబడునేని వితండావాదమునకై తేఁబడినకూటసాక్ష్యముగ గ్రహింపవలసియుండునవియుఁ దలఁచెదను.

ఓరుగంటివారివాదమే బలీయ మనుటకుఁ బంతులవా రాధారముల వ్రాసిరి. అందు:—

### 3A. మొదటియాధారము.

**13.** "పోతరాజుయొక్కయు, భాగవతములో శిథిలము లయినభాగములఁ బూరించినయితరకవులయొక్కయు నింటిపేళ్లు." పోతరాజుగారియింటి

పేరు బమ్మెరవారు. బొమ్మెర యనుగ్రామ మోరుగంటికి రమారమి మూఁడామడదూరమున నున్నది. దీని నచ్చటివారు బొమ్మెర యందురు” ఈపేరు గల గ్రామము మఱియొక్కటెక్కడ నున్నట్లు తెలియరాలేదు. కావునఁ బోతరాజు నింటిపే రీబొమ్మెరనుబట్టియే పుట్టిన దని యూహింపవచ్చును. మఱియు భాగవతము పంచమస్కంధము బొప్పనామాత్యపుత్రుఁ డగుగంగనార్యుఁడును, షష్ఠస్కంధము నేర్చూరి సింగయయు, నేకాదశద్వాదశస్కంధములు పోతనామాత్యప్రియశిష్యుఁ డగువెలిగందలనారయయుఁ దెలిఁగించిన ట్టచ్చుప్రతులలో నున్నది. “ఏర్చూరు, వెలిగందల, గోల్కొండదేశములో నున్నవి” అని వ్రాసి పంతులవారు కడపట “బమ్మెర, ఏర్చూరు, వెలిగందలయు నోరుగంటిప్రాంతదేశములో నుండుటచే నాయింటిపేళ్లు గలవా రాదేశమువా రని యూహించుట యసమంజసము కాదు” అనిరి.

14. ఈకడపటివాక్యమందు “ఆయింటిపేళ్లుగలవా రాదేశమువారు” అనునది “ఆయింటిపేర్లుగలవారి వంశములమూలపురుషులు తొలుత నాదేశమువారు” అని లుప్తపూరణము గావించినచో నిది యూహామాత్రముగఁ గాక సామాన్యసత్య మని యంగీకరించిన సంగీకరింపవచ్చును. అటుగానిచో నీయూహ యపోహమే యగు.

“ప్రస్తుతము తూర్పుదేశమం దున్నగోలకొండవేపారులయొక్కయుఁ దెలగాణ్యులయొక్కయు నింటిపేళ్లు గలగ్రామము లనేకములు గోలకొండదేశములో నున్నవి. దీనినిబట్టి యాగృహనామములుఁ గలవారు తొలుత గోలకొండదేశమునుండి వచ్చినా రని తేలుచున్నది ఆప్రకారమే బమ్మెరవారు వెలిగందలవారు, ఏర్చూరువారును దమతమగ్రామములనుండి వచ్చి యొంటిమిట్టప్రాంతమందు స్థిరపడి యుండిన నుండవచ్చును గాని యీయింటిపేళ్లు గలవారు పోతరాజుకాలమం దొంటిమిట్టప్రాంతమున నుండి రనుటకుఁ దగినయాధారములు కనఁబడినఁ గాని యాయాక్షేపమునకు బలము లేదు. అట్టియాధారములు లేనిచో నాయింటిపేళ్లు గలవారు గోలకొండదేశమం దుండి రనియే యూహింపవలసియుండును” అని పంతులవారు వ్రాసిరి.

15. ఇందుఁ గడపటి రెండువాక్యములందలి వాదపద్ధతియు నూహయు లోకానుభవమునకు వాస్తవమునకుఁ గూడ విరుద్ధ మని యొంటిమిట్టవాదు లందురు. ఏలన,

మనదేమున రాజులు, మంత్రులు, మహాకవీంద్రు లేకాలమువారో యే దేశమువారో చెప్పుటకుఁ జరిత్రములు లేవు సందర్భములఁబట్టి దేశకాలము లూహించుచున్నారు. కొన్ని యిప్పటికి నూహింప సాధ్యపడకున్నవి. పెరటిచెట్టు మందునకుఁ బనికిరానికారణముచేఁ గేవలకవిత్వవైశిష్ట్యముచేతనే తమయభిజనములఁ బ్రసిద్ధిగాంచినకవులు నూటి కొక్కరైనఁ గలరో లేరో. అందఱు దేశాంతరములఁ దమప్రాగల్భ్యము మెఱసి ప్రసిద్ధికి వచ్చినవారే

అంతియకాక యాంధ్రరాజులప్రభుత్వము దక్షిణదేశమునఁ జెల్లినపుడును గోల్కొండదేశమునఁ దురకలరాయిడి ప్రబలమైనపుడును ననేకాంధ్రకుటుంబములవారు ద్రవిడదేశముననందందు నెలవుకొనిరి. గోల్కొండదేశమున 1309 మొదలు 1424 వఱకుఁ దురకలదాడి విపరీతముగ నుండుటయు దేశ మల్లకల్లోలముగ నుండుటయుఁ దుదకు నాదేశములనుండి స్వదేశప్రభువులు తఱుమఁగొట్టఁబడి దక్షిణాభిముఖులై వచ్చి యందందు నెలకొనుటయుఁ జరిత్రకారులు వ్రాసి యుండువిషయమే కదా. బమ్మెరపోతనయు నీకాలములోనివాఁడే, పోతరాజు పుట్టకముందే యందుఁ దురకలదాడి విశేషముగ నుండెను. ఆకారణముచే దేశప్రభువులే దేశభ్రష్టులై పోవుచుండ బీదసాదలు తురకలబాధ సహింపలేక దేశభ్రష్టు లగుట వింత గాదు.

మఱియు నీకాలమున విజయనగరరాజ్యము ప్రబలముగ నుండె నని చరిత్రములే చెప్పుచున్నవి. కావునఁ బోతనామాత్యుఁడో యాయన తండ్రియో యాదేశము విడిచి యీప్రాంతమునకువచ్చి రని యూహించుటయందు వైపరీత్యమేదియుఁ గానరాదు. కడపమండలమందే నాయెఱిఁగినంతలో నోరుగంటివారను పేరు గలకుటుంబములు మూఁడునాలు గున్నవి. వీ రాకాలమున నాదేశము విడిచి వచ్చినవా రనియే తోఁచుచున్నది.

ఇట్లుండ నేవో రెండుమూఁడు సామాన్యకుటుంబములవా రన్యదేశములనుండినట్లు చిరకాలప్రసిద్ధి యుండినను జాలదఁట. ఇట్టికాలమున నిట్టిప్రదేశమున నిట్టివా రుండి రని 500 సంవత్సరములనాఁటి వృత్తాంతమునకుఁ "దగినయాధారములు వలయునఁట" జనశ్రుతియుఁ బూర్వులలేఖనములుఁ దగినయాధారములు గావోటు? బికారి పోతనమాట యటుండ నిమ్ము, ప్రభువు లగువెలుగోటివారికాలమున నెం దుండిరో పంతులవారు చెప్పఁగలరా? ప్రభువులస్థితి య టుండ బీదసాదలగతి యెట్లు చెప్పవచ్చును. అయిదునూర్లసంవత్సరములనాఁటివృత్తాంత

మిపు డిదమిత్థ మని నిర్ధారించుట యసాధ్య మని మొఱఁగిమొఱఁగి దుర్లభవస్తు
ప్రార్థనము చేయుటే యోఁగంటివారివాదదౌర్బల్యము సూచించుచున్నది. వీరి
యూహల కేతగినయాధారములఁ గనఁబఱిచిరో."

16. పంతులవా రూహించినట్లు లూహించి సిద్ధాంతముచేయఁబూనినచో
నెట్టి యనర్థకములుపొసఁగునో తెలుపుటకై నాచరిత్రము దృష్టాంతముగఁ జెప్పు
చున్నాను.

మేము గోల్కొండవేపారులము. ఆకారణముచేతనే మాపూర్వులు
గోలకొండదేశమువా రనుట నిర్వివాదము. మాయింటిపేరు వావిలికొలనివారు.
ఈపేరిగ్రామము గోలకొండదేశమం దున్నది మాబంధువు లాప్రాంతముల
నేఁటికి నున్నవారు

నాకౌసల్యాపరిణయము భద్రాద్రిరామస్వామి కంకితము. దానిని
ముద్రించి ప్రకటించినవా రిప్పటి పీఠాపురపురాజుగారి మేనమామగా రై విని
గడప, ఉంద్రాజవరము లోనగు తాలూకాల జమీందారులైన మ.రా.రా.శ్రీ
శ్రీ రాజా వెల్లంకి వేంకటరామారావుబహద్దర్ వారు.

అంతియకాక యభినవాంధ్రభోజు లని యాంధ్రలోకముచే నెన్నఁబడు
చున్నట్టియు, నాకు జీవనోపాయము కల్పించియు, బదరికాశ్రమమం దాసన్న
మరణదశనుండు నాకుఁ బ్రాణము నిలిపినట్టియు, మదీయాంధ్రవాల్మీకి రామాయ
ణాదికృతులఁ బ్రకటించి పాంచభౌతికకాయమున కన్న శాశ్వతమైన యశఃకాయ
మొసఁగి స్థిరజీవిఁ జేసినట్టియు శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావు
బహదర్‌గారు పాలించు పీఠికాపురము, మీఁద సూచించిన ప్రదేశములకు సమీప
మందున్నది ఈప్రభువుగారు నాకొనర్చిన సాహాయ్యము లోకమంతయు నెఱిఁగియే
యున్నది. కావున 500 సంవత్సరములకుఁ దరువాతి చిత్రచరిత్రకారు లాదేశము
వాఁడను నేను గాకుండిన నాకేల యాప్రభువుగారు తోడ్పడుదు రని యూహించి
నేను గోలకొండదేశమువాఁడ నని కాని వేఁగినాటివాఁడ నని కాని వ్రాయుచు
నాయూరు కడప గాదు కరప యనియుఁ బ్రమాదమువలననో లేక ర=ల=డ
కావుననో కరప యే కడపగా ముద్రింపఁబడిన దనియు, (నాజన్మస్థలము జమ్ముల
మడుఁగును జమ్మడక యని యు వాడుచుండుటచే) జమ్మడక కృష్ణామండలమునఁ
గాఁబోలు నుండుటచే నదియే నాజన్మస్థల మనియు దీనికి సమీపమందే బెజ
వాడ తాలూకాలోఁ బ్రొద్దుటూరను గ్రామమున్న దనియు నాప్రాంతములవాఁడ

నగుటచేతనే నాకృతి భద్రాద్రిరామస్వామి కంకితమిచ్చితి ననియు, నక్కడివాఁడ నగుటచేతనే పీఠికాపురముర్రాజుగారి ప్రాపు నాకుఁ గలిగె ననియు లేకున్నఁ గడప యెక్కడ? పీఠాపురమెక్కడ? రెంటికి సంబంధము కుదుర దనియు వ్రాసిరేని నేనంతవఱకు జీవించి యుండినను నది కాదని యెట్లు సమర్థింపవలయునో నాకుఁ దోఁచినదికాదు. నేను జీవించియుండఁగానే నన్నుఁ గొందఱు సుబ్బరాయశాస్త్రిగా రని వ్రాయుచున్నారు. తమజాతిలోఁ బుట్టి తమకుఁ గీర్తితెచ్చితి నని కొందఱు మాధ్వులు వ్రాసియున్నారు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో నొకరు నన్ను దక్షిణదేశకవులలోఁ జేర్చిరి.

జీవద్గ్రంథకర్తల గతియే యిట్టులుండ నిట్టియూహలవారు చరిత్రకారులు పుట్టుదు రని యూహయే లేనికాలమువారి గుఱించి యేమి చెప్పవలయును. కావున గగనకుసుమములఁ దేరఁగోరు వాదపద్ధతి సరిగాదు. శాసనములు లోనగు ప్రత్యక్షప్రమాణములు లేనపుడు గ్రంథకర్తలవిషయమై పూర్వుల లేఖనములు జనశ్రుతి బలిష్ఠము లైనప్రమాణములు. ఇవి రెండు నోరుగంటివిషయమున శశవిషాణములు.

17. ప్రొద్దుటూరియందు నిప్పు డోరుగంటివా రనియొకకుటుంబ ముండుట పంతులవారు నెఱింగియే యుందురు. వా రెన్నితరములకు ముందు కడపమండలముఁ జేరిరో వారికే తెలియదు. దీనివలన నూహింపఁదగిన దేమి? ఓరుగంటిప్రాంతమందలి కొన్నికుటుంబములవారు కడపమండలమందుఁ జేరి రని యే కదా? ఇట్టియోరుగంటివారికుటుంబము లింకను గడపమండలమందే యున్నవి. ఈప్రకారము వచ్చిన వంశములవారిలో 400, 500 సంవత్సరములలో నిలిచిపోయిన కుటుంబము లెన్నియో యెవ్వఁ డెఱుఁగును. ఉన్నవారికే తమపూర్వులవృత్తాంత మననేల 6, 7 తరములకు ముందటివారి పేర్లే తెలియకుండఁగా నష్టవంశములచరిత్ర మెవ్వఁ డెఱుఁగనగు. భాగవతకవిచతుష్టయవృత్తాంతము లెఱుంగఁదగిన విశ్వసనీయాధారము లాదేశమందైనఁ గలవా? వారివంశము లిప్పటి కున్నవా? ఓరుగంటినుండి వచ్చినవా రోరుగంటివా రైనట్లు బమ్మెరనుండి వచ్చినవారు బమ్మెరవా రైరి.

18. బమ్మెర పోతరా జొంటిమిట్టవాఁ డని యనాదిజనశ్రుతి గలదు. లిఖితాధారములు గలవు అటుగా దని యిప్పుడు నూతనముగ నోరుగంటిగ్రామము వాఁడని చెప్పువా రోరుగంటివారలు. కావున జనశ్రుతియు లిఖితప్రమా

ణము లసత్యమనియుఁ బోతరా జొంటిమిట్టకు రా లే దనియు గోలకొండదేశ మందే యుండె ననియుఁ “ దగిన యాధారముల ”చే సిద్ధాంతము చేయవలసిన భార మోరుగంటివాదులయం దుండ నీభార మొంటిమిట్టవారిపైఁ బంతులవారు వేయుట వాదచమత్కార మేమో గాని యుక్తియుక్తముగాదు. న్యాయ్యమునుగాదు. కావున భాగవతకవు లందఱు గోలకొండదేశము విడిచి రా లే దని యోరుగంటివాదులు సప్రమాణముగ సిద్ధాంతము చేయువఱకు వారివాదమునకు లోకము చెవినీయవలసిన పని లేదు.

19. కేవల కవిగృహనామములఁబట్టి వాసస్థలము సిద్ధాంతము చేయు పద్ధతి సరిగా దని రూపింప నింతదూరము వ్రాయవలసివచ్చెను గాని పంతుల వారిప్రథమాధారము నిస్సారముఁ జేయ వేఱుమార్గము లేకకాదు - ఇఁకఁ బంతులవారి వాదపద్ధతినే యొంటిమిట్టవిషయమున నన్వయించెద.

ఏర్చూరు, వెలిగందల గోల్కొండదేశమం దున్నవి కావున “ నాయింటిపేళ్లు గలవారు గోల్కొండదేశమం దుండి రనియే యూహింపవలసియుండును.” అని కదా పంతులవారివాదము. భాగవతము షష్ఠస్కంధము రచియించిన సింగయ్య తనపూర్వపితామహుఁడు ‘ ఎఱ్ఱన ’ యేర్చూరిశాసనుం డని వ్రాసెనే కాని తనయింటిపే రేర్చూరువా రని వ్రాయలేదు. ఎఱ్ఱన యధికారిగా నుండినస్థల మేర్చూరు.

ఈయేర్చూరు నరసారావుపేటసమీపమున గుంటూరుజిల్లాలో నున్నది. దీనికిఁ గలప్రమాణములు. ఆధునికకవిజీవితములు పుట 59 “పోతరాజు లక్ష్మీనరసింహకవిగారు. వీరి నివాసస్థలము నర్సారావుపేట తాలూకా ఏరుచూరు. ఆఱువేలనియోగిబ్రాహ్మణులు ఆపస్తంబసూత్రులు. శ్రీవత్సగోత్రులు.”

అందే పుట 279 “ పోతరాజు విశ్వనాథకవిగారు. వీరినివాసము నరసారావుపేటతాలూకా ఏరుచూరు ఆఱువేలనియోగులు. శ్రీవత్సగోత్రులు.”

అందే పుట 435 “ పోతరాజు రామకవిగారు. వీరినివాసస్థలము గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా యేర్చూరుగ్రామము. శ్రీవత్సముని గోత్రులు.”

మీఁదిగ్రంథమును బ్రకటించిన మ రా. శ్రీ. రాజాభుజంగరావుగారు “ ఏల్చూరు ” అనుటకు “ ఏర్చూరు ” అని ముద్రించి రనియు సర్వే లెక్కలలో ‘ ఏల్చూరు ’ అని యే యున్న దనియుఁ బంతులవారు వాదింపవచ్చును.

దీనికి జతపఱిచిన 1-2-3-4 అనుబంధములను వీరు పఠించిరేని వీరిసంశయము సమూలము తొలఁగును. ఈయనుబంధములవలన నేర్చూ రనునది యీదేశమందును నుండునే గాక యందే భాగవతషష్ఠస్కంధకర్త సింగయ్యయు నుండె నని తెలియవచ్చుచున్నది. విప్రనారాయణచరిత్రపీఠికయందుఁ బంతులవారు "సింగనమంత్రివంశకర్త యైన యెఱ్ఱాప్రెగడ గోలకొండదేశములోని నల్లగొండమండలమందలి యేర్చూరుగ్రామమున నుండువాఁడు" అనివ్రాసిరి. కాని దాని కాధార మించుకయైన వచించినవారుకారు లోకమున నేర్చూ రొకటియే యున్న దనుభ్రాంతియే యీవ్రాఁత కాధారమై యుండవలయును

ఇఁక రెండవగ్రామమైన వెలిగందల వేంకటగిరిరాజుగారి గ్రామము. పొదిలితాలూకాలో నున్నది. *ఈరెండు నిప్పుడీదేశమునఁ గడపమండలమునకు సమీపమున నున్నట్టు లేర్పడెను గదా. కావునఁ బంతులవారు తమవాదమును నొంటిమిట్టపరముగా నన్వయించి నిష్పక్షపాతబుద్ధితో నొంటిమిట్టకు ననుకూలముగఁ దీర్పుచెప్పఁ బొరింబొరి వేఁడుచున్నాఁడను. ఈవిధముగ నోరుగంటివారికిఁ బ్రబలాధారమైన ప్రథమాధారము నిస్సారమయ్యెను

రెండవయాధారము.

20. "పోతరాజు గంగాతీరమందు మహేశ్వరధ్యానము సేయునవసరమున రామభద్రుఁడు ప్రత్యక్షమై భాగవతము తెనిఁగింపు మని యనుజ్ఞయిచ్చెననుట."

ఇందు గంగ యనఁగా గోదావరి యని యర్థకల్పనముఁ గావించి యిది యోరుగంటివాదులకు రెండవయాధార మని పంతులవారు వ్రాసిరి. భాగవతకవిచతుష్టయమువారి యింటిపేర్లు గలగ్రామములు గోలకొండదేశమందే యున్నవని యెంచి దానిని బలపఱుచుటకై యిట్టి క్లిష్టార్థకల్పనము గావింపఁబడె నని యెట్టివారికి స్ఫురింపకపోదు. పరిశీలించి చూడ నాయాధారము దారమువలె నిస్సార మయ్యెఁ గదా. దీనిగతియు దానితోపాటే. గంగయనఁగా గోదావరి కావునను, గోదావరి గోల్కొండదేశమందే యుండుటను బోతరాజు గోల్కొండదేశమువాఁడు. పోతరాజు గోల్కొండదేశమువాఁడు గనుక గోదావరిని గంగ యని వ్రాసెను అను నీయుక్తులు పరస్పర మాధారము లగుటచే నన్యోన్యాశ్రయత్వదోషమునకుఁ బాలుపడ నయ్యెను. పోతన గోల్కొండయం దుండిన

* పులివెందల - పులివెన్దల Pulivendla పులివెండ్ల యని వాడఁబడుచున్నట్టు లిది వెలిగండ్ల యని వాడఁబడుచున్నది

వాఁ డనునది విశ్వసించినఁ గాని గంగ గోదావరి యని స్ఫురింపదు. ప్రథమా ధారమున కిది యాశ్రయము కాదనియు నాకారణముచే నన్యోన్యాశ్రయత్వము లేదనినను నిది స్వతంత్రాధారము కాఁజాల దని వా రంగీకరింపక తప్పదు. అది యెట్టులయిన నగును గాక యిది యు నొక యాధారముగఁ బంతుల వారు వ్రాసిరి. కావున నది యెంతమాత్రము క్షోదక్షమమో చూతము.

21. "శ్రీమన్నారాయణకథాప్రపంచవిరచనాకుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనానుమతంబున సభ్రంకషశుభ్రసముత్తుంగభంగ యగుగంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజులపులినతలమధ్యంబున మహేశ్వరధ్యానంబు చేసి కించిదున్మీలితలోచనుండనై యున్నయెడ"... .....

ఇవి పోతరాజుగారి వాక్యములు. ఇందు 'గంగ' యనఁగా గోదావరి యని యోరుగంటివారివాదము. దాని కాధారము జనులవాడుకయే గాని శాస్త్రము గాదఁట పురాణము గాదఁట పూర్వోత్తరకథాసందర్భమును గాదఁట.

కేవల గంగాశబ్దమునకు గోదావరి యనునర్థ మిప్పు డోరుగంటివారులు చెప్పఁగా వినుచున్నాను గాని యింతవఱ కేగ్రంథమందుఁ జదివినట్టు స్ఫురింప లేదు. అశ్రుతపూర్వమును. ఈనాయజ్ఞానమును సత్కవిప్రయోగములచేఁ బురాణవాక్యములచే వారు తొలఁగింతురుగాక. బమ్మెరపోతరా జెందైన నట్లు ప్రయోగించెనా వారు సెలవిచ్చెదరుగాక.

"ఈనదికి గోలకొండదేశమం దంతటను గంగయనుసంజ్ఞ రూఢమైయున్నది" అని పంతులవారు తమప్రమాణమును దెలుపుటచేతనే శాస్త్రపురాణ సత్కవీశ్వరప్రయోగాదిప్రమాణములు శూన్యము లని తెలియవచ్చుచున్నది. జనవాక్యము ప్రమాణము గాదా యందురేమో. పురాణసుప్రసిద్ధ సంకేత నామములకు విరుద్ధార్థము కల్పించుపామరవాక్యము ప్రమాణము కానేరదు.

దక్షిణగంగ యని గోదావరికి సంకేతము స్థలపురాణములఁ గలదు. దాని నాధారముచేసికొని నన్నయ్యభట్టు మూలమునందు లేకున్నను స్వదేశాభిమానముచే "దక్షిణగంగనాఁ దనరు గోదావరి" యని భారతమున వ్రాసెను. సంగ్రహార్థమై యొండె భక్తిచే నొండెఁ బామరులు దక్షిణగంగను గంగ యని వాడిన వాడుకొవచ్చును, గాని గ్రంథముల స్థలనిర్దేశము చేయునప్పుడు విశేషణరహితముగఁ బ్రయోగింపరాదు. పోతరాజుగా రెందును నట్లు

ప్రయోగించియు నుండలేదు పామరవాక్యములఁబట్టి యుద్గ్రంథముల కర్థము చెప్పరాదు. అట్లు చెప్పిన నేమి యందురా

I. కావేరీతీరవాసు లందఱు నేకుంటకుఁగాని నదికిఁగాని స్నానమునకుఁ బోవునపుడు కావేరికిఁ బోయివచ్చెద మని చెప్పుట వాడుక. ఆకారణముచేతనే యన్నికుంటలు వంకలు కావేరు లగునా? వాని నెల్లఁ గావేరులుగ నుద్గ్రంథముల వ్రాయువాఁడు వివేకియా?

II. మాధ్వులు నరకచతుర్దశినాఁ డుషస్స్నానము చేసి గంగాస్నానము చేసితిరా యని తమమతస్థులనే గాక పరిచితుల నెల్లఁ బ్రశ్నించుట వాడుక సుప్రసిద్ధము. వాస్తవముగ వీరు స్నానమొనర్చినది బావినీటియందో వాన చూరు నీటియందో కొళ్లాయినీటియందో వీరిమాటలు ప్రమాణములుగఁ గొనితిమేని గంగాళములోని వన్నియు గంగలే. ఈనీళ్లనెల్ల "నభ్రంకషసము త్తుంగభంగగంగ"లని వ్రాయు కవీశ్వరు లిఁకఁ బుట్టుదురు కాఁబోలు.

III. ఇందిర్ చెల్లెల్ మదిల్ నిన్ను భజింతు గంగల్
ఫుల్లత్తరంగల్ బహుపుణ్యసంగల్
గల్లోలలక్ష్మీజితకాశమల్లిల్
దల్లిల్ సుధీకల్పలతామతల్లిల్

పోతరాజుగారి యీపద్యమునకు గోదావరిపరముగ గోల్కొండదేశమువా రర్థము చెప్పెదరు కాఁబోలు.

IV. తిరునల్వేలియందు శ్రీవైకుంఠ మనియు, సేలముజిల్లా తిరుచెంగోడు తాలూకాయందు వైకుంఠమనియు గుంటూరుతాలూకాలో వైకుంఠ మనియుఁ జీకాకోలు తాలూకాలో వైకుంఠపుర మనియుఁ గలవు కదా. ఈపేళ్లు జనులవాడుకయం దుండుటయే గాక గ్రంథస్థములు నగుటచే "అలవైకుంఠపురంబులో నగరిలో నామూల" యను పద్యమునకు నర్థము చెప్పునపుడు మాయూరిలోని మాయింటిమూలనుండి విష్ణువు వెడలిపోయె నని యానాలు గూళ్లవాండ్రు కలహించిన నోరుగంటివాడు లేమిపంచాయతీ చేయుదురో. ఏయూరిజనుల వాక్యము ప్రమాణ మని న్యాయాధిపతులు తీర్పు చెప్పుదురో.

V. ప్రొద్దుటూరి కొంకమైలుదూరములో రామేశ్వర మని గ్రామముండుట యాగ్రామమునకు మంచిబాట వేయించి పుణ్యముగట్టుకొన్న పంతులవారెఱుఁగనివిషయముగాదు. లోకులెల్ల నాగ్రామమును రామేశ్వర మని యే పిలు

తురు. అపరరామేశ్వర మని మాహాత్మ్యము చెప్పుదురు. ఎవరైనను నేను రామేశ్వరమునకుఁ బోయి సేతుస్నానము చేసితి నని చెప్పిన-చో నీయూరివారు తమగ్రామమునకు సతఁడు వచ్చి యేటికాల్వపంతెనక్రింద మునిఁగె నని చెప్పిన లోకము నవ్వదా? ఓరుగంటివాడు లెవ్వరైనఁ గాశికిఁ బోయి గంగఁ దెచ్చి యీరామేశ్వరమున కర్పింతురా? దక్షారామవాసు లీరామేశ్వరమునకు వచ్చి పోయినఁ గాశీరామేశ్వరయాత్ర పూర్ణమైనట్టగునా?

vi తిరువల్లూరుతాలూకా ... ... గోవర్ధనగిరి
పుంగనూరుతాలూకా ... ... భద్రాచలము
పుత్తూరుతాలూకా ... ... విరాటపురము
తెక్కలితాలూకా ... ... శ్రీరంగము
దివితాలూకా ... ... అయోధ్య

పురాణేతిహాసాదుల నీపేర్లు వచ్చినచోటుల నాయాగ్రామవాసులు తమతమ గ్రామములే చెప్పఁబడిన వని వాదింపఁజొచ్చిన నంతకంటెను బరిహాస్య మొండొకఁ డుండునా?

vii. "తిరుగుదు రయూరె సురపురి సురల మరగి" యనుపద్యమునకుఁ గల్బరగయందుఁ జచ్చిన వారు తమయూరికే వచ్చి రని తామే సురల మని సురపురమువారు వాదించిన లోక మంగీకరింపవలయునా?

viii. గంగాధరశబ్దమునకు నోరుగంటివాడు లేమి వ్యుత్పత్తి చెప్పుదురో! నేను మీఁద నుదాహరించిన వన్నియు నాయాస్థలములందే గాక లెక్కలపుస్తకములందును బ్రసిద్ధములై నిస్సంశయముగ లోక మంగీకరింపఁదగినవి. అట్టి వానిని గ్రహించి పురాణముల కర్థముచెప్పినఁ గలుగునసర్థకము తెలిసెఁగదా. ఇఁక గోల్కొండదేశమందు మాత్రమే (దేశమం దంతయు నిది కలదో లేదో) తెలియవచ్చు దానిని గ్రహించి పురాణములకు నెవ్వఁ డర్థము చెప్ప సాహసించును? గోదావరిని గంగ యని పోతన చెప్పఁదలచియుండిన దక్షిణగంగ యని యే చెప్పియుండును. ఇంతగ్రంథము వ్రాసినవాఁ డీక మూఁడక్షరములు వ్రాయఁజాలఁ డయ్యెనా? అటు చెప్పిన గోదావరికి న్యూనత గలదా? కావునఁ బోతన స్నానమాడిన గంగ భాగీరథియే కాని గోదావరి సర్వథా కానేరదు.

22. అలైన గోదావరిని గంగ యనరాదా యని మీ రడుగుదురు కాఁబోలు. పూర్వోత్తరసందర్భములను బట్టి గోదావరి యని నిరూపింప వలె

నున్నప్పుడు స్తుతిపారముననో, వర్ణనముననో యెందేని భక్తిభావనచే గంగ యని చెప్పవచ్చును అటుగాక స్వతంత్రించి వస్తునిర్దేశము చేయునపుడు దక్షిణ గంగ యనవలయును గాని గంగ యనరాదు. గోదావరీనదినే కా దేయేటి నీటినైన నీవే గంగ వని స్తోత్రము చేయవచ్చును. ఏటినీటినే కాదు - ఏనీటి నైన నట్లు స్తుతింపవచ్చును. తాను స్నానముచేయు గొట్టపునీటిని "గంగేచ యమునే చైవ" యనవచ్చును. అది దోషముకాదు. అంతమాత్రముచేతనే యానీ రెల్ల భాగీరథి యని యర్థము చెప్పరాదు.

"ప్రవహించు నేవీటిపశ్చిమప్రాకార మొరసి గంగమ్మ సాగరము గొమ్మ" యని కాశీఖండమున లేదా ? యిది స్వతంత్రప్రయోగము కాదా ? యని యోరు గంటివాడు లడుగవచ్చును. దీనికిఁ బ్రత్యుత్తర మీపద్యమంతయు నుదాహ రించుచే

సీ. ఉండు నేవీట మార్కండేయమునినాథ సజ్జలింగ మనంగశాసనుండు
ప్రవహించు నేవీటిపశ్చిమప్రాకార మొరసి గంగమ్మ సాగరముగొమ్మ.

* * * * *

* * * * *

గీ. ప్రబలధారాసురత్రాణభద్రజాతి, కరిఘటాసైన్యదుస్సాధకనకలోహ
గోపురద్వారకవాటప్రదీపితమతి, సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

సందర్భమునుబట్టి గంగ యేదైనది స్పష్ట మగుచున్నది ఇట్టి సందర్భము పోతనగంగకు లేదు.

అట్టులే వారు శ్రీనాథుఁడు భీమఖండమున గౌతమిని గుఱించి
"కంటిరే ఘోరపాతకములనెల్లఁ
గడిమి జంకించుచున్నది గంగ యిప్పుడు" అనియు
"మహాహ్లాదనాద్వృద్ధాలింగన,
వ్యాపారప్రతిపన్నసౌఖ్యకును సాష్టాంగంబు గంగమ్మకున్."

అనియు వ్రాసె నని వాదింపవచ్చును.

దీనికి మీరు భీమఖండమునఁ జతుర్థాశ్వాసమున 158 మొదలు 190వ అంకుఁ గలపద్యములను జదువుఁ డని నేను మిమ్ముఁ గోరుచే తగిన ప్రత్యుత్తరము. మీఁది పద్యములకు ముందువెనుకల

" గౌతమీగంగఁ బాపి యిక్కడికినొక్క, సిద్ధవాహినిఁ బ్రవహింపఁజేసి కాని"
" గౌతమీగంగ నాలోలఘనతరంగ "

" పూర్వమున గౌతమీగంగ పుట్టివచ్చె " ఈప్రకారము స్తుతిఘట్టమున నభేదాధ్యవసాయముచే గంగాలక్షణములన్నియు గోదావరియం దారోపింపఁబడినవి. ఇచ్చటఁ గవి జల పర్యాయముగ గంగాశబ్దముఁ బ్రయోగించె ననుట నిర్బాధము.

అడిదము సూరకవి చెఱువునీటి నేమని సంబోధించెనో చూడుఁడు.

సీ. బ్రహ్మాండభాండసంపత్తి కుక్షినిగల్గు పద్మనాభునిపదాబ్జమునఁ బుట్టి
సకలరత్నాకరస్థానమై యొప్పెంగు నంబుధీశుని చరణంబుఁద్రొక్కి
పరమతత్త్వజ్ఞుఁడై పరఁగు శంతనుమహీరమణువామాంకభాగముఁ జేరి
యఖిలలోకాధ్యక్షుఁడై మించివిహరించు శివుజటాజూటాగ్రసీమ నిలిచి
తే. తనరు నీవంటిధన్య కుత్తమముగాదు, పూసపాటిమహాస్థానభూమియందుఁ
గాలుఁద్రొక్కంగ నోడుఁ జండాలుఁడైనఁ,గదలుమిటమాని దివిజగంగాభవాని.

ఇట్టులే భీమఖండమం దనియు నెఱుఁగునది.

గంగ యనుసంజ్ఞ గోదావరికి లేదా యందు రేని గోదావరికే కాదైదు నదులకుఁ గలదు. కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథి యీయైదు పంచగంగ లని ప్రశస్తి.

" మీయింటిలో నేను గంగ ద్రావను " ఇది సామాన్యముగ లోకులు వాడుకొనుమాటయే, ఇక్కడ గంగ యనునది జలపర్యాయశబ్దము. వీని నన్నిటినిబట్టి చూడఁబూజ్యార్థమందు నే నీటినైన గంగ యని చెప్పవచ్చును గాని వస్తునిర్దేశమందు గంగాశబ్దము భాగీరథికిఁ దప్పఁ దక్కిన వానికి నుపయోగింప రా దని యేర్పడు చున్నది కావునఁ బోతన స్నానముచేసిన గంగ భాగీరథియే.

23. ఆ దేశము వారి మాటలఁగాక పంతులవారు మఱియొకయూహచే గంగను గోదావరిఁ జేయఁజూచిరి. అది యేదన.

" మహేశ్వరధ్యానంబుచేసి కించిదున్మీలితలోచనుండనై యున్నయెడ " "రాజముఖ్యుఁ డొక్కరుఁడు నాకన్నుఁగవకు నెదురఁ గానఁబడి" "రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబు దెనుంగుసేయుము. నీకు భవ బంధంబు తెగు నని యానతిచ్చి తిరోహితుం డైన " " హరికరుణావిశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించె నని బుద్ధినెఱింగి లేచి మరలి కొన్నిదినంబులకు నేకశిలా
మఱె
మరల

నగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండ నై”
అనునవి పోతనామాత్యుని వాక్యములు ; వీనిపైఁ బంతులవారు

“భాగీరథి యోరుగంటి కాకాలములోఁ “కొన్నిదినంబుల” ప్రయాణమున కంటెఁ గడుదూరము. ఒంటిమిట్ట కంతకంటెను దూరము. ఒంటిమిట్టనుండి గాని యోరుగంటినుండి గాని పోతన చంద్రగ్రహణనిమిత్తమున స్నానమునకై యంతదూరము పోయియుండఁడు పోయె నన్నచో గంగ యేకశిలానగరమునకుఁ “కొన్నిదినంబుల” ప్రయాణములో నున్న దను మాట తప్పగును. కావున నీసందర్భమున గంగ యనఁగా భాగీరథి కా దని చెప్పవలసియున్నది” అనివ్రాసిరి.

పంతులవారు “కొన్నిదినంబుల”పై నెక్కువభారము మోపిరి గాని కొన్నిదినము లనఁగా నెన్నిదినములో చెప్పరైరి అయినను “గోదావరి యోరుగంటికిఁ బదియామడదూరమున నున్నది. నాలుగయిదుదినముల ప్రయాణము” అని వారు వ్రాయుటచేఁ గొన్నిదినము లనఁగా నాలుగయిదు దినము లని వారి యభిప్రాయ మయినట్లు మన మూహింపవచ్చును. ఈవిషయమున నాకుఁ గల సందేహములు విన్నవించుకొనుచున్నాను.

(1) గ్రహణస్నానము మాత్రమే యుద్దిష్ట మైనయెడలఁ బదియామడ దూర మొకఁడు పోవునా ? తమ వాదమునకు బలముఁ గల్పింప నాదేశమువారు పోవుదు రని యోరుగంటివాదులు చెప్పెదరు గాని యది సంశయింపఁ దగినదే. ఇప్పుడే యీమార్గము గహన మని యసహాయుఁడుగఁ బోరాదని వింటిని. ఇఁకఁ బూర్వ మెట్లుండెనో. తాను దగుపరివారముతోఁ బోయినట్లు పోతరాజు చెప్పినవాఁడు కాఁడు. పారమార్థికబుద్ధి గలవాఁ డగుటచేఁ బోయె నని యందు రేని గ్రహణస్నానమునకుఁ బదియామడ పోవ సాహసించిన భక్తుఁ డిఁక నిరువదియామడపోయి భాగీరథిలోనే మునుఁగఁ దలంపకుండునా?

(2) సులభముగ జ్ఞప్తియందుంచుకొనఁదగిన యల్పసంఖ్య 4-5 చెప్పవలసివచ్చినపుడు “కొన్ని” యని చెప్పఁగూడా ? 4-5 దినముల విరామమే యైనయెడల “మరలి వచ్చి” యనియే చెప్పియుండును. 4-5 దినము లొక్కలెక్కగాఁ జెప్పి యేయుండఁడు, 4-5 దినములు త్రోవలో నుంటి ననుటయం దేమి సారస్య విశేషము గలదో నాకు స్ఫురింపలేదు. ఎక్కువసంఖ్య గలదినములో నెలలో యగుటచేతనే కొన్ని యని చెప్పెను.

(3) తాను స్నానముచేయఁబోయినగంగ “యభ్రంకషశుభ్రసముత్తుంగ

భంగ" యని పోతరాజుగారు చెప్పిరి. అభ్రంకషత్వము శుభ్రత్వము గోదావరి యందుఁ గవిసమయమా? వాస్తవమా? రెండును గావు. ఈరెండువిశేషణములు భాగీరథియందు సార్థకములు. శుభ్ర మనఁగాఁ దెలుపు. ఇది యే సమస్త నిఘంటువులయందుఁ జెప్పఁబడిన యర్థము. ఆశబ్దమునకుఁ గలతక్కిన యర్థము లిందుఁ బొసఁగవు. సత్కవిప్రయోగము లీయర్థముననే కానవచ్చుచున్నవి. భాగీరథి శ్వేతవర్ణ యని కవిసమయమే గాక వాస్తవమునై యున్నది. ఏదైనఁ గక్కుఱితిప్రయోగము నాధారముచేసికొని శుభ్రమనఁగా నిర్మల మని నిష్పంక మని యోరుగంటివాదు లర్థము చెప్పెదరు కాఁబోలు. ఆయర్థ మిప్పుడు వాడుకలో నున్న దని యంత రేని శబ్దార్థము పాటింపక పోతన ప్రయోగించి యుండఁడు. నిష్పంక మని చెప్పఁదలఁచియుండినచో "అకర్దమమిదంతీర్థ" మ్మని వాల్మీకులు చెప్పినట్టు స్పష్టముగానే చెప్పియుండును. అనుప్రాసము నిమిత్తమె చెప్పెనందురేని ప్రాసమునిమిత్తమె యర్థమున కాభాసత్వము పోతరాజు గల్పింపఁడు. ఎట్లనఁ జూడుఁడు. "రాకానిశాకాలంబున సోమోపరాగంబురాకగని" యని 'రాక' రెండుమార్లు వచించెను. ఇక్కడ శాకారాకలకై మొదటిరాక వేయఁబడలేదు. రాకయనఁగా 16 కలలతోఁ గూడినచంద్రుని గలరాత్రి. 16 కలలు కలిగినప్పుడు గాక తక్కినవేళలఁ జంద్రగ్రహణము కలుగ దని జ్యోతిశ్శాస్త్రమునఁ బ్రసిద్ధి. ఈకారణముచేఁ బూర్ణిమతో వాక్యము ప్రారంభింపక రాకతోఁ బ్రారంభించి దానికిఁ దగిన యనుప్రాసములే వేసికొనెను. కావునఁ బ్రాసము కోసరముగనే శుభ్రశబ్దము ప్రయోగించె ననుట యంగీకరింపఁ దగినది కాదు. వాదమునకై నిష్పంక మనునర్థము గ్రహింత మనినఁ దనకుఁ బది యామడలో నుండుజలము సపంకమో నిష్పంకమో యెట్లెఱుంగ సాధ్యము? చూచివచ్చిన పిమ్మట వ్రాసె నన నీయన చూచునప్పటికి జనులత్రొక్కుడులచే నది సపంకమే యగు. కావున నభ్రంకష శుభ్రవిశేషణములు రెండును బోలరాజుగారు స్నానముచేసిన నదికి స్వభావగుణములు.

భీమఖండమున సప్తగోదావరస్తుతియం దానది తెలుపనికవి వర్ణింపలేదా యని యోరుగంటివాదు లడుగవచ్చును. "గౌతమీగంగ" యని గంగకు గోదావరికి నభేదాధ్యవసాయము చేసి గంగాలక్షణము లన్నియు గౌతమియందుఁ గవి యారోపించె నని మున్నే మనవిచేసితిని. అటుగాక వాస్తవ మందురేని శివునిశిరస్సుపై నుండునాకాశగంగను ద్రోచివైచి గోదావరిని జెలువునీళ్ళను

కొళ్ళాయినీళ్ళను శివునిభార్యలుగఁ జేసి యాయనతలపై నెక్కించుట లోనగు పనేకానర్థకములు పొసఁగు. పురుషసింహ మని చెప్పినపుడు పురుషునకు నాలుగు కాళ్ళు తోఁక వాస్తవ మని వాదించువారుగాని యామాట యనరు.

(4) "సజ్జనానుమతంబున గంగకుం జని"యని పోతరాజుగారు చెప్పిరి. గ్రహణస్నానమునకుఁ బోవువారు "సజ్జనానుమతిఁ గైకొనుట శాస్త్రీయమా? సదాచారమా? ఏదియుఁ గాదు. తీర్థయాత్ర చేయువారు సజ్జనానుమతిఁ గైకొనుట శాస్త్రీయాచారము. అది నేఁటికి నాచరణమం దున్నది. దీనివలన జనులు పుష్కరమునకై ముందే బయలుదేఱి పోయినట్లు గ్రహణము నిమిత్తముగఁ గొని తీర్థయాత్ర యథావిధి సంకల్పించి పోతరాజుగారు భాగీరథికిఁ జని రని తెలియవచ్చును. నదీస్నానమునకు సజ్జనానుమతిఁ గొనుట శాస్త్రీయాచారమే కదా "సజ్జనానుమతంబునఁ గ్రుంకులిడి" యని యేల యన్వయింపరా దందు రేని దూరాన్వయదోషము సందిగ్ధదోషమునా మహాకవివరునిమెడలో వేయవలసి వచ్చును. వచనమం దట్టిదోష మెట్టిమూఢుఁడైనఁ గావించునా? పోతరాజుగారి యభిప్రాయ మదియే యైయుండిన "..... గంగకుం జని సజ్జనానుమతంబునఁ గ్రుంకులిడి"యనియే వ్రాసియుందురు. ఈవిధముగఁ జూచినను బోతరాజుగారి గంగ భాగీరథియే కాని గోదావరి కానేరదు.

"అభ్రంకషశుభ్రసముత్తుంగభంగ" "సజ్జనానుమతంబున" ననునవి రెండును వాక్యాలంకారము లనిపంతులవా రందురేని పోతనామాత్యుఁడు స్నానముచేసినది యొంటిమిట్టచెఱువునీటియందో బావినీటియందో యని యొంటిమిట్టవాదు లనవలసివచ్చును. అట్లే లందురా.

"సర్వం గంగాసమం తోయం గ్రహణే చంద్రసూర్యయోః" యని మాధవీయనిర్ణయసింధ్వాద్యాదులందు గ్రహణకాలమున సమస్తజలము గంగాసమ మనియుఁ దద్భక్తిభావనచే దేనియందు స్నానముచేసినను గంగాస్నానము చేసిన ఫలము వచ్చు ననియు నున్నది. "యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ"యని కలదుగదా, మాధ్వులు గంగాస్నానము చేసితిరా యని ప్రశ్నించుట యాభక్తిభావనచేతనే, కావున సర్వశాస్త్రప్రవీణుఁడును సదాచారపరాయణుఁడును శ్రద్ధాభక్తియుతుఁ డగుపోతనామాత్యుఁడు భక్తిభావనచేఁ జెఱువునీటినే గంగ యనియే త్రికరణశుద్ధి నమ్మి స్నానము చేసె ననినచో నోరుగంటివాదు లేమి ప్రత్యుత్తర మీయఁగలరు? సత్యసంగరు లగునొంటిమిట్టవాదు లేదే నెపమున

గెలువ నుత్సహించువారు కారు కావున నిట్టిక్లిష్టకల్పనలు క్లిష్టార్థములు చేయఁ దలఁపరు.

(5) భాగీరథి యనునర్థము గ్రహించినచోఁ గాశీప్రయాగలను నచటి దేవతలను జేర్పకయుండఁ డని పంతులవారు వ్రాసిరి. పురాణమునఁ దనయాత్రాచరిత్రము చెప్పవలయు నని నిర్బంధమా? చెప్పకుండిన బ్రత్యవాయమా? "నేను గాశీరామేశ్వరంబులఁ జూచితి"ననిన వానియం దుండు దేవతలను దీర్థములను జూచితి నని యర్థవశమున స్ఫురింపదా? పోతరాజుగారు వ్రాయఁ దలపెట్టినది భాగవతము గాని నిజయాత్రాచరిత్ర గాదు. కావునఁ దనకు భగవద్దర్శన మెం దయ్యెనో యాప్రదేశమును జెప్పెను. తక్కినవిషయమును జెప్పట యప్రస్తుతప్రశంస. మహాకవి యట్టిదోషమునకుఁ బాలుపడునా?

(6) పంతులవారు "మరలికొన్నిదినంబుల" కనుపాఠము గ్రహించి మరలి యనఁగా గృహోన్ముఖుఁడై యని యర్థము చేసి "గంగయేకశిలానగరమునకుఁ గొన్నిదినంబులప్రయాణములో నున్న దనుట తప్పగును' అని వ్రాసిరి. గురుజాడ శ్రీరామమూర్తిపంతులవారు "మఱికొన్నిదినంబుల" కనుపాఠము గ్రహించిరి. అనేకతాళదళసంపుటములం దీపాఠమే కానవచ్చుచున్నది. ఈపాఠము గ్రహించినయెడలఁ "గొన్నిదినంబు" లనునది ప్రయాణకాలము కానేరదు. గంగాతీరమున నుండినకాల మగును. ఇదియే సమంజసముగా నున్నది. 'మరల' యనుదానికి 'మరలి' యనునది లేఖకప్రమాదపతితము గానోపు. త్రోవలో నడియడవిలోఁ గొన్నిదినంబులు గడపితి నని చెప్పుటయం దేసారస్యమును గానరా దని ముందే మనవిచేసితిని. దూరయాత్ర చేసినవాఁ డగుటచే భాగీరథీతీరంబునఁ గొన్నినాళ్లుండె నని తలంచుట తప్పు గాదు. మఱి యొప్పే యగు. గోదావరియొడ్డున నొంటరిగఁ గొన్నిదినంబు లుండె ననుట యచింత్యము.

(7) 'మరలి' యనుపాఠ మున్నది గదా దాని కేమి గతి యని మీ రడుగవచ్చును. ఆపాఠము గ్రహించినను "గంగ యేకశిలానగరమునకుఁ గొన్నిదినంబులప్రయాణములో నున్న దనుట తప్పగును" అని పంతులవారు వ్రాసినదే తప్పగును. "కొన్నిదినంబు"లనుటకు 4,5 దినము లని వారు చేసిన యర్థము సరి గాదు. ప్రయోగములు చూడుఁడు. కాశీఖండము తృతీయాశ్వాసము. 18.

"వ. ఇవ్విధంబున భువనోపద్రవంబుఁ బ్రశాంతిం బొందించి దక్షిణకాశీ సందర్శనంబునం గాని కాశీవియోగవేదనాభారంబు డిందుపడ దని డెందం బున నిశ్చయించి మందమందప్రయాణంబులఁ గెందలిరాకుఁబోఁడిం గనుకంద కుండ ముందఱ పిఱుంద నడిపించుచు నెడనెడఁ బుణ్యవాహినీతీర్థంబులఁ గ్రుం కులు పెట్టి యష్టమూర్తి నభ్యర్థించుచుం గొన్నివాసరంబులకుఁ గుంభసంభ వుండు గోదావరి నొరసికొనుచు నాంధ్రదేశంబున నరుగుచవ్వాడు" ఇం దగ స్త్యుఁడు వింధ్యోత్తరభాగమునుండి మెల్లమెల్లగఁ దీర్ఘసేవలు సేయుచుఁ గొన్ని వాసరంబులకు గోదావరి నొరసికొనుచు నాంధ్రదేశమున నరిగె నని చెప్పఁబ డెను గదా. ఇది 4,5 దినములప్రయాణ మేమో మీరే యాలోచింపుఁడు.

భీమఖండము ద్వితీయాశ్వాసము. 50, 51, 52 "కతిపయదినప్రయాణంబున

సీ. గంగానదీప్రవాహకణము మాధవదేవు చోరంతరంబుశ్రీతులసిచిగురుఁ
బురుషోత్తమమునందుఁ బుండరీకాక్షుని దివ్యపాదాంభోజతీర్థజలము
శ్రీకూర్మమునయందు శేషాహిపర్యంకకంఠరంబుక్రొత్తచెంగల్వదండ
సింహాద్రియందు లక్ష్మీనృకంఠీరవ సార్వభౌముప్రసాదచందనంబుఁ

తే. గాశికావిప్రయోగోరుగాఢతాప, శాంతి కొదవెను శిశిరోపచార మగుచుఁ
జాయ తెరువున శ్రీబాదరాయణునకు, హరిహరధ్యానపూజాపరాయణునకు

* * * * *

తే. అట్టిపీఠాపురముఁ జేర నరుగుదెంచెఁ, బరమశైవుండు శ్రీపరాశరసుతుండు,"

ఆర్యులారా! యిందు వ్యాసముని కాశినుండి పురుషోత్తమము, శ్రీ కూర్మము, సింహాద్రి, చూచుచుఁ గొన్నిదినంబులఁ బీఠికాపురముఁ జేరె నని చెప్పఁబడెను. ఇప్పుడు పొగబండిపై నెందు దిగకపోయినను నిది 4-5 దినముల ప్రయాణము. నడచి వచ్చినబడుగువ్యాసున కెన్నిదినములప్రయాణమో మీరే యాలోచింపుఁడు. ఇందుఁ బంతులవారు చెప్పినట్టు 4-5 దినముల ప్రయాణ మనిన మీ రంగీకరింతురా. మీఁది రెండనువాదములందును మాసపర్యాయ ముగ దినశబ్దము ప్రయోగింపఁబడిన దని తలంచుట యొప్పు. ఇట్టివి మఱికొన్ని ప్రయోగములు గలవు కాని గ్రంథవిస్తరభీతి విరమించితి. పంతులవారు గ్రహించి న "మరలి" యనుపాఠము గ్రహించినను నోరుగంటివారివాదమే దుర్బల మై యొంటిమిట్టవారివాదమే బలిష్ఠ మగుచున్న దని దీనివలన స్పష్టపడియెఁగదా.

ఏవిధముగఁ జూచినను బోతరాజుగారి గంగ భాగీరథియే కాని గోదావరి కానేరదు. కావునఁ గేవలగంగాశబ్దమునకు గోదావరి యనునర్థముసృష్టి విశ్వామిత్రసృష్టిగా నున్నది.

24 ఓరుగంటినుండి గ్రహణస్నానార్థమై పోవ గోదావరి యున్నట్టు "లొంటిమిట్టకు సమీపములో" "సుప్రసిద్ధమైన పుణ్యనది లేదు" "శ్రీశైలము నొద్దఁ గృష్ణానది యున్నది. ఆప్రదేశమందు దానికి "పాతాళగంగ" యనుసంజ్ఞ శాసనములందుఁ గలదు. కాని శ్రీశైలయాత్ర యిప్పుడే కష్టసాధ్యము. పూర్వము కష్టతరముగ నుండి యుండవలయును" అని పంతులవారు వ్రాసిరి.

కడపనుండి శ్రీశైలమునకు గ్రహణకాలస్నానమునకై పోవుట కష్టతర సాధ్య మని పంతులవా రనిరి గాని యసాధ్య మన రైరి. అది కొంతమేలే, అది య టుండనిండు.

దత్తమండలవాసులారా! యొంటిమిట్టకు సమీపమున నలుగా బది యామడలోపల గ్రహణస్నానయోగ్య మైనపుణ్యనది లే దనుపంతులవారిమాట మీరంగీకరింతురా? మీ రననేల? స్థలజ్ఞుఁ డెవ్వఁ డైన నంగీకరించునా?

ఒంటిమిట్టకు 5 మైళ్ళదూరములో "సాక్షాద్గంగ" పినాకిని యుండు టయుఁ బర్వదినంబులం దన్నిటఁ దత్తీరవాసులు పినాకినీస్నానమునకై పోవు చుండుటయుఁ బంతులవారు మఱచిరి కాఁబోలు. పెన్నమాహాత్మ్యము భారత మందును బేర్కొనఁబడినది. పినాకినిని గంగ యని చెప్పవచ్చునా? యని స్థల మాహాత్మ్యజ్ఞానముగాని పురాణజ్ఞానముగాని లేనివారు సందేహింపవచ్చును. కాని "ఋన్నేభ్యోఙీప్" అనుసూత్రమునన్నైన పినాకినీశబ్ద మనపాయముగ సాక్షాద్గంగను బోధించుచున్న దని యేసంస్కృతవైయాకరణుఁడైనఁ జెప్పఁగలఁడు. దీని పుట్టుపుగుఱించి శ్రీభారతియందిదివఱకే వ్రాసియున్నాను. "దక్షిణ" పెట్టినఁ గాని గోదావరి గంగ కానేరదు. పినాకిని కట్టితోడ్పాటుతోఁ బని లేదు. గోదావరి దక్షిణగంగ యని యేస్కాందపురాణము చెప్పుచున్నదో యాస్కాంద పురాణమే పినాకిని సాక్షాద్గంగ యని చెప్పుచున్నది. ఈవిషయమై నేను పెంచి వ్రాయుట మాని కడప డిస్ట్రిక్టుమాన్యుయల్‌లోని యీవాక్యములను బంతుల వారిస్మరణమునకుఁ దెచ్చుచున్నాను.

"Sidhout itself is sometimes called the Dakshina Kasi on account of the similarity of its position to Kasi or Benares. The

Pennair, on which it is situated is compared to the Ganges, Pushpagiri, a village in the Cuddapah Taluq to Gaya and Gundlamada, a village at the junction of the Cheyair and the Pennair to Prayaga on the confluence of the Ganges and the Jumna"

"The names of some of the rivers show that a part of the country, at all events, is in odour of sanctity, The Chitravati (a Hindu goddess), the Papaghni, the sin-destroyer, the Pennair are all sacred streams, the latter especially so."

సిద్ధవటస్థలపురాణమున

"శ్రీమత్సిద్ధవటావాసా న్మమసాయుజ్యమాప్నుయాత్
క్వచిత్పినాకినీస్నానా త్క్వచిత్సిద్ధేశదర్శనాత్
క్వచిత్సిద్ధవటావాసా జ్జీవన్ముక్తోనసంశయః"

ఒంటిమిట్టకు రెండుమైళ్లలో నుండు గంగపేరూరు పెన్నపేరూరు అను గ్రామములు గంగాపినాకినుల సంబంధము నేటికిని ఘోషించుచున్నవి. ఇదిగాక యొంటిమిట్టకు 10 మైళ్లలో బాహుద (చెయ్యేరు) యున్నది. ఇది పుణ్యనది కాదన నెవరుసాహసింతురు? దీనితీరముననే యత్తిరాల (హత్యరాల) యను సుప్రసిద్ధక్షేత్రము గలదు. పరశురాముఁడు మాతృహత్య రాల్చుకొన్న దిం దనియే పురాణప్రసిద్ధి.

మార్గము దుర్గమ మనుకారణముచే "బాతాళగంగను" గ్రహింపఁ బంతులవా రీయకొనరైరి. అట్టివారు 65 మైళ్లలో నుండు తిరుమలమీఁది యాకాశగంగ నేలగ్రహింపరైరో?

అదియును గాదేని యంతకు సమీపమున నుండుసువర్ణముఖరి నేల గ్రహింపరైరో? సువర్ణముఖరి గంగ కాదనువారు గలరా?

శ్రీకాళహస్తి మాహాత్మ్యమునందలి యీపద్యములఁ దిలకింపుఁడు.

ఉ. ఏనజుఁడన్ మునీంద్ర! పరమేశుఁడు నీకు నభీప్సితంబున
న్నీనియమించి పంచె, వర మెయ్యది వేఁడు మటన్న నభ్రగం
గానదిఁ దెచ్చి యిచ్చుట నఖండగతిం బ్రవహింపఁజేయవే
దాన మనోరథంబు ఫలితం బగు నాకుఁ బయోజసంభవా!

ఉ. నావుడుఁ దమ్మిచూలి గగనంబుఁ గనుంగొనఁగా సువర్ణశో
భావిభవంబుతో బహుళభంగ మహాముఖరత్వసంపదన్
దేవనదీర్ఘురంబు చనుదెంచినఁ గాంచి విరించి తద్గుణ
శ్రీవెలయన్ సువర్ణముఖరీప్రథ దానికిఁ గల్గఁజేయుచున్.

ఇవిగాక చిత్రావతి, పాపఘ్ని లోనగునదులును గలవు. ఇన్నిపుణ్యనదు లుండుట తెలిసి తెలిసి యొంటిమిట్టసమీపమున గ్రహణస్నానయోగ్య మైన పుణ్యనది లేదని పంతులవారు వ్రాయుటే చిత్రము.

"సోమోపరాగంబు రాకఁ గని" యనుచోఁ 'గని' యనఁగాఁ దెలిసి కొని యని యర్థము కాని చూచి యని యర్థము కానేరదు. ఈ తెలిసికొనుట క్రొత్తపంచాంగము పుట్టిన నాఁడే యై యుండవచ్చును. గ్రహణస్నానమునకై పోతరాజు పదియామడ పోయె నని యు నొంటిమిట్టకుఁ జుట్టు నంత దూరములోఁ బుణ్యతీర్థమే లేదనియు వ్రాసి పంతులవా రోరుగంటివారివాదము బలపఱుప యత్నించుటచే నింతదూరము వ్రాయవలసి వచ్చెను గాని పోతరాజు భాగీరథికే పోయె నని నాయభిప్రాయము.

ఉత్తదినములఁ దీర్థస్నానముకంటెఁ బర్వదినములందలి స్నానము విశేష ఫలదము. సామాన్యపూర్ణిమామావాస్యలకంటె గ్రహణకాలములఁ జేయు స్నానాదులు విశేషతరఫలదములు.

"హేమభారం కురుక్షేత్రే గ్రస్తే భానౌ ప్రయచ్ఛతి
యశ్చ రామాయణం లోకే శృణోతి సదృశౌ వుభౌ"

ఇత్యాదులు సుప్రసిద్ధములు. కావుననే పోతరాజు గంగాస్నానమునకు గ్రహణకాలమును నిర్ణయించుకొనె ననియు, గంగాయాత్ర తీర్థయాత్ర కావుననే శాస్త్రీయసదాచారము ననుసరించి సజ్జనానుమతిఁ గైకొని గ్రహణసమయమునకు గంగఁ జేరునట్లు కొన్నిమాసములు ముందుగనే స్వగ్రామము విడిచి పయనించె ననియుఁ బుణ్యతీర్థమునకుఁ బోయినకారణముచేతనే యందుఁ గొన్ని దినంబులు నిలిచె ననియుఁ దలఁచుట ఋజుపద్ధతి

సభ్యులారా! గంగ యనఁగా భాగీరథి యని తొలుతఁ జెప్పి తరువాతఁ జెఱువునీరు బావినీరు కూడ గంగ యని చెప్పితి ననియు, దానిచే నియమము దప్పి స్వోక్తి వ్యాఘాతము కలిగి కలవరపాటు చెందితి ననియుఁ బంతులవారభిప్రాయపడిరి గాని యట్టిదోషము నాయందు లేదు. గంగ యనఁగా భాగీరథి యనియే నావాదము. అది తప్పించి గోదావరి యని కృష్ణ యని నియతితప్పి విపరీతార్థములు చెప్పఁబూనినచో గోదావరి యనియే యేమి నియమము? ఏనీటినైన గంగ యనవచ్చు నని యాధారములు తెలిపి యెదుటివారివాద మంగీకరించినఁ గలుగు ననర్థకముల వివరించితి.

కం. అర్భకులు లేక కా దన
దర్భల మాదన్నకిచ్చెఁ దనయాలిని నా
నిర్భాగ్యుఁడు తనకును నది
గర్భము కాకున్నఁ బోతుగాడిద కిచ్చెన్. అన్నట్లు

ఉత్తమకులస్త్రీ తనభర్తను మాని పరకీయ యైనచోఁ దుదకుఁ గుక్క నక్కలపా లగునట్లు గంగకును రూఢ్యర్థమును వదలి గౌణార్థముల నిష్కారణముగ గ్రహించినచో బురదగుంటలోనినీటికిని నన్వయింపవచ్చు నని చెప్పితిని

(1) ఏరుచూరు లోనగుగ్రామములు గోలకొండదేశమం దున్నవి. కావున నాగ్రామములపేర్లు గృహనామములు గాఁ గలవా రాగోలకొండదేశమందే యుండవలయును.

(2) బమ్మెరపోతరాజుగారిగంగ గోదావరియే యనురెండాధారములచే నోరుగంటివారిపక్షమును స్థాపించి యిఁక నొంటిమిట్టవారిపక్షమును బంతులవారు ఖండింపఁబూనిరి. వారియాధారములు వారి కెంతమాత్రము సాహాయ్యపడెనో మీఁదివిషయము లాలోచించిన విజ్ఞులే యెఱుఁగఁగలరు.

25. ఇఁక నొంటిమిట్టవారివాద మెంతవఱకుఁ బూర్వపక్షము కాఁబడునో చూడవలసియున్నది.

"ఒంటిమిట్టలోఁ గోదండరామస్వామియాలయ మున్న దనియు, నీకోదండరామస్వామియే భాగవతకృతిపతి యగురామభద్రుఁ డనియు, నిందుచేతఁ బోతన యొంటిమిట్టవాఁ డని తేలుచున్న దనియు నొంటిమిట్టవాదులు వాదించుచున్నారు. కాని యావాద మంత సరసముగా లేదు. కవి తనకు ధ్యానములోఁ దోఁచినవాఁడు రామభద్రుఁ డని చెప్పెను గాని యేకశిలానగరమం దుండు దేవుఁ డని చెప్పియుండలేదు. ఆశ్వాసాద్యంతపద్యములఁబట్టి చూచినను గృతిపతి యొంటిమిట్టలో వెలసినకోదండరామస్వామి యనుట కాధారములు కనఁబడ లేదు. ఒంటిమిట్టలోఁ గోదండరామస్వామియాలయ మున్నంతమాత్రాన పోతరాజక్కడివాఁ డనుట యుక్తముగాదు" అనునవి పంతులవారివాక్యములు.

వ్రేళ్లు మడఁచి లెక్క పెట్టఁబూనిన నామసామ్యముతప్ప రెండవయాధారము లేకున్నను దమవాదమే సత్య మని వాదించుట యోరుగంటివాదులకుఁ జెల్లును గాని "యొంటిమిట్టలోఁ గోదండరామస్వామియాలయ మున్నంతమాత్రాన" పోతరా జొంటిమిట్టవాఁ డని యొంటిమిట్టవాదు లనుటకు వారు తెలివి

మాలినవారు గారు. అనాదిజనశ్రుతులు - పూర్వలేఖనములు లోనగుననేకా ధారములు గొని వానితోపాటు దీనిని జేర్చి వీరు చెప్పుచున్నారు. పూర్వుల వాక్యముల వా రనువదించిరి గాని మట్టియెద్దైన మాయెద్దే గెలువవలయు నని వాదింపఁ బూనినవారు గారు.

తనకుఁ బ్రత్యక్షమైన రామభద్రు నెట్టివానిఁగఁ గవి వర్ణించెనో చూడుఁడు.

సీ. మెఱుఁగు చెంగటనున్న మేఘంబుకైవడి, నువిద చెంగటనుండ నొప్పువాఁడు
చంద్రమండలసుధాసారంబుపోలికి, ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుతతమాలవసుమతీజముభంగి, బలువిల్లు మూఁపున బరఁగువాఁడు.

... . . ...

దీనివలనఁ బోతనకుఁ బ్రత్యక్షమైనరామభద్రుఁడు పంతులవారు తలంచిన ట్లుత్తరామభద్రుఁడు కాఁ డనియుఁ గోదండరామభద్రుఁ డనియు నిర్వివాదముగ స్పష్టపడియెఁగదా? ఒంటిమిట్టయం దుండురాముఁడును గోదండరాముఁడే. పోతరాజు రామభక్తుఁడు, శ్రీరామచరిత్రముఁ దిలకింపుఁడు. "చెనకి చెఱిచినాఁడు భాస్కరుఁడు కాకుండిన రామాయణమును బండ్ల కెత్తింపనా" యని పోతరా జనె నన్నజనశ్రుతియు దీనిని బలపఱుచుచున్నది. తనయూరియం దుండుతనభక్తునకుఁ దాను బ్రత్యక్ష మయ్యె నని చెప్పుట పంతులవారి "కంత సరసముగా లే" కుండినఁ గొంతయైన సరసముగా నున్నందునకు నొంటిమిట్టవాదులకు వారు వంద్యులు ఒప్పుకొన నిష్టము లేకయు నొప్పుకొనక తప్పనప్పటియర్థాంగీకారము లిట్టులే కదా యుండును.

పోతరాజు శైవుఁ డనియు మహేశ్వరధ్యానము చేయుచున్నట్టు లాయన యే చెప్పె ననియుఁ గావున రామభక్తుఁ డని యనరాదనియు నందు రేని జన్మమువలనవచ్చినది కులాగతమత మనియుఁ బూర్వజన్మవాసనాబలమున వచ్చునది భక్తియనియుఁ బెద్దలు చెప్పుదురు.

శ్లో. "శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీజపపరా నితరాం తథాఽపి
చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్." లీలాశుకులు.

హనుమద్భక్తుఁ డైనపుష్పగిరి తిమ్మన్న యోగసమాధి నుండఁగా శ్రీరాముఁడు తనకుఁ బ్రత్యక్ష మైనట్లు చెప్పి యున్నాఁడు

పోతరాజును “మదీయపూర్వజన్మసంచితతపః ఫలంబున శ్రీమన్నారాయణకథాప్రపంచవిరచనాకుతూహలుండనై” యని చెప్పెను. కావునఁ బోతరాజు మతమున శైవుఁ డయినను మనమున వైష్ణవుఁడే యనుట స్పష్టము.

ప్రత్యక్ష మైనకోదండరామభద్రుఁడు తా నొంటిమిట్టయం దున్నవాఁడ నని చెప్పలేదఁట. దిక్కాలాద్యనవచ్ఛిన్నమూర్తియై సర్వవ్యాపియై యుండువాఁడు తా నొంటిమిట్టయం దుండువాఁడ నని చెప్పకపోవుట దోషమఁట. తిక్కనకు హరిహరనాథుఁ డేల చెప్పలేదో. ఒకవేళ నే నొంటిమిట్టరాముఁడ నని చెప్పియుండిన భగవంతున కిట్టిభేదజ్ఞాన ముండఁజాలదు కావున నది భగవద్వాక్యము కాఁజాల దని వీరే యాక్షేపించియుందురు. జగన్మూర్తియు జగదంతర్యామియు నై వాసుదేవుఁ డైనభగవంతుఁడు తా నొంటిమిట్టవాసి నని చెప్పకుండుట త ప్పని చెప్పువారు పోతరాజుగారు జగత్ప్రసిద్ధుఁ డైనప్రతాపరుద్రుఁ డేలినయేకశిలానగరమునకు వచ్చితి నని యేల చెప్పఁడయ్యెనో సమాధానము చెప్పఁగలరా? వాస్తవ మారయఁ బోతరా జుండినది గోలకొండలోని యేకశిలానగరమే యైయుండినయెడల జగద్విఖ్యాతి గనిన ప్రతాపరుద్రుపేరు నుడివియే యుండును, అటు చెప్పకపోవుటచేతనే యాయన యుండినది యోరుగల్లు కా దని స్పష్టపడు చున్నది. ఇది కుయుక్తియో సుయుక్తియో నాకుఁ దెలియదుగాని పంతులవారు గంగాతీరస్థక్షేత్రదైవతములఁ బేర్కొనమిగుఱించి వ్రాసినయుక్తికంటెను మేలైనయుక్తి కావున దానిని వారియెడలనే ప్రయోగించితిని.

ఆర్యులారా! శ్రీరాముని గొందఱు కల్యాణరామునిఁగను, గొందఱు పట్టాభిరామునిఁగను, గొందఱు జ్ఞానముద్రాభిరామునిఁగను నానావిధముల సేవించుచున్నారు. ఈమూర్తులందుఁ గోదండధారణము గానరాదు. “ఇక్ష్వాకువంశమునఁ బుట్టినమహాపురుషుఁ” డిన్నిమూర్తులలో నేమూర్తితోనైనఁ బోతరాజునకు గోచరింపక యాయన యుండుగ్రామమునందుండి యాయనకుఁ బరిచిత మైనమూర్తియే యేల గోచరింపవలె? గోచరించినపుడు సంబంధము కలదనుట సమంజసమా లేదనుట సమంజసమా?

గ్రంథస్థపద్యములం దెందును “ఒంటిమిట్టలో వెలసినకోదండరామస్వామి యనుట కాధారములు కనఁబడుట లే” దనుఁట. మనుష్యప్రభువుల

కంకిత మిచ్చినగ్రంథములందే కృతిపతులస్థితిగతులు గ్రామనామములు గాన రాకుండఁగా భగవంతునికి గ్రామనామము చెప్పకుండుట దోషమా? జైమిని భారతకృతిపతి యేగ్రామమువాఁడో నేఁటికి సిద్ధాంతము కాలేదుగదా? దేవతాంకితము లైనపూర్వకృతుల స్థలమాహాత్మ్యముం దెలుపుగ్రంథములందు గ్రామనామములో నైనవి కానవచ్చుచున్నవి కాని తక్కినయెడల గ్రామనామములు తఱచు గానరావు. నెల్లూరిహరిహరనాథున కంకితమిచ్చినతిక్కన తనగ్రామనామముగాని కృతిపతిగ్రామనామముగాని యెందైనఁ జెప్పెనా? చెప్పకుండినమాత్రానఁ దిక్కన నెల్లూరివాఁడు కాఁడా?

ఒంటిమిట్టవారిబలిష్ఠాధారములఁ దాఁకక తడవక యల్పాధార మైన దేవాలయమును గుఱించి పూర్వపక్షము చేయ యత్నించుట చూచిన "నీకు రాగిపోగులే యనిన నీకవియు లేవే" యనుసామెత స్మృతికి రాకమానదు. ఆకాలమున నోరుగంటియందు శ్రీరామభజనమందిర మైనను లేదు. ఆకాలమున నెంతో యీకాలమున నంతే. ఓరుగంటియం దొకరామభజనమందిర మున్నను, నందొకరాయి స్థాపితమై యుండినను, నోరుగంటివాదులు విజృంభించి దానినే బ్రహ్మాండము చేసి యాగుండ్రాయియే పోతనకుఁ బ్రత్యక్షమయ్యె నని చిత్రవిచిత్రములుగ వ్రాసి యుందురు. ఇప్పుడు వారు చేయునాక్షేపములం దొకఁడైన వారి కప్పుడు స్ఫురించియుండదు. అసత్యము ప్రబలకుండుటకై శ్రీరామమూర్తి యం దేవిధముగను బ్రభవించినవాఁడు గాఁడోటు. బమ్మెరపోతరాజునకుఁ గోదండరాముఁడు ప్రత్యక్ష మగుటయుఁ, బోతరాజు కోదండరాము లొంటిమిట్టవాసు లగుటయుఁ జూచి యీయిరువురికి సంబంధముండునని చెప్పెడియొంటిమిట్టవారివాదము యుక్తియుక్తముగను, న్యాయ్యముగను, నెంతో సరసముగ నున్న దని మధ్యవర్తులకుఁ దోఁపకమానదు.

## మూఁడవయాధారము.

"కృతినిర్మాణ మేకశిలానగరమం దయిన దనుమాట యీవాదమున కంతకు మూలాధారముగ నున్నది. ఏకశిలానగర మన నేదియో నిర్ణయింపవలసియున్నది. ఇది గ్రామనామముయొక్క సంస్కృతరూపము గాని మూలనామము గాదు." "ఓరుగల్లు" "ఒంటిమిట్ట" యనునవి రెండును గూడ దీనికి దేశ్యరూపము లని చెప్పవచ్చును గాని కొన్ని కారణములచే నేకశిలానగరవాచ్య మగు పట్టనము ఓరుగల్లే యని నిర్ణయింపవలసియున్నది. ఆకారణము లెవ్వియన:—

"ఒంటిమిట్ట యనఁగా నొంటిగా నుండుగుట్ట (చిన్నకొండ)యని యర్థము ఓరుగల్లు ఒరుగల్లు శబ్దవికారము ఒరుగ ల్లనఁగాఁ గన్నడమున నొక్కరాయి యని యర్థము. ఒరుగల్లు-ఏకశిల యను నీరెండుశబ్దముల కర్థమునం దించుకైన భేదము లేదు. ఏకశిలకును, ఒంటిమిట్టకును భేద మధికముగా నున్నది. ఇంతియ కాక యేకశిల యనఁగా నఖండశిల యని యర్థము. ఒరుగల్లున కిదియే యర్థము. ఓరుగంటికోట నట్టనడుమ బొడ్డురాతివలె నఖండశిలారూప మగునొకచిన్నకొండ యున్నది. ఈరాతిని బట్టియే పట్టనమున కాపేరు వచ్చి యుండు నని చూచినవారికిఁ దోఁపకమానదు."

"ఏకశిలానగర మనుసంజ్ఞ యోరుగంటికి రూఢమై యున్నది. ఒంటిమిట్ట కాసంజ్ఞ పూర్వ మున్నట్లు తోఁపదు. మఱియు నగరశబ్దము పెద్దపట్టనమునకుఁ జెల్లును గాని యొంటిమిట్టవంటి చిన్నయూరికి వర్తింపదు." అని పంతులవా రొంటిమిట్టవారివాదమును బూర్వపక్షమును నోరుగంటివారివాదమును సిద్ధాంతముఁజేసిరి. దీని సారాంశము.

(1) ఏకశిలానగర మనుపే రోరుగంటికి మాత్రమే చెల్లును.

(2) ఒంటిమిట్ట కాపేరు చెల్లదు.

(3) ఒంటిమిట్ట కాసంజ్ఞ పూర్వ మున్నట్లు తోఁపదు.

(4) నగరశబ్ద మొంటిమిట్టవంటిచిన్నయూరికి వర్తింపదు.

వీనికి నొంటిమిట్టవాదులప్రత్యుత్తరము.

(1) సమానరూపములపేర్లు గలగ్రామములు లోకమునఁ బెక్కులు గలవు. అట్టులే యొంటిమిట్టగాక యేకశిలానగర మనుపేరుగలవి రెండును, నొంటిమిట్టయనునవి రెండును గానవచ్చుచున్నవి ఏకశిలానగర మనుపే రొంటిమిట్టకు, నోరగంటికి, భువనగిరికిఁగలదు. ఒంటిమిట్ట యనునవి కడపమండలమున సిద్ధవటముతాలూకాలో నొకటి చిత్తూరుతాలూకాలో నొకటి, పుంగనూరుతాలూకాలో నొకటి గలవు. రెం డేకశిలానగరములు గోల్కొండదేశమం దున్నవి. కావున "నేకశిలానగరవాచ్య మగుపట్టనము ఓరుగల్లే" యను పంతులవారిమాట సత్యముగాదు. భువనగిరి కాపేరున్నట్టులు సర్వోపనిషత్సార సంగ్రహమునఁ గలదు. అనుబంధము విలోకింపుఁడు.

"ఒరుగల్లనఁగాఁ గన్నడమున నొక్కరాయి యని యర్థము." అనియు "ఏకశిల యనఁగా నఖండశిల యని యర్థము. ఓరుగల్లునకు నిదియే యర్థము."

అనియుఁ బంతులవారు వ్రాసిరి. ఒక-ఏకశబ్దములకునఖండ మనునది యొకటే యర్థమని యోరుగంటివాదు లంపురేని వారిమాట పాటింపరాదు. ఏకకుండలుఁడు, ఏకతీర్థుఁడు, ఏకచక్రము, ఏకతాళము, ఏకదంతుఁడు, ఏకదృక్కు, ఏకనటుఁడు, (ముఖ్యనటుఁడు) ఏకపత్నుఁడు (సహాయుఁడు) ఏకభక్తవ్రతము-ఏకామ్రేశ్వరుఁడు, ఏకవేణీధర. ఇట్టి యనేకశబ్దములందు నేకశబ్దమునకు నఖండ మనునర్థము పొసఁగదు. ఇది సామాన్యముగఁ దెలిసినవిషయ మైనను నొకానొక రేకశబ్దమునకు నఖండార్థ మొండే కల దనుటచే నిది వ్రాయవలసివచ్చెను. ఇట్టులే 'ఒంటివాఁడ' 'ఒంటికొడుకు' ఒంటిపేఁటహారము, ఒంటికోఁజ, ఒంటిచీర, ఒంటికంటిగాము, ఒంటిస్తంభపుమేడ, లోనైన వెలుంగువది.

ఏకశిలానగరనామము నఖండశిలారూప మగునొకచిన్నకొండ వలనఁ గలిగిన దని యిప్పుడునూతనముగ ఒరుగల్లునకు నేకశిలాశబ్దమునకు సంబంధము కల్పింప నెంచు పంతులవారును వారివలన నెఱిఁగికొనిన పురాతనశాసనశోధకులు నభిప్రాయపడుచున్నారు గాని పూర్వు లట్లభిప్రాయపడలేదు.

Warangal (ఒరుంగల్లు-orungallu Tel ) From Oru tam Single+ Kal tam. stone [or] Sanskrit name (Varnakula) meaning caste + collection , (ékasılanagarı) One+stone+City from the single stone wall round the town [Vontımıtta]" Madras Manual of Administration.

"గణపతిరా జేకశిలానగరంబునకు వచ్చి తనకు మరలఁబడ్డతమ్ములం బ్రహరించి తాను బట్టాభిషిక్తుఁడై యోరుగంటికి శిలాప్రాకారంబుగాఁ గోట నేర్పఱచి" సోమదేవరాజీయము. వచనము.

గీ. వచ్చి తనకు మరలఁ బడ్డతమ్ములను హ
రించి సకలగహ్వరీస్థలికిని
బ్రాజ్ఞు లెన్నఁగాను బట్టాభిషిక్తుఁ డై
వీటి కొక్కరాతికోట నిలిపె. సోమదేవరాజీయము-పద్యకావ్యము

పంతులవారి 'యొక్కరాయి' యిందుఁ గానవచ్చుచున్నది.

వీనినిబట్టి యాలోచింప శిలాప్రధాన మైనకోట నిర్మింపఁబడుటచే నానగరమునకు నేకశిలానగర మనుపేరు వచ్చె నని తెలియవచ్చెడిని. దీనివలన నొంటిమిట్టవారివాదమున కేమియు సాహాయ్యము లేదుగాన విశేషించి చర్చింపవలసినపని లేదుగాని పంతులవారి యఖండశిలావాదమును బెండుపఱచుచున్న దని చెప్పినఁ జాలును.

ఒంటిమిట్టకు-నోరుగంటికి నర్థభేదము విశేషముగా నున్నట్టు పంతుల వారు వ్రాసినను వారువ్రాసినయర్థముప్రకారమే విశేషభేదము లేదని యేర్ప డుచున్నది. ఎట్లన

"ఒంటిమిట్ట యనఁగా నొంటిగానుండు గుట్ట (చిన్నకొండ) యనియర్థము."
ఏక శైల

"ఓరుగంటినట్టనడుమ నఖండశిలారూపమగు చిన్నకొండ యున్నది."
ఏక శైల

'చిన్నకొండ' యనునది రెండిట సమానము. ఏకశబ్దము సమానము. ఈశబ్దమునకు నొంటి యని యఖండ మని రెండర్థములు గలవు ఇఁక విశేష భేద మెచ్చటనుండి వచ్చెనో అఖండశిలాత్వము ప్రధానముగాని శైలత్వము గాదందు రేని మూఁడేడుబారెఁ డఖండశిల లింటింటఁ గల వని ప్రత్యుత్తరము. పంతులవారియర్థము గ్రహించినను వారివాదము దుర్బల మనుటకై యింత వఱకీవిషయము వ్రాసితి ఇఁక నాయభిప్రాయము తెలిపెదను.

"ఒరుగ ల్లనఁగా గన్నడమున నొక్కరాయి యని యర్థము." అని పంతులవారువ్రాసిరి. ఒరుశబ్దమునకు 'ఒక్క'యనునర్థము కన్నడమున లేదని మ. రా. రా.-శ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారిప్పుడుచెప్పిరి గదా. ఇట్టులే నేనువిచారించిన కర్ణాటకభాషాభిజ్ఞు లెల్లరుఁ జెప్పిరి. ఇప్పుడు పంతులవారివాద మున కేమిగతి? అఱవమున 'ఒరు'అనఁగా ఒకటి యని యర్థము కలదు. ఆకాలమున నఱవవా రందువ్యాపించి యుండలేదు. కావున నాశబ్దమునకుఁ బ్రసక్తియే పుట్టదు. అట్లైనచో నాశబ్దముగతి యేమని మీరడుగవచ్చును. నాయభిప్రాయమున నది యొరగల్లుగాని యొరుగల్లు గాదు. ఒరగల్లనఁగా "(ఒర+కల్లు) బంగారు లోనగువాని నొరపెట్టెడురాయి. నికషము" అని శబ్దరత్నాకరము. మహాపట్టనముల నికషోపలములుగా దండ్యాది మహాకవులు వర్ణించియున్నారు. దండిదశకుమారచరిత్రయందు "అస్తి సమస్తనగరీనికషాయ మాణా.........మగధదేశశేఖరీభూతా పుష్పపురీనామ నగరీ" యనికలదుగదా. ఆయర్థమున నీనగరమున కీపేరు వచ్చియుండవచ్చును. శిలామయమైనకోట నిర్మితమైనపదపడి యేకశిలానగరమనుపేరు వచ్చియుండవచ్చును. ఒరగల్లు వికా రమే ఓరగల్లు అని గొల్లకొండ గోలకొండ యైనట్టులు గ్రహింపవచ్చును. ఒరగల్లే ఒరంగల్లు. ఈరూపము వ్యాకరణసాధ్యమని పంతులవారెఱుఁగు

దురు. ఒరంగల్లు అనువపుడును రేఫముమీఁద నత్వమే కానవచ్చుచున్నది గాని యుత్వము కానవచ్చుటలేదు దేశమందు భాషయందు లేనిశబ్దార్థముల గ్రహించి చెప్పినపంతులవారివ్యుత్పత్తికంటె సుశబ్దము సాధ్వర్థము గలిగిననేఁ జెప్పినవ్యుత్పత్తియే సాధువు. పట్టనగౌరవమునకు నేనుజెప్పినదియే తగియున్నది. ఈవ్యుత్పత్తి గ్రహించినఁ బంతులవారిపూర్వపక్షము నేలఁగూలుచున్నది.

ఏకశిలానగరమనుపేరొంటిమిట్టకుఁ గలదా లేదా ?

ఒంటిమిట్టకు నేకశిలానగరమనుపేరు పూర్వ ముస్నట్లు తోఁపదని పంతులవారు వ్రాసిరి. వారికి సత్యముతోఁపకపోవుటచే వృథావాదమునకుఁ గారణమయ్యెను. పూర్వము లేదనుటచే నిటీవల నెవరో వాదార్థము కల్పించిరని పంతులవారిరహస్యాభిప్రాయము కాఁబోలు

ఉత్తరసర్కారులో నొకానొకఁడు బమ్మెరపోతరా జొంటిమిట్టవాఁడని నాప్రతిష్ఠయు నాంధ్రవాల్మీకిరామాయణమునకుఁ బ్రశస్తియుఁ గోరి తొలుత నేనువ్రాసితినని పత్రికయందు వ్రాసి ప్రకటించె నని విని యాపత్రిక వి. పి. గాఁ బంపుఁడనియు దానికిఁ గలకారణములు తెలుపుఁ డనియు నతనికిఁ వ్రాసితినిగాని నేఁటివఱకు మాఱుత్తరములేదు. అతఁడు ధీరుఁడేని యిపుడైనఁ దనవాదము నిలుపుకొనుఁగాక. అజ్ఞానము, దురభిమానము, అసూయ యెన్నిదబ్బఱలకైన నెడమిచ్చును. వానిమాట యటుండనిచ్చి పంతులవారికిఁ దోఁపకపోవుట కేమి కారణమో చూతము. వీరు ప్రయోగించిన "పూర్వ" శబ్దమునకు స్కాంద పురాణము పుట్టకముందని యర్థము చేసినచో వీరివాక్యము సత్యమగునేమో కాని యన్యథా కాదు. స్కాందపురాణ మైనను దాను బుట్టకముందు లోకమునఁ గలవి వివరించెనుగాని నూతనముగ నేదియు సృష్టింపలేదు

1. పురాణము హయగ్రీవశాస్త్రిలవారీవాద మన నేల యీవాదము చేయువారు పుట్టుట కెన్నియోసంవత్సరములకుముందే బమ్మెరపోతరాజుగారు వ్రాసినయేకశిలానగర మననొంటిమిట్ట యనియుఁ బోతరాజుగా రందుండి భాగవతము రచించిరనియు మఱికొన్నివిషయములును వ్రాసిరి. ఈశాస్త్రిలవారు గొప్పపండితులు. చెన్నపురియందుండి భాగవతాద్యనేక సంస్కృతాంధ్రగ్రంథములు శోధించి ముద్రించినవారు. వీరు ప్రతాపరుద్రయశోభూషణమై విద్యానాథకృతమైన ప్రతాపరుద్రీయమును బరించినవారే. అం దోరగంటికి నేకశిలానగర మని పేరుండుటయు నెఱిఁగినవారే. ఇంతయు నెఱింగియు వారు బలిష్ఠమై

యనాదిగ సర్వాంధ్రలోకవ్యాప్తమైనలోకప్రవాదమును, స్థలజ్ఞులవాక్యములును, స్థలపురాణమును, మఱియితరప్రమాణములను, నాధారపఱచికొని సత్య మెఱిఁగి యొరగల్లు "పెద్దపట్టన"మైనను దాని నీసడించి యొంటిమిట్టవంటి "చిన్న యూరిని" స్వీకరించిరి. సత్యము చెప్పవలసినచోటఁ బ్రాజ్ఞులు పిన్నపెద్దల తారతమ్య మెఱుఁగరు. వాదబలముమాత్రమే పరికింతురు. పంతులవారుచెప్పి నట్లు ఒంటిమిట్ట కేకశిలానగర మనుపేరు లేక పోతనామాత్యుఁ డందుండినవాఁ డును గాకపోయినచో శాస్త్రిలవారిట్లు వ్రాఁతకుఁ గారణమేమో యోరుగంటివాదులు చెప్పఁదలఁపరైరి. ఈశాస్త్రిలవా రొంటిమిట్టవాసులు గారు. కావున నొంటి మిట్టపై నభిమానముంచి యిది సృష్టించి రనియోరుగంటివాదు లనఁ జాలరు. ఓరుగల్లు వలె నొంటిమిట్ట గ్రంథముల కెక్కినప్రసిద్ధనగరము గాదు గదా? విషయ మసత్యమైనచో నిది యెట్లు వారికి శ్రవణగోచర మయ్యెను. పొగబండ్ల కిప్పు డున్నంతప్రచార మప్పటి కాచోటుల లేదు. ఒకవేళ నుండిన దనినను నొంటిమిట్ట దూరదేశజనుల నాకర్షించుమహిమగలది నేఁటికిని గాదు.

2. "Vontimitta (వొంటిమిట్ట-Vontimitta Tel) From Onti tel. Single+Mitta Tel. Mound [or] Sanskrit name Ekasilànagari meaning Single+rock+City [Warangal] Madras Manual of Administration." ఇదియు నీవివాదము పుట్టుటకు ముందు పుట్టినగ్రంథమే.

3. "ఒంటిమిట్ట లేక యేకశిలానగరమాహాత్మ్య" మనియొకవ్రాఁతపుస్తకమును సాహిత్యపరిషత్తువా రోబిలి గ్రామమందు సంపాదించిరి. అందు

ఉ. "స్కాందపురాణమందు నిది సంస్కృతభాషగ నుంట నాంధ్రిమున్
బంధుర మొప్పఁజేసినను బాలురుస్త్రీజనులాదిగాఁ దగన్
పాంథులునైనఁ జూచి బహుభంగుల మెత్తురు పూర్తిమట్టి నీ
గ్రంథము తాడిచెర్లకులకర్తగు వేంకటరామశాస్త్రిచేన్

దీనివలననొంటిమిట్టక్షేత్రమాహాత్మ్యము సంస్కృతభాషను స్కాందపురాణమున నున్నట్లు స్పష్టపడియెఁగదా? అందు వ్యుత్పత్తి యిట్లు వ్రాయఁబడియున్నది.

ఆ. కొండలవియు నయ్యు గుహలతో లతలతో
వను........చాల నగము లయ్యె
బంగరంబు చెడియుఁ బరఁగ మట్టియు రాయి
యున్నఁగ వెలసెఁ గలిని నరుదుగాను.

కం. అందులలో నొక్కటి యిచ
టందంబుగ బడియె నదియు నద్భుతభంగిన్
బృందారకాదిమానుల
డెందంబులు సంతసింప దేదీప్యంబై

కం. ఏకశిలానగరం బన
శ్రీకరముగఁ బట్టనంబు చెలఁగుచు నుండున్
లోకులు తెనుఁగున నుడువుదు
రేకంబుగ నొంటిమిట్ట యిది యనుపేరన్.

ఈగ్రంథము తప్పులతడక. అయినను మనకుఁ గావలసినవిషయము పఱుచుచున్నది. సంస్కృతగ్రంథము నాకు లభింపలేదు. దానిని బరిషత్తువారే సంపాదింతురుగాక. ఈస్వతంత్రప్రమాణములు మూఁడును నీవాదము విజృంభించుటకుముందే పుట్టినవి. కావున ననాదినుండి యొంటిమిట్టకును నేకశిలానగరనామ ముండుట నిస్సందేహము.

ఈక్రిందఁ జెప్పఁబడువ్యుత్పత్తులంబట్టి యొంటిమిట్ట కేకశిలానగరనామము సార్థకమో నిరర్థకమో ప్రాజ్ఞు లాలోచింపుఁడు.

(1) ఒంటిమిట్టగ్రామమునకు 60, 70 గజములదూరములో నొకగుట్ట యున్నది. పాఱువేఁటనాఁడు కోదండరామస్వాములవారి గుట్టశిఖరమున నుండు మండపమునకు విచ్చేయుదురు. దీనికి నితరపర్వతములకు సంబంధము లేదు. ఒంటిగానే యున్నది. ఇది మేరుపర్వతశృంగమనియు దీనివలననే యీయూరికి నేకశిలాఖ్యవచ్చిన దనియు స్థలపురాణమునఁ గలదు.

"ఏకవృక్షః (ఏకోవృక్షోయస్మిన్) చతుఃక్రోశాన్తరే యత్ర న వృక్షాన్తర మీక్ష్యతే। ఏకవృక్షస్స విజ్ఞేయ" యనియాగమమున నున్నట్టు శబ్దకల్పద్రుమమునఁ గలదు. అట్టులే చుట్టు సమీపమున శైలములు లేవు గాన దీనికి నేకశైల మని యేకశిల యని పేర్లు సార్థకములు. ఏకశైలమే యేకశిల. శైల శబ్దము శిలాపర్యాయము. గండశైలశబ్దార్థముఁ జూడుఁడు. భోజచంపువున "తత్ర జంభారిప్రహితాం రంభాం శైలీ భవేతి శప్త్వా" యనికలదు. కావున దీనికి నేకశిలానగర మనిపేరు వచ్చెనని యొకయోజన.

రెండవవ్యుత్పత్తి, దేవాలయమునందలి సీతారామలక్ష్మణవిగ్రహములు మూఁడును నేకశిలానిర్మితములై, యేకాక్షరప్రణవమున మూఁడక్షరములవలె

నుండి యాయర్థమునే బోధించుచున్నవి. ఈవ్యుత్పత్తి నాకల్పితముగాదు. సుప్రసిద్ధ మనుటకై 27-8-1913 గలహిందూపత్రికకు గౌరవార్హులైన కేశవపిళ్లగారు వ్రాసిపంపినదానిలోఁ గొంత నిందుఁ బొందుపఱుచుచున్నాను.

"POTANNA—THE CELEBRATED TELUGU BARD."

" The Hon'ble Mr P Kesava Pillai of Gooty writes:—

Bommara Potharaju or Pothanna, as he is popularly known, lived some six centuries ago, at Wontimitta in Cuddapah District, and sang his immortal and sweet poem.

* * * * *

Among the inspired and the beloved of the God's ranks the Brahmin, the peasant poet Pothanna Not only the Telugu world, but the whole Hindu race has reason to be thankful for the spiritual flame, he has lit amidst men And how God sways the human heart, sustains it in stress and storm, envelopes it in his all-embracing love, and transports it into ineffable spiritual visions, can be sensed by only those that are capable of studying the lives of God's Bhaktas, with chastened spirit Pothanna stands in the foremost ranks of selfless Hindu saints, who loved man and realised God.

The ancient temple has a sanctity, but it attracts crowds only during festivals. The Avatar of God as Sri Rama is the presiding deity with his Sita and his inseparable brother The Divine trio are made out of one single stone and the temple is, therefore, famed as of Ekasila. The Bhakta that added glory to the temple was Pothanna and his history is asked and told with varying interest and with more or less details

We are told that seven cities were raised to Homer but Homer begged for food, when he lived The Hindu poets, with a few exceptions, have fared worse; for the Hindu never thinks of raising monuments to the great ones, who leave the beacon lights of their race And our Pothanna tended cattle as a boy, and was content with the hard labour of a peasant all the rest of his life. He was, indeed, a true democrat, and he refused to acquire competence by dedicating his lofty theme of Sri Krishna's sublime 'Lila' to any man on throne or in palace. And he resided in the latter part of his long-life in a cave within a furlong from the village. The hillock is there by the side of a road, and the fountain, which supplied his wants, still runs; but the cave was demolished to make elbow room for a structure, intended to serve as a resting place, for the God of the temple when the festival comes round.

Mr. J. F Bryant, Collector of Cuddapah, paid a flying visit to the temple, made enquiries about Pothanna's abode and was shown the spot where the cave was And I had the privilege to be there with him through his courtesy. The demolition of a saint-poet's abode, struck the countryman of Shakespeare as a sacrilege And the neglected state of the sacred fountain appeared to be sinful to the Hindu mind The place attracts thousands of worshippers in the temple as well as the admirers of Pothanna"

* * * * *

ఈవిషయ మింతభక్తిపురస్సరముగ వ్రాసినగౌరవార్హులు కేశవపిళ్లగా రెవ్వరో నేను మీకుఁ దెలుపవలయునా ? గ్రామ్యవాదులరాయిడి కడ్డపడి యాంధ్రభాషాపవిత్రతను రక్షించిన పుణ్యాత్ములు వీరే వీ రొనర్చినసాహాయ్య మువలననే పాఠశాలలయందలిపండితులు మాతృభాషను నభ్యసించిన దోష ముచేఁ గాఁబోలు కాలుగంజిత్రాగువా రిపుడు సగముకుడుపైనఁ దినుచున్నారు.

మీఁది యనువాదములోని స్థలములను బ్రభుత్వమువారు చక్కఁజేయఁ బూనినపుడు కూడదనియు నది పోతనగా రుండినస్థలము గాదనియు దానికై ప్రభుత్వమువారు ధనవ్యయము చేయరాదనియు నోరుగంటివాదులు వ్రాసిరి. కాని దబ్బఱగాండ్రకు నసూయాపిశాచగ్రస్తుల కెట్టిగౌరవము జరపవలయునో యట్టిగౌరవమే జరపి ప్రభుత్వమువారు పోతన స్నానముచేయుచుండిన రామ తీర్థమును జక్కఁజేయించి దానితీరమున మండప మొకటి కట్టించిరి.

ఈవిషయము జరగినపుడు పంతులవా రొంటిమిట్టవారిపక్షమున స్థిర బుద్ధులై యుండిరి గాని యోరుగంటివాదులఁ గలయలేదు. ఈతీర్థము పోతన భూము లనిపిలువఁబడుభూములకుఁ బ్రక్కనే చెఱువుకట్టక్రింద నున్నది. ఈస్థ లములఁ జూచినవారు కట్టమీఁద శ్రీనాథుఁడు మడిలోఁబోతన యుండి సంభా షించి యుండుట కేయాటంక ముండ దని తలఁపక మానరు.

ఈవిషయములు మీకుఁ దెలిసినను దెలియనివారికై వ్రాసితిని. ఈసా యము కేశవపిళ్లగారే చేసిరి. ఏయాంధ్రుఁడును జేయనిమీఁదిసత్కార్యములు చేసినపిళ్లగా రాంధ్రులస్తుతికిఁ బాత్రులు. ఒంటిమిట్టతో నెట్టిసంబంధము లేక తటస్థులైనవీరు వ్రాసినలేఖ యోరుగంటివారివాదమును నిర్మూలించుచున్నది.

ఒంటిమిట్టకు నేకశిలానగరమునకుఁ గించిదర్థభేద మున్న దనుపంతుల వారిమాట వాదమునిమిత్త మంగీకరించెదను. ఒకపదార్థమునకు నొకప్రదేశ మునకు భిన్నకారణములచే భిన్ననామములు వచ్చుట వింతకాదుగదా ? నెల్లూ

రికి, విక్రమసింహపురికి నేమిసంబంధము? విద్యానగరమునకు విజయనగరమున కేమిసంబంధము? మదరాసునకుఁ జెన్నపురి కేమిసంబంధము? అలిమేలు మంగాపురమునకుఁ జిరుతానూరి కేమిసంబంధము? భువనగిరికి నేకశిలానగర మున కేమిసంబంధము*? ఇట్టి వెన్నియో కలవు.

(4) "నగరశబ్దము పెద్దపట్టణమునకుఁ జెల్లును గాని యొంటిమిట్టవంటి చిన్నయూరికి వర్తింపదు" అనిపంతులవారు వ్రాసిరికాని యిది వారు వ్రాయఁ దగినది కాదు. అనేకమండలముల సంచరించి నానానగరములను జూచినవా రిట్లు వ్రాయుటే వింత. కలకాల మొంటిమిట్ట యిప్పు డున్నస్థితిలో నుండినది కాదు. రాజధాను లనేకములు నామావశిష్టములై కొన్నియుఁ గుగ్రామములై కొన్ని యుఁ బేరైన లేకపోయి కొన్నియు నుండుట ప్రసిద్ధమే కదా? ఒంటిమిట్ట పూర్వ మింతచిన్నయూరై యప్రసిద్ధస్థల మయ్యెనేని యం దంతపెద్దదేవాలయ మెవ్వఁడు కట్టించియుండును? దానికి విస్తారముగ మాన్యము లెవఁడిచ్చియుండును? నేఁటికిని శిథిలములై కానవచ్చుబురుజులు ప్రాకారములు నెవ్వఁడు కట్టించి యుండును? పల్లెలయం దిట్టివికూడ నుండునా? ఈయూరికిఁ గొంచెముదూర ములో వేణుగోపాలస్వామిదేవాలయ మున్నది. అది పూర్వము గ్రామగర్భ మున నుండెనఁట. అంతియ కాదు. గ్రామమునకుఁ గొంతదూరములోఁ "గోట లోనిచే" లని కొన్ని కలవు. ఇవి కోట శిథిలమైనతరువాతఁ జేలుగా మార్పఁ

*న మనఁగా మూఁడని భువన మనఁగా నొకటి యని మ.రా రా.శ్రీ, కో. శ్రీనివా సరావుగా రనిరి. ఒంటికొండ యుండుటచే నాపేరు వచ్చె నని మ రా.రా శ్రీ, రామయ్యపంతులవా రనిరి. భువనమునకు నేడుసంజ్ఞ యనియే చదివియుంటిని. కావునఁ బంతులవారివాక్యమునకుఁ బ్రమాణము చూపరేని యంగీకార్యము కాదు. అటుగాక భువనగిరి యనునది యేకశిలాపర్యాయ మయ్యెనేని శిలా-శైలశబ్దములు పర్యాయములని నేనుముందు చెప్పినవాదము బలపడుచున్నది. ఒంటిగుట్ట యుండుటచే భువనగిరికి నేకశిలానగరమను పేరు సార్థకము గావచ్చును అప్పుడు పంతుల వారివాదమంతయు భువనగిరికి నన్వయించునుగదా భువనగిరివాసులు భాగవతమునఁ జెప్పఁబడిన యేకశిలానగరము తమగ్రామమని చెప్పినచోఁ బంతులవారు వారికేమి యుత్తరమిచ్చెదరో భువన మనఁగా నేడనుటకుఁ బ్రమాణము.

"శాలిన్యుక్తా మ్తౌ తగౌ గోబ్ధిలోకైః" వృత్తరత్నాకరము. దీనికి నొకవ్యాఖ్య "అత్రలోక శబ్దే సప్తసంఖ్యా వివక్షితా, ఏతే సప్తపదయో రాదశదిశస్సప్తైవ గోత్రాచలాః పాతాళ్యానపిస ప్త సప్తభువనాన్యేకంనభోమండలం ఇత్యనేన వృద్ధవ్యవహారేణ భువనాని సప్తేతి ప్రసిద్ధత్వాత్" మఱి యొకవ్యాఖ్యయందు, "అబ్ధిలోకైశ్చతుర్భి స్సప్తభిశ్చ వర్ణైర్యతిః."

బడినవి. ఇట్టివి సిద్ధవటము లోనగువానియందలి పాడుపడినకోటల యందన్నిటఁ గలవుగదా. వీనిని జూచిన గ్రామ మెంతవఱకు వ్యాపించియుండెనో తెలియఁగు. ఇంతయేల పాఱు వేఁటకొండ చుట్టి గృహము లుండె ననుటనిశ్చయము. అయినచో నిది పూర్వము పల్లెయో పట్టనమో మీరే నిర్ధారింపుఁడు. కావునఁ బంతులవారియూహ సరిగాదు.

వాదమునకై యొంటిమిట్ట యాగర్భకుగ్రామ మనియే యంగీకరించెదను. చిన్నయూరికి నగర మనుపేరు లేదా? అట్టివానిని బంతులవారు చూడలేదా వినలేదా? అట్టివానిని గొన్ని తెలిపెదను.

| జిల్లా. | తాలూకా. | గ్రామనామము. | ఇండ్లసంఖ్య | జనసంఖ్య |
|---|---|---|---|---|
| కడప | సిద్ధవటము. | ఒంటిమిట్ట | 930 | 4309 |
| నెల్లూరు | ఆత్మకూరు | నబీనగరము | 13 | 96 |
| ,, | వేంకటగిరి | దత్తనగరము | 0 | 0 |
| ,, | ,, | రాజనగరము | 0 | 0 |
| గోదావరి | భద్రాచలము | సీతానగరము | 36 | 283 |
| ,, | పెద్దాపురము | వేంకటనగరము (14) | 42 | 201 |
| ,, | ,, | ,, (45) | 12 | 49 |
| ,, | పిఠాపురము | సీతానగరము | 0 | 0 |
| ,, | రాజమహేంద్రవరము | సీతానగరము | 504 | 2574 |
| ,, | పోలవరము | సీతారామనగరము | 0 | 0 |
| ,, | ఎల్లవరము | వేంకటనగరము | 16 | 58 |
| చిత్తూర్ | పుత్తూర్ | సురేంద్రనగరము | 140 | 810 |
| ,, | తిరుతని | రాజనగరము | 162 | 1244 |
| ,, | చంద్రగిరి | శ్రీనివాసనగరము | 6 | 41 |
| ఉత్తరార్కాడు | పోలూరు | ఓడనగరము | 26 | 185 |
| ,, | పలమనేరు | విభూత్యాలనగరము | 11 | 65 |
| చెంగల్పట్టు | తిరువళ్ళూర్ | రాజనగరము | 242 | 1131 |

ఈనగరము లొకటి రెండుతప్పఁ దక్కినవి పంతులువారెఱుఁగనివి కావు, వీనిలో నొకటైన నొంటిమిట్టకు సమానమైనది లేదు. వీనికెల్ల నగరము లని పేరుండుట నిర్వివాదము. పంతులవారు వీనినెల్ల నెట్లు నిరాకరించెదరో, ఒంటి

మిట్టవంటి రాతిగొట్టునేలలోఁ బల్లెలోఁ బోతరాజువంటిమహాకవి యుండునా యన్నవారివాద మెట్టిదో యిదియు నట్టిదే

నగర మనుపే రొంటిమిట్టకుఁ దగునో తగదో వ్యుత్పత్తినిబట్టి చూతము. నగరమనఁగా నేమి? "క్రీడార్థంనగాః వృక్షాః పర్వతా వా అత్ర సం తీతి నగరీ విహారార్థమై వృక్షములుగాని పర్వతములుగాని దీనియందుఁ గలవు" అని లింగా భట్టీయము. ఒంటిమిట్ట సమీపమున నుండుపాలు వేటగుట్టను బూర్వము దానిఁజుట్టియలుగువంకవఱకు నావలకు గ్రామము వ్యాపించియుండుటయు మీరు స్మరించితిరేని యీవ్యుత్పత్తి యొంటిమిట్ట కన్వయించునని మీకుఁ దోఁపక పోదు. ఒంటిమిట్టకు నేకశిలానగరశబ్దము సరియైన సంస్కృతరూపము గాదని వాదించువారు సరియైనరూప మెట్టు లుండవలయునో సెలవిత్తురుగాక.

ఏకశబ్దము ప్రాచుర్యార్థమందును బ్రయోగించుట కలదు. అటు చూచి నను నొంటిమిట్టయం దది సార్థక మగుచున్నది ఈవిధముగఁ జూచిన నోరు గంటివారి మూఁడవయాధారము నిరాధారమై యొంటిమిట్టపైఁ జేసినయాక్షేపము నిస్సార మగుచున్నది.

### నాలుగవయాధారము.

"భోగినీదండకము పోతరాజు రావు సర్వజ్ఞసింగమనేనియుంపుడుకత్తె నుద్దేశించి రచించె నని లోకములో వాడుక కలదు. ఈదండకము పోతరాజు కృత్యమనుమాట సత్య మయ్యెనేని యదికూడ నోరుగల్లువాదమునకే యుపక రించు నని నాయభిప్రాయము" అని పంతులవారు వ్రాసిరి. ఈవాక్యమున "నోరుగల్లు" అనుదాని నొంటిమిట్టగా మార్చిన నెక్కువయుక్తియుక్తముగా నుండునని నాయభిప్రాయము. ఎట్లన,

బమ్మెరపోతరాజు వీరభద్రవిజయము వ్రాసినాఁ డనుట యెంతసత్యమో భోగినీదండకము వ్రాసియుండుట యంతసత్యమే యై యుండవచ్చును. కావునఁ బంతులవారిసందేహము న్యాయ్యమే. వాదమునకై వారంగీకరించినట్టు భోగినీ దండకము పోతరాజకృత మని నే నంగీకరించెదను. అయైనచోఁ బోతనా మాత్యుఁడు దరిద్రుఁ డగుట విత్తకాముఁడై బాల్యచపలతచే నాదండకము చెప్పినఁ జెప్పియుండవచ్చు నని తలంపవలయును. దానిని సింగమనాయఁ డాద రించినట్లుగాని బహుమతి యిచ్చినట్లు గాని తెలియరాదు. పోతరాజుగారి తరు వాతిచర్యవలన నిరాదరింపఁబడిన ట్లూహింపవలసియున్నది. ఆదరింపఁబడి

యుండినయెడల నాయన యుపకార మొనర్చినప్రభువును దూషించి కృతఘ్నుఁ డగుటకుఁ గారణము లేదు పూర్వపుఁబ్రభువులు కొందఱు తెల్గుకవుల మోసగించి కృతినొంది వారిని బరాభవించి వారిచేఁ జీవాట్లు తిని శాశ్వతాపకీర్తి గడించిరో యది లోకవిదితము. చంద్రరేఖావిలాపము ప్రబలదృష్టాంతము సింగమనాయఁడు వారిలో నొకఁడై యుండిన నుండవచ్చును. ఆకారణముచేతనే యాయనను మనస్సులో నుంచుకొని "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి" యని పోతరాజు నిందించి యుండవచ్చును. అంతియ కాదు. శ్రీనాథుఁడు దూతగా వచ్చినపుడు

ఉ "కాటుకకంటినీరు చనుకట్టుపైఁ బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యోమదంబ యో
హాటకగర్భురాణి నిను నాఁకటఁగాసముకోసరంబు క
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ముభారతీ"
అని పోతరాజు సరస్వతీదేవిని సంబోధించెను.

ఇందుఁ గర్ణాటశబ్దము సింగమనాయని నుద్దేశించియే చెప్పియుండవల యును. ఆంధ్రభాషకుఁ గర్ణాటభాష యని యాంధ్రప్రభువులకుఁ గర్ణాటప్రభువు లని పేరు గలదుకదా! కిరాటుఁ డనఁగా వైశ్యుఁడు, వైశ్యునకు హరవిలాస మంకిత మిచ్చినవాఁడు శ్రీనాథుఁడు. వీరి నిరువురను బోతరాజు దూషించె ననుట స్పష్టము ఇట్టివారికిఁ గృతినిచ్చుట తనతల్లి నిచ్చుటే యని పోతన యభిప్రాయ మని "మదంబ"యని సరస్వతిని సంబోధించుటే తెలుపుచున్నది.

ఈప్రకార మాయనను దూషించిన కవి యాయనరాష్ట్రములో నుండిన యెడల నాప్రభువు గ్రంథమునేకాదు కవినిగూడఁ బూడ్పించి యుండును. అట్టి మహాదశ పోతరాజుగారికిఁ బట్టకుండుటకు సింగమనాయనిరాష్ట్రములో నాయన లేకుండుటే కారణమై యుండవలెను. సర్వజ్ఞసింగమనాయఁ డోరుగంటియం దుండె ననుమాట నిజమైనచో భోగినీదండకము పోతరాజకృతమైనచో, బాల్య చపలతచే ధనాశచేఁ బోతరా జోరుగంటికిఁ బోయి యుండినచో నుండవచ్చును. అవమానితుఁడై మరలి వచ్చియు నుండవచ్చును. ఆమాత్రముననే పోతరా జోరు గంటివాఁడు కాఁజాలఁడు.

"పోతరా జొంటిమిట్టవాఁడైనను శ్రీనాథునివలెనే యోరుగంటికిఁ బోయి సర్వజ్ఞసింగమనేనిఁ జూచియుండఁ గూడదా యని యొంటిమిట్టవాదు లనవచ్చును. అదియు సమంజసమే." అని పంతులవా రొంటిమిట్టవారివాదము

సమంజస మనిచెప్పుచు నాయూహ సరిగా దనుటకు "శ్రీనాథునివలెఁ బోతరాజు బ్రహుదేశద్రష్ట యనికాని యనేకరాజుల నాశ్రయించినట్లుగాని ప్రమాణములు గానరావు. జనశ్రుతియు లేదు" అని యుక్తులు వ్రాసిరి.

ఈవాక్యములోనివిషయము లెంతమాత్రము సత్యములో బిదప నాలోచించెదఁ గాని పంతులవారి యుక్తులుమాత్రము నాకు బోధపడ లేదని వెంటనే చెప్పవలసియున్నది:—

ఆర్యులారా! నేనిచ్చటికిఁ బదునైదామడదూరములో నుండుప్రభువును నాజన్మములో నొక్కసారి చూచి వచ్చితిననిచెప్పిన నామాట స్థిరపఱచుటకు నేను "బహుదేశద్రష్ట" నని "యనేకరాజుల నాశ్రయించితి"నని మీకుఁ బ్రమాణములు చూపవలయునా? ఒకఁడు తనజన్మములో నొకచోటికి నొకసారి మాత్రము పోయియుండఁ గూడదా? ఇం దేవైపరీత్యము పంతులవారికిఁ దోఁచెనోకాని నాకేదియుఁ దోఁపలేదు. అందుఁ బ్రథమచుంబనములోనే దంతభగ్నమన్నట్టు లొకసారిపోయి యవమానపడి ప్రభువులయందు హేయబుద్ధి గల పోతన యనేకరాజులనాశ్రయించునా? కావున నొంటిమిట్టవాదులవారివాదము పైఁబంతులవారిప్రత్యాఖ్యానము బొత్తిగ యుక్తియుక్తము కాదు.

శ్రీనాథుఁడు ధనాశాపాతకుఁడై దేశములు ద్రిమ్మరి యుప్పుమిరపకాయలమ్ముకొనువారికిఁ గూడ స్వకృతికన్యకల విక్రయించి జీవించినవాఁడు. పోతనామాత్యుఁ డెఱిఁగినరాజు శ్రీరామభద్రుఁ డొకఁడే. తనకృతి నిమ్మని ప్రార్థింపఁ దనయింటికి వచ్చినరాజులను వారిదూతలను నిరసించు చిత్తౌన్నత్యము ధృతి గలవాఁ డాయన యొకఁడే. "శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెద లోకరక్షైకారంభకు" అనియుఁ "బలికిన భవహర మగునఁట" యని వ్రాసిన నివృత్తిమార్గనిష్ఠుఁడు పోతనామాత్యుఁడు. శిశ్నోదరపరాయణుఁడై తత్ఫలమనుభవించిన ప్రవృత్తిమార్గనిష్ఠుఁడు శ్రీనాథుఁడు. శ్రీనాథునివలెఁ బోతరాజు "బహుదేశద్రష్ట కాఁ డఁట. అనేకరాజుల నాశ్రయింప లే దఁట." ఎంతదోష మెంతదోషము!! "శ్రీనాథునివలెనే యోరుగంటికిఁ బోయి సర్వజ్ఞసింగమనేనిఁజూచి యుండఁగూడదా" అను పంతులవారి వాక్యములో రెండు దోషము లున్నట్టు తోఁచెడిని.

సర్వజ్ఞసింగమనాయఁ డోరుగంటియం దుండె ననుటయు, శ్రీనాథుఁడంపు నాయనను జూచె ననుటయు విశ్వసింపఁదగినవి కావు. ఏలన, శ్రీనాథుఁ

డు తాను సింగమనేని నోరుగంటిలోఁ జూచిన ట్లెందును జెప్పినట్టు లేదు. ఈకాలములో నోరంగల్లు తురకల యధీనమం దుండెను గాని స్వదేశప్రభువుల యధీనమందు లేదు. బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రిలవారు సింగమనాయఁడు రాజమహేంద్రవరములో నున్నట్టు వ్రాసిరి గాని యది తప్పని వారే యంగీకరించినట్టు పంతులవా రిప్పుడు చెప్పిరిగదా. కాశీఖండములోని,

ఉ. ప్రాకటవిక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
 నేకసితాతపత్త్రమున నేలెను వీరనృపాలుఁ డుత్తమ
 శ్లోకుఁడు వేమశౌరి యనుజుండు సమున్నతవైభవాఢ్యుఁడై
 చీఁకటియున్ గళింగయును జల్కసముద్రము సింహశైలమున్.

అనుపద్యమువలన శ్రీనాథునికాలమున రాజమహేంద్రవరమును నవేమారెడ్డి తమ్ముఁడు వీరారెడ్డి పాలించుచుండె నని స్పష్టపడియె. దానివలన సింగమనాయఁ డోరుగంటియందుఁ గాని రాజమహేంద్రవరమునందుఁ గాని యుండినవాఁడు కాఁడనుట విశదపడియె. అట్లైన నాయన యిఁక నెక్కడనుండె నన రాచకొండలో నున్నట్టుకొందఱు చెప్పెదరు. ఈరాచకొండ యోరుగంటికి 50,60 మైళ్లు దక్షిణమున నున్నది. అనఁగాఁ గడపకు 150 మైళ్లు ఉత్తరమున నున్నది.

గ్రహణస్నానమునకే పోతరాజు 100 మైళ్లు పోయి నూఱుమైళ్లు వచ్చె నని పంతులవారు వ్రాసిరికదా! అట్టివాఁడు పొట్టకూటికై 150మైళ్లు 7-8 దినములప్రయాణము చేసె నని చెప్పినఁ దప్పేమి ?

"The ruins of this old centre of Hindu power (Warangal) are still to be seen and are situated about 200 miles to the North of Cuddapah frontier" Cuddapah Dist Manual

దారిద్ర్యదోషమునఁ బోతరాజు రాచకొండకుఁ బోయియుండి పరిభవపడి వచ్చి నరపతిస్తుతివిముఖుఁడై వానరపతివరదుని సేవించుచుండె ననుట కేవల సమంజసము.

"కృతిపతి యోరుగంటిప్రాంతమువాఁ డైయుండినచోఁ బోతరాజు కూడ నాప్రాంతమువాఁడె యయి యుండు నని యూహించుట యసమంజసము కాదు" అని పంతులవారు వ్రాసిరి. ప్రాంత మనునది 150 మైళ్లవఱకు వ్యాపించు ననుటకుఁ బంతులవా రంగీకరించి రేని పంతులవారి యూహ సరియందును. సమీపమనఁగా 100మైళ్లని పంతులవారు వ్రాసినపుడు ప్రాంతమనఁగా 150మైళ్లు కాఁగూడదా ? అటుకా దందు రేని పంతులవారి యూహ సరిగాదు.

కవిప్రభువుల కానుకూల్యముండి కవి యాయాస్థానపండితుఁడు గా నుండినచోఁ బంతులవారి యూహ సరిదాఁకినఁ దాఁకవచ్చును. తప్పినఁ దప్పవచ్చును. కృతిభర్తది యొకదేశము కృతికర్తది వేఱొకదేశము గా నుండు సందర్భము లెన్నియో కలవు. కాని ప్రభువునందు విషమబుద్ధి గలకవి యతనిరాష్ట్రములో నుండుట పాముున్నయింటిలోఁ గాఁపురముండుటకంటె నపాయకరము. కావున బుద్ధిమంతుఁ డగువాఁడు ప్రభువుతో విరోధించి యతనిదూషించి యతనిరాష్ట్రములో నుండఁడు. కావునఁ బంతులవారి యూహ పోతనవిషయమున సరిగా దని యంటిని.

ఐదవయాధారము.

“ఇతరము లగుజనశ్రుతు” లని పంతులవా రొకవుట వ్రాసిరి గాని యం దోరుగంటివై రైనను గానరాదు. ఆకారణముచే బలిష్ఠప్రమాణ మైన జనశ్రుతి యోరుగంటివారికి హుళిక్కి యనుట స్పష్టము.

“ఒంటిమిట్టలో నొకానొకపాలమునకు బమ్మెరపోతరాజుగారి పొల మను వాడుక గల దనియుఁ, గోదండరామస్వామి యాలయములో నొకచోటు చూపి యచ్చటనే కూర్చుండి పోతరాజు భాగవతమును వ్రాసె నని యాగ్రామస్థులు చెప్పుదు రనియు నేను వినియున్నాఁడను” అని పంతులవారు వ్రాసిరి.

దీనిని బంతులవారు నిరాకరింపమి నొంటిమిట్టవాదులకృతజ్ఞతకుఁ బాత్రులు.

ఆఱవయాధారము.

భాగవతాంధ్రభాషావిశేషము :— ఈవిషయమున ద్రొబ్బు నూకు అనుశబ్దము లోరుగంటిప్రాంతమందును, ఒంటిమిట్టప్రాంతమందును గల వని పంతులవారు వ్రాసిరి. ఈశబ్దము లన్ని యాంధ్రమండలములఁ గలవు గాని యీామండలములో నుపయోగించునర్థముననే యందుపయోగించుచున్నా రని పంతులవారు సెలవిచ్చినవారు గారు. కొన్ని చోటుల భిన్నార్థములతో వాడఁబడెడిని. కాటుకకంటినీ రనుపద్యములోని ‘కోసర’ మనునది యోరుగంటి ప్రాంతమున లే దని విన్నాను. కోసము, కోసరము కడపమండలమున వాడఁబడుచున్నవి. కొన్ని మండలములవారి కీశబ్దములయునికియే తెలియదు. కొందఱు గ్రామ్యము లని భ్రమింతురు. ఇట్టి వారు కొంద ఱాపదమును బద్యమునుండి యెత్తివైచి మఱియేమేమో తమపై త్యవికారము కొలఁది వ్రాసిరి. ఇప్పటిగ్రంథ

శోధకులు, తమకర్థముగాని వానిని దమయభిప్రాయమునకు విరోధముగ నుండు వానిని భారతభాగవతనైషధాదులందే తమతిక్కకొలఁది సవరించి యాగ్రంథములను రూపుమార్పఁజేయుచుండ నీకఁ జాటువులా వారిధాటికి నాటుకొనును. ఇది పంతులవారు చాటు వందురేమో. అనిన నననింతు, పోతనపద్యముకా దని వా రనఁజాలరు.

'కనుక' ననునది యిట్లు వాక్యాలంకారముగ.

"వనజాక్షి నేఁగన్నఁ వైజయంతిక నైన
బింబోష్ఠి నేఁగన్నఁ బీతాంబరము నైన
కన్నియ నేఁగన్నఁ బాంచజన్యము నైన."

అని పోతరాజుగారు భాగవతమునఁ బ్రయోగించిరి.

ఇట్టి దీదేశమందు సాధారణముగ సంభాషణమందు విననగు. గోలకొండదేశమం దిట్టివి వాడుకయందు లే దని పిన్నాను. ఒంటిమిట్టవా రాదేశమంతయుఁ దిరుగఁజాల రనుధైర్యముతో ఒరుగంటి వాడు లీపదము లాదేశమం దున్న వని వాదార్థమై చెప్పవచ్చును. జోఁగాములు నిశ్చయించు టెట్లు? కావున గోల్కొండదేశ తత్కాలకవుల గ్రంథములం దిట్టిప్రయోగములు చూపువఱకు వీరిమాట లొంటిమిట్టవాదులు పాటిగాఁ గొనరు. అట్లు పూర్వగ్రంథములందు నీశబ్దము వారుచూపఁగలిగిరా యప్పు డీయాధార మిరువురకు సమానమే కావున నిష్ప్రయోజనము. చూపఁజాలకపోయిరా యోరగంటివారివాదము మఱింత యడుగంటి నట్టగును. వలయునేని విరామము కలిగినప్పు డిట్టివి మఱికొన్ని యేఱి వ్రాసెదను.

ఒంటిమిట్టవారివాదము.

ఒంటిమిట్టవారివాద మిదివఱకే గ్రంథస్థమై యున్నది. ఇప్పుడు నేను నూతనముగ సృష్టించికాని క్లిష్టకల్పనము చేసిగాని చెప్పవలసిన దేదియు లేదు. అయిన నుపక్రమంబున నిదియు సంకల్పించి యుంటుటచే దీనిని సంగ్రహముగ విన్నవించుకొనుచున్నాను. బొమ్మెరవారివాదము - ఓరుగంటివారివాదము పూర్వపక్షము చేయఁబడుటచేత నే పరిశేషన్యాయమున నొంటిమిట్టవారి వాదము సిద్ధాంతిత మయ్యెను.

ఒంటిమిట్టవారివాదముపై వచ్చినయాక్షేపము లన్నియు ఖండితములగుటచేతనే వారివాద మేలోటులేక యథాపూర్వము స్థిరపడెను.

అయినను నొంటిమిట్టవారికిఁ గలయాధారములు తెలియఁగోరువారికై వానిని సంగ్రహముగ విన్నవించుకొనుచున్నాను ఇందుఁ గొన్ని ముందే విపులముగఁ జర్చింపఁబడినవి.

(1) బమ్మెరపోతరా జేకశిలానగరంబున భాగవతంబు రచించితి నని చెప్పెను. ఏకశిలానగర మనుపే రొంటిమిట్టకును గల దని యనేకకారణములచే ముందు స్థాపించితిని.

(2) పోతరాజు పశువులమేపినస్థలము, దున్నినపొలము, స్నానముచేయుచుండినతీర్థము, కాఁపురముండినయిల్లు, భాగవతము వ్రాయుచుండినస్థలము, వీనిని జూపువారు నేఁటికి నున్నారు.

(3) పోతరాజు విగ్రహ మని నేఁటికిని నొకవిగ్రహము దేవాలయమునఁ గానవచ్చుచున్నది.

(4) పోతనామాత్యుఁడు తనమేనమామయింటి వంశమువాఁడని చెప్పునట్టి యవ్వ నేఁటికి నున్నది. ఇది నిజ మని, నెందలూర్ కోర్టువకీల్లు మ. రా. రా. శ్రీ. ఆ. పరశురామరావుగారు మొదలగువా రిప్పుడు పంతులవారియెదుటనే సభలోఁ జెప్పిరిగదా.

(5) పోతరా జొంటిమిట్టయం దుండె నని కడపమండలవాసులు గానట్టి పురాణము హయగ్రీవశాస్త్రిలు లోనగువారు మున్నే వ్రాసియున్నారు.

(6) ఒంటిమిట్టయందే గాక కడపమండలమందే గాక తదితరానేకమండలములందును బోతరా జొంటిమిట్టవాఁ డనుజనశ్రుతియే ప్రమాణము. ఆంధ్రవాల్మీకి రామాయణము శ్రీరామున కొంటిమిట్టలో నంకితమిచ్చిన దినములలో నాబాలగోపాలము నానామండలములవారు వేలకొలఁది జనులు ఘోషించుచుండిన బమ్మెర పోతరాజునామము వినినవాఁ డెంతటిశంకితుఁడైనను బోతరా జొంటిమిట్టవాఁడు గాఁడన సాహసించునా? అట్టిమాట వాఁడు నాలుకకొనకుఁ దెచ్చుటకైన మనస్సువచ్చునా? బమ్మెరపోతరాజు మరలవచ్చినాఁ డనియే కదా జనవాదము సర్వత్ర ప్రబలియుండెను. ఒరగంటివారు గోదావరిని గంగ యనెద రని చెప్పినంతమాత్రమున సులభముగఁ బంతులవారు బేలుపోయి యభిప్రాయము మార్చికొనిరి గాని యంకితకాలమున వా రొంటిమిట్టకు వచ్చియే యుండిన నిట్లు సంశయించి యుండ రని నానిశ్చయము.

నేను సిద్ధవటము తాలూకాలో రెవిన్యూ ఇన్స్పెక్టరుగా నుండినకాలములో నొంటిమిట్ట నాకు సంబంధించిన గ్రామముగా నుండెను. అప్పు డాయనను గుఱించి విచారింపఁగాఁ దద్వంశమువా రెవరు లేరనియు నాయన కాఁపురమున్న యిల్లిదే యనియు నొకయిల్లు చూపిరి. ఆయింటఁ 'గాలువవా' రను వారు కాఁపురముండిరి. ఆయింటివారు నదేమాట చెప్పిరి ఆయింట మూఁడు దినములుండు భాగ్యము నాకు లభించెను ఇప్పు డాయింటిపట్టునఁ జిన్న సత్రమున్నది. రామాయణాంకితకాలమందు నాకీసత్రమే యొసఁగఁబడెను. దీనివలనఁ బోతనామాత్యుని పే రాగ్రామమువా రెంత బాగుగ జ్ఞప్తియం దుంచుకొని యుండునదియు, పోతరా జందుండుటయే యసత్యమేని పామరులును దానిని జ్ఞప్తియందుంచుకొన సాధ్యపడి యుండ దనియు, సత్యమే గాకున్నఁ బంతులవారు చెప్పిన యీ "చిన్నయూరి" యం దీవార్త పుట్టఁ గారణమే కలుగదనియు నుదారచిత్తు లగు విజ్ఞులకుఁ దోఁపకమానదు. అయ్యలరాజు రామభద్రుఁ డాయూరివాఁ డనుట నిస్సందేహము కదా. ఆయన పే రాయూర నెవ రెఱుఁగుదురు? ఏల? పోతనామాత్యునిమహిమ యెద్దులు లేక మడకదున్నించుట, శ్రీనాథాదులు వచ్చినపుడు భగవంతుఁడే భోజనపదార్థములు తెచ్చి యిచ్చుట, శత్రురాజులఁ బరాభవించుట లోనైనవి ప్రజలమనస్సున బాగుగ నాటకున్న వారేల యిన్నిశతమానములుగ నాబీదబాఁపని స్మరింతురు.

మీఁదవివరించిన యాధారములకంటెను ప్రబలాధారము లేకపీవిషయమున నేగ్రామమువారు తేఁగలరో చూడవలసియున్నది. భాషావిశేషములు లోనైనయాధారములు రెండుమూఁడుమీఁదఁ జేర్చియుండలేదు.

ఆర్యులారా! యిప్పుడు నేఁజెప్పిన విషయము లన్నియు నాలోచించి నిష్పక్షపాతబుద్ధులై యొంటిమిట్టవారి వాదమందు బలముగలదో లేదో తెలుపఁ గోరుచున్నాను. ఇన్నియాధారములు గలయొంటిమిట్టవారివాదమే బలహీనమై పేరుమాత్రము గల యోరుగంటివారివాదమే బలీయమైనచో నింతకంటెను వింతయేది? ఈవిషయము మధ్యవర్తులు పరిష్కరింపవలసి యుండు నని పంతులవారు చెప్పిరి. పంతులవారు న్యాయైకదృక్కు లనియు వితండావాదవిముఖు లనియు నమ్మి నే నీవాదములోఁ దిగి వారికిఁ బ్రత్యుత్తర మీయఁబూనితిని. వారు తెలిసి కొన్ని తెలియక కొన్ని విడిచినవిషయము లన్నియు వారిస్మరణమునకుఁ దెచ్చిన యెడల వారే యొంటిమిట్టవారికి జయ మొసంగుదు రను నమ్మకమే

న స్నేశ్రమమునకు లోపఱిచెను. కావున నేను బట్టినవాదము చెడునే యను నహంత వదలి న్యాయమంద మనస్సు నిలిపి బలాబలము లారసి పరిష్కరించినచో వారితీర్పు నా కభిమతమే.

క. “ ఘనసామర్థ్యముగలిగియుఁ
దనదోషమెఱింగి యెవఁడు దానిం బలుకున్
వినయంబున మాయన్నయు
నినతనయా! నీవొకండు నిద్దఱు తక్కన్.”—కిష్కింధాకాండము.

అని తనదోషము తాఁ జెప్పుకొనుట యొప్పైన గొప్పగుణమే. అట్టిగుణము సామాన్యులయం దుండదు.

అటుగాక పంతులవారు వాదమునకే కడఁగిరేని వారియుత్తరములకుఁ బ్రత్యుత్తరమును, నీవిషయమై వ్రాయవలసి యసమయమగుట వదలిన మఱి కొన్నివిషయములను రెండవభాగమునఁ బ్రకటింతును.

వా॥ సుబ్బరావు.

శ్రీరామార్పణమస్తు.

## అనుబంధము. I

క్షేమం.

NARASARAOPETT,
13-12-16.

MY DEAR BROTHER,

Your kind card to hand. I made enquiries of two learned men of this place who are acquainted well with these parts, regarding the information that you wanted They say that the correct pronounciation of the village in Telugu is ఏఱ్చూరు It is said that the name of this village as ఏఱ్చూరు occurs in some Telugu works, In the ordinary popular usage it is called ఏల్చూరు, but it is not correct In that village there is even now an old Telugu Pandit named పోతరాజురామకవి He has written a book called నీలకంఠశతకము I saw that book myself In that the name of the village appears as ఏఱ్చూరు. The Pandit calls himself as ఏఱ్చూరిరామకవి Moreover, it is said, that the Telugu poet Yerrapragada was born and lived in this village, and the villagers say మాయెఱ్ఱప్రగడ meaning thereby that ఏఱ్చూరియెఱ్ఱప్రగడ was a native of this village. Hoping you are doing well

I am,
Yours truly,
A SUNDARARAJA ROW, B A,
*Sub-Registrar.*

## అనుబంధము. II.

శ్రీనీలకంఠశతకము. ఇదిముద్రితగ్రంథము - ప్రతిసీసపద్యము కడపట “నిత్యనందిత వైకుంఠ దైత్యలుంఠ, నిరుపమోత్కంఠ యేర్చూరినీలకంఠ” యని యున్నది. కడపట గద్యములో “ఇది శ్రీమదేర్చూరి లక్ష్మీనరసింహాకరుణాకటాక్షలబ్ధ కవితాధురంధరుండును.........నగురామకవిచే రచియింపఁబడిన నీలకంఠశతకము సంపూర్ణము” అనియున్నది.

## అనుబంధము. III

శ్రీరామ.

అయ్యా, ఇదివఱకు పూర్వము శాలివాహనశకము ౧౪౫౭వ సంవత్సరమునకు సరియగు మన్మథనామసంవత్సర భాద్రపదమాసమునందు గ్రామకరణము శ్రీవత్సగోత్రుఁడు చీమకుర్తి శంభయ్య అనేవాడు తటాకమొకటి వేయించి అందుకు దాఖలాగా సదరుచెరువులో వేసిన శిలాశాసనమందు "ఏర్చూరు" అనియే యున్నది. ఇదిగాక షుమారు రెండువందల సంవత్సరములక్రిందట రాజశేఖరుఁడనుకవిరచించిన అంబరీషోపాఖ్యానమను గ్రంథమునందు "సీ. శ్రీకరయోగీంద్ర సిద్ధమునీశ్వర చారణసంచారమేరుచూరు। అఖిలాండకోటి బ్రహ్మాండనాయకవీర నారసింహక్షేత్రమేరుచూరు। కాంచనప్రాసాదకమనీయ నవరత్నతోరణభాసురంబేరుచూరు। చందనమందారసకలాగమామోదదేందిరామందిరంబేరుచూరు। భూరిధనధాన్య పూరితంబేరుచూరు। చారుకాసారభాసితంబేరుచూరు। కుతలమందున శ్రీవినకొండ సీమ। నేర్పుకొన్నట్టి యూరు మాయేరుచూరు." ఈపద్యమునందలి చివర రెండుపాదములవలన గ్రామమునకు "ఏర్చూరు" అనుపేరు వచ్చినవిధము కనుపట్టుచున్నది. ఇదిగాక భాగవతషష్ఠస్కంధమున సీ॥ శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁడాపస్తంబసూత్రుఁడ పారగుణుఁడు। నేర్చూరి శాసనుండెఱ్ఱనప్రెగ్గడ పుత్రుండు వీరనపుణ్యమూర్తి" అను పద్యమందుఁగూడ నేర్చూరు అనియే చెప్పఁబడియున్నది. పూర్వికవికృత చాటుపద్యము. ॥కం॥ శ్రీరామచంద్రపదసర। సీరుహమకరంద పానమత్తమిళిందా। ఘోరదురితాగ్నికందా। యేరుచురి పురాంజనేయ యినవిభకాయా॥ పోతరాజు రామకవి మున్నుగాగల కవీశ్వరులు చెప్పిన గ్రంథములయందును "ఏర్చూరు" అనియే చెప్పఁబడియున్నది. అయితే కవులు సందర్భానుసారముగ "ఏర్చూరు" "ఏరుచూరు" "ఏరుచురు" అనివాడుకొనిరిగాని ఏల్చూరు అని యెక్కడను వాడియుండలేదు, అయితే వ్యావహారికలిపియందును సర్కార్ లెక్కలయందును యేల్చూరు అని వాడుచున్నారు మాకు తెలిసినంతవఱకు వ్రాసిపంపినాము చిత్తగింపవలెను.

13-12-1916.

పోతరాజు లక్ష్మీనరసింహకవి అష్టావధాని.

## అనుబంధము IV

పోతరాజువారు అనేయింటిపేరు ఏలావచ్చినది చెప్పుటకు తగునైన దృష్టాంతరములు ఏమియు కనుపించలేదు. యర్రాప్రగడ అనేవారిగోత్రము మా గోత్రము ఒకటే. అనగా శ్రీవత్సగోత్రమయియున్నది. అందువలన మాకుటుంబ ములో వాడని అభిప్రాయము. మావంశమునకు ఎప్పటికి పోతరాజువారనే యింటి పేరున్నదిగాని వీరుకొందరు యేరుచూరినుండి లేచి యితరగ్రామములకు వెళ్లి కాపురముచేయుచున్నందున వారికిమాత్రము ఏరుచూరివారని యింటిపేరువచ్చి నది అందువలననే యర్రాప్రగడ అనుకవీశ్వరుడు యేరుచూరునుండి యితర గ్రామమునకు కాపురము వెళ్లుటచేతనే యేరుచూరువారని ఇంటిపేరువచ్చినది.

పోతరాజు అనుపేరుగల మావంశపురుషుడు ఒక ప్రతిష్ఠితుడైనందున ఆయనపేరే మాయింటిపేరువచ్చినట్టు తెలియునుగాని అంతకువిశేషమేమియు చెప్పజాలము మావంశవృక్షము కొంతవఱకే యున్నదిగాని అంతబాగుగా పెద్దలు వ్రాసియుండలేదు. భాగవతములోచేరియున్న సింగన్నఅనుకవి మావంశ ములో వారేఅని చెప్పవచ్చును. ఏలనన ప్రస్తుతము కనుపించు మావంశవృక్ష మందు సింగన్న అనుపేరువున్నది. మాగ్రామములో ఏర్చూరువారని ఇంటిపేరు గలవారు వున్నారుకాని వారిది శౌనకస గోత్రముగాన యేర్చూరుసింగన్న మా వంశములో వారేగాని యేర్చూరువారనిచెప్పే శౌనకసగోత్ర వంశీకులుకారు.

పైకారణములనుబట్టి యేర్చూరిసింగన్న అనేకవి నర్సారావుపేట తా లూకా ఏర్చూరి కాపురస్తుడేకాని గోలకొండ డివిజను యేర్చూరి కాపురస్తుడు కాడు. మావంశమూలపురుషుడుపోతరాజుకున్ను బమ్మెర పోతరాజుకున్ను చుట్టరికము వుండవచ్చును. ఏలనన వారిదికౌండిన్యసగోత్రము అయియున్నది. కౌండిన్యసగోత్రులకు మాకు సంబంధములున్నవి.

ఇట్లు విధేయుడు

పోతరాజు రామకవిగారిపుత్రుండు చిన్నలక్ష్మీనారాయణవ్రాలు.

9-1-17.

Note ఈ యనుబంధముల మూలప్రతులన్నియు సాహిత్యపరిషత్స్థానమున బదిలపఱుప నీయఁబడినవి.

వా॥ సుబ్బరావు

## అనుబంధము V

## సర్వోపనిషత్సార సంగ్రహము.

శ్రీమద్వైభవప్రాభవే కృష్ణాగోదావర్యోర్మధ్యప్రదేశే కతిపయగ్రామాగ్రగణ్యం । ఏకశిలానగరీనామక భువనగిరిరితి పుణ్యక్షేత్రంప్రసిద్ధం । తదీయాశీమాంతరాభిరామం వేంకటాపురం అనంతశిద్ధసంచారక్షేత్ర మితిప్రకాశమానం భవతి । తత్సిద్ధక్షేత్రేఅత్యంన్నతం నిఖిలౌషధాశ్రయం శరభశార్దూలాద్యఖిల మృగనిలయం బహువిధగుహావహాంధరాధర శృంగంశృంగారం భవతి ॥ తస్మిన్నంధకారబంధురం । పరిపూర్ణామృతసరోవరాం తర్గతం । చిరకాలవృద్ధశిద్ధాశ్రయం ప్రాలేయాచలాంతం । మార్గనిర్గమం సకలకలుషౌఘ సంహారశ్రీమహాలక్ష్మీ నృశింహస్వవిహారగేహం ఏకంగిరిగంహ్వరం భవతి ॥ తస్మిశ్శ్రీమహాలక్ష్మీ నృశింహాదేవః. అనంతసిద్ధజనబృందై రత్యంతార్చనై ర్నిత్యకృత్యైః ప్రకాశమానోభవతి........

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శా॥శ. ౧౭౩౦. ప్రభవనామసం॥ శ్రావణ శు. ౧౫లవణికు వృద్ధమట్టి వెంకటరావుగారిచే రచియింపఁబడినది.

(ఈయన శ్రీ కృ. గోదావరిమధ్యమునందలి గోల్కొండపట్టణసామీప్యముననున్న భోనగిరితాలూకాలో వృద్ధమఁత్రిపరగణా జమీందారున్ను దేశపాండ్యాయున్ను... ..వృద్ధమఁత్రికాపురస్థులును.........గురుదత్తాత్రేయులవారి శిష్యుఁడు.)

ఈగ్రంధము సాహిత్యపరిషత్తువారు సేకరించిన యముద్రితగ్రంథములందున్నది.

వా॥ సుబ్బరావు.

# కవితారహస్యము.

—००*००—

లోకములో మనకు బోధపడుచుండు వస్తువులును, గుణములును, క్రియలును నాలుగుతెఱఁగులైయున్నవి. కొన్నిటిని బ్రత్యక్షముచేఁ దెలిసికొనుచున్నాము కొన్నిటి ననుమితిచే నూహించుచున్నారము. కొన్నిటిఁ బోలికచే నవగాహనచేసికొనుచున్నాము. కొన్నిటిని శబ్దప్రమాణముచే (అనఁగా బురాణాదులలో వినఁబడుచుండుటంబట్టి) నెఱుంగుచున్నాము.

ఇందులో శబ్దప్రమాణముచే గ్రహింపఁబడుచుండెడివి యొకకొన్ని సందర్భములయం దాయూరసంబుల కలౌకికవిభావాదు లనం బరఁగుచు శబ్దగతమైన సౌందర్యమునకుఁ గారణములైన రీతులయొక్కయు శయ్యలయొక్కయు ననుప్రాసాదులయొక్కయుఁ బరిపుష్టివలనను నర్థాలంకారములవలనను, పాకగుణాదులవలనను బ్రహ్మానందసహోదర మయినయలౌకికానందమును గలుగఁజేయునవి యగుచున్నవి

ఇట్టివాఙ్మయము సైతము రీతులు వృత్తులు మొదలైనయుపస్కారము లెన్నియున్నను, పైనిఁ జెప్పఁబడిన విభావాదులవలన నేర్పఱుపఁబడు రస మనునది స్ఫురింపనినాఁడు సహృదహృదయాహ్లాది కానేరదు. కావుననే "సాధ్యో హి రసోయధాతథం కవిభిః" అని ప్రామాణికు లనిరి. "రమణీయార్థప్రతిపాదక శ్శబ్దః కావ్యం" అని యర్థముయొక్క చక్కఁదనమే కావ్యమునకు ముఖ్య మని బోధించు రసగంగాధరకారుని నిర్వచనము సైతము, రమణీయత యనునది శాబ్దప్రపఞ్చమందు రసధ్వనిమూలకమే కావునఁ గావ్యమునకు రసప్రాధాన్యమునే చెప్పుచున్నది.

తదదోషౌ శబ్దార్థౌ, సగుణా వనలఙ్కృతీ పునఃక్వాపి" అను మమ్మటభట్టు నిర్వచనమునందును గుణములకుఁ బ్రాధాన్యమిచ్చుటచే "యేరసస్యాంగినోధర్మాః" అనువాక్యశేషమువలన రసము లుండనిచో గుణము లుండవు గనుక రసములే కవితకుఁ బ్రధానము లని చెప్పినట్లయినది.

సాహిత్యదర్పణకారుఁడు విశ్వనాథకవిరాజు "వాక్యం రసాత్మకం కావ్యమ్" అని స్పష్టముగనే కావ్యమునకు రసప్రాధాన్యమును జెప్పియున్నాఁడు.

ఇట్లఖిలాభిరూపజనసాధారణముగాఁ గావ్యప్రాణమని స్వీకరింపఁబడిన రసమును స్వస్వప్రబంధములలోఁ గవు లెట్లు సిద్ధింపఁజేసికొనవలెనో చర్చింపవలసి యున్నది.

"విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" అని రససాధనప్రకార మొకవిధముగా భరతాచార్యులవారిచే నిరూపింపఁబడినది. ఐనను, గొన్ని ప్రబంధములలోఁ గొందఱుకవులు విభావాదులను స్పష్టముగా వర్ణించియు రసము నచ్చట విబుధజనాస్వాద్యముగఁ జేయఁజాలకున్నారు.

ఉత్తరరామచరితములోని శ్లోకములు చదివినప్పుడేమి కాళిదాసుని రఘువంశములోని కొన్ని సందర్భములలో (అనఁగా దిలీపసింహసంభాషణము, రఘువాసవసంభాషణము, రఘుకౌత్ససంభాషణము మున్నగునవి) శ్లోకము లవలోకన చేసినప్పుడేమి చదువరుల కొక్క మహానందము స్ఫురించి పులకాంకురములు గలుగుచుండుట సహృదయుల కెల్లర కనుభవసిద్ధమే.

అది యేమో కాని మఱికొన్ని ప్రబంధాదులలోఁ గొన్నిచోట్ల నాయా రసములకు సంపాదకములయిన విభావములు, సాత్త్విక భావములు, వ్యభిచారి భావములు మున్నగునవి శాస్త్రప్రకారముగా వర్ణింపఁబడి యుండునుగాని వెనుక వ్రాయఁబడిన ట్లానందము చదువరుల కుద్రేకముగాఁ గల్గుటలేదు.

ఈయంశమునే సాహిత్యదర్పణముయొక్క వివృతిపూర్తియందు దుర్గాప్రసాదద్వివేదుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.

> శ్లో॥ రసాదిషు వివక్షాతు స్యాత్తాత్పర్యవతీ యదా
> తదానాస్త్యేవ తత్కావ్యం ధ్వనే ర్యత్ర నగోచరః ॥
> రసభావాదివిషయ వివక్షావిరహే సతి
> అలంకారనిబంధో య స్సచిత్రవిషయో మతః ॥

తత్పరత్వముతోఁ గూడుకొనిన కవివివక్షయే రససిద్ధికిఁ గారణ మగునని యీశ్లోకములలోఁ జెప్పఁబడిన యుత్తరము, 'వస్తువర్ణనము లేనికావ్య ముండదు కదా; చిత్తవృత్తివిశేషమే స్వరూపముగాఁ గలరసముల కేవస్తువంగముగా కుండును.' అను తనయాశంకకే సమాధానముగ వ్రాయఁబడినది.

దీనింబట్టిచూడఁ గేవలము విభావానుభావాదులను గుప్పించుటయే రససాధకము కానేరదనియుఁ గవికిఁ దత్పరత్వము (అనఁగా రసానుభవమువలన గలుగుపారవశ్యము) ఆవశ్యక మనియు స్పష్టముగఁ దేలుచున్నది.

రామాయణారంభమందలి వాల్మీకియుపక్రమము సైత మీరీతిగానే కవియొక్క యర్హతను సూచనగా వ్రాయబడుచున్నది. పరస్పరానురాగపారవశ్యమున రెండును గలసిమెలసి ముక్కులు కొఱుకుకొనుచు నీకలు సవరించుకొనుచు నేమేమో ప్రమోదము లనుభవించుచున్న పక్షులజంటలో నొకదానిని, దన బాణపాతమునకు గుఱిచేసిన దారుణచిత్తుఁ డగుకిరాతునిఁ జూచుతఱి వాల్మీకి చిత్తవృత్తి తత్కాలజాతము లగువాత్సల్య.శోకక్రోధాదులలోఁ దన్మయత్వముం గాంచుటం బ్రతిపదరసాస్పదంబగు......

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్."

అనుపద్య మమ్మునివాగ్జలజాలమునుండి మకరందమువలె వెలువడినదఁట వెను వెంటనె భారతీహృదయవారుఁ డగువిధాత సాక్షాత్కరించి మొసంగి కవితాపరికర మార్ద్రహృదయుఁ డగువాల్మీకిమునివర్యునకు సమగ్రముగా నలవడియుండుట నిశ్చయించి శ్రీమద్రామాయణమహాకావ్యనిర్మాణమున కీవ తగుదు వని వరణమిచ్చి చనెనఁట

చూచుఁడు. అప్రయత్నముగఁ దనభావము శ్లోకరూపముగ లయ కనుగుణమై తనవాక్కునుండి వెలువడుట కెంతటిపారవశ్య మావశ్యకమో; ఎంతటియార్ద్రహృదయత యపేక్షితమో, అంతటిసత్త్వోద్రేక మమ్మునిమనమునఁ దిలకించికదా కవితాయోగ్యత నచ్చట విధాత నిర్ధారణచేసెను. లోకజ్ఞత శాస్త్రజ్ఞత మున్నగునవి కవిత్వపరికరము లంతకుఁ బూర్వము వాల్మీకికి లేవా? కావున దీనివలన సర్వోపకరణములకన్నను రససిద్ధ్యనుకూల మయినయార్ద్రహృదయతయే కవి యగువానికి ముఖ్యతమ మని బోధపడుచుండెడిని

ఈయార్ద్రహృదయతయే సత్త్వోద్రేక మనియు నదిలేనినాఁడు పాఠకులకు సైతము రసోద్రేకము గలుగ దనియు రససిద్ధాంతవేత్తల సంప్రదాయము. ఇయ్యది కొందఱ కాజానసిద్ధమై వారు మాటలాడునప్పు డామాటలయందు సైతము రసము ప్రవహించుచునే యుండును. కొందఱ కీయార్ద్రత జన్మసిద్ధమై లేకపోయినను గావ్యపరిశీలనాది బలమువలన నేర్పడి యాస్వాద్యము లగుభావాదు లుదయించుటకుఁ గారణ మగును. ఇందు మొదటివిధము ప్రయత్నసాధ్యము కాదు, కావున దానివిషయమై చర్చ యావశ్యకము కాదు. రెండవయభ్యాసము వివరించి చెప్పఁబడవలసినదై యున్నది.

సంస్కృతములో నేమి తెలుఁగులో నేమి కావ్యములను, జదువుపని భాషాప్రవేశసాధనము-గాఁ బ్రస్తుతకాలములోఁ బరిగణింపఁబడుచున్నది ఇందు చేతఁ జిన్నతరగతిలోని విద్యార్థులు మాత్రమే కావ్యములలోఁ గృషిచేయువారుగ నేర్పడుచున్నారు. వారి బుద్ధి దురవగాహమగుచున్న బాసను దెలిసికొనుటయందు మాత్రమే పర్యవసన్న మగుచుండెడిని. ఇఁక రసములమాట యెక్కడ? కావునఁ గావ్యపరిశీలనఫలముగ మనచే నిర్ధారణచేయఁబడిన యార్ద్రహృదయత లేక సత్త్వోద్రేక మామాదిరి ప్రాథమికల్పికుల కావ్యపరనముచే లభ్య మగునది కాదు. ప్రౌఢసాహితీపరిపక్వప్రతిభు లగుపండితుల చేతులలోనికిఁ గావ్యములెక్కి యేనాఁడు వారిహృదయములలోనికిఁ గావ్యమాధుర్యము సారఁగల్గి వారినానంద మోహితులుగఁ జేయుచుండునో, యానాఁడు కదా కావ్యపరిశీలనఫల మనునది విమర్శకులకుఁ గన్నులకుఁ గట్టినట్టు కన్పట్టును.

కావున దృఢ మగుభాషాప్రవేశము గలిగినపిదపఁ బ్రతిభావంతులు మహాకవినిర్మితము లగుసరసకావ్యములలోఁ బరిశీలనపురస్సరముగ వ్యాసంగము సేయుదురేని క్రమముగ నమ్మహాకవులచే నుపదేశింపఁబడుచుండెడి లౌకికశాస్త్రీయరహస్యములు గ్రహింపఁబడుటయే కాక యాస్వాద్యము లగుసరసార్థములలోఁ దమప్రతిభలు మగ్నోన్మగ్నము లగుచుఁ దన్మయత్వం బాపాదించుచు మహానందానుభవముఁ గలిగించుచుండుటం జేసి యీయభ్యాసమే క్రమముగ దృఢీభవించి పరిపక్వ మై వెనుక నుపపాదింపఁబడిన యార్ద్రహృదయతకు లేక సత్త్వోద్రేకమునకు నిదాన మగును.

అనఁగా, ఎవఁడు కవి గాఁ గోరుచున్నాఁడో వాఁడు సరసభావసృష్టి తన కలవడుటకై రసికు లగుమహాకవులచే నిర్మితము లయినయుత్తమకావ్యముల నెక్కువగాఁ బరిశీలనసేయుచుఁ దత్పరత్వముతోఁ జదివి గ్రహించి మననముఁ జేసి కావ్యజ్ఞుఁ డనిపించుకోవలెను. అప్పటి కతనిహృదయ మార్ద్రార్ద్రమై రసభావాదు లుదయించుటకుఁ దగియుండును. లోకజ్ఞాన శాస్త్రజ్ఞానములచే సభ్యతఁ గన్నయీయార్ద్రహృదయుఁడు సుకవి యై వాక్కుసుమమాలలచే భాషాభవనము నలంకరింపఁ గలవాఁ డగును. ఆకవీశ్వరునిపద్యములే ప్రతిపదరసాస్పదములై సహృదయుల కనిర్దేశ్యమును నవాఙ్మనసగోచరమును నగు బ్రహ్మానంద సహోదర మయినయానందమును గలిగించునవి యై విరాజిల్లుచుండును.

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి.

(కడప పరిషత్సభలోఁ జదివినపద్యములు.)

ఉ॥ స్వాంతమునన్ భజించెద విశాలదృగంచలచంచలావళీ
కాంతకటాక్షవీక్షణవికస్వరదీధితిరక్షితాఖిలా
శాంతరదేశశాంతికలనావహదీక్షు వహింప శ్రీమనః
కాంతుని శాశ్వతాభ్యుదయ గౌరవహేతుకృపానిశాంతునిన్ ౧

సీ॥ నన్నయకవి వచోనైగనిగ్యప్రభాదీపితధారలోఁ దీర్థమాడి
తిక్కనకవిరాజు దిద్ది తీర్చిన జిల్గుపల్కులయందంబుఁ బడయఁగల్గి
శ్రీనాథకవిమౌళిచెంత నే శృంగారచేష్టాభినయములశిక్షఁ గాంచి
పెద్దనకవివర్యుప్రేమకుఁ బాత్ర మై భావానుభావసౌభాగ్య మెఱిఁగి
సహృదయహృదయరంగప్రచార మొనసి
రాజిలినయాంధ్రభారతి రమ్యకళల
జా నగుజయాంకములు దాల్చునమయ మయ్యెఁ
దనియుఁ డాత్మీమలబ్ధి కాంధ్రజను లెల్ల ౨

సీ॥ రాజరాజనరేంద్రు పూజితపక్షపాతాతిశయాదృతి నధిగమించి
మనుమభూపాలసమ్మాననాసంలబ్ధసౌష్ఠవపుష్టి విస్మయ మొసంగి
వీరభద్రారెడ్డి వెలయించిన యనూన మహిమాభిమానసంపద రహించి
యలకృష్ణదేవరాయల భక్తితాత్పర్యసంభావనసమృద్ధి సంగ్రహించి
యతిశయించిన దగుచుఁ గాలానుగుణ్య
గణ్యసౌభాగ్యగరిమావకాశలేశ
వాసితం బయి యాంధ్రుల వాసినిల్పు
తెలుఁగుబాస యభ్యుదయంపుఁదెరువుఁ బట్టె
జూడుఁ డానందమయదృష్టి శోభ లెసఁగ. ౩

మ॥ చల మై యాశ్రయహీన మై సురుచిరశ్లాఘార్హతాశూన్య మై
ఫలసంపద్విముఖప్రచార మయి సౌభాగ్యప్రభాచ్ఛేది యై
మెలఁగం జొచ్చినసాహితీమహిమ సామీచీన్యముం గాంచి యాం
ధ్రులభాగ్యంబు ఫలింపనున్నయది సంతోషంబునం గాంచరే॥ ౪

మ॥ ఖల మై దూషిత మై కళారహిత మై క్లిష్టాత్మకం బై మహా
త్ములచేతోబ్జములన్ వసింపఁగఁ గదున్ దూరస్థ మై యున్నయు

జ్జ్వలసాహిత్యవిలాససంపద రహింపన్ భవ్యలీలాప్తి నాం
ధ్రిలభాగ్యంబు ఫలించుచున్నయది సంతోషంబులం జూపరే॥ ౫

మ॥ ప్రణయద్యోతకకాకలీకలకలవ్యాపారపారాయణ
క్వణితాశాస్యశుభోక్తివైభవములన్ గానంబు మున్నెప్పుడో
గణనీయంబుగఁ జేసి కాలఘటనం గార్శ్యంబునన్ దోఁగు కా
రణముం గాంచి శుభాంధ్రవాగ్వనితకుం బ్రాశస్త్యము న్నిల్పఁ గం
కణము ల్గట్టిన యాంధ్రనాయకులకుం గల్యాణముల్ పొల్చుతన్. ౬

గీ॥ అరసి కావ్యజ్ఞశిక్షల నాటి తేరి
లోకశాస్త్రాద్యవేక్షణలోలు రైన
కవులయాదరణంబునఁ గ్రమ్మఱ మన
యాంధ్రసూక్తి పరిష్కృతి నమరుఁగాత! ౭

గీ॥ ధ్వనులవిభవంబు లానందవర్ధనునకు
సారరీతులు వామనాచార్యునకును
ప్రబలగుణపుష్టి ముమ్మటభట్టునకును
రసభరాసారములు కవిరాజునకును
మోద మొసఁగెడుసుకవితాస్ఫురితభూతి
తెల్గుబాసకై సేత వరిల్లుఁగాత
మాంధ్రలోక మాహ్లాదాబ్ధియందుఁ గ్రుంకు
లిడుచు గర్వించుసుదినము లెనయుఁగాత! ౮

శా॥ యావల్లోకనిరంతరాభినుతభవ్యాంగ్లేయసామ్రాజ్యల
క్ష్మీవిద్యోతితవైభవోన్నతి కిల న్మేలై మహాభారత
క్ష్మావిస్తారఫలోదయప్రకటయోగక్షేమసంధానకా
ర్యావిర్భావము లిట్లు పొల్చుత భవిష్యత్కాలమం దెంతయున్ ౯

శా॥ పాయంగూడనివైభవోన్నతులకుం బ్రాపై ద్విషత్కల్పితా
పాయధ్వంసనజాగరూకమయి సర్వాశాస్య మైనట్టియాం
గ్లేయప్రాభవవైభవక్రమము రక్షింపంగ నీయిండియా
శ్రీ యింకం జెలువొందుఁగావుత శుభశ్రేయోమయాభ్యున్నతిన్॥ ౧౦

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి.

బృహస్పతి :—సూర్యకుటుంబములోని గ్రహమండలము లన్నిటికంటె బృహస్పతిమండలము మిగుల గొప్పది. ఇది సూర్యునకు 4840 లక్షల మైళ్ళ దూరమున నున్నది. దీని వ్యాసము సుమారు 86300 మైళ్లు. భ్రమణకాలము 10 గంటలు. సుమారు $11\frac{3}{4}$ సంవత్సరములలో నొకభగణము చేయును. దీని చుట్టు నిప్పుడు 8 యుపగ్రహములు తెలిసియున్నవి. బృహస్పతియుపగ్రహములను మొదటఁ జూచినది "గాలిలియో" యని చెప్పుచున్నారు బృహస్పతి బింబము నిరంతరము మేఘావృత మై యుండుటచే బింబోపరిభాగ మంతగఁ గనఁబడుట లేదు. భూబృహస్పతికక్ష్యలమధ్య $1\frac{1}{3}^\circ$ మితి గలకోణ మేర్పడు చున్నది.

శనైశ్చరుఁడు:—గ్రహము లన్నిటిలో శనైశ్చరుఁడు విచిత్రతముఁడు. ఈతని చుట్టు మూఁడువలయములు కొన్నివేళలఁ గాన్పించుచున్నవి. ఈవలయము లొకప్పు డొకవిధమునను, మఱియొకప్పుడు మఱియొకవిధమున నగపడును. కొన్నివేళల వలయాకృతులుగను, మఱికొన్నివేళల రేఖాకృతులుగను గాన్పించును. భూకక్ష్యకు సమప్రదేశమున నుండినయెడల రేఖాకృతిగను, ఇతరసమయముల వలయాకృతిగను గనఁబడును.

శనైశ్చరుఁడు సూర్యునికి 8870 లక్షల మైళ్ళదూరమున నుండును. ఆతని బింబవ్యాసము 72800 మైళ్లు భ్రమణకాలము 10 గంటలు సుమారు $29\frac{1}{2}$ సంవత్సరములలో నొకభగణముఁ బూరించును. మనకుఁ దెలిసినంతవఱకు నితనియుపగ్రహములు పది. ఇతని యుపగ్రహములలో నొకటి సుమారు, అంగారకుని ప్రమాణమున నున్న దని చెప్పుచున్నారు. శనిభూకక్ష్యలమధ్య $2\frac{1}{2}^\circ$ కోణమున్నది.

వరుణుఁడు :—శనైశ్చరుని దాఁటి గ్రహములెవ్వియు లేవని ప్రాక్పశ్చిమదేశములలోఁ బూర్వు లభిప్రాయపడియుండిరి. 1781 సంవత్సరమున "విల్లియం హర్షెల్" (William Hershel) అనుజర్మనీదేశీయుఁడు తనదూరదర్శిని సాహాయ్యమున నొకగ్రహమును గనిపట్టెను. దీనికి "యురేనస్" ను (Uranus) నామము కలిగెను. నామసామ్యముచే నీగ్రహమును వరుణుఁ డనెదము.

ఇతనిమండలము సూర్యునికి 17850 లక్షలమైళ్ళ దూరమున నున్నది. దీని వ్యాసము సుమారు 32900 మైళ్లు. దీనిభ్రమణకాల మంతగఁ దెలియదు. 84 సంవత్సరములలో నిది యొకభగణముఁ బూర్తిచేయును. ఈగ్రహమునకు నుప

గ్రహములు నాలుగు. ఇవి యన్నియు నితరమూర్తములవలెఁ గాక వక్రగతులై (having retrograde motion) యున్నవి. భూవరుణుల కక్ష్యలకు మధ్యకోణ మించుమించుగ శూన్యము.

నభస్త్వాణుఁడు :—ఇతరగ్రహములవలె నీగ్రహమును దృష్టి సాహాయ్యమున నైనను, యంత్రసాహాయ్యమున నైనఁ గనిపెట్టలేదు. వరుణునికక్ష్యలో నాతనిగతి కప్పుడప్పుడు కొంతయాటంక ముండుటకుఁ గారణముల విమర్శింపఁ బూని, యాంగ్లసిద్ధాంతులలో "ఆడమ్సు" (Adams) అనునాతఁడును, ఫ్రెంచి సిద్ధాంతులలో "లవరీరు" (Leverrier) అనునాతఁడును 1846 సంవత్సరమున మఱియొకగ్రహ మెద్దియో వరుణు నాకర్షించుచుండు ననియు, నందుచే నాతని గతివైషమ్యము కలుగుచున్నదనియు వేర్వేఱుగ నిర్ణయించిరి. వారు చూపినది క్కునఁ దనదూరదర్శిని యంత్రముచేఁ బరీక్షింపఁగ నచ్చోట నొకగ్రహముం డుటను జర్మనీదేశీయుఁ డగు "గాలి" (Galle) యనునాతఁడు కనుఁగొనెను. ఈగ్రహమునకు "నెప్ట్యూన్" (Neptune) అనునామ మిడిరి. శబ్దసామ్యము చేతను, "తూణపూరణే" యనుధాత్వర్థబలముచేతను, ఈతఁడు నభస్థలమున సూర్యకుటుంబమును బూరించుటచేతను నీతని "నభస్త్వాణుఁ" డని పిలిచెదము.

ఈతనిమండలము సూర్యునకు 27970 లక్షల మైళ్ళదూరమున నున్నది. దీనివ్యాసము 30000 మైళ్లు. భ్రమణకాలము తెలియదు. సుమారు 165 సంవత్సరములలో నొకభగణముచేయు నని తెలియుచున్నది. దీని కుపగ్రహ మొక్క టి. ఇదియు వరుణుని యుపగ్రహములవలె వక్రగతి నవలంబించి యున్నది. పూర్వులలోఁ గొందఱు నభస్త్వాణునిఁ జూచియుండి రనియు, వారాతనిని నక్షత్ర మని భ్రమించియుండి రనియుఁ దెలియుచున్నది.

నభస్త్వాణుని గనుఁగొనినపిదప ననేకులు మఱియొకగ్రహము కూడఁ గాన నగు నని యెంచి యాకాశభాగముల దూరదర్శిని యంత్రములతోఁ బరిశీలించిరి. అయినను క్రొత్తగ్రహ మెద్దియుఁ గనఁబడలేదు. మఱి యెద్దియు లే దనియే యిప్పుడు శాస్త్రజ్ఞుల నమ్మకము.

## ధూమకేతువులు, ఉల్కలు.

సూర్యచంద్రాది గ్రహగతులనుమాత్రము పూర్వులు విమర్శించుచుండిరి గాని ధూమకేతువుల గతులగుఱించి యంతగ విచారించినటులు తెలియదు.

ధూమకేతువుల దర్శనకాలములనైనఁ గ్రమానుసారముగ నెవ్వోటనైన వారు వ్రాసియుండవచ్చు ననియు శంకించుట కవకాశము లేదు. అయినను సామాన్యముగ ధూమకేతువులదర్శనము దేశమునకు ననిష్టప్రద మనిమాత్ర మనేకస్థలముల వ్రాసియున్నారు. కాకతాళీయముగ ధూమకేతువులు దృగ్గోచర మగు కాలమున రాజులపోరాటమో, రాజ్యపరివర్తనమో, దీర్ఘక్షామాదులచే జనచ్ఛేదమో, యెద్దియో కలుగుచుండె నని మాత్రము తెలియుచున్నది.

ప్రాక్పశ్చిమదేశములలోని యార్యులు ధూమకేతువులవిషయమై యిట్లు మూకత్వమును వహించియుండఁగా, చీనాదేశపుఁ జరిత్రకారులుమాత్రము తమ రాజులచరిత్రాంశముల వ్రాయుచు నప్పుడప్పుడు ధూమకేతువులు దృగ్గోచరమయినకాలములఁ గూడ వ్రాయుచునే వచ్చిరి. ఈయంశము లిక్కాలమునఁ గొన్ని ధూమకేతువులగతుల నిర్ధారించుటయందు సాహాయ్యకరము లైనవి.

ప్రకృతము పాశ్చాత్యశాస్త్రజ్ఞులు ధూమకేతువులసంఖ్య యపరిమిత మని చెప్పుచున్నారు యంత్రములసాహాయ్యమునఁ గూడ నదృశ్య మగుధూమకేతువు లనేకము లున్నవి. యంత్రసాహాయ్యము లేకయే దృగ్గోచర మగునవియు ననేకము లున్నవనియే శాస్త్రజ్ఞులయాశయము.

స్వరూపాదులు :—ధూమకేతువులు సూర్యకుటుంబమునకుఁ జేరినవి కావు. తమమార్గమునఁ జరించుచు నప్పుడపుడు మాత్రము సూర్యకుటుంబమునకు నవి వచ్చుచుండును. కొన్ని ధూమకేతువు లనేకసహస్రసంవత్సరముల కొకపర్యాయమును, గొన్ని యనేకసంవత్సరముల కొకపర్యాయమును, గొన్ని యనేక మాసముల కొకపర్యాయమును, గొన్ని యనేకదినముల కొకపర్యాయమును సూర్యకుటుంబమును బ్రవేశించుచుండును. వీని మార్గములు కూడ నాయతవృత్తాకృతిగ నుండు నని గణితశాస్త్రధురీణులు నిర్ధారించుచున్నారు.

ధూమకేతువులకు శిర స్సనియు, వాల మనియు రెండు భాగములు కలవు. శిరోమధ్యమున జాజ్వల్యమాన మగుచుక్కయొకటి యుండును. వీనివాలము లెల్లప్పుడును సూర్యునికిఁ బరాఙ్ముఖముగ నుండును. అవి యిటులుండుటకు సూర్యునితేజో విశేషమే కారణ మని శాస్త్రజ్ఞు లూహించుచున్నారు. ఈవాలములు సూర్యమండలముననుండి వెలువడుచున్న పరమాణువుల పరంపరలే యని కొందఱు శంకించుచున్నారు. అయినను నిర్ధారిత మగునేయంశము నిదివఱకుఁ దెలియలేదు. సాధారణముగ ధూమకేతువుల కొకటియే

వాల ముండును. కొన్నిటికిమాత్ర మధికముగ నుండవచ్చు నని కొంద ఱూహించు చున్నారు. ధూమకేతువులలోఁ గొన్ని సౌమ్యగతి నవలంబింపక వక్రగతి నవలం బించియున్నవి.

ధూమకేతువులగతినిర్ధారణార్థము 'హాలీ' (Halley) యనునాంగ్లేయుఁడు ప్రథమమునఁ బరిశ్రమ చేసినట్లు పాశ్చాత్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇతఁడు 1531 సంవత్సరమునను, 1607 సంవత్సరమునను, 1682 సంవత్సరమునను, గొన్ని ధూమకేతువులు దృగ్గోచర మయిన వని తెలిసికొని, ఇవి యన్నియు నొకధూమ కేతువుగనే యుండవచ్చు నని యూహించెను ఒకధూమకేతువుగ నుండినయెడల దానిమార్గ మాయతవృత్తాకృతిగ నుండవలయు నని తీర్మానించెను. తనతీర్మాన మును దాత్కాలికుఁ డైన "న్యూటను" మహాశయునకుఁ దెలియఁబఱిచి యది నిర్దుష్ట మని యాతనిసాహాయ్యమునఁ గనుఁగొనెను. అయినను 1531 సం॥ నుండి 1607 సం॥ వఱకుఁగల కాలాంతరము 1607 సం॥ నుండి 1682 సం॥ వఱకుఁ గల కాలాంతరమునకు సమముగ లేనందున నీధూమకేతువునకు మార్గమున నెద్ది యో యాటంక ముండవలయు నని యూహించి, ఆయాటంకము సూర్యకుటుంబ మున బృహత్తమ మగుబృహస్పతియాకర్షణముచేఁ గలిగియుండవలయు నని నిర్ధారించెను. పిదప గణితసాహాయ్యమున నిదియె ధూమకేతువు 1758 సం॥ మున దృగ్గోచరము కావలయు నని తీర్మానించెను. అయినను దనతీర్మానమును దానుపరిశీలించునంతభాగ్య మితనికి లేకపోయెను. ఆసమయమునకు మునుపే యితఁడు స్వర్గతుఁడయ్యెను. ధూమకేతువుమాత్రము యథానిర్దిష్టముగ దృగ్గో చర మాయెను. దీనిమార్గము నితఁడు నిర్ధారించినందున నిది యితనినామముచేఁ బిలువఁబడుచున్నది.

ఇదియే 1910 సం॥ మునఁ గొన్నినెలలవఱకుఁ బ్రాక్పశ్చిమగగనాంగణ మున దృగ్గోచర మగుచుండెను. పశ్చిమమువనుండి ప్రాఙ్ముఖముగ నడుచు చుండుటచే నిది ప్రథమమున సూర్యునిపశ్చిమభాగమునను, దదనంతరము సూ ర్యునిప్రాగ్భాగమున నగపడుచుండును. కావున నాదిని సూర్యోదయమునకు ముందును, దరువాత సూర్యాస్తమయమునకు వెనుకను వెలుఁగుచుండును. 1910 సం॥ మున నిది గోచర మైనప్పుడు మనదేశపుఁజక్రవర్తి యగుసప్తమ ఎడ్వర్డుప్రభువు స్వర్గతుఁ డాయెను. ప్రవాహాదులచే ననేకులు మృతి నొందిరి. ఆసంవత్సరమున ధూమకేతువు సూర్యునికిని భూమికిని మధ్యఁబోయెను. అప్పుడు

విషవాయువు లనేకము లుత్పత్తియగు ననియు నందుచే జనులు మరణింతు రని యుఁ గొందఱు చెప్పుచుండినందున ననేకులు భయగ్రస్తు లయి యాత్మహత్యలు చేసికొనిరి.

ఈధూమకేతువుయొక్క మార్గమునే కాక యింక నెన్నియో ధూమకేతువులమార్గములఁ గూడ గణితసాహాయ్యమున శాస్త్రజ్ఞులు నిర్ణయించియున్నారు. "బయలా" (Biela) అనునాతనిచేఁ గనుఁగొనఁబడినధూమకేతువు రెండు మూఁడుపర్యాయములు సూర్యకుటుంబమునకు వచ్చెను గాని, పిదప రాకయే పోయెను. కడపటిపర్యాయము వచ్చినప్పు డది శకలముశకలముగా విభజింపఁబడి యుల్కా వృష్టి (meteoric shower) వలె నుండెను. తరువాత దానిగతి యేమాయెనో తెలియలేదు. అది యిప్పుడు నామావశిష్ట మయ్యె నని కొంద ఱూహించుచున్నారు.

ఇట్లు కొన్నిధూమకేతువులచరిత్రము మిక్కిలి విచిత్రముగా నున్నది.

**ఉల్కలు** :—ధూమకేతువులస్వరూపమును విమర్శించుటకు మునుపు కొంత యుల్కలను (meteors) గుఱించి విచారింపవలయును. స్వచ్ఛ మగు కొన్నిరాత్రులలో నాకాశమున జ్యోతిర్బిందువు లొకచోటనుండి మఱియొక చోటునకుఁ బోవున ట్లగపడును. ఇవియే యుల్కలు. వీనిమార్గములఁ బరిశీలించితిమేని యివి యాకాశములో నవ్యవస్థితములు కాక యొకవ్యవస్థ ననుసరించి యుండునట్లు తెలియును. అవి నభోంగణమున నొక్కచోటునుండియే బయలు వెడలి సమానాంతరమార్గముల (parallel paths) వచ్చుచుఁ దుదకు భూవాయుమండలిలోఁ బ్రవేశించును. ఇవి యతివేగమున వచ్చుచుండుటచే భూవాయుమండలిలో సంఘర్షణ మంది యత్యుష్ణ మై వెలుఁగ నారంభించును. వానిలో ననేకములు భూమండలమును జేరుటకు మునుపే నిశ్శేషముగ వెలిఁగి పోవును. కొంత గొప్పవిగ నుండునవి దగ్ధశేషములై భూమిపైఁ బడుచుండును. ఇట్లు పడినవానిని బరీక్షించి చూచియున్నందున నీయుల్కలు కొన్నిలోహమయము లనియుఁ, గొన్ని శిలామయము లనియుఁ దెలిసినది. ఇవి సూర్యకుటుంబమునకు వెలుపల సంచరించునపుడు సూర్యకుటుంబములోని కొన్ని గ్రహములచే నాకృష్టము లై తమతమమార్గముల వదలి సూర్యకుటుంబమునకు రాఁగలవు. సూర్యకుటుంబమునకు నపుడపుడు వచ్చుచుండుధూమకేతువు లీవిధముననే సూర్యకుటుంబములోఁ దగులుకొనిన వని శాస్త్రజ్ఞులు తెలిసికొని

యున్నారు. ధూమకేతువులశిరస్సు ఉల్కాసంఘాత మనియు (a swarm of meteors) వానిపరస్పర సంఘర్షణముచేతనే ధూమకేతువుల శిరస్సున జాజ్వల్యమానము లగుబెందువు లేర్పడుచున్న వనియుఁ జెప్పుచున్నారు. ఒకదినమున భూవాయుమండలిలో లక్షలకొలఁది చిన్నచిన్నయుల్కలు ప్రవేశించుచుండును.

ఆంగ్లగణితానుసారముగ నవంబరు సుమారు 13 తేదియందు 1833 సం॥ మునను 1866సం॥మున నొకయుల్కావృష్టి (meteoric shower) సంభవించినది. ఫ్రెంచిదేశీయుఁడగు "లవరీన్" ఈయుల్కావృష్టి క్రీ. శ. 126సం॥మున సూర్యకుటుంబసమీపముగా నెచ్చటికో పోవుచుండినపుడు సూర్యకుటుంబములోని వరుణునిచే (Uranus) నాకృష్టమై సూర్యకుటుంబముచుట్టుఁ దిరుగనారంభించి యుండు నని తీర్మానించెను. ఇది 33సం॥ ములకొకపర్యాయము సూర్యకుటుంబమునకు వచ్చుచుండెను. 1899సం॥ మున దీనిరాకకై నిరీక్షించుచుండ నదిరాకయె పోయెను. ఒకవేళ శనైశ్చరబింబముచే నిది యాకృష్టమై తన మార్గమును వదలి యెచ్చటనో తప్పిపోయి యుండు నని యూహించుచున్నారు. ఇది యాకాశమున సింహరాశిలో నొకచోటనుండి వచ్చుచుండునట్లుండెను.

'బయెలా' యనునాతని నామమునఁబిలువబడుధూమకేతువు కడపటి తూరి యగపడినపుడు శకలముశకలమై విభజింపఁ బడియుండి యుల్కావృష్టి వలెఁ గాన్పించె నని చూచియుంటిమిగదా? ఈయంశము ధూమకేతువులకు నుల్కలకును గలసంబంధమును దేటపఱుచుచున్నది.

# నక్షత్రమండలి, ఛాయాపథము, నభోలము.

ఒక స్వచ్ఛమైనరాత్రియందుఁ జంద్రుఁడు లేనిసమయమున నాకాశముఁ జూచితిమేని లక్షలకొలఁది నక్షత్రములు మిణుకుమిణుకు మని వెలుఁగుచుండునది కాన్పించును, అవి యన్నియు నెచ్చోటఁ జూచిన నవ్యవస్థితముగ నుండు ట్లగపడును. దినదినముఁ జూచుచుంటిమేని కొన్నినక్షత్రరాసులఁ గుర్తింపఁగలము. సంవత్సరములకొలఁదిఁ జూచుచుండినను వానిలోఁ బరస్పరము స్థితివైషమ్యము లంతగఁ దెలియవు. కావున నీనక్షత్రము లించుమించుగ స్థిరములనియే చెప్పవచ్చును, "ఇంచుమించుగ" యని చెప్పుటకుఁ గారణ మేమి తెలియునా? వస్తుతత్త్వమున నక్షత్రము లచలములు కావు. అవి యన్నియుఁ

జలించుచుండినను వానికిని మనకుఁ గలయత్యంతదూరముచే వానిచలనము సాధారణముగ నెన్నియోసంవత్సరములకుఁగూడ నంతగఁ దెలియుట కష్టము. గ్రహసంచారాదుల గణనవిషయమై నక్షత్రములు స్థిరములనియే యెంచవచ్చును. ఇట్లెంచియె కాఁబోలు మనపూర్వులు గ్రహసంచారాదుల నిర్ణయింపఁగలిగిరి.

నక్షత్రప్రభ :—ఆకాశమునఁ గొన్ని నక్షత్రము లతిస్వచ్ఛముగాను, గొన్ని మందముగాను, మఱికొన్ని మిక్కిలిమందముగాను వెలుఁగుచున్నవి యంత్రసాహాయ్యము లేనిదృష్టికి నగోచరము లగునక్షత్రము లెన్నియో యున్నవి. ఇవి యన్నియుఁ బూర్వులకుఁ దెలిసియుండవు. వారికిఁ దెలిసినవానిలోఁ బరస్పరము గుర్తించుటకై కొన్నికొన్ని నక్షత్రముల నొక్కొకరాశిగఁ జేర్చియారాశికి నొకనామ మిడుచు వచ్చిరి. ఇట్లు సూర్యచంద్రాదు లాకాశమునఁ బోవున ట్లగపడుమార్గమున మనయార్యులు ఋగ్వేదకాలముననే యశ్విన్యాది 27 నక్షత్రముల నిష్కర్షించినట్లు తెలియుచున్నది. ఈనక్షత్రముల నాధారముగనుంచి గ్రహగతుల నిర్ణయించిరి.

నక్షత్రములు సూర్యకుటుంబమునకు నతిదూరమున నున్నవి. సూర్యకుటుంబమునకు సమీపతమ మగునక్షత్రము సుమారు 25,400,000,000,000 మైళ్లదూరమున నున్నది. దూరముననుండునక్షత్రములకంటె సమీపమున నుండునవి సాధారణముగ స్వచ్ఛతరములై యుండును. అయినను గొన్నిసమీపనక్షత్రములు మందతరముగనే వెలుఁగుచున్నవి.

ద్వంద్వనక్షత్రములు:—యంత్రసాహాయ్యము లేక చూచునపుడు నక్షత్రము లన్నియు నొక్కొకటిగనే కాన్పించును. దూరదర్శినిసాహాయ్యమునఁ జూచినయెడల వానిలో ననేకములు ద్వంద్వముగ (double stars) నుండును. దూరదర్శినియంత్రమునఁ గూడ నొక్కొక్కటిగ నగపడుకొన్నినక్షత్రములు రశ్మివిభాజిని యంత్రమున (spectroscope) ద్వంద్వము లని తెలియును. ఈద్వంద్వములలో ననేకము లొకదానిచుట్టు నొకటి తిరుగుచుండును. అందుచే వాని నుండి వచ్చుకిరణము లొకప్పుడు భూమి కభిముఖముగను, మఱియొకప్పుడు పరాఙ్ముఖముగను జలించుచుండును. ఈయంశములు రశ్మివిభాజినిలోఁ దెలియుటచే దూరదర్శినికిఁ గూడ నగోచరము లగుద్వంద్వములు కొన్ని యీయంత్రమునఁ దెలియుచున్నవి. మఱికొన్నినక్షత్రములు వస్తుతత్త్వమునఁ బరస్పర

మెంతయో దూరమున నున్నను భూమినుండి చూచునపు డొకరేఖనే యుండుటచే ద్వంద్వములుగఁ గనఁబడును.

కొన్ని వేళలయందుఁ గొన్నినక్షత్రములప్రభ తగ్గుచుండును. మఱికొన్ని వేళల హెచ్చుచుండును. ఇటు లుండుటచే నానక్షత్రములచుట్టు నెద్దియో యొకగ్రహము తిరుగుచుండు ననియు నందుచే నానక్షత్రగ్రహణము సంభవించుచున్న దనియు శాస్త్రజ్ఞులు చెప్పుదురు. మఱికొన్ని వేళల నొకనవీననక్షత్రము కాన్పించును. దీనిప్రభ క్రమక్రమముగ వృద్ధియగుచుఁ దుదకు క్షీణింప నారంభించును అందుచేఁ గొంతకాలమున కానక్షత్ర మదృశ్య మగును. ఇట్లగపడునవి నూతననక్షత్రములు కా వనియు, నతిమందప్రభ లైనపురాణనక్షత్రములె యాకాశమున సంచరించుచుండుకొన్ని మూర్తముల సంధించుటచేఁ బ్రవృద్ధప్రభ లై తుదకు నామూర్తములలోని ద్రవ్యములు వెలిఁగిపోయినవెంటనె యథాస్థితి నవలంబించుచున్న వని కొంద ఱభిప్రాయపడుచున్నారు.

ప్రళయప్రశంస :—కొన్నినక్షత్రము లతిస్వచ్ఛముగాను, గొన్ని యతిమందముగాను వెలుఁగుచుండుట మనకుఁ దెలియును గదా ? ప్రభామాంద్యము కొన్నినక్షత్రములకు దూరమున నుండుటచేఁ గలుగును. సమీపమున నుండు మఱికొన్నినక్షత్రములుకూడ సర్వదా మందప్రభలై యున్నవి. కాలక్రమమున నక్షత్రములప్రభ క్షీణించు ననియు, నందుచే క్షీణప్రభ లగుకొన్నినక్షత్రములు పురాతనము లనియుఁ గొందఱు చెప్పుచున్నారు ఒకనక్షత్రప్రభ క్రమక్రమముగ క్షీణించుచుండెనేని యానక్షత్రము తుదకుఁ గాంతిహీనమై యాకాశమునఁ జరించుచుండును. ఇట్లు నిష్ప్రభ లైనమూర్తములు కొన్ని వేళల నొకనక్షత్రముతో సంఘర్షణ మంది ప్రళయించును. అందుచే నానక్షత్ర మకస్మాత్తుగఁ బ్రవృద్ధకాంతియై పిదప క్షీణింప నారంభించు ననియుఁ గొంద ఱూహించుచున్నారు. ఆకాశములో నిట్లు కొన్నిమూర్తములు పరస్పరసంఘర్షణముచేఁ బ్రళయించుననియె కొందఱయభిప్రాయము. (cosmic catastrophe) మనసూర్యకుటుంబమునకుఁగూడ నెప్పుడైన నీప్రళయము సంభవించు ననియు, నాప్రళయము కొన్నిసంవత్సరములకు మునుపే మనకుఁ దెలియవచ్చు ననియుఁ గూడ వీరు చెప్పుచున్నను, మఱికొందఱుమాత్ర మీయభిప్రాయముల నాదరింపకున్నారు.

క్రీ. శ. ముందు 134 సంవత్సరమున నొకనూతననక్షత్రము కాన్పించె ననియు నందుచే "హిప్పార్కస్సు" (Hipparchus) అనుగ్రీసుదేశీయుఁ డొక

నక్షత్రసూచికను (a star chart) సృజింపవలయు ననునుద్దేశముతో నాకాశమున దృగ్గోచర మగు నక్షత్రముల నన్నిటిని బరస్పరస్థానవైషమ్యము లేకుండ నట్లొకసూచికలో వ్రాసె ననియుఁ దెలియుచున్నది. ఈసూచిక నాధారముగఁ గొని "టాలమీ" మఱియొకసూచికను సృజించెను. 16వ శతాబ్ది యందు "టైకోబ్రాహి" (Tycho Brahe) యను డెన్మార్కు దేశీయుఁడు మఱియొక గొప్పనక్షత్రసూచికను సృజియించెను. ఇట్లప్పుడప్పుడు నక్షత్రసూచికల సృజించియుండుటచే నక్షత్రవిషయమై యనేకసంగతులు తెలియవచ్చినవి. ప్రస్తుతము 1887సం॥ మున ఫ్రెంచిరాజధాని యగు "పారిసు" (Paris) నగరమున జరిగినసిద్ధాంతులసభ ననుసరించి పదునెనిమిది నక్షత్రశాలలలోనివారు నభోవీధి యంతయుఁ బరిశీలించుటకుఁ బూనుకొనియున్నారు. ఛాయాపట (Photography) యంత్ర మీనక్షత్రసూచికల సృజించుటలో నిప్పుడు మిక్కిలి సహాయభూతము.

నక్షత్రచలనము :—ఈనక్షత్రసూచికలఁ బరిశోధించుటచేఁ గొన్నికొన్ని తా ముండినచోటు వదలి కొంచెము చలించియున్నట్లు తెలిసినది. అందుచే నక్షత్రము లచలములు కావని సిద్ధాంతులు తీర్మానించిరి. ఇట్లు నక్షత్రములు చలించుటచేఁ గొన్నివేళల రెండునక్షత్రములు పరస్పర మభిముఖముగఁ జరించుచు సమీపించు ననియు, నప్పు డవి పరస్పర మాకృష్టము లై తమయాకర్షణకేంద్రముచుట్టు (around their common centre of gravity) తిరుగ నారంభించు ననియు నందుచే ద్వంద్వము లేర్పడుచున్నవనియుఁ గొందఱు చెప్పుచున్నారు. సూర్యరశ్మిని రశ్మివిభాజినియంత్రముచేఁ బరీక్షించి సూర్యబింబములోని ద్రవ్యస్వరూపముల నిప్పుడు శాస్త్రవేత్తలు నిర్ణయింపఁ గలిగిరి. అట్లే నక్షత్రములలోని ద్రవ్యములఁ బరిశీలించి యవియన్నియు సూర్యబింబములుగనే యుండవలయు నని తీర్మానించిరి. కావున మనసూర్యుఁడుగూడ నొకనక్షత్రమే.

సూర్యకుటుంబచలనము:—నక్షత్రములు చలించునట్లు సూర్యుఁడుకూడఁ జలించుచున్నాఁడా యని ప్రశ్న కలుగవచ్చును "సర్‌విలియం హర్షెల్" అనేకవిధములఁ బరిశీలించి తుదకు నాకాశమున నొకవైపున నక్షత్రములు పరస్పర వియుక్తము లగుచున్న వనియు, దానికి నెదురువైపునఁ గ్రమక్రమముగ సమీపించుచున్న వనియుఁ గనుఁగొని, వియుక్తములగు నగపడుదిఙ్ముఖమున సూర్యకుటుంబము చలించుచుండవలయు నని నిర్ణయించెను.

నక్షత్రవీథి :—నభోంగణమున నొకవైపునుండి మఱియొకవైపువఱకు వ్యాపించియుండు నొకభాగము జలబిందువులచే మలిన మగుదర్పణమువలె నుండును. ఈభాగమున నచ్చటచ్చట ధూమమయముగ నుండునట్లు కాన్పించును. దూరదర్శినిసాహాయ్యమున నీభాగములఁ బరిశీలించితిమేని, వస్తుతత్త్వమున మేఘముకాని ధూమముకాని యచ్చోట లే దనియు లక్షలకొలఁదిఁ గొన్ని నక్షత్రములుమాత్రము గుంపులుగుంపులుగా నుండునవియుఁ దెలియవచ్చును ఈభాగమునే ఛాయాపథము(Milky way) అనెదరు ఈఛాయాపథము నభోంగణమును రెండుసమభాగములుగ విభజించుచున్నది. ఆకాశములోని నక్షత్రములలో ననేకము లీఛాయాపథమునకు సమీపముననే యున్నవి.

నభోలములు :—కొన్ని చోట్లయందు దూరదర్శినితోఁ జూచిన నచ్చటచ్చట నాకాశమునఁ జిన్నతెల్లనిమేఘశకలములవలెఁ గాన్పించును. గొప్పశక్తి గలయంత్రములతో విమర్శించినయెడల వీనిలోఁ గొన్ని తారాగుచ్ఛము లని (star clusters) తెలియును. మఱికొన్నిమాత్ర మిట్లు భేద్యములు గాక ధూమమయముగనే యుండును వీనిని "నెబుల" (Nebula) యనెదరు. శబ్దసామ్యముచేతను, ఇవినభస్థలమున లీనమై యుండుటచేతను, వీనిని "నభోల" మనెదము. దూరదర్శినియంత్రము నిర్మింపఁబడినది మొదలు సిద్ధాంతు లనేకు లీనభోలములఁ బరిశీలింపఁ దొడఁగిరి. విల్లియం హార్షెల్లును, అతనికుమారుఁడు జోహన్ హార్షెల్లును, ఆకాశమున నీనభోలముల సూచికను (Chart) దయారుచేయ నారంభించి వేలకొలఁది నభోలములఁ గనిపెట్టిరి. ప్రథమమునఁ గొందఱు నభోలము లన్నియుఁ దారాగుచ్ఛములుగ నుండవచ్చు నని నమ్మిరి నభోలములకిరణములను రశ్మివిభాజనియంత్రమున విభజించి పరీక్షించుటచే నాకిరణములు తారాకిరణభిన్నము లని సిద్ధాంతులు తెలిసికొనిరి. అందుచే నభోలములు తారాగుచ్ఛములు కా వని నిర్ణయింపఁగలిగిరి

ఈనభోలములలోఁ గొన్ని శంఖరేఖాకృతిగను (of spiral form), మఱికొన్ని నిరాకృతులై ధూమమయముగ నున్న వని తెలిసినది. ఈనభోలములు ప్రళయించిననక్షత్రద్రవ్యము లని యూహించుచున్నారు.

శంఖరేఖాకృతిగ నుండునభోలములు నూతననక్షత్రముల పూర్వదశ యనియు, వానినుండి కాలక్రమమున నీనక్షత్రము లుద్భవించు ననియు, వాని చుట్టు మిగిలినద్రవ్యభాగము క్రమక్రమముగ శీతలమై గ్రహరూపములఁ దాల్చి

తిరుగుచుండు ననియుఁ గొందఱూహించిరి. ఈవిధముననే సూర్యకుటుంబ ముకూడ నేర్పడియుండు నని 18వ శతాబ్దిలో "సైమన్ లాప్లాస్", Simon Laplace, అనుఫ్రెంచిదేశీయసిద్ధాంతి యూహించెను గాని యాయూహాపద్ధతి యనిర్ణేయ మగుటచే దానినిమాత్ర మంతగ శాస్త్రజ్ఞులు పాటింపరైరి. అయిన నాయూహయొక్క ఫలితాంశమును స్వీకరించిరి. నభోలములు క్రొత్తసూర్యకు టుంబముల పూర్వదశయో కాదో నిర్ధారితముగఁ దెలియకున్నను నక్షత్రము లన్నియు సూర్యులే యనియు వానిచుట్టుఁగూడ గ్రహములు తిరుగుచుండవచ్చు ననియు శంకించుట కవకాశ మున్నది. ఇట్లనేకసూర్యులను సృజించినభగవంతుఁ డు మనసూర్యకుటుంబమున నొకగ్రహ మగుభూమినిమాత్రము నివాసయో గ్యముగఁ జేసియుండునా?

# అయనచలనము.

భూమినిగుఱించి విచారించునపుడు మన మయనచలనవిషయమై కొంత ప్రస్తావించి యుంటిమికదా. మన మిప్పు డావిషయమై సవిస్తరముగఁ జర్చించె దము. ప్రస్తుతము నక్షత్రముల గణించునపుడు "అశ్వినీ" నక్షత్రమునుండియె ప్రారంభించుట వాడుక. ఇది మనదేశమున వరాహమిహిరాచార్యుల కాలమున (490 A D.) నిర్ణయింపఁబడెను. ఆసమయముననే వసంతర్తువు చైత్రవైశాఖ మాసముల సంభవించు ననియు నిర్ధారింపఁబడెను. వసంతారంభదినమునఁ, బగలును రాత్రియును సమముగ నుండు నని జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పు దురు. ప్రకృత మీ విధ మగుదినము మార్చి 21తేది యందును, సెప్టంబరు 23 తేది యందును సంభవించు నని మన మిదివఱకే చూచియుంటిమికదా. అందు మార్చి 21 తేది వసంతారంభమునకును సెప్టంబరు 23 తేది శరదారంభమున కును సమముగ నుండవలయు నని తెలియుచున్నది. అయినను మనకాలమున మార్చి 21 తేది ఫాల్గునముననె సంభవించుచున్నది. కావున జ్యోతిశ్శాస్త్ర రీతిగ మన మిప్పుడు వసంతర్తువు ఫాల్గునమునఁ బ్రారంభించుచున్నదని చెప్ప వలయు. వరాహమిహిరాచార్యులకాలమున వసంతర్తువు చైత్రముననే ప్రారం భించుచుండెను. వారికాలమునకును మనకాలమునకును గలయంతరము 1500 సంవత్సరములు. ఇంతకాలమున నయనములు (అనఁగా వసంతశరదారంభము లని చదువరు లిదివఱకే యూహించి యుందురు కాఁబోలు) ఎంతదూరము

చలించియుండునో విచారింతము. ఇవి యొకపూర్ణభ్రమణము చేయుటకు సుమారు 26000 సంవత్సరములగు నని మన మిదివఱకే తెలిసికొనియుంటిమి. కావున నవియొకడిగ్రీ వెనుకకుఁబోవుటకు సుమారు 72 సంవత్సరములగును. 1500 సంవత్సరములలో నవి సుమారు 20°48′ దూరము వెనుకకు జరిగియుండ వలయును ప్రకృతి ముత్తరాయణము (Vernal equinox) [ఇచ్చట 'అయన' పదము సూర్యుఁడు విషువద్రేఖకు దక్షిణమున నుండియుత్తరమునకుఁ బోవుస్థలమును దెలియఁజేయుచున్నది] రేవతీ నక్షత్రమునకు వెనుక 18°లలో నున్న దని తెలియు చున్నది. కావున వరాహమిహిరాచార్యుల కాలమున నది యశ్వినీనక్షత్రము నొద్ద నుండి యుండవలయు నని తెలియుచున్నది వరాహమిహిరాచార్యులు "అయన" శబ్దమును బ్రస్తుతము మనము వ్యవహారమున నుపయోగించునర్థముననే ప్రయోగించియున్నారు. అనఁగా సూర్యగమనమున నుదఙ్ముఖతను గుఱించియు దక్షిణోన్ముఖతను గుఱించియు నీశబ్ద ముపయోగింపఁబడియున్నది. ఈసమయ ముల నాంగ్లభాషలో (Winter solstice, Summer solstice) అని చెప్పుదురు. ఇవి హేమంతమధ్యదినమునకును, గ్రీష్మమధ్యదినమునకును సమముగ నుండు ను. వరాహమిహిరాచార్యులు "ఆశ్లేషార్ధమున సూర్యుఁడు పూర్వము దక్షి ణముఖముగ నివర్తించుచుండెను. ప్రస్తుతము పునర్వసునక్షత్రమున నుండి నివ ర్తించుచున్నాఁడు" అని చెప్పియుండుటచే గణించిచూచిన నాతనికాలము నకుఁ బూర్వము నక్షత్రములు కృత్తికాదిగ గణింపఁబడుచుండె ననియుఁ దా నశ్విన్యాదిగ గణింపఁబూనె ననియుఁ జెప్పవలసియున్నది.

వేదాంగజ్యోతిషగ్రంథమున "సార్పార్ధేదక్షిణార్కస్తు" అని యుండుట చే నాకాలమున నాశ్లేషానక్షత్రమధ్యమున సూర్యుఁడు దక్షిణముఖముగఁ బ్రవ ర్తించుచుండె నని (at the Summer solstice) తెలియుచున్నది. అందుకుఁ బూర్వము 'మఘా' నక్షత్రమున సూర్యుఁడు దక్షిణోన్ముఖుఁ డయ్యె నని కొన్ని వైదికగ్రంథములచేఁ దెలియుచుండుటచే నాకాలమున రోహిణ్యాదిగ నక్షత్ర ములు గణింపబడుచుండిన వని తెలియుచున్నది. మనవారల కీయయనచలన స్వరూపము తెలిసినను దెలియకుండినను దానిఫలము తెలిసియే యుండె నని యు, దాని కనుగుణముగఁ గాలమానములలో ననాదిగ వారు మార్పులు చే యుచునె వచ్చుచుండి రనియుఁ జెప్పవలసియున్నది. ఇటీవలఁ గొందఱుసిద్ధాంతు లుమాత్ర మీయయనము రేవతీనక్షత్రమున కిరువైపుల సుమారు 27°డిగ్రీల

వఱకు నూఁగుచుండు నని యభిప్రాయపడిరి కాని యది యవిశ్వసనీయము; పూర్ణముగ భ్రమణము చేయు ననియే చెప్పవలయును.

## కాలమానము.

సంవత్సరము :—భూమికి రెండు గతు లున్న వని మనము చూచియుంటిమికదా? అది సూర్యునిచుట్టు నొకభగణము చేయు కాలము సంవత్సర మనఁబడును. ఈకాలమున నది మేషాది 12 రాసులలోఁ బోవును. ఒక్కొక్క రాశి నతిక్రమించుకాలము మాస మనఁబడును. ఇదియె సౌరమానమున మాసము. భూగమనము మనకుఁ దెలియకుండుటచే సూర్యుఁడే భూమిచుట్టుఁ బోవుచుండునట్లు మన కగపడును. సూర్యుఁ డేరాశిలో నొకమాసమున నుండునట్లు కనఁబడునో యామాస మారాశిపేరఁ బిలువఁబడును. అందుచే మేషాది మాసము లేర్పడినవి.

మాసము :—ఒకభగణము 360 భాగములుగ విభజింపఁబడియుండుటచే నొక్కొకరాశిలోను సుమారు 30 భాగము లుండును. సూర్యుఁ డొకభాగము నతిక్రమించుకాలమున భూమి యొకభ్రమణము చేయుచుండుటచే, నొకొక్కమాసమును 30 భూభ్రమణకాలములుగ విభజింపఁబడెను.

అయనము :—మఱియు సూర్యుఁ డర్ధభగణకాలమున నుదఙ్ముఖముగను మఱియర్ధకాలమున దక్షిణముఖముగను బోవుచుండునట్లు కాన్పించుటచే నొకసంవత్సరము రెండయనములుగ విభజింపఁబడెను.

చాంద్రసౌరమానములు :—సౌరమానము గ్రీసు దేశీయులసంపర్కముచే మనయార్యులకుఁ దెలియు నని విమర్శకుల యభిప్రాయము. అందుకు నిదర్శనము గ్రీసుదేశీయులు ద్వాదశరాసులకుఁ బెట్టియుండునామములకు సమమైన మనమేషాది ద్వాదశనామములు. చాంద్రమానము మనయార్యులు స్వయముగ నిర్ధారించినది. సూర్యచంద్రులసంయోగము (అనఁగా నమావాస్య) చాంద్రమాన మాసారంభము. చాంద్రమానమాసము చంద్రభగణముకంటె సుమారు $2\frac{1}{4}$దినము లధికము. సూర్యచంద్ర సంయోగదినమున వారేనక్షత్రసమీపమున నుండిరో యానక్షత్రమునకు మఱలఁ జంద్రుఁడు సుమారు $27\frac{1}{4}$దినములలో వచ్చును. ఆసమయమున సూర్యుఁ డావోటు విడిచి సుమారు $27\frac{1}{4}$ భాగములు (Degrees) ప్రాఙ్ముఖముగఁ బోయిన ట్లుండును. కావునఁ గిరుగ సూర్యచం

ద్రసంయోగమునకుఁ (అనఁగాఁ జాంద్రమానమాసపూర్తికి) జంద్రుఁడీయంతర మునాక్రమింపవలయును. అందుకు సుమారు $2\frac{1}{4}$ దినము లవును. అనఁగాఁ జాంద్రమానరీతిగ నొకమాసమునకు సుమారు $29\frac{1}{2}$ దినములు

పున్నమచంద్రుఁ డొక్కమాసమున నేనక్షత్రసమీపమున నుండునో యామాస మానక్షత్రనామముచేఁ బిలువఁబడును. చిత్తానక్షత్రసమీపమునఁ బూర్ణిమ సంభవించినమాసమును "చైత్ర" మనియు, విశాఖానక్షత్రసమీపమునఁ బూర్ణిమ సంభవించినమాసమును వైశాఖ మనియు నీలాగున నార్యులు చాంద్రమానమాసములఁ బిలుచుచుండిరి. చాంద్రమానరీతిగ నొకసంవత్సరము పూర్తియగుసమయమున దాని కనుగుణముగ సూర్యభగణము పూర్తి కాక సుమారు 12 దినము లవశిష్ట మగుటచే మనయార్యు లప్పుడప్పు డొకయధిక మాసమును గణించుచువచ్చిరి.

"అధికచాంద్రమానమాసములు:—ఒకసౌరమానసంవత్సరమున సుమారు $365\frac{1}{4}$ దినము లుండును; చాంద్రమానసంవత్సరమున సుమారు $354\frac{1}{4}$ దినములె యుండును. కావునఁ జాంద్రమానవత్సరమున సౌరమానవత్సరమునకంటె సుమారు 11 దినములు తక్కువ. ఇట్లుండుటచే సుమారుమూఁడువత్సరముల కొకపర్యాయ మొకయధికచాంద్రమానమాసముఁ జేర్చినఁ గాని సౌరచాంద్రమానగణనములకుఁ బరస్పరభేదములు వృద్ధియగుచునే యుండును. ఇష్టము వచ్చినట్లు నధికమాసములఁ జేర్పక మనవార లొకపద్ధతి నవలంబించి యామాసముల గణించుచువచ్చిరి. సూర్యుఁ డొకరాశినుండి మఱియొకరాశికి దాఁటునది సంక్రమణమనఁబడును. చాంద్రమానమాసము సౌరమానమాసముకంటె స్వల్పతర మగుటచే నప్పుడప్పుడు కొన్నిచాంద్రమానమాసములలో సూర్యసంక్రాన్తి లేక యుండును; అనఁగాఁ గొన్నిసౌరమానమాసములలో రెండమావాస్యలు సంభవించును. ఇట్లు సూర్యసంక్రమణము లేనిచాంద్రమానమాస మధికచాంద్రమానమాస మనఁబడును. ఈయధికమాసమును ముందు గణించి నిజమాసమును వెనుక గణించెదరు. అధికమాసములు క్రమముగ 28, 34, 35, 34, 28, ...... మాసముల కొకపర్యాయము సంభవించుచుండును."

దినవిభాగములు:—ఒకభూభ్రమణ మొకదిన మనఁబడును. ఒకభూభ్రమణమున సూర్యుఁ డొకభాగమును దాఁటున ట్లుండుటచే, సూర్యుఁ డొక భాగము నతిక్రమించుకాల మొకదినము. ప్రతిభాగము నఱువదికలలుగ

(minutes) విభజింపఁబడియుండుటచే నొకదిన మఱువదినాడికలుగ విభజింపఁ బడెను. అనఁగా నొకనాడికలో సూర్యుఁ డొకకలను (minute) దాఁటు నని తెలియుచది. ప్రతికలయు నఱువదివికలలుగ (seconds) విభజింపఁబడినందున నొకనాడిక యఱువదివినాడికలుగ విభజింపఁబడెను.

దినమునకు 12 రాసులును భూమిని జుట్టునట్లు కనఁబడుటచేతను, రాత్రి యుఁ బగలు నని రెండుభాగములుగ దినము విభజింపఁబడి యుండుటచేతను, గాఁబోలు దినము ప్రథమమున 12 భాగములుగ విభజింపఁబడి పిదపఁ బ్రతిభాగ మును రెండుగ విభజింపఁబడియుండెను. ఈప్రభాగ మొక్కొక్కటియు హోర (hour) యనఁబడును. ప్రతిదినమున నాయారాసు లుదయ మగున ట్లుండుకాల విభాగము లాయారాసులనామము గలలగ్న మనఁబడును. ఉదయలగ్నమును గనుఁగొనుట కష్టసాధ్య మగుటచే నుచ్చలగ్న (the sign at the zenith) సాహా య్యమున నిది నిర్ధారింపఁబడుచున్నది. భూభ్రమణభగణము లిట్లు కాలమానము నకుఁ గొంతహేతువు లై యున్నవి.

దినమున నొక్కొక్కహోరకు శీఘ్రక్రమమున శనైశ్చరాదులు (అనఁ గా శని, బృహస్పతి, అంగారక, సూర్య, శుక్ర, బుధ, చంద్రులు) వరుసగ నధిపతులు. ప్రథమహోరకు నధిపతి యెవఁడో యాతనినామముచే నాదినము పిలువఁబడును అనఁగా శనివారమునఁ బ్రథమహోరకు శని ప్రభువు. ప్రతిహోర రకు నాదినమునఁ బ్రభువుల నేర్పఱిచితిమేని, 8, 15, 22వ హోరలకు శని ప్రభు వగును. 23, 24వ హోరలకుఁ గ్రమముగ బృహస్పతి, అంగారకుఁడును బ్రభువులు. మఱునాఁడు ప్రథమహోరకు సూర్యుఁడు ప్రభువు కావున శనివార మును వెంబడించినదినమునకు సూర్యుఁడు ప్రభువు ఇట్లే దినములకుఁ బ్రభువు లేర్పడి రని యార్యభటుఁడు వ్రాసియున్నాఁడు. మనపూర్వులకు వరుణనభస్స్వా ణులు తెలియకుండుటచే వారమునకు 7 దినము లయినవి.

షష్టిసంవత్సరహేతువు:—అఱువది సూర్యసంవత్సరములలో గ్రహము లన్నియు నక్షత్రపరిణాహమును బూరించుచున్నవి.* (60 years is the least time in which all the planets—Uranus and Neptune excepted, of-course—make certain numbers of complete revolutions.) అని యార్య

* షష్ట్యా సూర్యాబ్దానాం ప్రపూరయన్తి గ్రహా భపరిణాహమ్.

భటునివాక్యము, మనప్రభవాద్యక్షయాంత షష్టిసంవత్సరములకుఁ గారణము దెలియఁజేయుచున్నట్లున్నది. ఈవిభాగము చీనా దేశమునను, గ్రీక్కుదేశమునను గూడ నుండినట్లు తెలియుచున్నది.

యుగవత్సరములు :—కలియుగమున 7200 షష్టిసంవత్సరము లనియు, ద్వాపరమున 14400సం॥ ములనియుఁ, త్రేతాయుగమున 21600సం॥ ములనియుఁ, కృతయుగమున 28800సం॥ ములనియు మనసిద్ధాంతులు చెప్పుదురు. అందుచే నొక చతుర్యుగమున 4,320,000 సంవత్సరము లుండును.

శాస్త్రప్రశంస :—బహుకాలమునుండియు నీజ్యోతిశ్శాస్త్ర మాయాదేశములలోఁ గ్రమక్రమముగ వృద్ధిపఱుపఁబడెను. ఇప్పటికి నీశాస్త్రము పుంఖానుపుంఖముగ వృద్ధి యగుచునే యున్నది ఇంక నెన్నినవీనాంశములు వెలువడునో తెలియదు. ప్రతిమనుజునకు సాధ్యమైనంతవఱకు నీశాస్త్రమర్యాద తెలిసియుంటుట మంచిది. మనయార్యు లీశాస్త్రము నెంత గౌరవించియుండిరో యీ క్రిందిశ్లోకముచేఁ దెలియనగును.

> యథా శిఖా మయూరాణాం నాగానాం మణయో యథా ।
> తద్వ ద్వేదాంగశాస్త్రాణాం గణితం మూర్ధని స్థితమ్ ॥
> (సూర్యసిద్ధాన్తము.)

కపిస్థళము కృష్ణమాచార్యులు.

## ఈగ్రంథములో నుపయోగింపఁబడిన పారిభాషికపదములు.

| | |
|---|---|
| జ్యోతిశ్శాస్త్రము | = Astronomy. |
| జ్యౌతిషము | = Astrology |
| గ్రహము | = A planet. |
| ఉపగ్రహము | = A satellite |
| సూర్యుఁడు | = The Sun. |
| చంద్రుఁడు | = The Moon. |
| భూమి | = The Earth |
| బుధుఁడు | = The Mercury |
| శుక్రుఁడు | = The Venus |
| అంగారకుఁడు | = The Mars. |
| గ్రహపోతములు | = The Asteroids |
| బృహస్పతి | = The Jupiter |
| శనై[illegible] | = The Saturn. |
| వరుణుఁడు | = The Uranus. |
| నభస్త్రాణుఁడు | = The Neptune |
| కక్ష్య | = The orbit. |
| అక్షము | = The axis. |
| ధ్రువము | = The pole |
| ఉత్తరధ్రువము | = The North pole |
| దక్షిణధ్రువము | = The South pole. |
| నిరక్షరేఖ / విషువద్వృత్తము | = The equator. |
| అపమండలము / అపక్రమమండలము / క్రాంతిమండలము | = The ecliptic. |
| ఆభ్యంతరగ్రహము / శీఘ్రగ్రహము | = The inferior planet. |
| బాహ్యగ్రహము / మందగ్రహము | = The superior planet. |
| ఉచ్చము | = The Aphelion. |
| నీచము | = The Perihelion |
| అపజ్యము | = The Apogee |
| పరిజ్యము | = The Perigee. |
| సంయోగము | = The conjunction. |
| ఆభ్యంతర సంయోగము | = The inferior conjunction. |
| బాహ్యసంయోగము | = The Superior conjunction. |
| ఆభిముఖ్యము | = The opposition. |
| సౌమ్యగతి | = The direct motion. |
| వక్రగతి | = The retrograde motion. |
| ఆయతవృత్తము | = An ellipse |
| ఆద్యపాతము | = The ascending node. |
| ద్వితీయపాతము | = The descending node. |
| భగణము | = Revolution. |
| భ్రమణము | = Rotation |
| గ్రహణము | = An eclipse. |
| ఛాయ | = The Umbra. |
| ఛాయాకల్పము | = The Penumbra. |
| పూర్ణగ్రహణము | = The total eclipse. |
| ఏకదేశగ్రహణము | = The partial eclipse. |
| కంకణగ్రహణము | = The annular eclipse. |

| | |
|---|---|
| దూరదర్శిని | =The telescope. |
| రశ్మివిభాజిని | =The spectroscope. |
| ఛాయాపటము | =The photography |
| తారాగుచ్ఛము | =A star cluster |
| ద్వంద్వనక్షత్రములు | =The double stars |
| ఛాయాపథము | =The Milky way |
| నభోలము | =The Nebula |
| | =The spiral curve. |
| సమానాంతరము | =Parallal |
| శక్తి | =The force. |
| ఆకర్షణశక్తి | =Gravitation |
| ద్రవ్యము | =Matter. |
| ధూమకేతువు | =A comet. |
| ఉల్క | =A meteor. |
| ఉల్కా-వృష్టి | =A meteoric shower. |
| ఉచ్చలగ్నము | =The sign at the zenith. |
| హోరా | =An hour |
| పాతాళము | =Below the horizon. |
| భాగము | =A degree |
| కల | =A minute |
| వికల | =A second |
| సిద్ధాన్తి | =An Astronomer |
| ఘనత | =Density |
| ధూమమయము | =In a gaseous state |

# రఘునాథతొండమాన్‌వంశప్రతాపమాలిక.

—సీసమాలిక.—

(1)శ్రీబృహన్నాయికాసేవా త్తసంపద పదవినతారిభూపతినికాయ
కాయజనళబాహులేయాతిసుందరదరదరాతినిలయుదచలకుంజ
కుంజరారిసమాన ఘోరపరాక్రమ (2)క్రమలసత్ప్రాజ్యసామ్రాజ్యవిభవ
భవసుఖవిభవానుభవ సౌభరిసమాన మానవవరనీతిమహితమహిమ
హిమకరసమకీర్తివిమలదిగంతరతరవారిధారాహతారివిసర
సరళనిస్తులతరసద్గుణసంపన్న (3)పన్నగేంద్రసమానవచనచతుర
తురగాధిరోహణతోషితరేవంత (4)విశదయశః పూరవృతదిగంత
శీతాంశురవికలశీకృతాత్మనిశాంత గర్వితోర్వీవరగణకృతాంత
శరణాగతత్రాణకరుణాయుతస్వాంత ఘనతరకవిజనవనవసంత
కోటికులాంభోధికువలయినీకాంత (5)విబుధాళికాంక్షితవితరణచణ
దినదినసంప్రవర్ధిత (6)కటాక్షాపూర్ణ లలితాశ్రితద్విజరక్షణకర
(7) భాస్వత్ప్రతాప బిభ్యదమిత్రభూధవ రాజరాజతులితరమ్యవిభవ
లలితయక్ సీలింసి రఘునాథతొండమాన్ బహదరుపుడమిపైఁ బ్రబలఁదగిన
యట్టినీసంతతి యాఖండలునిబట్టి తామరతంపరై తనరుచుండు
ధీరుఁడౌ (8)నలకోటి తిరుమభూపునిబట్టి వరరాయరఘునాథ వసుమతీంద్రు
వఱకుధరణిలోన మెఱసినయిరువది తరములవారల ధైర్యశౌర్య
విభవప్రతా (9)పాది విశ్రుతగుణముల మాలికగాఁజేసె మహినివెలయ
ధరణిమహాబాద్దండ బిరుదనుమరుపాటివంశ సీతారామవరకవీంద్ర

---

(1)శ్రీబృహన్నాయికా సేవాత్తవై భవ భవసుఖవిభవ సౌభరిసమాన
శ్రీబృహన్నాయికా సేవాధురంధర ధరణీతలఖ్యాతబిరుదవార
వారధిపాత్మజావాసదాలయపదపదవినతారిభూపతినికాయ.
(2) గతలసత్ప్రా (3)పన్నగేంద్రకణాదఫణితిచతుర (వేఱొకప్రతిలో) పన్నగభాషితభాష్య
చతుర (4)మార్గణమధుకరావళిలతాంత. (5)విబుధకాంక్షితార్థ (6)కళాసం (7) భాస్వత్ప్రతాపాత్త
పరమావిరాజిత రాజితవిఖ్యాతరమ్యమూర్తి. (8)వరకోటి (9)పముల్విస్తార

గర్భసంభవుఁడు వెంకనసుధీవర్యుండు తత్పుత్రుఁడౌ నేను దగినరీతి
నావలివారల యద్భుతచరితముల్ (‡)విశ్రుతంబై రహి వెలయుచుండ
* మందమారుతలోలకుందబృందాంతరస్యందదమందమరందబిందు
తుందిలసారస్య ధుర్వహఫణితిచే వినిపించెద నొకింత వినుము దయను
దక్షిణసీమకుఁ దగినవాపైనట్టి మమదల్లిఖానుఁడు మహితబలుఁడు
కుంపుణీవారలఁ గూడినడిచినట్టి (1)యదిమొదలు జగడ మవధరింపు
చలమున నలచందసాహేబు చెలిమికై యలవిజయరఘునాథావనీంద్రు
కడకేగ నాలమఖానుని బంపిన వెస నతఁడాతని బేటిసేసి
యప్పుడె యలవాఁడు నతిరయమున
సాగి బేటిమైనఁ జతురత మెఱయఁగఁ బలుకఁదొడఁగె వాఁడువయనముగను
యట్టియాపురమాదిమైన భూపాలురు మనపారిపాల్యాల మహీపతులును
దనరనవాపుపై దండెత్తి తిరిచినాపలికోటను జయింపవలసి మేము
పనిఁబూని వ్రాసిన వారలు బలముతో వచ్చి చే(2)రెదమని వ్రాసినారు
తాము నీరీతి దయచేసినట్టైన సగమురాజ్యము మీకొసఁగెద మనుచుఁ
బలుకుమనిన (3)రీతిఁబలికితి నన విని కూడిరానిపనిని గోరినారు
చెనఁటియయినవాఁడు చెట్లపై పండ్లను గోరినట్టులు మీరుకోరినారు
మేము నవాపుకై మీమీఁద దండెత్తనేర్పడియుండ ని దేటిపలుకు
పలికెదరనుచును బకపక యనినవ్వి వినునవాపుతోడి వింతలనుచు
మమదల్లిఖానుఁడు మహితబలాఢ్యుఁడు మహిఁబేరుకన్నట్టి మంత్రివరుఁడు
పరవాహినీపతిబడబానలంబును సామదానభేదచతురమతియుఁ
గాననీబుద్ధిని గడకేగునటు ద్రోసి బ్రదుకుత్రోవను జూడవచ్చు ననుచుఁ
బలికిన(4)యామాట ములుకులవలె నాటఁగనలుచు నలవాఁడు కడకుఁదొలఁగి
చేరిన(5)దొరలను జేర్చుక యలప్రాంచు ముసలల్లియనువాని ముందుచేసి
తిరిచినాపలిచుట్టుదిగి రస్తురానీక త్రోవకట్టినమాట తోడనె విని
మంత్రివర్యుండైన మమదల్లిఖానుఁడు తిరిచినాపలికోట చేరనడిచె
బలముతోడుతను కేప్టన్కోపుసాహేపు జన్నలార్న్దొర సాగిరాఁగ

---

(‡)ధరణిలోన వెలయఁదగఁదెలిపెద. *ఇదియు దీనితరువాత చరణమును 1వ ప్రతిలో మాత్రమేయున్నవి. (1)జగడంబులన్నియు సరవిగాను. (2)రునటుల (3)మాట. (4)మాటలు (5)జనములు.

గసుసుగా నలువంకఁ గ్రమ్మికయుండిన కోటకు రస్తువుల్ గూర్చుకొనకు
శిస్తుగావలసిన రస్తువుల్ చేరనీక తొండమానువివాని తోడుగాను
వచ్చికీరణ్ణారిబైటను విడిసిన సంపఱు నియోజించి యమ్ములితను గ
దండుసాగఁగనిచ్చి లమకుబయలుదేక నాఖబురాలించి యలుకవూని
యాలముఖానుఁడు నాలముగావింపఁ బడమటిదిక్కున జారుతరి
గగనమధ్య గతారకరకిశాంశుప్రతిఫలనదుర్నిరీక్ష్యపటుకృపాణ
పాణితౌరంగికపాదాతఖురపదసంచలద్ధూళి(1)ప్రచ్ఛాదితాభ్రి
మండలుఁడై రాఁగ మఱికొప్పుసాహెబు వంకఁ రెట్టములను దాపుచేసి
రే(2)కవాలెగనెత్తి రేఁగినతూపుల(3)బఱవవద్దటనుచుఁ బట్టుపఱచి
హజాదావులోనుండు నాలముఖానుని బాగుగాగుట్టసేసి భయపడటన్న
హజాదావులోనున్న యాలముఖానుని మేనుచెదరి జనులఁమీఁదఁబడిన
దళముదానినెత్తిఁగి తగినరీతివిఱిగి దాఁగఁదావులెత్తిఁగి తగనుమఱిగి
నానాగతులఁజెందునట్టి ఘాఁజులుచూచి చేయునదియులేక చింతనొంది
నిలిచినతావున నిలిచికలఁకచెందు ఛందసాహెబు చూకనొందఁజేసి
హితుఁడై నవాపుసాహెబునకు సీమతో త్రిశిరఃపురంబు గైవశముచేసి
విజయాంకుఁడై తానువెలయుచునుండఁగ నటుకొన్నినాళ్లపై నబ్బురముగ
గూడలూ(4)రునయందుఁ గుంపిణీవారికిఁ బ్రాంచువారలతోడ బవరమంట
(5)బలముచాలకయున్న బాగుగాయోజించి గౌనర్బహాయరణ్ కారుచిచ్చు
మమదల్లిఖానుని మద్దత్తుగాఁగోర నతఁడువిజయరఘునాథనృపతి
(6)సాహాయ్యకము సేయ సమయమొంచనికోర నప్పుడేయాఘనుండైదువేల
దండుఁబంపుమటంచుఁ దానువ్రాసినను నప్పుడెయాతఁడునైదువేల
జనముల మున్నూఱు జవనాశ్వములఁబంప బలయుతుఁడై సాగి ప్రాంచువారి
గెలిచిమోదమున వక్కీలునుబిలిపించి సీమకుఁ బొమ్మనిసెలవొసంగె
నటులుండనొకనాఁడు హైదరుసాహెపు ముసలల్లి(7)రప్పించిమోదమునను
మంతనంబొనరించి మమదల్లిఖానుఁడు కుంపిణివారలకుమకువల్ల
నెవ్వరీడనుచును హెచ్చియున్నాఁడని యేర్పడికయ్య మొనర్పవలయు
ననుచు దండునుగూర్ప (8)నత్యుగ్రులైనట్టి పదివేలజనములు ప్రాంచువాండ్రు

---

(1)సంఘాది (2)కలాలెగ (3)బదర, (4)ర్బయలున (5)బలముచాలకనె మిక్కిలికక్కసంబైన.
(6)ఈచరణము 2వప్రతిలోలేదు. (7)తోడమోమోటుకొంత (8)నటుపదివేల్గు త్రిజనములు.

(1)పిడుగుచేవలపోల్కిఁ బడుదుచేఁ బొల్పారుపదిపటాళంబుల బారువాండ్రు
వహిమీఱఁదగిన యేబైవేలగుఱ్ఱముల్ రాజిగానిడిన పిరంగులలర
ఫౌఁజునడపి చెన్నపట్నముగూడలూర్ దాఁక గ్రమ్ముకయున్న దాడిచూచి
మట్టెఱుంగక పీరుమాపై నివిడిసినారంచని(2)మదిలోన నరసిచూచి
పదిపటాళంబులు పదిబుజుముట్లను నిరువదివేవురు నింగిలీజు
(3)తురుపువారు నవాపుతోడిజనంబులు కుమకుగారమ్మని కోటివిజయ
రఘునాథతొండమాన్ రాయహంవీరుని దండుఁబంపుమటంచుఁ దానువ్రాయ
నేనూఱుగుఱ్ఱము లేనూఱుచివ్వలు పదివేలసంఖ్యతుపాకివాండ్రఁ
బంపినపిక్కట్టు ఫౌఁజుతోఁజేర్చక మొగ్గరంబులువన్ని మొదటఁగొన్ని
పీరంగులనునుంచి పికట్లుగాఁబంచి దానికిఁజేరువఁదళతళయను
కత్తులుమెఱయంగఁ గక్కసగాండ్రైన తురుపుసవారులు తుదలనిల్చి
యిరువాగునేర్పడి యీసునఁబోరంగ గొప్పపిరంగులగుండ్ల చేత
(4)ఝుంఝూప్రభంజన జర్జరీకృతతూలజాలోపమానమై ప్రీలదళము
జడివానకాలానఁ దడిగోడలవితాన గడుసువెల్లువవేళ గట్టులట్ల
వరుసవరుసగాను బడుచుండెవేగమె తెలిపికానఁగనీక నెఱయసాగి
(5)కర తెగినంతలోఁ గ్రమ్మువెల్లువపోల్కి నొక్కుమ్మడిగఁ బయిఁద్రొక్కసాగి
యిదెమీఱెనదెతూఱెనదిపాఱె నను వేళ ఫౌఁజుకుమొనకల్గఁ బలికిపొగడి
(6) ఇదిసమయమనంగ నేకముగారేఁగి పైనిఁద్రొక్కినడచి బలముమెఱయ
యెడతెగనీయక (7)గెడగెడవాడిన నెదుటిఫౌఁజుకలఁగు ఔటేఁగివేగ
తురుపునఁ జెయిసూపఁ దూఱియాశూరులు బ్రద్దలుతుంటలు పాళ్లుగాను
జేకొద్దినఱకినఁ జెయ్యులన్నియుమాని పడియున్నయాఫౌఁజుపాటువినుము
కాళ్లును వ్రేళ్లును గన్నులుఁ జన్నులుఁ దొడలును మెడలును నడుముఁ గీళ్లుఁ
జెక్కులుఁ బొక్కలు చేతులు మూతులు విఱిచిపఱచినట్లు వెలయుచుండ [రు
(8)గాయముల్లగ్గొని కళమళఁజెందుచుఁజని మొండెముల్పైఁబడ మొగియువా

---

(1) గుత్తి జనంబులగుంపు యేబైవేలు (2)నవ్వుచుహాసరెబిలు, కుంపిణివారుగాఁబంపిన లాట్టు పిక్కట్టుబహద్దరు హాట్టుగారు (3)తురుపులఁగై సేసి తోడ్తోనవాపుసాహెబుకు కుమ్మకుజాబువ్రాయ, నతఁడు విజయరఘునాథహంవీరున కాలాగె. (4)(5)ఈచరణము లొకదానిలో నెకలవు. (6)ఇదిరెండవప్రతిలోఁగలదు. (7)యెడతెగనీయక బడుదుచేదాఁకుచో. (8) రెండవప్రతిలో నెకలదు.

వినుముగాయకచంద్ర వితమేమిచెప్పుదు నెత్తురుజొత్తిల్లఁదత్తరమున
లేచిపోవఁదలఁచి లేవరాకుండిన జరగువారును వట్టియొరగువారుఁ
గొఱప్రాణములతోడ గుజగుజమన్నఁ జూచి నొప్పిఁద్రుళ్లిపడఁగనులుకువారు
బరిగుఱ్ఱా లడ్డంబుపాఱినఁ గనిపెట్టిపొల్లువారునునట్టె త్రుళ్లువారుఁ
జెంగటిచెట్లను జేరఁగామదినెంచి పొల్లిగింతలువెట్టి పోవువారు
మేదినిపైఁబడి " మేరెహోద్దయెలకేలల్లా "యటంచని యడలువారు
" పాయిగేలేకి మీఁకాయికరూ "యని చెంగటివారితోఁ జెప్పువారు
" ఏనుమాడలినాను ఇల్లినమ్మెవ్వరు యెల్లిహోదనొ "యనివొడ్చువారు
(1)" పుదుచేరి మూరణ్ణపుణ్ణంగతమెనంచి అరమందపడిపోచ్చు "గనెడివారు
ప్రాణములొప్పిలేక పదములఁదన్నెడు నరులఁ జేకత్తిచేనఱకువారుఁ
బాఱిపోవదలంచి పదములురాకున్న మొండెముల్పైపైచుకుండువారుఁ [లు
(2)దెగిబ్రేలుతలలూడ నొగులుకాతులతోడ గుప్పుగుప్పునదాఁటుఘోటకము
ఒకప్రక్కఁ బ్రేగులు నొకప్రక్కఁబుఱ్ఱలు నొకప్రక్కనెమ్ములు నొకటసొమ్ము
లలరంగఁగనఁగూడ కతిరౌద్రమైనట్టి కలనిపట్టులఁదారు నిలువలేక
విఱిగిపాఱెడివారి వితములే(3)మందును గానలలోవారు కలసిమెలసి
పాఱుచోశిఖలంటి కొరిందముండ్లెడ్డ విడిచిపెట్టుమటంచు వేఁడువారు
నేగుచోమఱుఁగున నెదిరినతమవారిఁ జూచిదిగ్గున నుల్కిసొలయువారు
బయలుకన్గొనుచోట వడిఁబాఱిపాఱుచుఁ బొదలుకన్గొనుచోటఁ బొంచిపొంచి
వెనుక వచ్చెడివారి వేగఁ జేతులుచాఁచి గుంపుగూడకుమంచుఁ గూఁతలి
[డుచుఁ

గొండలగుహలందుఁగోనలఁగానలఁ గొందఱుపలికిరికూడియుండి
ఇంగిలీజుదొరల దీఘాఁజనుచువిన్న మేము నీవందుకు రామటంచు
గడియదూరంబునఁ గననీకకొట్టిన మనచేఁతలేమిటి కనెడివారుఁ
జేతికత్తికిఁ గత్తి చివ్వకుఁ జివ్వయుఁగాక యీగుండ్లైనఁ దాఁకవశమె
చెండ్లాల గుండ్లను జేటలఁజల్లిన నెదిరిపోర జగతి నెవరితరము

---

(1)యును(2) "పయినున్నతమరౌతు పడిన విచ్చలవిడి నైనరంబులు వాఱువారువములు, వేడెముపట్టుచో వ్రేటుచే .. తెగనట్ల తిరిగెడి యశ్వములును, గుండ్లుచుట్టని తాఁకగుప్పుమంచనితూలి పరదళంబులఁ దేరు వాజితతులు." అనునివియును రెండవప్రతిలోనున్నవి. (3)మనిచెప్ప.

గుండులుగుండ్లంచుఁ గూఁతలుపెట్టిరి తురుపువారిచేఁత తోఁపలేదొ
జీరాలు కేడెముల్ చిలుతాలుబొమిడికల్ దస్తాలటంచని తట్టువడక
వేసినతావున వ్రేటూఱుతున్కలు గాకరిత్తను(1)సోఁకగాన నెచట
నబ్బబ్బ(2)యెన్నైన నాలములోపల మంచిదెబ్బనుదీసె నంచుఁబలుక
దాఁగవచ్చినచోట దండుమాటలవేల యూరకుండుఁడటంచు నొకఁడుపలుక
నలసినగుఱ్ఱముల్ సొలసినసోల్జర్లు బడలికఁజెందినఁ బాఱువాండ్రు
రిత్తసీపాయిలు రుత్తదోస్తానాలు కడిపోయినట్టి చేకత్తు లలర
ఖడ్గకుంతాఘాతఘనతరక్షతిగళద్ర క్తధారాతిదుర్దాంతులగుచు
మోముననొమ్మున ముందటిగాయముల్ నెత్తురెల్లెడఁగన నెరయుచుండ
శూరులు వెడలిరాఁజూపరు(3)ల్కనుఁగొనియత్యద్భుతరసం బనుభవింప
విజయలక్ష్మిచెలంగ వెడలిపురముఁజేరి తొండమానునివారిదండుఁజూచి
మీరుకుంపణివారి మేలుకోరినవారలనుచు గౌనర్దొరహర్షమొప్ప
మీదొరకెప్పుడు మేలుకలుగుచుండు నని జనులకు నినామధికమిచ్చి
సంతోషమునఁ బంపసాగి సీమకువచ్చి తమతమయిచ్చలఁ దగిలియుండ
*గౌనరుమమదల్లిఖానుఁడు మొదలైనదొరలు కొల్వునుండుతఱిని మనకుఁ
దొండమాన్ బహదరుదండు మిక్కిలిసమ్మకుచేసి యించ్చుట ప్రశంసించివారిఁ
దోడ్తో నెరప్పించి దొరలెల్లనునుతింప సమ్మానమొనరించి సంతసించి
సీమకుఁబొమ్మని సెలవిచ్చిపంపఁగా దనమువెల్వడివచ్చి తనరవిజయ
రఘునాధతొండమాన్ రాయహంవీరుని భేటియై ఖబురంతవిన్నవించి
తమతమయిచ్చలఁ దగురీతిని జెలంగనాతఁ డత్యంతసంప్రీతిఁదనరె
నటులుండ..............................దొరవారికొప్పించి మెఱయుచుండ
నటులుండనొక్కనాఁ డాలముఖానుని మేనల్లుఁడైనట్టి మెందుమియ్య
యనుపేరవెలసిన మొనగాఁడుబలిమిచే మధురతెన్నల్ వెల్లి మట్టుగాను
వ్యాపించియున్నట్టివార్త వినినవాఁపు గవర్నరన్నను ఘనునిబిలువఁ
బంపితెలియఁజేయ వల్లెయంచునువాఁడు తెన్నవల్లికిఁబోవఁ దెంపుతోడ
నైదుపటాలాలు నాయితమైరాఁగఁ దొండమానునివారి తోడుఁగోర
ఆయనపంపిన యైదువేలజనంబు వెంటరా వానిపైవిడిసె

(1)పోక (2)యేమైన (3)ఎల్లను ముందఱకన్నను నందమునఁగ *ఇక్కడఁ గ్రిందియేడు చరణము లుండవలయునని మొదటి పుస్తకములోని చిత్రికవలనఁ దెలియును

# వి ష య సూ చి క

[illegible] వాఁడు బారుతీరి
చే[illegible] కలఁ[illegible]
[illegible] సీమకరి యుండ
[illegible] మమదల్లిఖానుఁ[illegible] మధుర[illegible] మహిమీఁదగఁగఁ
[illegible] కుముదాని నెంచిపంప
వాఁడునా(1)దిక్కే[illegible] ప్రకటముమైనఁ గోపగించి
మమదల్లిఖానుఁడు [illegible] కేమలు [illegible]బిలిచి
యేకాంతము [illegible] నాపల్లెచేరి
[illegible] రఘునాథేంద్రు రప్పించి కలనికి రమ్మటన్న
రా[illegible] తు[illegible] గలి[illegible] జనులు జలసికొలువఁ
[illegible] దండుదిగిన
నామాట[illegible] గలంగి [illegible] వేడి[illegible]
జెంతటివారలె చేపట్టుగాఁబట్టి యూరకయె నబాపుకొప్పగింప
వానిఁదూఁకుందీసి తోనె యూసీమకుఁ దగినవానినిలిపి తానుదిరిగి
తొండమానునివారిదండుచు దోర్నాడు సీమకుఁబోయిరా సెలవొసంగె
అటులుండనొకనాఁడు హాన్రెబిల్ కంపినీకార్యములకు నెల్లఁగర్త్తయైన
సాహసియైనట్టి జన్నలుల్లాంగుప శ్రీరంగ సీమనుగల .............
గడులనెల్లజయించి కానుకలనుగాంచి రావలెనంచని రవళిమీఁజు [వేఁడ
(2)రమ్యుఁడౌ శ్రీరాయరఘునాథతొండమాన్ ఘనునితోడ్తోనరింపఁ గడఁగి
దండుపంపుమటంచుఁ దానుగాఁగితమపంప నప్పుడె సుభటులనైదువేలు
మున్నూఱుగుఱ్ఱముల్ సన్నద్ధముగఁబంపఁ దత్క్షణంబే వాఁడు తరలిపోయి
కరువూరికోటను అరవకురిచ్చియు దిండుకల్ కోటను దీసియుండఁ
గర్నలైనపులటన్ ఘనుఁడల్లదండుకుఁ గార్యకాఁడైవచ్చి గడుసుగాను
బైసాగి బెంగుళూర్ వఱకోనఁగలయట్టి గడులనెల్లజయించి కడిమిమీఱ
బాలకాడింజేరి పైసాగియచ్చటి దుర్గములజయించి దొరలవలనఁ
గానుకల్ గైకొని కడుసంభ్రమముతోడఁ దొండమానునివారిదండుపోని
వక్కాలురప్పించి బాగుగామీవాకు బహుదినంబులుగాను బద్ధుతోడఁ
గుంపినీవారికిఁ గుమకుచేసినవారుగాన మీకిచ్చితి ఘనతమీఱ

(1)పక్కాలి (2)రమ్యగుణునికోటి

రెండుపటాకాలు రెండుపిరంగులు కుంపినిర్ఘుంటూను గొనుమటంచుఁ [లువ
ప్రేమతోనొసఁగఁగ సీమకుఁగొని(1)పోయి (2)పడవాళ్లు గమికాండ్రుబలసికో
లీలగాలాటు వాలీసుమెకీసను సరదార్లురిపుపై సాగునపుడు
రహెనిరాజవిజయ రఘునాథతొండమాన్ బహదరువారికి వ్రాసిపంప
నాలాగెపంపిన నాశూరవర్యులు బోదున మున్నీరుగహెంగినట్లు
కణవాయిపైసాగ గడుసైన తావులఁ గొండలసందులఁ గోనలందుఁ
బొంచియున్నరిపుల వంచనలనెఱింగి ముందుపిరంగులు పొందుపఱచి
ద్రాక్షగొలలువోని తఱుసైనగుండ్లను విచ్చుగుండ్లు మఱియుఁ బెద్దగుండ్లు
బారుచేయుచుఁజూచి ఫైరనిపల్కినఁ బెళపెళపెళయని బెడిదముగను
ఏకముహూర్తాన నెన్నంగరానట్టి గుండులువెలువడి గండశిలలఁ
దగిలినవేగానఁ బగిలినచిల్లులు విరియుగుండ్లవలన వెడలుతునుక
లిసుకచల్లినరీతి నెడలేకవిరిసిన నిలువలేకయువారు కలఁగిపాఱఁ
దఱిమిపైసాగంగదండును నడిపించి శ్రీరంగపట్నము చెంతనుదిగి
మొదటనుత్తరప్రకారమోర్చాలుసవరించి పిరంగులుబిగించి వీథిబడిని
నాలుగేగుండులు నగరివాకిలిముందు పడునట్లునేసిన వగనుజెంది
కౌలుపల్కుమటంచుఁ గార్యగాండ్రనుబంప నేమికవులటన్న నిపుడుమాదు
కోటలెన్నఁగఁగట్టి కోటకుఁదగినట్టి వస్తువుల్ తగనుంచి రహెనిమించి
మైదేండ్లుగానిచ్చి యావలవచ్చిన జగడముగావచ్చు సాగుఁడనుచుఁ
గోట్లసంఖ్యాధనము గొమ్మనియిచ్చినఁ దీసుకసీమకుఁ దిరిగివచ్చి
యటులుండనొకనాఁడు నారీసాహెబు సేసెనుదుర్నీతి చెవులవినిన
జన్నలగ్నీసను సరదారుకొప్పించి పదిలముగను పైనిబడఁగనెంచి
పదిబుజుము ట్లిరువదిపటాళంబులు తురువులుపదివేలు తురగములును
గొప్పపిరంగులు గుండ్లువగలబండ్లు మందుపీపాయిలు పొందుపఱిచి
రహెనిరాజవిజయ రఘునాథతొండమాన్ బహదరుజనములఁ బదిలముగను
మద్దత్తుగావచ్చి మనదండునకుమీరు కుముకుగారండని కోరివ్రాయ
నాలాగెనడిపింప నటసాగిరండని ముందుసాగినదండు ముదముతోడఁ
బవపదయనుచును శౌరుతీరుగసాగి శ్రీరంగపట్నము చెంతఁజేరి
కోటమర్మమెఱుంగ గుండ్లకువెలిగాను నిలిచి యద్దానిలోనెలవెఱింగి

(1)పచ్చి (2)దొరవారికొప్పించి మెఱయుచుండ.

గుండ్లకులోపల గుప్పుమంచనితూటతెగఁబనివాండ్రచేఁ దత్తరమున
నిసుకనించినగూండ్లవిపకముంగిడి నెమటిగుండులవల్ల నెత్తిపోక
బలముచేయుచు వేగబత్తెరిగాకించి యఁదముఁబొగులఁ బొందుపఱచి
యెదతెకయెనండ్లు గడగడగాడదఁ జేసినచేఁతలు చెప్పనేనె
నొకప్రక్కనడుగంట నొకటిపైనొకటిగాఁ గోటనిడియగొట్టి గుండ్లనవలి
యొకప్రక్క లోపలి యుప్పరిగెలుఁగ్రింది ధరణిపైఁబడఁబట్టి దళపడలును
నొకప్రక్కఁ గొత్తళాల్గాఁగానిలిచ్చి తలలెత్తువారల తలలుచదియ
నింగిమొల్లెడఁగన్న దిగనుప్రాంతము లేకముగఁజెలంగ నెకటిబాఁజు
కలఁగిపాముపెఠంగి కాల్పంబనుకుఁబొంగి యిడియఁగొట్టించట్టి యిమ్మెగుంగి
యగడితతెగఁబూన్చి పగునట్టిబొజర్లఁజేసి లగ్గలుపట్టసెలవొసంగఁ
జేతితుపాకులు చెలఁగంగసోజర్లు పెనుపెలాసంచుఁ బిరుతివియక
కొందఱుకోటపైఁ గొత్తళాల్ మొదలుగఁ గలచోట్లను మొనపి కడునుచూపఁ
గొందఱువాకిండ్లయందుఁ గ్రమ్ముకనిల్వఁ గొందఱువరుసగాఁ గోటలోన
వీథివెంబడిసాగ వెలుపునజనములు గుండ్లకు(1)వెఱగంది గుంపువిడక
సందులగొందుల నెందును సనుఁగొన్న నిలిచినతావున నిలిచియుండ
ఆరీపుసాహెబు అడ్డముగావచ్చి తప్పగుండులుతాఁకి ధరణిఁబడిన
(2)నామాటలను వినియప్పుడె సరదార్లు గుప్పనిలోఁజొచ్చి కుతుకమునను
ఖామందులనుబట్టి కావలినిడఁజేసి పేదసాదలనెల్ల వెలికివిడిచి
గడులెల్లమెల్లగాఁ గైవసంబొనరించి కర్తరుసను రాజ్యకార్యమిచ్చి
తొండమానుని వారిదండుకోఁగలయట్టి సరదార్లకును వారిజనులకెల్ల
నీనాములిప్పించి యింకమీఁదసీమకుఁ బోయిరమ్మనిపంపఁ బురముసేరి
వెలయుచునుండిరి వింతనేనేమన నలనబాపును జేరియణఁగినట్టి
రెడ్డియునొడయారి రీతితప్పచుమీఁగి యాజ్ఞనుమీఱెనా రనెడిమాట
నాలించితానును నాగ్రహవ్యగ్రుఁడై సామాజికులతో యోజననుజేసి
యుగ్రత నుందతుల్ ఉమ్రాబహద్దరు తనమనోభావంబు తగినరీతి
లలితుఁడైనవిజయ రఘునాథనృపతికి వ్రాసిపంపినవారి భావమెఱిఁగి
తొరయూరిసీముపై సరదార్లఁదగునట్టి సన్నాహములతోడ సాగుఁడనిన
ఆశూరవర్యులు నపుడెమోహరించి కోటలపురముల ఘోరవనుల

(1)దిగులంది (2)ఆమాటలనువినియపుడె లోనికివచ్చి నగరివాకిటనిల్చి తగినయట్టి.

తెట్టుంగ కుసైనపట్టుల నొష్టులఁ గొండలబండలఁ గోనలందు
నిలువసేయక వెంట నెమకినెమకి తాఁకసాగ తావులు లేక డాఁగిపోక
కవులుకవులటన్నఁ గరుణతోనుండతు ఉబ్రమూబహద్దరు కొప్పగించి
బాగుగా నొడయారిపాళెముపై దిగి వేముతుమ్మయునీఁదు వెదురు మొగిలి
బెత్తముల్ కోరిండ పెద్దకలివి మొద లల్లికొనినయట్టి యడవిముందు
రణమండలము భీకరణాపరాసదమని విన్నదైనను మేము వెఱవమనుచు
ముంపుపెరంగులు పొందుగా వెంటనే సరకోవులనమర్చి సరవిగాను
జగడమిచ్చుచునుండి జనములు రెండుగాఁ బంచి ప్రక్కలయందు బాగుగాను
జెట్లవెంబడిఁ జొచ్చి చెరిసమీపానఁ బెళపెళలాడిన బెదరివారు
పరువెత్తివేగ నబాపుసాహెబున శరణమొందఁగఁ జేయు జయముఁగన్న
వర్తమానము తమవారు వ్రాసియుఁబంప నదియెఱింగి యధికహర్షమునను
సాహసంబును శక్తి సత్యంబు నమ్మిక కోటివంశంబున కొప్పననుచు
నొనరంగనుందతు ఉబ్రమూబహద్దరు బిరుదులనన్నియుఁ బ్రేమతోడ
రాజన్యమాన్యమై రఘునాథతొండమాన్ బహదరటంచని పరఁగుపేరు
బంగారుబెత్తముల్ బాగైనమోర్ఛలు నవభత్తుభాంకృతుల్ భువిని వెలయ
జంకైనచోపుదార్జంటనకీబులు చదురునబిరుదులు సన్నుతింప
నానందమున నీయనాతఁడు గైకొని ధరణిఁ బాలించుచుఁ దనరుచుండ
నట్టియాపురమున దుష్టతముండైన మూగివాఁడనునట్టి మూర్ఖుఁడొకఁడు
తామరతంపరై తగ వెలింగెడునట్టి మరుదువివంశంబు మహినిఁ గూల్పఁ
గారణమైతోఁ చెఁగైయొనఁగిరివీరు నొసటిగ్రావాఁతనుద్రోయ నొకరితరమ
అటువలె వారలల్లల్లన హానరబిల్ కుంపినీవారిదా కోపమునకుఁ
బాత్రమయిన వారిపాపమేమందును దమ్ముఁదామెచ్చుచు దర్పమునను
వేసినకోలలు వెలువరింపనియట్టి వనదుర్గమును గల్గు ఘనతమెఱయఁ
దెట్టుకుముందు విల్వెట్టుపర్యంతంబు ముండ్లకంపలమర్చి మొళలుకొట్టి
యందుకులోపల నతిచుఱుకైనట్టి వసులఁ బాఁతఱలను బదిలపఱిచి [గాను
తమకుపెండెము మూసి నడుమమందులుపూడ్చి ముందుప్రక్కలఁ జుట్లఁ బొందు
డంజాల్లు రేకలాల్ సరకోవ్రలు తుపాకులెడయీక భటులను నెంచిపైటి
రాకపోకలెఱుంగ రహిమీఱ బ్రమాకులకోనలను గోటిగాండ్రను నమర్చి
త్రోవకు నిరుప్రక్కలఁ దుదముట్టఁ గానలోఁ బల్లముగాఁ ద్రవ్వి భటులనందుఁ

బొంచఁబంచి తనకుఁబోడిపించి యుండఁగ నట్టివారలభావమంతఁ దెలిసి
పెర్నలగ్నీసును కర్నలిన్నీసును దగనుమోసము చేసి దండుగూర్చి
ఘనమోజఁకపరుంచ కర్నలులన్సింగ్లాకి పనఁజేగానమనము వ్రాసిపంపి
ఆమోసమునగనియటు నాగవలెనంచుఁ బాకెముప్రామఁబ్రక్కనిల్ప
నాకాగితముచూచినపుడె బయల్దేరి త్రోత్తకోటకువచ్చి కుతుకమునను
రహిని రాజబిరుదు రఘునాథతోండమాన్ బహదరుతోడను బాగుగాను
మంతనంబునను గూడి మరుమఁజేసేవాఁడు మత్తుఁడై మేమియు మదిఁదలఁపక
కుంపినివారిద్రోహము తెలియలేక చెలరేఁగి విషమము చేసినాఁడు
కుంపిని వారికిఁ గుముకుగా నడిచి తగఁగీర్తిఁ జెందను దరుణమిదియె
ననుచుఁబల్కి జనులనప్పుడె రప్పించి సగముకోట్టాంపట్టి సాగఁబంచి
తక్కనసగమును దానుజేకొనిపోయి యర్ధాంగికాప్రక్కనాని నిలిచి
తిరుమయంకోటలో నరుదైన నస్తువులుంచి పెట్టఁగఁ దావునోసఁగుమన్నఁ
గోటమాత్రము నేమి కుంపినివారిదే యఖిలభాగ్యము మమ్మునడుగుటేమి
యనుచునుత్తరువిచ్చి యారస్తురక్షింప నమ్మికౌనరదార్ల నపుడెపంపి
జాగ్రత్త చేయఁగఁ జయ్యనన చటికిఁ గర్నలిన్నీసును గర్నలైన
బ్లాకిబర్ణ్ ద్వార వచ్చియప్పుడె యెల్లరస్తువుల్ చేకొని లలితముగను
ఓక్యూరిబైటను నోరట్టుగా దిగి ప్రళయకాలాంతకు పగిదినపుడు
పుడమిపయినినలుగడలును నుడుగక నడలునఁబడగలు కదువడిఁజెను
పిడుగులఁజడి నెడవిడుపకను తొడుగువడువునఁ గడిమినిదరఁబడకను
గడగడయనునట్టిగాఢ నిధ్వాననిర్భిన్నహృత్పరిపంథిబృందుఁ డగుచుఁ
దట్టుప్రక్కను బుజుముట్లపిరంగుల నిలిపిజగడమిచ్చి నేర్పుతోడ
గుప్పనిదండుచేకొని ప్రక్కవిడిసిన నిలువనీకను జేయవలయుననుచు
చెట్లమఱఁగియుండి చేతితుపాకులు పెళపెళలాడిన బెదరకుండ
గొప్పపిరంగుల గుండ్లువాగినప్రకర గురియించి ఫైరన్నఘోరనీల
నీరదావళిగాఢ నిర్ఘాతములఁబోలి గడగడగడగడగడగడయని
గడెసేపులోనను గణియింపరానట్టి గుండ్లువెల్వడి మహాఘోరలీలఁ
గొమ్మలురెమ్మలుగొనలును ననలును దుంపలు జొంపముల్ తూల్విప్రీలఁ
బెదరుచు నొరగుచుఁ జిద్రుపలై యెల్లెడఁ బఱచినట్లులుగాను నెఱయఁబడిన

నడవనుండఁగలేక యలవారుపఱచిన మజిలెయొక్క ప్రక్కల మాటిపితోన
సోజర్లుముందుగాఁ జోరవారు వాండ్రెను జేసినడువఁ బంచిచెట్లలోనఁ
జీమలవఱనగాఁ జటుకుపాటుకులేక సాగుదండును రెండుభాగములుగఁ
బంచిసగము తెట్టుపైదాక నియమించి సగముపట్నముపైని దగనుబంచి
యుండినట్టులయుండి యురుముకపిడుగులు పడినరీతిని గడగడగడయనఁ
దెట్టులోనిజనము లట్టిట్టుఁజనలేక శరణమన్నను బైటసాగనిచ్చి
పట్నంబునగ్గైసె బారుక్రమ్మకనిల్చి మూటవెట్టి తగినశూరవరులఁ
జేపట్టుగాఁబట్టి రేపెట్టులోయని కలకపాఱెడువారి ఖైదుచేసి
ద్రోహులనెల్లనుఁ దూఁటులోవేయించి జగతిలోఁ దమధాకమిగులనిలిపి
సరసుఁడై చట్టి రాజాబహద్దరువారి సరదాఱురప్పించి సకలమైన
బహుమానతులనిచ్చి పాయిరమ్మనిపంచి ఉయ్యాలెఉనిసీమ నుండఁబంచి
కర్ణునిబోలిన కర్నలుల్యాంబ్లాకి పరుఁడురసీజెంటు బాగుగాను
న్యాయంబునమనుపు నాఁగజగతిలోనఁ దగినట్టుకీర్తి ప్రతాపమెచ్చ
ద్వీపాంతరాదిక దేశములనుగెల్చి వాదుశావులనెల్ల భంగపఱచి
చక్రవర్తులఁబోలు శౌర్యసంపన్నులౌ హాన్రబిల్ కుంపెనిదైనయట్టి
కార్యధుర్యుఁడయిన గౌనరుసాహేబు వారికిఁబత్రముల్ వ్రాసిపంపి
ముదముతోడుతను ముప్పదివేలమాడలు నేయుకిళానెల్లిసీమమీకు
నిచ్చినామదికొని యేలుఁడటంచని వ్రాసినపత్రముతీసిపంప
నారాజ్యమునుజెంది యానందమొందఁగాఁ దద్గర్భమునఁగల్గి ధరణిలోన
లలితరాజవిజయ రఘునాధతొండెమాన్ బహదరురఘునాథ పార్థివుఁడన
బేరుఁజెంది జగతివెలయుచునుండెంగ శిశుభావముదలంచి చిత్తమునను
వాత్సల్యమునఁ బుత్త్రిభావంబుదగఁబూని సాముచేఁతలయందు సరవిగాను
హయగజాద్యారోహణాదికార్యములందు సకలవిద్యలయందు సాటిలేని
వారలఁగాఁజేసి వైవాహికాదికశుభముల నన్నింటిసొంపుమీఱ
బాగుగాఁగర్నలాంబ్లాకీ పరరెరసీజంటు సాహేబును సమ్మదమున
రమ్యగుణాఢ్యుఁడౌరాజాబహద్దర బాగుగానీవు నావార్తవినుము
యీజగంబున దొరలెందఱున్నా రేమి చూడనీవంశ్యులే శూరవరులు
స్వామికార్యంబున సత్యంబుదప్పక నడిచినవారలు నదియుఁగాక
న్యాయంబునమ్మిక యధికవిక్రమమును లోకరక్షణశక్తిలోనుగాను

లలితగుణంబులు

భవఘనత లగ్గకుండఁ గుంపిణికిఁ గొదవగాక

మనుపటికన్నను నినుమసియా

సింహాలి కనుఁజుట్టైనరి పట్టిరాజ్యంబున కధిపుఁడగుచుఁ

పాలింపఁగుంపిణివారు నీగుణము

...కన్నలించి రఘునాథతొండమాన్ బహద్దరసంగాను బిరుగుపేరు

పుడమి వెలయ సుగుణావ

మఱియుఁ గంపెనీవారు మాన్యుఁడవనుచును మత్కృతాశీర్వాదమహిమవలన

నీవుతలచరీతి ఘనపదవిభృత

పటలమకుటకోటఘటితమణిగణదీపికాజాల దేదీప్యమాన

(ఈ క్రిందివి మూఁడవప్రతిలోనివి)

నానందమ్మఁదైరసీజంటుకర్న లుక్సంబ్లాకిబరుండునెయ్యమున వీర్లఁ జేపట్టి వెలయఁ
కీర్తికిసాటి మీకేమియుఁగానేరదని నెమ్మనమ్మునఁదలఁచి సకల [జేయ
భాషలయందతిప్రావీణ్యము డిగాక హయ గజారోహణాచార్యపటిమ
నీతిమార్గంబున నిరతిశయప్రౌఢి మొదలగువిద్యలనధికమైన
పాండిత్యవంతులై పరఁగువట్టులుచేయ నందున నగ్రజుండైన రాజ
విజయాంకరఘునాథవిభుఁడు విశ్రుతకీర్తియై రాజ్యభోగంబు లనుభవించె
నారాజసింహునకనుజుఁడవౌ నీవుబృహదంబికాకృపా వీక్షణమున
బహుపుత్త్రసంపత్తిఁ బడసిసర్వంసహాచక్రసన్నుతరీతి విక్రమంబు
నీతిమార్గంబున నిరుపమానఖ్యాతిఁ దగరాజ్యమేలుచుఁ దనరుచుండఁ
గుంపిణీవారు నీగుణములుకొనియాడి దిక్సన్నుతంబైన మెక్సలెన్సి
రఘునాథతొండమాన్ రాజాబహద్దరన్పేరుగై కొమ్మని ప్రేమతోడ
నొసఁగినపేరంది యసదృశకీర్తివై వెలయుచున్నావని విశదముగను
తావకవంశమాధరణీధరేంద్రాబ్జమిత్రారితారమై మెఱయుచుండ
వంశావళిరచించి వఱలఁగాఁజేసితి మత్కృతాశీర్వాదమహిమవలన
నాహిమశైలసేతుర్వాంతరాళావనిభాగోల్లసద్ధరాపాలమకుట
కీలితకురువిందజాలప్రభాదరపాదపంకేరుహద్వంద్వుఁడగుము

గీ॥ సంగరమృగేంద్ర కోటివంశాబ్ధిచంద్ర । లలితమెక్లెన్సిరఘునాథరాయతొండ
మాన్ బహద్దరకుధర సమానధీర । ధరణి వర్ధిల్లు మాచంద్రతారకముగ॥

నుదురుపాటి సాంబశివకవి.

తొండమాన్ వంశప్రతాపమాలికకుఁ బరిషత్పుస్తక భాండాగారమున మూఁడసంపూర్ణప్రతులున్నవి, మూఁడింటినుండి యింతవట్టు ప్రతివ్రాసి ప్రకటించితిమి. ఇది పరిషత్పత్త్రిక తృతీయసంపుటము పుట 304లోఁ బ్రకటింపఁబడిన నుదురుపాటి వేంకనార్యుని తొండమాన్ వంశావళి తరువాయి. ఈగ్రంథములోఁ గవి తన పేరును దెల్పక పై వేంకనార్యుని పుత్త్రుఁడైనట్లుమాత్రము "నుదురుపాటి సీతారామవరకవీంద్ర । గర్భసంభవుఁడు వెంకనసుధీవర్యుండు తత్పుత్త్రుఁడౌనేను దగినరీతి॥" నని చెప్పుకొనియెను. ఇక్కవి బిల్హణీయమును రచించెను. చూ. పరిషత్పత్త్రిక 3వ సంపుటము 312 పుటమొదలు. ఇందుఁదప్పులు విశేషముగానున్నవి, దిద్దుట కనువుపడని తప్పులు విడువఁబడినవి. స. అ.

# స్వాగతోపన్యాసము.

(కడప, పరిషత్సభలోఁ జదువఁబడినది.)

→.000←

మహాశయులారా!

చండభానుఁడు స్వీయప్రచండశౌర్యమును సమగ్రముగ నిండువేడుకఁ జూపఁ బూనియున్న యిక్కాలమున దూర మనక మార్గశ్రమముల సరకు సేయక, యవాంతరకష్టముల నెన్నియేని పాటింపక, యనారోగ్యభూమి యను మిథ్యాప్రవాదమును వహించియున్న యీకడపనగరమునకు, ఆంధ్రభోజుఁ డని ప్రఖ్యాతినొందిన శ్రీమత్కృష్ణదేవరాట్ప్రభృతులు పరమపదించినపిదప నిరాధార యై, పెక్కుశృంగారములఁ బోఁగొట్టుకొని, యంగవిహీనయుంబోలెఁ గడు బడలి నవయుచు, దీనయై, యెవరియాధారమున నీకష్టములు నాకుం దీఱునా యని పరితపించుచు, నలుదెసలు పరికించు చున్నయాంధ్రభాషామతల్లికను నవనవాలంకృతఁ గాఁ జేయ నెంచి, యింతకన్నఁ బురుషార్థము వే ఱొండు లే దనుదీక్షఁ బూని, కడుదూరమునుండి యరుదెంచిన మీకందఱకు నేతన్నగర వాసులపక్షమునను, నాహ్వానసంఘమువారిపక్షమునను వందనపూర్వకము, హృదయపూర్వకము నగుస్వాగతము నిచ్చుచున్నాను.

ఆంధ్రసాహిత్యపరిషత్షష్ఠవార్షికోత్సవ దర్శనకారణమున మాతృభాషా పక్షపాతమును సంపూర్ణముగఁ గనఁబఱుపఁబూని యరుదెంచిన మీవంటిమహనీయులకుఁ దగినన్నిసౌకర్యములఁ గల్పింపలేకపోయినను, ప్రేమపూర్వక మగు నాదరమును జూపుటలో మే మెంతమాత్రము నెవ్వరికిని వెనుదీయువారము గా మని విన్నవించుకొనుచున్నారము.

రాజమహేంద్రవరమునను, బళ్లారిపురమునందును, గుంటూరునగరమందును గలదుస్సహాతపమున కోర్చినమీ కీపురమునఁ దోఁచునాతపము దుర్భరముగా నుండకపోయినను బోవచ్చును గాని యెండకుఁ దోడుగా మార్గశ్రమములుకూడఁ గలిసి మిమ్ము నలయించునేమో యని యించుక ఖేదపడవలసినవారమే యైనను మాతృభాషారక్షణమున బద్ధదీక్షు లై యున్నమీపూన్కికి

నెంతయు సంతోషించి నిర్భరానురాగసమంచిత మగుస్వాగతమున మాకృత జ్ఞతను జూపుచు నిందలియితరకష్టములకుంగూడఁ దా మోర్చుకొనవలయు నని యభ్యర్థించుచున్నాము.

ఆంధ్రులపూర్వచారిత్రమునకును, ఆంధ్రకవుల మహోన్నతదశకును ముఖ్యస్థాన మై యిప్పటికింగూడఁ దద్విషయమున నీమండలము ప్రఖ్యాతిని వహించియే యున్న దనుట మీకుం గ్రొత్తవిషయము గాదుకదా.

తొలుదొల్త నాంధ్రరాజులు తమధర్మస్థాపనమును వెల్లడించుచుఁ బరి పాలించి దైవగతిచేఁ గొంతకాలంతను గాంచినతరువాత నీమండలమును బల్లవు లను నొకతెగవారు క్రీ. శ. ३५० సంవత్సరప్రాంతమున స్వాధీనము చేసికొని ౧౦౦ సం॥లు పాలించిరి. పినాకినీసమీపపురము లన్నియు వారికి ముఖ్యస్థాన ములై యుండె.

ఆపిదప "చోడు"లని ప్రఖ్యాతినొంది కాంచీనగరము తమకు నివాస స్థానముగా నున్నరాజులు పినాకినీప్రాంతముననే యేతన్మండలమును బ్రవేశించి వశము చేసికొనిరి. పెద్దముడియము, ముద్దనూరు, మాలెపాళెము నను గ్రామ ములయందు నేఁటికిని నేత్రపర్వ మొనరించు శిలాశాసనము లీపైవిషయమును సిద్ధాంతము సేయుచున్నవి. చీనాదేశమునుండి వచ్చి యీదేశమంతయుఁ దిరిగిన యొకపాంథునివ్రాఁతవలన నమరావతికి నైఋతిభాగమునఁ జోడరాజ్య మున్న దని తెలియఁదగిన రాజ్య మీమండలమే యని చెప్పక తప్పదు. వీరిరాజ్యము ३००సం॥లు నిరంకుశముగా సాగెను.

ఆతరువాత "బాణు" లనురాజులు పాపఘ్నినదీపరిసరమార్గమున వచ్చి యిందుఁ గొంతభాగము నాక్రమించుకొని పాలించుచు నాంధ్ర-చోడులకు సామంతులును బంధువులును నై యుండి రనువిషయమును దెలుపుశాసనము పొత్తిపాడు గ్రామమున మీమనస్సంతోషమును బుట్టింపఁగలదు.

అవ్వల "రాష్ట్రకు" లనువారు వచ్చిరని తెలుపు దానపాడు శాసనము దృగ్గోచర మగును. అప్పుడే "వైడంబు" లనువారు రాయచోటిసమీపమున నున్నట్లు తెలియఁదగు.

ఆంధ్రచోడులముఖ్యపట్టనము పుల్లంపేట సమీపమున నున్నపొత్తపి యనునది. వీరు "మధురాంతకపొత్తపిచోడు" లనుబిరుదమును బూని యుం డిరి. చోళులకు సహాయులుగను నున్నట్లు మన మెఱుంగనగు. ఈవంశమున

మనుమసిద్ధిరాజు మిగులఁ బ్రఖ్యాతిని వహించి నెల్లూరునగరమును రాజధానిగఁ జేసికొని రాజ్యమును పాలించెను. కవిబ్రహ్మ యగుతిక్కనసోమయాజులను పోషించినమహాశయుఁ డీతఁడే. ఈయాంధ్రచోళులరాజ్యము కొంతకాలము హెచ్చుగను, కొంతకాలము సాధారణముగను నించుమించుగ 200 సంవత్సరము లుండెను.

ఆసమయమునఁ గాకతీయరాజ్యమును హరించిన యంబదేవరాజు వల్లూరుగ్రామమున నుండి కొంతభాగమును పాలించుచుఁ, బొత్తపిభూములను గొలిచి లేపాకదగ్గఱ నొకకాలువను ద్రవ్వించి యత్తిరాలకుఁ జెంత బాహుదా నది కనకట్ట కట్టించినట్లు స్పష్టము

తరువాత ఓరంగల్ రాజ్యమున కధిపతి యగు ప్రతాపరుద్రమహారాజ కడపవఱ కున్న దేశము నంతయు స్వాధీనము చేసికొనెను.

పరదేశీయరాజులను రా కుండఁ జేయఁ బ్రయత్నించిన రాజులప్రయత్నమునకు ఫలము గా శ్రీమద్విజయనగరము స్థాపిత మాయెను. తర్వాతఁ గొలఁది కాలమున నుదయగిరిదుర్గము స్థాపింపఁబడియెను. కడపమండల మంతయు దానికి లోపడుట తటస్థ మాయెను. ఈవిషయమును పోరుమామిళ్ల చెఱువు కట్టపై నున్న భైరవాలయమునందలి శాసనము తెలుపుచున్నది. మొదటిబుక్కరాజుపుత్త్రుఁ డగుభాస్కరరాయఁడు పోరుమామిళ్ల తటాకమును గట్టించెను.

ఆతరువాత మట్లిరాజులు మహోన్నతదశకు వచ్చిరి. వీరిముఖ్యస్థానము తొలుతఁ బొత్తపియె యైనను పిదప చిట్టివే లని స్పష్ట మగును. అనంతరాజనుమహాత్ముఁడు బద్వే లనఁబడు పెద్దప్రోలునొద్ద గొప్పతటాకమును గట్టించి యనంతరాజపుర మనునగ్రహారము నేర్పఱిచి శ్రీప్రసన్నవేంకటేశ్వరుల దేవాలయమును గట్టించి యనేకభూదానములు చేసెను ఇచ్చటికి నాలుగుకోసుల దూరమున నున్నదియు, దక్షిణకాశి యనిపురాణప్రసిద్ధ మైనదియు నగు సిద్ధవటమునఁ గోటను గట్టింపఁ బ్రయత్నించినవాఁ డీతఁడే. వీరివంశజుఁ డగు ననంతరాజు కాకుత్థ్సవిజయ మనునొకయుత్తమగ్రంథము నొనరించెను. మఱియొకరాజు తిరుపతిలోఁ గోవిందరాజుల దేవాలయమున గోపురమును గట్టించెను. ఆగోపుర మిపుడు నేత్రగోచర మగుచు నమ్మహాత్ముని ప్రఖ్యాని శీలమును భక్తిని వేయిభంగులఁ జాటుచున్నది. వీరు "దేవచోడమహారాజు" లనుప్రఖ్యాతిని గాంచిరి. వీరివంశీయు లొసఁగిన యఱువదినాలు గగ్రహారములు బావా

దాతీరముల నలరారుచు నిర్మలజలపూరిత వాపీకూపతటాకాభిరామంబు లై నేఁటికిని వారియౌదార్యమును వేయినోళ్లఁ గొనియాడుచున్నవి.

ఈమండలమున రాజస్థానము లని ప్రఖ్యాతిని వహించిన పట్టనములు. పొత్తపి, చిట్టివేలు, వల్లూరు, ఇనగలూరు, పెనగలూరు, గట్టుసీమ, సోమపల్లి యనునవి.

మఱియు నీమండలము సుప్రసిద్ధమహాకవుల కునికిపట్టయినట్లు కనుపట్టుచున్నది. సకలసుకవిసంస్తుతిపాత్రముగ నాంధ్రభాగవతమును రచించి పరమేశ్వరకరుణాపాత్రుఁ డైనబమ్మెరపోతనామాత్య సత్కవిశిరోమణి యీమండలమున నున్నయొంటిమిట్టయం దున్నవాఁడు. భాగవతమును గృతినందిన శ్రీకోదండరాములవారి యాలయ మాపురమునం దిపుడు నిత్యోత్సవములచే నలరారుచు, నేత్రపర్వ మొనరించుచున్నయది.

కొందఱు నాగరకు లిక్కాలమున నిమ్మహాకవిని ఓరంగల్లోనివాఁ డని సాధింపఁబూనిరి కాని యది సమంజస మగువాదము కా దని నొక్కి వక్కాణింపనగు. వారివంశమున జన్మించినయొకసాధ్వీతిలకము జరాభారముచే నడుము వంగియుండి యెవరైనఁ బోతనగారు మీవారేనా యని ప్రశ్నింపఁ గన్నీరు కాఱ మావారే యని తడఁబాటుమాటలతో నుత్తర మిచ్చుచున్నది. నాగరకత యించుకేనియు నెఱుఁగని యేనాదులుకూడ నేఁటికిని "ఇది పోతన్న తానమాడిన తావు. ఇది కయిత్తము చెప్పినతా" వని చూపుచున్నారు. రామాభ్యుదయమును రచించిన యయ్యలరాజు రామభద్రమహాకవియు నొంటిమిట్టలో నున్నవాఁడే. ఆంధ్రకవితాపితామహుఁ డగునల్లసానిపెద్దనకవి కృష్ణరాయలను మెప్పించి కైకొన్నకోకటగ్రామ మిచ్చటి కెనిమిదికోసులదూరమున నున్నది. ఈమహాకవి కడపమండలములోఁ గొంతకాల మున్నవాఁ డనియు, నిందే శఠకోపయతియొద్ద నుపదేశము నొంది తరువాత నానెగొందికిఁ బోయి యుండవచ్చు ననియు ననుట నిర్వివాదాంశము. రామరాజభూషణమహాకవియు నీమండలములోని పులివెందలప్రాంతమున నున్నవాఁడే. ఇప్పటికి నాప్రాంత్యమున నుండుబట్టు రాజులు బట్టుమూర్తి మావాఁడే యని యుద్ఘోషించుచున్నారు. తరిగొండ వెంగమ్మ, వేమన, కవిచౌడప్ప మొదలగువా రీమండలములో నున్నవారే. పండితరాట్టగుజగన్నాథమహాకవియుఁ బదవాక్యప్రమాణపారావారపారీణమహామహోపాధ్యాయ బిరుదాంచితుఁ డగుకోలచల మల్లినాథసూరియు నీమం

డలములో నున్నవారే యనుసిద్ధాంతము నిపు డందఱు నంగీకరించుచున్నారు. దత్తమండల కవిజీవితము వ్రాయుచున్నారని గాక కంపుఁ గొప్పలవిషయమును జక్కఁగాఁ జర్చించియున్నారు. ఆగ్రంథము శ్వరగా ముద్రింపఁబడుభాగ్య మేతన్మం డలవాసుల యాదరణమున నొందుఁగాక.

ఈరీతిఁ బ్రాక్ప్రత్నమునకును, సత్కృపకును నాధార మగుచుండు నీమండలమున భాషాపోషణచే ప్రధానకృత్యముగ భావించి సముచిత మహత్తర కృత్య మును సర్వదా సర్వథా చేయునిమ్మహాసభ మద్యావార్షికోత్సవము చేయఁ దల పెట్టుట యానందదాయకము గా నుండుటయే గాక భాషాపరిపోషణమునకును హేతువుగా నున్నది.

ముద్దు లొలుకుపలుకులు గలభాష యని పాశ్చాత్యులచే నుతింపఁబడు చున్న యీయాంధ్రభాష కాలవైపరీత్యమునఁ బరభాషాప్రచే బలువెతల నొందిం పఁబడి విశ్లేష్టమై యుండు కాలమున నీయాంధ్రపరిషత్తు మహనీయులచే నెల కొల్పఁబడినది. మొదటిగండము భాషకుం దప్పినది. ఇమ్మహాకార్యమే యీప రిషన్మంగళకృత్యమునకు స్వస్తివాచనము. అది చక్కఁగా నెఱవేఱినది. తక్కిన కృత్యము లన్నియు నిట్లే నెఱవేఱి పరమేశ్వరానుగ్రహమున నీసభ దినదినాభి వృద్ధిఁగాంచి యశశ్చంద్రికల దిగంతములఁ దేజరిల్లఁ జేయుఁగాక.

భాషాభివృద్ధియే దేశాభివృద్ధికిఁ గారణ మని యంద ఱెఱింగినదియే. ఏదేశమునఁ గాని భాషాభివృద్ధి సన్నగిల్లునో యాదేశము క్షీణింపఁగల దనియే యెఱుఁగనగు. దేశగౌరవమునకుఁ బ్రధానహేతువు భాష పెంపొందుటయే యనుట యొకయాశ్చర్యము గాదు.

పూర్వకాలమున సంస్కృతగ్రంథములనుండి యాంధ్రీకరణము చేయు టయే యాంధ్రకవిత్వమున కాద్యదశ యని మన మెఱుఁగుదుము. మహనీయు లట్లే పెక్కుగ్రంథము ల రచించి యున్నారు. ఆపిదప ప్రబంధకల్పన యారంభ మైనది. అప్పటికవులు బుద్ధిచమత్కృతిసే యెక్కువగఁ జూపి భాషాభివృద్ధికిఁ బాటుపడిరి. అవ్వలఁ బరిణయగ్రంథము లారంభ మైనవి. అక్కవులు వర్ణ నాంశమే ప్రధానముగఁ జేసికొని తమయసాధారణపాండిత్యమును వెల్లడించు టయే పురుషార్థ మనుకొని గ్రంథముల రచియించిరి. అవ్వి సుబోధకములు గా నుండకుండుటయే గాక పాఠకులకును శ్రోతలకును వెఱ్ఱియెత్తఁజేయుచుండును. ఆమీఁదఁ గొంతకాలము క్రొత్తవిషయమేదియుఁ గన్పడనిగ్రంథములు కొన్ని

విరచితము లాయె. ఇవి కూడ నించుమించుగఁ బరిణయగ్రంథములకుఁ బుత్త్రిక లనియే చెప్పవచ్చును.

ఇక్కాలమున నించుమించుగ నలువదిసంవత్సరములనుండియు నాటకముల నాంధ్రీకరించుటయు, గద్యగ్రంథముల రచించుటయు జరగుచున్నది. కొలఁది సంవత్సరములనుండి తెనిఁగించుట మాని నాటకముల వ్రాయుట యారంభ మైనది. ఇందుఁ గొన్ని ప్రాచీననాటకలక్షణముల నతిక్రమింపక రసపోషణమున నించుకేని కొఱఁతపడక విరచితము లగుచున్నవి. ఇట్టినాటకము లత్యల్పసంఖ్యాకములే. భాషాసముద్రమున నివి మౌక్తికప్రాయము లై యున్నవి. మఱికొన్ని ప్రాచీనలక్షణవిరుద్ధములై యుండుటయే గాక యాలక్షణములఁ దూలనాడునవి యై నిరంకుశత్వమున నటించుచు క్షుద్రశంఖప్రాయము లై యున్నవి. తుదకు నాటకము వ్రాయుట సాధారణ మైనది. ఇందు వేషభాషాపోషణము గాని, నాయకాదిగుణపోషణము గాని, యంబరారవిందము. వీని కలంకారము చక్కనివీరిక యొకటి రెండవది చక్కనిముద్రణము. మూఁడవది యట్టకట్టునేర్పు, నాల్గవది ముద్రణాదిసర్వాధికారస్వామ్యము.

ఇటులుండఁగ నవల లను గ్రంథములు పుట్టగొడుగులువలె వెలువడుచున్నవి. ఈసృష్టి ప్రారంభ మయి యించుమించుగ నిరువదిసంవత్సరము లయ్యె నని చెప్పవచ్చును. గ్రంథకర్తల తాత్పర్యము భాషాపోషణమునకును, గల్పనాశక్తికిని దమగ్రంథము హేతు వనియే, కాని యది నెఱవేఱుచున్నదో లేదో దేవుఁడే యెఱుఁగు.

ఏగ్రంథము గాని చదివినవారు పట్టు మని పదిమాట లైనను గ్రొత్తవి నేర్చుకొనఁదగు. అది లేదేని యాగ్రంథము నిరుపయోగ మని చెప్పుటకన్న వేఱేమియు లేదు.

ఇట్టికాలమునఁ బ్రాచీనగ్రంథపక్షపాతము గలిగి, సత్కవికల్పద్రుమ మను, ఖ్యాతిఁ గాంచి సద్గ్రంథములఁ బరించి తద్ద్రవ్యము నెఱింగి, సరసజనాగ్రేసరు లై, పండితపోషకు లై, యిక్కాలమున నాంధ్రభోజు లని చెప్పందగిన వేంకటగిరిసంస్థానాధీశ్వరులు, మహారాజబిరుదాంచితులు నగుశ్రీవెలుగోటి రాజగోపాలకృష్ణయాచేంద్ర బహదూరుగారు పరమపదించుటకన్న నాంధ్రభాషకుం గొఱంత వేఱొకటి యుండునే.

ఇమ్మహాసభ గ్రంథవిమర్శనమునకుం బూనినం గాని భాషాపోషణము కానేరదు. దోషోద్ఘాటన మనుచిత మని కొందఱన్నను, యథార్థముగ గ్రంథకర్తల కంతఃపరితాపకారము చేయునొకటి కానరాదు. మహనీయు లగు పండితులం గూర్చి తత్పోషణమున బద్ధకంకణు లై, సకలగ్రంథసంపాదనమునం దనగంభీరాశయమును జూపుచు నలరారుచున్న యీపరిష త్త్రిభువనకార్యమున నించుకేనియు నశ్రద్ధ వహింప దని నమ్ముచున్నాము. కరుణాకరుం డగుసర్వేశ్వరుని యనుగ్రహమున నిత్యకాలమున నిర్విరళ వికాసోన్ముఖమున నెఱవేఱుంగాక. ఆంధ్రభాషయు, నాంధ్రదేశమును దినదినాభివృద్ధి నొంది సంస్తుతిపాత్రము లగుంగాక.

జనమంచి శేషాద్రిశర్మ

# శ్రీనాథునికవిత్వము.

(ఆ 1917 సం॥ ఏప్రల్ నెల 9 తేదిని కడపసభలోఁ జదువఁబడినది.)

—∞✽∞—

పండితశిరోమణులారా :—

ఈమహావిద్వత్సభయందు నేఁ డాంధ్రకవినాథుఁ డగుశ్రీనాథునికవిత్వముంగూర్చి యొకయుపన్యాసంబుఁ గావింపు మని మదీయమిత్రవతంసు లగుశ్రీజయంతి రామయ్యపంతులుగారును శ్రీగుక్ష్మదూరి వేంకటరంగరావుపంతులుగారును నా కానతి చేసినకారణంబున నే నొకచిన్నవ్యాసమును జదువఁబూనితిని. విద్యాగృహమునకుఁ గడపవెద్ద నున్ననాకు సంఖ్యావత్సన్నిధానంబున నుపన్యసింపఁబూనుట యొప్ప దని యెఱుంగుదు. ఐనను మిత్రులయానతి యనుల్లంఘనీయ మగుటంజేసి యేను దీని కియ్యకొంటిఁ గావున నాసాహసంబునకు విద్వాంసులు నన్ను క్షమించి యాదరింతు రని సవినయంబుగ విన్నవించుకొనుచున్నాఁడ.

శ్రీనాథునికవిత్వము :—

ఆంధ్రమహాకవులలోఁ గవిత్రయమువారికిఁ బిదప నగ్రగణ్యుఁ డని పేర్కొనఁ దగినమహాకవిశిరోమణి శ్రీనాథుఁడు. అమ్మహాకవిచరిత్రకవిత్వములంగూర్చి విద్వజ్జనానుమతంబున నించుక వచియింపఁబూనితి.

ఇతఁడు క్రీస్తుశకము 14-15 శతాబ్దములనడుమ జీవించియుండె నని యనేకనిదర్శనములచేఁ దెల్లం బయ్యెడు. శ్రీజయంతి రామయ్యపంతులుగారానంద సంవత్సరాంధ్రసాహిత్యపరిషత్పత్రిక 261-270 పుటలలోఁ బ్రకటించియుండు "రెండురెడ్లనాఁటిశాసనములు" అనువ్యాసమువలన గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా ఫిరంగిపుర మనుగ్రామమున శ్రీవీరభద్రస్వామివారియాలయమున కెదుటఁ గలశిలాస్తంభమున నొకశాసనము చెక్కఁబడియున్న దనియు నందలి శ్లోకములను బద్యములను శ్రీనాథుఁడు రచియించినట్లు

"విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః ।
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం ॥" అనుశ్లోకమువలనఁ దెలియు ననియుఁ దెల్లం బగు. ఆశాసనమును బెదకోమటి వేమభూపాలునిభార్య

యగునూరాంబ సంతానసాగర మనునొక పెద్దచెఱువును త్రవ్వించి దానిని శాలివాహనశకము 1331వ సంవత్సరమునకు సరి యగువిరోధిసంవత్సర ఫాల్గున బహుళ శుక్రవారమునఁ బ్రతిష్ఠించె నని యున్నది. అదిహూణశకము 1410వ సంవత్సర మగుచున్నది శ్రీనాథునికాలమును నిర్ణయించుటకు శ్రీకొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు శ్రీనాథప్రణీత హరవిలాసం బనుకావ్యంబునఁ గొన్ని ముఖ్యాధారములు గానవచ్చుచున్న వని నుడివి గ్రంథాలయసర్వస్వము ద్వితీయ సంపుటము ప్రథమసంచిక 24-29 పుటలలో నతఁడొనర్చిన కావ్యములకాల ములను సయుక్తికంబుగ నిర్ణయించి యొకవ్యాసమును వ్రాసియున్నారు. ఆచర్చ నంతయు నిట వ్రాయం బనిలేదు గాని దానంగలకొన్ని ముఖ్యాంశముల నిందుఁ బ్రదర్శింతు.

చ॥ హరిహరరాయ ఫేరొజసహా సురథాణగజాధిపాది భూ
వరులు నిజప్రభావ మభివర్ణన సేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణిభట్టికి నెవ్వరీడగుఁ ॥

(పుట 4) హరవిలాసము ఆ. 1 ప. 23

అనుపద్యమున విజయనగరాధీశ్వరు లగుహరిహరరాయలను బహమనీప్రభుం డగుఫిరోజిషా (Feraz shah) సురథాణ (Sultan)యును గజాధిపుఁడు (గజపతి) ను గుమారగిరినృపాలునివైభవమును వినుతించిన ట్లుండుటచే వీరందఱును సమ కాలికు లనుట స్పష్టము హరిహరరాయలు (Hari Hara II) ద్వితీయులు హూణశకము 1376సం॥ మొదలు 1404సం॥ వఱకును ఫిరోజిషా 1397-1422సం॥ లోను గుమారగిరి 1378—98సం॥ లోను రాజ్యము చేసి రని శాసనములవలనఁ దెలియవచ్చెడి కుమారగిరిప్రభునకుఁ "ప్రతిసంవత్సరోత్సవంబునకుం దగినకస్తూరీ కుంకుమ ఘనసార సంకుమద హిమాంబు కాలాగరు గంధసార ప్రభృతిసుగంధి ద్రవ్యంబు లొడగూర్చియుఁ జీని సింహళ తవాయి హురుమంజి జలనోగి ప్రభృ తి నానాద్వీపనగరాకరంబు లగుధనకనకవస్తువాహన మాణిక్యగాణిక్యంబులు తెప్పించి" యిచ్చుచుండిన యవచిత్రిపురాంతకసెట్టి యనుతిప్పసెట్టికి శ్రీనా థుఁడు హరవిలాసము నంకితముచేసెను.

ఈకుమారగిరిప్రభువగుం డేవంశమువాఁ డని విచారింపవలసి యున్నది. ఇతఁడు పాకనాటిదేశంబునఁ గొండవీడు రాజధానిగా రాజ్యముచేసిన పంటకుల రత్నం బగునన వేమారెడ్డివంశమువాఁడు. ఇతనివంశావళి యీక్రిందివంశవృక్షము లవలనఁ దెల్లంబగు.

వేమ
|
కోమటిప్రోల=అన్నమాంబ

మాచ — వేమ(1) (1320-49) హరివంశకృతిపతి — దొడ్డ — అన్నయ — మల్లయ

మాచ: రెడ్డిపోత, కోమటి, నాగ

మల్లయ: వేమ

వేమ(1): అనపోత(2) (1350-61), కోమటి అనవేమ(3), దొడ్డాంబ =కాట(2), వేమసాని

పెద్దకోమటివేమ(5) (1399-1415) =సూరాంబ
|
రాచవేమ(6) (1416-1419)

అనపోత(2): కుమారగిరి(4) (1378-98)

మల్లాంబ=కాటయవేమ(5a) అల్లాడ

మల్లాంబ=కాటయవేమ: కుమారగిరి(2), అనతల్లి=వీరభద్రు, వేమ

ఈకుటుంబమువారు దూవ్వూరు పెరుమాళ్లు రెడ్డివంశస్థులతో సంబంధము చేసినట్లు భీమేశ్వరపురాణము, ఆ 1. ప 31 "పంటమహాన్వయంబు పాకనాటి దేశంబున భద్రపీఠంబు నధివసించి సింహవిక్రమనగర దువ్వూరుగండవరాళి పట్టణంబులు నిజనివాసంబులుగా భూవలతాదష్టాష్టాదశ ద్వీపాంతరాళ్లు లగు భూపాలగ్రామణులం ద్రిలింగభూమండలాఖండలులను బోలయ వేమాన్నపోతాన్న వేమకుమారగిరీశ్వరాములఁ బూజ్యసామ్రాజ్యపీఠస్థులం గాంచె. తత్సంబంధ బాంధవంబున వసుంధరాభారధౌరంధర్యంబున......రాయగురుపరమేశ్వర సాధు జనవిధేయ ఘోడెరాయ సకలకళాధామాదిబిరుదభాస్వరుం డై భీమయగురు వరేణ్య పుణ్యకారుణ్య కటాక్షవీక్షాలబ్ధ సుస్థిరై శ్వర్యధుర్యుండై విజయధాటీ సమాటీకంబున దిశ లల్లాడ నల్లాడభూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రిపర్యంతంబు ...పరిపాలించె" అనుగద్యమువలనఁ దెల్లం బగు వీరివంశముం దెలుపువంశవృక్ష మీక్రిందఁ గన్పఱుపఁబడియున్నది.

దూపూరి రెడ్లవంశవృక్షము.




ఇతఁడు రాజమహేంద్రవరమునకుఁ బ్రభువయ్యెను.

ఈకుటుంబమువా రన్నవేమనకుటుంబమువారితో సంబంధము చేసినా రని భీమేశ్వరపురాణంబున 6వపుటలోఁ (ఆ1. ప28.) జెప్పఁబడియున్నది. పంట కులంబునఁ బోలయవేమాన్నపోతాన్నవేమకుమారగిరీశ్వరాదులు గలిగి రనియు "దత్సంబంధబాంధవంబున వసుంధరాభారధౌరంధర్యంబున.........నల్లాడ భూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధాని గా సింహాద్రిపర్యంతంబుఁ బరిపాలించె" ననియు నున్నది.

దువ్వూరు పెరుమాళు రెడ్డి.

మొదటివంశవృక్షంబునఁ జూపట్టుకోమటిప్రోలయ ద్వితీయపుత్రుఁ డగు నన్నమవేముఁడే యెఱ్ఱాప్రెగ్గడహరివంశమునకుఁ గృతిస్వామి. ఇతనికిఁ బోలయ వేముఁడు, కోమటివేముఁడు, దేసటివేముఁడు, అనుపేరులుం గల వని హరివంశమువలనఁ జూపట్టెడు. ఇతఁడు 1320-1349 సం॥లలో రాజ్యము చేసెను. అనంతర మితనిప్రథమపుత్రుఁ డగునన్నపోతరెడ్డి 1350-1361 సం॥లలోను బిమ్మట నితనితమ్ముఁ డనవేముఁడు 1362-1377 సం॥లలోను దరువాత నన్నపోతనికుమారుం డగుకుమారగిరి 1378-1398 సం॥లలోను రాజ్యము చేసిరి. అనంతరము పెద

కోమటివేముఁడు 1399-1415 సం॥లలోను నతనికిఁ బిదప నతనిసుతుం డగురాచవేముఁడు 1416-1419 సం॥లలోను రాజ్యము చేసిరి. కుమారగిరిసోదరి మల్లాంబ. ఈమెభర్త కాటయవేముఁడు. వీరిపుత్త్రిక యగు ననతల్లిని దూవూరువంశజుం డగువీరభద్రారెడ్డి పరిణయం బై రాజమహేంద్రవరమున రాజ్యము చేసెను. ఈవీరభద్రారెడ్డికే శ్రీనాథుఁడు కాశీఖండమ్ము నంకితము చేసెను. పెదకోమటివేముని మంత్రి యగుమామిడి సింగామాత్యునికి శృంగారనైషధమును వీరభద్రారెడ్డిమంత్రి యగుబెండపూడి యన్నమంత్రికి భీమేశ్వరపురాణమును శ్రీనాథుఁడు కృతియొసంగెను.

శ్రీనాథవిరచితగ్రంథము లనేకములు. (1) మరుత్తరాట్చరిత్ర, (2) శాలివాహనసప్తశతి. (3) శివరాత్రిమాహాత్మ్యము. (4) పండితారాధ్యచరిత్రము. (5) శృంగారనైషధము. (6) హరవిలాసము (7) భీమేశ్వరపురాణము (8) కాశీఖండము. ఈగ్రంథముల రచనాక్రమమును నాయాగ్రంథములందలి పద్యముల వలనఁ గొంతదాఁక నిర్ణయింపనగును.

శృంగారనైషధమున (ఆ1. ప14)

క॥ జగము నుతింపఁగఁ జెప్పితిఁ। బ్రెగడయ్యకు నాయనుంగుఁబెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ। మగునాయారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్॥

అనియు, హరవిలాసమున, "నంధ్రభాషానైషధాబ్జభవుని" అనియు భీమేశ్వరపురాణమున (ఆ1. ప18.)

తె॥ నవమరుత్తుచరిత్రంబు నైషధంబు। సప్తశతి పండితారాధ్యచరిత మనఁగఁ
గావ్యములు పెక్కు చెప్పియుఁ గాంక్ష చనక। వెండియును గావ్య మొకటి గావింపఁ దలచి॥ అనియు, కాశీఖండమున (ఆ1. ప7.)

సీ॥ చిన్నారిపొన్నారిచిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాలనూత్నయావనమున శాలివాహనసప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొనియాడితి భీమనాయకునిమహిమఁ
తే॥ బ్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మనుమహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టకవిని॥ అనియుఁ గలవు.

ఈపద్యమువలన మరుత్తరాట్చరిత్ర, శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్ర, శృంగారనైషధము, హరవిలాసము, భీమేశ్వరపురాణము, కాశీఖండము, ఈవరుసను రచియింపఁబడియె నని తెలియవచ్చెడును. హరవిలాసమును గుఱించి యీగ్రంథములలోఁ జెప్పకున్నను భీమేశ్వరపురాణమునకు మునుపే దానిని రచియించె నని శ్రీలక్ష్మణరావుగారు చేసినసిద్ధాంతమే సమంజస మై యున్నది. శివరాత్రిమాహాత్మ్య మెపుడు చెప్పఁబడినదో యింకను దెలియదు. ధనంజయవిజయ మనునొకకావ్యము శ్రీనాథుఁడు కావించి గన్ననృపతి కంకితము చేసినట్లు సాహిత్యపరిషత్పత్రిక ౭వసంపుటము 8,9 సంచిక 319 పుటలో విమర్శింపఁబడిన మూర్తిత్రయోపాఖ్యాన మనుగ్రంథమువలన నెఱుంగనయ్యెడి, ఆగ్రంథ మెన్నఁడు మనముఁ జూడఁ గాంతుమో!

"శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజయం బనుసత్కావ్య మంది వెలసె......
నృపతిమాత్రుండె నిజపాదనీరజాత, ఘటితకోటీరవైరిభూకాంతమాన
సాంతరభయాపహారి శ్రీదంతులూరి, గన్నభూపాలమౌళి దోర్గర్వశాలి॥"

అనిమూర్తిత్రయోపాఖ్యానంబుననుండి పత్రికలో వ్రాయఁబడియున్నది.

పల్నాటివీరచరిత్రము శ్రీనాథకవి కృతమని యున్నది గాని దానిశైలిం జూడనాడెందంబున నది నిక్కంబు గాదని తోఁచుచున్నది. పల్నాటివీరచరిత్రము శ్రీనాథకృత మని యాగ్రంథాదియందలి

"సంగీతసాహిత్య చాతుర్యకవితఁ। జెప్ప నేర్చినవాఁడఁ జెలఁగి మాచెర్ల
చెన్నరాయనిపాదసేవారతుండ। వలను భారద్వాజవంశవర్ధనుఁడఁ
గవిసార్వభౌముఁడ ఘనతఁ గన్నట్టి। శ్రీనాథుఁ డనువాఁడ శివభక్తిపరుఁడ"

అనియును, గ్రంథాంతంబున

"ఘనుఁ డైనశ్రీనాథకవిరాజరాజు। చెన్నునికృపచేతఁ జిత్త ముప్పొంగి
బాలునివిక్రమప్రౌఢి యంతయును। వివరించె జనులకు విశద మౌదీని"

అనియును నున్నవి కాని, దీనిశైలిం జూడఁజూడ నీగ్రంథము శ్రీనాథవిరచితము కా దని నిశ్చయింపవలసియున్నది.

"చెన్నరాయనిపాదసేవారతుండ" అనుచోట నేకదేశాన్వయము గ నున్నది.

పు. 2. "ధృవముగ నానతి యిమ్ము నా కిప్పుడు" అనుచో "ధ్రువ" అనియుండవలయు. అట్లు దిద్దినచో యతిభంగము.

పు. 5. "ప్రతిమ్రోఁత లీయంగ భావ మువ్వొంగ" అనుచోఁ బ్రతి యనునుపసర్గమును మ్రోఁత యను తెనుఁగుపదముతోఁ జేర్చినాఁడు.

పు. 7. "కంచియేకాంబరకాళికానాథ" ఇవి వృషభములపేరు లైనను "ఏకామ్ర" యనుటకు "యేకాంబర" యని శ్రీనాథుఁడు వ్రాయునా?

పు. 14. వేగుజామునకు వచ్చివిడిదిలో నిలిచె—"జామునకు" అని యుండ వలయుఁగదా.

పు. 16. తావుకుముందరఁదగఁజెప్పిపంపె—తావుకు, నకారలోపము.

పు. 17. సంచారిసంస్థాయిసరసభావములు—సంస్థాయి యని లేదు. స్థాయి యని యుండఁజను.

పు. 21. వారున్నతావుకు వచ్చుట తగవె—"తావుకు"-నకారములేదు.

పు. 31. "గజములు ఘీంకారగాఢంబు లాయె"—ఇట గాఢంబు లాయె" ననుటలో సారస్యము లేదు

పు. 39. "పూఁబోడి నాదేహపోషణార్థంబు"—ఇచ్చటను నేకదేశాన్వ యము.

పు. 40. "హీనబాంగరముల నెట్లాడఁగలఁడు"—"హీనబాంగరము" అనుచో దుష్టసమాసము.

పు. 57. "మిక్కిలి దయగద్దు మెలఁతలయందు"—కలదు అని యుం డవలయు. అట్లు దిద్దిన గణభంగము.

ఇట్టిప్రయోగంబులవలన నీగ్రంథము శ్రీనాథకృత మెంతమాత్రమును గానేర దని తోఁచెడు.

వీథినాటకము శ్రీనాథుఁడు చేసిన దని యందురు. రచనాపాటవముం గాంచ నది తత్కృత మనిపించుఁ గాని యందందుఁ బొడచూపు "ముద్దుమాట లన్, అజవు, "ప్రవీణత్వమున్, అరవిందాస్య, కాసలనాటివారికనకాంగి ని, ఆత్మరవంబున్ ఏకీకృతముగ" ఇట్టిస్ఖాలిత్యములం జూడ నమ్మహాకవీ శ్వరుండు దానిని వ్రాసియుండ నోపఁ డని యెన్నెద. నిక్కంబుగ శ్రీనాథకృతం బ యయ్యెనేని వీథినాటక మతనినూత్నయౌవనావస్థయందు వ్రాయఁబడి యుం డవలయు. వల్లభరాయప్రణీతం బగుక్రీడాభిరామం బనుగ్రంథమునందు వీథినా టకమునఁ గానంబడు పద్యము లొకకొన్ని యున్నకతంబున నీరెండును శ్రీనాథ విరచితంబులు గానోపు నొకో యని కొందఱు సందియపడుచున్నారు. అంత

మాత్రముననే యతఁడు నూహించుట కవకాశము లేదు. ఏకవియైనను వీథి నాటకమును వ్రాసి దానిలోఁ బ్రసిద్ధకవుల పద్యములఁ గొన్నిటిని చేర్చుకొని యుండవచ్చును.

శ్రీనాథప్రణీతగ్రంథములలో మన కుపలబ్ధంబు లైనవి శృంగారనైషధము, హరవిలాసము, భీమేశ్వరపురాణము, కాశీఖండము, ననునవి నాలుగు. తక్కినవి యెక్కడ లభించునో తెలియరాదు. వీనిలో శృంగారనైషధమును గాశీఖండమును నెక్కుడుప్రచారము గలిగి పండితజనసమాదృతంబు లై విలసిల్లు.

శ్రీనాథునిజననకాలమును గూర్చి నిర్ణయింపఁ దగు శాసనములు మున్నగు నాధారము లున్నను నతనినివాసస్థానమునుగూర్చి నిర్ణయింపఁ జాలునంశంబులు గానరావు. ఇతనికాలమునఁ బద్మపురాణగ్రంథకర్తయు నగుకమలనాభామాత్యుఁడు సముద్రతీరంబున నుండుకాల్పట్టనమున కధిపతి యని భీమఖండములోని

మ॥ "కనకక్ష్మాధరధీరు వారిధితటీకాల్పట్టనాధీశ్వరుం
ఘనునిం బద్మపురాణసంగ్రహకళాకావ్యప్రబంధాధిపుం
వినమత్తాత్కతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు మా
యనుఁగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్ "

అని శ్రీనాథుఁడు చెప్పికొనియున్నవాఁడు గాని కాల్పట్టన మేదియో యెఱుంగ రాదు. అట్టిపట్టనము గాని పల్లియ గాని సముద్రతీరంబున నున్నట్లు కానం బడదు. ఆసముద్రతీర మనఁగా నిటఁ బశ్చిమసముద్రతీరమా ? ప్రాక్పారావార తీరమా యని యొకయాశంక యుదయింపవచ్చుఁ గాని యంధ్రదేశ మీవైపున నున్నకారణంబున నిక్కడఁ దూరుపుసముద్ర మనుటయే యొప్పు.

నాకవిత్వంబు నిజము "కర్ణాటభాష" అనియును

"కర్ణాటదేశకటకపద్మవనహేళి" అనియును శ్రీనాథుఁడు చెప్పియుం డుటచే నితఁడు తొలుతఁ గర్ణాటదేశనివాసి యై పిదప నాంధ్రదేశమునకు వచ్చె నని కొందఱు తలంచుచున్నారు గాని నా కయ్యది యుక్తముగాఁ దోఁపదు. శ్రీనాథునికవిత్వము కర్ణాటభాష యెట్లవును? సుప్రసిద్ధము లైనయాంధ్ర దేశజాతీయములు వినువారివీనులకుఁ దేనియలొలుకుచుండ నివి యెట్లు కర్ణాట భాష యగును? కర్ణాటదేశ మనఁగా నంధ్రదేశం బనియే చెప్పఁదగు. కర్ణాట భాష యనఁగాఁ గేవలము సంస్కృతమును గేవలాంధ్రమును గాక మిశ్రభాష యని యర్థము చేసికొనవచ్చును. భీమఖండమునసే కృతినాయకుఁడు తన్నుఁ

గాంచి "పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు" అని చెప్పిన ట్లునికిం జేసి యితఁడు "పాకనాడు" నాఁబరగు దేశమువాఁ డని యూహింపవచ్చుఁ గాని "యింటి" యనుశబ్దమువలన నితఁడు పాకనాటినియోగి యనిచెప్ప నొప్పు నని తలంతు ఇతఁ డొకదేశంబున నొకయూరనే నివసించినవాఁడు కాఁ డనియుఁ బెక్కుదేశములు సంచరించి యనేకప్రభువర్యులయాస్థానంబుల కేగుచు సన్మానంబులు వడయుచుండె ననియుఁ గడపట రెడ్డిప్రభువుల నాశ్ర యించి కొంతకాలము కొండవీటిలోను గొండొకకాలము రాజమహేంద్రవర ములోను నివసించె ననియుఁ దెలియుచున్నది. కావున శ్రీనాథునినివాసస్థా నము కృష్ణాగోదావరీమధ్యదేశంబనియు సామాన్యముగాఁ జెప్పఁదగియున్నది. ఇతఁడు చూడనిదేశములును జొరనియాస్థానంబులును బ్రాయికముగా లేవు.

శ్రీనాథుఁడు పాకనాటినియోగిబ్రాహ్మణుఁడు. పాకనాటివారినే ప్రాజ్ఞా టివా రని జనులందురు. భారద్వాజగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, ఇతని గురువు ఘోడెరాయఁ డనుబిరుదు గల భీమేశ్వరస్వామి యని కాశీఖండము (ఆ. 1. ప. 16.)

సీ॥ ఆంధ్రక్షమామండలాఖండలుం డైన వేమభూపతికృపావీక్షణంబు
ఘోడెరాయాంకసద్గురురాజభీమేశ్వరస్వామిపదసమారాధనంబు
కమలాద్రినిలయమార్కండేయశివమౌళిచంద్రాంశునవసుధాసారధార
వేదాద్రినరసింహవిపులవక్షస్స్థలీకల్హారమాలికాగంధలహరి॥
కారణంబులు నుద్బోధకములు గాఁగ, సంభవించిన సాహిత్యసౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభునిఁ జేసి, కాశికాఖండముఁ దెనుంగుగా నొనర్తు॥
అనుపద్యమువలన వేద్యం బయ్యెడును.

ఇచ్చట వేదాద్రి యనుక్షేత్ర మేది యని యరయ బ్రహ్మశ్రీ సదాశివ శాస్త్రిగారు, అవధానము శేషశాస్త్రిగారు వీరిచేఁ బ్రకటిత మైన వేంకటగిరిరా జుల వంశచరిత్రములో 42వ పుటయందు, హైదరాబాదుసీమలో రాచకొండ యనుదుర్గమునకు "దక్షిణమున వేదగిరి యని వ్యవహరింపఁబడుచున్న పర్వతము యొకగుహలో వరాహనారసింహస్వామి యనుస్వయంవ్యక్తమూర్తి కలదు. ఆమూర్తి యనాదిగా రేచర్లరాజుల కుపాస్యముగా నుండె నఁట. దీనివలననే సింగమనాయఁ డనునామములు వీరియింట నాకాలమునఁ దఱచుగాఁ గలిగి యుండె నని తోఁచుచున్నది" అని వ్రాయఁబడినదానిని జదువ వేదాద్రి యిది యని తెలియవచ్చె. ఇందలి కమలాద్రి యెద్దియో తెలియకున్నది.

ఇతఁడు బమ్మెరపోతనకు బావమఱఁది యని యొకలోకవార్త గలదు గాని దానియాథార్థ్యంబు నిర్ణయింపఁదగిన యాధారములు గానంబడవు శ్రీనాథునికిని బమ్మెరపోతనకును జరిగినట్లు చెప్పంబడు సంభాషణాదులు పోతనార్యునిజీవితంబువలనఁ దెలియనగు. ఇంతటిగొప్పకవు లిరువురు నిట్లుసమీపబంధువు లై యుండినచో నొకరై నను నొండొకరుని దమగ్రంథంబులఁ బేర్కొనియుండరా. ఈవార్త విశ్వసనీయము కానేరదనియు నిది పుట్టుటకుఁ గారణము శ్రీనాథుని మఱఁది యగుదగ్గుఁబల్లి దుగ్గనార్యుఁడు తానురచియించిన నా(చి)సికేతూపాఖ్యానం బనుకావ్యంబున నిజాగ్రజుండు పోతన యనునొకఁ డుండె నని చెప్పినకారణంబున నతనిని గాలక్రమంబున బమ్మెరపోతన యని జనులు భ్రమించి రనియు నే నూహింతు. దుగ్గనార్యుఁడు చెప్పినపద్యములు మీఁదట వ్రాయఁబడును.

శ్రీనాథుఁడు కవిసామాన్యుఁడు కాఁడు. ఇతఁడు జైమినీయ, పాతంజల, గౌతమీయ, కాణాద, వైయాసి, కాదిసమస్తశాస్త్ర సిద్ధాంతతత్త్వనిష్ణాతుండును, సకలపురాణాగమేతిహాసార్థ విదుండును, వేదార్థవిజ్ఞానసంపన్నుండును, సర్వతంత్రస్వతంత్రుండును నగుమహాపండితశిరోమణి. హరవిలాసమున "నఖిల పురాణవిద్యాప్రవీణు । నధ్వర్యు వేద శాఖాతిథినిష్ణాతు నంధ్రభాషానైషధాబ్జభవుని........" అనితన్నుఁగూర్చి శ్రీనాథుఁడే నుడివికొని యుండుటయే కాక శృంగారనైషధకృతిపతి యగుమామిడి సింగనామాత్యుఁడు తన్నుఁజూచి

శా. "బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే" (ఆ1 ప13)

అని వినుతించినట్లు చెప్పఁబడియున్నది. శ్రీనాథునిమఱఁది యగుదగ్గుఁబల్లి దుగ్గనార్యుఁడు నా(చి)సికేతూపాఖ్యానమునఁ గృత్యాదియం దితనిఁగూర్చి చెప్పిన పద్యములఁ జూడ నితనిపాండిత్యము నిస్సీమం బని గోచరించు.

సీ. సంస్కృతప్రాకృతశౌరసేనీముఖ్య భాషాపరిజ్ఞానపాటవంబు
పన్నగపతిసార్వభౌమభాషిత మహాభాష్యవిద్యాసమభ్యాసబలము
నక్షపాదకణాదపక్షిలోదీరితన్యాయకళాకౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్యసిద్ధాంత కబళనవ్యుత్పత్తిగౌరవంబు
పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్య, భావరససుధాచర్వణప్రౌఢతయును
గండళింపంగఁ గాశికాఖండనైషధ ప్రముఖవివిధప్రబంధము లొనర్చి.

సీ. కవిసార్వభౌముఁ డై కర్ణాటవిభుచేతఁ గనకరత్నాభిషేకములు గనిన
శ్రీనాథసుకవి కూరిమిసేయుమఱఁదివి దుగ్గయకవిరాజ దగ్గుఁబల్లి
తిప్పనార్యునకు సతీమణియెఱ్ఱమకును దనూజుఁడవు పోతనకు నెఱ్ఱి
నామాత్యవరునకు ననుఁగుదమ్ముండవు శాండిల్యగోత్రుఁ డౌసరసమతివి
చెప్ప నేర్తువు కృతులు సుస్థిరముగాఁగ, గాన నీవు రచింపంగఁ గడఁగియున్న
నాసికేతుచరిత్రంబు నాదు పేర, నంకితము సేయు కపిరాజు లాదరింప.

గద్యమున- ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర కవిసార్వభౌమ సకలవిద్యాసనాథ శ్రీనాథమహాకవీంద్ర ప్రసాదలబ్ధకవితావిశేష దగ్గుఁబల్లితిప్పనార్యప్రియతనూజ దుగ్గననామధేయ ప్రణీతం బైననాసికేతూపాఖ్యానం బను మహాప్రబంధంబునందు......" అనియున్నది.

శ్రీనాథుఁ డనేకదేశాధీశులసభలకు జని యందలివిద్వాంసులతో శాస్త్ర సంవాదంబులు గావించి విపశ్చిద్వర్యులను రాజన్యవరేణ్యులను మెప్పించి సత్కారంబులు వడసి యాశాంతయశస్సుఁ బొందె. భీమేశ్వరపురాణమునకుఁ గృతిస్వామి యగుబెండపూఁడి యన్నమంత్రి శ్రీనాథునింగూర్చి చెప్పినపద్యముం గనుఁడు.

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకం బైనహర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో విద్యాపరీక్షణవేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తికర్పూరములఁ దిశాంగనములందుఁ
బాకనాటింటివాఁడవుబాంధవుఁడవు, కమలనాభునిమనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు, కలితగుణగణ్య శ్రీనాథకవివరేణ్య!

ఇక్కవికుంజరుండు రాయలయాస్థానంబున కేగి యరుణగిరినాథసుతుండగు డిండిమభట్టుతో శాస్త్రవాదంబు గావించి జయించి యతనిబిరుదం బగుకంచుఢక్కను బగులఁ గొట్టించె. రాజసార్వభౌముఁ డగునారాయలు శ్రీనాథునిపాండిత్యకవిత్వగౌరవంబుల కలరి యతనికిఁ గవిసార్వభౌముం డనుబిరుదు నొసంగెను. ఈవిషయములనే శ్రీనాథుఁడు వేంకటగిరిప్రభుం డగుసర్వజ్ఞసింగమనాయని దర్శింపఁబోవునవసరమున సరస్వతీదేవిం బ్రార్థించుచుఁ జెప్పిన—

సీ. "దీనారటంకాలతీర్థ మాడించితి దక్షిణాధీశుముత్యాలశాలఁ
బల్కుతోడై తాంధ్రభాషామహాకావ్య నైషధగ్రంథసందర్భమునకుఁ

బగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢ గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రశేఖరక్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మెట్టుల మెప్పించెదో నన్ను నింకమీఁద, రావుసింగమహీపాలు దీవిసాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు, సరసగుణనికురుంబ శారదాంబ!

అనుపద్యమున నుడివియున్నాఁడు.

శ్రీనాథునకుఁ గవిసార్వభౌమబిరుద మున్నట్లు కాశీఖండములోని

శా. "ఈక్షోణి న్నినుఁ బోలుసత్కవులు లే రీనేటికాలంబునన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించుం గవిసార్వభౌమ భవదీయప్రౌఢసాహిత్యముల్"

అనుపద్యమువలనను దెలియు

పైఁ జెప్పినరాయ లెవ రనియు, డిండిమభ ట్టెవ రనియు నించుక విచారింతము. ఆరాయలు ప్రౌఢదేవరాయ లనియు (Deva Raya II) నతఁడు **1424-1449** సం॥లలోఁ బాలన మొనర్చె ననియు, నతనియాస్థానంబుననె డిండిమభట్టును శ్రీనాథుఁడును వాదంబులు గావించి రనియు నొకపక్షము. అతఁడు జైమినిభారతకృతిపతి యగుసాళువగుండ నరసింహరాయ లనియు, నతనియాస్థానముననె డిండిమభ ట్టుండె ననియు మఱియొకపక్షము. డిండిమభట్టు సాళువనరసింహరాయని విజయములను వర్ణించుచు సాళువాభ్యుదయ మనుగ్రంథమును వ్రాసె నని మానవల్లి రామకృష్ణకవిగారు తద్గ్రంథాంతంబుననుండి "ఇతిమండలీకమలహరహండ మేదినీమీసరగండ రాజపక్షిసాళువకరారి......... బిరుదమండనస్య గుండయరాజకుమారస్య కుమారసమవిక్రమస్య విక్రమార్కోదగ్రపరాక్రమస్య పరకుంజరాక్రమణసింహస్య.........నరసింహమహారాజస్య చరితే ....అష్టభాషాపరమేశ్వరస్య అష్టదిగ్విజయపటహీకృతబిరుద డిండిమాడంబరస్య షడ్దర్శనషణ్ముఖస్య శైవశాస్త్రజీవాతో ర్వేదసాగరసాంయాత్రికస్య డిండిమకవిసార్వభౌమ ఇతి కృతాపరబిరుదనామ్నః శ్రీమదరుణగిరీశస్య తపఃపాకస్య డిండిమకవిరాజనాథస్య కృతౌ సాళువాభ్యుదయే త్రయోదశ స్సర్గ స్సమాప్తః" "చంద్రశేఖరుఁ డనునియోగిపుంగవుఁడు నరసింగరాయలమంత్రి యని సాళువాభ్యుదయమున నున్నది." అనియు వారుప్రకటించిన క్రీడాభిరామముభూమికలోఁ వ్రాసియున్నారు. అరుణగిరినాథుఁ డనుపేరు డిండిమభట్టునకే

కలదని యొకమతము. ప్రౌఢదేవరాయలశాసనములను సాళువాభ్యుదయమును
లెస్సగాఁ బరిశీలించినపదంపడియే యీవిషయమును నిర్ణయింపవలసియుండెడు.

శ్రీనాథుఁడు సకలపురాణార్థవేది యని మున్నె నుడివితిఁగదా! "బ్రహ్మాం
డాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత బ్రహ్మజ్ఞానకళానిధానమవు," అని
చెప్పియుండుటచే శ్రీనాథుఁడు పురాణములలో బ్రహ్మాండపురాణమును మహో
త్కృష్టమైనదానినిగా గ్రహించినట్లు తోఁచెడి. శ్రీనాథుఁడే కాదు మహా
భారతమునం దాదిపర్వమున నన్నయభట్టు తన్ను రాజరాజనరేంద్రుండు భార
తము నాంధ్రము సేయు మని ప్రార్థించునవసరమునఁ "దనకులబ్రాహ్మణు నను
రక్తు నవిరళజపహోమతత్పరు విపులశబ్దశాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతు" నని బ్రహ్మాండపురాణమును గొప్పగాఁ బేర్కొ
నియున్నాఁడు. ఇమ్మెయి నిమ్మహాకవీశ్వరు లుత్తమం బని భావించినబ్రహ్మాండ
పురాణంబు నేల వారు తెలుఁగు సేయరైరని మీకెల్లరకును నాశంక వొడమ
నోపు. దీనికిఁ గారణంబు లేదని తలపోయకుఁడు ఇక్కాలంబున వైదికవిప్ర
వరేణ్యులును సులలితవచనరచనాధౌరేయ కవితానిర్మాణదక్షులును గడపత్తన
వాస్తవ్యులును నగుబ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి కట్టియశోగౌరవం బా
పాదింపఁ దలంపుగొని కాఁబోలు నన్నయ శ్రీనాథులును నితరాంధ్రమహాకవు
లును బ్రహ్మాండపురాణంబు నాంధ్రీకరింపక విడిచిపెట్టిరి.

శ్రీనాథుఁడు పండితసత్తముఁడును వైదికకర్మాచరణశీలుండు నగుటం జేసి
తానును "జిన్నారిపొన్నారి" యనుపద్యముచివరఁ "బ్రాయ మింతకు మిగులఁ
గైవ్రాలకుండఁ గాశికాఖండ మనుమహాగ్రంథ మేను దెనుఁగుఁ జేసెదఁ
గర్ణాటదేశకటక పద్మవనహేళి శ్రీనాథభట్టకవిని." అని తననామధేయముతో
భట్టబిరుదమును జేర్చుకొనెను ఈకవినాథుని కితరము లగుబిరుదులును గలవు.
ఇతఁడు శృంగారనైషధమున "సకలవిద్యాసనాథ" అనియు హరవిలాసమున
"వినయవిధేయ" అనియు భీమేశ్వరపురాణంబున "సుకవిజనవిధేయ" అని
యుఁ గాశీఖండమున "సుకవిజనవిధేయకవిసార్వభౌమ" అనియు బిరుదములు
గద్యములలో వేసికొనియున్నాఁడు.

శ్రీనాథుఁడు కేవలము "బ్రాహ్మీదత్తవరప్రసాద' లబ్ధకవితాధురంధ
రుఁడే కాఁడు. అకాలంబున సముపలబ్ధంబులైనసంస్కృతాంధ్ర మహాగ్రం
థముల నన్నింటిని లెస్సగాఁ బఠించి వానిసారస్యం బంతయు నెఱింగినవాఁడు.

ఆంధ్రకవులలో గణనీయు లిమ్మహాకవికిఁ బూర్వము పెక్కురు లేరు నలువురిని గాశీఖండమున సన్నుతించియున్నవాఁడు

సీ. వచియింతు వేములవాడభీమునిభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తుఁ దిక్కయజ్వప్రకారము రసాభ్యుచితబంధమున నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరునిఠేవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు
నైషధాదిమహాప్రబంధములు పెక్కు, చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ
యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ, మంకితము సేయు వీరభద్రయ్య పేర.

శృంగారనైషధమున (ఆ 1. ప 13)

సంస్కృతమున నితఁడు చదివినగ్రంథము లనేకములు.

సీ. "వ్యాసవాల్మీకిసంయమివాక్సుధాంభోధిలోలోఁ గ్రీడింపబుద్ధిఁ గల నొలలాక్షి
భట్టబాణమయూరభారతీసందర్భసౌభాగ్యగరిమంబు సంగ్రహించి
భాససౌమిల్లికప్రతిభాసమున్మేషహేలావిశేషంబు నిచ్చగించి
మాఘభారవివచోమకరందనిష్యందమాధుర్యమునకు సమ్మదము నొంది
కాళిదాసుమనంబులోఁ గాంచి మ్రొక్కి, రాజశేఖరుఁ గవిరాజుఁ బ్రస్తుతించి
ధీరమతి నన్నపార్యునిఁ దిక్కయజ్వ, శంభుదాసునిఁ గర మర్థి సన్నుతించి.

(ఆ 1. ప 7.)

అనియు, భీమేశ్వరపురాణమున వాల్మీకివ్యాసులను వినుతించినయనంతరము

సీ. ప్రణుతింతు రసభావభావనామహనీయకవితాసముల్లాసుఁ గాళిదాసు
గణుతింతు నిరవద్యగద్యపద్యనిబంధపరితోషితస్థాణు భట్టబాణు
భజియింతు సాహిత్యపదవీమహారాజ్యభద్రాసనాసీనుఁ బ్రవరసేను
వర్ణింతు నంభోధివారీచిగంభీరతాసారవాక్సముత్కర్షు హర్షు
భాసశివభద్రసౌమిల్లభల్లురకులు, మాఘభారవిబిల్హణమల్హణులకు
భట్టిచిత్తవకవిదండిపండితులకుఁ, గేలుకోలుపుదు నొసలిపైఁ గేలుదోయి.

(ఆ 1. ప 7.)

శ్రీనాథునికి భరతశాస్త్రము మున్నగుసకలవిద్యలసంప్రదాయంబులును దెలియు నని యితనిగ్రంథంబులలోని ప్రయోగంబులు దెలుపుచున్నవి.

శ్రీనాథుని కిట్టియసదృశక్షోదక్షమం బగుపాండిత్యంబును నసాధారణ మేధోపబృంహితానర్గళ కవితాధారయుఁ గలిమింజేసి యనన్యసామాన్యంబు

లై మహాకవి నాకాలముల నొప్పారెను. "గాఢబంధ మయుపమించ, నైషధం కావ్యబంధుర' స్ఫురి సూక్తిజనం బలచే ... గ్రంథంబులను ప్రౌఢరీతి నిలిచి యాంధ్రీకరించెను.

భాషాంతరము సేయుచో నాదరింపవలసినియమంబు లివి యని నుడువ నశక్యము. కావ్యములను దెనుఁగుచేయునపు డందలియలంకారములను బద చమత్కారంబులను భావసౌష్ఠవంబును భాషాంతరమునకుఁ దేవలయుఁ గాని యందలిప్రతిపదంబునకుఁ బర్యాయపదంబుల దెచ్చిపెట్టవలయు ననునియమం బనవసరము. మూలమునం దేభావము లేకైవడిఁ జెప్పఁబడియె నాభావంబుల న్నాకైవడినే చెప్పవలయు ననునియమంబును ననవసరము. అట్లు చెప్పినచోఁ గొన్నిసందర్భములు హృద్యములుగా నుండవు. కొన్నిచోటుల మూలములో నున్నవిషయంబులను నుల్లేఖంబుల నించుక మార్చియైనను గొండొకఁ బెంచి యైనను సంకోచించియైనను దెనుఁగున వ్రాయుట సరసం బని కవి తలంచునేని యాచందంబున వ్రాయుట సమంజసము కాని యధిక్షేపణీయము కానేరదు. మూలమున నున్నవిషయములలో నప్రధానము లని తోఁచినవాని నొకటిరెం టిని భాషాంతరమున విడిచినను దానం గవికి దోషంబు వొరయనేరదు.

శ్రీనాథుఁడు నైషధమహాకావ్యము "నశేషమనీషిహృదయంగమంబుగ శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుఱించియు భావం బుపలక్షించియు రసంబు పోషించియు నలంకారంబు భూషించియు నౌచిత్యం బాదరించియు ననౌచి త్యంబు పరిహరించియు మాతృకానుసారంబుగఁ జెప్పితి" నని కావ్యోపసంహా రముల వక్కాణించియున్నవాఁడు.

శ్రీహర్షునినైషధము "ప్రౌఢవాక్పాటవమున" నారికేళపాకముగా విరచితము; గావున శ్రీనాథుండును నారికేళపాకముననె శృంగారనైషధమును బ్రౌఢవాక్పాటవ మొప్ప నిర్మించె.

చ. పనివడి నారికేళఫలపాకమునం జవి యైనభట్టహ
ర్షునికవితానుగుంభములు సోమరిపోతులు కొంద ఱయ్య లో
నని కొనియాడ నేర రదియట్టిద లేజవరాలు చెక్కుగీ
టిన వస వట్టిబాలకుఁడు డెందమునం గరఁగంగ నేర్చునే.

అని కృతిపతి శ్రీనాథునితో ముచ్చటించిన ట్లున్నది.

శ్రీనాథుఁడు శృంగారనైషధము వ్రాసి పిల్లలమఱ్ఱి పిన వీరభద్రునికిఁ జూపినట్లును నతఁడు,

"సరసీః పరిశీలితుం మయా గమికర్మీకృతనైకనీవృతా
అతిథిత్వమనాయి సా దృశోస్సదసత్సంశయగోచరోదరీ." (2-40)

అనుశ్లోకము నెట్లు తెనుఁగుచేసె తెలియఁజేసినట్లును, శ్రీనాథుఁడు-

మ "మృదుకీలిం బ్రతివాసరంబు గమికర్మీభూతనానానదీ
నదకాంతారపురీశిలోచ్చయుఁడనై నైకావృతిభ్రాజిత
త్రిదివం బైనవిదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్" (ఆ 1. ప 20.)

మ. కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిం
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్. (ఆ 1. ప 21.)

అనుపద్యములఁ జదివె ననియు దానికిఁ బినవీరభద్రుఁడు నవ్వి గ్రంథ మంతయు నిట్లే యుండునా యని పరిహసించె ననియు నొకగాథ కలదు, గాని, యది విశ్వాసార్హము గాఁ దోఁచదు మూలశ్లోకమునకు శ్రీనాథునిపద్యములు మెఱుఁగు వెట్టిన ట్లున్నవి కాని చమత్కారంబున దాని కెంతమాత్రమును లోటుగావు.

ఆంధ్రీకరణ విశేషములం గుఱించి కొన్ని యుదాహరణంబులు చూపెద.

సం॥ అహో మహేంద్రస్య కథం మయా చితీ సురాంగనాసంగమశోభితాభృతః
హ్రదస్య హంసావళిమాంసలశ్రియో బలాకయేవ ప్రబలా విడంబనా (9. శ్లో 27.)

(ఆం) సీ॥ అమరాంగనాసంగమాభిశోభితుఁ డైనహరి కేలమానుషీపరిచయంబు
(ఆ 4. ప 68.)

అని శ్రీనాథుఁడు తెనిఁగించెను. సంస్కృతమునం దుత్తరార్ధమున నొప్పారు సురుచిర మగునుపమను విడిచిపెట్టెను.

సం॥ స్వనామ యన్నామ ముధా భ్యధామహో మహేంద్రకార్యం మహదేతదుజ్ఝితం
హనూమదాద్యైర్యశసా మయా పున ర్ద్విషాం హసైర్దూత్యపథః సితీకృతః. (9-120)

దీనిలోఁ బూర్వార్ధమును శ్రీనాథుఁడు

ఆం॥ క. పేరు ప్రమాదవశంబునఁ, జెరుకొనుట కల్ల యయ్యె బృందారకకా
ర్యారంభోదయమున కది, యారూఢం బైనవిఘ్నమై ఫలియించెన్.

అని తెలిఁగించి యుత్తరార్ధమం దున్నచక్కనిభావమును వదలిపెట్టి దానికి మాఱుగా నొకయర్థాంతరన్యాసము చేసె-

ఉ. ఆదిఁ బయోధికన్యకయు నైతె దరియించినయట్టియాంజనే
యాదులఁ బోలనైతి నిపు డక్కట దైవతకార్యసిద్ధి వి
చ్ఛేదము నొందె నేమి యని చెప్పెద నింక సమర్థ్యపం క్తు
న్నామములు సంఘటింపఁగ సమర్థులె యెంతయు రాయబారముల్. 4-95.

అని వ్రాసెను.

సం వాహౌఘశీఘ్రజవికంకణభూయమైకే సోయంమనోహరమణీరమణీయముచ్చైః
కోటీరబంధకఘనర్గుణయోగపట్ట వ్యాపారపారగమముంభజభూతభర్తుః॥ (11-18)

(ఆం) పాణికంకణ మై యోగపట్ట మయ్యుఁ, గంధగజయానకోటీరబంధ మయ్యు
వింటికిని నారి యై పెక్కువిధములందు, భూతభర్త భజించు నీభుజగవిభుఁడు
(ఆ 5. ప 26.)

ఇచటఁ "కంకణభూయ "మునకు (భావమునకు) " మనోహరమణీయం " అను విశేషణము మూలమునఁ గరంబు సరస మై యొప్పెడు. దీనిని శ్రీనాథుఁడు విడిచిపెట్టెను.

(సం) దేవ్యాభ్యధాయి భవ ఖీరు ధృతిం దధానా
భూమీభుజో భజత భీమభువో నిరీక్షాం
ఆలోకితా మపి పునః పిబతాం దృశైనా
మిచ్ఛా పిగచ్ఛతి న వత్సరకోటిభిర్వః (11-24)

,, లోకేశకేశవశివా నపి యశ్చకార
శృంగారసాంతరభృశాంతరశాంతభావాన్
పంచేంద్రియాణి జగతా మిషుపంచకేన
సంక్షోభయ న్వితనుతాం వితను ర్మదం వః (11-25)

ఈరెండుశ్లోకములను శ్రీనాథుఁడు తెలిఁగింపలేదు, వీనియం దంతచమత్కారము లే దని విడిచిపెట్టెనో.

పంచనళీయప్రకరణమందలిప్రతిశ్లోకమునుసమగ్రముగావ్రాయుక క్రోడీకరించియుఁ గొన్నింటిని విడిచిపెట్టియుఁ దెలిఁగించెను.

(సం)బ్రూమః కి మస్య వరవర్ణిని వీరసేనో ర్ఖ్యాతిం ద్విషద్బలవిజిత్వరపౌరుషస్య
సేనాచరీభవదిభాననదానవారివాసేన యస్య జనితా సురభీ రణశ్రీః॥ (18-3)

1. నవగ్రహప్రశ్నము. సం. 2712.

ఇది 107 పొట్టియాకులు గలప్రశ్నపుస్తకము. ప్రశ్నచూచువిధము దీనిలో నిట్లువ్రాయఁబడినది

"ఆదివారమునాఁడు సూర్యోదయకాలమందు స్నానము చేసి సరస్వతికి ఆవాహన షోడశోపచారపూజలుచేసి యేప్రశ్న చూడవలయునో ఆప్రశ్న చూచుకొని ప్రశ్న యడిగినవారిచేతను తొమ్మిదిగవ్వలు ముమ్మారు పందెము వేయించి వెలికిలఁబడుగవ్వలు తొమ్మిదింట భాగించి శేష మెన్నిగవ్వలో యన్నవయాకున నన్నవపంక్తివిచారించిన ప్రశ్న వచ్చును." ఇట్టిది యంగళ్లలో నొకటి యచ్చుదికూడ నున్నది. దానికిని దీనికిని భేదము చూడఁదగును. ప్రశ్న 1కి తొమ్మిది విషయములు గలవు. చిన్నచిన్న తెనుఁగువాక్యములు.

విరోధికృన్నామసం॥ ఆశ్వయుజ బ ౭ శుక్రవారము వఱకు జమ్ములాపురము వేంకటరాయఁడు వ్రాయించుకొన్నది.

2 మోక్షశాస్త్రము. వచనము. సం. 2771.

"ఆచ్చి రామానుజయ్యంగారు ఆనతిచ్చినారు" అనిగ్రంథప్రారంభము. వైష్ణవసాంప్రదాయమునఁ జక్కఁగ మోక్షమార్గము లుపదేశింపఁబడినవి. ఇందుఁ బూర్వభక్తచరిత్రములు, సాంప్రదాయములు మెండుగఁ గలవు. ఉదాహరణము :—

(1) బాహ్యవేషము :—లోపలివేషము మోక్షహేతువు. పైవేషము నాశనమైచెడిపోయేటందుకుఁ గారణము. లోపలివేషము గలిగిన విదురుని, శబరిని, ప్రహ్లాదుని, విభీషణాళ్వారుని, చింతయంతిని, గోపస్త్రీలను రక్షించెను. సన్యాసివేషమునవచ్చిన రావణుని, మాయామృగమైన మారీచుని, తల్లిరూపమునవచ్చిన పూతకిని దేవతలవేషమున వచ్చిన రాహుకేతువులను, శంఖచక్రములుధరియించిన పౌండ్రక విష్ణుని సంహరించెను.

(2) తొల్లియొకఁడు పెరుమాళ్లకో వెలకు దినమున్నుబోవును. చూచినవారెల్ల దేవునిమీఁద వీనికెంతభక్తియనియందురు. ఒకనాఁడు వాఁడుకోవెలకు రాలేదు. అందఱును అతనిని, యేమిటికిఁ గోవెలకురాకపోయితివని యడిగిరి "అదిరాకుండగానేనును రాలేదు. అదివచ్చినట్టయిన నేనునువత్తును" అనివాఁడుచెప్పెను. అందఱును వానిని లంజలమారిముండఁడని తిట్టిరి.

(3) విశ్వామిత్రుడు "నేనెన్నడును బసాపడక యుపవాసముండువాడ

నైన దోవయిమ్మనుమని యేటితో జెప్పుమనియెను. ఆమాట అరుంధతి విని యే టిదగ్గరకువచ్చి విశ్వామిత్రుడు నిత్యోపవాసియైన నీవునాకు ద్రోవయిమ్మని యేటితో జెప్పగానే...... యేఱుత్రోవయిచ్చెను.

పూర్వముకాళహస్తిలో నొకజంగముకలఁడు. ఇత్యాదిశివనిందకథలునుగలవు

3. బాలక్రీడావిహారము. సం. 2699.

కవిశోభనాద్రి, యక్షగానము, కవిత్వమునఁ దప్పులు కలవు. ఇకవి యింటిపేరు కౌఁడురివారని—

క. వేడుకతోఁ గను శాల, క్రీడావిహారంబు రామకృష్ణులమహిమల్
నాడెముగవినుఁడీమీరలు, కౌడురిశోభనాద్రిదాసుకవితారచనన్.

అను దానివలనను, గద్యలో

క. హరితసగోత్రపవిత్రుఁడ, ఎరదేవవరాన్వయుఁడ నివాసముకౌలూ
రరయశోభనాద్రి" యనుదానివలన వేఱొకలాగునను దెల్పఁబడినది. ఇందుఁ గృష్ణబలరాముల బాలక్రీడలు వర్ణింపఁబడినవి.

ప్రమాదీచనామసం॥ భాద్రపద శు॥ శనివారమున వ్రాయఁబడినప్రతి

4. మైరావణచరిత్రము. సం. 2610.

ఇదియొకద్విపదకావ్యము. హనుమద్విజయమను రెండవపేరు గనఁబడుచున్నది.

కవిబసవప్ప. తనవంశము ప్రారంభమున నిట్లుచెప్పెను

"..........మానుషజ్ఞుఁడు పోలుమంచిప్రాసనుఁడు
బసవప్పయాసునుపత్నినాగాంబ, కసమానమగుపుణ్యులతిథిబాంధవులు
ఇరువురుతనయు లీయిలసింగమంత్రి, తిరుమలార్యుండు........."

ఇందు సింగమంత్రిభార్య గౌరమ. తిరుమలమంత్రిదేవి లింగాంబ. తిరుమలమంత్రికి లింగాంబకు బసవప్రధాని పుట్టెను. ఆయనపత్ని గంగాంబ. వీరి పుత్రుఁడు మల్లమంత్రి, మల్లమంత్రి సతి జన్నమ్మ.

వారిపుత్రుఁడ బసవననుపుంభావ, శారద నిపుణుఁడ సతతపీశ్వరుల
పాదాబ్జ భృంగమై పరఁగినవాఁడ, మోగానరఘుకులముఖ్యుఁడైనట్టి
శ్రీరామవిభునికీక్షితివంకితముగ, మైరావణచరిత్ర మహిమఁజెప్పెదను.

గ్రంథాంతమున గద్యకుమారుఁగా—

"కుసుమాస్త్రగురునిభక్తులు పోలుమంచి, బసవయమల్లన్నబసువప్పసుకవి
సీతావిభుండైన శ్రీరామునికిని, ఖ్యాతిగామైరావణాఖ్యుని చరిత

సతతము శ్రీరామచంద్రునికృపను
మంతుకెక్కినహనుమద్విజయమ్ము,.... .. .. ...
భక్తిసద్విపదప్రబంధంబుచెప్పి - యాకృతిఁదనకితమొనరించినాఁడు.

పరిషత్పుస్తకాలయమునం గల సంఖ్య 896 గలమైరావణచరిత్రమును నాల్గవసంపుటములోఁ దెల్పియున్నాము. అదియునిదియుఁ గాక మఱియొక రీతిగల మైరావణచరిత్రమున్నది. (గ్రంథసంఖ్య 1590) గలది కృత్యాదియేమియు నిందులేదు.

"బహుపురాణజ్ఞులు ప్రస్తుతిసేయ, జనులకునానంద జలధియైనట్టి
మంజరిఁజెప్పెద మహిమీఁదవెలయ, రఘువంశ తిలకులు రామలక్ష్మణులు
విశదకీర్తులువిండి విశ్వంబునిండ," ఇత్యాదిగా మొదలిడి వ్రాయఁబడినది.
ఈమంజరికావ్యమును రచించినకవియెవ్వరో తెలియదుగాని—
అనుచు శ్రీరఘుపతి యానతిచ్చుటయు, శ్రీరామవరుఁడైన చెన్నకేశవుని
కర్పితంబుగఁ గాంచనాంబపుదలఁచి, చెప్పితినీకథ చరితంబుగాను.

అనిమాత్రమున్నది. ఏపుస్తకమునకును మూలకథయెక్కడిదో తెల్పఁబడలేదు ఇవిమూఁడునుగాక మాడయ్యకవి మైరావణచరిత్రమొకటి పద్యకావ్యము గలదు. మైలురావణుఁడని యఱవవారందురు. తెనుఁగువారు మైరావణుఁడని వాఁడుచున్నారు. ఈశబ్ద విచారముం గావింతురుగాక !

బసవకవి ద్విపదకావ్యమునుండి కొన్ని బంతులు—

కరువలితనయుని గనుఁగొనిపోయి.......
యీక్షితినాథుల నిచ్చిమ్రొక్కినను, రాక్షసకులమెల్ల రక్షించునతఁడు,
తగదయ్యప్రాణేశ తర్కింపనీకు, వగపులఁబడమేలొ పగయిదిమేలొ
తల్లడంబున దిగుల్ తలఁకుచునుండెఁ, జెల్లఁబోనోరాడఁ జెప్పలేనన్నిన
మాతంగితోనను మైరావణుండు, ఓ తరుణెందుకే యారకజడియ,
భావించిబలభేదిఁ బ్రాగ్దిక్కునుంచి, పావకుఁ జెనుమంట పాలుగాఁజేసి
యమరంగఁగాలుని నంతకుఁజేసి, కుమతినైఋతి నొక్కకోణానద్రొబ్బి
నీరధీశ్వరువాఁడి నీరుగాఁజేసి, మారుతమునును వేమాఱుఁదూలించి
కౌశికుబేరునికన్నుఁబోఁగొట్టి, యీశాను నొకపెద్దయెద్దునెక్కించి......
శరణంబువేఁడను శాత్రంబువిడిచి,.........
శత్రువుఁగని పాటిచచ్చుటకంటె, జిత్రాసిధారలచేఁ దెగిమించి,
వృత్రారిపథమున వెలయుటలెస్స, నేత్రబిబ్బోకాంగి నీవుపొమ్మనిన,

దైవాజ్ఞగాఁబోవఁగఁదరమె యెంతైనఁ, దానెతనొంది మాతంగిశోకముఁ
బోయెనుగదఁ జాలఁబొంగిలోపలికి.

ఈగ్రంథము శాలివాహనశకవర్షంబులు ౧౬౬౨ నళనామసం॥ పుష్య శు ౭ బుధవారమునవ్రాసె శ్రీమత్ప్రసిద్ధ తాళ్లపాక తిమ్మాచార్యులు పంజ వెంకటరెడ్డిగారి కిచ్చినయేడుకాండముల రంగనాథరామాయణము చివర ౧౨ పత్రములలో వ్రాయఁబడినది. రంగనాథరామాయణము ౭కాండములును 323 పత్రములు. 324 పత్రము మొదలు 33౫ పత్రమువఱకు నీద్విపదయున్నది. దీనిని గూడ ద్విపదకావ్యచక్రవర్తులగు తాళ్లపాకవారె వ్రాసియుందురు వ్రాఁతకొంచెము భేదముగనున్నది. మంజరి యుదాహరణము:—

వలకొప్ప హనుమంతువాలంబుకోల, గొప్పగాదృఢశాలి యొనరంగఁజూడఁ
జంద్రసూర్యులకును సాధింపరాదు. అతిశయంబైనట్టి యావాలమహిమ,
యేమనిచెప్పుదునెన్నఁడఁజూడ. నెఱుఁగమురావణాయవనిలోపలను
చెలఁగివానరవీరసేనలనెల్ల, తనవాల మల్లార్చి తగఁగోటచేసె
భూమికిమింటికిఁ బోరామిచేసె, హనుమంతుఁడెంతయు నటువాయుదేవు
కరుణవిజృంభించికాచియున్నాఁడు

ఖరసం॥ ఫాల్గునమాసములో ఊటుకూరికరణము వేంకటాచలముగారికి వ్రాసియిచ్చినది.

౫. వీరమాహేశ్వరాచారసంగ్రహము. సం. 263౫.

ఇదియొకపద్యకావ్యము. ప్రథమోల్లాసముమాత్రమెయున్నది. అతిశిథిలమైయున్నది కవి లింగనామాత్యుఁడు.

“ఇది శ్రీగిరీశ్వర ..........కళ్యాన, విదితశివాచారవిహితసుజ్ఞాన
పండితారాధ్య శ్రీపాదాబ్జభృంగ, ఖండేందుధర భక్తకామాంతరంగ
శివకృపాంచితగాత్ర శ్రీవత్సగోత్ర, ప్రవిమలనిగమోక్త భవ్యచారిత్ర
శైలజేశ్వరభృత్యజనభృత్యభృత్య, లీలపర్వతమంత్రి లింగనామాత్య
విరచితమై సర్వవేదోక్తమగుచు, ధరణినాచంద్రార్కతారకంబగుచు.

ఇందు శంఖచక్రాయుధోత్పత్తి, మార్కండేయమహత్త్వము, శరభావతారము, వ్యాసభుజస్తంభనము మొదలగువిషయములున్నట్లు తెలియవచ్చును. పేరుచేతనే దీనివిషయము విదితమగుచున్నది. శైలి—

శివపదధ్యానంబు శివపూజనంబు, శివపాదభక్తియుఁ జెదరకపెక్కు

వ్రతములు కృచ్ఛచాంద్రాయణాదులును జతురుండై దేహశోషణముగావించి తివిరిపూర్వము వేయి దివ్యవర్షములు, ప్రవిమలుండై వాయుభక్షుండైయుండి మఱినిరాహారుండై మధువై రినిలిచి, గురునకు మఱిమూండుకోట్లవర్షములు ఆదివ్యవర్షంబులతిఘోరతపము, మోదంబుతోంజేసిముర వైరితనువు చిక్కి వెండి తపంబుసేయుచుండఁగను, అక్కడవిశ్రాంతినందొకనాడు హరునిమాఱటరూపమై యొప్పువాఁడు, పరమశివాచార పరుండైనవాఁడు నిత్యుండై తానయోనిజుండైనవాఁడు, సత్యవ్రతుండును సదమలాత్మకుండు నైననందీశ్వరుఁ డందేగుదెంచి, యానీరజోదరుఁ డతిఘోరతపము సేయుచుండఁగఁజూచి చిత్తంబులోన, నాయుగ్రతపమునకాశ్చర్యమొంది పాయకపరమేశుపాలికిఁ బోయి, ఆయతభక్తి సాష్టాంగుండై మ్రొక్కి.......

ఈగ్రంథము కడపట వర్షఫలములందెల్పు రెట్టమతములోని కొన్నిపద్యములు వ్రాయఁబడినవి

విక్రమనామసం॥ అధిక జ్యేష్ఠ శు ౧౫లు. చందలూరివీరన్నకు పూరేబాపిరాజు వ్రాసియిచ్చినది.

6. శైవాచారసంగ్రహము సం. 2868.

గద్యము. ఇది శ్రీదుర్గాంబికాప్రసాదాసాదిత కవితావిలాస భాసురతిమ్మదహళబిలామాత్యపుత్ర సుకవిజనపాత్ర సకలవిద్యానిధాన తిరుమలనాథాభిధానప్రణీతంబైన శైవాచారసంగ్రహమ్మను కృతియందు శివపూజావిశేషంబులగు వివిధకుసుమంబుల తారతమ్యంబును .. ... ... ... ...

ఈతిరుమలనాథకవి విస్సయగన్నధీమణికీకృతినంకితమొనర్చెను. మొదటిపద్యము-

శా. శ్రీరమ్యాబ్జదళాక్షముఖ్య సురసంసేవ్యుండుకృష్ణాసరి
త్తీరస్థేముఁడు మల్లికార్జునమహాదేవుండు
తారాఢ్యుండు శివామనోహరుఁడు నిత్యానందచిద్రూపుఁడిం
పార న్విస్సయగన్న ధీమణి కభీష్టార్థంబు లిచ్చుందయన్.

వ. అనియిష్టదేవతాప్రార్థనంబుచేసి......

కృతిపతివంశమిట్లిందుఁ దెలియఁబఱిచెను—

గేమయప్రభుఁడు, అతనికుమారుఁడు వీరభద్రుఁడు.

క. ఆవీరభద్రునకుహితుఁ, డై వెలసినయజ్ఞపుణ్యుఁ డనవరతశివా
ర్చావైభవసంపన్నుఁడు, భూవినుతుఁడు గన్నమంత్రిపుంగవుఁడొప్పున్

శా. భారద్వాజపవిత్రగోత్రుఁడు జగత్ప్రఖ్యాతుఁ డుద్యద్యశః
ప్రారంభుండగు గన్నసైన్యపతికిం బాత్రుండు శ్రీయజ్ఞస
త్త్వాలోకా      పతుండయిన కన్నామాత్యపుత్రుండు వి
ద్యావాచస్పతివుండు గన్నసమహీదాసుండు ధీరుండిలన్.

ఉ. నిత్యయశోవిశాలుఁడును, నీతియుగంధరుఁ డద్రిధీరుఁ డా
దిత్యసమానతేజుఁడు సుధీనుతుఁ డున్నతధర్మశీలు
సాంద్రుఁడు పిల్లలమఱ్ఱికన్ననా
మాత్యుఁడు సెప్పనొప్పు మహిమవ్విలసిల్లుచునెల్లదిక్కులన్.

ఇందుగన్ననామాత్యుఁడా కన్ననామాత్యుఁడా తెలియదు. రెండుపథముల వ్రాయఁబడినది.

ఈగన్నధీమణి పండితారాధ్య దేశికుని శిష్యుఁడని—

క. ఆశాపాశవిముక్తున, కాశాముక్తునకుఁ బండితారాధ్యమహా
దేశికశిష్యునకు.....అనువాక్యము తెల్పుచున్నది.

మూఁడాశ్వాసములుగలవు. శైలివిషయము మొదలైనవానికిఁ గొన్నిపద్యములు.

గీ. తండులము లొకటి పాలుదగ్ధములుమూఁడు, పాల్గుబెల్లంబుపాలలోపలసగంబు
గుడములోసగముఘృతంబుగూర్చివండ, నదిగుడాఖ్యాన్నమనఁగను విదితమగు

ఉ. మానుఁగ బత్తివత్తి నగుమానితసిద్ధులు పట్టువత్తి సు [ను.
జ్ఞానకరంబు వీనిఘనసారరజస్సముదాయగర్భము
ల్గానొనరించి మంచికపిలాఘృతముం దగవించి దీపమీ
శానునకెత్తఁగోటిగుణసంచితపుణ్యఫలంబు సేకుఱున్.

శా. నానైవేద్యముఁ బాదతోయముఁ బ్రసూనవ్రాతముంబత్రసం
తానంబుంగొన      నవర్ణములు తథ్యంబంచు నీశుండును
న్మానిశ్రేణులతోడఁ బల్కెనని యాత్మజ్ఞ దృఢవ్రతజ్ఞతం
గానంబల్కుదు రిత్తెఱంగుఁ దెలియంగా నానతీ వేదయున్.

ఈగ్రంథమును శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము ప్రతివ్రాసిన వ్రాయసకాఁడే వ్రాసెను. అక్షరము లన్నియు నుండును, అర్థముగావు. ఆరీతినే దీనిని వ్రాసినాఁడు.

## 7. రామాయణవచనము. గ్రం సం. 2944.

ఇది యొకరామాయణకథ. మొదటిపత్రము లేదు. విస్తారముగాఁ దప్పులు గలవు. భాషసలక్షణముగా లేదు. ఇందలియొక కాండాంతగద్యములో—

"బాలకాండ అయోధ్యాకాండ యీ రెండుకాండ్లలున్న వాల్మీకమహాముని . రామాయణార్థంబు అందరికి తెలియడానకి వచనరూపంబ్బుగా మార్కండేయమహాముని పాండునందనులకు చెప్పినప్రకారం శింగ్గరాజు దత్తాత్రేయులు చేసుకున్న పుణ్యకథా సంపూర్ణం" అనియున్నది దీనింబట్టి భారతారణ్యపర్వములోని రామాయణభాగమును దెనుఁగుజేసికొన్నట్లు తేలుచున్నది. ఇందెనుబదిపత్రములు గలవు. యుద్ధకాండము ముగియలేదు. పత్రములు పురుగులు కొట్టినవి. వచనమునకుఁదగినట్లే ప్రతికాండమునకు మొదట నొక్కొకకంద పద్యముం గలదు. అవియును వచనానుసారముగనే తప్పులుగాఁ వ్రాయఁబడినవి.

సుందరకాండాదిపద్యము—

క. మీకారుణ్యముచాతను, అక్కడికథలంత దెలిశిహనుమంతుం
జోకసువేలాద్రికి జన, మాకు ఆకథ దెలుపవయ్య మార్కండేయా.

యుద్ధకాండాదిపద్యము—

క. శ్రీయినవంశోద్భవురాముఁడు, వనచరభల్లూకములతో వారధిమీాదం
జనిరి సువేలాద్రికి సరె, మునివర అటవెనక యేమి ముచ్చటనడిచెనో

శైలికై కొంతవచనము, యుద్ధకాండములోనిది వ్రాతలోఁగనఁబడు తప్పులు సవరించివ్రాయఁబడినది.

"ఓయి మంత్రులారా ! ఆరామచంద్రుండు మనుష్యుండుగాఁడు. సాక్షాచ్ఛ్రీమన్నారాయణుండు, ఈలాగవతరించినాఁడు గనుక మీరాయనతోఁబోరి జయింపలేరు. వారితోవైరంబువల్లను. మనయతికాయునిఁ బంపిన మనవిభీషణుండు పొసఁగ నింపుగ మాటలాడి సంధిచేసి సమాధానంబుచేయు, ననిన రావణుం డామాటలనువిని యిరువదికన్నులు నెఱ్ఱఁజేసి మనకుభయంబేమి, యింద్రజిత్తను కుమారుఁడుండఁగా సంధిచేసుక వానిని బతిమాలనేమి. ఇఁక నీవవతలికిఁబో, యిదిగో నేనుబోయి యుద్ధంబుచేసి సంహరించివచ్చెదను."

8. గురుగీతాసారము. సం 2937.

గద్యము-ఇది శ్రీరామబ్రహ్మేంద్రగురువరప్రసాదలబ్ధకవితావిలాస .నారపామాత్యప్రణీతంబైన శ్రీగురుగీతాసారంబున.........

ఈనారప్పయింటిపేరు మొదలైనవి తెలియవు. "స్కాందపురాణంబునందుత్తరఖండంబున గురుగీతాకావ్యంబుం దెనుంగుసేయంబూని మదీయాచార్య పరంపరావతారంబు లభివర్ణించెద" .నని గురుపరంపరమాత్రమే—దత్తాత్రే

యుఁడు, చిదానందుఁడు, దత్తగురుఁడు, దత్తాత్రేయయోగీంద్రుని శిష్యుఁడు పరమానందమునీంద్రుఁడు, . . . ధేనువుకొండ తిమ్మయోగి, వీరిశిష్యుఁడు చింతల లింగాన్వయయోగి యోగావధూత, రామగురుఁడు. ఈరామగురుఁడే కవిగురువఁట. ఈతనిఁ బ్రారంభమున నిట్లుస్తుతించినాఁడు

శా. శ్రీకైవల్యపిశేషస్థానము మదింజేరంగనేఁగోరి లో
 కైకాచార్యుని దత్తవంశజుని సత్కారుణ్యపాథోధియై
 లోకాచారవిచార సంపదల కాలోకింపకన్మోక్షుల
 క్ష్మికాంతుండగు రామబ్రహ్మగురునే స్తోత్రింతు నశ్రాంతముగ్.

క. పలికెద శ్రీగురుగీతలు, పలికించెడివాఁడు రామబ్రహ్మమునాలో
 పలనిలిచి యేవిధమ్మునఁ, బలికించునొ యావిధమునఁ బలికెద సుమ్మా.

కవికిఁ బోతరాజకవీంద్రు భాగవతమునం దభిమాన మెక్కుడుగా నున్న ట్లు కనఁబడును గాని భక్తిపారవశ్యమేగాని కవిత్వరీతి యొకించుకయుఁ బట్టువడి నట్లుతోఁపదు శైలికి——

మ. రమణీఖేచరముద్ర నిశ్చయముచే రంజిల్లఁగం జూచునా
 సమయుం బందుఁ జిత్తవాయువులలో సంచారమొందైన రెం
 డమరన్నిల్వవటంచు నెన్నఁబడునాయా రెంట్లోనేదైననుం
 గ్రమమొప్ప న్నిలుచున్న రెండమరఁగా గట్టిన్నదానిల్పునే. [యఁజూడ

గీ. అపుడుమేనునదశవిషయాదు లెపుడు, మెలఁగుచుండఁగఁ బరమాత్మఁదెలి
 నవలపివయేంద్రియభ్రాంతులచటనిలువ, కెట్లుపోనని మదిసంశయించెదేని.

ఈగ్రంథము ౫౬ పత్రములు రెండాశ్వాసములు మాత్రమేయున్నది.

## 9. శరభరాజీయము. సం. 3989

ఇదియొకవైద్యపద్యకావ్యము తుళ్లూరి శరభరాజప్రణీతము. ప్రథమా శ్వాసాంతగద్యము.

“ఇతి శ్రీ వేణుగోపాలవరప్రసాదలబ్ధ కవిత్వరాజ తుళ్లూరి శరభరాజప్ర ణీతంబైన వైద్యశాస్త్రంబున నిదానపద్ధతియు ద్రవ్యసిద్ధి పద్ధతియు బహువిధ రత్నపద్ధతియుఁ బ్రథమాశ్వాసము.

ద్వితీయాశ్వాసాదిపద్యము——

క. శ్రీకొమరపూఁడిమందిర, లోకేశ్వరవినుత జలజలోచన దనుజా
 నీకభయంకర విపులద, యాకర హనుమంతరాయ యనుపమగేయా.

## ద్విపదప్రబంధములు.

| | | |
|---|---|---|
| 1 | చిదానందమంజరి | ... ఉమాపతికవి. |
| 1 | చిఱుతొండభక్తునికథ | ... |
| 1 | దమయంతీచరిత్రము | ... |
| 1 | ద్వాత్రింశత్సాలభంజికలకథలు | ... |
| 1 | ద్విపదశృంగారవర్ణనము | ... |
| 8 | ధర్మాంగదచరిత్రము | . బొమ్మకంటి నృసింహకవి. |
| 23 | నలచరిత్రము | వీరరాఘవకవి. |
| 1 | నలచక్రవర్తికథ | ... తిమ్మకవి. |
| 1 | నాగరకాండము | చంద్రశేఖరకవి. |
| 3 | పండితారాధ్యచరిత్రము | ... సోమనాథుఁడు. |
| 1 | పల్నాటివీరచరిత్రము | ... శ్రీనాథునిదఁట. |
| 1 | పెద్దిరాజుకథ | ... |
| 5 | ప్రభులింగలీలలు | ... పిడుపర్తి సోమనాథకవి |
| 1 | ప్రమథస్తోత్రము | ... సన్న్యాసికవి. |
| 1 | భల్లాణచరిత్రము | ... బసవన్న. |
| 1 | భల్లాణచరిత్రము | ... నింబాద్రిదాసు. |
| 1 | భల్లాణరాయచరిత్రము | ... చిత్తార గంగాధరుఁడు. |
| 1 | భాగవతార్చనము | ... |
| 4 | మైరావణచరిత్రము | ... |
| 1 | మైరావణచరిత్రము | బసవప్పకవి. |
| 1 | మైరావణచరిత్రము (మంజరి) | ... |
| 1 | రామధ్యానము | |
| 2 | రుక్మిణీకల్యాణము | ... పాటూరి చిన్నయ్య. |
| 1 | రుద్రాక్షమాహాత్మ్యము | ... పర్వతరాజు లింగకవి. |
| 1 | విష్ణుభక్తిచరిత్రము | ... ఆసూరి శేషావతారము. |
| 1 | శివస్తోత్రము | ... |
| 1 | శ్రీరామకుమారవిజయము | . చిదంబరకవి. |
| 2 | సానందగణేశ్వరము | ... భద్రకవి లింగయ్య. |
| 5 | సారంగధరచరిత్రము | . బాణాల శంభుదాసుఁడు. |

| | | |
|---|---|---|
| 1 | సౌగంధికపుష్పాపహరణము. | ... గోపాలకవి. |
| 6 | హరిశ్చంద్రోపాఖ్యానము | ... గౌరనమంత్రి. |
| 1 | హరిశ్చంద్రోపాఖ్యానము | ... బండి గట్టయ్య. |
| 1 | గణమాలిక | |

## యక్షగానములు.

| | | |
|---|---|---|
| 2 | అధ్యాత్మరామాయణము | ... రాపాక శ్రీరామకవి. |
| 1 | అనిరుద్ధచరిత్రము | |
| 1 | ఇల్లిందకుంటరామాయణము | |
| 1 | ఉత్తరరామాయణము | |
| 2 | ఉషాపరిణయము | ... మూళగిరికవి. |
| 1 | ఎఱుకలకథ | ... రామకవి. |
| 1 | కంసవధ | . |
| 5 | కన్యకాచరిత్రము | ... తిమ్మనకవి. |
| 1 | కపోతవాక్యము | ... సోమయ బసవన్న. |
| 1 | కాళిందీవిలాసము | ... |
| 1 | కూరత్తాళ్వారుచరిత్రము | ... |
| 1 | కృష్ణపారిజాతనాటకము | ... |
| 1 | కొరవంజి | . |
| 1 | గీతరఘునందనము | ... తిరుమలకవి. |
| 2 | గరుడాచలము | . . |
| 1 | గుత్తెనదీవిరామాయణము | ... |
| 1 | గోకర్ణేశ్వరవిలాసము | ... |
| 4 | గొల్లభామకథ | ... నక్కలపాటి సంజీవికవి. |
| 2 | గోపాలవిలాసము (కాళింగచరిత్రము) | |
| 1 | చంద్రరేఖావిలాసము | .... విశ్వేశ్వరుఁడు. |
| 1 | చంద్రశేఖరనాటకము | .... |
| 1 | జలక్రీడావిలాసము | .... అకలంక కృష్ణకవి. |
| 1 | జీవయెఱుకలకొరవంజి | .... సన్నిధిరాజు జగన్నాథకవి. |

| | | |
|---|---|---|
| 1 | జాంబవతీవిలాసము | ... |
| 1 | తారాశశాంకము | .... |
| 1 | తారాశశాంకవిజయకీర్తనలు | .... |
| 1 | తిరుమంగైయాళ్వారుచరిత్రము | ... కోవెలరాఘవదాసు. |
| 1 | దశావతారకందార్థములు | ... |
| 1 | నరకూరిపారిజాతము | ... నారాయణకవి |
| 1 | నిజలింగచిక్కయకథ | .... |
| 2 | పాటలపుస్తకము | ... వారణాసి సుబ్బయ్య. |
| 1 | నౌకాచరిత్రము | ... కాకర్ల త్యాగరాజు. |
| 1 | పార్వతీకల్యాణము | .. వేంకటకవి. |
| 3 | పారిజాతనాటకము | ... చల్లా నారాయణకవి. |
| 1 | పారిజాతాపహరణము | ... |
| 1 | బాలక్రీడావిహారము | ... శోభనాద్రి. |
| 1 | బాలకృష్ణనాటకము | .... |
| 1 | భక్తాంఘ్రిరేణువిలాసము | ... ఉత్తమరంగకవి |
| 1 | భక్తికీర్తనలు | .... |
| 1 | మల్లికాకల్యాణము | .... రాయపురి చెన్నయార్యుడు. |
| 2 | మృత్యుంజయవిలాసము | .... కూర్మనాథకవి. |
| 1 | యోగప్రభావము | .... |
| 1 | రంగపురిపారిజాతము | .... శృంగారకవి శ్రీనివాసయ్యంగారు. |
| 2 | రామాయణము | .... మాచిరాజు లక్ష్మయ్యమనుమడు. |
| 1 | రతిమన్మథవిలాసము | .... శేషము రంగాచార్యులు. |
| 3 | రుక్మిణీపరిణయము | .... చౌదరి రామదాసు. |
| 1 | లక్ష్మీనృసింహసంవాదము | .... |
| 1 | వాసవీమాహాత్మ్యము | .... భాస్కరాచార్యులు. |
| 1 | వేంకటేశకల్యాణము | .... |
| 1 | శకుంతలానాటకము | .... నరసింహకవి. |
| 1 | శివపారిజాతనాటకము | .... తరిగొండ వెంగమ్మ. |
| 1 | శివరాత్రిమాహాత్మ్యము | .... |

| | | |
|---|---|---|
| 1 | సీతాకల్యాణము ... | అగస్త్యరాజు రామకవి |
| 1 | సీతాకల్యాణము .. | వాలమోంకరి మల్లభూపాలుఁడు. |
| 2 | సుగ్రీవవిజయము ... | కమసాలి రుద్రయ్య. |
| 3 | సుందరకాండము .... | పట్టాభిరామయ్య |
| 1 | సుందరకాండము .. | వెమరాజు వేంకటరా... |

శతకములు.

| | | |
|---|---|---|
| 1 | అల్లమప్రభుశతకము . | దొమలూరి పద్మనాభకవి. |
| 1 | ఆదినారాయణశతకము .. | |
| 1 | ఈదులవాయిరామస్వామిశతకము . | ప. లింగమూర్తి |
| 1 | కంచియేకామ్రలింగశతకము . | |
| 1 | కందమాలిక (వేమనశతకము) .. | వేమనయోగి. |
| | కనుపర్తిబాలకృష్ణశతకము | |
| | కన్నశతకము | |
| | కలువాయిశతకము | |
| | కవిచౌడప్పశతకము | చౌడప్ప. |
| 4 | కాంతాలలామశతకము | |
| 1 | కాళహస్తీశ్వరశతకము | |
| 2 | కాళహస్తిలింగశతకము | తిరువిరూపాక్షుఁడు. |
| 3 | కాళహ | శరభకవి. |
| 3 | కృష్ణశతకము | |
| 3 | కృష్ణశతకము | నరసింగార్యుఁడు. |
| 2 | కృష్ణశతకము | కృష్ణకవి. |
| 1 | కృష్ణహరివసుదేవనందనాశతకము .... | సంజీవరాయకవి. |
| | కేశవశతకము | వేంకటరాఘవార్యుఁడు. |
| | గురుశతానందయోగిశతకము | |
| | గోకర్ణలింగశతకము | |
| | గోపబాలశతకము | |
| | జయరమానాథశతకము | |

1 జయరఘురామశతకము ....

2 జానకీపతిశతకము .

1 జానకీనాయకశతకము ...

1 తాళ్లపాక వారిశతకములు .... తిరుమలయ్య.

1 తిరుమలగిరిశతకము ....

1 తేరపావనశతకము ... తేరప్ప.

1 తొండమాన్‌రఘునాధరాయశతకము

2 దత్తాత్రేయశతకము ..

1 ద్వారకా వేంకటేశ్వరశతకము ... నృసింహకవి.

16 దాశరథిశతకము .. గోపన్న.

3 దేవకీనందనశతకము ...

1 దేవీశతకము ... దెందులూరి పద్మనాభకవి.

14 నరసింహశతకము ... శేషప్ప.

6 నారాయణశతకము ...

1 నిరంజనశతకము ....

1 నీతిసీసపద్యశతకము .... తాళ్లపాక తిరుమలయ్య.

1 నీరజాక్షశతకము .... వేంకటాచార్యుఁడు.

1 పరమపురుషశతకము ...

1 పరమానందశతకము ....

1 పరశురామశతకము .. పరశురామపంతుల రామమూర్తి

1 పరశురామశతకము .... తోఁట గజేంద్రుఁడు.

1 ప్రణవగిరివాసశతకము ....

6 ప్రసన్నరాఘవశతకము .... నరసింహకవి.

1 బచ్చుపురీశ్వరమల్లికార్జునశతకము....

1 బసవశతకము .... పాల్కురికి సోమనాథుఁడు.

1 బాలగోపాలశతకము .... పుసులూరి సోమనామాత్యుఁడు.

2 భద్రాద్రిరామశతకము ....

4 భాస్కరశతకము ....

2 మంగళాద్రినృసింహశతకము ....

| | | |
|---|---|---|
| 1 | మదనగోపాలశతకము | ... రావూరి శోభనాద్రిరాయఁడు |
| 1 | మనోహరశతకము | .. లింగకవి |
| 2 | మల్లికార్జునశతకము | |
| 1 | మహానందీశ్వరశతకము | దెందులూరి పద్మనాభకవి. |
| 1 | మహాప్రభూశతకము | |
| 1 | మాటూరిచెన్నకేశవశతకము | |
| 2 | మానసశతకము (మొదలగునవి) | పరశురామపంతుల లింగమూర్తి. |
| 1 | మహేశ్వరశతకము | |
| 1 | మీనాక్షీశతకము | కూచము వేంకటరంగకవి. |
| 9 | రామతారకశతకము | |
| 3 | రామలింగేశశతకము | అడిదము సూరకవి |
| 1 | రామశతకము | |
| 2 | వీరనారాయణశతకము | సంజీవరాయకవి. |
| 1 | వీరభద్రశతకము | కొమఱ్ఱాజు రామయ్య. |
| 2 | వేంకటేశశతకము | |
| 3 | వేణుగోపాలశతకము | |
| 1 | శ్యామలాంబాశతకము | |
| 1 | శివమహాదేవశతకము | దెందులూరి పద్మనాభకవి. |
| 1 | శివసాంబాభక్తచింతామణిశతకము. | కూచిమంచి సోమసుందరకవి. |
| 1 | శ్రీగజేంద్రశతకము | తోఁట గజేంద్రుఁడు. |
| 1 | శ్రీగిరిమల్లేశశతకము | రామలింగార్యుఁడు. |
| 1 | శ్రీవేంకటేశ్వరశతకము | మంచెళ్ల కృష్ణకవి. |
| 1 | శ్రీహరిశతకము | |
| 1 | శృంగారవృత్తపద్యశతకము | తాళ్లపాక తిరుమలయ్య. |
| 1 | సంపగిమన్నశతకము | పరమానందయ్య. |
| 1 | సదానందయోగిశతకము | |
| 1 | సరస్వతీశతకము | |
| 2 | సర్వేశ్వరశతకము. | యథావాక్కుల అన్నమయ్యగారు |
| 4 | సిద్ధరామశతకము | సిద్ధరామకవి. |

1 సీతాపతిశతకము
2 సుబ్రాయశతకము .. బృహత్తటాకము నాగశాస్త్రి.
5 సుమతిశతకము
1 సోమేశ్వరశతకము
1 స్వప్రకాశశతకము

దండకములు-చూర్ణికలు.

1 అక్రూరదండకము
1 ఆంజనేయదండకము
1 ఆర్యాపురనాథదండకము
1 కచ్చిరంగరాజదండకము
1 కామాక్షీదండకము
1 కృష్ణదండకము
1 కోదండరామచూర్ణిక గరుడాద్రి సుబ్రహ్మణ్యము.
1 కొమ్మాలపాటిదండకము కృష్ణమాచార్యులు.
1 గణపతిదండకము
1 చంద్రరేఖాదండకము సుకురుపాటి వేంకనార్యుఁడు.
1 చంద్రాననాదండకము సాంబకవి.
1 చంద్రాననాదండకము వేంకనార్యుఁడు.
2 చూర్ణికలు
1 దండకము
1 నామగిరిలక్ష్మీదండకము
1 పద్మినీదండకము దేవరకొండ వెంకయ్య.
1 పాంచాలిరంగయ్యగారిచూర్ణిక రంగయ్య.
1 పోగాకుదండకము
1 భద్రాచలమువారిచూర్ణిక
2 భోగినీదండకము పోతన.
1 మీనాక్షీదండకము
1 మీనాక్షీచూర్ణిక తూములూరి వేంకటరంగకవి.

# విషయసూచిక.

శుభ్రాంశుహారగణహారికహారధారాంకసంగోంద్రప్రవాహకఛవిస్యమశీర్ప్రవాహః
అనాస్యస్య తే సమితి చామరవాహిసేవిధ్వాత్రాసుకైవ ఒమాధవరోర్చితాభిః.
క్షోణీభృతా మతులకర్ణకృపాగ్రహేణా ముద్రామదక్షహాటకాంతరకోపిరాజామ్
పక్షచ్ఛిదా మయమమునగ్రబలో౽థాయ మన్యం విపక్షజలదా జగదుజ్జహార.
భూమీభృతస్సమితి జిష్ణు మసహ్యదానం జానీహి నత్వమఘవంతమముం కథంచిత్
గుప్తం ఘటప్రతిమలబ్ధ బాహుశేషం నాలోకసే తేజసా మశ్నుత మేదినీయమ్
13 3-6

ఈనాలుగుశ్లోకములకును శ్రీనాథుఁ డొకపద్యమునే వ్రాసెను
చ. అతివ యొకపద్మపాయుని విశాలవిలోచనపంకజాతుఁ డై
జితగజవీరవృత్తుని విరాజితసర్వమహీభృదావళిన్
హతమదవద్విరోధిబలు నాత్మచమూచరవారణానన
స్రుతమదగంధియుద్ధమహిఁ జూడుము వీని మహేన్మహేంద్రునిన్. 5-166.

"భూమీభృతస్సమితి" అనుశ్లోకమున "జానీహినత్వమఘవంతమముం" అనుశబ్దములలోఁ గన్పట్టుసభంగశ్లేషయందలి చమత్కారమువలన నింద్రపరముగా " అముం-అమఘవంతం=అనింద్రం-నజానీహి " అనఁగా నింద్రుఁడు కానివాఁడుగాఁ దలఁపకుము. అనియు నలపరముగా " అముం-అఘవంతంనజానీహి" అనియు నర్థద్వయము భాసిల్లుచున్నది. దీనిని విడిచిపెట్టె.
అగ్నిదేవునివర్ణించుశ్లోకములు మూలమున నాలుగు గలవు.(13 10—13)

వానికన్నిటికి శ్రీనాథుఁ డొకపద్యమును వ్రాసెను. యమునివర్ణించు నాలుగుశ్లోకములకును నొక్కటియే వ్రాసెను.
నలేంద్రశ్లేషను జెప్పుశ్లోకము—

అత్యాజిలబ్ధవిజయప్రసర స్త్వయాకిం విజ్ఞాయ తే రుచిపదం నమహీరుహేంద్రః
ప్రత్యర్థిదానవశతాహితచేష్టయాసౌ జీమూతవాహనధియం నకరోతి కస్య.
దీనికి శ్రీనాథుఁడు— (13-28)
తే. నలిననేత్ర ప్రత్యర్థిదానవశతాహి, తాత్మచేష్టాగరిష్ఠత నరసిచూడ
నితఁడు జీమూతవాహనుఁ డింత నిక్క, మింపు పొంపిరిపోవ వీక్షింపు మితని.
(ఆ 5. ప 172.)

అనితెన్నుగా మాతృకానురోధంబుగా నాంధ్రీకరించెను.

అగ్న్యాది దేవతలకును నలునకును శ్లేషగాఁ జెప్పుశ్లోకముల నన్నింటిని గ్రో

డీకరించి శ్రీనాథుఁడు "వ. మఱియు నితండు హుతవహుండుంబోలె బహువిగాఢ మఘవదధ్వరాజ్యాభిషేకవికస్వరతేజోవిరాజితుండును......" అనియొకగద్యములో నిమిడ్చివ్రాసెను.

ఇందాఁక సంక్షేపింపఁబడినవాని కుదాహరణంబులు ప్రదర్శింపఁబడియె. ఇఁక విస్తరించివ్రాసినవాని కుదాహరణంబులు ప్రదర్శింపఁబడు.

శ్లో॥ అథాయాంత మవైక్షంత తే జనౌఘ మసిత్విషా (17-13)
తేషాం ప్రత్యుద్గమప్రీత్యా మిళద్వ్యోమేవ మూర్తిమత్ ॥ అనుశ్లోకమునకు

స్ర. కని రంతంత న్నభోమార్గమునఘనతమస్కాండసందేహసంపా
దనలీలాజాగరూకాతనువికటతనూధామధూమాయితంబున్
వనరాశ్యంతస్తరంగధ్వనిసమధికదుర్వారకోలాహలంబున్
జనసందోహంబు భూషాచ్ఛవిధగధగితాశాకటాహోదరంబున్. (ఆ7. ప38)

అనుపెద్దస్రగ్ధరావృత్తమును వ్రాసెను.

శ్లో॥ అద్రాక్షు రాజిహానం తే స్మర మగ్రేసరం సురాః
అక్షావినయశిక్షార్థం కలినేవ పురస్కృతమ్. (17-14)
దీనికి శ్రీనాథుఁడు

సీ. రతిదేవి నెవ్వాఁగు రాహుఁజన్నులు గడకన్నులకు నింపు గడలుకొలుప
గుడుసైనపూవింటఁ గూడికమ్మనితూపు కటకాముఖపుఁగేలఁ గరము మెఱయఁ
గటిమండలంబుపైఁ గనకంపుఁజెఱఁగులజిలుగుఁబచ్చనిపట్టుఁజేల మమర
నాలీఢపాదవిన్యాసంబు శృంగారవీరాద్భుతములకు విందు సేయఁ
తే. జిన్నిచిగురాకుఁజేరోఁకలఁ జేతఁబట్టి, పేరుటామని రాచిల్కతేరు నడుప
నుక్కడీఁడయియేతెంచెనుక్కుమిగిలి, కలికిగారాపుఁజెలికాఁడు కలికిమరుఁడు.

అనిరసవంతముగా సీసపద్యంబుఁ జెప్పెను.

శ్లో॥ అగమ్యార్థం తృణప్రాణాః పృష్ఠీకృత భీహ్రియః
శంభళీభుక్తసర్వస్వాః జనాయత్తారిపార్శ్వకాః (17-15)
అనుశ్లోకమును

ఉ. చీకటితప్పనం బరులచేడియలన్ రమియింప దూతికా
లోకముమాటతీపులకులోఁబడి భీత్యభిమానలజ్జలం
బోకడఁ బెట్టి ప్రాణ మొకపోఁకకుఁ గైకొనకుండు సాహసుల్
పైకొనిచేరి తన్నుభయపార్శ్వములందును భక్తిఁ గొల్చిరాన్. (ఆ7. ప42.)

అని తెనిఁగించి మూలశ్లోకమునం గస్పట్టునఁ బద్ధపారుష్యమును బోఁగొట్టి మెఱుఁగిచ్చెఁ.

కలిపురుషుం డింద్రాద్యమరుల కెదుర్చు ప్రకరణంబున శ్రీనాథుఁడు మూలమునకంటె నెంతయు రసవంతం బగువర్ణనములతోఁ గలిపురుషుని దదనుచరులను గడు మనోహరముగ వర్ణించియున్నాఁడు.

సీ. జ్ఞానప్రదీపికాఝంఝూసమీరంబు కామలోభక్రోధకారణంబు
సంసారకపటేంద్రజాలవిద్యాపింఛ యామ్నాయపదకంటకాంకురంబు
శూన్యవాదారణ్యశుండాలకలభంబు కుమతసిద్ధాంతవిభ్రమగృహంబు
బహుళఘుట్టకుటీప్రభాతతిగ్మమరీచి యంధపరంపరావ్యాప్తసరణి
తే. కన్నులకు నిద్ర మతికి జోఁకన్ను ధృతికి, వినమి చెవులకు నెద్ది భావించిచూడ
నమ్మహామోహుఁ డెదురుగాఁ జరుగు దేర, బ్రమసి చూచిరి వాసవాద్యమరవరులు.
(ఆ 7. 60.)

సీ. పాతకంబులు నీలిపట్టుబొందడములు పగలింటినిద్రలు పచ్చడములు
పరదూషణంబులు ప్రాలంబహారంబు లన్యకాంతాసక్తి యుంగరాగ
మీర్ష్యాపరత్వంబు హేలావతంసంబు బుధజనద్వేషంబు పువ్వుదండ
మిథ్యాప్రలాపంబు మృగనాభితిలకంబు బహులాశనత్వంబు పరికరంబు.
తే. పరులఁ జూపులు వాకోల్పఁ బ్రసభలీల, రాసభాంగరుహాగ్రధూమ్రప్రకార
బర్బరాకార దేహు లంబరము నిండి, సరస వచ్చిరి కలిరాజుసైన్యభటులు.
(ఆ 7. 61.)

శ్లో. శ్రుతిస్మృత్యర్థబోధేషు క్వైకమత్యం మహాధియామ్
వ్యాఖ్యాబుద్ధిబలాపేక్షా సా నోపేక్ష్యా సుఖోన్ముఖీ. (17-51)

అనుశ్రుతికటుపదఘటితశ్లోకమునకు శ్రీనాథుఁడు మృదుమధురపదగుంభనచే విలసిల్లు-

సీ. ఐకమత్యంబు లే దఖిలశాస్త్రములకు నిగమంబులాకజాడ నిలువకాదు
నాగమంబులత్రోవ యది యొండుచందంబు పంకంబులోనికంబంబు తర్క
మతిగూఢ మైయుండు యామళంబులచాయ యుపనిషత్తులభావ మొక్కరీతి
బహువిధంబులు మంత్రపారాయణంబులు సాంఖ్యయోగములవాసనలు వేఱు.
తే. పట్టి యేదర్శనం బైనఁ బ్రతిభ కలిమి, వలసినట్లు వక్కాణింపవచ్చియుండు
నరసి దుఃఖంబు లేక సౌఖ్యంబు గలుగు, ధర్మ మొకఁ డేటికోనుఁడు విద్వాంసు
[లార. (ఆ 7. వ 73.)

కొన్నిచోటుల మూలములోనిభావమును శ్రీనాథుఁడు మార్చియున్నాఁడు.

శ్లో. పితాత్మనః పుణ్య మనాపదః క్షమా ధనం మనస్తుష్టి రథాఖిలం నలః
అతఃపరం పుత్త్రి నకోపి తేహా మి త్యుదస్రు రేష వ్యసృజ న్నిజౌరసీమ్. 16-118

దీనికి శ్రీనాథుఁడు చెప్పినపద్యముఁ గనుఁడు.

మ గురువన్నన్ ధనమన్నఁ బుణ్యమనినన్ గోత్రోదయం బన్న దే
వరయన్న న్మనమన్నఁ దుష్టియనినన్ వాత్సల్య మన్నన్ నిజే
శ్వరుఁ డన్నం బరమోపకార మనినన్ సర్వంబు నన్నం దలో
దరి నీకున్ నిషధాధినాథుఁడె సుమీ తథ్యంబుగాఁ జెప్పితిన్ (ఆ 7. ప. 8.)

మూలమున "నీకుఁ బుణ్యమే తండ్రి, క్షాంతులే యాపన్నివారకంబులు, మనస్తుష్టియే ధనము. తక్కినయఖిలమును నలుఁడు. ఇఁకను నేను నీ కేమియును గాను. అని యేడ్చుచుఁ దనకూఁతుం బంపెను అని యర్థము. "దీనిని శ్రీనాథుఁడు మార్చి స్వేచ్ఛగాఁ జెప్పెను. ఈప్రకరణమునఁ గాళిదాసునిశాకుంతలములోని—

"శుశ్రూషస్వ గురూన్ కురుప్రియసఖీవృత్తిం సపత్నీజనే
భర్తు ర్విప్రకృతాపి రోషణతయా మా స్మ ప్రతీపం గమః
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యే ష్వనుత్సేకినీ
యాం త్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః.

అనుశ్లోకమును మనంబునఁ దెచ్చుకొని

సీ. పాటించికొలువుము భవనదైవతముల సవతులఁ గొనియాడు సఖులఁబోలె
నారాధనముసేయు మత్తమామల నెప్డుఁ బరిజనంబులమీఁదఁ గరుణగలుగు
మలుగకు కోపించినపుడు నాథునితోడ మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోడికోడండ్రతోఁ గూడిమాడి చరింపు దాసీజనముఁ బోవుతల్లికరణి

తే. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు, భక్తివిశ్వాససౌహార్దపరత నెఱపు
భవ్యపతిదేవతాచారపరమపుణ్య, ధర్మ మేమఱకుండుమీ తల్లి కాన. ఆ7. ప9.

శ్లో. మృతః స్మరతి జన్మాని మృతే క ర్మఫలోర్మయః
అన్యభుక్తే మృతే తృప్తి రిత్యలం ధూర్తవార్తయా.

ఈశ్లోకమును శ్రీనాథుఁడు—

క. మృతుఁడఁట పుట్టుం బెరుఁగును,మృతుఁడఁట వేఱొకఁడుకుడువ మేకొనుదృప్తిన్
మృతునకు నఁట కర్మఫలం, బతిధూర్తులవార్త లేటికావర్తింపన్. ఆ7.ప75.

అని సరిగాఁ దెలుఁగుచేసినాఁడు.

ఇట్లు కొన్నిచోట్ల వర్ణనలను సంక్షేపించియుఁ గొన్నిస్థలంబుల విస్తరించియుఁ గొండొకయెడల నిచ్ఛానురోధంబుగ మార్చియు, శ్రీనాథుఁడు వ్రాసినను మొత్తముమీఁద శృంగారనైషధము మాతృకానుసారిగా విలసిల్లుచుఁ దద్దయుఁ బ్రౌఢశైలి నొప్పారి పండితుల డెందంబుల కమందానందం బొడఁగూర్చుచుండు. కొన్నిచోట్ల శ్రీనాథునిపద్యములు మూలశ్లోకములకు మెఱుఁగువెట్టినట్లు తేజరిల్లెడు. నైషధంబు నీకరణి నాంధ్రీకరింప నిస్సీమసాహితీపాటవభాసమానుండును సరస్వతీదేవతానుగ్రహలబ్ధకవిత్వసామ్రాజ్యపట్టాభిషిక్తుండును నగు శ్రీనాథకవివతంసునకుఁ గాక సామాన్యకవుల కెంతయు నలవికాదు. కవికులాదృష్టాధ్వగమనుఁ డని శ్రీనాథుఁడు శ్రీహర్షునివర్ణించె. నిక్కము పరికింప శ్రీనాథుండును గవికులాదృష్టాధ్వగమనుఁడే.

శ్రీనాథుఁ డొనర్చినశివరాత్రిమాహాత్మ్యము జంగమువా రగు ముమ్మడిశాంతయ్య కంకితము కావింపఁబడినట్లు కృత్యాదిపద్యములచేఁ దెలియవచ్చెడు.

శా. .................... ......వాశ్రితోరస్థలీ
నాగాధీశవిశిష్టసంస్తవలసన్నాళీకపాదద్వయీ
ప్రాగల్భ్యం డగుశంకరుండు మనుచుం బ్రత్యక్షుఁడై యెప్పుడున్
యోగీంద్రాఖ్యుని ముమ్మడీంద్రసుతునిన్యుద్యుక్తశాంతాత్మునిన్.

శా. శ్రీరామారమణుం డశేషజగతీక్షేమంకరప్రక్రియా
భారాయత్తమనస్కుఁ డార్యజనసంభావ్యుండు భవ్యాత్ముఁడై
గారా మారఁగ నుమ్మమాంబికసుతున్ గౌరీశభక్తాగ్రణిన్
ధీరున్ ముమ్మయశాంతుని న్మనుచు సందీప్తాయురర్థాఢ్యుఁ గన్.

శైలిం జూపుటకై వెండియుఁ గొన్నిపద్యంబు లాకబ్బంబునుండి యుదాహరించుచున్నాను.

చ. హరిహరపద్మజాదు లగునాద్యులు సంతతభక్తియుక్తులై
చిర మగునిష్టసంపదలఁ జేకొని లోకములన్ సృజింపఁగా
నరుదుగఁ బ్రేమఁ బ్రోవ లయ మందఁగఁ జేయఁగఁ గర్తలైరి నీ
పరమహనీయతత్త్వ మనివార్యము సద్గుణశీల పార్వతీ !

తే. ప్రళయకాలంబుతుదఁ గాళరాత్రి చనిన, నపర మగు సర్గమునకు బీజాంకురంబు
శీతమును నుష్ణమును గాఁగఁ జిలుపచిలుప, గంధవాహంబు వీచు నిర్గంధ మగుచు,

సీ. అప్సరఃస్త్రీవోలె నకులి యై యారు యీ పైఁదలి కన్నులపంపు వయస్యాఁ
జారుయావనరూపసంపన్న యై లోకవన రేఖయునుబోలెఁ బెనఁచె వేడ్కఁ
బోలఁతి ప్రావృడ్వేళవోలె వినీలిమ ఘనవేణి యయి యిది గిరము మెఱసె
నిభరాజనిభయానయిదిశరదృతువుఁబోలెఁబుండరీకాక్షియైచాలుపుమిగిలె.
తే. ముట్టరానిది యైనట్టిమూర్తివోలెఁ, జిత్తరువువోలె దృష్టికచ్చెరువొనర్చెఁ [గు.
బోలఁతి మధుమాసకుసుమసమృద్ధివోలె, జాతివిరహిత యయ్యు సంప్రీతి నోసఁ
ఉ. యోగసమాధితత్పరత నున్నవిధంబున వాసినట్లు మూ
ర్ధాగమమిాలితాత్ముఁ డగునాకృతినిశ్చలదేహయష్టి యై
సోగకనుంగొన ల్నుదురుచాకుఁలకింకలు గాఁగ నత్తటిన్
రాగరసాతిరేకమున బ్రాహ్మణుఁ డాదటఁ జూచె మాలెతన్.

ఈగ్రంథము దొరకినప్రతి సమగ్రముగా లేదు. పెక్కుచోటులఁ బదములును బాతులును లుప్తములై యున్నవి. వేఱుప్రతులు దొరకినఁగాని పాఠములు సవరించి నిర్ణయించి యచ్చువేయింప ననువుగాకున్నది. పై పద్యములును నింకను నే నందందుఁ జూచినయితరపద్యంబులను జూడ నిది శ్రీనాథునిబాల్యదశయందో యావనదశయందో వ్రాయఁబడినట్లే తోఁచుంగాని శ్రీకొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగా రూహించినరీతిని జరమదశయందు వ్రాయఁబడినదని తోఁపదు. శైలి ప్రౌఢముగాఁ గన్పట్టదు. పదగుంభన మంతగా సన్నుతింపఁదగి యుండలేదు. వర్ణనలును నంతమనోహరముగాఁ గానంబడవు.

కాశీఖండభీమేశ్వరపురాణముల యాంధ్రీకరణముంగూర్చి చెప్పవలసి యున్నది. పురాణములను భాషాంతరముసేయుచోఁ గవికి స్వాతంత్ర్య మెక్కుడై యుండు. ఇష్టము వచ్చినట్లెల్ల గ్రంథసంకోచము గావించియు మూలమున నున్న కథలను విషయములను గొన్నిటిని ద్యజించియుఁ బూర్వాపరవ్యత్యయంబు గలుగునటులు కథానుక్రమణికను మార్చియు నిష్టమైనచోట వర్ణనలఁ బెంచియు, భాషాంతరము సేయుట పురాణకవులకు సంప్రదాయ మై యున్నది. యథామూలంబుగా నన్నివిషయంబులను విడువక తెలిఁగించునెడఁ గొన్నిచోటులఁ బునరుక్తియుఁ గొన్నిచోటుల నీరసత్వమును బొడసూపుట నిక్కువంబు. కొన్నిచోటుల, సహస్రనామము మొదలగు సంస్కృతమున నుండువానిం దెలుఁగున వ్రాయవలయునన్న నామాటలనే యెత్తి వ్రాయవలసియుండు. చదువరుల కింపు సమకూర్చుముఖ్యవిషయంబులను సరసంబుగ వచియించి జ్ఞానం బొదవించుటయే

పురాణకవులకుఁ గర్తవ్యంబు. కాశీఖండమును భీమేశ్వరపురాణంబును నీపద్ధతి నవలంబించియే రచియింపఁబడినవి.

సంస్కృతకాశీఖండమునం దేకచత్వారింశాధ్యాయంబున యోగప్రకారంబు గను విపులంబుగ నిరూపితంబు దానిని శ్రీనాథుండు క్రోడీకరించి యిరువది పద్యంబులలో ముగించె తెలిఁగించినపట్టుల మూలానుసారంబునఁ జెప్పియున్నాఁడు.

శ్లో. న తోయవహ్నిసామీప్యే న జీర్ణారణ్యగోష్ఠయోః
న దంశమశకాకీర్ణే న శ్మశానే న చ చత్వరే.
కేశభస్మతుషాంగారకీకసాదిప్రదూషితే
నాభ్యసేత్పూతిగంధాఢ్యే న స్థానే జనసంకులే
సర్వబాధావిరహితే సర్వేంద్రియసుఖావహే
మనఃప్రసాదజననే స్రగ్ధూపామోదమోదితే
నాతితృప్తః క్షుధార్తో న న విణ్మూత్రప్రబాధితః
నాధ్వఖిన్నో నచింతార్తో యోగం యుంజీత యోగవిత్ ॥

వ. దంశమశకాకీర్ణంబు గాక, కేశభస్మాంగారకీకసాదిప్రదూషితంబు గాక, జీవసంకులంబు గాక సర్వబాధావిరహితం బై సర్వసుఖావహం బై మనఃప్రసాదజననం బై కుసుమస్రగ్వాసనాధూపామోదమేదురం బైనప్రదేశంబున నతృప్తుండును నతిక్షుధార్తుండును విణ్మూత్రబాధితుండును జింతాకులుండును గాక నిమీలితాక్షుం డై చిత్తంబులు గూర్పక యింద్రియగ్రామంబు నియమించి ప్రాణాయామంబున కుపక్రమించునది.

శ్లో. హతాన్నిరుద్ధప్రాణోయం రోమకూపేషు నిస్సరేత్
దేహం విదారయత్యేష కుష్ఠాదిజనయత్యపి.

తే. యోగి యొయ్యొయ్య మరిగించి యనుపవలయుఁ
గుక్షిగోళంబులో గాలి కుంభకమున
బలిమి నిలిపిన రోమకూపముల వెడలి
యది ప్రకల్పించుఁ గుష్ఠాదు లైనరుజల.

శ్లో. తత్రాప్యాయితవ్యోసౌ క్రమేణారణ్యహస్తివత్
వన్యోగజో గజారిర్వా క్రమేణ మృదుతామియాత్.

ఉ. ఎంతయు ఘోర మైనవిపినేభము మెల్లన మస్తరించి మా
వంతుఁడు కంఠపీఠి గుదె వైచి సుఖంబున నెక్కినట్టు ల

క్రాంతము యోగసాధకుఁడు ప్రాణసమీరణము న్నిసర్గదు
ర్దాంతము మస్తరించి యవధానముమై ధరియింపగాఁ దగున్.

శ్లో. హకారేణ బహి ర్యాతి సకారేణ విశే త్పునః
హంసహంసే త్యతో మంత్రం జీవో జపతి సర్వదా.
అజపానామగాయత్రీ యోగినాం మోక్షదాయినీ
అస్యాః సంకల్పమాత్రేణ నరః పాపైః ప్రముచ్యతే.

వ. హకారంబున బహిర్గమనంబును సకారంబున నంతర్గమనంబును జే యుచు హంసహంస యనుప్రణవాంకురమూలభూతం బగునజపామంత్రంబున దివారాత్రంబు లిరువదియొక్కవేయి న్నాఱునూఱుమాఱు లుచ్ఛ్వాసనిశ్వాస రూపంబున జీవుఁడు జపించు. అమ్మహామంత్రంబు సంకల్పమాత్రంబున”

ఇట్లు మూలశ్లోకార్థములను సరిగా శ్రీనాథుఁడే తెనుఁగు చేసియున్నాఁ డు. మూలమున వర్ణనలు గలస్థలంబులలో వానినే స్వీకరింపక తనయిచ్ఛకు వచ్చినచొప్పునఁ గవితాచాతుర్యంబు మెఱయ నతిరమ్యంబుగ వర్ణనలు చేసి యున్నాఁడు.

(సం) సూర్య ఆత్మాస్య జగత స్తస్థుష స్తమసో రిపుః
ఉదియాయోదయగిరౌ శుచిప్రసృమరైః కరైః.
సంవర్ధయన్ సతాం ధర్మాన్న్యక్కుర్వం స్తామసీం స్థితిమ్
పద్మినీం బోధయం స్త్విష్టాం రాత్రౌ ముకుళితాననామ్
హవ్యకవ్యం భూతబలిం దేవాదీనాం ప్రవర్తయన్
ప్రాహ్ణాపరాహ్ణామధ్యాహ్న క్రియాకాలం విజృంభయన్.
అసతాం హృది వక్త్రేషు నిర్దిశం స్తమసః స్థితిమ్
యామినీకాలకలితం జగ దుజ్జీవయన్ పునః.
యామ్యాం భుక్త్వా తథాగ్నేయీం జ్వలంతీం విరహాదివ
లవంగైలామృగమదచంద్రచందనచర్చితామ్.
తాంబూలీరాగరక్తోష్ఠీం ద్రాక్షాస్తబకసుస్తనీమ్
లవలీవల్లిదోర్వల్లీం కంకోలీపల్లవాంగుళిమ్
మలయానిలనిశ్వాసాం క్షీరోదకవరాంబరామ్.
త్రికూటస్వర్ణరత్నాంగీం సువేలాద్రినితంబినీమ్
కావేరీగౌతమీజంఘాం చోలచోలాంశుకావృతామ్

సహ్యాదర్దురవక్షోజాం కాంచీకాంచీవిభూషణామ్
సుకోమలమహారాష్ట్రీ వాగ్విలాసమనోహరామ్.
అద్యాపి న మహాలక్ష్మీ ర్యాం విముంచతి సద్గుణామ్
సుదక్షదక్షిణాశామాశా నాథః ప్రతస్థివాన్
క్రమంతః సర్వ మర్వంతో హేలయా హేలికస్య ఖమ్.

వీనికి వ్రాసినపద్యము లెంతమనోహరములుగా నున్నవో యరయుటకై యిం దాపద్యముల మొదళ్లు సూచింపఁబడినవి.

సీ. చిఱుసానఁ బట్టించి చికిలి సేయించిన గండగొడ్డలి నిశాగహనలతకుఁ ....
సీ. ప్రాలేయకిరణ...
సీ. తఱపివెన్నెల...
తే. వర్ణములుగూడి ..
తే. ప్రాగ్దిశాకాంత...
చ. కమలములుల్లసిల్ల...
సీ. చరమరింఖా...
సీ. మలయాచలంబుపై...

శ్రీనాథునికవిత్వధాటి సురనదీలహరింబోలె ననర్గళధారావిలసితం బై పొలుపారును.

భీమఖండమును గాశీఖండమును శ్రీనాథునిగ్రంథంబులలో నత్యుత్తమంబులు నతిప్రౌఢంబులు నై కవికర్ణరసాయనంబులుగఁ దనరారును. ఏపద్యముఁ జూచినను రసవంతమై పదసౌష్ఠవంబునఁ జెన్నారుచు జిగిబిగింగులుకుచుఁ దేవియ లొలుకుచుండు ఈరెంటిలోను గాశీఖండము సారతరం బని తలంతు. ఆంధ్రంబునఁ బురాణకథలను గావ్యశైలిని వ్రాయుటకు దారిచూపినమహాకవి ప్రబంధపరమేశ్వరుఁ డనుబిరుదుఁ గాంచినయెఱ్ఱాప్రెగ్గడ. అమ్మహాకవినాథుని లక్ష్మీనృసింహపురాణము కావ్యముంబోలె సహృదయులడెందంబుల కాహ్లాదంబు సమకూర్చు. ఈమార్గము నభివృద్ధిఁజేసినవాఁడు శ్రీనాథుఁడు.

శ్రీనాథునిశృంగారనైషధము కేవలము కావ్యము గావున దానికావ్యగుణములంగూర్చి చెప్పవలసినది లేదు. భీమేశ్వరపురాణమును, గాశీఖండమును ప్రౌఢములగు మహాకావ్యము లనుటకు సందియము లేదు.

భీమఖండములో ద్వితీయాశ్వాసమున సూర్యాస్తమయచంద్రోదయవర్ణనలును బీఠికాపురవర్ణనమును బంచమాశ్వాసంబున వసంతర్తువర్ణనంబును గేవలము శృంగారరస భూయిష్ఠములై కోమలపదసముదయ సంకలితములై చదువఁ జదువ వెండియుఁ జదువఁ దలంపుఁ బుట్టించు. కొన్నిపద్యంబులు సరసులు చవిచూడఁ బద్యప్రారంభములు నుదాహరించెద.

చ. ప్రమదమదాతిరేకమున...

సీ. కాదుకా దుదయాద్రి... (ఆ 2. ప 42.)

చ వెలవెలఁబాఱె... (అ 2. ప 48.)

సీ. హేరాళముగఁ జల్లె నెలనాగ... (ఆ 5. ప 113.)

ఈగద్యములం గనుఁడు. కాదంబరియందలిగద్యమాలకును దీనికిని భేదము కానంబడదు.

వ. మఱియుఁ దత్సమయంబున... (ఆ 5. ప 99.)

వ. మఱియు నప్పురంబు దళిత...అనుగద్యమునం దంతంబున « వర్ణసాంకర్యంబు వాసవకోదండంబునందు యహిభయంబు వల్మీకములయంద,జీవనసంశయంబు వారిదంబులయంద, వృషాతిక్రమణంబు గృహంబులయంద...(ఆ 1. ప 109.)

భీమేశ్వరపురాణమున వ్యాసుఁ డగస్త్యునితోఁ దాను గాశిం బాసినకారణంబు చెప్పుపట్టునఁ బ్రతిపద్యంబును రసవంతమై యాయాభావంబులు చదువు వారియుల్లంబుల జనింపఁజేయు. కాశీఖండమునఁ జతుర్థాశ్వాసంబున గుణనిధివృత్తాంతమును బంచమాశ్వాసంబున ధనంజయవృత్తాంతంబును సప్తమాశ్వాసంబున మహానందమునిచరిత్రంబును నతిరమణీయ మగుసులభశైలి నొప్పారును. హరవిలాసంబున సిరియాళుచరిత్రమును, పార్వతీపరిణయకథయును, బరమేశ్వరుని దారుకావనవిహారవర్ణనంబును, గాలకూటభక్షణంబును,గిరాతార్జునీయకథయును జెప్పఁబడియున్నవి దీనిశైలి భీమఖండకాశీఖండములకైవడిఁ గఠినము కాక చక్కనిస్వభావోక్తులఁ దేజరిల్లుచు లలితమై యలరారు. కొన్నిపద్యములయారంభములు సూచించెదను.

సీ. జడలయల్లిక... (ఆ 2. ప 107.)

తే. పాలువోయించుకొని... (ఆ 2. ప 95.)

ఉ. పంకజరేణుగంధియగు... (ఆ 3. ప 61.)

ఉ. కమ్మనియూర్పుగాడుపుల... (ఆ 3. ప 71.)
ఉ. పుట్టువెఱుంగనెవ్వరికి... (ఆ 4. ప 29.)
సీ. ఎమిలిపాములతోడిసాగతెంబొల్లక... (ఆ 5. ప 5.)

శ్రీనాథుఁడు మహాశివభక్తుఁడు శివుని వర్ణించు నవసరముల నిమ్మహనీయున కొడలు మఱచినచందంబు దోఁచును. ఎన్నిచందంబుల నప్పరమేశ్వరునిమాహాత్మ్యంబును సన్నుతింప శక్యమౌ యన్నిరీతులను మనసార నభివర్ణించి యున్నాఁడు.

సీ. పాటలంబగు (హర) ఆ 3. పద్య 19
సీ. పంచాక్షరీమంత్ర... ,, ఆ 3. ప. 28.
సీ. శ్రీకంధరునిఁ బ్రతిష్ఠించు.... ,, ఆ 3. ప. 99.
సీ. వణఁకుగుబ్బలి... ఆ 3. ప 184.
శా. సందర్శించిరి... ఆ 3. ప 185.
సీ. శ్రీభీమనాయక శివనామధేయంబుఁ జింతింపనేర్చిన జిహ్వజిహ్వ. ఆ 3. 197.

ఈపద్యంబును సీ. "కమలాక్షునర్చించు కరములుకరములు." అనుభాగవతపద్యముం బోల్చి చూచుకొనునది

శ్రీనాథునిగ్రంథములలో నెల్ల నన్నిచందంబులను జాల నుత్కృష్టమైన కావ్యము కాశీఖండము. ఇందలిరచనలు సహృదయానందజనకంబులై లోకోత్తరములై రసపోషకంబులై కర్ణామృతంబులుగా నుండును. ఏవిషయముం జూచినను హృద్యముగా నుండును. ఈతనిరచనలలో సంస్కృతము బహుళంబును నాంధ్రపదంబు లల్పంబులు నై యుండును నైషధమునకంటె భీమఖండంబునను దానికంటె హరవిలాసంబునను దానికంటెఁ గాశీఖండమునను దెనుఁగుపదము లెక్కుడుగాఁ గానంబడియెడు.

సీసపద్యములు వ్రాయునేర్పు శ్రీనాథుని కమరినచందంబున నితరాంధ్రకవుల కెవ్వారికిని గుదిరినది కాదు ఇతనిసీసపద్యములుంబోలె సరసంబు లగునవి యాంధ్రవాఙ్మయంబున నెందును లేవు ప్రతిసీసపద్యమును యతిస్థానంబులను పాదాంతములను బదవిశ్రాంతి గలిగి సమపదవిన్యాసంబులు సొంపుమీఱ సమతయనుకావ్యలక్షణంబు గలిగి చెన్నారును. చూడుఁడు.

సీ. ధరియింప నేర్చిరి.... (కాశీ. ఆ 1. ప 37.)
సీ. కండూయనము సేయు. (కాశీ. ఆ 2. ప 43.)

సీ. అనుదినంబును బ్రాతరారంభ (కాశీ. అ 3. ప. 212)
సీ. అరుణాంశుమండలం... (కాశీ. ఆ 5. ప 49.)
సీ. వలుదచన్నుల... (కాశీ. ఆ 5 ప 52.)
సీ. తరుణేందు...... (కాశీ. ఆ 4. ప 66.)
సీ. ముడువంగ నేర్తురు... (భీమ. ఆ ప 94.)
సీ. ఎచ్చోటఁదాఁబాటె... (భీ. ఆ 3. ప 37.)

శ్రీనాథుని కుభయభాషలయందలి శబ్దజాలం బంతయు సరస్వతీదేవి యనుగ్రహంబునం గాఁబోలు మనంబున కెట్టయెదుట నత్రాంతము సాక్షాత్క-రించుచుండినట్లు కానంబడు. కావునరచనలు సేయునపుడు శబ్దజాలంబులుతమం తన యహమహమికతోడంబోలె నిక్కవీశ్వరుని మ్రోలఁ గన్పట్టు.

సీ. ముక్కంటిదరహాసమున... (భీ. ఆ 1. ప 53.)
సీ. ప్రతిబింబమోకాని... (కాశీ. ఆ 4. ప 191.)
క. సిగ్గువడివిరియఁబాఱెరి . (కాశీ ఆ 7. ప 87.)

శ్రీనాథునికవిత్వంబును దరువాతికవులు గడు నాదరంబునఁ బాటించుచు నతనిచూపినత్రోవలం గయిత సేసిరి. వారిలో నగ్రగణ్యుఁ డల్లసాని పెద్దన.

సీ. గిరినికుంజములఁ గుంజరపుంజ .. భీమ. ఆ 2. ప 35.

దీనింబోలె నల్లసాని పెద్దన

సీ. ఉరుదరీకుహరసుప్తోత్థ (మను ఆ 3. ప 11.)
సీ. త్రసరేణుపరిమాణ ధాతుధూళీపాళి... (కాశీ. ఆ 1. ప 90)

దీనికై వడినె పెద్దన.

సీ. చేర్చుకర్ గానిడ్డ... (మను. ఆ 1 ప 5.)
సీ. నలినసంభవువాహనము... (శృ. నై. ఆ 1.)

దీనిచందంబునఁ బెద్దన.

సీ. చిన్ని వెన్నెలకందు... (మను. ఆ 2. ప 43.)

ఇట్లు పెద్దన శ్రీనాథునికవిత్వ మార్గమును గరం బనుసరించియుఁ బూర్వ కవులను వినుతించునపు డికవినాథుని పేరుం బేర్కొనమి శోచనీయము. రామ రాజభూషణుం డాదికవుల నుతించుచో—

“ మహిమ మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా

మహాత్ములై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

వసు ఆ 1. ప 10

అని శ్రీనాథుఁ డాంధ్రవాఙ్మయమును పోషించినట్లు గొప్పగాఁ బొగడి యున్నాఁడు.

శ్రీనాథుఁడు జాతీయములను లోకోక్తులను బ్రయోగించి రసము పుట్టించుటయం దెంతయు నేర్పరి.

ఆలు మగఁడు నొకకుత్తుకైనఁగాక, యిట్టిధర్మంబు మిన్నక యేలకలుగు
(హర.) ఆ 2 ప 60.

ఎదిరికోరికె మెఱుంగుట యెట్లు పుట్టియా చూడఁగ దోసకాయలెయవ్వ చిత్తముల్. (హర.) ఆ 2 ప 63.

ఆవగింజంత భూతి మైనలఁదికొనిన, వెలఁది గుమ్మడికాయంత వెట్టి పుట్టు.
(హర) ఆ 2. ప 99.

మగవాఁడో మానో యనుమాట. (హర) ఆ 2. ప 100.

పడితిమికుక్కలుం బడనిపాటులు.
గర్భయాచకులభంగి. } హర. ఆ 3. ప 15.
పాలలోఁ బడినబల్లులకైవడి.

తాత కట్టించినచెఱువంచుఁ దగునె మునుఁగ. కాశీ. ఆ. ప 294.

తత్క్షణమునంద తమయాంత్రోత్రాళ్లు తెగవె. కాశీ. ఆ 7. ప 60.

ఒట్టు వెట్టినభంగినే యుగ్మలియును.
పిలిచి యొకపట్టెఁడన్నంబుఁ బెట్టదయ్యె. } కాశీ. ఆ 7. ప 135.

చేలపంటలఁ గొయ్యలే చెప్పఁగాదె కాశీ. ఆ 7. ప 143.

అరఁటాకుఁ జూచినన్ ఝల్లనెగుండె. భీమ. ఆ 2. ప 134.

గోత్రక్రొవ్వియు సెలకట్టెఁ గొఱికినట్లు. భీమ. ఆ 4. ప 52.

పాడుచేసితి గృహము నిర్భాగ్యురాల. కాశీ. ఆ 4. ప. 108.

సంస్కృతమున దీర్ఘసమాసములను బ్రౌఢముగా రచియించుటలో శ్రీనాథుఁడు పెట్టినది భిక్ష యని చెప్పఁదగు. తరువాతి గొప్పకవు లీసందర్భంబునను నీతనిమార్గం బనుసంధించిరి.

సీ. దోర్దండఘట్ట  కాశీ ఆ 1 ప 126

దీనింబోలె రచింప నెంచికాఁబోలుఁ దద్దయుఁ గఠినసమాసపదములఁ గృష్ణదేవరాయం డాముక్తమాల్యదలో—

సీ. స్యందనస్థితబిడౌజఃకుత్స్రజాడ్యకృద్ఘుంఘుమాగుద్గురుజ్యాత్కృతములు
క్రవ్యాశిరాడ్దాత్రికనదసృగ్గాహనస్ఫుటశల్య హవ్యభుక్ఛ్వాత్కృతములు
యోధవర్తితహృత్పుటోత్క్రాంతనిజపాతసాలాక్షకృతముహుస్థాత్కృతములు
పతితోగ్రరక్షఃకబంధభారభృశార్తిభుగ్న భోగఫణీంద్రఫూత్కృతములు

తే. శ్రాంతరథ్య నిరంతరచ్ఛాయదములు, దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు
కలుషము లడంచుఁ గాత లంకాపురాంగ, ణాంబరచరతటలంబకదంబకములు
  (ఆ 4. ప 27.)

అని యత్యంతకఠోరముగా వ్రాసెను

శ్రీనాథుఁడు చెప్పినదీర్ఘసమాసము లింతకటువుగాను వెగటుగాను నుండవు

ఇతనిసంస్కృతవ్యాకరణప్రావీణ్యంబును జూపుట కెన్నియో ప్రయోగంబు లితనికావ్యంబులలోఁ గానంబడు. వాని నిటఁ జూపుటకు గ్రంథవిస్తర భీతిచే విరమించితి హరవిలాసము ఆ 7. ప 59 లో "వాగ్వివాద మిం కేటికిఁ" అనియున్నది. వాగ్వివాద మనుప్రయోగమును "ఉపసర్గస్యఘఞ్యమనుష్యే బహుళం" (పాణిని 6. 3. 122.) అనుసూత్రముచే సమర్థింపవచ్చును.

భీమఖండమున. ఆ 2 ప 114 లో

"భిక్ష లేదని యింత కోపింతురయ్య, కాశికాపట్టనముమీఁదఁ గానినేయ"

అనుచోఁ "గానినేయ" అని వ్యాసుని సంబోధించిన ట్లున్నది "కానీన" అని రూపమగుం గాని "కానినేయ" అనురూప మెట్లు సాధువో యెఱుంగఁ జాలకున్నాఁడ. పండితులు విమర్శింపఁ గోరెద.

ఇతఁడు లోకజ్ఞుండు గావున లోకములోనిమానవులను వస్తువులను మనోగతభావములను జకటనిస్వభావోక్తులచే మనోహరంబుగా వర్ణించి జనులయుల్లంబులఁ బల్లవింపఁజేయు.

ఇక్కవిచంద్రునిహరవిలాసమువలన నాకాలమం దీదేశమువారికిని ద్వీపాంతరములవారికిని వర్తకవ్యాపారములు జరుగుచుండె నని తెలియవచ్చుచున్నది.

మ. తరుణాచీనితవాయి గోవరమణాస్థానంబులం జందనా
గరుకర్పూరహిమాంబు కుంకుమరజః కస్తూరికాద్రవ్యముల్

శరధిం గప్పలి జోగులన్ విరివిగా సామాన్లఁ దెప్పించునే
ర్పరి యావైశ్యకులోత్తముం డవచితిప్పం డల్పుఁడే యిమ్మహిన్. ఆ 1. ప 27.

తే. పండువాఢిల్లి రాఢాది పట్టనముల, యధిపతులు మాళిఁ దాల్చురత్నాంకురంబు
లవచిత్రిపురాంతకానీత యానపాత్ర, సింహళద్వీపమండలక్షేత్రజములు.
ఆ 1. ప 28.

మనుజులయాచార వ్యవహారంబులును గుణంబులును నీతనికావ్యముల యం దింపుగా నభివర్ణింపఁబడి యున్నవి గుణనిధివృత్తాంతమున నతఁడు జనకునికిఁ దెలియకుండ దురోదరపరాయణుండై క్రీడించుచు నెత్తంబున నోడినవిత్తంబు తల్లి మేనిరవణంబుల నమ్మి కితవులకుఁ బెట్టుచుండఁ దనరత్నాంగుళీయకము నొక జూదరి వ్రేల నున్నఁ జూచి గుణనిధితండ్రి తనభార్యపైఁ గోపించి యాడినమాటలును నయ్యతివ చెప్పిన ప్రతివచనంబులును, దద్దయుఁ జమత్కారములై స్వభావావిరుద్ధములై తనరారు. కాశీ. ప 181-185.

ఇంకను శ్రీనాథునికవిత్వమునం గలచమత్కారంబులగుఱించి వక్తవ్యంబులు పెక్కులు గలవుగాని యిప్పటికే యీయుపన్యాసము చాలవిసుగుఁ బుట్టించునంత పెద్దది యయ్యె నని వగచి వానిం జెప్పనైతి కవిత్రయమువారు దక్క శ్రీనాథునిఁబోలెఁ బ్రౌఢమనోహరంబుగాఁ గావ్యములు నిర్మించినకవు లాంధ్రంబున లేరని యెలుంగెత్తి యెందైనను జెప్పవచ్చు నని నాభావము. ఇట్లుండఁ జిన్నయసూరియు సీతారామాచార్యులును వీరేశలింగ పంతులుగారును నాచనసోముని గవిత్రయమువారికంటె నుత్కృష్టునిగాఁ జెప్పుట యతిశయోక్తి యని తలంచెద ఎఱ్ఱాప్రెగ్గడహరివంశముతో నేవిధంబునను బోలనేరని యుత్తర హరివంశమును రచించినసోమనాథుని కట్టియున్నతపదవి నొసఁగ నామనస్సు గొలుపదు. ఈయిరువురకవిత్వంబులం గలతారతమ్యంబులను బ్ర॥ శ్రీ అనంతకృష్ణ శర్మగారు ప్రకటించినయుపన్యాసములో నతివిపులముగాను సయుక్తికముగాను బ్రదర్శించియున్నారు. దానియం దరయునది కృష్ణదేవరాయలు శ్రీనాథుని కావ్యములకు సరిరాని యొక్క మనుచరిత్రమును వ్రాసిన పెద్దన కవిత్వపటిమకు సంతసించి యాంధ్రకవితాపితామహుండను బిరుదు నొసంగెఁ గదా. ఆరాజన్య మూర్ధన్యుని యాస్థానంబున శ్రీనాథుఁ డుండి తనగ్రంథముల నతని కంకితము చేసి యున్నచో నెట్టిబిరుదము నొసంగియుండునో తెలియరాకున్న యది. నాచన సోమునికవనము సర్వవిధములను గవిత్రయమువారి కవనమునకు శ్రీనాథుని

కవనమునకును సరిరాదనియే నాయభిప్రాయము సోమునికవనంబునకంటె శ్రీ
నాథునికవనము చాల మేలైనదని తలంతు ఈవిషయమై నాయభిప్రాయంబున
బ్ర శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారును బ్ర శ్రీ రాయదుర్గము నరసయ్యశాస్త్రి
గారును నేకీభవించియున్నారు కీర్తిశేషులైన శతఘంటము వేంకటరంగశాస్త్రి
గారియాశయంబు నిదియె.

శ్రీనాథుఁడు పరమశివభక్తుఁ డయ్యును నారీలోలుఁడై వర్తించె నని
లోకులు నుడువుదురు వీధినాటకములోనిపద్యములఁ జూడఁ దత్కవి యట్టివాఁడు
గాఁబోపు నని తలంపవలసియున్నది. వీధినాటకము శ్రీనాథకవిరచిత మగునో
కాదో యనుసందియంబు గలుగుచున్న దని నుడివితిఁ గదా ఇఁకను శ్రీనాథుని
సుప్రసిద్ధకావ్యములలో నీవిషయమై యూహింప నేమేని సామగ్రి గలదా యని
యారయ భీమేశ్వరపురాణంబున—

సీ. హాలహాలంబను నల్లనేరేడుపండు మిసిమింతుఁడును గాక మ్రింగినాఁడు
పెనుఁవ్రేలికొనగోర బిసరుహాసనుమోముఁ గెందమ్మివిరివోలె గిల్లినాఁడు
పంచవన్నియతోడఁ బ్రసవనారాచుని నెఱ్ఱిచిచ్చుఱకంటఁ జుట్టినాఁడు
మెఱుఁగుఁగోఱలుదుల్ల మృత్యుదేవతనోరు దట్టించి యఱకాలఁ దన్నినాఁడు.
తే. త్రిపురదైత్యావరోధనారీవిలాస, దంతతాటంకముల కెగ్గుదలఁచినాఁడు
దక్షపురిసానికూఁతులఁ దపిలినాఁడు,విశ్వలోకకుటుంబి భీమేశ్వరుండు.ఆ 1. 111.

మ. ఎనయంగల్గినకూర్మి భృంగిరిటిఁగానీ తండుఁ గానీ నికుం
భునిఁ గానీ కయిదండపట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం
గనలం గన్నుమొఱంగి యప్సరమునం గన్నెఱుకాఁదారిప్రొ
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబులన్. ఆ 1. ప 112.

అనుపద్యములను జదువునప్పుడును—గాశీఖండములోని

సీ. ముడువంగ నేర్తురు మూల దాపటికి రాఁ జికురబంధము వీఁగి జీరువాఱఁ
బొన్నపువ్వులఁ బోలుపొక్కిళ్లు బయలుగాఁ గట్టనేర్తురు చీర కటిభరమునఁ
దొడువంగనేర్తురు నిడువ్రేలుఁజెవులందు నవతంసకంబుగా నల్లిపువ్వుఁ
బచరింపనేర్తురు పదియాఱువన్నియ పసిఁడిపాదములిలఁ బట్టువెంపఁ
తే. బయ్యెదయుసిగ్గుఁబాలిండ్లఁబ్రాఁకనీక,తఱచుప్రాయుదురొడల గందంపుఁబసపు
బందికత్తెలు సురతప్రపంచవేళఁ, గంచియఱవత లసమాస్త్రఖడ్గలతలు.
(కాశీ.) ఆ 3. ప 109.

అనుపద్యమును జదువునప్పుడును శ్రీనాథుని దెసం గలిగినలోకాపవాదంబునకుఁ గొంతయేని కారణం బుండు నని యూహింపవలసియున్నది. అది యెట్లున్నను శ్రీనాథుని కవననైపుణిం గూర్చి విచారింతుమేని యది యనన్యసామాన్యం బని యొప్పుకొనక తప్పదు. అమ్మహాకవివరేణ్యుని కల్పన లనల్పంబులు, రచనలు రసవంతములునై చవులు పుట్టించు. ఇంతప్రౌఢముగాను నింతసరసముగాను గావ్యములు వ్రాయుట కడు దుష్కరము. ఇతనిగ్రంథములు చదువఁజదువఁ దనివినొందింపవు. ఆంధ్రభాషను లెస్సగా నభ్యసించి పాండిత్యముఁ బడయఁ గోరువారలు, కవిత్రయమువారికబ్బంబులకుఁ బిదప శ్రీనాథునికావ్యములనే విశేషముగాఁ బఠింపవలయు. ఎంతప్రయత్నించినను శ్రీనాథునిశైలి ననుకరించి కవిత సేయుట సులభంబు గాదు.

ఈయుపన్యాసంబున నేపట్టుననైనను దోషంబు లున్నను నవక్తవ్యోక్తి వక్తవ్యత్యాగము లున్నను సదయహృదయు లయి తెలిపి నన్ను మన్నింప విపశ్చిద్వరేణ్యుల నభ్యర్థించెద.

నాగపూఁడి కుప్పుస్వామయ్య.

# సంకుసాల నరసయ్య.

నే నిందుఁ గవికర్ణరసాయనకర్త యగుసంకుసాల నృసింహకవియొక్క కవిత్వమును విమర్శింపఁ దలఁచుకోలేదు. ఇప్పు డానిరర్థకవిస్తరము గల్గించుకార్య మున కవకాశమును, ఆవశ్యకతయు లేదు. ప్రకృతము నేను దమయెదుట నివే దింపఁబోవువిషయ మాతనికాలము. ఈవిషయ మెంతయల్పమో యంతగణనీ యము గూడ నగు ననుట కవిచరిత్రవిమర్శనోత్సాహులకు నే వేఱవిన్నవింపఁ బని లేదు.

ఇతనింగూర్చినకింవదంతి యొకటి గలదు. ఇతఁడు శ్రీకృష్ణదేవరాయల కాలమునఁ గవికర్ణరసాయనమును బూర్తిగ రచించుకొనివచ్చి, యప్పటితదాస్థాన కవులలో నగ్రగణ్యుఁ డగునాంధ్రకవితాపితామహునకుఁ జూపి తన్మూలముగా రాజాస్థానమునఁ బ్రవేశింపఁ గోరఁగాఁ దనమనుచరిత్రముకంటె నీకవికర్ణరసాయ నమే శ్రేష్ఠతరముగా నుండుటచేఁ బెద్దన యితనికి రాజద్వారమునఁ బ్రవేశించు టకే యవకాశ మీయ లేదఁట. తరువాత నితఁడు కొన్నాళ్లు వేచివేచి వెచ్చము నకై కొన్నిపద్యముల నమ్మి జీవించుచుఁ దుదకు నిరర్థకప్రయాసుఁడై విసివి, యిఁకఁ దనగ్రంథమును రాజాంకితముఁ జేయ నని యభావవైరాగ్యమును దెచ్చు కొని ప్రతిజ్ఞచేసి, శ్రీరంగక్షేత్రమునకుఁ బోయి, శ్రీరంగనాథదేవునకుఁ దన కృతి నర్పించి కృతార్థుఁ డయ్యెనఁట! కావుననే యితఁడు రాజులను దనగ్రంథ మున నిట్లతితీవ్రముగా దూషించెను.

సీ. ఆందోళికలయందు నంతరచరులైన సవికృతాకృతుల పిశాచజనులు,
పరకరాళంబులై ప్రార్థింపఁ గనుఁగోక వాయెత్తకుండుజీవచ్ఛవములు,
వాలవీజనములఁ గ్రాలుచు నీఁగకు నంటీని ఖరవర్తులాండసములు,
వేత్రపరంపరావిలకంటకాకృతిఁ జేరఁబోరాని బర్బూరతరులు
శంఖనాగస్వరస్వరశ్రవణసమద, విస్ఫుటచ్ఛత్ర విస్ఫారితస్ఫటాక
విష్టవిషవైద్యవశవర్తిదుష్టఫణులు, ప్రభుదురాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు?

జీవనార్థ మతఁ డమ్ముకొనిపోయిన పద్యములలో నొకటి యిందుఁ బడి యందుఁబడి తుదకు రాయలకూఁతు రగుమోహనాంగిదేవికడకుఁగూడఁ బోయె ను. ఒకనాఁడు రాయలు కూఁతుతోడఁ జదరంగమాడుచుండఁగా, నతనిమంత్రి,

యేనుఁగు మొదలగుకాయలనడుమ నిరాధార మై చిక్కుకొని చావనున్న తన పేదను దీసి వేశ్యాకయింటి కాడుచు నాయమ “ ఉద్ధతులమధ్యమునఁ బేద కుండఁదరమె ?” యన్నదఁట ! పద్యముఁ బూర్తిగాఁ జదువుమని యడిగి రాయలు,

> “ ఒత్తుకొని వచ్చుకటికుచోద్వృత్తిఁ జూచి
> తరుణితనుమధ్య మెచటికో తలఁగిపోయె;
> నుండెనేనియుఁ గనఁబడకున్నె యహహా !
> యుద్ధతులమధ్యమునఁ బేద కుండఁదరమె?”

యని యామె చదువఁగా, నామెవలన సమస్తవృత్తాంతము నెఱిఁగి పెద్దనదౌష్ట్యమునకును దనదురదృష్టమునకును జాలఁ జింతించెనఁట !

ఈ కాళ్ళులేనికథనే నమ్మఁ గలిగినంతవఱకు నమ్మి కవిజీవితములును గవిచరిత్రమును నితఁడు శ్రీకృష్ణదేవరాయలకాలమువాఁడని విశ్వసించినట్లు తోఁచుచున్నది. కాళిదాసుఁడు, బాణుఁడు, దండి, భవభూతి మొదలగు, నొకరి మొకరింకొకరు చూడని, సంస్కృతకవుల కెల్ల భోజరాజసభవలె, శ్రీకృష్ణదేవరాయల ‘భువనవిజయాఖ్యసంసద్భవనము’ పరస్పరసంబంధము లేని యనేకాంధ్రకవులకు నిష్కారణముగా నాశ్రయ మిచ్చిన దని వాడుకలు వాకొనుచున్నవి. పైగాథ సంకుసాల నరసయ్యను గృష్ణదేవరాయలకాలపువానిఁగాఁ జేయుటయే కాక, తన్మూలమునఁ బెద్దనార్యునియం దసహాన మనునొకగొప్పదోషముఁగూడ నారోపించినది. పెద్దనార్యుఁ డాంధ్రకవితాపితామహుఁ డైనమాత్రమున నతనికి మనుష్యసామాన్యసహజము లగునసూయాద్వేషాదు లుండ వనుట యుక్తము గాదని నే ననలేను, గాని, నిరాధారముగాఁ గలదని నమ్ముటమాత్రము చాల నన్యాయ్యము. పై నమ్మిక నిరాధార మని చూపుటయే నాప్రకృతోద్దేశము.

నరసకవికాలముఁ గనిపట్టుట కాధార మతనిగ్రంథమందే కొంత గలదు. ఇతఁడు తన్నుఁగూర్చి,

> “ గురువరభట్టపరాశర, చరణసరోరుహసముల్లసన్మానసుఁడన్
> నరసింహనామధేయుఁడ ” ననియు,

“ ఇది శ్రీ భట్టపరాశరదేశికేంద్ర చరణసరసీరుహ సేవకోపసేవకుఁ” డనియుఁ గృత్యాద్యంతములందుఁ జెప్పుకొనియున్నాఁడు. కాఁబట్టి భట్టపరాశరుఁ డితనికి విద్యాగురువు గాఁజాల కున్నను వైష్ణవదీక్ష నొసఁగినవాఁ డని తేలుచున్నది.

శ్రీవైష్ణవాచార్యపరంపరలోఁ బ్రఖ్యాతు లగుభట్టపరాశరు లిరువురు

గలరు. అందు మొదటి యాతఁడు శ్రీరామానుజాచార్యుల శిష్యు లగుశ్రీవత్స చిహ్నమిశ్రుల జ్యేష్ఠకుమారుఁడు, శ్రీసహస్రనామభాష్యకర్త. మనకవి యీతని శిష్యుఁడు కానేరఁడు. కారణము ముందు విన్నవింతును.

రెండవభట్టపరాశరుఁడు శ్రీవైష్ణవాచార్యులలోఁ బ్రఖ్యాతతములై, కవితార్కికసింహ సర్వతంత్రస్వతంత్రాది బిరుదాంకితు లగు శ్రీవేదాంతదేశికుల శిష్యుఁడు. మొదటిపరాశరభట్టు తమ్మునిమనుమఁ డగుశ్రీభట్టసుదర్శనాచార్యుని కుమారుఁడు. ఈసుదర్శనాచార్యులే భగవద్రామానుజవిరచిత మగుశ్రీశారీరక బ్రహ్మసూత్రభాష్యమునకు శ్రుతప్రకాశిక యనువ్యాఖ్యానము రచించెను. వీరందఱును శ్రీరంగక్షేత్రవాసులు. పదునాల్గవశతకపుటాదిభాగమున అల్లాయుద్దీనుచేఁ బంపఁబడిన మల్లిక్కాఫిరుసేనలు దక్షిణమధుర నాక్రమించుట సుప్రసిద్ధ విషయము. ఆసేనలు వచ్చునప్పుడును బోవునపుడును త్రోవలోని ముఖ్యపట్టనముల నెల్ల వీరైనంతవఱకుఁ బాడుచేసెను. శ్రీరంగక్షేత్రముగూడ నామహమ్మదీయసేనలదాడికి లోపడినదయ్యెను. అనేకశ్రోత్రియబ్రాహ్మణు లప్పు డాయబ్రహ్మణ్యములకుఁ బాత్రులైరి. అట్టివారిలోఁ బైనివిన్నవించిన శ్రుతప్రకాశికా కర్తలగుసుదర్శనాచార్యు లొక్కఁడు. తురకలదెబ్బలచేఁ బ్రాణములు విడుచుచు నాతఁడు సమీపమం దున్నవేదాంతదేశికులను బిలిచి తనరచించినశ్రుతప్రకాశికా గ్రంథమును గుమారులనిద్దఱను వారిచేత నర్పించి "ఈకుమారులను రక్షించి యీగ్రంథమును బ్రచురపఱుపు" మని వేఁడుకొనెను. వేదాంతదేశికులును నందు కంగీకరించి, యాకుమారులతోడను బుస్తకముతోడను బీనుఁగుపెంటలమఱుఁగున డాఁగియుండి, తురకలదండు వెడలిపోయినవెంటనే యీదేశమున నిఁక నుండరాదని పయనమై మైసూరుసమీపమున నున్నసత్యమంగళక్షేత్రమునకు వచ్చి యందు నివాస మేర్పఱుచుకొనిరి. ఆయిరువురుకుమారులకు నుపనయనాదు లందే జరిగించిరి. తరువాతఁ బదునాలవశతకపుమధ్యభాగమున శ్రీవిద్యారణ్యులచే స్థాపింపఁబడిన విజయనగరసామ్రాజ్యసూర్యుని యుదయముచే దక్షిణమందు నెలకొనియుండిన మహమ్మదీయుల చంద్రధ్వజము లస్తమించెను. అప్పుడు వీరు మరల స్వదేశముఁ జేరిరి.

పైకథవలన భట్టపరాశరులకాలము నించుమించు నిష్కర్షముగా మనమెఱుఁగవచ్చును. శ్రీవేదాంతదేశికాచార్యులు ౧౨౬౮వ క్రైస్తవశతాబ్దమున జన్మించి, ౧౩౭౦వఱకు, నననఁగా నూటరెండువత్సరములు జీవించియున్నవారు.

ఈవిషయమున, " శ్రీధీయోగ్యే శకే శుక్ల ఉదభూ ద్వేంకటేశ్వరః
లబ్ధప్రాయే శకే సౌమ్యే ప్రాయా త్స పరమంపదమ్"
అను నాచార్యచరిత్రవాక్యము ప్రమాణము. ౧౭౧౦వ వత్సరమున మహమ్మదీయులు మధురానగరము నాక్రమించిరి. అప్పు డుపనయనముకూడఁ గానివయసున, ననఁగా నెంతయెకుల వైనను బదేండ్లు నిండక యున్నవారు భట్టపరాశరులు. శిష్యుఁడును గురువువలె నూఱేండ్లు జీవించియుండె ననుకొన్నను బదునాల్గవశతకము ముగియులోపల నతఁడు బరమపదముఁ జేరి యుండవలయును.

ఈరెండవభట్టపరాశరులే మనసంకుసాల నరసకవికి గురువులు. ఈవిషయము నీక్రింది కవికర్ణరసాయనమునందలి పద్యము స్ఫుటముగా సూచించుచున్నది.

శా. "జ్ఞానప్రౌఢమహాకవీశ్వరవచస్సంస్తూయమానుండు ల
క్ష్మీనాథుండు మదల్పవాక్యరచనాస్వీకర్త గాకుండునే?
నానాభూపతు లెల్లఁ గానుకలు రత్నశ్రేణు లర్పింపఁగా
ధానాముష్టిముచుఁ గుచేలుఁ గరుణన్ ధన్యాత్ముఁగాఁ జేయఁడే"

ఈపద్యపుఁ గడపటిపాదమందలి "ధానాముష్టిముచుఁ గుచేలు" ననుపదము శ్రీవేదాంతదేశికులది. శ్రీమాధవవిద్యారణ్యులు విజయనగరసామ్రాజ్యమును నెలకొల్పినపిదపఁ, దనసహాధ్యాయు లగుశ్రీవేదాంతదేశికుల రిక్తదశను గాంచి కనికరించి, మారాజాస్థానమునకు విచ్చేసినచో మీపాండిత్యమునకుఁ దగినట్లు బహూకరింపఁ జేయుదు నని విజయనగరమునుండి చెప్పి యంపఁగా, నందుకు బదులుగా దేశికు లైదుశ్లోకముల వ్రాసి పంపిరి. ఆశ్లోకము లైదింటికి వైరాగ్యపంచక మని పేరు. ఈక్రిందిశ్లోక మాయైదింట నొకటి,

"క్షోణీకోణశతాంశపాలనకలా దుర్వారగర్వానల
క్షుభ్యత్క్షుద్రనరేంద్ర చాటురచనా ధన్యాన్ న మన్యామహే,
దేవం సేవితుమేవ నిశ్చినుమహే, యోఽసౌ దయాళుః పురా
ధానాముష్టిముచే కుచేలమునయే దత్తే స్మ విత్తేశతామ్"

ఈకడపటిప్రౌఢప్రయోగమునే నరసకవి యనువదించినాఁ డనుట స్పష్టము. తనకుఁ బరమాచార్యులు గావుననే వారిపద్యభాగ మిట్లు కవి యనువదించెను.

మఱియు, వేదాంతాచార్యులు శ్రీశాంకరమతమునకుఁ బ్రబలశత్రువు. శ్రీశంకరాచార్యమతానుయాయుల నందఱను 'ప్రచ్ఛన్నబౌద్ధు' లనుమాఱుపేర వారు పిలుచుచుందురు. వారిప్రశిష్యుఁడు గావుననే నరసయ్యయుఁ బంచమాశ్వా

ప్రాంతమున, 'లక్ష్మణమునీంద్రుఁడు,' అనఁగా రామానుజాచార్యులు, 'ప్రచ్ఛన్నబౌద్ధదుస్సహహృచ్ఛర' మని పలుకుచుఁ, బరమతద్వేషమున నాగువురునకుఁ దానుదగినశిష్యుఁ డనిపించుకొన్నాఁడు.

మఱియుఁ బంచమాశ్వాసమున వసిష్ఠమహర్షి మాంధాతకు వైష్ణవమతము నుపదేశించుసందర్భమునఁ, బ్రపత్తియోగమును విపులముగ వివరించియున్నాఁడు. దీనికే శరణాగతి యనియు, భరన్యాస మనియు శ్రీవైష్ణవుల సంకేతము. దీనిని బ్రచారమునకుఁ దెచ్చినవారు శ్రీవేదాంతదేశికులె.

"ప్రపత్తియు సకలార్థసమీహితార్థసాధనమనఘా!"
"శరణాగతులకుఁదక్కం బరులకు మోక్షంబులేదు"
ఇత్యాదిస్థలముల నరసయ్య శ్రీవేదాంతదేశికుల సిద్ధాంతములనే సంపూర్ణముగ ననువదించుచున్నాఁడు.

పైకారణములచేతనే యితఁడు రెండవపరాశరభట్టుశిష్యుఁడు కాఁగలఁడు కాని, శ్రీరామానుజాచార్యుల సమకాలీనుఁడును వారిశిష్యుఁడునగు భట్టపరాశరునిశిష్యుఁడు కాఁజాలఁ డనివిన్నవించితిని. ఈయిరువురుఁ దప్ప నేనెఱిఁగినంతవఱకు వేఱొక్కభట్టపరాశరుఁడు లేఁడు.

కావునఁ, బైవిన్నవించినట్లుగ భట్టపరాశరులు క్రీస్తుశకపుఁ బదునాల్గవశతాబ్దములోపలనే యుండఁగా, వారిశిష్యుఁ డగు మనసంకుసాల నరసయ్య తరువాత నూటపదియేండ్లకుఁ గాని రాజ్యమునకు రాని శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునకు రాఁగల్గుట సుతరా మసంభవము. గురుశిష్యు లిరువురును జెఱినూటయిరువదేండ్లు జీవించియుండి రనుకొన్నను, శిష్యునకు బాల్యముననే పండుముసలిగా నుండిన పరాశరభట్టరు వైష్ణవదీక్ష నిచ్చి రనుకొన్నను, కృష్ణరాయల కాలమునాఁటి కతనికి నూఱేండ్లు దాఁటి యుండును. అట్టివార్ధకమున నతఁడు కవికర్ణరసాయనము వంటి శృంగారప్రధాన మగు గ్రంథమును వ్రాసి, యందు,

"యతి విటుఁడు గాక పోవు నెట్లస్మదీయ, కావ్యశృంగారవర్ణనాకర్ణనమున,
విటుఁడు యతి గాక పోరాదు వెస మదీయ, కావ్యవైరాగ్యవర్ణనాకర్ణమున"
అని ప్రతిజ్ఞ చేయఁగలిగినంతటి కవిత్వాహంకారతారుణ్యము గల్గి యుండు నని యూహించుట పరిహాస్యము. కావుననే యతనిమనసున కంత విసుగు గల్గించిన 'ప్రభుదురాత్ములు' బమ్మెరపోతనామాత్యుని జుగుప్సకుఁ బాత్రులైన 'యేఁకర్ణాటకిరాటకీచకు'లో యయి యుందురుగాని, యా "సాహితీసమరాంగణసార్వభౌముఁడు" మాత్రము కాఁజాలఁ డని విశ్వసించుట న్యాయ్యము.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

దీనింబట్టి కవి శరభరాజు కొమరపూఁడి నివాసియని యెంచవచ్చును. తద్గ్రామమునంగల యాంజనేయునికిఁ గృతి యిచ్చి యుండును. పుస్తకము పూర్తిగ లేదు. ప్రథమాశ్వాసము, ద్వితీయాశ్వాసము, తృతీయాశ్వాసము నగపడుచున్నవి. రెండుప్రథమాశ్వాసములు రెండుద్వితీయాశ్వాసములు వ్రాయఁబడినవి. విషయము రెంటనొక్కటియే. ఒక్కొక్కయాశ్వాసములోఁ బద్ధతులు వేఱువేఱుగా సూచింపఁబడినవి. ప్రతివ్రాసిన వారు చాలఁదప్పులు వ్రాసినారు.

రసభస్మము చేయువిధము—

గీ. కుక్కుటాండంబునకుఁ జిల్లిఁగొనిరసంబు, పోసి పైచీలమన్నిడి పుటమువేయ
భస్మమగు నుప్పపై నిది పరగడమరు, యంత్రమున వేయఁ గర్పూరమగునటండ్రు

కర్ణవాతమునకు-లక్షణము—

క. శ్రోత్రద్వయశూలనహో, గాత్రంబులు దుఃఖమొదవి రమ్యతరంబౌ
గాత్రముచిక్కియు బధిరం, బత్యుత్కటమైనఁగర్ణవాతంబు ధరన్.

దీనికిమందు—

క. ఛాగక్షీరము వస మూ, లాగతమాకాళ్వథనూనె నటుగాఁచియును
ద్వేగము చెవిలోనిడినం, బాగుగఁగర్ణాఖ్యవాతబధిరములెల్లన్.

పరిషత్తున దీనికిఁ దాళపత్రప్రతి యొకటియుఁ గాగితపుఁబ్రతి యొకటియుఁ గలవు.

10. భక్తాంఘ్రిరేణు విలాసము. సం 2974.

ఇది యొక యక్షగానకావ్యము. ఉత్తమరంగకవి రచియించినది. ఉత్తరరంగధామునకుఁ గృతి. ఇందలి విప్రనారాయణచరిత్రము సారంగు తమ్మయకవి వైజయంతీవిలాసము ననుసరించియేయున్నది. ఇందు నడుమనడుమ వికటదాసుండనువిదూషకుఁడొక్కఁడు దేఁబడియెను. వేశ్య లిద్దఱు నలివేణి దేవదేవు లని చెప్పఁబడినది. కొన్ని పద్యములు—

క. నీవేకా దిప్పరిలో, నేవేశ్యాపుత్రిమైన నీతనివిటునిం
గావించి తెచ్చె నేనియు, నావనితకు నీళ్లుకట్టియలు నేఁదెత్తున్

గీ. అక్కరో నీకు నేఁ గట్టియలును నీళ్లు, నెంతమోసిన దాన నెగ్గేమి లేదు
నిన్ను నేఁబని గొన నాకు నియతిగాదు, వేశ్ఞ పన్నిద మొకటి గావింపు మనిన.

చ. ఇటు గణుతింప యోజనము లేఁబదికోటులు భూమి యందులో
నటు తుహినాచలేంద్రమున కావల నన్నియు దేవభూములే

యిట రఘునేతు వీనడుమ నెంతగఁదాఁ బరికించి చూచిన
న్నిటులకు సత్యశౌచములు వేశ్యకు నీమములే దొకింతయుగా.

శేషభట్టరు అప్పలాచార్యులుగారు వ్రాసినది.

11. వివేకసారము గ్రం. సం. 3014.

ఇది యొకవేదాంతవచనము. ఇందుఁ బంఢ్రెండువర్ణకములు గలవు. "వివేక సారే ద్వితీయవర్ణకం సమాప్తం" ఇట్లుకాని యెవరు రచియించినదియుఁ దెలియ వచ్చుట లేదు. సంస్కృతమునుండి తెనుఁగు వ్రాసినట్లు తోఁచుచున్నది. పంఢ్రెం డువర్ణకములలోను, జ్ఞానాజ్ఞానప్రకరణము, ద్వాదశమంజరిప్రకరణము, సర్వసార సంగ్రహప్రకరణము, మనీషాపంచకము మొదలగునంతర్భాగములు గలవు. 162 ప త్రములు గలయొకపుస్తకము. తెనుఁగుమాత్రము శుద్ధముగా లేదు. మొదటను జివరను గొన్నిపత్రములమొదళ్లుఁ దుదలు విఱిగిపోయియున్నవి.

విషయము తెలియుటకై కొన్నిపంక్తులు—

"సజాతీయభేద మెటువలె ననిన దృష్టాంతపూర్వకముగా నిరూపించుచు న్నారము. ఆదృష్టాంత మే దనినఁ జెప్పెదము :—ఒక్కయాకాశమె ఘటపటకు డ్య కుసూలవనవృక్షా ద్యుపాధులచేతను ఘటాకాశ మని, పటాకాశమనియుఁ, గుడ్యాకాశ మనియుఁ, గుసూలాకాశ మనియు వనాకాశమనియు......ననేకము గా నెటువలె వ్యవహరింపఁబడుచున్నదో యాత్మయు నుచ్చావచములైన శరీ రోపాధులచేత దేవదత్తుం డనియు యజ్ఞదత్తుం డనియు విష్ణుమిత్రుం డనియుఁ గృష్ణుం డనియు రాముం డనియు ననేకాత్మలుగాఁ దోఁచుచున్నాఁడు. పరమా ర్థము విచారించునప్పు డాయాకాశమునకువలెనే సజాతీయభేదము చేసి విజాతీ యభేద మెట్లు లేదనిన సద్రూపుండైన యాత్మకు విజాతీయ మైనటువంటి యస త్ప్రపంచమంతయు నసత్తే యై యున్నది గనుక యసత్తయినప్రపంచముచేత నాత్మకు శశవిషాణము వంధ్యాపుత్ర గగనారవిందములచేతను వలెనే విజాతీయ భేదమును లేదే స్వగతభేద మెటువలెననిన"

12. కులశేఖరమహీపాలచరిత్రము. సం. 3006.

ఇప్పద్యకావ్యము శేషము రఘునాథాచార్యకవిరచితము. ప్రథమపద్యము.

శా. శ్రీగోత్రాతనయాస్తనస్థగితకాశ్మీరద్యుతుల్ నైజవ
క్షోగస్ఫారలలంతికారుచితతుల్ చూపట్టనన్యోన్యహృ
ద్రాగంబు ల్బయలెక్కిన ట్లెసఁగు నుద్యత్సంతతానందసం
భోగౌత్సుక్యము నొందురాఘవుఁడు.........నెల్లప్పుడున్.

ఉ. ఖ్యాతయశఃప్రభూత విబుధవ్రజసేవితదివ్యరూపవి
ఖ్యాత సమస్తలోకశుభ కారణదృష్టిసమేత జాంబవ
ద్వాతసుతాంగదాది కపివందిత పూతపదాంబుజాత సం
ప్రీతపతివ్రతాశ్రవణపీతగుణామృత సీతఁ గొల్చెదన్.

ఇక్కవిస్వప్నములో శ్రీరాముఁడుసాక్షాత్కరించి,

"గీ. ఏను రఘువల్లభుఁడ నీదుహృదయ మెఱిఁగి,వచ్చితిని గులశేఖరాళ్వార్ల చరిత
మాంధ్రగీర్వాణపద్యమిశ్రాంతరములఁ,గృతిని నిర్మింపు మాకు నంకితము గాఁగ.

వ. పరమపురుషార్థవేత్త లగుభాగవతోత్తములం గీర్తించుట కీర్తికరంబును మదీయకైంకర్యవిశేషంబును నగు నని యానతిచ్చె"నఁట. తనవంశ మిందిట్లు కవి వ్రాసికొనినాఁడు.

సీ. శుభకరాపస్తంబసూత్రుండు కౌండిన్యగోత్రపవిత్రుండు గుణవిశిష్టుఁ
డనుపమశేషాన్వయాంభోధిచంద్రుం డహోబలదేశికుఁ డొనరఁ దనదు
సతియందుఁ బుత్రపంచకము నాపాదించె నం దగ్రజుండు రామానుజార్యుఁ
డమ్మహాత్ముండు సీతమ యనునిజదేవివలన శ్రీభట్టరాహ్వయకుమారుఁ
గనియె నాశాంతనిధికి రాగమయు సత్య, భామయను భార్యలిరువురు భవ్యమతులు
నరవి రాగమదేవికి సంభవించె, సతతగుణశాలి వేంకటాచార్యమాళి.

గీ. అమ్మహాత్ముండు లక్ష్మమ్మ యనెడుపత్ని, వలన ముప్వురుతనయుల నెలమిఁగాంచెఁ
జెలిమి రామానుజార్యుండుఁ జెన్నభట్ట, రనుసహోదరులిర్వు రేనగ్రజుఁడను.

క. ఇల రఘునాథార్యుం డన, వెలసితి......

ఇందు నాలుగాశ్వాసము లున్నవి. పుస్తకము పూర్తిగా లేదు. శైలికి—

శా. రాజన్మూర్తి భవత్తనూజుఁడు మనోరాజీవవీధిన్ మహా
రాజశ్రీరఘురామనామ దివిషద్రాజాధిరాజాంఘ్రిసే
వాజాగ్రద్గతిఁ బూననేర్చెఁ జదువు ల్వైదుష్య మేపార నో
రాజా పాండురకీర్తిరాజినిధి ముద్రారాజరాజోపమా.

చ. అడుగునఁ బుట్టి తీవు దివియందు జనించినదాన నౌట నేఁ
బాడ వని గంగ పల్క నరపుంగవుకీర్తివధూటి పల్కు నా
నడుగున నీవ పుట్టితివి హస్తతలంబునఁ బుట్టినట్టి యేఁ
బాడ వని యిట్లెసంగుదురు పోరు నభోంతరవీథి నిద్దఱున్

ఈగ్రంథము బాపట్లతాలూకా నారికేళపల్లిలో సంపాదింపఁబడినది.

13. సుందరకాండము-యక్షగానము.

ద్వి. కౌండిన్యగోత్రుండు ఘనచరిత్రుండు, పండితశ్రేష్ఠుండు పరమపుణ్యుండు
వరపెమ్మరాడ్వంశవార్ధిచంద్రుండు, సరసుండు బ్రహ్మన్న సత్యవ్రతుండు
అతనితనయుఁడ వెంకనాహ్వయుఁడంద్రు...... అనితనపేరుచెప్పుకొని
కరిముఖుఁ బ్రార్థించి కరములు మొగిచి,
దశరథరాజనందనుచరిత్రంబు, రసికు లెన్నఁగఁ దగురామాయణంబు
కరమొప్ప సుందరకాండ నిండార, వరయక్షగానసద్వైఖరి మీఱ
విరచింతు నే జగద్విఖ్యాతి వెలయ...... అని కవి తాను సుందరకాండము నె
రచియించునట్లు దెల్పెను.

ఇతరయక్షగానములలోవలె నిందుఁ "జెప్పుచున్నాఁడెటువలెను, ఏలలు పాడుచున్నారెటువలెను" అని వ్రాయఁబడి యుండలేదు. శైలి కొంతమంచిదే. తప్పు లందందుఁగలవు.

ద్వి. అకలంకచిత్త నయోముఖం జూచి, నికరంబుగాఁ బల్కె నీచకర్ముండు
మాసద్వయములోన మగువబోధించి, నాసొమ్ముచేసిన నది మంచిమేలు.
యీసతి వినకున్న నిందఱుఁగూడి, కోసిభక్షింపుడీ కోమలులార
యని చెప్పి యారామ మప్పుడె విడిచి, చనియె రావణుఁడును సదనంబునకును
అంత నాత్రిజటయు నవనీతనూజ, సంతాపపడుచున్న సమయంబునందుఁ
జూడఁజాలక యొక్కచోట నిద్రించి, తోడన మేల్కని తొయ్యలులార!

"......నామసంవత్సర వైశాఖ లలవఱకు శ్రీకొర్నిపాటి వేంకటేశ్వరస్వామివారి కటాక్షమువలన అకలంకము రంగాచార్యులు పెమ్మరాజువెంక... ......సమర్పణముగా సంపూర్ణము." అని తుద నున్నది.

14. పెద్దిరాజుకథ. (పాట) సం. 3217.

ఇది 56 తాళపత్రముల గ్రంథము. అసంపూర్ణము. కవిపేరు తెలియవచ్చుటలేదు. ప్రారంభము

శ్రీగిరినాథుని చేమొత్తిమ్రొక్కి, సొంపుతో కల్యాణసోమప్పను దలఁచి
వినిపింతు యాదవవృత్తాంత మెల్ల, పెద్దభూపతికథ పెంపొంద వినుఁడా.
కల్యాణునకు తూర్పు కనకరేపల్లె, దినకరుణి పేరిటకనక రేపల్లె
కట్టించె పెద్దిరాజు ఘనతతోడుతను, కొమరారు ముత్యాలకొలువుకూటములు
రాజుతనగృహములు రాచమేడలును, భోజనంపుశాలలు మంచిభువనేశ్వరములు

యేకాంతపుమిద్దెలు యెలమిగృహములును, వండొంటి మిద్దెలు వరుసమేడలును
శాస్త్రశాలలు......మద్దికాయలచవికెలో మగువపెద్దమ్మ, పగడంపుతరిగోళ్ల
[పట్టెమంచము
హంసతూలికెపఱుపు అమీఁదఁబఱచి...యేనాళ్లపావను యెదురుమందు
[జేర్చుకొని
నీరజగంధి పెద్దమ్మతాను నిద్రసేయఁగను... .....ఇత్యాదిగానున్నది.

15. బాలప్రబోధిక. గ్రం. సం. 3178

ఇది యమరసింహకృతనామలింగానుశాసనమునకుఁ దెనుఁగుటీక. లింగా భట్టీయముతోఁ గూడఁబ్రకటింపఁబడిన తెనుఁగుటీక యిదియే యని విజ్ఞులు చెప్పుచున్నారు. కాని యచ్చుప్రతిలోఁ దెనుఁగుటీకవ్రాసినవా రెవ్వరో తెల్పఁబడి యుండలేదు. పరిషత్పుస్తకభాండాగారములో నున్నప్రతులయందుఁ దెనుఁగుటీక వ్రాసినకవి తన్నిట్లు తెలుపుకొనియున్నాఁడు.

శ్లో. శ్రీవేంకటేశేవ సరోజజాతా సేయం సరోజాలయలాలనీయా
......ఇవనిత్యం హృదయారవిందే నివేశితామాం కమలాలయావ్యాత్.[రాంచితః
ఆసీదాసేతుసీహార నీతిపిఖ్యాతనామవాన్, తాళ్లపాకాన్నమాచార్యో వేంకటేశవ
తతోభవత్తిరుమలగురుర్గురుసమానధీః,భారద్వాజాన్వయపయఃపారావారకళానిధిః
తస్మాదభూన్నందవరవరహీరహార్మణిః, దీక్షిత శ్చిన్నతిమ్మాఖ్యో ముక్తాచ్ఛత్రద్వ
తదాత్మజన్మా తిరువేంగళాఖ్యో ఋగ్వేదశాఖ్యో ధరణీబుధాగ్రణిః [యాంకితః॥
రసేహంసో. హంసోమిత్రసరోరుహామ్, ఆలోక్య దీక్షితీయాది టీకాం బాలప్ర
టీకా మమరసింహస్య రచయత్యంధ్రభాషయా. [బోధికామ్.

ఇందుఁ గలరెండుపుస్తకములలోను బూర్తిగాలేదు. ప్రథమకాండమును ద్వితీయ కాండములోఁ గొంతభాగముమాత్రమే యున్నది.

16. రామాయణవచనము. గ్రం. 3397.

ఇది రంగనాథరామాయణమునుబట్టి వ్రాయఁబడినవచనము. యుద్ధకాండము కడవఱకు 623 పత్రములుగలది. కాని, పరిషత్తునకు లభించినగ్రంథము 420 పత్రము మొదలుకొని యున్నది. మొదట నన్నూటయిరువదిపుటలపుస్తకము కనఁబడదు. యుద్ధకాండముచివర నిట్లున్నది.

"ఆంధ్రభాషాధీశుఁ డగుబుద్ధభూవిభుఁడు ద్విపదకావ్య మొనరించిన ప్రకారమునకు నీయొక్కరామాయణవచనకావ్యము రచియింపుమని మహారాజరా

జశ్రీ మెస్తర్ సాండ్రీసు దొరవారు పైడిపాటికొండలయ్య కొమారుఁడగు పాప య్యను బిలిపించి వస్త్రభూషణగంధమాల్యములచేతఁ బరితృప్తిం బొందింపఁగా నంతట సంతోషచిత్తుఁడై బాలకాండము మొదలుకొని యీయొక్క యుద్ధకాం డముమట్టుకు షట్కాండములును రచియించెను." అని. భాష చక్కఁగా లేదు. సాండ్రీ సుదొరగారు సత్కరించియాజ్ఞయిచ్చినందుకుఁ దగినట్టుగా లేదు. ఈసాండ్రీసు దొరగా రెక్కడివారో కవి పాపయ్య యేచోటివాఁడో దీనివలనఁ దెలియవచ్చుట లేదు. శైలిం దెల్పుకొన్ని వాక్యములు.

"తమ్ముఁడైనలక్ష్మణునిగోలుపొయ్యేకాలము వచ్చెను చూస్తివా. తల్లి వలెనె నన్నుపోషిస్తువచ్చినటువంట్టిలక్ష్మణుని యడబాశి యిఖమీఁదనాకు శీత యెన్దుకు, సౌఖ్యము లెన్దుకు, తంమ్ముసిగోలుపోయి నేనుమాత్రంఅయోధ్యకు పోయినట్టైతే లక్ష్మణుఁడు యేడని అడిగేప్పంటికౌసల్యసుమిత్రలకు యేమని చెప్పు దును. యిటువంటిసౌందర్యముగల శీతను సంప్పాదించ్చవచ్చును. సహోదరు లను సంప్పాదించ్చేదికష్టము."

ఈపుస్తకమును చెన్నపట్టనములోని మ॥ వి. వి. సుబ్బరామయ్య సెట్టిగారు పరిషత్తున కొసంగిరి.

17. మహాలక్ష్మీపరిణయము. గ్రం. సం. 3387.

ఇది మూఁడాశ్వాసములప్రబంధము. గద్యము—.

"ఇతి శ్రీహరిగురు విప్రానుగ్రహాలబ్ధశృంగారరసమాధురీజనక విశేషార్థశ్లే షాదిక కవితాచాతుర్య వెంగనామాత్యపుత్ర శేషాచలేశప్రణీతంబైన శ్రీమహా లక్ష్మీపరిణయంబను మహాప్రబంధము......

ఇక్కవి హరివరకులజాతుఁ డగు వేంగనామాత్యునకును జెల్లమ్మకును బు త్త్రుఁడు. మట్టితిరువేంగళాధిపుని యాస్థానమునందున్నవాఁడు. గ్రంధారంభపద్యము.

శా. ఆంభోరాశి దర్భివివాహవేళ మదిలో శ్రీరమ్యవక్షస్థమా
దేవశ్రేష్ఠమణిన్ స్వలీల సరిగాదీపింప శ్రీవత్సుఁగా
భావింప న్మృదుమాధురీరచనతో భావోక్తిలాలించునా
శ్రీవిష్ణుం డగుకృష్ణమూర్తి కరుణన్ శ్రీలిచ్చుమా కెప్పుడున్.

ఈకవి వసుచరిత్రముపై నభిమానముఁగలవాఁడని పొడకట్టుచున్నది.

సీ. "హీరాలఁ జనరాదు జీరాడుపునుగుచే ధారాళ మగురాల దలఁపవలయు."

ఉ. వచ్చె మహాత్ముఁ డంచు మధువాహిని దాఁటి సుపుష్పవాసనల్
సచ్చరితాత్ముఁ జేరె వసుచంపకజాత రజోవితానముల్
మెచ్చుగ నీటితుంబురుల మేళన మొంది సమీరబాలునిం
జెచ్చెరఁ గూడి మాధవుని జీర్ణపథశ్రమముఁ జేసె ముచ్చటన్.

మ. అరవిందాయతలోచనభ్రమర సంఘాధిక్యధమ్మిల్ల స
ద్వరపున్నాగసుయాన లందముగ సౌవర్ణ ప్రఫుల్ల ప్రసూ
నరజోరాజిత షట్పదావృతలసన్నాళీకమందాకినీ
సరసీసౌరభవారిజాలములతో స్నానంబుఁజేయింపఁగన్.

చెప్పుకొనినంతవిశేషముగాఁ గవిత్వము కనఁబడదు.

## 18. భగవద్గీతాయోగశాస్త్రము. గ్రం. 3393.

కవి అండివోలి గిరిమనమంత్రిపుత్త్రుఁడు; మాధవకవి ఈతనితల్లిమంగమ్మ.

గద్యము. ఇతి భద్రాద్రిరామభద్రవరప్రసాదలబ్ధ కవితావిచిత్ర గిరిమన మంత్రిపుత్ర కిడాంబివేంకటాచార్య కరుణాకటాక్ష దక్షభగవద్భాగవతకృపావిధేయ మాధవయ నామధేయప్రణీతం బైనశ్రీభగవద్గీతాయోగశాస్త్రము.

ఈమాధవకవి తనగురువంశమును మాత్రమే విరివిగ వర్ణించినాఁడు.

సీ. ... ... ... ... ... ...

గౌతమగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబసూత్రుఁ డోబనవప్పసూనుఁ డనఘుఁ
డండివోలికులాబ్ధియందునఁ గొండప్ప యుదయించి నాగమనొప్పుగాను
బెండ్లియై యాలేమప్రేమ సేయుచునుండ నామిథునంబున నధికయశుఁడు [నఁ
లింగఘనుఁ డుద్భవంబయ్యె రంగుమీఱ।నతఁడసంతాయి యనెడుల తాంగివల
బుత్రులను గాంచె నిరువురఁ బుణ్యయశుల। సిద్ధనను గిరిమయామాత్యశేఖ
రులను.

.... ... ... ... ... ....

"గిరిమనమనమంత్రి సత్కీర్తి పరుఁడు।మహితలావణ్యగుణశీల మంగమాంబ
తనకు గేహినిగాఁగ నాతరుణియందు। మాధవుఁడు సిద్ధమంత్రి రామాజి
యనఁగ

మమ్ము ముప్వుర సుతుల నేమమునఁగాంచె." అనిమాత్రముచెప్పుకొనియెను.

వ్రాఁతతప్పులు చాలఁగలవు.

" వారిజభవునంశంబునఁ, గూరిమితో నుదయమయ్యెఁ గోపాచార్యుఁడు.
" లక్ష్మణాచార్యుఁ డెతిరాజలక్ష్మణుండు."

శైలికై కొన్ని పద్యములు :—

మ. తనప్రాణాశలు మాని యుద్ధమునకుం దార్కొన్నయీమిత్రులన్
దునుమం జాలను దుష్టచిత్తునిగతిన్ దోషఘ్ను యిందెవ్వరై
నను నూహింపఁగ నన్యులే యధికసన్నభ్యుల్ మహాపుణ్యవ
ర్తనులు నీవారె ముకుంద యందఱను మేధాయుక్తిచేఁ జూడుమా.

చ. గురువులు తండ్రు లాత్మజులు కూఁతుల నిచ్చినమామ లాప్తులున్
దొరలును మేనమామలును దోరముగాఁ గృపగల్గు తాతలున్
ధరఁగల యట్టిరాజులును దార్కొనిప్రాణములందుఁ దెంపుతోఁ
బిఱుతివకున్నవా రనికి బెట్టుగ నందఱుఁ బోఁజుమూఁకలై.

ఉ. కర్మము చేయువాఁడ నని గర్వమునొందుట బుద్ధిలోనఁ ద
త్కర్మఫలంబు గొందు నని కాంక్షయొనర్చుట రెంటియందునం
దర్మిలి నేనెకర్తనని యాత్మ దలంచుట వల్వ దెప్పుడున్
గర్మ మిదైన నేలయనఁగా దదిమానఁగఁ గూడ దర్జునా.

మ. విను ముత్పత్తికి హేతు వేనె యగుచున్ విత్పత్తిచే ధాత్రిపై
ఘనత న్వర్తిలువారలేనె తలఁపం గంజాసనుండేనె యో
యనఘా పాత్రమనంగ నేనగుదుఁ దథ్యంబేనునేధాతనే
యనుకంప న్నొనగూర్తు నిష్టమగుకామ్యంబుల్ మహేంద్రాత్మజా.

నాలుగాశ్వాసములలోఁ బదునెనిమిదియధ్యాయములును జెప్పినాఁడు. నడుమనడుమ నాయాయధ్యాయములును సూచించియున్నాఁడు.

" ఖరనామసంవత్సర ఆశ్వయుజశుద్ధ ౭ సౌమ్యవారం పెరటాసినెల ౨౨ తేది రాజశ్రీ ధనాల దేవరాజులు నాయఁడుగారికి వ్రాసిన భగవద్గీతలు పద్యకావ్యము."

ఈపుస్తకమునకుఁ బరిషద్భాండాగారమున రెండుప్రతులున్నవి. ఈ పుస్తకమును మహాలక్ష్మీపరిణయమును గూడ మ. వి. వి. సుబ్బరామయ్యసెట్టిగా రొసఁగినవియే.

| | | | |
|---|---|---|---|
| 1 | ముద్దళగిరిదండకము | .. | ముద్దళగిరి. |
| 1 | యతిరాజదండకము | .. | |
| 1 | యోగచూర్ణికాదులు | .. | |
| 1 | రామకవికాళీదండకము | .. | రామకవి. |
| 1 | రామస్వామిదండకము | | |
| 1 | రామానుజదండకము | .. | |
| 1 | రామాయణదండకము | .. | |
| 1 | రామాయణచూర్ణిక | .. | |
| 1 | లీలావతీదండకము | . | శేషయామాత్యుఁడు. |
| 1 | విఘ్నేశదండకము | . | |
| 1 | విద్యావతీ(అళఘురి)దండకము | . | |
| 1 | వినాయకదండకము | . | |
| 1 | వీరభద్రదండకము | .. | |
| 1 | శక్తిగణపతిదండకము | .. | ఆఱువేలపల్లి వేంకటరంగకవి. |
| 1 | శృంగారదండకము | . | తాళ్లపాక వారు. |
| 1 | శ్యామలాదండకము | . | |
| 1 | శ్రీపుష్పశైలప్రభావదండకము | . | |
| 1 | శ్రీరామదండకము | . | |
| 1 | నృంగేరీస్వాములవారిమీఁదిదండకము | ... | గరుడాద్రి సుబ్రహ్మణ్యము. |
| 1 | సుబ్రహ్మణ్యదండకము | . | |
| 1 | సూర్యదండకము | . | |
| | హనుమద్దండకము | . | |

పదములు-కీర్తనలు.

| | | | |
|---|---|---|---|
| 1 | అధ్యాత్మరామాయణకీర్తనలు | ... | సుబ్రహ్మణ్యకవి. |
| 2 | ఒప్పగింతపాటలు. | ... | అయ్యకవి. |
| 13 | కీర్తనలపుస్తకము | ... | |
| 1 | కృష్ణకీర్తనలు | ... | |

| | | |
|---|---|---|
| 1 | కృష్ణకీర్తనలు, రామకీర్తనలు | |
| 1 | గొల్లభామపదము | |
| 1 | గొల్లకలాపముపదము | |
| 4 | చిల్లరకీర్తనలు | |
| 1 | జ్ఞానగురుస్తోత్రకీర్తనలు | |
| 1 | తలుపులయొద్దిపాటలు | అకలంకం రంగాచార్యులు. |
| 2 | పాటలపుస్తకము | |
| 1 | పిళ్లారప్పపదములు | |
| 1 | పొగపాటుపుస్తకము | |
| 1 | మత్స్య(మువ్వ)గోపాలపదములు | |
| 1 | రామకథ | |
| 1 | రామకీర్తనలు | |
| 1 | రామాయణముపదము | |
| 1 | వేంకటేశకీర్తనలు | |
| 4 | వేదాంతకీర్తనలు మొదలగునవి | |
| 1 | వేదాంతముపదము | |
| 1 | వేదాంతముపాట | |
| 1 | శారదరామాయణము | |
| 1 | శివకీర్తనలు | |
| 1 | శృంగారపుఁబాటలు | |
| 1 | శ్రీశైలశివకీర్తనలు | వారణాసి సుబ్బారాయఁడు. |
| 1 | క్షేత్రయపదములు | |

పరిశిష్టములు.

| | | |
|---|---|---|
| 1 | అకలంక కృష్ణుని వర్షాశనపుఁగవిత. . | |
| 2 | అష్టకములు ... | |
| 2 | అష్టమహిషీకల్యాణము ద్విపద ... | తాళ్ళపాక తిరుమలయ్య. |
| 1 | అక్షరాంకమాల ... | |
| 6 | ఆటవిడుపు పద్యములు ... | |

| | | |
|---|---|---|
| 1 | అమరము (పద్యము) | ... కొమాండూరి కృ లు. |
| 1 | ఇంటి పద్దులు | ... |
| 1 | ఎక్కములు-చక్రములు | ... |
| 2 | ఎక్కములు-తిథులు (మొదలగునవి.) | |
| 1 | ఎంబెరుమానారు తెచ్చిన యెనుఁబదిరెండు వార్తలు | |
| 1 | కథకట్టు పద్యములు | ... |
| 1 | కరణికదానపత్రము | ... |
| 1 | కరణికోద్ధారణి | పూశే వీరభద్రకవి. |
| 1 | కాళహస్తిమాహాత్మ్యము(ప.కా.). | కుమారధూర్జటి. |
| 5 | కీర్తనలు | ... |
| 1 | కుక్కుటేశపద్యములు | ... |
| 1 | కృష్ణునిమీఁది దసరాపద్యములు | ... |
| 1 | కొడిమెల రాజేశ్వరుని పై పద్యములు. | |
| 1 | గరళపురి ఛందస్సు | ... |
| 1 | గీతగోవిందము (ఆంధ్రపద్య, తాత్పర్య, ద్విపద, సంస్కృతచూర్ణిక, రాగయుక్తగీతికాదియుతము.) | |
| 1 | గొల్లసుద్దులు | ... |
| 1 | ఘంటాప్రహారి | ... అకలంక రంగాచార్యులు. |
| 1 | చమత్కారపద్యములు | ... |
| 4 | చాటుపద్యములు | ... |
| 2 | చిత్తుకట్ట | ... |
| 12 | చిల్లరపద్యములు | .... |
| 1 | చేపలసీసమాలిక | ... |
| 1 | జయవిజయాభ్యుదయము (పద్య కా.) | రాజవోలు సుబ్బరాయకవి. |
| 5 | దసరాపద్యములు | ... |
| 1 | దానశాసనములు | ... |
| 1 | నందవర (గ్రామ) ప్రశంస | ... |
| 1 | నానార్థపద్యములు | ... |
| 1 | నానావిధపద్యములు | ... |

| | | |
|---|---|---|
| 3 | నారాయణకవచము | .... |
| 1 | | |
| 1 | పద్యావళి | ... |
| 1 | పిండిప్రోలివారిపద్యములు | ... లక్ష్మణకవి, కృష్ణమూర్తి. |
| 1 | బాలశిక్ష | ... |
| 1 | బాలసరస్వతీయభాష్యము (వ్యాకరణము). | |
| 1 | భగవద్గీత (శ్లోకము, దానిక్రిందఁ దెలుఁగుపద్యమును గలవు). | |
| 1 | భూదానశాసనము | ... |
| 1 | మహానవమిపద్యములు | ... |
| 1 | మానములు (అకరంనకరీలు) | .... |
| 1 | మానసపూజ | ... |
| 1 | ముచ్చెర్లపుల్లప్పలెక్క | ... |
| 1 | రామదాసుచరిత్ర (మొ.) | ... |
| 1 | "రామప్రభో"యనుపాటలు | ... |
| 1 | రామాష్టకములు | ... |
| 1 | "రుక్మిణీప్రాణలోల"యనుపద్యములు. | మాడపాటి నరహరిదాసు. |
| 1 | లంకసారథి | ... |
| 1 | వారణాసిబ్రహ్మయ్యపదములు | ... |
| 1 | విజయరఘునాధునిపై స్తోత్రపద్యములు | |
| 4 | విడిపద్యములు-సమస్యలు | |
| 1 | వినాయకునిమీఁదిపద్యములు (మొ.) | |
| 1 | వేంకటేశనక్షత్రమాలిక | ... తూములూరి వేంకటరంగయ్య. |
| 6 | వేమనపద్యములు | ... వేమన. |
| 1 | శకుంతలోపాఖ్యానము(పద్యకావ్యము) | రేవణూరి వేంకార్యుఁడు. |
| 1 | శత్రుఘ్నవిజయము (పద్యకావ్యము) | గరుడాద్రి సుబ్రహ్మణ్యకవి. |
| 1 | | |
| 1 | శూలినీదుర్గామంత్రము | |
| 1 | శ్రీగోపాలకృష్ణయక్షతు | |
| 1 | శ్రీరామతారావళి | |

| | | |
|---|---|---|
| 1 | శ్రీవచనభూషణము (ద్రదాడోపేతము) | |
| 1 | సంకలనము ... | |
| 1 | సంకీర్తనలక్షణము ... | తాళ్లపాక తిరుమలయ్య. |
| 1 | సమస్యలు ... | |
| 1 | సుకవికర్ణామృతము (ఛందస్సు.) ... | |
| 1 | సుదర్శనరగడ ... | తాళ్లపాక తిరుమలయ్య. |
| 1 | స్తోత్రపద్యములు ... | |
| 1 | హనుమత్సేవాభిరామము (పద్యకా). | అలవెండి శ్రీరామకవి. |
| 1 | హనుమద్విజయము .... | దోసిల్ల ప్రసన్నయ్యకవి. |
| 2 | హనుమద్విలాసము (పంచాననమూర్తిచరిత్రము). | పెద్దన. |

ఇతరభాషాగ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | కన్నడభక్తికీర్తనలు ... | |
| 1 | కల్యాణప్రసంగము (కన్నడము) ... | |
| 1 | కృష్ణార్జునసంవాదము (ఓఢ్రీము) ... | |
| 1 | తిరుప్పావొెుళ్షి (ద్రావిడము) ... | |
| 1 | తిరుప్పళ్లైచ్చవ్యాఖ్యానము(ద్రావిడము) | |
| 1 | తిరువారాధనము (ద్రావిడము) .. | |
| 1 | ద్రావిడరామాయణకీర్తనలు .... | అరుణాచలకవి. |
| 1 | ద్రావిడప్రబంధము ... | |
| 1 | నాయనార్లచరిత్రము (ద్రావిడము పెరియపురాణము.) | |
| 1 | నిగమనప్పడి (ద్రావిడము) ... | |
| 1 | నిత్యానుసంధానము (ద్రావిడము) .. | |
| 1 | ముముక్షుప్పాడి (ద్రావిడము) ... | |
| 1 | వైష్ణవమతగ్రంథము (ద్రావిడము)... | |
| 1 | స్వాత్మానందవిలాసము (ద్రావిడము)... | |



# బమ్మెర పోతనామాత్యుఁడు, నవరత్నములు.

(కడపసభలోఁ జదువఁబడినవి.)

---

క. శ్రీరాముని కంకితముగ
గౌరీధవుకరుణ నసమకవితామహిమన్
నోరూర భాగవతమును
సారమతిం బలికినట్టిసత్కవిఁ దలఁతున్ 1

ఉ. కన్నుల కెత్తి యొత్తికొనఁగాఁ దగుముద్దుకవిత్వ మబ్బియుం
బన్నుఁగ నీకృతుల్ గొనుటె భాగ్య మటంచను రాజు లుండ నీ
వెన్నఁగ రానికష్టముల కెల్ల సహించితి గాని పొట్టకై
కన్నకుమారికన్ ధరణికాంతుల కమ్మవుగా! కవీశ్వరా! 2

చ. పనివడి యారమాధవుఁడె వామనుఁడై జనియించి నాఁడు నె
వ్వనిఁ గరుణింప నిచ్ఛ యగు వాని దరిద్రు నొనర్తు నంచు ము
న్ననఁడె విధాతతోడ నిను నట్లె దరిద్రునిఁ జేసి సత్కృపన్
మనిచెఁ గదా యతండె? యసమానము నీసుకృతంబు పోతనా! 3

ఉ. మానితసత్కవిత్వమహిమన్ నిను రామవిభుండె మెచ్చిటుల్
పూనిక నాంధ్రభాగవతముం దన కంకిత మాచరింపఁగాఁ
దానె వచించె నీయతులధన్యత యేమన! రామభూపునా
స్థానకవీశ్వరా! యితరధారణినాథుల నాశ్రయింతువే. 4

సీ. ధరలోనికవుల నుత్తముఁడ వీ వనఁగ నీ,కృతిఁ గొన్నజానకీపతియె సాక్షి
సహజపాండితి నీకె చను నన నీయింట, సతతంబు వెలయుభారతియె సాక్షి
ఆవాణి నీపాలి దనఁగ నాయమవంటఁ, జవిగొన్నశ్రీనాథకవియె సాక్షి
సకలాంధ్రలక్షణ చక్రవర్తివి నీవె,యనఁ గూచిమంచి తిమ్మనయె సాక్షి
తే.గీ. నీకవిత్వము సకలలోకైకమాన్య,మనఁగ వినువారి నానందవనధి ముంచి
తనువుమఱపించితన్మయత్వంబునించి, యతులమనిపించునీభాగవతమెసాక్షి.

మ. తనివిం డాయనియర్థగౌరవము నంత్యప్రాసవై చిత్రియుం
దను వెల్లం బులకింప శ్రీహరిచరిత్రవ్రాతముల్ వ్రాయుట
ల్వీన నింపై రసమొల్కఁ జేయుపదలాలిత్యంబు నీసొమ్మ లై
చనుఁగాదే? నినుఁ బోలువాఁడు కవిరాట్సంఘంబునం గల్గునే. 6

మ. నవమాధుర్యము నించి భక్తిరసముం నానాప్రకారంబులం
జవు లూరంగ రచించి మోక్షపదవీసామ్రాజ్యముం బెంచి మా
ధవునాకారము ముందు నిల్చినటు లుద్యద్రీతి వర్ణింపఁగాఁ
గవివో? భక్తిరసంపుముద్దవొ? కదా! కల్మోక్తిసంశీలనా. 7

సీ. జన్మంబు వాగనుశాసనుం డొసఁగంగ, శిశువ వై యాతనిచేత నలరి
ర మ్మంచు నిం గవిబ్రహ్మ యెత్తికొనంగఁ,బాప వై ముద్దులఁ బలుకనేర్చి
కరుణతోడఁ బ్రబంధపరమేశ్వరుఁడు పట్టి, నడపంగ బాల వై నడవఁగలిగి
సోమన కవిసార్వభౌములు పోషింప, జవ్వని వై చాల నివ్వటిల్లి

తే.గీ. నేమమున నాంధ్రకవితాపితామహాది
తనయులను గాంచుకోర్కెఁ బోతన వరించి
తేరితే! యాంధ్రకవితాసతీలలామ!
యుక్తదాంపత్య మొప్పె మీ కుర్వి మీఁద. 8

తే.గీ. తడవు నేర్చినతెలుఁగు సార్థకము గాఁగఁ
బోతనామాత్యు మనసారఁ బొగడఁడేని
భాగవతమును నోరారఁ బలుకఁడేని
నతనిజనయిత్రికంటె గొడ్రాలు మేలు. 9

కె. సంజీవమూర్తిరావు.

# గ్రంథస్వీకారము.

---

(1) "భారతవీరుఁడు" ప్రస్తుతము నిడదవోలులో నివసించుచున్న బ్ర॥శ్రీ॥ గంగాధరరామశాస్త్రిగారు రచించినది. వీరు విఖ్యాతోభయభాషావిద్వాంసులగు భద్రాద్రిరామశాస్త్రిల ప్రథమపుత్త్రులు. ఈపుస్తకము నిడదవోలు, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయానుబంధ గ్రంథమాల 45వ సంఖ్యగాఁ బ్రకటింపఁబడినది. ఇందు మహాభారతమునం గలయర్జును విషయ మంతయు మృదుమధురవచనమునఁ దెలుపఁబడినది. ఇట్టిది "భారతవీరు" లనుపేరఁ గొన్నియేండ్లక్రిందట "సరస్వతీ" పత్రికలోఁ బ్రారంభించిరి కాని, యది తుదముట్టలేదు. అర్జుననిజననము, అస్త్రవిద్యాభ్యాసము, మనోబలము, అస్త్రవిద్యాప్రదర్శనము, గురుభక్తి, గురుదక్షిణ, గుణకీర్తనము, బ్రహ్మచర్యవ్రతప్రభావము మున్నగు 27 శీర్షికలుగా, మనోహరముగ నాతిక్లిష్టము నాతివిపులమును గా 162 చిన్నపుటలలో నిమిడ్చిన శాస్త్రిగారు విద్యార్థులకుఁ బరమోపకార మొనర్చినవారయిరి.

ఇది ప్రథమప్రయత్నము గావున నెఱసు లందందు దొరలును. "కవదొనలును గాండీవము" ననుపద్యమునుబట్టి కాఁబోలు "నేనుపోయితోడ్కొనివచ్చెద" నని వ్రాసిరి. "భూమింజయా! ఈశమీవృక్షమునెక్కి పాండవు లజ్ఞాతవాససమయమునఁ దమతమయాయుధంబుల......బెట్టినారు. నీవాకట్టువిప్పి" ఇచ్చట నెక్కి యనుక్రియ సందిగ్ధముగా నున్నది. "మానవు లంటకుండుటకై చేసినయస్త్రసంచయము గాని నిజ మగుశవము గాదు" మానవులనుటకంటెఁ దమకంటెనితరు లనుట యుచితము. దీనిక్రయము తెలుప లేదు గాని విక్రయమునకు నిడదవోలులో దొరకును. వలయువారు ఆంధ్రప్రచారిణీగ్రంథమాలకు నిడదవోలు కృష్ణాజిల్లా వ్రాయవలయును.

(2) "ఆగర్భశూరులు" కరుణరసపూరిత మగునొక్కపద్యప్రబంధము. మణిమాలాద్యనేకగ్రంథకర్త లగు మ.రా.శ్రీ. ఎల్లాపంతుల జగన్నాథము, బి.ఎ. గారిచే రచింపఁ బడినది. "మ్యాచూ ఆర్నోల్డ్" అను నొకవిఖ్యాతకవి రచించిన "సోహ్రాబ్ అండ్ రుస్తుమ్" అనుపేరఁ బరఁగు నాంగ్లేయప్రబంధమున

కిది యాంధ్రీకరణము. ఆంధ్రపద్యకావ్యములలో నితరదేశీయులనామములు చదువునపుడు శ్రుతికటుత్వ ముండునుగాని సత్యమైన మూలకథఁ దెలిసికొనఁ గోరువారి కవియుండకున్న రుచింపదు. చూడుఁడు—

క. ఒకచో "టర్క్మను" లొకచో "తుకాలు" రణకౌతుకంబుతో "సాలో" ర
త్రకు "శాక్తీకుల"మరిర, ల్పకాయులు జవంబు సూపు వాపురములపై.

కవిత్వము చక్కఁగ నున్నది. స్వతంత్రపదప్రయోగ ముచితముగఁ జేయఁబడినది. కవిగారు వ్రాసినట్టులు పెద్దలకట్టుఁబాటులకు లోఁబడియె కడుజాగరూకతతో రచింపఁబడినది. దీని కిందు వెల దెలుపఁబడియుండలేదు కావున నీగ్రంథ మమూల్య మని మేమెంచెదము. గంజాంజిల్లా పర్లాకిమిడిలో నున్నగ్రంథకర్త గారియొద్ద నీగ్రంథము దొరకును.

(3) "చంద్రకళ" ఇది పదుమూఁడుప్రకరణములు గల తెలుఁగునవల. బ్ర.శ్రీ. శతావధాని వేదులసూర్యనారాయణ శాస్త్రిగారిచే రచింపఁబడినది. ఇకవిగా రింతకు మున్ను నిందాపహరణము, వాసంతికాపరిణయము, ప్రతాపరాఘవము మొదలగునాటకముల రచించిరి. ఇందలిమూలకథ కొంత బెజవాడప్రాంతము నందలి పూర్వచారిత్రము ననుసరించినది. చంద్రకళ ప్రభాకరునిపేర శాలివాహనశకము 1226 మన్మథనామసంవత్సర ఆశ్వీయుజశుద్ధ ౨ నాఁడు వ్రాసినయుత్తరమునుబట్టి కథ "యెంతకాలముక్రిందటిదో" యని యాలోచింప నక్కఱయే లేదు. మంచిశైలిలో నుదారవాక్యములతో వ్రాయఁబడినది తొంబదినాలుగు పుటలు, పెద్దయక్షరములు. "శార్దూలంబుపేరువినిన హరిణంబు భయపడినట్లు నాపేరు విన్నంతమాత్రమునఁ బ్రాణంబుల విడుచు చంద్రభానుఁడు" అనుదానిలో లేడి పులిపేరువిని భయపడు ననుట యుచితముగ నుండదు. దీని వెల రు 0-6-0. కృష్ణాజిల్లా తణుకులో సూర్యనారాయణగ్రంథమాలాధికారులకు వ్రాసిన దీనితోఁ బాటితరగ్రంథములును దొరకును.

(4) "రూపలత" ఇదియొకనాటకము. పిఠాపురములోని యున్నతపాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయు లగు మ రా. కూచి నరసింహముపంతులు బి.ఏ.గారిచేఁ గథాసరిత్సాగరస్థమైనయొకకథ నాధారము చేసికొని స్వతంత్రముగఁ గొంత కథను గల్పించియుఁ బెంచియు మార్చియు వ్రాయఁబడినది. దీనిప్రస్తావనను గవిగారిస్నేహితులు సుప్రసిద్ధనాటకకర్తలు, నగు మ.రా పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు వ్రాసిరి. 150 పుటలు. 9అంకములు గలపెద్దనాటకము. కవి

గారాంధ్రభాషాభిమానులు, విద్యాధికులును, శ్రీరామకృష్ణపరమహంసజీవితము, గౌరాంగచరిత్రముల వ్రాసి విఖ్యాతిం గన్నవారు. సూత్రధారుఁడు పారిపార్శ్వికుఁడు నౌకరి నౌకరు "బావా బావా" యని సంబోధించికొనుట యంతమంచి దిగాఁదోఁపదు. పారిపార్శ్వకుఁడు 'మాత్రమే సూత్రధారుని భావ యనిపిలువ నగును. "సూత్రధారం వదేద్భావ ఇతివై పారిపార్శ్వకః" (సాహిత్యదర్పణము.) "భావ" యనఁదోఁబుట్టుదాని మగఁ డగుబావయనునర్థ మిందుఁ బొసఁగదు. ఈ బావశబ్దము భావశబ్దభవమే యందురు కాని యం దాచితి లేదు. ఇపుడు పెక్కు రిట్లే వాడుచున్నారు. పద్యలు రాక పారిపార్శ్వకుఁడు "బావపా త్రములోనికి బదలాయించి" కొన్నట్లు తెల్పఁబడినది. దీనివలన బావయగు సూత్రధారుని కేమియుఁ బనిలేనట్లు తెలియుచున్నది. అది యుక్తముగాదు. మఱియు నే నాటకములందైనను "త్రివర్గనిపుణః కవిః......నాట్యేచదక్షావయమ్" అనురీతిని సూత్రధారుఁడు పండితుఁడుగానే వర్ణింపబడుచున్నాఁడు. కావుననే యాతఁడు వస్తుసూత్రమునెల్ల ధరింపఁగలిగిన వాఁడు, పద్యములురానిబావ యీబావపాత్రమునకు బదలాయించికొనుట యుచితమా?

"పూలుఁగాయలు లేనట్టి పొడుగుచెట్లు, నొప్పునారామమెట్లుపయోగపడునో
స్వామికామాడ్కినుపయోగపడును బ్రకృతి, జనమునకురాణిలేనట్టిశ్రావరుండు.

ఇందుఁ బూలుకాయలు లేనట్టి యనుటంబట్టి సంతానములేనిరాణియని యుండిన నౌపమ్యము లెస్సగానుండును, మఱియు "నెట్లుపయోగపడునో, యట్లుప యోగపడునని" ప్రయోగించి వ్యతిరేకలక్షణ కవసరము కల్పించుటకంటె 'ఎట్లుపయోగపడదో, యట్లుపయోగపడఁడు" అనివ్రాసి పాఠకులకుఁ గ్లేశముఁ దొలఁగించుట యుక్తమగును.

గీ. "బలిమిజీలుగుబెండ్లను జలధియందు, ముంచివదలినఁ దేలికాన్పించుపగిది
నెంతగంభీరహృదయుని స్వాంతవికృతి, పాళిమైనను గలలందు బయలువడును."

బెండ్లను జలధిలోబలిమినిముంచి వదలుటకువలెఁ గలలో స్వాంతవికృతిపాళి కిఁ బయలుపఱచుట కేమిగనఁబఱచినారు? ఇట్టికొన్ని స్వల్పశంకలు తోఁచునుగాని వానికభిప్రాయభేదము లుండవచ్చును. కవిగారు స్వానుభవమువలనను, నాంగ్లేయ భాషాశోధనమునను, బొడమినతలంపులతోఁ గల్పనములను జేసియున్నారు. అల్ప ములగు దోషములఁ దెల్పవచ్చును. అనల్పములగుగుణములం జదువరులు గ్రంథ ముంజదివియే తెలియవలయును. దీనివెల 0-14-0లు. గ్రంథకర్తగారికి, పిఠాపురము వ్రాయవలయును.

(5) "అజ్ఞానవలలు" రాజమహేంద్రవరమునందలి కె. యల్. యన్. సోమయాజులు అండుసన్సువారిచేఁ బ్రకటింపఁబడిన మొదటిభాగము మాకార్యస్థానమునకు వచ్చినది. దీనియందు 1. ఎడమచేతిదెబ్బ, 2. దొంగా, 3. ప్రేమానుబంధము, 4. కడసారిమాట, 5. ఒక డాయిద్దఱా, 6. రాల్లే శనగలు, 7. దురాశ, 8. వేమన్న యనునెనిమిది గ్రంథములుకలవు. ఒక్కొక్కపుస్తకమున సుమారిరువది పుటలుగలవు. చిన్నపిల్లలు స్త్రీలును జదువుకొనుట కుపయోగించును. వలయువారు పైవిలాసమునకు వ్రాసిన దొరకును.

(6) "గోపాలకృష్ణగోఖలేచరిత్రము" ఇది శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహదరువారిచేఁ గేవల పద్యరూపమున రచియింపఁబడినది. భాషాశైలి మృదువు. రాజకార్యములం దామహాత్ముఁ డొనరించిన సదుపాయములు బాగుగ స్వభావానుగుణముగ వర్ణింపఁబడినవి. పుస్తకము 28 పుటలు, 0-4-0లు వెలయుఁగలది. వలయువారు "భారతీవేర్‌హౌస్, ఏలూరు, కృష్ణాజిల్లా" అని వ్రాసినఁ బొందఁగలరు.

(7) "శ్రీపరదేవతాప్రశస్తి" బ్ర॥ గరిమెళ్ల సత్యగోదావరిశర్మగారిచే రచింపఁబడినది. ఇందు 18 పుటలలో నేఁబదిపద్యములు గలవు. వలయువారు అబ్జర్వేటరిప్రెస్సు శ్రీడాబాతోఁట, విశాఖపట్టనము వ్రాసినఁ బడయఁగలరు. వెల తెలుపఁబడియుండలేదు.

(8) "విజ్ఞానపత్త్రిక" ఇది క్రైస్తవమతప్రవిష్టులగు రివరెండు, గానుగపాటి కృష్ణయ్యగారిచే స్వయముగ వ్రాసికొనఁబడిన స్వజీవచరిత్రము. 24 పుటలు. విషయము క్రైస్తవ మతబోధనము. వెలలేదు. ఉచితముగనే యీఁబడునేమో. భారతీవేర్‌హౌస్, ఏలూరు. అనివ్రాసిన దొరకును.

(9) "నలజారమ్మయగ్నిప్రవేశము" దీనిని రచించినవారు మ॥ దువ్వూరు రామరెడ్డిగారు. ఇది, గద్యపద్యాత్మకముగానుండిన యొకపూర్వశూద్రదంపతుల చరిత్రము. ఈగ్రంథకర్తగారివలెఁ దమతమ శాఖలలోఁ బూర్వముండిన ప్రసిద్ధుల చారిత్రములను వ్రాసి దేశచరిత్రమును భాషను వృద్ధిపఱచుట కెల్లవారు యత్నింపవలెను. కవిత్వము బాగుగానున్నది. 32 పుటలు. సుమారు రెండువందల గద్య పద్యములు గలవు. పుస్తకము వెల 0-4-0లు. "వీరేశలింగ పుస్తకభాండాగారము, కాఁపువీథి, నెల్లూరు అనివ్రాసిన గ్రంథము దొరకును.

(10) "ప్రపంచయుద్ధచరిత్రము" మ॥ మత్స సూర్యారావుగారిచే రచిం

పఁబడినది. ప్రస్తుతము జరగుచున్న యుద్ధవిషయము లన్నియుఁ బద్యములుగా నై దధ్యాయములలో రచింపఁబడినవి. గ్రంధము రాజభక్తిప్రధానము. వెలవేయఁ బడలేదు. వలయువారు భారతీ వేర్‌హౌస్, ఏలూరు వ్రాయవలయును.

(11) "రామాయణసారనాటకము" ఈగ్రంధము మ॥ మాకరాజు నారాయణరాజుగారు, కోలాహలము సీతారామరాజుగార్ల చే రచింపఁబడినది. రామాయణములోని కథ నక్కడక్కడిభాగముల గ్రహించి నూతనమార్గమున నాటకముగా నొనరించిరి. ఇందు అంకములకు బదులుగా రంగములే యుంపఁ బడినవి. నటీ సూత్రధారులు లేరు. ప్రస్తావనకుబదులు నాందిగీతమని శ్రీశతావధానులు శేషాద్రిరమణకవుల చే రచింపఁబడిన మంజరీద్విపద యుంపఁబడినది. మొత్తముమీఁద నాటకలక్షణములుగాని కధాచమత్కారముగాని దీనియం దేదియులేదు. ఈబాలకవు లిప్పుడే నాటకముల రచింపక యింకను గొంతకాలము బాగుగ విద్యావ్యాసంగ మొనరించి కావ్యార్థముల బాగుగనెఱింగికొని పిదప నూతన మార్గములఁగాని ప్రాచీనమార్గమునఁగాని నాటకములు రచించుట మేలు. నాందిగీతము వ్రాసినవారుగూడ దీనిని నాటక మనివ్రాయుచున్నారు. గ్రంధము వెల 0-4-0. వలయువారు "రామా అండు కో" ఏలూరు వ్రాయవలయును.

(12) "విచిత్రరాఘవము" ఇది నెల్లూరు వాస్తవ్యులు బ్ర॥శ్రీ॥ పంగులూరి రామచంద్రశర్మగారిచే రచింపఁబడినది. 5 అంకములు. ప్రధమభాగముమాత్రమే మాకడకు వచ్చినది ఇది సంస్కృతమున భవభూతి మహావీరచరిత్రము, జయదేవుని ప్రసన్నరాఘవము, మురారి యనర్ఘరాఘవము, మొదలగు నాటకముల నెల్లఁజదివి వానివానియందుఁ దత్తత్కవులు ద్రొక్కిన నూతనమార్గములనెల్లఁ గ్రోడీకరించి వ్రాయఁ బడినది. ఈ యైదంకములలోను రామునిచేఁ బరశురాముఁడోడింపఁ బడుకధవఱకు మాత్రమే కలదు. వీరి యాంధ్రీకరణము బాగుగనే యున్నది.

శ్లో. రఘునందన ఏష సుందరః కరపద్మార్పిత బాణకార్ముకః । [యము.
అహిడింభ ఇవోద్వమ ద్విషం స్పృహణీయశ్చ భయంకరశ్చ మే ॥ జానకీపరిణ

గీ. శరశరాసనధారియై సంచరించు, సుందరాకారుఁడీ రఘునందనుండు
పరఁగవిషమునుగ్రక్కెడు పాముపిల్ల,కరణిభయమునుబ్రీతియుఁ గలుగఁజేయు.

ఈరీతిగా నాంధ్రీకరణమును గ్రోడీకరణమును బాగుగనే యున్నవి కాని కథమి

క్కలి విస్తారముగ నుంపఁబడుటఁ బ్రయోగమున కనువుపడదు. 157 పుటల గ్రంథము. మార్గ వ్యయములుగాక 1-0-0 వెల గలది. వలయువారు సంతపేఁట, నెల్లూరు, గ్రంథకర్తగారికి వ్రాయవలయును

(13) "బ్రహ్మపూజ" బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారిచేఁ రచింపఁబడినది. ఇందు "బ్రహ్మదేవుని కేశాపమువలననో యీలోకమునఁ బూజలేనేలే" దను జనసామాన్యప్రతీతిని సప్రమాణముగ ఖండించి యెన్నియో ప్రమాణముల నుదాహరించి యవశ్యము బ్రహ్మను బూజింపవలయునని సిద్ధాంతీకరించిరి. 48 పుటలు. వెల 0-2-0 మాత్రము. వలయువారు, కాకినాడలోనున్న గ్రంథకర్తగారికి వ్రాయవలయును.

(14) "అంబ్రడంగిగ్రామచరిత్రము" ఇది గోదావరిజిల్లా, కాకినాడ తాలూకాలోఁ జేరిన అంబ్రడంగిగ్రామమును గూర్చి 12-వ శతాబ్దమునుండి యింతవఱకుఁగల యాధారములనన్నిటిని జేర్చి మ॥పులవర్తి వేంకటరాయఁడుగారిచే రచింపఁబడినది. గ్రంథకర్త యింకను విమర్శకతను, యథార్థాన్వేషణమును బాగుగ నలవఱుచుకొనవలయును. అవి తక్కువ యగుటచే నిందుఁగొన్ని నెఱసు లుంట సాజము. దీనివెల 0-6-6లు. అంబ్రడంగి, ద్రాక్షారామం పో గోదావరిజిల్లా, అనిగ్రంథకర్తగారికి వ్రాసిన దొరకును.

# ద్వంద్వయుద్ధోపసంహారము.

“ అమహాన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు ” అనుబాల వ్యాకరణసూత్రముయొక్క యర్థమును గూర్చి సమరాంగణపార్థమూర్తిగారిచే వ్రాయఁబడి 1916 సం॥ ఆగష్టు 7 తేదీ గలదేశమాతపత్రికయందు ద్వితీయ ప్రత్యభియోగ మనుశీర్షికతోఁ బ్రచురింపఁబడినవ్యాసమునందుఁ బార్థమూర్తి గారు తమవాదమున కుపష్టంభకము లనియెంచి యుదాహరించినసంస్కృతవ్యా కరణాదివిషయములను విమర్శించుచు ద్వంద్వయుద్ధోపశమన మనువ్యాసమును నలసంవత్సర భాద్రపదాశ్వయుజమాసముల యాంధ్రసాహిత్యపరిషత్పత్రికయం దు నేను బ్రచురించియున్నాను. అద్దానిని విమర్శించుచు బ్ర॥శ్రీ॥ కల్లూరి వేం కటరామశాస్త్రులవారు ద్వంద్వోపశమన మనువ్యాసమును వ్యాసఘట్టములుగ విభజించి 1917 సంవత్సరమున ఏప్రెల్ 4,18,24 మేయి 7 తేదులదేశమాత యందు వరుసగానాలుగువ్యాసఘట్టములను బ్రదర్శించిరి.

వారివ్యాసఘట్టముల కింతకాలమువఱకును నేను సమాధానములు వ్రా కుండుటకు మూఁడుకారణములు గలవు.

I నావ్యాసమును వారివ్యాసమును సావధానముగఁ జిత్తగించినయెడల వారి యాక్షేపణములు నావ్యాసమునకుఁ దగులలే దనియుఁ, దగిలినట్లు తోఁచినవా నికి నావ్యాసమునందే సమాధానము లున్న వనియు, విమర్శకు లగుపండితు లకు స్ఫురించును. కావున నేను వేఱుగ సమాధానము వ్రాయ నక్కఱ లే దనునది మొదటికారణము.

II బ్రహ్మశ్రీ వేంకటరామశాస్త్రులవారు నాల్గవవ్యాసఘట్టమును ముగించి సశేష మని వ్రాసియుండుటచే వారివ్యాస మసంపూర్ణ మని విశదపడినందున నుపక్రమోపసంహారములు చూడకయె యెట్టియభిప్రాయము నిచ్చుటయు యుక్తము కా దనునది రెండవకారణము.

III. శాస్త్రీయవిషయములచర్చ వచ్చునపు డందలిసిద్ధాంతమునుగూర్చి యొక పర్యాయ మెవ్వరైన నభిప్రాయ మిచ్చుట యుచితము గాని యామూలమున

వివాదములు పెంచుకొని యేమేమో యెడతెగక వ్రాయుచుండుట యుచితము
కా దనునది మూఁడవకారణము

అట్లయినను నావ్యాసముపైని బ్ర॥శ్రీ॥ కల్లూరి వేంకటరామశాస్త్రుల
వారి వ్యాసముపైని, శ్రీమాన్ ప్రతివాదిభయంకరం రాఘవాచార్యులవారు
తమయభిప్రాయము నిచ్చుచు వేంకటరామశాస్త్రులవారి తాదాత్మ్యము నొంది
1917 సం॥ జూలై తే 11ది దేశమాతయందుఁ బ్రకటించిన వ్యాసములోని
"కోవిదవర్యులారా! శ్రీవాచకద్వంద్వార్థ నిర్వాహకులపత్రికలయందు నాత్మ
స్తుతి పరనిందలయుక్తులు దక్క బ్రహ్మశ్రీ తాతాసుబ్బారాయశాస్త్రి ప్రణీత
ద్వంద్వయుద్ధోపశమనంబునకు ఖండనంబుగాఁ బైఁగనంబఱచిన దేశమాతపత్రిక
లందువెల్వడిన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రికృత ద్వంద్వోపశమన
వ్యాసంబునకు సమాధానయుక్తు లెవ్వియుం గానరావు కావున సదుత్తరం
బీఁబడునేమో? కొంతకాలము నిరీక్షించి సమరాంగణపార్థమూర్తినామము
సార్థకం బగునటులు రచియింపఁబడిన సమరాంగణ పార్థమూర్తీయమ్మును (1)ద్వం
ద్వోపశమనంబును (2) పుస్తకరూపంబున ముద్రింపించి గుప్తార్థప్రకాశికకుం జేర్చి
పండితప్రపంచమునఁ బ్రకటింపఁబడును. అవసర మని మాకుఁ దోఁచునపుడె
ల్లను మాకుఁ బంపఁబడుపండితాభిప్రాయంబులు సత్యార్థప్రదర్శనంబునకై
పత్రికలయందుఁ బ్రకటించెదము" అనువాక్యములు సమాధానము వ్రాయు
మని నన్నుఁ బ్రోత్సహించినందున సంక్షేపమున నిట్లు వ్రాయుచున్నాను.

"అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు" (బాల-తత్స
39 సూ) అనుసూత్రమున "అమహన్నపుంసకపదము" కర్మధారయసమాస
మనునపుడు మహన్నపుంసకము లగుదైవతాదిశబ్దములకును నమహత్పుంలిం
గము లగువృక్షాదిశబ్దములకును మువర్ణకము సిద్ధింపకపోవుటచేఁ దత్సిద్ధికై
సమరాంగణపార్థమూర్తిగారు రవివత్క్షోపలక్షణత్వాదు లనునుపాయములను గల్పిం
చిరి. అందలియుక్తాయుక్తతలను ద్వంద్వయుద్ధోపశమన మనునాపూర్వవ్యాస
మునఁ జర్చించి యుంటిని.

పిదప బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారు కర్మధారయసమాస
మును స్థిరపఱుపయత్నించి యాపక్షమున సిద్ధింపని రూపములసిద్ధికయి పార్థ
మూర్తిగారిచేఁ జూపఁబడినయుపాయములయం దరుచిచేతనో లేకయభ్యుచ్చయ
వాదముచేతనో కొన్నినూతనోపాయములను బ్రథమవ్యాసఘట్టమునందుఁ జూపిం

చిరి. వానియుక్త్యాయుక్తతలు విమర్శకులు విమర్శింతురుగాక యని యిచ్చట తద్వి
మర్శనీయాంశములను వానిపయిని నాయభిప్రాయములను విశదీకరించుచున్నాను.

ఈప్రథమవ్యాసఘట్టమున నాకొకసందేహము పొడముచున్నది. బాల
వ్యాకరణమునందలి డుజ్ఞువర్ణకవిధాయక సూత్రములలోని పుంలింగనపుంసక
లింగశబ్దములు శాస్త్రీయలింగతాత్పర్యమున వాడఁబడినవని వీరు తలచెదరా ?
లేక లౌకికలింగతాత్పర్యమున వాడఁబడిన వని తలచెదరా ?

శాస్త్రీయలింగతాత్పర్యమున వాడఁబడె ననుపక్షమున దైవతశబ్దము
సహజముగా నపుంసకలింగమై యుండ దానినపుంసకత్వసంపత్తికై యగతికగతిభూ
తమైన "సామాన్యేనపుంసకమ్" అనుప్రవాదము నంగీకరించి దానిని దృఢపఱుచుట
కై యనేకప్రమాణముల నుపన్యసింప నేల? ఈపక్షమున వృషభాదిశబ్దములు నపుం
సకలింగములుగఁ దలంపఁబడుచున్న వనువీరివాక్యము లెట్లు సంగతములగును ?
మఱియు "నామిత్రము దయావంతము" ఇత్యాదు లపప్రయోగము లనుటకు
వీరి కవకాశ మెట్లు చిక్కును ?

ఇఁక లౌకికలింగతాత్పర్యమున వాడఁబడిన వనుపక్షమున వృక్షశబ్దము
సహజముగా నపుంసకలింగమయి యుండఁగా నద్దానికి నపుంసకత్వసిద్ధికయి
"వృక్షః, కాకః—ఇత్యాదిపుంలింగములు గూడఁ దెలుంగున నపుంసకములే
విధిచే నగు నందురేని యవధరింపుఁడు. ఈసూత్రములోని యమహత్పదంబున
యావదమహత్తుల నుద్దేశించి "అప్రాప్తేశాస్త్ర మర్థవత్" అనుమీమాంసా
న్యాయంబునఁ బ్రాప్తాప్రాప్తపర్యాలోచన చేసినచో నపుంసకత్వ మీవిధియే
విధించుచుండు. అందున వృక్షాదులు తెలుంగున నపుంసకము లయ్యె" అను
గ్రంథముచేఁ గ్రొత్తగా నపుంసకత్వమును విధించి యాయంశమును స్థిరపఱుచు
టకుఁ బూర్వ మీమాంసాన్యాయములను సంస్కృత వ్యాకరణగ్రంథములను,
నుదాహరించి యుపన్యసింపనేల ? మఱియు శాస్త్రీయలింగమును దెలుపుటకయి
సత్త్వాదిగుణముల యుపచయరూపము పుంలింగమనియు, నపచయరూపము
స్త్రీలింగమనియు, స్థితిరూపము నపుంసకలింగ మనియు, నుపచయాపచయము
లున్నప్పుడు స్థితికూడ నుండును గాన నుపచయాపచయములను వివక్షింపక స్థితిని
మాత్రము వివక్షించునపుడు నపుంసక ముండవచ్చుననియు, "సామాన్యేనపుం
సకమ్" అనుప్రవాద మేతన్మూలకమే గాని వేఱుగా దనియు "అజాద్యత
ష్టాప్" అనుసూత్రపు శేఖరమునఁ జెప్పఁబడినందున "సామాన్యేనపుంసకమ్"

అనుప్రవాదము శాస్త్రీయలింగపక్ష నాశ్రయించియుండఁగా నీలౌకికలింగపక్ష మున నద్దానిని జెప్పుట యెట్లు సంగత మగునో తెలియకున్నది.

ఈ ప్రథమవ్యాసఘట్టమునందలి పూర్వోత్తరసందర్భములను శాస్త్రదృష్టితోఁ బరిశీలించినప్పుడు, డుజ్ఝవర్ణకవిధాయకశాస్త్రములలో గ్రంథకర్త ప్రయోగించినపుంలింగ నపుంసకలింగశబ్దములు శాస్త్రీయలింగపరము లని శాస్త్రులవారు తలంచిరో లేక లౌకికలింగపరము లని తలంచిరో, యనువిషయము నిరూపించుటకు వలనుపడ దని చెప్పక తప్పదు.

శాస్త్రులవారి యుపన్యాసధోరణినిబట్టి చూడఁగా నీరెండుసూత్రముల లోను లౌకికలింగమును వీ రాశ్రయించినట్టు నాకుఁ దోఁచుచున్నది. అట్లే కానిచో వీరు దైవతాదిశబ్దములకు నపుంసకత్వసంపాదనమునకై యంత ప్రయత్నము చేసియుండరు. “ తీర్థప్రధానాదిశబ్దములు మహదర్థవాచకము లగునపుడు “ తీర్థుఁడు ” అనుటకు బదులుగా ‘ తీర్థము ’ అనవలసివచ్చును. మంత్రివాచకమై మహదర్థక మైననపుంసకప్రధానశబ్దమునకు “ ప్రధానుఁడు, ప్రధానులు ” అని కావలసియుండఁగా ‘ దైవతము ’ అన్నట్టుల “ ప్రధానము ” అనవలసియుండును. ప్రధానశబ్దము మంత్రివాచక మైనపుడు పుంలింగముగూడఁ గల దందురేని వైకల్పికముగాఁ బ్రధాన మన్నరూపము తప్పక విధి నొందవలసి వచ్చును.” అను మొదలగు నాపత్తిబోధకవాక్యములను వ్రాసియుండరు. వారియభిప్రాయవిషయమున నే నూహించిన పైయూహ నిజమె యయినచో శాస్త్రులవారు “ సామాన్యేనపుంసకమ్ ” అనుప్రవాదము శాస్త్రీయలింగవిషయక మని గమనించియుండలేదా యనుసందేహము పొడముచున్నది. విద్వాంసులగు శ్రీశాస్త్రిలవారు గమనించియుండలే దనుకొనుట సమంజసము కాదు. కాని, వా రేయుద్దేశముతో నట్లువ్రాసిరో తెలియకున్న దనుకొనుటయే సమంజస మని నేను దలంచుచున్నాను.

వృక్షశబ్దము లౌకికనపుంసకమే యై యుండఁగా నద్దానినపుంసకత్వసిద్ధికై యమహన్నపుంసకసూత్రము నపుంసకత్వాతిదేశబోధక మని యుపన్యసించుట మఱింత వింతను గొలుపుచున్నది. అరయసరయఁ జిన్నయసూరిగా రమహన్నపుంసకసూత్రమునకు మొదటియుదాహరణముగా వృక్షశబ్దము నిచ్చియుండుటచేఁ దత్పరనాభ్యాసపాటవమున వీరు దాని నుదాహరించిరి గాని స్వవాదమునకుఁ బ్రతికూల మగునని గమనించిరేని దీని నెత్తుకొనకయే యుందు రని తోఁ

చుచున్నది. వీ రొకప్పుడు వృక్షశబ్దోదాహరణమును విడుచుకొనినను, జిన్న
యసూరిగారు వీరు వర్ణించినయభిప్రాయమే తమయభిప్రాయ మని స్థిరపఱుచు
టకై తా ముదాహరించియున్న వృక్షశబ్దము నిపుడు తీసివేయఁ జాలరుగదా !

శాస్త్రులవారు వర్ణించినయభిప్రాయము సూరిగారిదికా దని వ్యక్తపఱు
చుటకు నిచ్చటఁ గొన్నికారణముల నుదాహరించుచున్నాను.

I. వృక్షశబ్దము సహజముగా నపుంసకలింగ మై యుండ నమహన్నపుం
సకసూత్రము నపుంసకత్వాతిదేశబోధక మని తలఁచినపుడు దాని నీయతిదేశ
మునకు లక్ష్యముగా నుదాహరింతురా ?

II. సుహృదాదివాచకములును మహద్వాచకములును నగుమిత్రాదిశబ్దములు
లౌకికపుల్లింగము లగుటచే మిత్రుఁడు మొదలగురూపములును, శాస్త్రులవారు
వర్ణించినరీతిని "సామాన్యే నపుంసకమ్" అనుప్రవాదముచొప్పున 'మిత్రము'
మొదలగురూపములును, సిద్ధించుచుండఁగా "క్లీబంబులు మిత్రాదులు, మహ
ద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులు" అని మరల నతిదేశశాస్త్ర
మును గల్పింతురా ?

"ఇట్లె మిత్రము (మహద్వాచకమగు దో) ఇత్యాది క్వాచిత్కరూపంబు
లందుంగూడ సూత్ర మక్కఱలేకయే లింగసర్వనామం బగునపుంసకలింగము
(ము) విభక్తిన్యాయప్రాప్తం బగు" ననుశాస్త్రులవారివాక్యమును జూడఁగా వీ
రీయతిదేశవిధానము న్యాయప్రాప్తానువాద మని యందురేమో యని తోఁచు
చున్నది. నివర్తక మగుపురుషారంభము లేనపుడు న్యాయప్రాప్తము నతిదేశిం
చుట శాస్త్రసమ్మత మగునా ? అట్లతిదేశించినను నగతికగతిభూత మగు "సా
మాన్యేనపుంసకమ్" అనుప్రవాదమువలన సిద్ధించునపుంసకత్వము నతిదేశించినఁ
గొంతవఱకైన నుచితముగా నుండును గాని సహజముగా నున్నపుంలింగత్వము
నతిదేశించుట యుచితముగా నుండునా ? "క్లీబంబులు మిత్రాదు లనుసూత్రం
బునఁ బాక్షికంబుగఁ బుంలింగత్వ మతిదేశించుటంజేసి" అని సూరిగారు వ్రాసి
యుండఁగాఁ బయియతిదేశసూత్రము ప్రాప్తవిభాష యనియుఁ, బ్రాప్తవిభాషల
కభావవిధియందుఁ దాత్పర్య మనియుఁ, గల్పించి పుంలింగత్వాభావాతిదేశ మని
చెప్పి దానికి నపుంసకత్వాతిదేశమునందుఁ బర్యవసాన మని చెప్పుట కవకాశ
ముండదుగదా ?

III. స్త్రీలింగప్రథ మైకవచనలోపవిధాయక శాస్త్రమునందు స్త్రీలింగశబ్దము

శాస్త్రీయలింగపర మని శ్రీశాస్త్రులవారిపక్షమునఁ గూడ నంగీకరింపఁబడి యున్నందున, నర్ధజరతీయముగ, ఘుఝ్ఘువర్ణకవిధాయక శాస్త్రములందుమాత్ర ము లౌకికలింగపర మనుట యుచితమా ?

చిన్నయసూరిగారిగ్రంథమునందుఁ గలయిట్టియితరకారణముల నెల్ల వివరించినచో గ్రంథవిస్తర మగు నని యింతతో విరమించుచున్నాను.

శాస్త్రులవా రెన్నిప్రయత్నములు చేసినను ' అమహన్నపుంసక ' సూత్రమునందుఁ గర్మధారయపక్షాంగీకారమున, దైవతాదిశబ్దములకు ముపర్ణకము సిద్ధించుటకై, నపుంసకములకు, ముపర్ణకము విధించుశాస్త్ర మొకటి కల్పించుకొనక తీరదు. అట్లు శాస్త్రమును వేఱుగఁ గల్పింపక, యీయమహన్నపుంసక సూత్రమునకే " నపుంసకములకు ముపర్ణక మగును, అమహత్తులు నపుంసకములగును " అని యర్థము చేసెద మందురేని, ద్వంద్వసమాసాశ్రయణమున, వాక్యద్వయాపత్తి రూపగౌరవము నాపాదించి, తన్నివృత్తికయి కర్మధారయసమాసాశ్రయణము చేసిన వీరికి, వాక్యద్వయాపత్తి దుర్వారమై ఘట్టకుటీప్రభాతవృత్తాంతమును స్మరింపఁజేయును.

ఇంక నిచట నీవాక్యద్వయము లభించుట యెట్లో విమర్శింపవలసియున్నది. శాస్త్రులవారియభిప్రాయప్రకార మమహన్నపుంసకసూత్రమున నమహత్తులయినపుంసకములకు ముపర్ణకం బగుననునర్థము వాచ్యవృత్తిచేతన లభించుచున్నది. ఇందు విధేయముగా భాసిల్లుచున్న ముపర్ణక మితరశాస్త్రములచే నప్రాప్త మగుటంజేసి, తద్విధాయకమై శాస్త్రము సార్థక మగుచుండఁగా, నమహత్తులయందు నపుంసకత్వాతిదేశము నెట్లు బోధించును? కావున శాస్త్రులవారు చేసినయతిదేశవాక్యకల్పనము సరిగా నుండలేదు. ఈయతిదేశవాక్యకల్పనమున కుపష్టంభకముగా శబ్దేందుశేఖరాదిగ్రంథములను శాస్త్రులవా రుదాహరించిరి. అవి వీరి వాదమునకు సాధకములు కానేరవు. " నబహువ్రీహౌ " అనుసూత్రపుశేఖరమున " సర్వాదిసూత్రస్య చాయ మర్థః, సర్వాదీని తదంతానిచ, ఉక్తసర్వార్థవాచకత్వ సమానాధికరణ సర్వనామపదవంతీతి, తత్రప్రాప్తాప్రాప్తవివేకన్యాయేన సర్వనామపదవత్త్వాంశఏవ విధిః, సర్వార్థవాచకత్వస్య లోకత స్సిద్ధేః " అని వ్రాయఁబడియున్నది. ఇచట సర్వాదులును దదంతములును, నుద్దేశ్యములు, సర్వార్థవాచకత్వసమానాధికరణ సర్వనామపదవత్త్వము విధేయము. విధేయము కించిద్విశేషణవిశిష్టమైనపుడు, విధేయతాపర్యవసానము విశేషణమందా ? లేక

విశేష్యమందా ? లేక విశిష్టమునందా ? యనుసంశయమును నిశ్చయింపవలసి వచ్చినపుడు, ప్రాప్తాప్రాప్తవివేకన్యాయముచేత, నప్రాప్త మయినదానియందే పర్యవసాన మనియు, నాకారణచేత నిచట సర్వనామపదవత్త్వాంశమునందే పర్యవసాన మనియుఁ బైశేఖరగ్రంధమునకుఁ దాత్పర్యము. ప్రకృతమునందన్ననో, యదంతములై, యమహత్తు లగునపుంసకము లుద్దేశ్యములు, మువర్ణకము విధేయము. ఇందు విధేయాంశము విశిష్టమే కాదు కావున నిటఁ బ్రాప్తాప్రాప్తవివేకన్యాయమునకుఁ బ్రసక్తియే లేదు. ఉద్దేశ్యఘటకములు విధేయము లగునని యెవ్వరైన నంగీకరింతురా ? ఇట్లే " లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరంతి " అనుచోటసయితము వికృతియాగమున విధింపఁబడిన లోహితోష్ణీషవిశిష్ట ఋత్విక్కర్తృక ప్రచరణము విధేయ మగుటంజేసి, యందువిధేయతాపర్యవసానము నిశ్చయింపవలసి వచ్చినపుడు, ప్రకృతివత్త్వాతిదేశమున నుష్ణీషవిశిష్ట ఋత్విక్కర్తృకప్రచరణము వికృతియాగాంగముగాఁ బ్రాప్త మగుటచే నప్రాప్త మగునుష్ణీషమునందలి లౌహిత్యాంశమునందు మాత్రమె విధేయతాపర్యవసాన మని తాత్పర్య మయి యున్నది. కావున నిదియుఁ బైరీతిని శాస్త్రులవారివాదమున కుపష్టంభకము కానేరదు

ఒకవ్వుడు, నపుంసకములకు మువర్ణకం బగు ననువాక్యము వేఱుగఁ గల్పించినను, శాస్త్రులవా రుదాహరించినరీతిని బ్రాప్తాప్రాప్తవివేకన్యాయమున, నుష్ణీషమునందు లౌహిత్యవిధికిఁ బర్యవసానము కలిగినట్లె నపుంసకములయందమహత్త్వవిధికిఁ బర్యవసానము లభించును గాని, యమహత్తులయందు నపుంసకత్వవిధికిఁ బర్యవసానము కలుగనేరదు.

ఇఁక శాస్త్రులవా రనుకొనినప్రకారముగ నమహత్తులయందు నపుంసకత్వవిధిపర్యవసానము కలుగవలె నన్నచో, నమహత్తులకు మువర్ణక మగు నను విధిని వేఱుగఁ గల్పించి శాస్త్రులవారు వివరించినప్రకారముగ, నమహత్తులు నపుంసకము లగు ననునతిదేశవిధికల్పనము చేయవలసియుండును. అట్లే చేసెద మన్నను, దైవతాదిపదములకు మువర్ణకము సిద్ధింపనేరదు. ఇఁక వానికిని మువర్ణకమును సిద్ధింపఁ జేయుటకు నపుంసకములకు మువర్ణకమగు నని వేఱొకశాస్త్రమును గల్పించుకొనవలసియుండును. అట్లును జేసెదమన్నచో, నమహన్నపుంసకపదము ద్వంద్వసమాస మన్నపుడు వచ్చునర్థమునే పైరెండుశాస్త్రములును బోధించును. అపు డమహన్నపుంసకసూత్రము వ్యర్థ మగుటయే శాస్త్రులవారివాదమునఁ గల్గులాభము.

మఱియు నపుంసకములకు మువర్ణకము వచ్చు ననియు, నమహత్తులు నపుంసకము లగు ననియుఁ గదా శాస్త్రులవారివాదమునందలి ఫలితార్థము. అట్టి స్థితిలో నమహత్తులకు నపుంసకత్వాతిదేశద్వారమున మువర్ణకమును విధించుట కంటె నమహత్తులకు సాక్షాత్తుగా మువర్ణకమును విధించుటయే యుచిత మయి యుండదా ?

ఇఁక ద్వంద్వసమాసవాదులపక్షమునఁ గొన్నిప్రయోగముల కనుపపత్తి గల్గు నని శాస్త్రులవారు వ్రాసియున్నారు. దానియాథార్థ్యము నిట విమర్శింప వలసియున్నది. ఉపాధ్యాయాది మహదర్థకము లగుతీర్థప్రధానాదిశబ్దములు 'తీర్థుఁడు' 'ప్రధానుఁడు' అని యిట్లు, డుజ్వర్ణకాంతము లయి యుండవలెను గాని, మువర్ణకాంతము లై యుండఁగూడ దనియు, నట్టిమువర్ణకాంతరూపములు భ్రష్టప్రయోగము లనియు, నట్టిప్రయోగములు, ద్వంద్వపక్షాశ్రయణమున దుర్వారము లనియు, శాస్త్రులవారు స్పష్టముగాఁ జెప్పుచున్నారు, గాని, యవి భ్రష్టప్రయోగము లనుటకుఁ దగినప్రమాణములను జూపరైరి. ఇతరశబ్దములవిషయమున నెట్లువ్రాసినను బ్రధానశబ్దవిషయమునందును నట్లువ్రాయుట యత్యద్భుతముగా నున్నది. సూరిగారు, "క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు" నని సూత్రించి, "మిత్రశరణప్రధానపాత్రాదులు మిత్రాదులు" అని మిత్రాదులలోఁ బ్రధానశబ్దమును జేర్చి వివాదస్థ మగునమహన్నపుంసకసూత్రమునొద్ద, మిత్రాదిశబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది. "ఉ 'మిత్రుఁడు' మిత్రము, శరణుఁడు, శరణము" అనివ్రాసి యుండుటచే, మహద్వాచకప్రధానశబ్దమునకు 'ప్రధానుఁడు' ప్రధానము' అను ద్వైరూప్యము గ్రంథకర్తచే నంగీకరింపఁబడె నని స్పష్టపడుచుండఁగా నాగ్రంథ విమర్శనమునే చేయుచు నతనియభిప్రాయమునకు విరుద్ధముగా "ప్రధానము" అనునది భ్రష్టప్రయోగ మని వ్రాయుట యెంతసంగతమో చదువరులే గ్రహింతురుగాక !

మహద్వాచకములును, నపుంసకలింగములును నగునేసంస్కృతశబ్దములకు, డుజ్వర్ణకాంతరూపములు ప్రమితములో, వానిని మిత్రాదులలోఁ జేర్చికొని రూపసిద్ధిని జేసికొనవలయు నని గ్రంథకర్త మిత్రాదులకుఁ బుంలింగతుల్యత్వాతిదేశమును జేసియుండుటచే వానికి డుజ్వర్ణకాంతరూపములు ద్వంద్వవాదులకు సిద్ధింపనేర వని చెప్పుట కెంతమాత్రమును నవకాశము లేదు. అట్లె వాని

మువర్ణకాంతరూపములును, 'మిత్రము, శరణము, ప్రధానము' అనువానివలె సాధువులె యనఁదగును గాని భ్రష్టప్రయోగము లనఁ దగదు.

మహదర్థవాచకములై నపుంసకలింగము లగుతత్సమశబ్దములు మువర్ణకాంతము లయి యున్నప్పుడు, వానివిశేషణము లగుసంస్కృతవిశేష్యనిఘ్న శబ్దములకు, డుజ్వర్ణకాంతరూపములె సాధువు లనియు, " జగన్నాటకప్రవర్తకం బైన దైవమే రక్షణంబు " అను మొదలగుమువర్ణకాంతప్రయోగములు, భ్రష్టము లనియు, నట్టిభ్రష్టప్రయోగములు ద్వంద్వవాదులకు దుర్వారము లనియు శాస్త్రులవారు వ్రాసియున్నారు. కాని యట్టిస్థలములందు మువర్ణకాంతరూపములు భ్రష్టము లనుటకును, డుజ్వర్ణకాంతరూపములు సాధువులనుటకును దగినప్రమాణములను జూపరైరి. మీఁదుమిక్కిలి వారు భ్రష్టప్రయోగములనుకొనుచున్న మువర్ణకాంతప్రయోగములు గుప్తార్థప్రకాశికయందు వారిచేఁ బ్రామాణికుఁడుగా గ్రహింపఁబడిన తెనాలిరామకృష్ణమహాకవిచే రచింపఁబడిన పాండురంగమాహాత్మ్యమునం దగపడుచున్నవి. చిత్తగింపుఁడు.

" సర్వోత్కృష్టంబు లగుతీర్థక్షేత్రదైవతంబుల " (పాండురంగమాహాత్మ్యము. 1 ఆశ్వా, 207 గద్యము.)

" నిఖిలభువనప్రధానధన్యంబు లగుమాన్యదైవతంబులం గొనియాడి " (పాండురంగమాహాత్మ్యము. 1 ఆ, 16 గద్యము.)

" అత్యుత్కటప్రభావంబుల దీప్రమైన, దైవతంబును గూడి " పాండురంగమాహాత్మ్యము. 1 ఆ, 193 పద్యము.)

పైనుదాహరించినరీతిని సూరిగా రంగీకరించిన " ప్రధానము " మొదలగుమువర్ణకాంతశబ్దములును, పాండురంగమాహాత్మ్యములోఁ బ్రయుక్తములగుమువర్ణకాంతవిశేష్యనిఘ్నశబ్దములును భ్రష్టప్రయోగము లని వీ రనుకొనుటయే వీరిప్రథమవ్యాసఘట్టమునకుఁ బునాది యై యున్నది. నేను బయి నుదాహరించినవిషయములను గమనించి యీప్రథమవ్యాసఘట్టపుఁ బునాదిబల మెట్టిదియో రచనాబల మెట్టిదియో చదువరులే గ్రహింతురుగాక.

ఇఁక రెండవవ్యాసఘట్టబలమును విమర్శింతము. " అదంతము లగునమహత్తులకును, నపుంసకలింగశబ్దములకును, మువర్ణక మగు నని యర్థము" అని సీతారామశాస్త్రులవారు వ్రాసిరి ; అది కేవలసముచ్చయార్థ వివరణవాక్య మనియుఁ, గేవలసముచ్చయార్థమున, ద్వంద్వ మసాధు వని శాస్త్రు ముద్ఘోషించు

చుండుటచే సీతారామశాస్త్రులవారు చేసినయర్థమున, ద్వంద్వ మసాధు వని యు వ్రాసి, పార్థమూర్తిగారు సీతారామశాస్త్రులవారు వ్రాసినయర్థమును దూషించిరి. పార్థమూర్తిగారియభిప్రాయము సరి కాదని చూపుటకై కేవలస ముచ్చయార్థమును బోధించునపుడు రెండుచశబ్దము లుండ వనియు, సీతారామ శాస్త్రులవారివివరణమున, 'చ' శబ్దసమానార్థక "ను" శబ్దములు రెం డుండుట చే నది యితరేతరయోగార్థవివరణమే గాని, కేవలసముచ్చయార్థవివరణముకా దనియుఁ బార్థమూర్తిగారి దూషణ మట్టివివరణమునకుఁ జెందనేర దనియు, నేను ద్వంద్వయుద్ధోపశమన మను వ్యాసమున వ్రాసి యుంటిని. నావ్యాస మందలి యీయంశమును ఖండించుటకై, శాస్త్రులవారిచే ద్వితీయ వ్యాసఘట్టము రచింపఁబడెను.

సీతారామశాస్త్రులవారి వివరణవాక్యములను బోలినసంస్కృతవాక్యము లలో నయినను, దెనుఁగువాక్యములలో నయినను 'చ' శబ్దద్వయముగాని, 'చ'శ బ్దసమానార్థక "ను" శబ్దద్వయము గాని యున్నపు డావాక్యము లితరేతర యోగార్థవివరణబోధకములె యగును గాని కేవలసముచ్చయార్థబోధకములు కానేర వని నావ్యాసమున వ్రాసియుంటిని, గాని, చశబ్దద్వయ మేవాక్యమున నున్నను నది యితరేతరయోగార్థము గాక తీరదనియు, 'చ' శబ్దద్వయఘటితవా క్యము లెల్ల ద్వంద్వవివరణవాక్యములె కావలయు ననియు నేను వ్రాసియుండ లేదు. చశబ్దద్వయము గల వాక్యము లెల్ల ద్వంద్వవివరణవాక్యములు కాక తీర దని నేను వ్రాసినట్లు శ్రీశాస్త్రులవా రభిప్రాయపడి, "నీలంచ, తత్, ఉత్ప లంచ," అనుమొదలగు కర్మధారయార్థవివరణవాక్యములోఁగూడ 'చ' శబ్ద ద్వయ ముండును గాన నదియు ద్వంద్వవిగ్రహవాక్యమె యనవలసివచ్చు నని నావ్యాసముపై దోషమును మోపి, యావాక్యము ద్వంద్వవిగ్రహము కాదనుట కనేకప్రమాణములను జూపిరి. నేను జెప్పిన యితరేతరయోగార్థ వివరణవాక్య ములలోని చశబ్దసమభివ్యాహృతపదార్థములందుఁ బరస్పరాభేదము భాసిల్ల కుండు ననియు, "నీలంచ, తత్, ఉత్పలంచ" అనుమొదలగువాక్యములలోని, చశబ్దసమభివ్యాహృత పదార్థములయందుఁ బరస్పరాభేదము భాసిల్లుచున్న దనియు, నచ్చటిసర్వనామ మభేదమును స్ఫుటముగా భాసిల్లఁజేయు ననియు నట్టిసర్వనామములు లేకున్నను, గర్మధారయార్థ వివరణవాక్యములలో నభేదము భాసిల్లకతీర దనియు, నభేదభానజనకము కానివాక్యము, చశబ్దద్వయఘటిత

మయినను గర్మధారయవివరణవాక్యము కానేరదనియు నేను జూపినవాక్యము లను బోలినవాక్యము లెన్నఁటికిని నభేదభానజనకములు కావనియు, శ్రీశాస్త్రిలవారు గ్రహించినచో నీక్రింద నేను సమాధానము చెప్పఁబోవువిషయము తప్పఁ దక్కినభాగము నెల్లను వ్రాయకయె యుందురు. కావున నీవిషయమున శ్రీశాస్త్రిలవా రుపన్యసించినవిషయములను జర్చించుట యప్రసక్తమయినందున వానిని విడుచుచున్నాను. నావాదమునందు దశాస్త్రీయాంశము లేదని చూపవలె ననియే నాయభిప్రాయము గాని నావాదమునకు సంబంధింపని, శ్రీశాస్త్రిలవారు వ్రాసినయంశముల నెల్లఁ జర్చింపవలె నని నాయభిప్రాయము కాదు.

ఇఁక నీవ్యాసఘట్టమున "ద్వంద్వార్థవివరణవాక్యము లన్నియుఁ బ్రథమాంతఘటితము లయియే యుండవలయును గాని, తత్తద్విభక్త్యంతఘటితము లయి యుండఁగూడదు." అనునొక్క విషయమునకు మాత్రమే సమాధాన మీయవలసియున్నది. ఈవిషయమును స్థిరపఱుపఁదలఁచి శ్రీశాస్త్రిలవారు కొన్నిశాస్త్రవిషయము లయినచర్చలు చేసి యున్నారు. వానికెల్లఁ బ్రతివిమర్శనము వ్రాసినచో నాయాశాస్త్రములయందుఁ బరిచయము లేనిపాఠకులకు దుర్బోధముగా నుండు ననియు, గ్రంథవిస్తర మగు ననియుఁ దలఁచి శాస్త్రిచర్చలను మాని, శ్రీశాస్త్రిలవా రుండ దని యనుకొనినరీతి గలప్రయోగములు ప్రమితగ్రంథముల నుండి చూపి శాస్త్రిలవా రనుకొనినరీతి సరికా దని చదువరులకు విన్నవించుకొనుచున్నాను.

"సిద్ధే శబ్దార్థ సంబంధే" అనువార్త్తికమును వివరించుతఱిని "అథ కం పునః పదార్థంమత్వా ఏషవిగ్రహః క్రియతే సిద్ధే శబ్దే అర్థే సంబంధే చేతి ఆకృతి మి త్యాహ" "అథ ద్రవ్యే పదార్థే కథం విగ్రహః కర్త్తవ్యః, సిద్ధే శబ్దే అర్థసంబంధే చేతి" అని యిట్లు మహాభాష్యమున, (పస్పశాహ్నికము.) "శబ్దార్థ సంబంధే" అనుప్రథమేతరవిభక్త్యంతద్వంద్వమునకుఁ బ్రథమేతరవిభక్త్యంతపదఘటితముగనే విగ్రహము వ్రాయఁబడెను.

"ఆచార్యాచారా త్సంజ్ఞాసిద్ధిః యథా లౌకికవైదికేషు" అనువాక్యమునందలి "లౌకికవైదికేషు" అనుప్రథమేతరవిభక్త్యంత ద్వంద్వమునకు "లౌకికేషు, వైదికేషుచ," అని ప్రథమేతరవిభక్త్యంతపదఘటితవివరణవాక్యమె వృద్ధిసంజ్ఞాసూత్రభాష్యమున వ్రాయఁబడెను.

"ఘ్వసోరేద్ధా వభ్యాసలోపశ్చ" అనుపాణినిసూత్రమునకు (సిద్ధాంత

కౌముది-అదాది) భట్టోజీదీక్షితులచే "ఘోరస్తే శ్చ పత్వం స్యాత్ హశాపరే" అనివృత్తి వ్రాయఁబడెను. ఇచట "ఘ్వసోః" అనుషష్ఠ్యంతద్వంద్వమునకు "ఘోఃఅస్తేశ్చ" అనిషష్ఠ్యంతపదఘటిత వివరణమే యగపడుచున్నది.

"అస్తిసిచో పృక్తే" అనుసూత్రమునందలి (సిద్ధాంతకౌముది-భ్వాది) "అస్తిసిచః" అనుపంచమ్యంతద్వంద్వమునకు "విద్యమానాత్ సిచఃఅస్తేశ్చ" అని పంచమ్యంతపదఘటితవివరణవాక్యమె యగపడుచున్నది.

"సిజభ్యస్తవిదిభ్యశ్చ" అనుసూత్రములోని (సిద్ధాంతకౌముది-భ్వాది) పంచమ్యంతద్వంద్వమునకు "సిచోఽభ్యస్తాత్ విదేశ్చ" అని పంచమ్యంతపద ఘటితవివరణవాక్యమె యగపడుచున్నది.

"తాసస్త్యోర్లోపః" అనుసూత్రములోని (భ్వాది) "తాసస్త్యోః" అను షష్ఠ్యంతద్వంద్వమునకు "తాసేరస్తేశ్చ" అనుషష్ఠ్యంతపదఘటితవివరణవాక్యమె యగపడుచున్నది.

"షష్ఠీసమాసమునం దుకారఋకారంబుల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు" (బాలవ్యాకరణము-సంధి-34సూ) అనుసూత్రములోని "ఉకారఋకారంబులకు" అనుషష్ఠ్యంతద్వంద్వమునకు "(షష్ఠీసమాసమునందు) ఉకారమునకును, ఋకారమునకును, (అచ్చుపరం బగునప్పుడు నుగాగమంబు గల్గును) అని యిట్లు షష్ఠ్యంతపదఘటితముగనే శ్రీశాస్త్రిలవారే గుప్తార్థప్రకాశికయందు వివరణవాక్యమును వ్రాసియున్నారు.

"ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు" (బాలవ్యాకరణము. తత్సమ.48సూ) అనుసూత్రములోని "ఉకారాంతగోశబ్దంబులకు" అనుషష్ఠ్యంతద్వంద్వమునకు "ఉకారాంతంబులకును, గోశబ్దంబునకును," అని యిట్లు షష్ఠ్యంతపదఘటితముగనే శ్రీశాస్త్రిలవారు గుప్తార్థప్రకాశికలో వివరణవాక్యమును వ్రాసియున్నారు.

"ఆత్మేమనిజంతములకు నాంతంబు లగుమనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు" (బాలవ్యా. తత్సమ77సూ) అనుసూత్రములోని "ఆత్మేమనిజంతములకు" అనుషష్ఠ్యంతద్వంద్వమునకు "ఆత్మన్ శబ్దంబునకును, ఇమనిచ్ ప్రత్యయాంతంబులకును" అని యిట్లు షష్ఠ్యంతపదఘటితముగనే శ్రీశాస్త్రిలవారు గుప్తార్థప్రకాశికలో వివరణవాక్యమును వ్రాసియున్నారు.

పయియుదాహరణములనుబట్టి చూడఁగా ద్వంద్వసమాసార్థమును వివ

రించునపుడు ద్వంద్వసమాసోత్తరవిభక్తిసజాతీయవిభక్తిని సమాసావయవపదా ర్థబోధకపదములకుఁ జేర్చి వివరించుచున్నట్లు స్పష్టపడుచున్నది. ఆవివరణవాక్య ము లన్నియు భ్రష్టవాక్యము లని యంగీకరించినవారు సీతారామస్వామిశాస్త్రి లుగారి వివరణవాక్యమును సైతము భ్రష్టవాక్యముగా నంగీకరింపవచ్చును. ఆవి ధముగా వివరించినయర్థమునందుఁ బైనుదాహరించినద్వంద్వము లసాధువు లను వారు సీతారామస్వామిశాస్త్రిలుగారు వివరించినయర్థమునందు ద్వంద్వ మసాధు వని యనవచ్చును. సీతారామస్వామిశాస్త్రిలుగారు చెప్పినవి తప్పని చెప్పెడు పట్టుదలతోఁ బైనుదాహరించిన ప్రయోగము లన్నియుఁ దప్పులే యని చెప్పుట యుచితమో ? లేక పైప్రమితప్రయోగములతోఁబాటుగ సీతారామస్వామిశాస్త్రి లుగారు చెప్పినదియు సాధువే యని యంగీకరించుట యుచితమో ? చదువరులె గ్రహింతురుగాక. ఒకప్పు డితరులు పైప్రయోగములు తప్పనిన, ననవచ్చును గాని సీతారామస్వామిశాస్త్రిలుగారు చెప్పినరీతినే బాలవ్యాకరణములోని ద్వం ద్వసమాసములను వివరించినశ్రీశాస్త్రిలవారు మాత్ర మట్లనుటకు వలనుపడదు. ఈవిషయమున సీతారామస్వామిశాస్త్రిలవారు చెప్పినది తప్పనిచెప్పుటకు యత్నిం చుట శాస్త్రిలవారు తాము చెప్పినది తప్పని చెప్పుటకుఁ బ్రయత్నించుటయె గాని వేఱు కాదు.

ఇఁక మూఁడునాలుగువ్యాసఘట్టములను విమర్శింతము. శ్రీశాస్త్రిలవారి మూఁడవవ్యాసఘట్టమం దంతటను ద్వంద్వసమాసము సాహిత్యవిశిష్టబోధక మని స్థిరపఱుచుటకై యనేకప్రమాణములు చూపఁబడినవి. నావ్యాసమునందు ద్వంద్వసమాసము సాహిత్యవిశిష్టబోధక మనివ్రాసితిని గాని కా దని యెచ్చ టను వ్రాసియుండలేదు. ద్వంద్వసమాసము సాహిత్యవిశిష్టబోధక మనునంశ ము భయవాదసిద్ధ మయి యుండఁగా నావిషయము నే స్థిరపఱుచుటకు ననేకప్రమా ణము లుపన్యసించుట శ్రీశాస్త్రిలవారి బహుగ్రంథద్రష్టృత్వమును బోధించుట కుపచరించును గాని నావాదమును ఖండించుట కుపచరింపదు. ఇఁక నీవిషయ మున మాయుభయులకుఁ గలభేద మేమనఁగా "ద్వంద్వసమాసార్థ మగుసాహి త్యము శాబ్దబోధములో భాసిల్లక తీర దని నియమము గలదు గాని ద్వంద్వసమా సఘటితవాక్యముచే బోధితమగుక్రియయొక్క నిష్పత్తిలో నుండు ననునియమము లేదు. కొన్నివాక్యములందు ద్వంద్వసమాసఘటితవాక్యబోధితము లగుక్రియల నిష్పత్తిలోఁ గూడ సాహిత్య ముండిన నుండవచ్చును. ఇట్టివాక్యములె "సము

దాయే వాక్యపరిసమాప్తిః” అనున్యాయమునకు విషయములు. కొన్నివాక్యములందు ద్వంద్వసమాసఘటితవాక్యబోధితము లగుక్రియలనివృత్తిలో సాహిత్యముండదు. అట్టివాక్యములె “ప్రత్యేకంవాక్యపరిసమాప్తిః” అనున్యాయమునకు విషయము లని నాయభిప్రాయము. ద్వంద్వసమాసార్థసాహిత్యము క్రియానివృత్తిలోఁ గూడ నుండకతీరనిదియే యని శ్రీశాస్త్రులవారి యభిప్రాయము. ఈవిషయమున నాయభిప్రాయమును స్పష్టముగా బోధించుభాష్యప్రదీపోద్ద్యోతాదిగ్రంథములను నాద్వంద్వయుద్ధోపశమనవ్యాసమునఁ జూపియుంటిని.

శాస్త్రులవారివ్యాసమున ద్వంద్వసమాసార్థము సాహిత్య మగు నని స్థిరపఱుచుట కుపయోగించుప్రమాణములే యగపడుచున్నవి గాని, క్రియానివృత్తిలో సాహిత్య ముండనక్కఱలే దనుటకు నేఁజూపిన “మాతాపిత్రోర్మృతేఽహని ఇతివత్ బోధే సాహిత్యం నతు క్రియానివృత్తౌ” అనుప్రమాణమును బోలునట్లుగఁ గ్రియానివృత్తిలోఁ గూడ నీసాహిత్య ముండక తీర దని నిర్ణయించుప్రమాణ మొక్కటియైనఁ గానరాదు. శ్రీశాస్త్రులవారు ద్వంద్వసమాసార్థసాహిత్యము క్రియానివృత్తిలో నుండు నని లోకులకు స్ఫురింపఁ జేయుటకై కొన్నిద్వంద్వసమాసముల నుదాహరించి వానియర్థ మగుసాహిత్యము క్రియానివృత్తిలోఁ గూడ నుండునట్లుగఁ జూపిరి. ఆయుదాహరణము లెల్ల “సముదాయే వాక్యపరిసమాప్తిః” అనున్యాయమునకు విషయము లయియే యున్నవి గాని “ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః” అనున్యాయము నిర్విషయ మని నిర్ణయించుటకు సమర్థము లయి యుండలేదు. ప్రకృతవివాదవిషయక మగుద్వంద్వము “ప్రత్యేకంవాక్యపరిసమాప్తిః” అనున్యాయమునకు విషయమై యున్నది. ఇదియే యననేల ? వ్యాకరణశాస్త్రమునందలి ద్వంద్వసమాసము లెల్లఁ దఱుచుగ నీన్యాయమునకే విషయము లని చెప్పవచ్చును.

శ్రీశాస్త్రులవారు చూపినరీతులు గల “సముదాయే వాక్యపరిసమాప్తిః” అనున్యాయమునకు విషయము లగుద్వంద్వములే కాక తత్సమకక్షములై “ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః” అనున్యాయమునకు విషయము లగు ద్వంద్వములు లెక్కకు మీఱి యున్న వని గ్రహించినచదువరులకు శాస్త్రులవారి తృతీయవ్యాసఘట్ట మెల్ల నిరుపయోగ మని తోఁచు నని తలఁచియే కావలయును “సముదాయే వాక్యపరిసమాప్తిః” అనున్యాయము ముఖ్యపక్ష మనియు, “ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః” అనున్యాయము కడపటిపక్ష మని

యు, స్ఫురింపఁ జేయుటకయి చతుర్థవ్యాసఘట్టమునఁ జాలవఱ కుపన్యసించిరి. కాని యీయుపన్యాసములో "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనునది ముఖ్యపక్ష మనియు, "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనునది కకుఁజితిపక్ష మనియు, నేగ్రంథమునందైన నున్నట్లు శ్రీశాస్త్రులవారు కనఁబఱుపలేదు. సరే గదా యీ రెండున్యాయములును సమబలము లనియు, నివి లక్ష్యముల ననుసరించి వ్యవస్థితము లయి ప్రవర్తిల్లు ననియు, శ్రీశాస్త్రులవారే యీవ్యాసఘట్టమున వ్రాసియున్నారు "పయిని జూపినప్రత్యేకపరిసమాప్తి సముదాయపరిసమాప్తిన్యాయంబులు సమానబంబులలై యుండఁగా నీరెండింటిలో నిదియే గ్రహింపవలయు నని సుగ్రీవాజ్ఞ లేదు." అని యిట్లు పయిన్యాయములు సమానబలము లని యిచట వ్రాసి, వేఱొకచో నీన్యాయములలో నొకటి కకుఁజితిపక్ష మని తలంచుటయు, లక్ష్యానురోధమున నివి వ్యవస్థితము లగు నని వేఱొకచోటఁ దా మంగీకరించినయంశమును గణింపక "ఈరెండిటిలో నిదియే గ్రహింపవలయు నని సుగ్రీవాజ్ఞ లేదు" అని యిచట వ్రాయుటయు వింతగ నున్నది.

శ్రీశాస్త్రులవారి ధోరణినిబట్టి చూడఁగా న్యాయములకు లక్ష్యానురోధమునుబట్టి వ్యవస్థ చేయుట లక్ష్యైకచక్షుష్కులపని గాని లక్షణైకచక్షుష్కుల పని కా దని వా రభిప్రాయపడినట్లు తోఁచుచున్నది. కాని లక్షణైకచక్షుష్కు లగుపరిభాషేందుశేఖరాదిగ్రంథకర్తలుగూడ న్యాయములు లక్ష్యానురోధమున వ్యవస్థితము లనియే వ్రాసిరి. పరిభాషేందుశేఖరమునఁ బయిన్యాయములనే చూపి "లక్ష్యానురోధేనచ వ్యవస్థా" అనియే వ్రాయఁబడెను

వ్యవస్థితము లయినపక్షములలో నొకపక్షముచేతఁ గార్యసిద్ధి యగునపుడు పక్షాంతరము నవలంబించి దూషణదానము చేయుట యనుచిత మని వైయాకరణు లందఱు నంగీకరించియుండఁగాఁ బ్రకృతమున "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయముచేత లక్ష్యసిద్ధి యగుచుండఁగా "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయము నాధారముగాఁ జేసికొని శంకించుట యెంతవఱ కుచితముగా నుండునో చదువరులే గ్రహింతురుగాక.

పైరీతిని "ప్రత్యేకంవాక్యపరిసమాప్తిః" అనున్యాయము గమక మక్కఱలేకయే ప్రకృతమునఁ బ్రవర్తింపఁదగి యున్నది. అయినను గమకముగూడఁ గావలయునని పట్టుదల యున్నయెడల "సంస్కృతమునకు వర్ణంబు లేఁబది." "ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనఁబడు" "ద్వంద్వంబునం బదంబు పై

పరుషంబులకు గసడదవ లగు " అనుమొదలగు సూరిగారినిర్దేశములె యిచట " ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః " అనున్యాయము ప్రవర్తించుటకు గమకము లని గ్రహింపనగును.

నేను ద్వంద్వార్థసాహిత్యమును విడనాడినట్లు చదువరులకుఁ దోఁచురీతిని శ్రీశాస్త్రులవా రుపన్యసించుచు వచ్చిరి. నే నటులు ద్వంద్వార్థసాహిత్యమును విడనాడలేదు. ఆసాహిత్యము శాబ్దబోధలో భాసిల్లు నని చెప్పియుంటిని. " ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః " అనున్యాయమునకు లక్ష్యము లగుద్వంద్వములందును సాహిత్యము శాబ్దబోధములో భాసిల్లుచునే యుండును. సాహిత్యబోధకవాక్యార్థవిశ్రాంతి సముదాయమం దుండునా ? లేక ప్రత్యేకవ్యక్తులం దుండునా ? అనునది వివాదాంశము. ఇందుఁ బ్రత్యేకవ్యక్తులయందు వాక్యార్థవిశ్రాంతి యత్నసాధ్య మనియు నందువలన నిది కష్టతరపక్ష మనియు సముదాయమందు వాక్యార్థవిశ్రాంతి సహజ మనియు నందున నదిముఖ్యపక్ష మనియు శ్రీశాస్త్రులవారి యభిప్రాయ మై యున్న ట్లగపడుచున్నది. అట్లు సముదాయమున వాక్యార్థవిశ్రాంతిమాత్రమే సహజ మైనయెడల సముదాయమున వాక్యార్థవిశ్రాంతి కావలసినచోట " సహగ్రహణంకర్తవ్యమ్ " అనువార్తికమేల యారంభింపఁబడును. తద్వార్తికప్రత్యాఖ్యానమునకు భాష్యకారులు న్యాయప్రదర్శన మేల చేయవలయును ? కావున సాహిత్యము క్రియానిష్పత్తిలో నుండవలయు నని బోధచేయుటకు సహగ్రహణాదులు గాని " సముదాయే వాక్యపరిసమాప్తిః " అనున్యాయముగాని సమర్థ మగును, గాని, కేవలద్వంద్వాదులు సమర్థములు కావు.

ఈసందర్భమున ద్వంద్వాదిఘటితవాక్యస్థలములలో నీరెండున్యాయములకుఁ గలయుపయోగమును విశదపఱచుట యావశ్యక మని తోఁచి యిచట విశదీకరించుచున్నాను.

ద్వంద్వాదులు, అవయవమును, సముదాయమును గూడ బోధించును. అట్లు బోధితము లగునవయవసముదాయములలో నవయవములయందుఁ దాత్పర్యమును సముదాయము నాంతరీయకమును, అని గాని, సముదాయమునందుఁ దాత్పర్యమును నవయవములు నాంతరీయకములు, నని గాని, నిర్ణయించుట యావశ్యకము. " సముదాయే వాక్యపరిసమాప్తిః " అనున్యాయము సముదాయమునందుఁ దాత్పర్య మనియు, నవయవములు నాంతరీయకము లనియు, బో

ధించును. అట్లే "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయమును నవయవ ములయందుఁ దాత్పర్య మనియు సముదాయము నాంతరీయక మనియు బోధించును. ఈయంశము "సముదాయావయవసన్నిధౌ క్వ తాత్పర్యం క్వచ నాంతరీయకత్వమితి విచార్యతే" అనుగ్రంధముచేఁ గైయటుఁడు స్పష్టపఱిచి యున్నాఁడు.

తాత్పర్యనిర్ణయ మన్ననో యర్థస్వభావమునుబట్టియే సంభవించును. కావుననే "శతాదానే ప్రధానత్వాత్" అనువాక్యపదీయకారికయొక్క, వ్యాఖ్యానమున "ఏత దుక్తం భవతి, ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః, సముదాయే వాక్యపరిసమాప్తి రిత్యేతత్ నరాజాజ్ఞావశాత్ వ్యవస్థాప్యతే, అపితు అర్థతథాభావాత్, ఇతి న్యాయసిద్ధ మేవైత ద్వేదితవ్యం" అని వ్రాయఁబడెను. అనఁగా, నర్థస్వభావమునుబట్టి యీరెండు న్యాయములు వ్యవస్థితము లగు నని పైగ్రంధమునకుఁ దాత్పర్యము. ఈయభిప్రాయము గర్గదండనన్యాయమును, దేవదత్తాదిభోజనన్యాయమును, వివరించుతఱిని శ్రీశాస్త్రిలవారే యంగీకరించి యున్నారు. అర్థస్వభావము లక్ష్యదర్శనమువలనఁ దెలియఁదగినదై యున్న దని "సంప్రైక శేషద్వంద్వేషు" అనునది మొదలుగ నెనిమిది వాక్యపదీయశ్లోకములును వానివ్యాఖ్యానములును బరిశీలించిన విశదపడును ఈయభిప్రాయముతోడనే "లక్ష్యానురోధేనచ వ్యవస్థా" అని పయిరెండున్యాయములకు వ్యవస్థ చూపఁబడెను.

పై విషయము నాద్వంద్వయుద్ధోపశమనవ్యాసమునందే 263 పుటలో సమగ్రముగా వ్రాసియున్నాను. పయిసందర్భముచొప్పున నీరెండు న్యాయములును నర్థస్వభావము ననుసరించినవగుటచే, వీనిలో నొకటి ముఖ్య మనియు నొకటి గౌణ మనియుఁ జెప్పుట కవకాశము లేదు.

ఇఁక వృద్ధిసంజ్ఞాసూత్ర కైయటమున వృద్ధిసంజ్ఞకు నవయవము లన్నిటియందును విశ్రాంతి కలుగుటకయి "మాలాదీనాంచ" అనుజ్ఞాపకమును జూపుటచేఁ "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయము యత్నసాధ్య మనియు "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయ మట్టిది కాదనియు శాస్త్రులవా రభిప్రాయపడుచున్నారు గాని "సముదాయే వాక్యపరిసమాప్తిః" అను న్యాయమునకు విషయము లగుసంయోగసంజ్ఞా సమాససంజ్ఞలకుఁగూడ సముదాయమునందు విశ్రాంతికి మహాసంజ్ఞాకరణము వలన నన్వర్థత్వము సాధకముగఁ జూపఁబడినది. ఈసందర్భమును బట్టి "సముదాయే వాక్యపరిసమాప్తిః" అను న్యాయముకూడ యత్నసాధ్య మనియే యంగీకరిపవలసి వచ్చును. కావున నెన్నివి

ధముల నాలోచించినను, నీరెండున్యాయములవిషయమునను శాస్త్రులవా రొక చోటను వ్రాసినట్లు సమబలము లనుమాటయే స్థిరపడును గాని వేఱొకచోట వ్రాసినట్లుగ, నొకటి ముఖ్యము వేఱొకటి గౌణము ననుమాట సిద్ధింపనేరదు.

వేయేల "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు విషయ ము లగుద్వంద్వములు కక్కుఱితిపక్షములోనివే యయినయెడ శ్రీశాస్త్రులవా రట్టివానినే గుప్తార్థప్రకాశికలోఁ బ్రయోగింపనేల ? "ఇంచుగ్వక్రంబులకు (240 పుట.) 'యుష్మదస్మచ్ఛబ్దంబులు' (167పుట) ప్రథమమధ్యమపురుషములకు (169) 'ఉకారాంతఋకారాంతశబ్దములకు' (73పుట.)

పార్థమూర్తిగారివలెనే శ్రీశాస్త్రులవారును నపుంసకత్వపుంసకత్వము లకు సామాన్యవిశేషభావ మున్నటు లీచతుర్థవ్యాసఘట్టమున వ్రాసిరి వీనికి సా మాన్యవిశేషభావము లేదని స్పష్టపఱుచునట్టి నాద్వంద్వయుద్ధోపశమనవ్యాసభా గమును (భాద్రపదాశ్వయుజమాస సాహిత్యపరిషత్పత్రిక 265-266 పుటలు.) నొకసారి చిత్తగింప శ్రీశాస్త్రులవారిని బ్రార్థించుచున్నాను. మఱియు వివాద స్థము లగునుపలక్షణత్వాద్యంశములనుగూర్చియుఁ బయినుదాహరించినద్వంద్వ యుద్ధోపశమనవ్యాసమును శ్రీశాస్త్రులవారు సావధానచిత్తులయి చిత్తగించియు న్నయెడల నాయంశములను గూర్చి మరల నీవ్యాసఘట్టమునఁ జర్చించినరీతిని జర్చించియుండ రని నమ్ముచున్నాను.

ఇఁక నావ్యాసములోఁ బ్రయోగింపఁబడిన "దుర్యోధనార్జునులు శ్రీకృ ష్ణసహాయముం గోరి వచ్చిరి" అనువాక్యములో "దుర్యోధనార్జునులు" అ నుచో దుర్యోధనపదమును మొదటఁ బ్రయోగించుటయు మఱియు నావాక్యము నందు సహాయపదమును బ్రయోగించుటయుఁ బ్రమాదకృతము లని యభిప్రా యపడిరి. నేను వ్రాసినది తెనుఁగుభాష. తెనుఁగుభాషలో సహాయశబ్దమును నే నుపయోగించినరీతిని బ్రయోగించుట సుప్రసిద్ధము. అట్టిప్రసిద్ధిని జూపుటకయి భారతమునుండి కొన్నితిక్కనసోమయాజిప్రయోగముల నిట నుదాహరించెదను. చిత్తగింపుఁడు.

ఉ. వారలఁ జూచి కేశవుఁడు వచ్చినకార్యము సెప్పుఁ డన్న న
క్కౌరవనాథుఁ డిట్లనియెఁ గయ్యము సేయువగన్ సహాయముం
గోరి భవత్సకాశమునకుం జనుదెంచితి మేము వీరు నీ
కారయ నొక్కరూప హృదయంబునఁ బేర్చినబాంధవంబునన్.

(భార-ఉద్యో-1ఆ 69ప)

క. అనుటయు నాతఁడు హరికి, ట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్
వినుసుప్రసిద్ధుఁడవు నీ, వనిసేసినఁ బేరు నీక యగు నెప్పాటన్.
(భార-ఉద్యో-1ఆ 86)

ఇట్లు ఛందఃప్రతిబంధము గలపద్యములందే గాక గద్యములందును నగపడుచున్నవి.

" సంపదసహాయంబు నపేక్షించి యుండుసహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లును " (భార-ఉద్యో-2ఆ 89 గద్యము.)

దుర్యోధనుఁడు రారా జగుటచేత నతఁ డభ్యర్హితుఁ డనఁదగును గాన దుర్యోధనశబ్దమును ద్వంద్వపూర్వపదముగఁ బ్రయోగించుట దుష్టము కానేరదు. మఱియు దుర్యోధనుఁ డభ్యర్హితుఁడు కాఁడని శాస్త్రిలవారికి బట్టుదల యున్నను బయిప్రయోగము " లక్షణహేత్వోః క్రియాయాః " " సముద్రాభ్రాద్ఘః " అనుపాణినినిర్దేశములవలనఁ బూర్వనిపాతప్రకరణమున కనిత్యత్వమును జెప్పి వైయాకరణులచేత సాధింపఁబడిన " కతిపయదినస్థాయిహంసా దశార్ణాః" అను మొదలగుమహాకవిప్రయోగములవంటి దని శ్రీశాస్త్రిలవారు గ్రహింపఁదగును గాని వేఱొకటిఁగా గ్రహింపఁ దగదు. మఱియు నాప్రయోగము శ్రీశాస్త్రిలవారి యపరావతార మగుపార్థమూర్తిగారు ప్రయోగించిన " కైయటోపాధ్యాయ " అనుప్రయోగమువంటిదే యని యైన గ్రహించి మన్నింతురుగాక.

" కైయటోపాధ్యాయ " అనునది కర్మధారయసమాసము. కర్మధారయసమాసమున, విశేషానుశాసనము లేనపుడు విశేషణము పూర్వపద మై యుండవలయు నని, " విశేషణం విశేష్యేణ బహుళం " " ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్ " " ఉపసర్జనం పూర్వమ్ " అనుశాస్త్రములచే వ్యక్త మగుచున్నది. ఇచట సమస్యమానపదములలో " కైయట " పదము సంజ్ఞాశబ్దము "ఉపేత్యాస్మా దధీయతే" అనువ్యుత్పత్తిచొప్పున నుపాధ్యాయశబ్దము క్రియాశబ్దము, సంజ్ఞాశబ్దమునకుఁ గ్రియాశబ్దముతో సమభివ్యాహార మున్నపుడు, సంజ్ఞాశబ్దము విశేష్యమే కావలయు ననియుఁ గ్రియాశబ్దము విశేషణమే కావలయు ననియు నియమము. " తత్రజాతిసంజ్ఞయోః గుణక్రియాభ్యాం సమభివ్యాహారే విశేష్యత్వైవ " అని " విశేషణం విశేష్యేణ బహుళం " అనుసూత్రమునందలి శబ్దేందుశేఖరమునఁ జూపఁబడియున్నది. కావున విశేషణ మగునుపాధ్యాయశబ్దము పూర్వనిపాతశాస్త్రముచేఁ బూర్వపద మై " ఉపాధ్యాయకైయట " అనుధా

పము సిద్ధింపవలసియున్నది. కాఁబట్టి "కైయటోపాధ్యాయ" అనుదానికి సాధుత్వము పూర్వనిపాతప్రకరణమున కనిత్యత నంగీకరింపకున్న సంభవింపదుగదా.

ఈసందర్భమున శాస్త్రవిషయములె విమర్శించుట యావశ్యకము గాని యుపన్యాసస్థభాషను విమర్శించుట యావశ్యకము కాదని యెంచి పార్థమూర్తిగారియుపన్యాసభాషను గూర్చి కాని శ్రీశాస్త్రిలవారియుపన్యాసభాషనుగూర్చికాని నే నిచ్చట విమర్శింపఁ దలఁచుకొనలేదు.

నాద్వంద్వయుద్ధోపశమనవ్యాసములో 265-275, పుటలలో "పార్థమూర్తిగారి కర్మధారయ" అనియు "తమ కర్మధారయార్థము" అనియు "పార్థమూర్తిగారు తమకర్మధారయ" అనియు నాచేఁ బ్రయోగింపఁ బడినవి. వీనిని బరుషోక్తులుగాఁ గ్రహించి నేనాగ్రహముతో వాపిని వ్రాసినట్లు శ్రీశాస్త్రిల వారు వ్రాసియున్నారు. అవి నేను బరుషోక్తు లని యనుకొన లేదు. వానిని నేనాగ్రహపూర్వకముగా వ్రాయనులేదు అవి పరుషములె యని వారికిఁ దోఁచినయెడల నే నట్లు గ్రహింపలేక యట్టిప్రయోగములు సందర్భవశమునఁ బ్రయోగించినందులకు నాత్షమార్పణమును దయతోఁ బరిగ్రహించి నన్ను మన్నింతురుగాక.

ఇప్పటికి వ్రాయఁబడిన యుభయవాదులవ్యాసములనుబట్టి "అమహాన్నపుంసకసూత్రార్థతత్త్వము చదువరులు గ్రహింపలేకపోరు. ఇటుపయి నేమివ్రాసినను వివాదమును బెంచుకొనుటకును స్వస్వపాండిత్యప్రకర్షములను లోకమునకు వెల్లడించుకొనుటకును మాత్రమె యుపయోగించును, గాని, తత్త్వనిర్ణయమున కంతగా నుపచరింప వని నాయభిప్రాయము. కావున నిటుపయినీవిషయమున నెవ్వ రేమివ్రాసినను నేను బ్రత్యుత్తర మీయఁ దలఁచుకొనలేదు.

శ్రీమాన్ ప్రతివాదిభయంకరం రాఘవాచార్యులుగారు లోకమునఁ దత్త్వమును వెల్లడించుటకై సమరాంగణపార్థమూర్తీయమ్మును ద్వంద్వోపశమనంబును బుస్తకరూపమున ముద్రింపించి బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికకుం జేర్చి ప్రచురించునపుడు శ్రమ యని యెంచక నాప్రార్థనమును మన్నించి నాయీరెండువ్యాసములను గూడ నందుఁ జేర్చి ప్రకటించిన నేను వారియెడలఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను. అట్లు ప్రకటించుటవలన లోకమునకుఁ దత్త్వమును వెల్లడింపవలయు ననువారియభిప్రాయము మఱింత బాగుగాఁ గొనసాగఁగలదు. కావునఁ దత్త్వప్రకాశనపరు లగువారు నాప్రార్థనమును దప్పక మన్నించెద రని నమ్ముచున్నాను.

తాతా సుబ్బరాయశాస్త్రి.

# అభినవకవిత్వతత్త్వము.

(కడపసభలోఁ జదువఁబడినది.)

ఆర్యులారా !

ప్రతిమనుష్యునకును గర్మజన్యము లగుశరీరము లెట్లు భిన్నములో యట్లు తదంతర్వర్తి యగుమనస్సు బుద్ధియుఁ దజ్జన్యము లగునూహాపోహాలును, భావములును, నిచ్ఛలును భిన్నభిన్నములుగ నుండును. ఒకరిమన స్సున్నట్లు మఱియొకరిమన స్సుండదు. ఒకరిమన స్సెప్పుడు నేదో యొకదానిని నాలోచించుచుండును. ఒకరిమనస్సు దేనిని సంకల్పింపక నిర్వికల్పసమాధిఁ దాల్చియుండును. ఒకరిమనస్సునకు మంచి దని తోఁచినది రుచించినది మఱియొకరిమనస్సునకు మంచి దని తోఁపదు. రుచింపదు. ఒకరిమనస్సునకు యుక్త మనియు న్యాయ్య మనియుఁ దోఁచినది యొకరిమనస్సునకు నయుక్త మనియు నన్యాయ్య మనియుఁ దోఁపవచ్చును. ఒకనియూహాపోహావిచక్షణతయు భావనావైదగ్ధ్యమును భాషాచమత్కారము నొకరి కిష్టపడదు. కావునఁ గవిత్వతత్త్వ మిదమిత్థ మని నిర్ణయించుట మిక్కిలి కష్టము.

కొందఱు భావశుద్ధి యున్నం జాలు నందురు. మఱికొందఱు భావాభిద్యోతకము లగునిర్దుష్టశబ్దార్థములపొందికయు నభిలషింతురు. ఇంకఁ గొందఱు శబ్దార్థచమత్కారమును గోరుదురు. అన్యులు వీనియన్నిటికిఁ దోడుగఁ గథాసంవిధానమును నిచ్ఛయింతురు. పాత్రములచర్యలు వర్తమానదేశకాలములకుఁ దగియుండవలయు ననియు వక్కాణింతురు. కొందఱు మహనీయులు మనస్సు, ప్రకృతి ననుసరించి యెట్లెట్లు పోవుచుండునో యట్లు పాత్రములచర్యలు పోవుచుండవలయును, గాని ప్రకృతిస్వభావము నెఱుంగనివారు చేసిన ప్రాంతనిబంధనలకు లోపడియుండరా దనియుఁ జెప్పుదురు. ప్రకృతిస్వభావము మీఁదుమిక్కిలి యర్థానర్థముల విచారించి పోవునది గాదు గావున దూరదృష్టి గలవారు మేలుగీళ్లరసి యుక్తాయుక్తపరిజ్ఞానము కలిగి యొనర్చినసుఖసంపాదనహేతువు లగుసార్వకాలికానుష్ఠేయము లగుసమీచీనధర్మములకు లోపడి పాత్రచర్య లుండుటయే దేశక్షేమకరం బని నుడువుదురు. ఏతత్సర్వలక్షణలక్షితం బగుకవిత్వతత్త్వము

ప్రకృతిని మెప్పించు ననుటకు సందేహ ముండదు కాని యట్టివా రెంతయు మృగ్యు లని చెప్పవలయును.

ఎవ రెన్నిచెప్పినను పాత్రములమనోభావములు పాఠకులహృదయాదర్శ ములఁ బ్రతిబింబించి యెదుటఁ బొడకట్టినట్లు రచన మొనర్చుటయే ముఖ్యకవిత్వ తత్త్వ మని యేకగ్రీవముగా నొప్పుకొనక తప్పదు. దీనినే కవిత్వతత్త్వవిచా రము "భావనాశక్తి" యని పలుమాఱు పలుచోట్ల నొక్కినొక్కి వచించివచించి తనయావచ్ఛక్తిని వినియోగించుచున్నది. దానిశ్రమము నిరర్థకము గాదు. కాని నేల విడిచి సాముచేయుట కేఁతయు వగచుచున్నాఁడను.

పదాఱువన్నెబంగార మైనను మెఱుఁగువెట్టక ప్రకాశింపనట్లు భావనా వైదగ్ధ్య మెంత యున్నను దదుద్బోధకము లగుశబ్దార్థములసామీచీన్యము లేమి దానిశ నిరర్థకము. అంతియకాదు అది యుండియు లేనియట్ల "శబ్దార్థా మూర్తి రాఖ్యాతౌ" అని కవిత్వకన్యకు శబ్దార్థములు శరీరము. శరీరస్వాస్థ్యము కుదిరినఁగదా రమణీయభావము లుప్పతిల్లును. శరీర మాపాదమస్తకముఁ బుం డ్లచే నిండి చీము, నెత్తురు కాఱుచుండ నిరంతరబాధచే మొత్తుకొనుచుండువా నికి మంచిమంచిభావము లుప్పతిల్లుట లోకానుభవము కాదు. నిరామయునిము ఖవిలాస మున్నట్లు లామయావిముఖవికాస ముండ దనుట సార్వజనీనము, అను భవసిద్ధము. కొందఱకు నొకనిపై నభిమానము, దయ, గౌరవము, కోపము, ద్వేషము, మొదలగునవి శరీరసౌందర్యమువలననే కలుగుచుండును. ఇది ప్రకృతి వైచిత్ర్య మన నొప్పనుగదా ? కావున నిర్దుష్టశబ్దార్థసంఘటనమే భావావిష్క రణమునకు ముఖ్యహేతువు.

భారతకవిత కంతయశస్సు వచ్చుటకును, దనభావనాశక్తిని స్పష్టముగ వెలి వుచ్చుటకును, సర్వజనసమ్మానము నొందుటకును నిర్దుష్టశబ్దార్థసంఘటనమే ముఖ్య కారణము. వేమన్నపద్యములు, బొబ్బిలికథ, దేశింగురాజుకథ, బాలనాగమ్మ కథ మొదలగునవి భావనాశక్తి యున్నను, నిర్దుష్టశబ్దార్థసంఘటనములేమిం జేసి సర్వజనసమ్మతములు కాకపోయినవి. అవి పామరజరంజకములే కాని పండితజన రంజకములు కావు. రంగరాయచరిత్ర భావనాశక్తిని గనఁబఱచినట్లు బొబ్బిలికథ పండితులకు భావనాశక్తిని గనఁబఱుపఁ జాలదు. పండితులు గొనియాడకపో యినమాత్రాన వానిగౌరవమునకుఁ గొఱఁత రా దందురు గాఁబోలు. గొంగడి గొల్లవానికి రుచించును. చీనిచీనాంబరములు రుచింపవు. మహారాజులకు గొం

గడి రుచింపకపోవుట మహాదోషము. లోకమున గొంగళ్లు గప్పువారే చాలమంది. సేలువలు గప్పువారు గొందఱే. సేలువలు గప్పువారికే విశేషసన్మానము. వీరినే గొప్పవా రందురు. సేలువకంటె నధికముగఁ జలి నాఁపినను గొంగడి యెక్కువలో నెక్కువ నాల్గుపారూయలు. సాలువ పదిరూపాయలకుఁ దక్కువ రాదు. ప్రకృతిస్వభావమును వేయికవిత్వతత్త్వవిచారములైనను మార్పఁ జాలవు' నిమ్న

రణము దేశాభిమానులకు ముఖ్యకర్తవ్యము.

కేవలనిర్దుష్టశబ్దార్థసంఘటనమే భావనాశక్తిని గనఁబఱుపఁజాలదు. అది సాలంకారము సగుణమును గావలయును. అప్పుడు భావనాశక్తి మఱింత బాగుగ నభివ్యక్త మగుచున్నది. రమ్యాకారములు సొమ్ములు లేకున్నఁ బ్రకాశించినను నవి వానిశోభను వికారపఱుపఁజాలవు. కాని మఱింత యభివ్యక్త మొనర్చి యపూర్వవికాసమును గల్పించి సర్వజనస్పృహణీయము లౌననుట యసత్యము కాదు. అసమానలావణ్యవతి యగుస్త్రీ, పట్టుపీతాంబరము ధరించి యనర్ఘరత్న స్థగితాభరణములను దాల్చినఁ జూచుటకుఁ గడు నసహ్యముగ నుండు నేమో ? అట్టిస్త్రీని గవిత్వతత్త్వము మెచ్చదేమోకాని మఱి యెవ్వరును మెచ్చకపోరనునానమ్మిక యపరిహార్యము.

రామాయణమహాభారతములు కవిత్వతత్త్వమునకు మేలుబంతి కావని యెవరు చెప్పఁగలరు ? కవిత్వతత్త్వ మంతయు వానియందు మూర్తీభవించిన దనుట నిర్వివాదమును జర్వితచర్వణమును. ఆమహాసముద్రములో నాయలంకారములు నాగుణములు నేమూల నణఁగినవో తెలియవు, గాని చక్కఁగఁ బరిశీలించినఁ గవిత్వప్రపంచములో నెక్కడను లేనియలంకారములు గుణములు నింతకుము న్నున్నవియు, నిప్పు డుండునవియు నింక నుండఁబోవునవియు నన్ని లక్షణములు నందుఁ జూడఁగలము. అందు భావనాశక్తిని బ్రదర్శించుటకు వలయుసర్వాలంకారములును సర్వగుణములును మహాభారతమునందుఁ బూర్ణముగ నున్నవి. అది సర్వాలంకారములకును సర్వలక్షణములకును రంగనాథరాకరు, పి. ఆర్, అండుసన్సు మొదలగుగొప్పగొప్పరత్నాపణములవంటి రత్నాపణము. ఈ యాపణమున దొరకనియలంకారములు మఱి యేయాపణమునను దొరకవు. తరువాతికవు లందఱును నీయాపణమునుండియే యలంకారప్రపంచమును గొనికొనిరన నతిశయోక్తి కాదు. ప్రబంధకవులయందు నలంకారములు మెండనియు నవి భావనాశక్తిని బ్రదర్శించుట కుపకరింప వనియు ననుకొనుట యవిచారమూలము,

భావనాశక్తి ప్రబంధములయందు నభివ్యక్త మయినట్లు మఱిదేనియం దును నభివ్యక్తము కా దని చెప్పవలనుపడదు గాని యది ముందంజవేయునే కాని వెనుకంజ వేయ దనిమాత్రము చెప్పఁగడంగిన నాసాహసమును మన్నింప వేఁడెదను. అందు వసుచరిత్ర భావనాశక్తికిఁ బుట్టినిల్లు. ఇతివృత్తమత్యల్ప మైనను భావనాశక్తి యపారము. గిరికాదేవిచే వసురాజునొద్దకుఁ బంపఁబడినమంజువాణి వసురాజుక్రీడాగారమునఁ బుత్తళిబొమ్మలలో నొకబొమ్మయై నిల్చుటయు నామె గిరికాదేవియవస్థను వర్ణించుటయు నతఁడు దానికిఁ బ్రత్యుత్తరము లిచ్చుటయు నీఘట్టమున భావనాశక్తి వెల్లివిరిసిన దనుట యవిచారమూలము గాదు. నాకుఁ జిత్రలేఖనసామర్థ్యము లేదు గాని యదియుండిన నిప్పుడీకవిత్వతత్త్వవిచా రము ప్రబంధములపై నారోపించిన యపవాదమును బాపి యుందును. రవి వర్మయైనను లేఁడు ; అతనిచేనైన వ్రాయించిచూపుద మన్న. ఇచట భావనా శక్తి ప్రతిబింబించుచున్న దనుట యాభావనాశక్తికి నవమానము గల్గించుటయు· యథాశ్రుతముగ నట్లె వచ్చి మ్రోల నిలుచు ననిన నమ్మరేమో. చూచినం గాని తత్త్వబోధము కాదు. ఇచటభావనాశక్తి సామాన్యులహృదయములందుఁ బ్రతిబింబింపదేమో గాని పండితుల హృదయాదర్శములయందుఁ జక్కఁగఁ బ్రతి ఫలించుచునే యున్నది. పండ్లులేనివాఁడు చెఱకును దూషించుట ప్రకృతిమా హాత్మ్యముగాక మఱేమి ? పండ్లున్నవారికిని బండ్లులేనివారికిని జెఱకు సులభసా ధ్యముగ నుండునట్లు సృజింపకపోవుట సృష్టికర్తమహాపరాధమే. సృష్టికర్త ద్రాక్షాగుళుచ్ఛములనే సృజించియున్న బెల్లము, చక్కెర మొదలగునవి యెట్లు దొరకవలయును. ఆసృష్టికర్త ముది మదిఁ దప్పినమొదటివేల్పు గావున నాలోచ న తోఁచలేదు.

ప్రబంధములయందుఁ గథాసంవిధానముఁ, బాత్రకల్పనయు నించుమించుగ నేకవిధ మనుట నిర్వివాదాంశ మని యెవ్వరు నొప్పుకొనకపోలేదు. అవి కథా సంవిధానచమత్కారమును వెల్లడింపఁగడంగినవి కావు. మఱేమన్న భాషాచమ త్కారము, గల్పనాచాతురి, రచనానైపుణము, భావపుష్టి, రసోజ్జృంభణము, నింగితావిష్కరణచాకచక్యము మొదలగుభాషాప్రపంచమును జూపఁగడంగినవి. భాషాగాంభీర్య మంతయు నొకచో సమావేశ మొనర్చి పాఠకులమనంబునకు విస్మయమును నానందమును గల్పించి తన్మయత్వము నొందించుటయే ప్రబం ధరచనాముఖ్యోద్దేశము. ఉద్దేశ మెఱుంగక దూషించుట ధర్మముకాదు. భార

తము, భాగవతము, రామాయణము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్న
మును గధాసంవిధానమున నెంత పొగడఁదగినవో భాషాచమత్కారమున
నీప్రబంధములు నంతపొగడఁదగినవే. నిష్పక్షపాతబుద్ధితో నాలోచించినఁ బ్రబంధ
ములయం దున్నంతభాషాచమత్కారము భారతమునను మఱి దేనియందును లే
దని దృఢముగాఁ జెప్పవచ్చును. ప్రబంధములయందు భాషాచమత్కారము పూర్ణ
ముగ మూర్తీభవించిన దని చెప్పకపోవుట న్యాయముకాదు.

భాషాచమత్కారముయొక్క సృష్టికర్త యల్లసాని పెద్దన్న. కావుననే
యితనికి నాంధ్రకవితాపితామహుఁ డన్నబిరుదము వచ్చినది. భాషాచమత్కా
రము ముదావహమును భావావిష్కరణచణమును తన్మయత్వాపాదకక్షమం
బు ననుటకు శ్రీకృష్ణదేవరాయలే సాక్షి. సేతువింధ్యాచలమధ్యమహీమండలము
నకు సార్వభౌముఁ డగుశ్రీకృష్ణదేవరాయఁడు తత్ప్రబంధస్వీకారసమయము
నందుఁ బల్లకిఁ దాఁ జేతఁ బట్టి యెత్తుటయు నెదురై నప్పు డంతయుఁ బెద్దన్నను
గేలూఁత యిచ్చి యేనుఁగుపై నెక్కించుకొనుటయు వలసినసీమల ననేకాగ్రహా
రముల నొసఁగుటయు నిట్లె యాయాప్రబంధములకు నాయాప్రభువులు పెక్కులు
బహుమానంబు లొసంగుటయు భాషాచమత్కారమునకుం గలప్రాశస్త్యమును
వేయినోళ్లం జాటుచుండ వేఱునిదర్శనములం జూపనక్కఱలేదు. జాతిమతభేద
ములు పూర్ణముగఁ బాటించునాకాలమున శూద్రకులసంజాతుఁ డగురామరాజ
భూషణునికి నాబ్రాహ్మణవిద్వత్సభయందు నంతటిగౌరవమును, మహారాజసమ్మా
నమును "నాపాదమునందు వర్తిలెడునందియ యే మని పల్కుఁ బల్కుఁడీ" అని
చెప్పునంతటిగర్వమును గలిగించినది భాషాచమత్కారము గాక మఱియేది?
కవిత్వతత్త్వవిచారము పొగడుకళాపూర్ణోదయకర్తయే భాషాచమత్కారము ప్రశ
స్యము నుపాదేయము నని

మ. ఇట మున్నారుడసంహితాదికృతు లీవింపొందఁగాఁ బెక్కొన
ర్చుట విన్నారము, చెప్పనేల యవి, సంస్తుత్యోభయశ్లేషసం
ఘటనన్ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నె
చ్చట నెవ్వారికి నీక చెల్లె నది భాషాకావ్యముం జేయఁగన్.

అనుపద్యమునఁ జెప్పియున్నాఁడు. ఇట "భాషాకావ్యముంజేయఁగన్" భాషా
చమత్కృతికావ్యముగఁ జేయఁగా నని యర్థము చేయవలయు. రాఘవపాండవీ
యమున భాషాచమత్కారముదప్పఁ గథాచమత్కార మేమి యున్నది. అది

చదువునప్పుడు పండితులయానందమునకు మేరలేదు. పామరులకుఁ గలుగకపో యినంతనె దానిగౌరవమునకు హానిలేదు.

భాషాచమత్కార ముపమాద్యలంకారమూలకము అలంకారము ల నావశ్యకము లైన భాషాచమత్కార మేమున్నది. ఎఱుకులయేనాదులమాట లకు హైన్యమును నుత్తమజాతులవారిసంభాషణమునకు గౌరవమును గలుగుట కు హేతువు వక్రోక్త్యాద్యలంకారములు గాక మఱేవి? "ఆపీఠముపైఁ గూర్చుం డండి" అనుటకును "నాపీఠమునలంకరింతురుగాక" అనుటకును భేదము లేదా? "వైఖానసం కి మనయా వ్రత మాప్రదానాత్ .... ఆహోనివత్స్యతి సమం హరిణాంగనాభిః" అని యడుగక యామెను ఋషుల కిచ్చెదరా రాజుల కిచ్చె దరా యని యడిగియుండినఁ గాళిదాసున కంతటిమహిమ వచ్చియుండునా? "సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం" అనుపద్యమునందు ముఖ్య మగువక్త వ్యాంశము శకుంతల నారచీరకట్టుకొన్నను మనోజ్ఞ యని చెప్పుటయేగదా? "సరసిజం" మొదలగుదృష్టాంతము లేలా? దృష్టాంతములమూలమున వక్తవ్యాం శము దృఢపడి యర్థాన్తరన్యాసముచే సమర్థింపఁబడుటంజేసి గదా యాపద్య మంత చమత్కారజనక మైనది. ఆదృష్టాంతములఁ ద్రోసివేసిన నామాటయు మన మాటవంటిదే యవును. భావగాంభీర్యము భాషాచమత్కారము నలంకారముల వలన నభివ్యక్త మయినట్లు మఱిదేనివలనను గావు.

అలంకారములు స్వభావజన్యము లైన నొప్పును గాని బలాత్కారజన్య ములు శోభావహములు గావనియుఁ బ్రబంధములయందలియలంకారము లట్టివి గావుగాన నవి గర్హణీయములు ననుట సమంజసము కాదు. స్వభావసిద్ధము లనుట కర్థము తెలియదు. ఆలోచనాప్రయత్నము లేకయే వచ్చునవి యనియేమో? చారుకవిత్వమే యాలోచనాశక్తిసాధ్యము. అలంకారము లాలోచనాశక్తిసాధ్య ము లని వేఱుగఁ జెప్పవలయునా? ఆలోచనాశక్తి లేక యలంకారములు రావ ని దృఢముగఁ జెప్పవచ్చును. తిక్కనాదులకును నాయలంకారము లించుక మైనను నాలోచనలేక వచ్చినవని చెప్పుటకు నిదర్శనము లేవియు లేవు. ఇతరు లకంటె వారికి శీఘ్రముగ స్ఫురించియుండు నన్నఁ బ్రకృతిని మీఱుట గాదు. "పఱమొయిల్ గప్పిన" అనుపద్యము తిక్కనకు నించుకమైనను నాలోచన లేకయ నిర్గమించిన దనుట యాయనయందలిభక్తివిశేషమే? తిక్కన యింట మాటాడినట్లు కవిత్వము చెప్పువాఁడేని ఆభారతముఁ జెప్పుటకు మూఁడుసంవత్స

రము లేల పట్టును. కవిత్వప్రపంచమునకు వారు దేవతలుగాన వారి కామూ
త్రము గౌరవము నీకున్న నెట్లు! ప్రబంధకవులకును నాశ్లేషాద్యలంకారములు
స్వభావసిద్ధము లని చెప్పకపోవుట పక్షపాతము. శృంగారరసావిర్భావమునం దగ్ర
గణ్యతఁ జెందినవి ప్రబంధములుగాక మఱేవి?

శృంగారరసము రసములలో నెల్ల శ్రేష్ఠ మైనది. సర్వప్రాణులకును సహజ
మైనది: సర్వభూతములహృదయకవాటముల సదావాసము చేయురస మిది తప్ప
మఱేదియు లేదు. కరుణాదిరసము లెప్పుడును బుట్టునవికావు. ఎప్పుడైన నొక్కప్పు
డు పుట్టినను దత్క్షణము నశించును ఈరసముచేఁ గలుగునానందము మఱియేరసము
చేతను గలుగదు. అనుభావాదులు తక్కినరసములకు నున్నవి కాని యీరసము
నకున్నన్ని లేవు. ప్రతిజీవజంతువునకును శృంగారము రుచించినట్లు మఱియేర
సము రుచింపదు. ప్రాణులహృదయమున నిది తనకుఁదాన పుట్టుచున్నది. కరుణ
రసము దీనులఁ గాంచినపుడుమాత్రము పుట్టుచున్నది. వీరరసము శత్రువు గంటఁ
బడినప్పుడ యుద్భవించుచున్నది. ఘోరకృత్యములఁ గనుఁగొనిననే భయా
నక ముత్పన్న మగుచుండును. ఈరసములు గొందఱకు మాత్రమే పుట్టుచు
న్నవి. నిర్దయుల నెందఱ నెఱుంగము: పరమశాంతుల నెందఱను జూడము!
మిన్నువిఱిగి పైఁబడినను దుఃఖింపని ధైర్యశాలు లెందఱు లేరు. క్రోల్పులి పైఁబడ
వచ్చినను భయముఁ జెందనిధీరు లెందఱు లేరు. కాని విషయవాంఛలు లేని
ప్రాణి నెందును గానము. శృంగారరసము సర్వప్రాణిసాధారణమును, మనోజ్ఞ
మును, గావున మధ్యకవు లందఱును దానినే విశేషముగఁ దమకావ్యముల
యందు వర్ణింప నారంభించిరి. ఇది యొకతప్పా? ఈరస మెట్లుపరిపుష్టిఁ జెంద
వచ్చునో యెట్లు పాఠకులహృదయముల వెల్లిపెరియునో యావిధము లన్నియు
మధ్యకవులు పూర్ణముగ వర్ణించియున్నారు. ఇందుఁ బ్రకృతిస్వభావవిరుద్ధము
లేవియు వర్ణింపఁబడలేదు. నాయికానాయకుల హృదయగతభావము లున్నవి యు
న్నయట్లు చూచినట్లు వర్ణించు టెంతయు శ్లాఘనీయము. ఆభావములు రాళ్లకుఁ
బుట్టకపోవునేమో కాని పంచభూతాత్మక మగుశరీరముగలసర్వప్రాణులకుఁ బుట్టు
ననుట నిర్వివాదాంశము. అవి స్వసంవేద్యములు నపడక్షీణములునైనను గవు
లు వానిని వ్యక్తీకరించుట ముఖ్యకర్తవ్యమే. మూత్రపురీషాదులు అసహ్యకర
ములును నవాచ్యములును నైనను వైద్యశాస్త్రము వానితత్త్వమును వెల్లడిం
చుట ధర్మముగదా? కావుననె మధ్యకవులు ప్రబంధములు సామాన్యులకు బో

ధపడనంత కఠినముగ వ్రాసినారు. శృంగారముశక్తి నంతయు విచ్చలవిడిగ విశృంఖలముగ వ్రాసినారు. ఈశృంగారకావ్యములు తమకుఁదామ చదువుకొని యానందింపఁదగినవే గాని వీధిపురాణములు చెప్పఁదగినవి కావు. భాషాప్రౌఢిమ, కవిత్వమర్మము, కల్పనాకౌశలము మొదలగుచమత్కారముల నెఱుంగఁగోరువారు చదువుకొని యానందింప నుపయుక్తము లయినవి

భారతము రామాయణము మొదలగుపురాణేతిహాసములు ప్రపంచమునకు వలయుసర్వవిషయములను బోధింపసమకట్టినవి. జనసామాన్యమును సంతోషపెట్టఁగడంగినవి. కావున నాగ్రంథముల నంతసులభముగ శ్లేషాద్యలంకారభూయిష్ఠములు గానివిగను శృంగారము సూచనమాత్రము గలవిగను రచింపఁబడినవి. మఱియు నవి ధర్మాదులస్వరూపంబుఁ జూప, నివి వాఙ్మయముయొక్కవిశేషమును గనఁబఱుపఁ బ్రయత్నించినవి గాన వానివానిపని యవి నిర్వహించుకొనుట దూషణమునకుఁ బాత్రములు గావు. శృంగారరసము పచ్చిపచ్చిగ వర్ణింపఁబడిన దనుటకు మనలో నున్నభావము లన్నియు దాఁచిపెట్టక పూర్ణముగ వర్ణింపఁబడిన వని యర్థముగాని యస్వాభావికములు ననుభవవిరుద్ధములును వర్ణింపఁబడినవి యని యర్థము కాదు. నాయికానాయకులమనస్సులో లేనిప్రకృతివిరుద్ధము లైన భావము లేవియు వర్ణింపఁబడలేదు.

కవిత్వతత్త్వవిచారము ప్రభావతీప్రద్యుమ్నములోని ప్రభావతియొకవిరహచిహ్నములఁ దెలిసి శుచిముఖికిం జూపుటను బ్రభావతి తనమనోభావమును బ్రకటించురీతిని నవి గణికలకైనం బుట్ట వనియుఁ దగ వనియు, శృంగారమే కాదనియుఁ, దుచ్ఛశృంగార మనియుఁ, గడుంగడు దూషించినంతనె పింగళిసూరన్నకుఁ గాని ప్రభావతికిఁ గాని యావర్ణనకుం గాని యేకొఱంతయు రాలేదు గాని మఱిప్రకృతిప్రౌఢిమకుఁ జాలఁ గొఱంతయు నవమానముఁ గలుగును వాస్తవకవిత్వతత్త్వవేత్త లీక్రిందివాని నరయుదురుగాక !

సీ. నెలఁతముక్కఱయందు నీలంబు గాదుసూ తెలిదళుకొత్తుముత్తియముగాని,
యువిదసందిళ్ల బాహుపురులు గావుసూ మితిచూడ నిడినయూర్మికలుగాని,
సుదతిపాలిండ్లఁ గస్తురినల్పు గాదుసూ కనుదోయికాటుకకప్పుగాని,
రమణికర్ణికల వజ్రపుదీప్తి గాదుసూ ప్రాఁగెంపుఁదునుకలరంగుగాని,

తే. యూర్పు వేఁడిమిఁ గృశత బాష్పోదయమున,గండపాండిమఁ దత్తత్ప్రకారములను
గానఁబడియెడు నోవిహంగమపురంధ్రి, యింక నీచేత నున్న దీయింతిబ్రతుకు.
(ప్ర. ఆ. 3. ప. 82.)

సీ. ఆరతికిఁ గరంబు లైతిరే నవ్విభుఁ గౌఁగిలింపఁగ నబ్బుఁ గరములార !
ఆయింతికిఁ గుచంబు లైతిరే నతనివక్షోనిపీడనమబ్బుఁగుచములార !
ఆలతాంగికిఁ జెక్కు లైతిరే నారమ్యశీలుచుంబన మబ్బుఁ జెక్కులార !
ఆనెలంతకు వీను లైతిరే నాకళావిదుమంతనం బబ్బు వీనులార !
తే. యట్లు గానోఁచ కేల నాకైతి రకట, యని నిజావయవంబుల కాత్మ వగఁచు
బాల్యమునఁ దన్ను రమణసౌభాగ్యకలిత, యనిరసాముద్రికులమాట లరసి తిట్టు.
(ప్ర. ఆ. 3. ప. 104.)

విరహిణులకు నాధర్మములు నాభావములు గలుగుట విరుద్ధమో కలిగినను గవి వర్ణించుట విరుద్ధమో నాకుఁ దెలియకున్నది అవి కలుగుట విరుద్ధ మన్నఁ బ్రకృతికిఁ గోపము వచ్చును. వర్ణించుట యసమంజస మన్నఁ గవికిఁ బ్రకృతిప్రలోభనదోషమును లోకవంచనాపరాధమహాపాపమును ఘటింపకపోదు. పిపీలికాదిబ్రహ్మపర్యంతము గలసమస్తజీవులకు విరహావస్థయందు మనోరథము నెఱవేఱకపోయినప్పుడు చింతచే ముఖవికాసభావముతగ్గి నల్లఁబాఱుట మేను చిక్కుట కన్నీరుగారుటచేఁ గజ్జలమలీమస యగుట చెక్కులు దెల్లవడుట యివిమొదలగుధర్మములు స్వభావజన్యములు గావా ? ఇవి యసంభవము లన్న నిఁక నే నేమి యనఁగలను. ఇవి కవి వర్ణించినంత కలుగకపోయినను గలుగుటయేమో నిశ్చయము. అందుకు సందేహము లేదు ఉన్నవాని నతిశయించి చమత్కారముగ వర్ణించి రసావిర్భావము కలుగునట్లు చేయుట కవితప్పా ? కామినీకాముకుల కాధర్మము లుద్భవింప వనుట ప్రకృతిధర్మ మెఱుఁగమియే, సంతసారకాయలు గాన ననుభవించియనుభవించి విసుగు జనించిజనించిన వేశ్యల కిట్టిభావములు పుట్టవేమో కాని యుప్పుకారముఁ దిన్నప్రతిజీవికిని నూతనయువతీయువకులకు సహజధర్మములే ? కవిత్వతత్త్వవిచార మింకను బాల్యమున నుండవలయును. వార్ధకమున నున్నవారికి సహితము కొంచెముగనో గొప్పగనో యట్టివాంఛలు పుట్టుచునే యుండును. పూర్వసమాచార మేమో నాకుఁ దెలియదు గాని స్తనంధయులను విడిచి తక్కటియిప్పటిబాలికలకును బాలురకునుగూడ నట్టియూహ లుద్భవించుట స్వాభావికమే. రాళ్లకుఁ జెట్లకు నట్టితలంపులు పుట్టునో పుట్టవో ప్రకృతిశాస్త్రజ్ఞుల నడుగుదము. కౌఁగిలింపను, వక్షోనిపీడన మొనర్పను, జుంబనము చేయను, నాతనితోడ మంతనం బుండను, గోరుట యస్వాభావికము లైన మతేవి స్వాభావికములో తెలియరాదు. " కౌఁగిలింపను గాంక్షించుఁ గాంతునురము । చుంబ

నము సేయ వాంఛించు సుదతిమోవి। యతనితో మంతనంబుండ నభిలషించు। నతనితోఁ బంతులాడంగ నాత్రపడును." అని వ్రాసిన నస్వాభావికము గాదు గాఁబోలు. ఈవిషయమునే గూఢముగను జమత్కారముగను మనోహరముగ ధ్వనించునట్లు వ్రాసినది తప్పు వచ్చినది. "జీవితం వ్యంగ్యవైభవమ్" అన్న వారలు ప్రకృతివిజ్ఞానశూన్యులా? మనకవులకు శృంగారప్రకృతి యగోచరమంట. విద్వాంసు లరయుదురుగాత. పైభావములు మనహిందూదేశమువారికే గాక యాంగ్లేయులకు నున్నట్లు షేక్స్పియరుగారు వ్రాసియున్నారు.

ఆత్మతృప్తి యంగములద్వారమునఁ గాక ప్రత్యేకముగ నున్నదని యేప్రకృతిశాస్త్రజ్ఞుఁడును జెప్పఁడు. ఆత్మకు నాలింగనసౌఖ్యము బాహువులవలనఁగాక మఱిదేనివలనఁ గలుగును ? రహస్యాలాపసుఖము వీనులమూలమునఁ గాక యింక దేననైనఁ గల్గునా ? చుంబనానందము చెక్కులమూలమునఁ గాక మఱి దేనను లభింపదు. ప్రప్రథమమున వీనికి నాయాసౌఖ్యములు కలిగియే యావల నాత్మకుఁ గలుగుట సుప్రసిద్ధము. "నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని" అనునట్లు "అపాపము చేతులారఁ జేసితిని" "కన్నులారఁ గాంచితిని" అనుట లోకప్రసిద్ధము. సర్వమునకు నాత్మ యాధారమైనను నింద్రియసమేతము గాక యేపనియుఁ జేయఁజాలదు. ఆత్మేంద్రియములకు నిత్యసంయోగము ప్రసిద్ధము కాకపోలేదు. శాంతిపర్వముఁ జూచిన స్పష్టము గాఁగలదు. కావున నాత్మేంద్రియములకు నద్వైతభావము గలిగించి యాత్మధర్మము లింద్రియములం దతిదేశించుట దోషావహము కాదు. ఇట్టికల్పన లౌకశృంగారముననే గాక తక్కినరసములయందును జూడనగు.

నాయికానాయకులనడవళ్లును స్వభావములును వారివారిమర్యాదకును బదవికిని దగినవై నీతిబాహ్యములు గాక దేశక్షేమాభివృద్ధిహేతువులై ముందువారికి ననుసరణీయంబులై యుండవలయును గాని తమముకుఁనకు సూటిగ నుండరాదు. ప్రబంధములయం దట్లున్నవి గొప్పవారందఱును రాయబారులమూలముననే తమతమకార్యముల నెఱవేర్చుకొందురు కన్యలం జెప్పవలయునా? వేశ్యలుసహితము స్వయముగ విటులను గుదుర్చుకొన రన రాజకన్యలు తాముగఁ బ్రియుని వెదకుచుఁ బోయి యతనితోడ సంభాషించి తమవలపును దెలిపి పెండ్లి చేసికొనుట కిచ్చగింతురే. అంతటిదుర్బుద్ధి హిందూస్త్రీల కింకను బుట్టలేదు. అంతటిధైర్యము, స్వాతంత్ర్యము, స్వచ్ఛందప్రవృత్తియు హిందూస్త్రీలకుఁ బ్రబం

ధకవులు గల్పింపమి మహాపాపమే ? ఒకప్రబంధకవులకే గాదు, ఆదికవులకుఁ
గూడ నిదే దుర్బుద్ధి పుట్టినది. సీత, ద్రౌపది, రుక్మిణి మొదలగువారును దమ
భర్తలను దాము తెచ్చుకొనలేదు. తల్లిదండ్రులే తెచ్చియిచ్చిరి. దాంపత్యసంఘ
టనమున యోగ్యురాండ్రగుముఖ్యపరిచారికలు మధ్యస్థత్వము వహించుట ధర్మ
విరుద్ధము దోషావహమును గాదు. తల్లిదండ్రులకంటె వీరే తగినవారు. తల్లిదం
డ్రులకడ జంకును గొంకును నుండును. వీరియొద్ద నది యుండదు. మనంబున
నున్నయర్థమును స్పష్టముగఁ జెప్పి తమయభీష్టముల నెఱవేర్చుకొందురు. వీరు
నీచస్వభావలును స్వామిద్రోహిణిలును వంచనాపరలును దుర్నీతిబోధికలు నుత్కో
చహారిణులును గాక సత్ప్రవర్తన గలవారై స్వామికార్యనిర్వహణసముత్సుకలును,
యుక్తాయుక్తవిచారలును, భావ్యనర్థప్రతీకారక్షమలును, నపయశోనిరాసికలు
నై తమభర్తృదారికలకు యోగ్యుఁ డగుమగనినే ఘటింపఁజేయుదురు. వలపు
పెల్లిదం బావఁజాలక మీఁదుమిక్కిలి విచారింపక మన్మథమాయావాగురములఁ
బడి తాత్కాలికసుఖాపేక్షం గల్లోలమాలికలవలె నుల్లోలంబు లగుచు జనించు
మనోవికారములు పోయినట్లెల్లను దమభర్తృదారికలఁ బోనీక యుచితవర్తన
మున నడపించుచు సార్వకాలికసుఖం బొడఁగూర్చుమహోపకారిణులు. భర్తృ
దారిక లీపరిచారికలకు నెఱుకపఱుపక యేకార్యమును జేయఁజాలరు. వీరు
సర్వదా నీడవలె భర్తృదారికలఁ బక్కఁబాయక కొల్చియుందురు.

స్వచ్ఛందత నిర్వహించుటకుఁ దగినసామర్థ్యము మనస్త్రీలకుండి మనకవు
లీయకున్న దోషమే? కాని యట్టిసామర్థ్యము హిందూదేశముస్త్రీలకేకాక యేదే
శపుస్త్రీలకును లేదనుట స్పష్టము. స్త్రీలు సహజభీరువులు. అబలలు పురుషుల
కున్నంతబలము, ధైర్యము, బుద్ధిచాకచక్యము, యుక్తాయుక్తపరిజ్ఞానము, గాంభీర్య
ము, దృఢగాత్రత, శీతోష్ణసహిష్ణుత్వము మొదలగునవి స్త్రీలకు లేవు. పురు
షుఁడు మోసినంతబరువు స్త్రీ మోయఁజాలదు. పురుషుఁడు నడచినంతదూరము
స్త్రీ నడవఁజాలదు. నాల్గుమైళ్లు నడచినంతనె కాళ్లు బొబ్బలుపోవుచున్నవి. ఒక్క
పూఁట నన్నము దొరకకపోయినఁ దోఁటకూరమట్ట వ్రేలఁబడినట్లు వ్రేలఁబడును.
చీఁకటిలో నొంటరిగ నెంగిలియాకు పాఱవేసి రాఁజాలనంతటి మహాధైర్యశాలి
నులు స్త్రీలు. ఇట్టివారు చోరకిరాతవ్యాఘ్రాదులకు జడియకయుండి దేశదేశ
ము దిరిగి తమగుణాతిశయములఁ గనఁబఱచి భర్తల వరించుటగాని యితరవి
షయముల నిర్వహించికొనివచ్చుటగాని యెట్లు చేయఁగలరు ? మనవా రట్టివా

రినిగఁ జేసి రందురేమో ? పశ్వాదుల నట్టివానినిగ నెవరు చేసిరి ? పశ్వాదుల యందు నెద్దులు దున్నపోతులు మొదలగుమగజంతువులు కష్టపడి పనిచేయుచున్నవి. కష్టపడి సేద్యముచేసి పుట్లాది పండించి తమను దమయజమానులను బోషించుకొనుచున్నవి. ఆవులు గృహమున నుండి యెద్దులు సంపాదించినమేఁతను దిని దూడల నీని వంశాభివృద్ధి చేయుపనితప్ప మఱి యేపనియుఁ జేయఁజాలవు. ఎద్దుతోఁ బోట్లాడినయావును నెందును గానము. ఎద్దును జూచినయావు తొంబదితొమ్మిదియామడఁ బరువెత్తును, ఈధర్మము లన్నియు మనుష్యులయందును బూర్ణముగ నున్నవి ! వాని నన్నింటి నిట నిరూపించుట కాలహరణమునకు హేతు వగును. కానఁ జదువరులే యూహింపుఁడు.

పైహేతువుల నన్నిటినిఁ జక్కఁగ విచారించి పరమదయాళువు లగుధర్మశాస్త్రకర్తలును, వారి ననుసరించినకవులును స్త్రీలకు స్వచ్ఛందప్రవృత్తిని నిషేధించి యెండఁగన్నెఱుఁగకుండ నీడపట్టునఁ గూర్చుండఁబెట్టి సర్వసుఖముల నబ్బునట్లు చేసిరి. అబలలుగావున స్వయముగ సంపాదించికొన శక్తిలేనివారని యెంచి పురుషులకు లోఁబడి వర్తించునట్లును వారిమనసున కెక్కు మెలఁగునట్లును వారినే దైవముగ నెంచులాగునను వారితోఁ దప్ప మఱియేరితోను మాటలాడకుండునట్లును మఱియొకరియింటికిఁ బోకుండునట్లును గట్టుదిట్టముల నేర్పఱిచిరి. ఇవి స్త్రీలయొక్కయు దేశముయొక్కయు నభివృద్ధిహేతుభూతములేకాని తన్నాశకరము లెప్పటికిని గావు.

స్త్రీలవలనఁ గామసుఖము లొక్కటియే యని యనుకొందురు. అది తప్పు. వారివలనఁ బురుషుల కెన్నియో సౌఖ్యములు గలవు. గృహకార్యముల నిర్వహించికొని పురుషునికి సాహాయ్యము చేయుచున్నారు. సంపాదించుసామర్థ్యము స్త్రీలకు లేదని పైన నిరూపించితిమిగాన సంపాదించి తమను బోషించుపురుషులకు భోజనమజ్జనాదులచే సర్వవిధములను నుపచరించుచు వారు సంపాదించికొని వచ్చుటకుఁ దగినయానుకూల్యములఁ గలుగఁజేయుచున్నారు. ఆడను బాడను మద్దెలఁగొట్టను దా నొక్కఁడే యయినఁ బురుషున కేమిసుఖ మున్నది. ఇంటను బైటను గష్టపడినవాఁ డెన్నాళ్లు జీవించును. మఱియుఁ బురుషుఁడు దాను వెలుపలఁ బొందివచ్చినకష్టముల నెల్ల మఱచునట్లు చేయఁజాలినమోహనశక్తియు బాహ్యప్రపంచమును, గనఁబడకుండున ట్లొనర్పఁజాలిన రూపలావణ్యాదులను స్త్రీలకు నెక్కుడుగఁ గలుగఁజేసినాఁడు దేవుఁడు. పురుషుఁ డెంతకష్టపడి వచ్చినను

భార్యముఖముఁ జూచినతోడనే యాచింతల నెల్ల నొక్కుమ్మడి విస్మరించి హాయిని గనుచున్నాఁడు.

నూటికిలోఁ దొంబదితొమ్మండుగురు స్త్రీసౌఖ్యముఁ గన్నవారే. కావుననే పురుషులు తా మెన్నికష్టములయినను బడి సంపాదించి స్త్రీలకు సుఖమును గలిగించుచున్నారు. తాము రెండురూపాయలదోవతులఁ గట్టుకొన్నను భార్య కధమపక్షము పదిరూపాయలచీరనైనను దీసి యివ్వకపోరు. తా మెక్కడికైనను బోవలసివచ్చినప్పుడు నడచిపోయినను భార్యతోఁ బోవుచున్నప్పుడు బండిలోఁ గాని పోరు. తా మొక్కతులముబంగారము ధరింపకపోయినను మణుఁగులకొలఁది బంగారు భార్య కొసంగెదరు. భార్య యేమేని నపేక్షించినఁ జెఱలోనైనంబడి సాధించి తెచ్చియిచ్చెదరు ! భార్యచే మెప్పువడయఁ జూచెదరు. ఇన్నివిధముల మనధర్మశాస్త్రకర్తలును, గవులును, విద్యావంతులును, స్త్రీల కపారసౌఖ్యమును గౌరవము నొసంగుచుండ స్త్రీలను బానిసలుగఁ జేసికొని రని దూషించుట వింతగ నున్నది. స్త్రీలకుఁ బురుషులు దాసు లనిన నతిశయోక్తి గాదు. ఎంతమోహనశక్తియు నెంతటిసౌఖ్యప్రదాతృత్వము లేనిది స్త్రీల నింత గౌరవముతోఁ జూతురా పురుషులు. ఇట్టిమోహనయంత్రములు గావుననే వీరికి స్వచ్ఛందత స్వాతంత్ర్యము నీయక యొకరియధీనములో నుండి వారు చెప్పినట్లు నడచుకొనునట్లు కట్టుపాటు చేసినారు.

ఇట్టిమోహనదేవతల నెవ్వరు గొనియాడరు ? ప్రబంధకవులు వీరి నింతగ వర్ణించుట వీరియుత్కృష్టతఁ జాటుచున్నది. ప్రత్యవయవమును బ్రోల వచ్చి నిలుచునట్టు లద్భుతకల్పనలతోఁ జవు లుట్టిపడునట్లు రసము చిప్పిలునట్లు వర్ణించుట ప్రత్యవయవముయొక్క మోహజనకత్వమును నిరూపించుటయ కాని వేఱు గాదు. ప్రత్యవయవవర్ణనము ప్రబంధములయందుఁ జేయుట దుష్టము, నస్వాభావికము ననుట పొరపాటు. రమ్యవస్తుసందర్శన మైనతోడనే దాని నుగ్గడింప బుద్ధిపుట్టుట యస్వాభావికమా ! దుష్టమా !

దివ్య మైనప్రాసాదము కనులఁబడిన దానియంతస్తులను, నందలిపనివానితనమును దానియౌన్నత్యమును, నందలికుడ్యములను, వానియొప్పిదమును గొనియాడ మనసువచ్చుట లోకవిదితము. అచేతనములే యట్టిబుద్ధిని బుట్టించుచుండ నిఁక సచేతనములఁ జెప్పవలయునా? అందును స్త్రీల నుడువవలయునా ? సాధారణముగఁ బ్రపంచజ్ఞాన మించుకయు లేని మిక్కిలి యనాగరకు లగునెఱు

కులు సేనాదులును గొగ్గిరిపండ్లయాఁడుదానిని జూచినను నొకవిధ మగునున్మాదమున కు గుఱియై దానిని వర్ణించుచుఁ దమమిత్రులకుఁ జెప్పికొనుట లోకవిదితము. సకల కలావిశారదుఁడును రసికుఁడును నగునర్మసచివుఁ డసమానలావణ్యవతియగు నొకచకఁనిరాజకన్యకను జూచి యాశ్చర్యపడి దానిలావణ్యాదులను గడుఁ జమత్కారముగ వర్ణించి తనప్రభువుతోఁ జెప్పుట తప్పా? స్వభావవిరుద్ధమా! విద్వాంసు లరయుదురుగాక!

మొట్టమొదట మనస్సు నాకర్షించునది సౌందర్యమే. ఒకనిముఖమును జూచినతోడనే వానియందు నెకఁడను లేనిప్రేమయు దయ యభిమానము వానికి నేమైనను జేయవలయు ననుబుద్ధియు జనులకుఁ బుట్టుచున్నది. ఒకనిముఖము గాంచిన సహజప్రేమ గలవానికిఁగూడ విరసభావము పుట్టి వాని నెదుటికిఁగూడ రానీయ నంతటి కాఠిన్యము ద్వేషమును నుదయించుచున్నవి. దీనికిఁ గారణ మేమి? హావభావవిలాసములుగాని గుణములు గావు. గుణములు చిరకాలసేవన మునఁ గాని యెఱుకపడవు. చిత్తోన్మాదము గలిగించుట, యంగము చిక్కిపోవునట్లు చేయుట,భోజనమజ్జనాదులయందు నరతిఁ గల్పించుట, రమ్యవస్తువులయందు నరుచి పుట్టించుట మొదలగుస్వభావసిద్ధము లగువానిఁ గలుగఁజేయఁజాలదా! ఇంత చేసినది తన్నుఁ బొగడించుకొన లేకపోవునా?

నర్మసచివులు, నాయికలను, దమచెలికత్తెలతో జంకువీడి విస్రంభాలాపము లాడుచు స్వేచ్ఛావిహారము లొనర్చుచుఁ, బరిహాసము లొనర్చుచుఁ దమను నెవ్వ రుంజూడ రని శంకను వీడియున్నప్పుడే చూచునట్లు కవులు సంవిధానము చేసియున్నారు. దానంజేసి వారిరూపలావణ్యాదులనుబోలెఁ దక్కినయవయములను జూచి యుందు రనుట యనుభవైకవేద్యము. ముఖమును, దేహమును, హస్తములను బాదములను వర్ణించుట నైసర్గికము నిర్దుష్టము నైనఁ దక్కటివర్ణనముమాత్రము నైసర్గికము నిర్దుష్టము నేల కాకపోవును?

ఈవర్ణనములు మిక్కిలి యాంతరంగికులును బరస్పరము తమతమరహస్యముల నిర్భయముగఁ జెప్పుకొనఁదగినంత మైత్రిగలవారును సిగ్గు నెగ్గును లేనివారును నగునర్మసచివులును ముఖ్యపరిచారికలును జేయుదురు గాని, తల్లిదండ్రులు, నన్నదమ్ములును, అకఁచెల్లెండ్రును, గురుశిష్యులును జేసిన శ్లేప్రబంధముల యందును జెప్పఁబడలేదు. తమమిత్రులతో నిట్టివర్ణనలు చేయుట యనుచితమా? అస్వాభావికమా? అసహ్యమా?

ప్రబంధములయందలి నాయికానాయకు లందఱును నొకయచ్చునఁ బోసిన ట్లొకవిధమున నుండుట (అనఁగా నందఱిముఖము చంద్రునిఁ బోలియు నందఱికన్నులు కమలములనో కలువలనో పోలియుండుట మొదలగునేకవిధమైన వర్ణనలు) దోషావహము కాదు విషయ మేకవిధముగ నున్నను యుక్తులు కల్పనలును, భిన్నభిన్నములుగనే యుండును. చంద్రాదుల నుపమానముగఁ దీసికొన్నను రామరాజభూషణుఁడు చెప్పినయుక్తులనే కృష్ణదేవరాయలు చెప్పలేదు. అతఁడు చెప్పినదే అయ్యలరాజు రామభద్రయ్య నుడువలేదు. వీరియుల్లేఖములు, శబ్దచమత్కారములు, అలంకారవైచిత్ర్యము, శబ్దార్థసంఘటనానైపుణము, శైలి, రసావిర్భావవైదగ్ధ్యము, అర్థవైచక్షణ్యము మొదలగునవి భిన్నభిన్నములుగ నుండి భిన్నభిన్నసంతోషమును గూర్చుచున్నవి.

ఒకయర్థమును మనోదర్పణమునఁ బ్రతిబింబించునట్లు చేయవలయునన్న సాదృశ్యోక్తిచే నైనట్లు మఱి దేనిచేతను గాదు. బాలునికి గుఱ్ఱమును గుఱించి బోధించునప్పుడు గుఱ్ఱము పటమును నెదుట నుంచికొని బోధించినం జక్కఁగ బోధపడును. లేకున్న బోధపడదు. ఆబోధనయు సలక్షణ మనిపించుకొనదు. ఆబోధకుఁడు మంచిబోధకుఁ డని యనిపించుకొనఁడు. కవులును "నుపమోత్ప్రేక్షాదులు భావస్ఫూర్తి నినుమడింపఁ జేయఁదగినసాధనము" లని యెంచి యవి లేక కావ్యముల రచింపరు. అవి లేనిచోఁ దమపలుకులకును నేనాదివారి మాటలకును వ్యత్యాస ముండదని భావింతురు.

ప్రబంధముల రచించుకాలమునకు ముఖాదులకంటె నధికగుణము గలవియు నుపమింపఁదగినవియుఁ జంద్రకమలాదులే కాని మఱేవియు లేవు. అప్పుడనియే యేల చెప్పవలయు. ఇప్పుడును లేవు. ఇంకను నుండఁబోవు. అధికగుణము గలవి యుపమానములు, తక్కువగుణము గలవి యుపమేయములు. అధికగుణము గలచంద్రాదులతో ముఖమును బోల్చి ,ముఖమును బ్రతిబింబించునట్లు చేయుట యొకదోషమా? గోపాలకృష్ణగోఖలేకంటె నధికుఁ డొకఁడు పుట్టువఱకు దేశభక్తుల నతనితోఁ దప్ప మఱియెవనితోఁ బోల్పనగును? దేశభక్తులందఱకు గోకిలే కున్నట్లు ముక్కుచెవులు లేకున్నను నతని కున్నట్లు దేశభక్తి యొకటి యున్నది గావున నతనితోఁ బోల్చినట్లు ముఖాదులకుఁ జంద్రాదులతో యావత్సామ్యము లేకున్నను నాహ్లాదకత్వాది యత్కించి న్ముఖ్యధర్మములతో సామ్య మున్నది గావున వానితోఁ బోల్చి చమత్కరించుట విరుద్ధధర్మము కాదు.

సీతాదేవిముఖము కమలముతోఁ బోల్చకున్న నామెయొక్క ముఖమునకుఁ గొఱఁత కల్గునా యని యందురేమో ? సీతాదేవియొక్క ముఖమును వర్ణింపక పోయిన నామెయొక్క ముఖమునకుఁ గొఱఁత గల్గునా? ఎవరికిని గొఱఁత లేదు, గాని యుపమాదులు లేకున్నఁ గవిత్వమునకుమాత్రము విశేషలోపము గలుగుట నిశ్చయము. ముఖాదులను జంద్రాదులతోఁ బోల్చకపోయిన మఱి దేనితోఁ బోల్పవలయునో యోజింపుఁడు

ఒకటి రెండు ప్రబంధములు విషయైక్యము గలవిగా నున్నవి గాని తక్కిన వానియందు విషయభేదమును బాటింపఁబడినది. వసుచరిత్రము నందలి విషయమునకును, విష్ణుచిత్తీయమునందలి విషయమునకుఁ జాల భేద మున్నది నీలాసుందరీపరిణయమునకు రుక్మిణీపరిణయమునకును నెక్కువభేద మున్నది. వీని కన్నిటికంటెను ననిరుద్ధచరిత్రముయొక్క కథ మిగులవిభిన్నము. ఇందలికథ మంచి ప్రణాళికను బడినది ఇట్లు భిన్నభిన్నవిషయములును బ్రణాళికలును గల ప్రబంధములు పెక్కులు గలవు. వసుచరిత్రమునఁ గథాచమత్కారము విశేషముగ లేకున్నను భాషాచమత్కారము విశేషముగ నున్నది. భాషాచమత్కారవేదులు దీనిని గడునాస్థతోఁ జదివెదరు. కథాచమత్కారము గలకావ్యములయందు ముం దేమి కథ వచ్చునో యని యెదురుచూచినట్లు ప్రబంధములయందును ముంగ పద్యమున నేమిచమత్కారము పెట్టినాఁడో యని యువ్విళ్లూరుచుందురు. ఇట్లు ప్రబంధములయందుఁ గథాచమత్కారమునకు నెదురుచూచినను జూడకపోయినను భాషాచమత్కారమునకును వర్ణనాచమత్కారమునకును యుక్తివైశద్యమునకును నెదురుచూచుచుండుట సత్యము.

జనుల కొక్కొకకాలమున నొక్కొకవిషయమునందు నభిరుచియు, నాదరమును, నభిమానమును, బ్రేమయు మెండు. కృష్ణదేవరాయలకాలమునకు ముందు రాజరాజనరేంద్రుఁడు మొదలగుప్రభువు లందఱు సంస్కృతభాషయందు రచింపఁబడిన పురాణాదులయందలి సారస్యమును గథలను దెలిసికొనుటయందు నిచ్ఛ గలవారలై యుండిరి. కావున నాకాలపుఁగవులు విశేషముగ సంస్కృత కావ్యములను నాంధ్రీకరించుటతోఁ గాలముఁ బుచ్చిరి. ఆకాలమున నది గౌరవ హేతువుగ నెన్నఁబడినది. జనులకు నాంధ్రీకృతకావ్యములయందును నట్టి వారి యందును విశేషగౌరవప్రతిపత్తులు గలవు అప్పటి జనులు కేవలః కుతూహలమానసులు గావునఁ గథాభాగము విశేషముగ నుండునట్లును వర్ణనాం

శములు తక్కువగ నుండునట్లును గథ సులభముగ బోధపడునంత సులభశైలిని గావ్యములు వ్రాయుట కవసర మేర్పడినది.

కథ సులభముగ బోధపడుటకై సులభశబ్దములనే ప్రయోగించుచుండిరి. భాషాప్రౌఢిమపై నెరికిని దృష్టి పాఱలేదు. రానురాను గథాశ్రవణాందోళనము కొంచెము శాంతించి భాషాచమత్కారమునందు నించించుక యాదరము పొడమసాగెను. అప్పుడు శ్రీనాథుఁడు పింగళి సూరన్న మొదలగువారు కథాసంవిధానముతోఁగూడ భాషాచమత్కారమును జూపుటకు మొదలుపెట్టిరి. అద్భుతకల్పనలతో వర్ణనలు గావింప దారిఁజూపిరి. భారతాదిగ్రంథములకన్నఁ గళాపూర్ణోదయము, శృంగారనైషధము, కాశీఖండము, మొదలగుగ్రంథములు భాషాకాఠిన్యము, భాషాప్రౌఢిమ, వర్ణనావిశేషములు, మొదలగుభాషాసౌందర్యమును గలిగియుండుట చదువరులకు విదితమె. ఈయభిప్రాయము శ్రీకృష్ణదేవరాయల కాలమునాఁటికి ముదిరి కథపై నెవ్వరికిని మనస్సు పోక కేవలభాషాచమత్కారముపైనే మనస్సుపోసాగెను. కేవలభాషాచమత్కారము గలప్రబంధకావ్యముల వ్రాయ నవసర మేర్పడియెను. గొప్పగొప్పమహారాజులకు వీనిపై నధిక ప్రీతి పుట్టెను. ఇట్టిప్రబంధముల రచించుటయే గొప్పగౌరవముగను బాండిత్యముగను బరిగణింపఁబడెను. అట్టివారికి విశేషరాజసమ్మానము, బహుమానము రాఁదొడఁగెను. "నక్కను జూచినవాఁ డెల్లను వేఁటకాఁడ" యన్నట్లు ప్రతికవియుఁ బ్రబంధముల వ్రాయుటకుఁ బూనెను. కావునఁ బ్రబంధములయందుఁ గొన్నింట నుపక్రమైక్యము, వర్ణనాభిన్నత, గొన్నికొన్నియెడలఁ జమత్కారాభిన్నత, భాషాప్రతిబింబత, యుక్త్యద్వైతము, గలుగవలసివచ్చెను. ఈప్రబంధరచనకు దారిఁ జూపినవారు సంస్కృతకవులే గనుక వారిలక్షణములే యాంధ్రకవులు గ్రహించి యాలక్షణములప్రకారము తమప్రబంధముల రచించిరి.

ఆయాకాలపుజనుల యభిప్రాయముల ననుసరించి యాయాకాలపుఁగావ్యములును మాఱుచుండును కాలాంతరమున వానికిఁ బ్రాశస్త్యము తగ్గుచుంటయు లోకస్వభావము. ప్రకృతము 20 శతాబ్దమునందు జనులకుఁ బద్యకావ్యములకన్నను గద్యకావ్యములే ముదావహములుగాను సర్వజనశ్లాఘాపాత్రములుగాను నున్నవి. అందుఁ బుస్తక మంతయుఁ జదివినంగాని కథ బోధపడకుండులాగునఁ దలతోఁక లేర్పడకుండు నవల లధికప్రేమాస్పదములు. యుద్ధసంక్షోభమునఁ గాగితములు లేక దేశ మంతయు నల్లకల్లోలముగ నున్నను దాని నివారింపఁ

గాగితముల ఫ్యాక్టోరీలు పెట్టువా రెవ్వరును లేరు గాని నవలాఫ్యాక్టోరీలుమాత్ర మాంధ్రదేశమునందన్ని చోట్లను బ్రారంభింపఁబడి విశేషముగఁ బనిచేయుచున్నవి. ప్రకృత మన్నివ్యాపారములకంటె నవలావ్యాపారము మనహిందూదేశమున మిక్కిలి విశేషముగ జరుగుచున్నది. నవలయంగళ్లు ప్రతిపట్టనమునందును బెట్టఁబడియున్నవి. ప్రతియంగడిలోను నధమపక్షమున 10,12, నవలలకుఁ దక్కువ యుండవు. ఈవ్యాపారము వృద్ధిచేయుటకు మహారాజులును, జమీందారులును న్యాయవాదులును, నుదుత కుడుతౌభక్తి యన్నవిధమున సర్వులును దోడ్పడి దేశాభిమానమును భాషాభిమానమును వెల్లడించుచున్నారు. తెలుఁగు నాల్గుముక్కలు వచ్చినతోడనే నవలాయంగడి పెట్టుకొనుచున్నారు. నవలలు వ్రాసినవారికి విశేషబహుమానములు దొరకుచున్నవి అధికగౌరవము లభించుచున్నది. నవలలు రచించుటయే ముఖ్యపాండిత్యము. అతఁడే కవి ఏకపథ మైన ప్రణాళిక కలిగియున్నను గథ బోధపడకపోవుటచే నవలలో నేమున్నదో తెలిసికొనవలయు ననుపెఱపెఱ మెండుగ నుండుటంబట్టి చదువరులు గడు నాసక్తితోఁ జదువుచున్నారు. ఒక్కసారి చదివినతోడనే కథ బోధపడునట్లు నవలవ్రాయువాఁడు నికృష్టుఁడు. నాల్గుసారులు చదివిన బోధపడునట్లు వ్రాయువాఁ డుత్కృష్టుఁడు. ఎన్నిసార్లు చదివినను గథ యించుకైనను బోధపడకుండులాగున వ్రాయువాఁ డుత్కృష్టతముఁడు. ప్రథమప్రకరణమునఁ గథానాయికయొక్క గాని కథానాయకునియొక్క గాని పేరు నూరుఁ జెప్పక నాల్గైదుప్రకరణము లైనతరువాత

"ఆనాఁడు కమలయట్లు దుఃఖించుచుండఁ దూర్పువైపునుండి దిల్లీపాపోసులు దొడిగికొని రూమియాటోపీ పెట్టుకొని యతిదీర్ఘకాయుఁ డొకఁడు వ్రేమోల వచ్చి నిలిచెను." అనిచెప్పుట నవలాప్రణాళికాప్రౌఢిమ.

అథవా, 1897 సంవత్సరమున నేప్రెల్ నెల 18 తేదియుదయమున 6½గంటలకు సరిగా వీరబాహుఁడు మృతుఁ డయ్యెను. పరిచారకు లందఱును విచారగ్రస్తులయి యుండిరి ఊరివారందఱు కట్టై, కంప చక్కఁజేయుచుండిరి. రామావధానులు తాటియాకులపుస్తకమును జంకఁబెట్టుకొని దర్భలు చేతఁ బట్టుకొని లేని దుఃఖము నటించుచు నెత్తిన ముసుఁగు వేసికొని "మెండు కాలస్యము, ప్రొద్దు పోవుచున్నది చైత్రవైశాఖమాసాలు ఆనికె అవస్తపడతాము. మంత్రకలాపము చాలా జరుగవలసియున్నది. దుఃఖించుట కిది సమయము కాదు. లేండిలెండి" అని కేకలువేయుచు వచ్చెను. అని యుపక్రమింపవలయును. ఇదియే నవలాప్రణాళికాలక్షణము. ప్రబంధములకు నష్టాదశవర్ణనలు ముఖ్యము లైనట్లు నవలలకును గపటబుషియు, స్త్రీలో, పురుషులో స్వచ్ఛందవిహారములు సలుపుచుండ మహాత్మ్యదీయులు పైఁబడుట, వారితో వీరు పోరాడుచుండ నాకస్మికము

గ నొకరాజపుత్రుఁడో యెవఁడో యొకఁడు గుఱ్ఱముమీఁద గూర్చుండి యటకు వచ్చుట వారిని విడిపించుట, యతనిని దమయూరికి ర మ్మనుట, మహమ్మదీయు లనో పూర్వాచారములనో దూషించుట, యివిమొదలయినవి ముఖ్యలక్షణ ములు. తక్కినలక్షణములు కొంచెమించుమించుగఁ దాఱుమారైనను గపటఋషి యుండియే తీరవలయు. అతఁడు లేనిది నవలలు రుచింపవు. నమువఁజాలవు. కథా సంవిధానము పొసఁగదు. ప్రబంధములయందుఁ బ్రాయికముగ నాయికలు సంగీ తగోష్ఠియం దున్నప్పుడే నాయకులు చూచుట సంప్రదాయ మైనట్లు నవలయం దును నాయికలు చెఱపట్టఁబడినప్పుడే నాయకులు విడిపించుట యందు మూల ముననే యన్యోన్యప్రీతియు, నభిమానము నుదయించుట సంప్రదాయసిద్ధము. “గతానుగతికో లోకో నలోకః పారమార్థికః” కావున, నొకకాలమున నిం పుగ నుండునవి యొకకాలమున నింపుగ నుండవు. అంతమాత్రముచేతనే యవి దూషణకుఁ బాత్రము కావనుట చదువరులు భావింతురుగాక. ఈకవిత్వతత్త్వము పూర్ణముగ నిరూపింపవలయు నన్న, నొకగ్రంథముఁ బ్రత్యేకముగ వ్రాయవల యును. ఇట్టియల్పకాలమున బఠనీయము లగువ్యాసములచే నిర్వహింప సాధ్య ముగాదు

సీ. భాషాచమత్కృతి పాకంబుపరిణతి పాండితీమహిమ సుభావగరిమ
సదలంకృతివిశేషసారస్యవిభవంబు వ్యంగ్యవిస్తారంబు వ్యాపృతంబు
అసమరసాంచితయశముమహత్త్వమ్ము శైలీవిలాసవైశద్యవిభుత
పాత్రోచితాలాపభాసురతానీతి మృగుపదఘటనాసమృద్ధరీతి
తే. ఇన్నియును గల్గ భావంబు లినుమడించి, మ్రోలఁ గ్రాల నానందము జాలువాఱఁ
గవిత నొనరింపఁగఁ బ్రబంధకవులె గాక, యన్యులొనరింపవలఁతులేయవనిలోన.

సీ. కాకెమ్మకథలను గల్పించినంతనె నిర్దుష్టశబ్దార్థనియతి వలదె
నిర్దుష్టశబ్దార్థనియతి యున్నంతనె సమ్యగలంకారసమితి వలదె
సమ్యగలంకారసమితి యున్నంతనె పాత్రోచితాలాపఫణితి వలదె
పాత్రోచితాలాపఫణితి యున్నంతనె భావగాంభీర్యంబు పరఁగవలదె
తే. ఉండి యివి యన్నియును బ్రాణ ముండకున్న, జీవకళ లేనిదేహంబురీవి కవిత
రసము వెలిఁ ద్రోసి భావంబు వసముచేసి, బుధుల మెప్పింపఁ జాలునే భువినిఁదలఁప.

చింతలపల్లి నరసింహశాస్త్రి.

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత గ్రంథములు.

(1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నినాయనమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది వైజయంతీవిలాసముకంటె మిన్న. ౫ ఆశ్వాసములు. ౭౮ పుటలు సవిమర్శమైన ౧౮ వెల రు ౦-౮-౦.

(2) జైమినిభారతము (ఆంధ్రవచనము.)

రెండునూఱేండ్ల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకునిచే రచింపఁబడినది. భాషా సలక్షణము శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు. ౧-౧౨-౦.

1917-18 సం॥ ఇంటరుమీడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము

(3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవి విరచిత మగుఛందశ్శాస్త్రము ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేకలిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రచ్ఛందస్సుల భేదాభేదములు, లచ్చుటచ్చుగాఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగువిషయము లనేకములుగల విపులమగుపీఠికయు, విషయసూచికయు పద్యానుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును పండితులకును గూడ నుపయోగకరము వెల రు ౦-౧౦-౦.

(4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి.ఏ., బి.ఎల్. గారిచే రచింపఁబడిన సవిమర్శపీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుగఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి.ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల రు. ౦-౮-౦.

(5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలయ్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల రు. ౦-౨-౦.

(6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థళము కృష్ణమాచార్యులు బి.ఏ ఎల్ టీ. గారిచే రచింపఁబడినది. తెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల రు ౦-౮-౦

(7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Guru. 0-8-0

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, 12, అరుణాచల నాయఁక వీధి, చింతాద్రిపేట, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 12 అరుణాచల నాయఁకవీధి, చింతాద్రిపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రచురింపఁబడియెను.

చందా సం॥ కు రూ. 3—0—0. విడిసంచిక రూ. 0—5—0





సంపుటము 6. సింగళి నామసంవత్సరము. కార్తికమాసము. సంచిక. 8.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ప్రతిమాసమునఁ గడపటివారములోఁ బ్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.





# విషయసూచిక.

# ప తాపచరితము

[ఈగ్రంథము మాయొద్ద నొక్కప్రతియే యున్నది తప్పులు మెండుగా నున్నవి చరిత్రము చెలుపు గ్రంథముగావున స్వతంత్రించి సందేహములను మార్పలేదు. ప్రాంతిలోగల పొరపాటులను సవరించిసారము ప అ]

— కథాప్రారంభము —

శ్రీమన్మహాదేవుని సర్వదేవతామయుం డగుశంభులింగంబు నుతియించి, గణనాథుని యనుమతివలన అతనియడుగులకు మ్రొక్కి యేకామ్రనాథుం డనువాడు ఒక్కపుణ్యకథ పలుకందలంచి * శ్రీశైలోత్తరదిగ్భాగంబున కృష్ణాగోదావరీమధ్యభాగంబున దండకారణ్యంబున మునిజనసేవితం బగుహిడింబాశ్రమంబు గనుపట్టిన* అట్టిపుణ్యాశ్రమంబున ఈశాన్యభాగంబునందున హనుమద్గిరి యనునొక్కధరణీధరంబు పురంబుగా విలసిల్లునది దేవగంధర్వ సిద్ధవిద్యాధరవిహారం బైయుండు నప్పర్వతంబు పురంబుగా మధ్యభాగంబున సిద్ధసేవితుం డగుసిద్ధేశ్వరుండును, పూర్వభాగంబున భద్రేశ్వరియును, దక్షిణభాగంబున పద్మహస్తుం డగుగోపాలమూర్తియును, పశ్చిమభాగంబున పద్మాక్షీదేవియును ఉత్తరభాగంబున అనుమంమను, కొండమును, నర్గ, కొమ్మ, కాట్రేయుండును మొదలుగాగలవారలు నూట యెనుబది యేండ్లు యేలినతదనంతరంబున పద్మాక్షీదేవివరప్రసాదంబునం

— పూర్వరాజవృత్తాంతము —

జేసి కాకతిరాజు వెయ్యేండ్లు భూమి పాలించి యేకశిలానగరంబు కట్టించి మరియు పెక్కుసాహసంబులు చేసి శాత్రవుల గెలిచినచరిత్ర సంగ్రహించుక ఇన్నూరుయిగువదేను కథలుగా అనుక్రమణిక సర్వంబును దెల్పెద. సుధాకరుండు జన్మించె, నతండు మహాదేవుని జటాజూటంబు సింహాసనంబుగా నిలిపి సకలదేవతల కెల్ల బత్యంబు బెట్టించి తనరాజత్వంబు నిజంబుగా శోభిల్ల గనుపట్టె. అతనికి పురూరవుండు జన్మించె, నతండు చక్రవర్తియై సర్వంసహాచక్రంబు నొకఛత్రంబుగా పాలించె. తద్వంశంబున నహుషుండు జన్మించె, నతండు ఇంద్రత్వంబు జెంది స్వర్గంబు స్వర్గంబు గావించె అతనివంశంబున భరతుండు మహావిఖ్యాతి జెంది,

* "పలుకందలంచి, కనుపట్టిన, నడుపుచుండ, అగుటయు" మొదలగు ననమాపకక్రియ లీపుస్తకమున సమాపకక్రియలుగా వాడఁబడుచున్నవి

గహ్వరీవలయంబు మహామహిమతో పాలించె. తద్వంశంబున భారతవీరులనం
బరగి భగవంతుం డైనహరిపంచప్రాణంబులం బోలినపాండవులు ధర్మజ భీమా
ర్జుననకులసహదేవులన విలసిల్లిరి రాజసూయయాగ, అశ్వమేధాదిక్రతువులు
గావించి దేవమునిపితృగణంబుల సంప్రీతి జేసిరి. వారిలో కిరీటి మేటి యై ముక్కం
టి గెల్చె. అదియునుంగాక వాసుదేవుని రథసూతుగా జేసి మారుతాత్మజుని
కేతనంబుగా జేసి మరియు కౌరవులంగెల్చుట అది యేమని చెప్పదు. ఆధనం
జయునకు అభిమన్యుండు జన్మించె. అతండు తండ్రివలె పరాక్రమశాలి యయ్యె.
అతనికి పరీక్షిత్తు జన్మించె. ఆఘనుండు రామచంద్రునియట్లు ధర్మంబునాల్గు
పాదంబుల నిలువంజేసి కృతయుగచర్య నడిపించె. ఆమహాత్మునకు జనమేజయుం
డు జన్మించె అతండు తండ్రిపగ దీర్చుటకునై తక్షకాదులనాశంబు గా సర్పయా
గంబు గావించె. అతనికి శతానీకుండు సుతుం డై తమవృద్ధపరంపరలయట్ల విజ
యు డయ్యె. అతనికి క్షేమాంకుండు జన్మించి తనరాజ్యంబు ఒక్కభాగంబు
దేవబ్రాహ్మణులకు ఒక్కభాగంబు పరివారసమేతంబుగా తనకు నడువంజేసి తన
వదాన్యం బెంచి చూచిన రాధేయాదులతో సరిసేయం దగు. ఆక్షేమాంకునకు
విజయాంకనాథుండును సోమేంద్రుండును నిద్దరు అగ్రమహిషికి జన్మించిరి.
అం దగ్రజుం డైనవిజయాంకునకు విష్ణువర్ధనుండు జన్మించె. అతనికి రాజనరేం
ద్రుండు జన్మించె. ఆరాజనరేంద్రునకు సారంగధరుండు జన్మించె.

— నందచరిత్రము —

అంతకుమున్ను మరియు కనిష్ఠుండైన సోమేంద్రునకు విష్ణువర్ధనుండు
జన్మించె. అతండు దాయాదులతో రాజ్యభారంబు పోరాడ జాలక గోదావరి
కుత్తరంబున ధర్మపురిదక్షిణదిగ్భాగంబున ఆనదీతీరంబున ఒక్కపురంబు గావిం
చుకొని రాజుల గెల్చి నన్నూటలరువదిఆరు దుర్గంబులు సాధించి రాజ్యభారం
బు పాలించె. మరియు నతనిచరిత్రంబులు బుధజనంబులచే గద్యపద్యప్రబంధా
దికృతులు చెప్పంబడియె. అతనియగ్రమహిషియందు నందుండు రాజోత్తముం
డయ్యె నందనందనుచందంబున తేజోత్తముండయె, నతనిచరిత్రంబులు నలకా
ర్తవీర్యార్జునుల చరిత్రంబులట్టు మహామహిమ శోభిల్లె. అందు సంక్షేపంబుగా
చెప్పెద. ఆనందుండు నందగిరి ప్రవేశించి నందగిరిపురంబు గావించుకొని
యందు చంద్రపద్మసూర్యాదిత్యులు ప్రధానులుగా, ఋషీశ్వరుండు గురువుగా,
భానుమతీదేవి పట్టపుదేవి గా, లంబోదరుండు రాజుచెలికాడుగా, సులభుండను

రాజు దండనాయకుండును తనపనులు నడుపుచుండ. ఈవిధంబున కొన్నిదినం
బులు రాజ్యభారంబు మహామహిమతో పాలించి శ్రీనగరంబునకుం బోయి
మల్లికార్జును సేవించి భ్రమరాంబికాదేవిని సేవించి యచట సిద్ధోపదేశంబున
నొక్కమహాబిలంబు జొచ్చి అందు ఒక మహాయోగి కనుపింప నమ్మహాయోగి
చేఖడ్గఖేటకంబులు యోగవాలంబులు గొని మరియు నబ్బిలంబు దూరిచనునెడమా
యానృసింహమూర్తి యనుజనార్దనుండును అతిభీషణంబుగా గనుపడిన ఒక్కిం
తయు చలింపక నిలిచిన ఆదేవుండు మెచ్చి దివ్యాయుధంబులు కృపచేసిన మగిడి
బిలంబు వెలువడి దివ్యయోగంబులపై నెక్కి పురంబునకుం జని చోళేంద్రు
నితో మహాయుద్ధంబు చేకొని యతనిచే పూజ గైకొని యతనికూతురును
నంద యనుకన్యకను పరిణయంబై యంత సేతువు కరిగి రామేశ్వరుని సేవించి
తద్దివ్యాస్త్రంబులకలిమిచే ఆవిభీషణుని గెల్తు నని యచట నిలిచిన విభీషణుండు
శుక్రానుమతంబున సర్వధనంబులు కానుకలుగా బట్టిన గైకొని నిజరాజధాని
యగునందగిరి ప్రవేశించి రాజ్యంబు పాలించె. ఆనందునకు నంద యనుకన్యక
వసుమతీకన్యకయును విజయపాలుం డనుసుతుండు నుదయించిరి. వసుమతీకన్య
కను యదువంశతిలకుం డైనసత్యభానునకు వివాహంబు చేసె. మరియు విజయ
పాలునకు అగ్నివర్ణుం డనురాజుజన్మించె. అంత నావసుమతీకన్యకకు వృషసేనుండు
జనియించె. విజయపాలుండు కొన్నిదినంబులకు మృగశాపంబున విగతజ్ఞానుం
డై యుండె నంత మరల శారదానందునిప్రసాదంబున సుజ్ఞానుండై యుండె.
అంత నానందుండు పెక్కుసంవత్సరంబులు రాజ్యంబు పాలించి యోగమార్గం
బులు దాల్చి రాజ్యంబు భోగంబులు చాలించి శ్రీశైలంబునకుఁ జనునప్పు
డు తనవెన్నుతగిలి పౌత్రదౌహిత్రులలోన అగ్నివర్ణవృషసేనుల గాంచి యాద
రించి వారల శారదానందున కప్పగించి వారలయభీష్టం బెరింగి శ్రీశైలనివాసుం
డగుటయు.

ఇట్లు చాలుక్యవంశతిలకుం డైననందునిపరోక్షంబున శారదానందుండు,
రాజ్యంబునకు అగ్నివర్ణవృషసేనుల నధిపతుల జేసి రాజ్యంబు విభాగించి యిరు
వురకున్ బంచిపెట్టుటయు వారలు శారదానందుని యాజ్ఞాక్రమంబున రాజ్యంబు
పాలింపుచున్నసమయంబున మూడువర్షంబులు రాజ్యంబునకు వానలు లేకయు
న్న మహాక్షామం బయ్యె. అంత వృషసేనుండు దేవేంద్ర ప్రీతిగా మఖంబు
గావించి ధాన్య వృష్టిగురియించుటయు నది కారణంబుగా వృషసేనువంశంబు

వృష్టిసంజ్ఞ దనరుచుండె. చాలుక్యవంశతిలకుం డగునగ్నివర్ణునకు నందగిరి రాజధానిగా రాజ్యంబు పాలించి బహుసుతుల గాంచె. అక్కుమారవర్గంబు నగ్నివర్ణులపరోక్షంబున రాజ్యంబు గుడువ నొల్లక తమలో తమరు వైరంబులు దెచ్చుకొని అందులో కొందరు వృష్టికులభూపతుల సహవాసులై యుండిరి.

అచట వృషసేనునివంశంబున పెక్కురాజోత్తరంబులు జరిగిన వృష్టికుల తిలకుం డై నకన్నమదేవుం డనుమహారాజు జన్మించి, తనకు కందారంబు రాజధానిగా రాజ్యంబు పాలించె.

—— సోమదేవరాజువృత్తాంతము ——

దేవభూదేవపూజలు విధ్యుక్తంబుగా నడిపి గోదావరీతీరంబున నున్నవిప్రులకు పదమూడువేలనూరు అగ్రహారంబులు సమర్పించి రాజ్యంబేలుసమయంబున నతనికి సోమదేవరాజు జనియించె. దినదినప్రవర్ధమానుండై తండ్రిపరోక్షంబున రాజ్యం బేలుచున్న సకలధర్మంబులు నడుపుచున్న యవసరంబున నతనిధేనువులు పదమూడువేల నేనూరువందలు తంత్రికూటంబు మొదలుగా గోదావరి ఉభయతటాకంబుల మందలు గావించుటయు వాటిమీద నధికారుల నియోగించిన వారలు మేపుచున్నయెడ కటకవల్లభు డొక్కనాడు సోమదేవరాజు గోవులవృత్తాంతం బంతయు చారులచే విని సకలసేనాసమేతుం డై వచ్చి గోగణంబుల చుట్టు ముట్టడి వేసి తద్గోపాలకులతో యుద్ధంబు జేసి వారల నోడించి గోవుల మలుపుకొని పోవుటయు నాగోపాలకులు కందారంబునకు వచ్చి ముకుళితహస్తులై సోమదేవరాజుకు తద్వృత్తాంతం బంతయు తెలియ బలికిన విని యదరిపడి సకలసేనాసమేతుం డై సోమదేవరాజు కటకంబుపై విడిసి ఆరునెలలు ముట్టడివేసి మహాయుద్ధంబు జేసి సోమదేవరాజుసేనలు మడిసిన తిరిగి మరలి కందారంబునకు వచ్చి మగుడ బలంబుల గూర్చి కటకంబునకు పోయి యెప్పటియట్లు యుద్ధంబు జేసి సకలసేనలు మడిసిన తిరిగి మరలి కందారంబునకు వచ్చి మగుడి బలంబుల గూర్చి కటకంబునకు పోయి మాసద్వయంబు అఘోరయుద్ధంబు జేసి సకలసేనలును మడిసిన తిరిగి కందారంబునకు జేరి యీవిధంబున పదిమార్లు ధేనువులనిమిత్తంబు కటకవల్లభుని సాధించి గోవుల మల్పుకొందునని పోయిసాధించనేరక మహాచింతాక్రాంతుండై బహుబుధజనామాత్యవర్గంబులతో కటకవల్లభుని సాధించ తెరం గెఱుంగన్ బలుకుం డనుటయు వార లి ట్లనిరి. కటకవల్లభుండు అపారధనంబుల బంధుసంపన్నుండు గావున మానవశక్తి గెలువ నలవి గాదు. దేవతాప్రసాదంబునన్ జేసి గెలువం దగు

నని యెకసంగం బలుకుటయు విని రాజు త్రియంబకపర్వతంబు మొదలుగా గో దావరి ఉభయతటాకంబుల నున్నఅగ్రహారంబులు పదమూడువేల నేనూఱగ్రా మంబుల గలవేదాంగప్రచండు లయినబ్రాహ్మణుల రావించి వారల బహు విధంబులం బూజించి అపారధనకనకవస్తువాహ నాంబరాందోలికాభరణ చీనిచీ నాంబరంబులన్ తృప్తులం జేసి వారలహృదయంబుల కానందంబు గావించి ముకుళితహస్తుం డై ఓమహాత్ములారా తనగోధనంబుల కటకవల్లభుండు దోలు కోపోయిన యతని సాధించుటకునై బహువిధంబుల గోరితి అసాధ్యుం డయ్యె. ఏను వార్ధిక్యంబునం బొందితి. కటకవల్లభుని గ్రుంచి గోధనంబులు మరల్చునట్టి సత్పుత్రుల కృపసేయుం డని పలికిన దయార్ద్రమానసులు గావున సోమదేవరా జుకు అభయం బిచ్చి లె మ్మనుటయు.

అవిప్రులు పుత్రకామేష్టి యనుక్రతువు గావించుటయు తత్క్రతుముఖం బున అగ్నిహోత్రునియందు శుభసూచకంబులు గానంబడుటయు అది గని అట్టిపుత్రు డుదయించు నని నిశ్చయించి యాహవిర్భాగంబు మంత్రపూతంబుగా జేసి సోమదేవరాజు అగ్రమహిషి యైనసిరియాలదేవికి కుడువం బెట్టుటయు ఆప్ర సాదంబువిశేషంబుతోడ సిరియాలదేవి గర్భంబు దాల్చుటయు సోమదేవరాజు ప్రమోదచిత్తుం డై యావిప్రులకు అపారధనకనకవస్తువాహనంబులు సమ ర్పించుటయు. అంత విధ్యుక్తప్రకారంబుగా గర్భధారణాదికంబులు క్రమక్రమం బున జేయుచున్నసమయంబున తద్వృత్తాంతం బంతయు కటకవల్లభుడు చారు లచే విని యదరిపడి విప్రకృతంబు వృధా కాదని తల్లడిల్లి తనబంధుజనుల సమ ర్థుల దొరల రావించి వారలతో కార్యంబూహించి పత్నీయుక్తంబుగా సోమదే వరాజును జంపుటకునై యరువైనాలుగువేలమదగజంబులును పన్నెండులక్షల పదాతివర్గంబులును లక్షగుఱ్ఱంబులును గూర్చుకొని కందారంబుపై విడియు టయు. అంత సోమదేవరాజు కటకవల్లభునితో మహాయుద్ధంబు జేసి మాసద్వ యంబున గజయుద్ధంబున గజపతిచే సోమదేవరాజు మడియుటయు.

— సిరియాలదేవివృత్తాంతము —

అప్పుడు సోమదేవరాజుభార్య సామంతవర్గంబు ధైర్యంబు వదలక సిరి యాలదేవి గర్భంబులో నున్నశిశువు తమకు రాజు గాగల డని విప్రకృతంబు వృథా కాదని పిరికితీయక నిలిచి సింహాసనంబున నిలుపుద మని మరిన్ని యొక్క మాసంబు యుద్ధంబు జేసి పదివెయలగజంబులూను అయిదులక్షల పదాతివర్గం

బును యాభయిునెయల తురంగంబులు మడియుటయు. అప్పుడు అంతఃపురం
బున నున్నసిరియాలదేవి పతిమరణంబు విని మహాభయాకులచిత్త యై యున్న
తన్ను తనగర్భంబులో నున్నశిశువును చంపుదు రని విచారించి యెచటికైనను
జని శిశువును రక్షించుకొనియెద నని యూహించి తనపోష్యవర్గంబులలో నూ
రు యిండ్లవారిని రప్పించి వారలతో రహస్యంబుగా తనకార్యం బెరింగించి వా
రల కపారద్రవ్యం బొసంగి మితపరిజన యై, తానును తనగృహదేవత యైన
సదాశివుని ఒడి గట్టుకొని మహాగర్భభారంబుతో గదలి అతివేగిరంబున హన్మ
కొండకు జేరవచ్చి ఆపురం బేలుచున్న యెరుకురాజులకు రహస్యంబుగా తన
వృత్తాంతం బంతయు దెలియం బలుకుం డని తనవెంట వచ్చిన బ్రాహ్మణుల
వివేకచతురుల బంపుటయు వారలచే యెరుకరాజులు తద్వృత్తాంతం బంతయు
విని సోమదేవరాజు ఇవ్విధం బయ్యె నట, మావంటివారలము శరణాగతధర్మం
బనిన కాచిరి, సిరియాలదేవిని వెనుకవేసుకొని గజపతి నెరిగించగలవారమే మహా
త్ములారా యీపురంబునకు నిశిసమయంబున జేరవచ్చుట మిమ్ము నెవ్వ రెరుం
గకుండ రహస్యంబుగా మంత్రభిన్నంబు గాకుండుం డని వారల బంపిన వారు
హన్మకొండనుంచి కందారంబుపర్యంతరం మెట్లు బెట్టించుటయు. అంత సోమ
దేవరాజు సామంతవర్గంబు సిరియాలదేవి కందారంబున లేకుండుట, ఆప్త
వర్గంబుచే విని ఆహాకారంబుగా వగచి యుద్ధంబు చాలించి తేటమొగంబులున్
బడి తమతమదేశంబులకున్ జనుటయు. తదనంతరంబున కటకవల్లభుండు సిరి
యాలదేవి నూరుయిండ్లబ్రాహ్మణులతోను హన్మకొండ దిక్కు మొగంబై పోయె
నని చారులచే విని హన్మకొండపై వచ్చుట మెట్లవారిచేవిని కటకవల్లభుండు హన్మ
కొండపై వచ్చుట యెరుకురాజులు మెట్లవారిచే విని తహతహ పడి శరణాగతుల
నిచ్చుట అత్యంతనరకం బని ఇయ్యక యెదిర్చి పోరపోయిన ప్రాణహాని యగు
నని విచారించి యందు కందారంబున నుండివచ్చినబ్రాహ్మణులతో గలసిరియా
లదేవిని నిశిసమయంబున పురివెలువడ జను లెరుంగకుండ వెడల దోలించుటయు,
ఈవిధంబున సిరియాలదేవి హన్మకొండవలుసవారలతో వెలువడి యావిప్రులకు
సాష్టాంగంబుగా నమస్కరించి మీర లందరు బహుముఖంబుల ఎట్టకేనియుం
జని మిమ్ము రక్షించుకొం డని వారలం బంపి ఆతత్క్షణంబున సిరియాలదేవి తిరుగ
హన్మకొండకు వచ్చి యెర్కరాజుల పౌరోహితుండు మాధవశర్మ యనుబ్రాహ్మ
ణుని నగరి జొచ్చి తనవృత్తాంతం బంతయు వినుపించి నమస్కరించి లేవకయు

న్నం జూచి ఆవిప్రుండు సిరియాలదేవి కభయం బిచ్చి వెరవకు మని యూరడం
బలికి అప్పుడు తనసమీపంబున నున్నభృత్యులచే హన్మకొండలో ఉన్నబ్రాహ్మ
ణుల రాత్రి పిలిపించుకొని యావృత్తాంతం బంతయు వారలకు రహస్యంబుగా
నెరింగించి అందరు నేకగ్రీవంబుగా బలుకుటయు అంతట కటకవల్లభుండు హన్మ
కొండపై విడిసి యప్పురం బేలుచురుకురాజులకు వివేకనీతిచతురు లగువారిచే
కందారంబుననుండి సోమదేవరాజు అగ్రమహిషి గర్భంబుతో నూరుయిండ్ల
బ్రాహ్మణులతో తానువచ్చి మీవద్ద నున్నది ఆబ్రాహ్మణులతో గూడ సిరియా
లదేవిని మాచేతికి ఇచ్చి మావారై సుఖంబున నుండుడు ఇంచుక బెనంగితి
రేని కందారంబున జేసినలక్షణంబు ఎరుంగుదురు గదా యని పలుకుటయు
వార లి ట్లనిరి సిరియాలదేవి మా పురంబునకు వచ్చుట లేదు. ఎట్టిబాస నైనన్
జేసెదము. కాక నమ్మరేనియు నిరాయుధస్థులై వచ్చివెదకు మనుటయు మీ
రలు వీధులు, సందులు, విప్రగృహంబులు ఆదిగా గలబహునియోగంబుల వెద
కుం డనిన వారలు సమ్మతించి కటకవల్లభునిపాలికిం జని యెరిగించిన కటకవల్ల
భుండు రాజగృహంబులకు రాజస్త్రీజనంబులను విప్రగృహంబులకు విప్రవరులను
వైశ్యగృహంబులకు వైశ్యజనంబులను శూద్రనిలయంబులకు నిశ్చలశూద్రవరు
లను మరియు నానాజాతిగృహంబులకు నానావర్ణంబుల నియోగించి వారలకు
అపారధనంబు లొసంగి మణిమయాభరణ చీనిచీనాంబరంబు లొసంగి వారల
తో నాకు శిరియాలదేవిని వెతకి తెచ్చినవారికి నారాజ్యంబులో అర్ధరాజ్యంబు
ఇచ్చెద. నాకు వతండునే చెలికాడు. నాకు ప్రాణబంధుండు ఇందుకు తప్ప నని
యజ్జనంబుల నొడంబరచుటయు, అట్లు రాజుచే అనుజ్ఞాతులై హన్మకొండ
జొచ్చి రాజగృహంబులును మేడలును రాణివాసగృహంబులును బండారగృహం
బులును నేలమాలియును పసులగాపిల్లును నూతులును తోటలును నానావర్ణ
గాడంబులును వెతకి వచ్చినరావుకు నుగిడి వచ్చుచు చూచినయెడల మగుడ
చూచుచు పోయినవీధికి మగుడ పోవుచు ఎక్కినమేడలు తిరుగా ఎక్కుచు ఆవి
విధంబున సిరియాలదేవిని కానక పురంబును నొకరకడకు రావించి చూచు నెడ
కందారంబు ప్రజల నొకర్త రైనగానక యేడుదినంబులు వెతకి బ్రాహ్మణస్త్రీ
లలో సిరియాలదేవిని చూచి కొందరు ఇది రాజపత్ని యగు నని తలంచి బహు
జనంబులతో వచ్చినది. ఒంటిగానే ఉండ నేర్చునే యిది విప్రాంగనయే కాబో
లు నని మగుడు వాసను అందులో నొక్క ధూర్తు ఆయింతిని వీక్షించి యీయిం

తిముఖంబు పూర్ణబింబంబు తిరస్కరించుచున్నది. యీకుటిలకుంతలంబులూం న్ను ఈమందయానంబులును ఈవిశాలనేత్రంబులును సింగిణిబొమ్మలూంన్ను సంపెంగనాసికంబును ఈబాహులును జెక్కువస్తనంబులున్ను ఈరంభోరుపాదం తలును హరిమధ్యనడుమును అష్టదళపద్మంబుల చేతుల వజ్రంబులపలువరుస యు ఇంద్రనీలంబుల కురులును ఈపాదపద్మంబుల మెరుంగులును తక్కినయితర జనకాంతలకు గలుగనేర్చునే యిది రాజపత్ని యగుసిరియాలదేవి యని తప్ప దని నిశ్చయించి తమవారల కేరింగించిన ఎరుకురాజుల యనుమతిని కటకవల్లభుని సముఖమునకు దోడుకొని పోవుసమయంబున ఆపురివిప్రులు సిరియాలదేవిని మరల తీసుకొని ఆహాకారంబులు చేయుచు ఈసతి రాజకాంత కాదు. ఇది విప్రకాంత. మామాధవశర్మకూతురు. ఈచెలియపెన్నిటి వారణాసికి పోవుచు గర్భంబున నున్న మాతృగృహంబున నుంచి చనియె. ఇది నిజంబు ఎట్టిప్రమాణంబు అయిన చేసెదము. అట్లుగా దని తలంచితిరేని యీచెలియతోకూడ మాపురివిప్రుల మంచరమును సొదలు జొచ్చువార మని పట్టి హరిద్రవస్త్రంబుల దాల్చి వీరజడ లల్లుకొని తమగృహంబులు అచ్చుకొని సొదలు పెచ్చుకొని కటకవల్లభునివంశంబు నిర్వంశంబుగా శపియించెద మని పలుకుసమయంబున ఆవిప్రులం జూచి కటకవల్లభునిపరిజనంబులు వణంకి మహాభీతచిత్తులై యావిప్రులకు నమస్కరించి యిది రాజకాంతయని పట్టితిమి. ఇంతియకాక మీకును మాకును వైరంబు గలదే ? కోపంబులు సైరింపుడు. మీకు మాకు నొక్క తగువుగలదు. అది యెట్లనిన, ఈవిప్రజనంబులు సిద్ధేశ్వరునిసమ్ముఖంబున గూర్చుండి యీచెలియ వడ్డించిన అన్నంబులు రోయక భుజింతురేని మీవిప్రకాంత యగును. మీరు నిజంబుగా బలికిన మీకు వెయ్యిగ్రామంబులు అగ్రహారంబుగానిచ్చి యీకోమలినిరక్షించి యీగర్భంబులో నున్నశిశువును మగుడ కందారంబునకు పట్టంబుగట్టెద మని కుయుక్తి వాక్యంబుగా నాడిన వారలతో విప్రు లిట్లనిరి ఈ స్త్రీ రాజకాంత గాదు మాధవశర్మకూతురు. భిక్షుకులైనవిప్రులకు సింహాసనంబేల ? ఈ కోమలి విప్రకాంత. తథ్యంబు. ఇదె మీరుచూడుం డని ఆతత్క్షణంబె సిద్ధేశ్వరుం డైన శ్రీమన్మహాదేవు నగరికిం జని యావిప్రులందరును ఆగుండంబునన్ మునింగి కృతానుష్ఠానులై యద్దేవుని వేదోక్తంబుగా నారాధించి బహువిధంబుల పూజించి చతుర్విధోపహారంబు నైవేద్యంబిచ్చి ఆకోమలి లవణము వడ్డింప నందరు గూర్చుండి సోమదేవరాజు వేదాధ్యాయపరాయణుం డగుటం జేసి

# విశాఖపట్టనమండలాంధ్రకవులు.

## (1) గోకులపాటి కూర్మనాథకవి.

జన్మాదికము :—ఇతఁడు శాఖవేల నియోగి బ్రాహ్మణుఁడు ఆపస్తంబసూత్రముద్గలగోత్రజుఁడు. గౌరమాంబకును బుచ్చనకును బుత్త్రుఁడు. సూరనార్యుని పౌత్రుఁడు. వెంకన్న, కామన్న లనుతమ్ములు గలవాఁడు. శ్రీతిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యుని శిష్యుఁడు. ఇతఁడు తన్నుఁగూర్చి, తాను రచియించిన మృత్యుంజయవిలాసమునం దిట్లు చెప్పికొని యున్నాఁడు.

ద్వి శ్రీసింహభూధర శ్రీరామతీర్థ। భాసురస్థలముఖ్య బహుదేశములకు
నాచార్యు లుభయవేదాంతరహస్య। ధీచతురాత్ములు తిరుమలవంశ
కలశాంబురాశిరాకాచంద్రమూర్తి। సలలితపెద్దింటిసంపత్కుమార
శ్రీవేంకటార్యదేశికులశిష్యుఁడను। పావనగౌరమాంబాబుచ్చిమంత్రి
వరపుత్రుఁడను సూర్యవరునిపౌత్రుఁడను।ఇరవొందు కాశిరామేశ్వరముఖ్య
సరసదివ్యక్షేత్రసంచారభవ్య। కరు లైనవెంకన్న కామన్న యనెడు
ననుజన్ములను గూడి యలరినవాఁడ।... శ్రీకూర్మదాసాఖ్యఁ జెందినవాఁడ.

ఇంక నితనివాసస్థలమునుగూర్చి స్పష్టముగఁ దెలిసికొనునాధారము లంతగాఁ గానరావు. ఇతఁడు తనచిన్నతనములో, ననఁగా, విద్యాభ్యాసము చేయుకాలమున, శ్రీరామతీర్థములో నున్నట్టుగఁ దెలియవచ్చెడిని. ఏల యన :— నితని గురువు లగు వేంకటాచార్యులవారు శ్రీరామతీర్థవాసులు. కూర్మనాథుఁడు చదువు ముగించినవెనుక శ్రీవిజయనగరసంస్థానమున దేవస్థానపుశాఖలో నుద్యోగిగా నుండి శ్రీరామతీర్థము, పద్మనాభము, సింహాచలము మొదలగుస్థలములయందు నుండుచువచ్చె నని చెప్పుదురు. తనజీవితకాలములోఁ జరమభాగమున గజపతినగరమునకు సమీపమున నున్న దేవుపల్లిగ్రామములో నుండెను. అచ్చట నున్నకాలముననే యీకవి "మృత్యుంజయవిలాసము"ను రచియించినటులు తెలియవచ్చుచున్నది. ఎట్లన :—

గీ. పరమభక్తిని గోకులపాటికూర్మ, మంత్రి మృత్యుంజయవిలాసమధురకావ్య
మొనరఁ జదియింప సన్నిధి నుండి వ్రాసె।ధరణి నాదుర్తి హరిహరదాసఘనుఁడు.

ఈపద్యమందుఁ జెప్పఁబడిన అమర్తి హరిహరదాసునివంశజు లిప్పటికిని దేవుపలిలో నివసించుచున్నారని తెలియవచ్చెనని అంతియెకాక దేవుపలిగ్రామమున నిపుడు దేవాలయ మున్నస్థలము పూర్వము గోకులపాటివారి యింటి నివేశన మనికూడఁ జెప్పుచున్నారు. ఈహేతువులనుబట్టిచూడఁ గూర్మనాథుఁడు కొంతకాలము దేవుపలిలో నున్నాఁ డనువాడుక సరియైన దని తోఁచుచున్నది. ఇతఁ డద్వైతశాఖలోఁ జేరినబ్రాహ్మణుఁ డయ్యు వైష్ణవప్రపత్తి గలవాఁడై వైష్ణవగురువులయొద్ద శుశ్రూష చేసి విద్యాభ్యాస మొనర్చినవాఁడు.

కూర్మనాథకవి యిప్పటికి రమారమి నూటడెబ్బది సంవత్సరములక్రిందటి కాలమున నుండెను. ఇతనినిగూర్చి “విశాఖపట్టణము డిస్ట్రిక్టుమ్యాన్యూలు” నందిట్లు వ్రాయఁబడి యున్నది.

“గోకులపాటికూర్మన్న, ఈయన యిప్పటికి 150 సంవత్సరములక్రిందట నుండెడివాఁడు. విజయనగరసంస్థానీకు లైనమొదటియానందరాజుగారీయనకు పోషకులు. మృత్యుంజయవిలాస మనేగ్రంథమును నీయన రచించినాఁడు.

*    *    *    *    *    *

వైరిహరరంహ శతకముకూడ నాయనే చెప్పినాఁడు” విశాఖపట్టణముడిస్ట్రిక్టు మ్యాన్యూలు పుటలు 132, 133.

కూర్మనాథకవి రచించినగ్రంథములలో వచ్చుపడి ప్రచురము లై యున్నవి రెండుమాత్రము గనఁబడుచున్నవి. (1) మృత్యుంజయవిలాసము, (2) సింహాద్రినారసింహశతకము.

మృత్యుంజయవిలాసము :— ఇది యక్షగానము. మూఁడాశ్వాసముల గ్రంథము. కవి దీనిని శృంగారినాటక గేయప్రబంధ మని పేరొకొనియున్నాఁడు. ఇందలికథ యందఱకును దెలిసినదియే ఇందు మొదటియాశ్వాసమునఁ బార్వతి జననము మొదలు ఇంద్రునియాదేశమున నతనికడకు మన్మథుఁడు వచ్చుట మొదలగునవి వర్ణింపఁబడినవి. 2-వ యాశ్వాసమున మన్మథుఁడు హరునియాశ్రమమునకుఁ జనుట మొదలు శివునిగూర్చి గౌరి తప మాచరించుట లోనుగాఁగలవి యభివర్ణింపఁబడినవి. 3-వ యాశ్వాసమున సప్తఋషులు హిమవంతునికడ కేగుట, శివునికళ్యాణయాత్ర, పార్వతీపరమేశ్వరుల పరిణయమహోత్సవము, కుమారోదయము, తారకాసురవధ మొదలగునవి వర్ణితములు. ఇది యక్షగానమైనను నాంధ్రవాఙ్మయమునఁ గలప్రసిద్ధప్రబంధములతో నెల్లవిధములఁ దుల

తూఁగుచు హృద్యము లగువర్ణనాంశములతోఁ గూడి చదువరుల కానందము గలి గించుచున్నయది కవికిఁ గలనిరుపమానసాహితీపటిమయు సంకేతకళావైదుష్యము నీగ్రంథము వెల్లడిచేయుచున్నది కవి యాభయభాషలయందును జక్కనిపాండి త్యము గలవాఁ డనియు, నవీనకల్పనాకౌశల మతిమనోహర మై కవిత్వము ప్రబంధరీతుల ననుకరించుచున్న దనియు నీక్రిందిపద్యములవలనఁ దెలియనగును.

ఉ. నాయనుకూలభాగ్యసదనా యను, నవ్వెదనాడ నాయ మా
నా యను, నిన్నుఁ బాయఁగలనా యను, నీవెత కోర్చుదాన నే
నాయను, వేఱుసేయఁ దగునా యను, నోమనసామజంపుగు
న్నా యనుఁ, బల్కనేమిపదనా యను, నేఁ బగదానా యనున్.

సీ. స్తనితారవార్భటీజనితాతిభయవధూ జనతాస్వయంగ్రాహవినుతజనము
కరకాంతధారానికరకాంతనూత్నకాకరకాయమానబాకాశఘనము
అవనీధరస్థలన్నవనీరబహుళస్ఫురజ్జవనాపతద్దర్భభవనవనము
విపులావియన్మధ్యవిపులాభపరిపూర్ణచపలాభ్రభీతాహిచపలమనము
అఖిలసస్యావనము మయూరౌఘజీవ, ధనము పాంథమనోవిభేదనము జలప
దనముభూదేవతకుఁజల్లదనమునగుచుఁ బ్రకటగతిమించెనంతవార్షికపుదినము.

సీ. ఉదయాద్రికరిమీఁద హురుమంజిచౌకోలు వెదవింటిపాదుశావెల్లగొడుగు
తమిఁజకోరములు పాల్ద్రావువజ్రపుగిన్నె నిశిమీఁదఁ జల్లుపన్నీటికుప్పె
గగనమన్ పందిరిఁ గట్టుమల్లెలగుత్తి విష్ణుపదంబుపెన్వ్రీలినఖము
తెలిగంటిగమి బువ్వదినువెండిపళ్లెంబు, గగనసౌధాగ్రాబ్జకాంతకలశ
కాలసురభూరుహముపండు గగనలక్ష్మి, చేతిపూఁజెండు పాంథగర్వాతిశయము
క్రుంగఁ గంతుఁడు వేయుపిరంగిగుండు, సుందరాకృతిఁ దగె నిండుచందురుండు.

సీ. మొగముఁజూడకయింతవెగటు గావించుటయందమాయిదినీకుఁ జందమామ
మనసులో మెలఁగుచు మర్యాద దొలఁగించి, మనసు నొప్పింతురా మనసిజాత
ప్రాణబంధుత్వంబుఁ బాపి గాలిపిశాచి మనసార్తి యేతురా మలయపవన
మాటమంచితనంబు మాని యింత యెఱింగి పడుగురా శుకపికపాళులార
తుమ్మెదనటంచు నేపనితోఁపకుండ, దఱిమిఝుంకారములు సేయఁదగునె భృంగి
నీలకంఠాఖ్యఁ బురివిచ్చి యేల కేక, లానరవేసెదు సిగ్గుమాలినశిఖండి.

సింహాద్రినారసింహశతకము :— కవి యాశతకము రచించుటకు నీక్రిం దికారణముం జెప్పుదురు. 18-వ శతాబ్దోత్తరభాగమున మరాటీలు, పిండారీలు,

తురుష్కులు, మొదలగుకొల్లగాండ్రు శ్రీసింహాచలము వచ్చి గుడి ప్రవేశించి సర్వవిధముల నాదేవాలయము మొదలగుపవిత్రస్థలములను బాధచేయుసమయమునఁ గూర్మనాథకవి శత్రుసంహారము నపేక్షించి దీనిని వ్రాసెనఁట. ఆసమయమునందుఁ గలిగినయలజడి యిట్లు వర్ణింపఁబడినది.

సీ. నీకొండపై నెక్కి నియతులౌ భక్తులఁ గొట్టి నానావస్థఁ బెట్టకుండ
గాంగధారాతీరకలితమండపముల మద్యపానము చేసి మలయకుండ
నీవంటసాలలో నిశ్శంకతో మాంసఖండము ల్మెండుగా వండకుండ
నీగుడిఁ జొచ్చి దుర్నీతిఁ గామాంధులై పరవధూటుల భంగపఱుపకుండఁ
బౌరుషంబునఁ దురకలబాఱిఁ దఱుము! వేటకాఁ డిల మొత్తనావేళ లేఁడి
మూఁడుకాళ్లను నడుచు నిర్మూలితాంహ! వైరిహరరంహ సింహాద్రినారసింహ॥

సీ. యవనేశుధాటికి నడలి సర్వస్వమ్ము విడిచి మందిరములు వెడలువారు
వెడలియుఁ దలదాఁప వెర వేమి గానక యడవుల నిడుమలఁ బడెడువారు
పడియు నెచ్చటఁ గూడుగుడువఁ గానక తమ శిశువులతో వెతఁ జెందువారు
చెంది డెందము గుందఁ గాందిశీకత నభిమానాఢ్యులై ఖేద మూనువారు
నైరి యొక్కొకటిభార్యతో నవనిప్రజలు! అష్టమహిషులపైఁ బదియాఱువేల
సతులతో నీవు వలన కెచ్చటి కరిగెదు! వైరిహరరంహ సింహాద్రినారసింహ॥

సీ. 'నీసుహాలుక్యాపకడోరెగద్దా' యని, యాహితాగ్నులనెత్తు లణఁపకుండ
'పాముధోనేకుతుంపానిలారే' యని తివిరి శ్రోత్రియుల మర్దింపకుండ
ఘాసులారేఅరేగాండూ' యనుచు శిష్టతతులపైఁ బడి వడిఁ దన్నకుండ
కులితీపకావురేజలిదీ యటంచు'మారుఁడు మెడ వడిఁ బట్టి త్రోయకుండ

గీ. బహులహాలామదావిలపరుషయవన! రాజి నిర్జింపు నీవంటిప్రభువు గల్గ
బ్రాహ్మణుల కిన్నిపాట్లు రారాదుగాదె! వైరిహరరంహ సింహాద్రినారసింహ॥

ఇట్లేఁబదియరువది పద్యములు చెప్పసరికి భగవంతునిచేఁ బంపఁబడినవో యన వేనవేలుగఁ దుమ్మెదలు చెలరేఁగి కొల్లగాండ్రను బొడిచి రక్తముఁ ద్రావి చంపెనఁట. కొందఱను విశాఖపట్టనము వఱకుఁ దఱిమి యచ్చట నున్న మెట్టలోఁ జొచ్చి యదృశ్య మాయెనఁట. ఆమెట్టకు నిప్పటికిని "తుమ్మెదలమెట్ట" యనియే పేరు. ఈసంగతులను దేటపఱుచుపద్యముల రెంటి నీక్రిందఁ బొందుపఱుచుచున్నాను.

సీ. కారుణ్యదృష్టిచేఁ గని మమ్ము రక్షించి నీరజేక్షణ నీవు నేఁడు పంపఁ
బారసీకులదండుపైఁ గొండలోనుండి గండుతుమ్మెదలు నుద్దండలీలఁ
గల్పాంతమున మిన్నుఁగప్పి ఘోర మైన కాలమేఘంబులు గవిసినట్లు
దాఁకి భోరున రక్తధారలు దొరఁగఁగాఁ గఱచి నెత్తురు పీల్చి కండలెల్ల
నూడిపడ నుక్కుమూతులవాఁడి మెరసి, చించి చెండాడి వధియించెఁ జిత్రముగను
నొక్కొకనిఁ జుట్టుముట్టి బల్ మిక్కుటముగ। వైరిహరరంహ సింహాద్రినారసింహ॥

తే. గీ. అరులఁ బరిమార్చి వైశాఖపురసమీప
గిరిబిలంబున డాఁగె బంభరములెల్ల
నదిమొదల్ తుమ్మెదలమెట్ట యఁద్రు దాని
వైరిహరరంహ సింహాద్రినారసింహ.

ఆంధ్రవాఙ్మయమునకు అలంకారప్రాయము లయినశతకరాజములలో నియ్యది యగ్రస్థాన మాక్రమింపఁదగిన దని నాయభిప్రాయము. గ్రంథవిస్తరభీతిచే మఱికొన్ని పద్యము లిం దుదాహరింప వీలు లేకపోయెను.

కూర్మనాథకవి వ్రాసినయింకొకగ్రంథము చోరసంవాదము లేక లక్ష్మీనారాయణవిలాసము. విష్ణ్వాలయములలో జరగు "దోఁపుడు" ఉత్సవమునందు నర్చకులు దీనిని బఠింతురు.

కూర్మనాథకవి 18-వ శతాబ్దోత్తరభాగమున నుండినవాఁ డని మీఁద వ్రాసియుంటిని. కవికాలమునుగూర్చి డిస్ట్రిక్టుమ్యాన్యూలునందు వ్రాయఁబడినవిషయములనుబట్టిచూడ నీతఁడు అడిదము-సూరకవికి సమకాలీనుఁడుగఁ గనఁబడుచున్నాఁడు ఇతఁడు క్రీ.శ. 1780 సంవత్సరప్రాంతమునఁ గీర్తిశేషుఁ డయ్యె నని తోఁచెడిని.

అడిదము రామారావు.

— పరిషత్పుస్తకభాండాగారము. —

19. ద్వాత్రింశత్సాలభంజికలకథలు. ద్విపద. 3453.

ఈద్విపద విక్రమార్కచరిత్రము కవియెవ్వరో తెలియవచ్చుటలేదు. ఆదిని నంతమున నించుకంతయుఁ దనవిషయమై కవి చెప్పికొనియుండలేదు. తొమ్మిదవ బొమ్మచెప్పిన కథ పూర్తిగాలేదు. కృత్యాదిని—

శ్రీసదాశివమూర్తి శృంగారయుతుని, వాసవవంద్యుని వనజాతవంద్యు
కైలాసవాసుని గంధర్వహరుని, శైలేంద్రజాపతి శిఖివాహజనకు
దర్వీకరాభరణు ధనపతిసఖుని, గీర్వాణవరదుని గిరిరాజపతిని
గంగాధరు నభవు గజచర్మధరుని, సంగీతలోలుని సకలలోకేశు......
ఆశివునకుఁ గూర్మియర్ధాంగియైన, బిసరుహదళనేత్ర బృందారవంద్య
శ్రీగౌరికల్యాణి శ్రితలోకవంద్య, సట్టిపార్వతిదేవి సతిమహాశక్తి
శర్వాణిసేవలు చేసిరి సతులు...,ముప్పదిద్దఱు సతుల్ మొగిఁదన్నుఁగొలువ
అప్పుడుకదలెను అంబికాదేవి, ఆరామమున కేగిహర్షంబుతోడ.

అంతమున- " ఈపుణ్యకథయెప్పు డెలమితోవిన్న, వ్రాసినఁ జదివినవారలకెల్ల సిరియు నాయువుగల్గి చెలఁగుచుండుదురు, కామితార్థంబులు గలుగుచుండుదురు. శైలి పైదానింబట్టి తెలియుచున్నను గొన్నిపంక్తులు—

తొల్లిపూజకు ధనమని యింటనుండి, యెల్లపుష్పంబులునెలమి నేఁదెత్తు
తెల్లమి నొకనాఁడు తేఁబోయినేను, గోరికిఁ బొన్నలు గోయంగ నచట
నిరవొందనాకాంత లిద్దఱు విటులు, వరుసతోఁజనుదెంచి వరవినోదములు
నెరపుచుండఁగ వారినింజూచుచుండ,......
తావేగఁబోకున్నఁ దడవాయెననుచు, దేవపూజకు విరుల్ తేఁడు వీఁడనుచు
శపియించికోయమై చనువుండుమనిన, శాపంబునకునేను జలనంబునొంది
ఈశాపభయరోగ మెన్నఁడుపాయు, కోపంబుమాని యెక్కువకృపనేయు....

వ్రాఁతతప్పులు మెండు. కవితప్పులును గలవు.

"వ్రాలాశ్వభ్రలు- అబద్ధంవాసుబద్ధంవా" యను నవియన్నియును వ్రాసినవాఁ తకాఁడును దనపేరిందు వ్రాసికొనలేదు.

20. వైద్యచింతామణి. 3527.

ఆంధ్రటీకాయుతము. ఇందు గద్యమిట్లున్నది.

ఇది శ్రీమదావసంభవకుల సుధార్ణవ పూర్ణసుధాకర శ్రీవత్సగోత్రతిలక సప్తవిద్యాధురీణ శ్రీయమరేశ్వర భట్టారక ప్రియతనూజ భైషజ్యవిద్యాపారీ

ణ......నాథవిద్యాప్రవీణ శ్రీయింద్రకంటి వల్లభాచార్యవిరచితే వైద్యచింతామణౌ జ్వరసన్నిపాతదోషాతిసార నిదానంనామ ప్రథమవిలాసః అని

ద్వితీయవిలాసము పూర్తిగా నిందులేదు శ్లోకమును, దానికిఁ దెనుఁగర్థమునుగా నున్నది ఈ రెండవదానియందు భస్మములుచేయుక్రమము, వస్యములు, కషాయములు మొదలైనవి చెప్పఁబడినవి.

21. భల్లాణచరిత్రము. యక్షగానము. 3490.

కవి, నింబాద్రిదాసు కృత్యాది నీఁదివ్రత్తాంత మిట్లున్నది.

ద్వి శ్రీమనోహర నారసింహసర్వేశ, హామదేవా సరస్వతినాథ యనుచు
ముప్పరేకముచేసి మురిపంబుతోను, చెప్పుచుబ్రహ్మాంబు సంతుటకోఅకు
శైవపరంబొక్కచర్యఁ జెప్పెదను, కావ్యంబుల్లెగ్గైన మనుఁడనుగాను
పరికించువాఁడెపోపరబ్రహ్మమూర్తి, యిలలోజనస్వాతంత్ర్య మించుకలేదు,
పొలుపొందగాను నీభూమిలోనొక్క, వలనొప్పఁగా దాస్యవంశంబునందు
వైష్ణవకులములో వరుసజన్మించి, విష్ణుసద్భక్తిచే విలసిల్లుచుండు
నంతనాఖ్యుని పుత్రులసమానఘనులు, వింతగాజన్మించె వెంకటనరసు
తరుణియుఁగమలాంబ తనయుఁడైపుట్టి, నరసింహవరముచే నగణితంబైన
కృతులురచించెడు కొమరుండనేను, తతిగొన్న నింబాద్రిదాసుఁడనాఁడ.

గద్యములలో—

నాపాలి శ్రీగురునాథునిపేర, పాపసంహరుపేరఁ బరమాత్మపేర
స్తంభసంభవుపేర సర్వేశుపేర, నింబాద్రియేగంటి సిలయునిపేర
కమలాంబతల్లి వేంకటనర్సుతండ్రి, కొమరుఁడ నింబాద్రి కూర్మిదాసుఁడను.

కథ ప్రసిద్ధమైనదియే. కవిత్వము తప్పులుగానున్నది. శైలి—

ద్వి. జంగమయ్యలకిది సంగతిగాదు, యెంగిలిబుధులు యేయిలుఁ జూపితేను
ప్రింగెడివార లీమిండజంగాలు, అంగననడుగుట హాస్యంబుమఱియు
ధనధాన్యమడుగవలె దండిరాజ్యంబు, ఘనతురంగంబులు గజములుమెద్దా
లన్నంబువస్త్రాలు నగ్రహారములు, ఎన్ని యడిగిననైన నీయంగవలయు
ఇల్లాండ్రవేశ్యగా నిట్లడుగఁదగునె, బల్లాణుఁడైనసీవనియేమినాక
తనభార్యనిచ్చుట ధైర్యంబుగాదె, సూర్యవంశంబున శూరత్వమిదియు
ఇద్దఱుభార్యలు యితనికున్నారు, యిద్దర్లొవర్లిస్తె యితనిదేంబోమె,
రద్దుపద్దులకైన రాజునోర్వకను, ఒద్దికలేకుండ నొకతెనిస్తుండె.

రాక్షసనామసం॥ భాద్రపద బ ౧౦ శుక్రవారము వఱకు, వీరముష్టి కోటప్ప వ్రతి నున్నక్రమాన రేచా వీరయ్యకుమారుఁడు కోటయ్య వ్రాసినది.

22. అహల్యావిలాసము. 3520.

ఇదియొకచిన్న యేకాశ్వాస కావ్యము. కవిపేరు తెలియదు. కృత్యాదిప ద్యములులేవు ఆశ్వాసాంత గద్యాదికమును లేదు. కథపూర్తిగానున్నది.

సీ. వికచపద్మకుడుంగ విహరమాణరథాంగ, సహచరచ్చక్రాంగ చటులభృంగ
గాహమానపతంగ కరతప్తమాతంగ, మదగంధిలతరంగ మయశుభాంగ
నీరజాతలవంగ నారంగతరుసంగ, కలనినాదవిహంగ కలుషభంగ
బహుళశ్రమోత్సంగ పథికహర్షణభంగ, సురభిశీతసురంగ వరతరంగ
సురగశైనపతంగ జాడ్యత్తమాంగ, దీపితోత్తుంగ జననసంస్థితిపిహాంగ
కనకగిరిశృంగ విగళదఘనమృదంగ, ఘనరపజలానుషంగ నాకాశగంగ.

మ. కని శ్రీరామవిభుండు కౌశికునిచే గంగామహత్త్వంబు విం
చును బల్మాఱు భగీరథక్షితిపతిస్తోత్రంబు గావించి మ
జ్జన ముఖ్యక్రియలాచరించి యటఁ గౌశాంబీపురీరాజ పూ
జనముల్ గైకొని మైథిలోపవన వీక్షం జొక్కి తానిట్లనెన్. అనిప్రారంభించి,

గీ. అని శపించి హిమాద్రికిఁ జనియెగౌత, ముండుజంభశాసను మేషా......

ఇట్లు ముగించినాఁడు. కవిత్వము కొన్నిపట్టుల బాగుగనేయున్నది. శైలికైకొన్ని పద్యములు—

వ. అనినలజ్జావనతముఖియై శశిముఖి సఖీమణి కిట్లనియె.

శా. ఔనౌ నే వెలయాలనా యిటులు నీవాడెన్ బళా చాలుఁ బో
పోనవ్వేరెవరైన విన్న నిటనేర్పుల్ జూపఁగావచ్చితో
నానాథుం డిదియింత విన్నఁ దనకు న్నాకు న్మహాహానిరా
దానావంటి కులాంగనామణికి న్యాయంబౌనె యీమార్గముల్.

మ. తగవౌనే తనవంటివాఁడు పరకాంతంగోర సామాన్యుఁడే
మగువా తానుశతాశ్వమేధి త్రిజగన్మాన్యుండు నేఁజెల్ల ! యీ
వగవర్తించిన యాగభాగములఁ బిల్వంజూతురే బ్రాహ్మణుల్
నగరేతోడిసురల్ ఋషీశ్వరులచెంతం గౌరవంబుండునే.

తారణనామ సం॥ పుష్య శు ౨ శనివారము వఱకు కొండపల్లి రాజారాంగారికి దుర్గి శేషాచలము వ్రాసియిచ్చినది. వరంగల్ జిల్లా మధిరలో లభించినది.

## 23. రాధామాధవసంవాదము. 3502.

వెలిదిండ్ల వేంకటపతి కవిప్రణీతము. మూఁడాశ్వాసములు కనఁబడుచున్నవి. మొదటఁ దుదను గొన్నిపత్రములు విరిగిపోయినవి. ఇక్కవి గద్యములోఁ దనవిషయమిట్లు చెప్పికొన్నాఁడు.

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధ శృంగారకవిత్వవైభవ వెలిదిండ్ల తిరువేంగళాచార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకటపతినామధేయప్రణీతము...

మగదల రామదాసామాత్యున కీగ్రంధము కృతియీయఁబడినది. ఈరామదాసు విషయ మీయాశ్వాసాంత పద్యమువలనఁ దెల్లంబగు.

శా. వీక్షామాత్రఫలప్రదా ప్రళయకావేరీమహాపట్టణా
ధ్యక్షా శంకర పద్మనాభ రఘునాథా మాత్యగోపాలకా
దిక్షేమంకరసోదరాదర నవామ్రీయాత్సవ
సాక్షానన్దకుమారపాదయుగపూజాలబ్ధ భాగ్యోదయా.

కవిత్వము మృదుమధురముగనున్నది. శృంగారభూయిష్ఠము. శైలిం దిలకింపుఁడు.

ఉ. కల్లరిగాఁడు లోఁ నెనరు గల్గినవాఁ డదిగాక వావి మే
నల్లుఁడు రూపవంతుఁడు మహాగుణశాలి గదా యటంచు నేఁ
దల్లినిదండ్రిని న్మగనిఁ దమ్ముల నన్నల రోసి తన్ను నే
నుల్లమునందు దేవుఁడని యున్నది కీరమ నీవెఱుంగవే.

"వాంఛ్లున్ వీండ్లును" రుక్మిణీటులన్ వంశాభిమానంబుకై "అహోరాత్రంబులుం గోటఁజుట్టుకపోరాడ" ఈరీతి నియమవిరుద్ధ పదప్రయోగము నందందుఁ గావింపఁబడియెను.

## 24. శుకచరిత్రము. 3499.

ఇది యొక వేదాంతగ్రంథము. సీతారామాంజనేయసంవాదమును రచియించిన పరశురామపంతుల లింగమూర్తికుమారుఁ డగురామమూర్తికవి రచించినది. ఇతని గద్య మిట్లున్నది.

ఇది శ్రీమద్గురు లింగమూర్తి చరణకమలసేవావిధేయ తద్గురు కరుణాకటాక్షవీక్షణానుగ్రహోపలక్షిత శ్రీరామమంత్రోపాసనాప్రకార జ్ఞానధారేయ తన్మంత్రాధిష్ఠాన దేవతాతత్త్వానుసంధానలక్షణ భాగధేయ వేదాంత కవితా విచిత్రవిజ్ఞేయ బ్రహ్మవిద్వజ్జనగేయ పరశురామపంతుల రామమూర్తి నామధేయ ప్రణీతంబైన శుకచరిత్రం బనువేదాంతగ్రంథము.....

అయిదాశ్వాసములుగలది. ఇందలికథ "పంచమవేద సంజ్ఞాప్రభారతం బగుభారతంబున నితాంతశ్రోతృస్వాంతోపశాంతిపర్వంబగు శాంతిపర్వంబునందు, తత్త్వబోధంబును, భీష్మబోధితంబును, ధర్మబోధ్యంబునునై సకలసుకవి తిలకనిరత ప్రకటితతత్త్వచరితం బగుశుకచరితంబు గలుగు నది సంక్షేపరూపంబు గావున నయ్యర్థంబు విస్తరించి యొకఁడు బంధుర బంధీకృతానుబంధ ప్రబంధం బగు ప్రబంధంబుగా" రచియింపఁబడినది.

ఇకఁడి కవిత్వమును జకఁడిదియె. ఒక్కొక్కతావున నెదుటివానితో మాటలాడుచుండునట్లు మనోహరముగఁ బద్యములున్నవి, వేదాంతవిషయమందును, శ్లేషానుప్రాణితమైన శృంగారవర్ణములను గవి చక్కఁగాఁ బొసఁగించునేర్పుగలవాఁడు.

క. మతిగురుకొనుసెళవులఁ బర, సతిసంగతి గొని కకారసంజ్ఞలయి......

మొదలగునవియు, ముక్తికాంతా సంభోగవర్ణనము, పార్వతీ పరమేశ్వరుల యన్యోన్య సల్లాపంబులు నుదాహరణంబులు.

"శాస్త్రవిగ్రహాలోకవాసనల నేటి, వాసనాత్రయమున కలవడఁడితండు."

"లోకాంతము సేయకను గలుంగదు పుడమిన్" కండ్లు, ఇత్యాది విరుద్ధప్రయోగము లందందుఁ గావించినను—శైలి మంచిది. తండ్రి సీతారామాంజనేయమునందువలెఁ నిం దితఁడును యమకాదిచిత్రకవిత్వముం జేర్చియున్నాఁడు.

గీ. అనిశము స్వభావనియతమై నట్టిరేచ, కప్రపూరక కుంభక క్రమముచేత
హంస మిరువదియొకఁడు వేయాఱునూఱు, గాజపించుట మంత్రయోగంబువత్స.

చ. అనవుడు సద్గురు ప్రవరులందఱు నన్ని తెఱంగులంగతుల్
పనుపడ బోధసేయ నవి భావమునం దలకూడకున్కి న
జ్జనకనృపాలశేఖరుఁడు సంశయము న్విడి ముక్తికన్యకం
గనియెడు సాధనంబొకటి గానఁగఁ గోరుచునుండె నత్తఱిన్.

ఉ. కావునబంధముక్తులకుఁ గారణ మామనమంచుఁ బెద్దలెం
తోవచియింతు రాగమతతు ల్వివరించుచు మాకుఁజూడఁద
ద్భావము బంధకంబు తదభావము ముక్తిగఁదోఁచుఁ గానని
ల్లైవిలసిల్లు మానసలయం బమనస్కము నిశ్చయింపఁగన్.

క. బహుపదకరములు గలిగిన, మహితుం డీశ్వరుఁ డటంచు మదిఁదలపోయన్
బహుపదకరములు గలిగిన, రహిఁగ్రిమ్యాదులకు నీశ్వరత్వము గలుగున్.

## 25. సకలలక్షణసారసంగ్రహము. 3471.

ఇది సులక్షణసారమువంటి యొకఛందోగ్రంథము. రత్నాకరము గోపాల కవి వ్రాసినది. గ్రంథాంతమునం దిట్లున్నది.

క. ప్రకటిత లక్షణలక్ష్యము, లొకయింతయుఁ దెలిసితెలియకను దుశ్శంకల్
ప్రకటించు హీనమనుజుని, గుకవిపిశాచంబటండ్రు కోవిదులెల్లన్.

క. అందంబుగ దశవిధముల, చందంబుల లక్షణములు సకలకృతులలోఁ
జెందినప్రయోగ వితతులు, పొందికగాఁ గూర్చినాఁడ బుధులౌననఁగన్.

గద్య—ఇది శ్రీమద్వేంకటాచలాధ్యక్ష కరుణాసంలబ్ధాసాధారణప్రజ్ఞా విచక్షణాక్షీణ ప్రబంధాంకాంధ్రశబ్దసారలక్షణ బహుచిత్ర కవిత్వరచనాచమత్కార రత్నాకర కృష్ణమరాజగర్భరత్నాకర సుధాకర గోపాలసత్కవిరాజ ప్రణీతంబైన సకలలక్షణసార సంగ్రహంబను ఛందంబునందు గురు లఘు గణనిర్ణయంబును గణాధిదేవతాహ్వయంబులును బహువిధపద్యభేదంబులును నానావిధ యతిప్రాసప్రపంచంబును షట్ప్రత్యయమార్గ ప్రభావంబును గణాక్షరఫల కులాధీశ్వర గ్రహతారక వర్ణసముద్భవాది నిర్ణయంబును నతులిత తిథివారవేళా శుభాశుభవిలసితంబును ననందగు సకలలక్షణలక్ష్యంబులును సంపూర్ణము.

ఇది తాతంభట్టు పేరుతో నచ్చుపడిన సులక్షణసారమువలెనే మొదటఁ గొన్ని సమానపద్యములున్నను బెక్కులక్ష్యలక్షణములు కవి పలు లక్షణగ్రంథములనుండియో లేక మూలగ్రంథములనుండియో చూపి విరివిగా వ్రాసియున్నాఁడు. అన్నిటికిఁ గవిజనాశ్రయమమూలమైనట్లు కనఁబడుచున్నది. ఈక్రిందఁ జూపఁబోవు లింగముగుంట తిమ్మకవి సులక్షణసారమునకును దీనికిని భేదములు చాలఁగలవు. అచ్చుప్రతిలో నీరెంటిలోనున్న విషయము లే వ్యతిరేకముగాఁగొన్నియున్నవి.

లక్షణము- గీ. జాకువడిచెల్లు రత్నకంకణమనంగ, ఖాకువడిచెల్లు బ్రహ్మపింఛంబనంగ
ణాకువడిచెల్లుఁగనక మంటపమనంగ, నాకువడిచెల్లు దివ్యగంధంబనంగ.

లక్ష్యము-భీముఁడు—

నవ్యవికాసరమ్య నలినంబని బాలముఖాబ్జసౌరభా
భివ్యసనంబునంబఱచు భృంగకులోత్తమ తద్వియోగతా
పవ్యథ ప్రాణి నిల్వదు కృపాగుణ మేర్పడ "బ్రాహ్మణోనహం
తవ్య"యనంగ నొప్పవచనస్థితి నాకెఱుఁగంగఁ జెప్పుమా.

నిత్యసమాసయతికి లక్ష్యము-దశరథకుమారచరిత్రము.

క. గిరిఁ గనినెరయఁగ రథములు, పరఁగించి పదాతికులముఁ బఱపిహయముల
న్నుఱుమాడియు రథికులను, క్కఱఁగూల్చి సురారిఁ గేరి యరదమునూకెన్.

తాతంభట్టు, అచ్చుప్రతిలో "దీవ్వులద్రుంచి విశ్వజగతీపతి" యనుపద్య మాది పర్వములోనిదని యున్నది. ఇందుఁ బెద్దిరాజు దనియున్నది.

భోగయతికుదాహరణము——

గీ. అచ్చునొందక యతులు రెండాదినున్న, స్థానమున రెండుఁ జెల్లును సకలసుకవి
రాజనుతముగఁదనరు విశ్రామమమరు, జ్ఞానులునుతింతు రసురభంజనుననంగ.

లక్ష్యము-అంబాలభాణము——

వగమీరు స్సరసీరుహప్రకరము ల్బాడేగు చేలావళుల్(?)
బాగుల౦ బాఱెఁ జకోరవారము మహామోదంబున౦ జక్రము
ల్నెగడె న్నుజ్జగముల్వెలింగె జగి మీఱె న్సర్వభూతాలిప్రా
బ్నగరాజాగ్రమునందుఁ దోఁచె రవి......త్రోజ్జ్వలద్భానుఁడై.

వికల్పప్రాసమునకు-పద్మావతీచరిత్రము——

క. పద్మాసమానయగునవ, పద్మావతిఁజూచి ధరణిపాలక సుతుఁడు
ద్యన్మోదంబునఁ దనముఖ, పద్మమునలరించె ననుచుఁ బరిజనులలుకన్.

అన్యోన్యప్రాసమునకు-కమలాకరచరిత్రము——

ఉ. కాశకరూశకోసల త్రిగర్తకకాంగ కళింగదేశధా
త్రీశులనెల్లఁ జేరి పరికించితిఁ గాంచితి వారిధైర్యముల్
భాసురభూరిఘోర వరభండనచండ పరాక్రమక్రియా
భ్యాసులటంచు మిమ్ముఁ దలఁపన్విని వచ్చితి రాకుమారకా.

అర్ధబిందుప్రాసమునకు-కమలాకరచరిత్రమునందే.

క. ఈగహనభూమి బంధుర, నాగవ్యాఘ్రోగ్రశరభ నాగారియుతం
బీగతినొంటిగ నెచటికి, నేఁగంగారణ మదేమి యిందునిభాస్యా.

సంధిగతప్రాసమునకు-రాజనరేంద్రచరిత్రము——.

క. అగణిత భేరీధ్వనులును, బెగడొందెధరిత్రి మిన్నుబీఁటలు వాఱెన్
నగములు ప్రీలెర్దిగిభము, లుగలంగె వడంకె సకలలోకము లెల్లన్.

క. పూజించియర్ఘ్యపాద్యము, లోజంగావించి మణిసమంచితలీలన్
తేజమున నుంచుటయుదయ, తోఁజూచి సుధారసంబు దొలఁకఁగఁ బలికెన్

కమలాకరచరిత్రమునందు—

ఉ. మాటలకేమివచ్చె వినుమానవనాయక చొక్కమైన మి
న్నేటిపసిండితామరలహీనశిరోమణి గాంచుఁబోల్చునా
నాఁటికినిన్నుఁ జేరుమనినన్విని నవ్విన్నృపాలమౌళి జం
జాటముమాని మంత్రిసుతసంయుతుఁడై రథమెక్కి యుద్ధతిన్.

పంచబాణవిలాసమునందు—

క. వింటంబూనిన శరములు, వింటనెఁ వెలుఁగొందుఁ దొడిగివిడుచుటగనరా
దొంటరియై బహురథికుల, గెంటించిజయించె మకరకేతనుఁడధిపా.

అన్యోన్యప్రాసమునకు, విభాగయతికి-రాజనరేంద్రచరిత్రము—

ఉ. భూసురవర్గముం గదిసిపూజలుచేసి యొసంగె వేగనూ
ఱేసి తురంగమంబులుఁ బదేసిశతాంగములుం జెలంగి వే
యేసి విలాసధేనువు లనేకధనంబులు ధారణీతలా
ధీశుఁడు వేఱువేఱ నలుదిక్కులఁ గీర్తులు పిక్కటిల్లఁగన్.

సీమంతశబ్దమునకు-చంద్రశేఖరచరిత్రము—

క. ఎంతయునంత ననంతా, కాంతుఁ డనంతరనితాంతకాంతానంత
స్వాంతుండై కాంతకునీ, మంతమహోత్సవముఁ జేయు నాసమయమునన్.

## 26. సులక్షణసారము. 3489.

లింగమగుంట తిమ్మకవిరచితమగు నొక లక్షణ గ్రంథము. గ్రంథాది పద్యము—

క. శ్రీవనితాసమభూతన, యావత్క్షోజార్ద్రి కుంకుమాంకితవక్షున్
పావనతరచారిత్రుని, సేవించెదఁ జెదలువాడ శ్రీరఘురామున్.

ఈతిమ్మకవి, లక్ష్యలక్షణపద్యములు మొదలైనవి యిచ్చుటలోను వివరణమునందును నితరలక్షణ గ్రంథములకంటె విశేషమున్నది. ఇందును పెక్కుగ్రంథముల నుదాహరించినాఁడు. తాతంభట్టు, చిత్రకవి పెద్దనాదుల నొక్కొకచోఁ ఖండించెను.



## సంస్కృతాముద్రితగ్రంథ విషయానుక్రమణికా.

### వైదికగ్రంథాః.

| | | | |
|---|---|---|---|
| 5 | అగ్నిహోత్రప్రశ్నాః | ... | |
| 1 | అచ్ఛావాకాః | ... | |
| 1 | అన్నసూక్తమ్ | ... | |
| 1 | అనుక్రమణికాభాష్యమ్ | ... | |
| 1 | ఆరుణమ్ | ... | |
| 5 | ఆరణ్యకమ్-సభాష్యమ్ | .... | సాయనాచార్యాః |
| 17 | ఉపనిషదః | ... | |
| 1 | ఋచః | ... | |
| 6 | ఋగ్వేదః | ... | |
| 1 | కృష్ణయజుర్వేదబ్రాహ్మణమ్ | ... | |
| 1 | కౌషీతక్యుపనిషత్ | ... | |
| 1 | చిత్తివిద్యారణ్యభాష్యమ్ | ... | |
| 1 | గరుడోపనిషత్ | ... | |
| 1 | గర్భోపనిషద్దీపికా | ... | |
| 1 | జీవసూక్తాని | ... | |
| 2 | త్రృచకల్పసూర్యప్రార్థనా | ... | |
| 5 | తైత్తిరీయోపనిషత్ | ... | |
| 1 | దశశాంతయః | ... | |
| 1 | నమకమ్ | .... | |
| 1 | నారాయణసూక్తమ్ | .... | |
| 1 | న్యాయప్రశ్నాః | ... | |
| 1 | పంచసూక్తాని | ... | |
| 14 | పరాయాతమ్ | ... | |
| 3 | పురుషసూక్తమ్ | ... | |
| 1 | బ్రాహ్మణమ్ | ... | |
| 6 | మంత్రప్రశ్నాః | ... | |
| 1 | మంత్రపుష్పమ్ | .... | |

| | | |
|---|---|---|
| 3 | మన్యుసూక్తప్రకరణమ్. | |
| 1 | మైత్రాయణీయోపనిషత్ | |
| 1 | మైత్రావరుణమ్ | |
| 1 | యజుర్బ్రాహ్మణమ్ | |
| 1 | యజుర్వేదః | |
| 1 | యజుస్సంహితా | |
| 1 | లఘుజాబాలోపనిషద్దీపికా | శ్రీశంకరానందాః. |
| 43 | వేదః | |
| 2 | వేదార్థప్రకాశికా | సాయనాచార్యాః. |
| 1 | శాంతిసూక్తాని | |
| 1 | శ్రీభూసూక్తాని | |
| 18 | సంహితా | |
| 2 | సామవేదః | |
| 1 | సింహానువాకః | |
| 1 | సూక్తత్రయమ్ | |
| 1 | సూర్యోపస్థానమ్ | |

## వేదాంతగ్రంథాః.

| | | |
|---|---|---|
| 1 | అఖండత్వనిరూపణమ్ | |
| 1 | అద్వైతమకరందః | |
| 1 | అథర్వశిఖోపనిషద్దీపికా | శ్రీశంకరానందాః. |
| 1 | అపరోక్షానుభూతిః | |
| 2 | అవధూతగ్రంథః | |
| 1 | అవిద్యాపిశాచభంజనమ్ | |
| 2 | అష్టశ్లోకీవ్యాఖ్యానమ్ | |
| 6 | ఆత్మబోధః (సవ్యా.) | |
| 1 | ఆత్మతత్త్వజాతివాదః | |
| 1 | ఆత్మానాత్మవివేకః | |
| 1 | ఆత్మార్పణస్తుతిః | |

| | | | |
|---|---|---|---|
| 10 | ఉత్తరగీతాః (సుబోధినీసహితాః) | .... | (వ్యా.క.) సుదర్శనతీర్థః. |
| 1 | కపిలగీతాః | .... | |
| 1 | కర్మగీతాః | .... | |
| 1 | గీతాసారః | .... | |
| 1 | చతుశ్శ్లోకీ | .... | |
| 1 | జగన్మిథ్యానుమానఖండనమ్ | .... | వేదాంతాచార్యాః. |
| 1 | జీవన్ముక్తివివేకః | .... | విద్యారణ్యాః. |
| 1 | జైనసూత్రాణి | .... | |
| 1 | జ్ఞానద్వయరహస్యమ్ | .... | |
| 2 | జ్ఞానప్రదీపః | .... | |
| 1 | జ్ఞానప్రబోధికా | .... | |
| 1 | జ్ఞానవాసిష్ఠమ్ | .... | |
| 1 | జ్ఞానార్ణవః | .... | |
| 1 | ణత్వోపపత్తిః | .... | |
| 1 | తత్త్వత్రయమ్ | .... | |
| 1 | తత్త్వవివేకాగ్నిభట్టీయమ్ | .... | |
| 1 | తత్త్వవిషయః | .... | |
| 1 | తనిశ్లోకీ | .... | |
| 1 | దత్తరత్నప్రదీపికా | .... | |
| 1 | దత్తాత్రేయగోరక్షకసంవాదః | .... | |
| 1 | దత్తాత్రేయసంహితా | .... | |
| 1 | దేశికదర్శితపద్ధతిః | .... | |
| 1 | దేశికదినచర్యా | .... | |
| 1 | దేశికాచార్యస్తుతిః | .... | శ్రీరామానుజాచార్యాః. |
| 2 | ద్వాదశమంజరీ | .... | |
| 1 | ద్వయానుసంధానమ్ | .... | |
| 1 | పంచదశీప్రకరణమ్ | ... | శ్రీశంకరాచార్యాః. |
| 2 | పాండవగీతాః | .... | |
| 1 | బ్రహ్మగాయత్రీస్నానవిధిః | .... | |

| | | |
|---|---|---|
| 1 | బ్రహ్మతత్త్వదీపికా | శ్రీకంఠసూరిః. |
| 1 | బ్రహ్మవిద్యాభరణమ్ | అద్వైతానందయతిః |
| 1 | బ్రహ్మవిద్యావిజయః | |
| 2 | బ్రహ్మసూత్రభాష్యమ్ | |
| 35 | భగవద్గీతాః | |
| 1 | భేదస్యధిక్శ్రుతివ్యాఖ్యానమ్ | కాళహస్తియజ్వా. |
| 1 | మహావాక్యార్థదీపికా | |
| 2 | మహావాక్యావళిః (సవ్యాఖ్యా) | |
| 1 | మహావాక్యోపదేశః | ంకరాచార్యాః |
| 1 | ముక్తికాండపద్యాని | |
| 1 | యోగచూడామణిః | |
| 1 | యోగతారావళిః | |
| 1 | యోగసూత్రభాష్యమ్ | శ్రీశంకరాచార్యాః |
| 1 | యోగావళిః | నృసింహః. |
| 1 | రాజయోగః | |
| 1 | లఘువాక్యవృత్తిః | |
| 2 | వాసుదేవమననమ్ | |
| 1 | విధిరసోదయః | అభినవోపేంద్రసరస్వతీ. |
| 1 | వివేకసారప్రకరణశ్లోకాః | |
| 1 | వేదాంతచంద్రికా | రఘునాథభట్టః |
| 2 | వేదాంతదీపికా | |
| 1 | వేదాంతడిండిమశ్లోకాః | సదాశివబ్రహ్మస్వామీ. |
| 1 | వేదాంతశిఖామణిః | రామకృష్ణాధ్వరీ. |
| 1 | వేదాంతశ్లోకాః | |
| 3 | వేదాంతసంగ్రహః | శ్రీరామానుజాచార్యాః. |
| 1 | వేదాంతస్తవః | జైమినిమునిః. |
| 1 | వైఖానససూత్రాణి | |
| 1 | వైష్ణవభక్తివిషయకశ్లోకాః | |
| 2 | శితికంఠీయమ్ | |

| | | | |
|---|---|---|---|
| 1 | శివకర్ణామృతమ్ | .... | భరద్వాజమునిః. |
| 3 | శివగీతాః | .... | |
| 1 | శివతత్త్వవివేకః | .... | అప్పయదీక్షితః. |
| 2 | శివతత్త్వసుధానిధిః | .... | |
| 1 | శివధ్యానమ్ | ... | |
| 1 | శైవశంకాచతుర్వింశతిః | .... | |
| 1 | శ్రీరామబ్రహ్మస్తవరాజః | .... | |
| 1 | షట్చక్రనిర్ణయః | .... | |
| 1 | షడ్గురుభాష్యమ్ | .... | |
| 1 | షడ్వింశతిసూత్రాణి | .... | |
| 1 | సర్వవేదాంతసారసంగ్రహః | .... | సచ్చిదానందస్వామీ |
| 1 | సాంఖ్యతారకాదివివరణమ్ | .... | |
| 2 | సూత్రభాష్యమ్ | .... | శ్రీశంకరాచార్యాః |
| 1 | హృదయగుహ్యమ్ | .... | |

---

## ధర్మశాస్త్రగ్రంథాః.

| | | | |
|---|---|---|---|
| 1 | అఘనిర్ణయవ్యాఖ్యానమ్ | ... | వేంకటేశః. |
| 2 | ఆపస్తంబసూత్రవృత్తిః | .. | భట్టరుద్రదత్తః. |
| 4 | ఆపస్తంబగృహ్యప్రయోగః | .... | ఆపస్తంబః |
| 1 | ఆపస్తంబధర్మాః | .... | |
| 2 | ఆశ్వలాయనగృహ్యమ్ | ... | |
| 1 | ఆశ్వలాయనగృహ్యపరిశిష్టమ్ | .... | |
| 4 | ఆశ్వలాయనమ్ (అనాహితాగ్నిపరమ్) | | |
| 2 | ఆశ్వలాయనాపరప్రయోగః | .... | |
| 2 | ఆశ్వలాయనసూత్రవృత్తిః | .... | |
| 1 | అశ్వలాయనసూత్రవ్యాఖ్యా | ... | మంచనభట్టః |
| 4 | ఆశౌచనిర్ణయః | .... | |
| 1 | ఆహితాగ్నిసంస్కారః | .... | |
| 1 | ఆహ్నికధర్మశాస్త్రమ్ | .... | |

| | | | |
|---|---|---|---|
| 1 | ఎల్లాజీయమ్ | .... | ఎల్లాజీపండితః. |
| 1 | ఏకదండసన్న్యాసవిధిః | .... | |
| 1 | కాశికాదిత్యమ్ (ఆశౌచనిర్ణయః) | .... | |
| 2 | గౌతమసూత్రాణి | .... | |
| 1 | దాయవిభాగః | .... | |
| 1 | ధర్మప్రశ్నాః | .... | గౌతమః. |
| 3 | ధర్మప్రవృత్తిః | .... | నారాయణః. |
| 6 | ధర్మశాస్త్రమ్ | .... | |
| 3 | నిర్ణయసింధుః | .... | కమలాకరభట్టః. |
| 1 | పరాశరమాధవీయమ్ | .... | మాధవవిద్యార |
| 1 | పారాశరస్మృతిః | .... | |
| 3 | ప్రవరఖండభాష్యమ్ | .... | |
| 2 | ప్రాయశ్చిత్తకాండః | ... | |
| 2 | ప్రాయశ్చిత్తదీపికా | .... | |
| 1 | మనుస్మృతిః | .... | |
| 1 | మనుసమ్మతషడశీతిః | .... | |
| 1 | యాజ్ఞవల్క్యధర్మశాస్త్రమ్ | .... | |
| 1 | రజస్వలాస్నాననిర్ణయః | .... | |
| 1 | లోకోపకారకగ్రంథః | .... | నృసింహః. |
| 3 | విజ్ఞానేశ్వరీయమ్ | .... | విజ్ఞానేశ్వరభట్టః |
| 1 | వ్యవహారనిర్ణయః | .... | |
| 1 | వ్యవహారసింధుః | .... | ప్రతాపరుద్రః. |
| 1 | శాకల్యసంహితా | .... | |
| 1 | శ్రాద్ధవిధినిర్ణయః | .... | సుదర్శనాచార్య. |
| 2 | షడశీతిః (సవ్యాఖ్యా) | .... | |
| 3 | స్మృతికౌముదీ | .... | |
| 1 | స్మృతిచంద్రికా | .... | |
| 2 | స్మృతిరత్నాకరః | .... | వేంకటనాథః. |
| 1 | స్మృతిసారదర్పణమ్ | ... | |

| | | |
|---|---|---|
| 3 | స్మృతిసారసంగ్రహః | .... ప్రతాపరుద్రదేవః. |
| 1 | స్మృతయః | |
| 1 | హేమాద్రిః | |

## శిక్షాగ్రంథాః.

| | | |
|---|---|---|
| 1 | త్రిభాష్యరత్నమ్ | .... |
| 1 | ప్రాతిశాఖ్యమ్ | .... |
| 4 | ప్రాతిశాఖ్యభాష్యమ్(భారద్వాజశిక్షా). | మంకిభట్టః, కౌవటః, |
| 1 | వ్యాసశిక్షా | .... |
| 1 | వేదవ్యాకరణమ్ | .... |
| 3 | శిక్షా (సవ్యా) | .... వెలమకన్ని సూరావధానీ. |

---

## వ్యాకరణశాస్త్రగ్రంథాః.

| | | |
|---|---|---|
| 5 | అష్టాధ్యాయీ | ... పాణినిః. |
| 2 | అహోబలపండితీయమ్(ఆంధ్రవ్యాకృతిః) | అహోబలపండితః. |
| 3 | ఆంధ్రశబ్దచింతామణిః(ఆంధ్రవ్యాకృతిః) | |
| 1 | కారకాణి | ... |
| 1 | కాశికావివరణమ్ | ... |
| 1 | తిజంతగాడః | ... |
| 1 | తిజంతసూత్రాణి | ... |
| 1 | ధాతుపాఠః | ... |
| 1 | ధాతుమంజరీ | ... |
| 1 | పరిభాషేందుశేఖరః | ... |
| 1 | ప్రక్రియాకౌముదీ | ... |
| 2 | ప్రయోగచంద్రికా | ... |
| 1 | ప్రౌఢమనోరమా | ... భట్టోజీదీక్షితః. |
| 1 | పాతంజలమ్ | ... |
| 1 | మనోరమా | ... |
| 1 | లఘుశబ్దేందుశేఖరః | ... నాగోజీభట్టః. |

| | | |
|---|---|---|
| 1 | లఘుసిద్ధాంతకౌముదీ | ... వరదరాజః. |
| 9 | వ్యాకరణ॰ | ... |
| 2 | శబ్దకౌస్తుభః | ... |
| 11 | శబ్దమంజరీ | ... |
| 1 | శబ్దేందుశేఖరః | ... నాగోజీభట్టః. |
| 1 | సంస్కృతధాతవః | ... |
| 1 | సమాసకుసుమావళిః | ... మంగళేశ్వరశాస్త్రీ |
| 1 | సమాసచక్రమ్ | ... |
| 1 | సమాససంధివ్యాఖ్యానమ్ | ... మల్లయార్యః. |
| 1 | సారస్వతవ్యాకరణమ్(సటీకమ్) | ... |
| 21 | సిద్ధాంతకౌముదీ (సవ్యాఖ్యా) | ...భట్టోజీదీక్షితః. |

ఛందశ్శాస్త్రగ్రంథాః.

| | | |
|---|---|---|
| 1 | ఛందశ్శాస్త్రమ్ | ... పింగళ నాగరాజః. |
| 1 | వృత్తరత్నాకరః | ... కేదారభట్టః. |
| 1 | వృత్తలక్షణమ్ | ... |
| 1 | హలాయుధవృత్తిః | ... హలాయుధః. |

నిరుక్తగ్రంథః.

| | | |
|---|---|---|
| 1 | నిరుక్తమ్ | ... |

శ్రౌతగ్రంథాః.

| | | |
|---|---|---|
| 1 | అశ్వమేధః | .... |
| 1 | ఆశ్వమేధకారకాః | .... |
| 1 | ఆగ్రయణాధ్వరమ్ | ... |
| 2 | ఆగ్రయణహౌత్రమ్ | ... |
| 1 | ఆధ్వరమ్ | ... |
| 1 | ఇష్టిహౌత్రమ్ | ... |
| 1 | ఔద్గాత్రమ్ | ... |
| 6 | కర్మకాండగ్రంథః | ... |
| 1 | కర్మప్రవృత్తిః | ... |

# బమ్మెర పోతరాజు నివాసస్థానము.

ఆంధ్రభాగవతకర్త యయిన బమ్మెర పోతరాజు నివాసస్థాన మోరుగల్లు ప్రాంతమం దయియుండును గాని యొంటిమిట్ట యైయుండదని సహేతుకముగాఁ దెలుపుచు నేనొకవ్యాసము రాక్షససంవత్సర మాఘఫాల్గునమాసముల యాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందుఁ బ్రకటించితిని. నాసిద్ధాంతములను హేతువులను నాక్షేపించుచు బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బారావుగారు మఱియొకవ్యాస మీసంవత్సరము జ్యేష్ఠాషాఢమాసములసంచికలోఁ బ్రకటించినారు. ఈవ్యాసముఁ జక్కఁగాఁ జదివినాఁడను, గాని నాయభిప్రాయమును మార్చుకొనుటకుఁ దగినకారణము లేమియు నందుఁ గానరాలేదు. కావున సుబ్బారావుగారికి నేను బ్రత్యుత్తర మీయ వలసివచ్చినది.

సుబ్బారావుగారివ్యాసము వాదప్రౌఢిమను సూచించు వాక్యాలంకారములతో నిండి యున్నది. అందలిమాటల కన్నింటికి వేఱువేఱుగా సమాధానములు చెప్పవలయునన్న గ్రంథము మిక్కిలి పెరుఁగుటయే కాక వివాదాంశములు మఱుఁగుపడుటయుఁ దటస్థించును, గావున నట్లుచేయుట మాని సిద్ధాంతమునకు ముఖ్యాధారము లని నేను దొలుతఁ బ్రతిపాదించిన విషయములపై సుబ్బారావుగారుచెప్పిన యాక్షేపముల ననువదించి, వానికి సంగ్రహముగా సమాధానము చెప్పి, యాపిదప సుబ్బారావుగారు క్రొత్తగాఁ బ్రతిపాదించిన హేతువులేమైన నున్నయెడల వానిని ఖండించెదను. చదువరు లీపద్ధతి నామోదింతురుగాక.

౧. పోతరాజు నింటిపేరయిన బమ్మెర, భాగవతములోని శిథిలభాగములం బూరించిన సింగన నారయకవుల యింటిపేళ్ళయిన ఏర్చూరు, వెలిగందల యను నీమూఁడు గృహనామములకుఁ గారణభూతములగు బమ్మెర, ఏర్చూరు, వెలిగందల యనుగ్రామము లోరుగంటికి సమీపదేశమునం దున్నవి, గాన నాగృహనామములు గల కుటుంబము లాప్రాంతమందే యుండెనని యూహించుట యసమంజసము కాదని నా మొదటివాదము. దీనిని బూర్వపక్షముచేయు తలంపుతో సుబ్బారావుగా రయిదాఱు పుటలగ్రంథము వ్రాసినారు. ఏర్చూరనుగ్రామము గుంటూరుమండలములో నొకటియున్న దనియు, దీని నిప్పుడు ఏల్చూరని జనులు

వ్యవహరించుచున్నను బూర్వము పేర్బాఱై పేల్బారుగా మాఱి యుండవచ్చు ననియు, నెల్లూరిమండలములో వెలిగండ్ల యను గ్రామమొకటి యున్నదనియు, నిదియే వెలిగందల మై యుండవచ్చు ననియు, నీయూహలు సరియైనచో సింగన నారయలు గుంటూరు నెల్లూరుమండలవాసులై యుండవచ్చుననియు వారి వ్రాఁతలోని సారాంశము. వివాదాస్పదమైన మూఁడుగ్రామనామములలో రెంటి కేలాగుననో మేనమామపోలిక గల మఱిరెండు గ్రామములపేళ్లు సుబ్బారావు గారు సంపాదింపఁ గలిగిరి, గాని యీవాదమున కంతకు మూలాధారమైన బమ్మెరగ్రామమునకుఁ బ్రతిగ్రామ మాయనకుఁ బొడకట్టియుండలేదు. పేల్బారు, వెలిగండ్లగ్రామముల కనతిదూరములో నొకబమ్మెరయో, బొమ్మెరయో కనఁబడి నప్పుడు గాని సుబ్బారావుగారియాక్షేపము విమర్శనపాత్రము కాదు.

ఒకకుటుంబ మొక్కయూరు విడిచి మఱియొకయూరికిఁ గాఁపురము పోయినప్పుడే పూర్వగ్రామముపే రాకుటుంబమునకు గృహనామ మగుననియు, గృహనామము, నివాసగ్రామనామము నొక్కటియే యగుటయరుదనియుఁ, గావున బమ్మెర పోతరాజు బమ్మెరనివాసి గాఁడనియు సుబ్బారావుగా రింకొక యాక్షేపము చేసినారు. తెలుఁగువారల గృహనామము లనేకములు గ్రామనామములే. కొంత మంది తమయింటిపేళ్లు గలయూళ్లలోనే కాఁపుర ముండవచ్చును. కొంద ఱితర గ్రామములలో నుండవచ్చును. ఇంటిపేళ్ళు గలయూళ్లలో నివాసము చేయు చున్నవారలఁ బలువుర నేనెఱుఁగుదును అట్టివారు బొత్తిగా లేరని సుబ్బరావు గారును జెప్ప సాహసింపలేదు. కాకపోయినను, భాగవతమునురచించు కాల మందుఁ బోతరాజు బమ్మెరలోనే కాఁపురమున్నాఁ డని నావాదముకాదు. గ్రంథ రచనాప్రారంభమం దాయన యేకశిలానగర మందున్నట్లు భాగవతమే చెప్పు చున్నది. తొలుత బమ్మెరలో నుండి భాగవతరచనాకాలమందుఁగాని యంతకుఁ గొంతకాలము పూర్వముగాని యేకశిలానగరమునకు వెళ్లియుండవచ్చును. కావు ననే తాను బమ్మెరకు సంబంధించినవాఁ డనికాని, బమ్మెరనుండి వచ్చినవాఁ డని కాని సూచించుటకై బమ్మెర యనుగృహనామమును బెట్టుకొనియుండును. తిరిగి యవసానదశకు బమ్మెర చేరియుండిన నుండవచ్చును. అటు కాకపోయినను బమ్మెర యాయనకు స్థిరవాసమగుటచే నాగ్రామమువా రామహాకవిని దమ యూరివాఁడుగానే భావించి యాయనకు జ్ఞాపకముగా విగ్రహమును స్థాపించుట లోకాచారవిరుద్ధము కాదు.

౨. పోతరాజు కానొకచంద్రగ్రహణము నిమిత్తమున గంగాతీరమందు మహేశ్వరధ్యానముచేయు నవసరమున రామభద్రుఁడు ప్రత్యక్షమై భాగవతమును దెనిఁగింపు మని యాజ్ఞయొసఁగెనని భాగవతమునం జెప్పంబడి యుండుటంబట్టి యీసందర్భమున గంగయనఁగా గోదావరి యని గ్రహింపవలసియున్న దనియు, గోదావరికి నోరుగంటిప్రాంతదేశమున గంగ యనుసంజ్ఞ వ్యవహారమందు రూఢమై యుండుటంబట్టియు, నొంటిమిట్టప్రాంతమం దట్టివ్యవహారము లేకుండుట వలనను గోదావరి యొంటిమిట్టకుకంటె నోరుగంటికి సమీపమగుటను భాగవతములోని యేకశిలానగర మోరుగల్లనియే యూహింపవలసి యుండునని నా రెండవవాదము. ఈవాదము నాక్షేపించుచుఁ గొంతసేపు గంగ యనుసంజ్ఞ గోదావరికిఁ జెల్లదనియు, మఱికొంతసే పాపేరు నీళ్ళుగల యేగుంటకైనను జెల్లుననియు నింకను మఱి యేవేవో వ్రాసి యించుమించు పదునాలుగుపుటలు నింపినారు. గంగ యనుసంజ్ఞ సర్వసాధారణముగా భాగీరథికే రూఢము. గోదావరికి దక్షిణగంగ యనుసంజ్ఞ లోకములోఁ గలదు. నన్నయభట్టారకుఁ డాసంజ్ఞను బ్రయోగించెను. శ్రీనాథుఁ డొకటిరెండు స్థలములలో గోదావరిని గంగయనియే పిలిచెను. కాని, నావాదమునకు ముఖ్యాధార మోరుగంటి ప్రాంతదేశమునందలి వాడుకగాని యీప్రయోగములు కావు. ఆదేశమందు సర్వసాధారణముగా గంగ యనఁగా గోదావరి యనియే యర్థము. పలువురు ప్రామాణికులవలన నేనిది వినియున్నాఁడను. ఇది కాదని సుబ్బారావుగారు చెప్పలేగు. చెప్పలేరు. చంద్రగ్రహణమునకు మిక్కిలిదూరమున నున్నభాగీరథికిఁ బోవుటకంటె ననతిదూరమందున్న గోదావరివంటి మహానదికిఁ బోవుట సామాన్య లోకాచారానుసారము. పోతరాజు భాగీరథికిఁ బోయియుండఁగూడ దని నావాదముకాదు. పోయినఁ బోయియుండవచ్చును. కాని, తగినంత యాధారములేక యంతదూరము చంద్రగ్రహణ నిమిత్తమాత్రమున వెళ్లెననుట సమంజసముకాదని నామతము.

గోదావరికి గంగ యనుసంజ్ఞ లోకవ్యవహారములో నున్నంతమాత్రమునఁ బోతరాజువంటికవి యది గ్రంథస్థము గావించునా యని యొక యాక్షేపము పుట్టవచ్చును. "అభ్రంకష శుభ్రసముత్తుంగ భంగ యగుగంగకుం జని" యని పోతరాజు ప్రయోగించెను. ఇందు గంగ యనుశబ్ద మనుప్రాసాలంకారమున కుపకరించినది పోతరా జనుప్రాసప్రియుఁడు, కావున, లోకవ్యవహారరూఢమును సత్కవిప్రయోగావిరుద్ధమును నగుసంజ్ఞ నాకవి ప్రయోగించుట వింత కాదు.

ఈవిషయమై యిచ్చట నింతకంటె నెక్కువవ్రాయుట చర్వితచర్వణ మగును. వలసినచోఁ బాఠకులు నాప్రథమవ్యాసముం జూచెదరు గాక.

భాగవతకృతిపతి సామాన్యరాముఁడు కాక కోదండరాముఁ డనియు, భాగవతములోని కోదండరామవర్ణన మొంటిమిట్ట కోదండరామస్వామి యాకార మునకు సరిపోవుచున్న దనియు, నీహేతువుచేఁ బోతనకుఁ బ్రత్యక్షమైన రామ భద్రుఁ డొంటిమిట్టదేవుఁడేయని యూహింపవలయు ననియు సుబ్బరావుగారు వ్రా సినారు. పోతరాజునకుఁ బ్రత్యక్షమైనదేవుఁడు కోదండరాముఁడనుమాట తథ్యమే. కాని,కోదండరాముఁడొంటిమిట్టలోమాత్రమే వెలసియుండలేదు.అనేకగ్రామముల లోఁ గోదండరామస్వామి యాలయములు గలవు. ఎక్కడ నున్నను నాదేవుని యాకార మొక్కరీతిగానే యుండును. కావునఁ గోదండరామస్వామి యన్నంత మాత్రమున నొంటిమిట్ట కోదండరామస్వామియేయని సిద్ధాంతముచేయుట న్యా య్యము కాదు.

కావ్యముల నర్చావిగ్రహముల కంకితమొనర్చినకవులు సర్వసాధారణ ముగా నావిగ్రహములు ప్రతిష్ఠింపఁబడిన క్షేత్రముల నొకచోటఁ గాకపోయిన మఱియొకచోటనయినను దమగ్రంథములందు సూచించియున్నారు. అట్లు సూచింపనియెడలఁ గృతిపతు లర్చావిగ్రహములు కావనియే యూహింపవల యును. భాగవతమం దట్టిసూచనలు లేవు కావున నీకృతిపతి యర్చావిగ్రహము కాదనియే తేలుచున్నది. ఒంటిమిట్టదేవాలయములో రామవిగ్రహమున కొక ప్రక్క సీతావిగ్రహమును రెండవప్రక్క లక్ష్మణవిగ్రహము నున్నవి. పోతరాజు లక్ష్మణవిగ్రహముమాటయే తలపెట్టలేదు, కావున నాతఁడు తనకుఁ బ్రత్యక్ష మయినరాముని వర్ణించినప్పు డొంటిమిట్ట దేవాలయములోనివిగ్రహ మాతని మనస్సులో లేదనియే చెప్పవలసియున్నది.

3. భాగవతనిర్మాణ మేకశిలానగరమం దయినది. ఏకశిలానగర మను సంజ్ఞ యోరుగంటికిఁ జెల్లిన ట్లొంటిమిట్టకుఁ జెల్లదను నామూఁడవవాదమునకు మూఁడుహేతువులు చెప్పినాను. అవి యేవియనఁగా (1) ఏకశిలయనఁగా నఖండ శిల యనిభావము. ఓరుగల్లన నదియే యర్థము. ఓరుగంటి కోటనడుమ నఖం డశిలారూపమున నొకచిన్నకొండ గలదు. దీనినిబట్టియే పట్టనమున కాపేరు వచ్చి యుండును. ఇది యొకహేతువు. దీనికి సుబ్బరావుగారు రెండుమూఁ డాక్షేపములు చేసినారు. ఏకశబ్దమున కఖండమనునది యొకటేయర్థము కాదని యొక యాక్షే

పము. ఏకశబ్దమున కఖండమనునర్థ మొకటిమాత్రమే యున్నదని నే నన లేదు. ఏకశిలానగర మనుశబ్దమం దాయర్థము చెప్పవలసియున్న దని నావాదము. కాఁబట్టి సుబ్బరావుగారియాక్షేప మప్రసక్తము. ఓరుగంటికిసమీప మం దున్న భువనగిరికిఁ గూడ నేకశిలానగర మనుసంజ్ఞయున్నది కావున నాపే రోరుగంటికి మాత్రమే లేదని రెండవయాక్షేపము. భువనగిరి కెప్పటికిని భువనగిరి యనియే రూఢనామము. ఈపేరునకుఁ గారణభూత మయినకొండ యఖండశిలారూప ముగా నుండుటచేఁ గొందఱాపట్టనమున కేకశిలానగర మనుసంజ్ఞను సాధించిరి, గాని యాపే రోరుగంటికివలె సుప్రసిద్ధము కాదు. ‘ భువనగిరి ’ “ఏకశిలానగ రము ” నను రెండును సంస్కృతపదములే. మొదటిది సిద్ధనామము. రెండవది యిటీవల సాధింపఁబడినది. రెంటికి నర్థములో భేద మున్నది. ఓరుగ ల్లనునది కన్నడపుఁబేరు. దానికి సంస్కృతమున నేకశిలానగరమని వ్యవహరించిరి. పోత రాజాసంస్కృతకవిసంప్రదాయమునే యనుసరించెను.

ఏకశిలానగర మనుపే రోరుగంటికే ప్రాచీనగ్రంథములందుఁ గనఁబడుచున్న దనియు, నొంటిమిట్టకాపేరు పూర్వకవులు ప్రయోగించి యుండలేదనియు నారెం డవవాదము. పూర్వగ్రంథములం దొంటిమిట్టకుఁగూడ నేకశిలానగర మనుపేరున్న దని సుబ్బరావుగారివాదము. ఈపూర్వగ్రంథము లేవియన:- పురాణము హాయ గ్రీవశాస్త్రిలుగారు రచియించిన భాగవతపీఠిక యొకటి Madras Manual of Administration అనుపుస్తక మొకటి “ ఒంటిమిట్ట లేక యేకశిలానగరమాహా త్మ్యము.” అను పుస్తకమొకటి. మొదటిది “శాలివాహనశక గతసంవత్సరములు 1770అగు నేఁటి కీలక సంవత్సరమునందు” అనఁగా నిప్పటికి 69 సంవత్సరములక్రిం దటఁ బ్రకటింపఁబడినది. ఇందులో బమ్మెరపోతరాజు విద్యాప్రాదుర్భావమునుగూ ర్చిన వుక్కిటిపురాణము వివరించు నవసరమున “ నిమ్మహాత్ముండు బాల్యమునందు గోసంరక్షణార్థంబుగా స్వగ్రామం బగునేకశిలానగరంబునకు సన్నికృష్టపర్వతా గ్రంబున సంచరింపుచుండుసమయంబున నచ్చట నతనిపూర్వజన్మ సుకృతపరిపాకా తిశయంబున చిదానందయోగీంద్రుండను నొకఋషిశ్రేష్ఠుండు దృగ్గోచరుం డ య్యె” నని వ్రాసి, ఏకశిలానగర మనుచోట హంసపాదముపెట్టి పుటయడుగున “ఈగ్రామమునకు ప్రతినామము ఒంటిమిట్ట. ఇదికడపకు దక్షిణమున చెన్నపట్టణ మునకు బోయే భాటలో మొదటిమజిలీ స్థలముగా నుంటున్నది” యనివ్రాసిరి. వీనినిబట్టియొంటిమిట్ట కేకశిలానగర మనినామాంతరము గలదనియు, బమ్మెరపోత

రాజు నివాసమది యేయని యుహాయగ్రీవశాస్త్రిలుగారి యభిప్రాయ మయినట్లు తే
లుచున్నది. ప్రస్తుతవాదమున కీగ్రంథమువలనఁ గలుగుఫల మింతియే. సుబ్బారావు
గారి రెండవపూర్వలేఖనము మూఁడుసంపుటములుగా నున్నది. అందు మూఁడవ
సంపుటములో నొంటిమిట్ట కేకశిలానగర మనుపేరుగూడ నున్నట్లున్నది. ఈ
సంపుటము 1893వ సంవత్సరమందుఁ బ్రకటింపఁబడినది ఏకశిలా నగరమాహాత్మ్య
మనుతప్పులతడక "శాలివాహనశకం 1828 అగునేటి పరాభవనామసంవత్సర
కార్తీక శు ౧ శుక్రవారంవరకు-పూర్తి. ఇందుక్కు సరిఅయిన 1906 సం॥ అక్టో
బరు నెల 26వ తేది" యని గ్రంథాంతమం దున్నది. ఇది యొంటిమిట్టసమీప
మందలి యోబిలిగ్రామమందు నివసించియున్న కోవ్వూరు రామదాసుచే రచింపఁ
బడినది. ధూర్త వేంకటాచలమయ్య స్కాందపురాణమునను సరించి రచించి
తనకంపిన తెనుఁగువచనమునుబట్టి పద్యకావ్యము చేసితినని కవి కృత్యాది
యందుఁజెప్పినాఁడు. ఈమూఁడు గ్రంథములలో హయగ్రీవశాస్త్రిగారి పీఠికయే
ప్రప్రథమము. ఇదియైన నిప్పటి కిఱువదితొమ్మిది సంవత్సరములకుఁ బూర్వము,
అనఁగాఁ బోతరాజుగతించినపిదప నాలుగువందల సంవత్సరములకుఁ బైఁగాఁ బుట్టి
నది. పోతరా జొంటిమిట్ట నివాసి యగునో కాఁడో హయగ్రీవశాస్త్రిగారు స్వయ
ముగ నెఱిఁగియుండరుగదా? ఏకారణములఁబట్టి తమకాయభిప్రాయము గలి
గెనో యాయన చెప్పియుండలేదు, ఆయన కడపమండలమందుఁ బుట్టినవాఁడుకాక
పోయినను గొంతకాలము కార్యవశమునఁ గడపలో నివసించియుండి రని వారి
బంధుకోటిలోనివారగు చదలువాడ సుందరరామశాస్త్రిగారు చెప్పుచున్నారు. ఆ
కాలమం దీప్రతీతిని హయగ్రీవశాస్త్రిగారు కడపలో విని యుండవచ్చును. ఒంటి
మిట్ట కేకశిలానగరమని స్థూలదృష్టిచే నర్థముచెప్పవచ్చునుగనుకను, నాయూరిలోఁ
గోదండరాముని యాలయమున్నదిగనుకను నీప్రతీతిపుట్టియుండును, గాని యంత
కంటె నీవాదమునకుఁ బ్రబలకారణ మున్నట్లు కనఁబడదు. Manual of Administration.
లోనివ్రాఁతకును హయగ్రీవశాస్త్రిలుగారి పీఠికయే కారణమయి యుండవలయును.
ఏకశిలానగర మాహాత్మ్యములోనికథ కొంత విలక్షణముగా నున్నది. ఒంటఁడు,
మిట్టఁడు నను బోయ లిరువు రొకయడవిలో వెలసియున్న శ్రీరామవిగ్రహమును
సేవించుచుండిరనియు, నాసమీపమున రామతీర్థమను మంచినీళ్ళగుంట యొకటి
వలసినప్పు డామూఁతను
దీసి నీరుద్రావుచుండెడివారనియుఁ, గొంతకాలమున కొకరాజావనమునకు వేటకు

వచ్చి దప్పిగొని నీరుగానక తపించుచుండ బోయలు మూఁతదీసి రామతీర్థ మాత నికిఁ జూపిరనియు, రాజుసంతసించి వరముకోరుఁడని బోయల నడుగ రామునకు గుడియుఁ దమపేర నచ్చట నొకయూరును గట్టింపుమని యడిగిరనియు, రాజట్లు చేయుటచే నొంటిమిట్ట యనుగ్రామ మేర్పడె ననియు నిందున్నది దీనినిబట్టి యేక శిలానగర మనుపేరు రామతీర్థముపైఁ గప్పినరాతినిబట్టి పుట్టినదిగాని యొంటి మిట్టకు భాషాంతరము కాదని తేలుచున్నది. ఈవ్యుత్పత్తి సుబ్బరావుగారి మతానుసారముగాదు. 1300 శక సం॥లు గతించినపిమ్మట బమ్మెరపోతన యీగ్రామ మునఁ బుట్టి చిదానందయోగికరుణచే సరస్వతిని బ్రసన్నఁగాఁ జేసికొని భాగవత మును దెనిఁగించెనని భూతవృత్తాంతముగా నీగ్రంథమందు వర్ణింపబడినది. ఈ గ్రంథము స్కాందపురాణము ననుసరించి రచింపఁబడినదిగావునఁ బరమప్రమాణ మని సుబ్బారావుగారి వాదము. స్కాందపురాణమును గవి చూచియుండలేదు. దానినిబట్టి యెవరో వ్రాసినా రన్న వచనమునుబట్టి గ్రంథము రచించినాఁడఁట. స్కాందపురాణ మన దిక్కులేని క్షేత్రమాహాత్మ్యముల కెల్ల దిక్కు. కావుననే యఱవమున “ ఈపొయి కందపురాణత్తిలియు మిల్ల ” (ఈకల్ల స్కాందపురాణము నందును లేదు) యనుసామెత పుట్టినది. పోతరాజు తెనుఁగు భాగవతముఁ రచిం చినకథ యిట్టి పుస్తకమునం దుండుట వింతకాదు.

ఈగ్రంథములు మూఁడును బ్రస్తుతవాదము విజృంభింపక పూర్వమె పుట్టి నవి గావునఁ బ్రమాణము లని సుబ్బరావుగారు వాదించుచున్నారు. ఈవాదము శాస్త్రసమ్మతము కాదు. పోతరాజు జీవించియున్నపుడు గాని, యాతఁడు గతించిన పిమ్మటఁ గొంచెముకాలమునకుఁ గాని యీగ్రంథములలోఁ నేదియైనఁ బుట్టి యుండినచోఁ బోతరాజు జన్మస్థానవిషయము గ్రంథకర్త సత్యమెఱింగియే వ్రాసి యుండు నని యూహింపవచ్చును. కాని, యాయన కీర్తిశేషుఁడయిన నాలుగు వందల సంవత్సరములకుఁ బైనిఁ బుట్టినపురుషుఁ డావిషయము నిజమెఱిఁగియే వ్రా సెనని యెట్లు నమ్మవచ్చును ?

ఇంతకు, నొంటిమిట్టవాదుల కేకశిలానగరశబ్దము వ్యుత్పత్తియే కుదిరినది కాదు. ఏకశిల యనునది యొంటిమిట్టకు సంస్కృతరూప మని సుబ్బరావుగారి సిద్ధాంతము. రామతీర్థముపై మూఁత వేయఁబడిన రాతినిబట్టి యేకశిలానగర మను పేరు పుట్టిన దని యేకశిలానగర మాహాత్మ్యములో నున్నది. ఈరెండును జాలక యొంటిమిట్ట దేవాలయములోని సీతారామ లక్ష్మణ విగ్రహములు మూఁడును

నేకశిలానిర్మితము లగుటనుబట్టి యేకశిలానామము గ్రామమునకుఁ గలిగిన దని మూఁడవవ్యుత్పత్తి నొకదానిని సుబ్బరావుగారు కల్పించినారు. నేనీనడుమ సుబ్బరావుగారితోఁగూడి యాదేవాలయమునకుఁ బోయి స్వామిని సేవించితిని. సీతారామలక్ష్మణ విగ్రహములు మూఁడు నేకశిలానిర్మితము లన్నమాట సరికాదు. మూఁడు నొకపీఠమందే ప్రతిష్ఠింపఁబడియున్నవి గాని యొక్కరాతితో నిర్మింపఁబడినవి కావు. ఒకదాని కొకటి రమారమి గజముదూరమునం దున్నది.

నగరశబ్ద మోరుగల్లువంటి పెద్దపట్టనమునకె చెల్లునుగాని యొంటిమిట్టను బోలిన చిన్నయూరికిఁ జెల్ల దని నావాదము. కొన్నిపల్లెటూళ్లకుఁ గూడ నగరము పట్టనము మొదలగు సంజ్ఞ లున్నవనియు నొంటిమిట్టగూడఁ బూర్వము పట్టనముగానె యుండవచ్చు ననియు సుబ్బరావుగారి సమాధానము గ్రామములు పుట్టినప్పుడు చిన్నగ్రామములకుఁగూడఁ బెద్దపేరులు పెట్టునాచార మచ్చటచ్చట నున్నను,నడుమఁ గల్పింపఁబడు నామము లన్వర్థముగానే యుండుననియు, నొంటిమిట్ట పూర్వము గొప్పపట్టనముగా నున్నట్లు నిదర్శనములు కానరావనియు నా ప్రత్యుత్తరము. ఏది యెట్లయినను నిది యొక గొప్పవిషయము కాదు గనుక నింతకంటెఁ జర్చింపవలసిన పనిలేదు.

ఓరుగంటికిఁ బుట్టుపేరు ఒరగల్లనియు, సామాన్యనగరము లనుబంగారమున కీపట్టన మొరపుడురాయివంటిదిగాన నీపేరుపెట్టి రనియు, కాకతీయ గణపతిదేవునికాలమం దాపట్టనమున రాతికోటయొకటి కట్టఁబడుటవలన నప్పటినుండి యేకశిలానగర మనుసంజ్ఞ వచ్చిన దనియు, నొరగల్లే యొరంగల్లయినదనియు, నీపేరులో రేఫమున కత్వమెగాని యుత్వములే దనియుఁ, గన్నడములో నేకార్థమం "దొరు" అను శబ్దము లేనే లే దనియు సుబ్బారావుగారొక యపూర్వవాదము కల్పించినారు. కన్నడములో నొకటియనునర్థమం దొరు శబ్దము లేదనుటయు, గణపతిదేవునికాలమునకుఁ బూర్వ మేకశిలానగర మనికాని యోరుగల్లనికాని పేరోరుగంటికి లేదనుటయు నీవాదమున కాధారము లయియున్నవి. ఈయూహలు రెండును దప్పని చూపిన నీవాదమడుగంటును గదా! ఒరుశబ్దవిషయమై సుబ్బరావుగారు :—"ఒరు" శబ్దమునకు "ఒకటి" యను నర్థము కన్నడములో లేదని మ-రా-రా కోలాచలము శ్రీనివాసరావుగా రిప్పుడు చెప్పిరి గదా! ఇట్టులే నేను విచారించిన కర్ణాటక భాషాభిజ్ఞు లెల్లరుఁ జెప్పిరి. ఇప్పుడు పంతుల వారివాదమున కేమిగతి" యని వ్రాసినారు.

నా వాదమున కించుమించు డెబ్బదెనిమిదియో యెనుబదియో సంవత్సరములకు ముందటి కేశిరాజు గ్రంథమునుండి : నా వాదమున కించుమించు చాలువందల సంవత్సరములక్రిందటఁ గర్ణాటక భాషాలక్షణ గ్రంథములలో నుత్తమ మయిన శబ్దమణిదర్పణ మను లక్షణగ్రంథ మును రచియించిన కేశిరాజుగతి. ఆగ్రంథములో సమాసప్రకరణమున :—

"దొరకొళ్వ దఖిలవైయా, కరణరి నొందెంబు దర్కొ రెంబాదేశం"

అని యున్నది. అఖిలవైయాకరణుల మతమునను (వృత్తియందు) ఒందు (ఒకటి) అనుదానికి "ఒర్" అను నాదేశము వచ్చు నని దీని యర్థము. అఖిలవైయా కరణులు నంగీకరించిన దానికి సుబ్బారావుగారు విచారించిన కర్ణాట భాషాభిజ్ఞు లెల్లరు నెట్లొప్పకుందురో తెలియదు. ఓరు అనునది ఒర్ శబ్దమునకు రూపాంతర మని చెప్పనక్కఱలేదు గదా.

ఓరుగంటి కేకశిలానగర మనుపేరువచ్చుటకు హేతువు చెప్పుచు సుబ్బ రావుగారు :—

"వచ్చి తనకు మరలఁబడ్డ తమ్ములను హా, రించి సకలగహ్వారిస్థలికిని, బ్రా జ్ఞు లెన్నఁగాను బట్టాభిషిక్తుఁడై, వీటికొక్కరాతికోట నిలిపె."

అను సోమదేవరాజీయపద్యము నుదాహరించి, "పంతులవారియొక్క రాయి యిందుఁ గానవచ్చుచున్నది. వీనినిబట్టి యాలోచింప శిలాప్రధాన మైన కోట గణపతిదేవుని కాలమందు నిర్మింపఁబడుటచే నానగరమునకు నేకశిలా నగర మనుపేరు వచ్చెనని తెలియవచ్చెడిని" అని వ్రాసిరి. ఒక్కరాతికోట యను నప్పు డొక్క యను విశేషణము కోట కన్వయించునుగాని రాతి కన్వయింపదు గదా. అట్లయినచో "నొకఁ రాతికోట" యుండుటచే నగరమున కేకశిలాభి ధానం బెట్లు సాధింపవచ్చునో ప్రాజ్ఞులు నిర్ణయింతురుగాక.

శబ్ద వ్యుత్పత్తిమాట యటుండనిచ్చి గణపతిదేవునికిఁ బూర్వ మోరుగంటి పే రేరూపముననుండెనో విచారింతము. హనుమకొండకోటలోఁ బద్మావతి యాలయమున కెదుట నొక స్తంభముమీఁదఁ గన్నడశాసన మొకటి యున్నదని నాపూర్వవ్యాసములోఁ జెప్పియుంటిని. ఆశాసనములో గణపతిదేవుని పితా మహుఁడగు కాకతిప్రోలరాజు మంత్రి బేతరస భార్య మైలమయు, మాధవవర్మ వంశజుఁడైన మేలరసయు నలువదిరెండవ చాలుక్య విక్రమార్క సంవత్సరమునకు సరియైన "హేమలంబి సంవత్సర పౌష్యబహుళ ౧౨ సోమవార"మం దాదేవాలయ మునకు భూదానములు చేసినట్లున్నది. శాసనములోఁ జెప్పిన తిథి 1117సం॥ 24 డి సెంబరునకు సరిపోవును. మేలరస దానమునుగూర్చిన శాసనభాగ మిట్లున్నది:—

"మాధవవర్మవంశోద్భవరప్ప శ్రీమన్మహామండలేశ్వర నుగ్రవాడియ మేలరసం తన్నాళికె యొరుంగల్ల కూచికెఱె యేరియ కెళగె కాలువెయ మొదల గద్దెయ మత్తరొం దాసమిాపదలె కరంబం మత్తహత్తు మిత్త."
దీనికిఁ దెనుఁగు :—

మాధవవర్మ వంశోద్భవులైన శ్రీమన్మహామండలేశ్వర ఉగ్రవాడి మేలరసు తనయేలుబడి (లోనున్న) ఒరుంగల్లు కూచిచెఱువు గట్టుక్రింద కాలువ మొదట నొక మత్తరు వల్లపునేలయు పదిమత్తరుల మిశ్రభూమియు నిచ్చెను.

ఈశాసనము Epigraphia Indica 9వ సంపుటములోఁ బ్రకటింపఁబడి యున్నది. ఇందు ఒరుంగల్లు అని స్పష్టముగా నున్నది. హానుమకొండ యోరుగంటి కంటియున్నది. శాసనకాలమందు మేలరస ప్రోలరాజు నధికారము నకు లోపడి యోరుగంటిని బాలించుచున్నట్లు కనఁబడుచున్నది.

ఇంతియకాక, గణపతిదేవుని కాలమందుఁ బుట్టిన గణపేశ్వరశాసనములో (దీనిని Epigraphia Indica, 3వ సంపుటములోఁ జూడఁదగు) గణపతిదేవుని పెదతండ్రియగు ప్రథమరుద్రదేవుని ప్రశంసించునవసరమున :—

"ఉన్మృష్టాని పురాణి యేన కథయం త్యాపూర్య తత్తజ్జనై
స్తత్తన్నామభి రోరు(ం)గల్లు*నగరే నిర్మాపితా వాటికాః
కించ స్వేషు కృతేషు తే వ్యధ పురీష్వాపూర్య నూత్నైర్జనైః
శ్రీరుద్రేశ్వర సంజ్ఞయా విరచితాః ప్రఖ్యాతదేవాలయాః.

అని చెప్పఁబడియున్నది. ఈశాసనమం దోరుగల్లనియు మొదటిశాసనమునం దోరుంగల్లనియు నున్నది. ఈరెండును ఒరుగల్లు రూపాంతరములే. ఇప్పుడైన గణపతిదేవునికిఁ బూర్వ మోరుగంటిపేరిలో రేఫమున కుత్వము లేదను వాదము సుబ్బరావుగారు మానుకొందురుగాక.

౮. భోగినీదండకకృతిపతి యగు సర్వజ్ఞసింగమనీఁ డోరుగంటిప్రాంతమువాఁడు గావునఁ దత్కృతికర్తయగు పోతరాజును నాప్రాంతమువాఁడే యై యుండు నని నానాల్గవవాదము. పోతరా జొంటిమిట్టనుండి యోరుగంటి ప్రాంతమునకుఁ బోయి యుండరాదా యని సుబ్బరావుగారి యాక్షేపము. పోతరాజే భోగినీదండకమును రచియించె నను జనశ్రుతి యీవాదమున కాధారము. ఈ

* ఓరుంగల్లనువ్యావహారికరూపము ప్రయోగింపఁబడినను ఛందోభంగము లేకుండుటకై యోరుగల్లనియే చదువవలయును.

జనశ్రుతికిఁ దగినప్రమాణములు కాన్పించుట లేదు, కావున నీవిషయ మంత గాఁ జర్చించుట యనావశ్యకము.

౫. జనశ్రుతిప్రమాణ మొంటిమిట్ట వాదమునకే కాక యోరుగంటి వాదమునకును గల దని చూపి యుంటిని. నేనుదాహరించిన జనశ్రుతులలో బమ్మెరపేరేగాని యోరుగల్లు పేరు లేకుండుటచే నాప్రమాణము లోరుగంటివాద మున కుపచరింపవని సుబ్బారావుగారి యభిప్రాయము. దీనికి సమాధాన మింతకు ముందే చెప్పియున్నాను. ఓరుగంటివాదము బమ్మెరవాదము నొకటే. భాగవతమును రచించిన కాలముననో యంతకుఁ గొంచెము ముందుగానో పోతరాజు బమ్మెరనుండి యోరుగంటికి వచ్చియుండును.

ఒంటిమిట్టవాదమున కున్న జనశ్రుతుల వంటివి యోరుగంటివాదము నకుఁగూడ లేకపోలే దని చెప్పటకై యోరుగంటివారిమాటలఁ గొన్ని నే నుదాహరించితిని, కాని, కేవలజనశ్రుతులు ప్రబలప్రమాణములు కావనియే నామతము. ఏదోయొక యల్పాధారమును బట్టియో, ప్రమాదముననో యొకఁడేదయిన నొకమాట పుట్టించిన యెడల "గతానుగతికోలోకో నలోకః పారమార్థిక" యను న్యాయమునుబట్టి యామాట కాలక్రమమున లోకములో వ్యాపించుట కలదు. అంతమాత్రముచేత నాకింవదంతి సత్య మనుటకు వలనుపడదు. ఇటీవల రావు బహదర్ వీరేశలింగము పంతులుగారు ఖండించు వఱకు నన్నయభట్టును, తిక్కనసోమయాజియు నొకకాలమువారే యని యాంధ్రలోకము నమ్మినది. సారంగధరచరిత్రములో వర్ణింపఁబడిన యితివృత్తము రాజమహేంద్రవరములో జరగినదనియు, కృతినాయఁకుడు పూర్వచాలుక్యరా జగు రాజనరేంద్రునికొడు కనియుఁ బ్రబల మయిన కింవదంతి కలదు. రాజమహేంద్రవరము సమీపమున సారంగధరునిమెట్ట యనుప్రతీతి గలచిన్నకొండ యొకటియున్నది. దీనిమీఁదనే సారంగధరుని కాళ్లు, చేతులు నఱకఁబడిన వందురు. రాజనరేంద్రునియొక్కయు నతనికొడుకుల యొక్కయు శాసనము లనేకములు వెలువడినవి. వానిలో నెక్కడను రాజనరేంద్రునకు సారంగధరుఁ డను కొడు కున్నట్లే లేదు. చేమకూర వేంకటకవికృతాంధ్రి సారంగధరచరిత్రమందు రాజనరేంద్రుఁడు మాళ్వదేశపురాజయి నట్లున్నది. గోలకొండదేశములోని వేములవాడ ప్రాంతమందలి జనులు సారంగధరునితండ్రి తమదేశము నేలినరాజే యని చెప్పుదురు. ఇట్టి ప్రతీతు లింకను ననేకములు గలవు. వీనిలో నేది సత్యమో యేది యస

త్యమో ప్రమాణములవలనఁ గాని తేలదు.

౬. భాగవతములోఁ బ్రయోగింపఁబడిన యాంధ్రశబ్దవిశేషము లోరుగంటివాదమునకు నొంటిమిట్టవాదమునకును సమానములే గావున నాయాధారమునుబట్టి యాగ్రంథ మొంటిమిట్టలోఁ బుట్టిన దని కాని, యోరుగంటిలోఁ బుట్టిన దని కాని నిర్ణయించుట కనువు గాదని నావాదము. ఈవాదమును బూర్వపక్షముచేయఁ దగిన యాధారములు సుబ్బరావుగా రేమియుఁ గనఁబఱిచియుండలేదు.

ఒంటిమిట్ట దేవాలయములోఁ బోతరాజువిగ్రహ మొకటి యున్నదనియు, నందువలనఁబోతరాజాయూరివాఁడే యనియూహింపవలయుననియు సుబ్బరావుగారొకచోట వ్రాసిరి. రంగమండపములో ద్వారమున కెడమవైపున నొకచిన్న శిలావిగ్రహ మున్నది. పూజారి నడుగఁగా నది పోతరాజు విగ్రహ మని కొందఱందురు గాని వేదాంతదేశికుల విగ్రహ మని తన యభిప్రాయ మని యాతఁడు చెప్పెను. ఆవిగ్రహము పోతరాజు దనుట కాధారము లేవియుఁ గనఁబడవు. విగ్రహము, పద్మాసనస్థుఁడై ధ్యానించుచున్న పురుషుని రూపముగ నున్నది. పాదముల యందుఁ బద్మరేఖలును, గాళ్ళకు ముంజేతులకును గొలుసులు నున్నవి. భుజకీర్తులును మెడలో హారమును గలవు. వడగలవైష్ణవులు ధరించునట్టి నిలువుబొట్టు నుదుట నున్నది. పోతరాజు రామభక్తుఁడైనను శివపూజాతత్పరుఁడు. వైష్ణవచిహ్నమైన నిలువు బొట్టు పెట్టుకొనియె ననుటకు వీలులేదు. గొలుసులు, హారము, తులసిపూసలపేరు లనుకొన్నచో శివపూజసేయుచుఁ బోతరాజు తులసిపేరులు ధరించె ననుటయు సమంజసము కాదు. సువర్ణాభరణము లని యూహింపవలసిన యెడల నవియుఁ బోతరాజున కనుచితములే కావున నావిగ్రహము పోతరాజుది కా దనియే చెప్పవలసి యున్నది.

ఈహేతువులంబట్టి యొంటిమిట్టవాద మిప్పటికిని దుర్బలమే యని నాయభిప్రాయము.

జయంతి రామయ్య.



# జ్ఞానప్రసూనాంబికాశతకము.

(శిష్టు సర్వశాస్త్రికవిరచితము.)

---

శా. శ్రీమద్ధామర వేంకటక్షితిపతిక్షేమంకరప్రక్రియో
ద్దామాత్మీయదయారసప్రసరసిద్ధ్యన్మంజుళాపాంగవీ
క్షామందస్మితసుందరాస్యమెలమిన్గన్పట్టఁ బ్రత్యక్షమై
సామంజస్య మెసంగఁ బ్రోవుము ననున్ జ్ఞానప్రసూనాంబికా. 1

శా. శ్రీమాన్యం బగుకాళహస్తినగరీసీమంబున న్సజ్జన
క్షేమప్రక్రియఁ గూర్చుచు న్సకలశక్తిస్తోమము ల్గొల్వఁగా
శైవమాన్యస్థితి నున్ననిన్విడిచి నే నన్యాశ్రయం బొల్ల నన్
సామాన్యంబుగఁ జూడకమ్మ పుడమిన్ జ్ఞానప్రసూనాంబికా. 2

మ. దిగధీశు ల్నినుఁ గొల్చి రక్కసులఁ బ్రోదిందోలి యాత్మప్రధా
నగతిం గాంచి సమస్తభాగ్యముల సన్మానంబులంబొందిరె
న్నఁగ వేమాట లిఁకేల యెంతయును నానావాంఛితార్థాప్తికై
జగతీసంతతి నిన్భజించునుగదా జ్ఞానప్రసూనాంబికా. 3

మ. పరమానందముతోడ నిన్నుమదిలో భావించి సేవించి స
ద్వరముల్గాంచి యగస్త్యముఖ్యులహహా వారాశ్యుపస్పర్శన
స్ఫురణాదిం బ్రథఁ జెంది రీవు గరుణంజూడంగ దుస్సాధదు
స్తరదుష్ప్రాపము లేలగల్గు జగతిన్ జ్ఞానప్రసూనాంబికా. 4

మ. ధరణింగల్గిన గొప్పగొప్పపదము ల్తత్తద్విశేషంబు లుం
బరికింప న్మదిఁ దోఁచె నేఁటికి నినున్భావించి సేవింప నే
పురుషార్థంబును గల్గునంచుమనస్స్ఫూర్తి న్వచింతు న్సదా
సరమార్థాయకసత్కటాక్షకలికా జ్ఞానప్రసూనాంబికా. 5

మ. తరమే నీమహిమంబు లెన్నఁగ నసద్భావంబు లేకుండ న
ప్పరమామ్నాయము లాఋనుం గని తలంప న్దుస్తరప్రక్రియన్
దిరమై మించుపథంబునం దగు నశీతిన్యాసము ల్సేయు భా
స్వరమంత్రజ్ఞులఁ బ్రోచితీవకద వే జ్ఞానప్రసూనాంబికా. 6

మ. కలుము ల్నిత్యము లంచునమ్మి మదిలోఁగ్రారించియిద్ధారణిం
గలమూఢాత్ములు నిన్ను గొందఱు గనంగారాక నీసేవలం
దొలఁగింపం దలపోసి దుర్గతులపొందుం జెందువారేకదా
జలజాతప్రతిమానమాననకళా జ్ఞానప్రసూనాంబికా. 7

మ. అకలంకం బగునీదుసేవకయి మాన్యానూనమాణిక్యము
క్తికపంకేరుహరాగవిద్రుమముఖాగ్రీయోజ్జ్వలద్రత్నయు
క్తకరాంభోరుహపాత్రికాకలన నిత్యంబు న్నినుం గొల్వరా
సకలామర్త్యసతీతతిం దనుపవే జ్ఞానప్రసూనాంబికా. 8

మ. చెలువ ల్నిన్నొకసారి చేరియెలమి న్సేవింప సౌభాగ్యముం
దెలివి న్సంతతి నిత్యసంపదయుఁ బాతివ్రత్యముం గల్గఁజే
సి లసద్దివ్యదయాకటాక్షముల వాసింగూర్తు వంతంతకున్
జలజాతాసనముఖ్యదైవతనుతా ! జ్ఞానప్రసూనాంబికా. 9

శా. ధైర్యశ్రీ మది నూలుకొల్పి సతతోద్యద్భక్తియుక్తి న్దనా
శ్చర్యప్రక్రమ మొప్ప మెప్పుగను బూజాప్రక్రియం గాంచి యై
శ్వర్యప్రాప్తిమదంబుఁ జెందక సదాసక్తి న్సముద్యత్తప
శ్చర్యంబూనినవాని బ్రోతువుగదా జ్ఞానప్రసూనాంబికా. 10

మ. లలితంబై తగునీమహామహిమ వాలాయంబు వర్ణింపఁగాఁ
గలనా నేననియూరకుండ కిపుడీకావ్యంబునేయంగ ని
మ్ముల నేనెంచితి నీభరం బడరు పెంపుం జెంది యిందీవర
స్థలనాపాదనలోచనద్వయకళా జ్ఞానప్రసూనాంబికా. 11

మ. చకితార్తీయజనాంతరంగభయసంసర్గాపనోదక్రియా
ధికమంద స్మితసుందరాస్యహిమరుగ్దీప్తిప్రసారాంచిత
ప్రకటానర్గళసుప్రభావవిలసద్భవ్యాకృతిశ్రీయుతా
సకలామర్త్యజయావనక్రమహితా జ్ఞానప్రసూనాంబికా. 12

మ. జయలక్ష్మీకర మైననీమహిమచే సంప్రాప్యముల్సంపదల్
భయముల్దూరము లౌనటంచు మదిలో భావించినీసద్దయా
శ్రయముంగాంచి ప్రియార్థముల్గను టవశ్యం బేరికిం జూడ భా
ఛయనిర్ధూత నభోంబుభృత్పటలికా జ్ఞానప్రసూనాంబికా. 13

శా. అత్యాలస్యముఁ జెంది నీభజనమం దాసక్తియింతైన స
ద్వృత్త్యానందము గల్గఁజెందకెపుడు న్సత్సంగతిం గాంచకే
నిత్యంబంచును సంసృతిం దలఁచి మానిత్వంబుతో నుంటి నా
సత్యాదిత్యనుతా దయన్గనుపుమో జ్ఞానప్రసూనాంబికా. 14

మ. కలరా నీసరివేల్పు లీజగతిలోఁ గల్యాణకల్యాత్మతన్
వెలయింపం దగువారటంచు సరిగా విజ్ఞానముం జెంది నే
వలనొప్ప న్భవదీయపాదయుగళీవర్తి ష్ణుధీవృత్తినై
చలనం బందకయుంటిఁ బ్రోవఁగదవే జ్ఞానప్రసూనాంబికా. 15

శా. మార్గంబు ల్పదివేలు లోకమున సన్మాన్యస్థితిం జెందఁ ద
ద్దుర్గాధ్వప్రతిపత్తిమాని విగళద్దోషాళినై మించి స
ద్వర్గస్తుత్యతఁ గన్న నీభజన సల్పంబూనితి న్నిత్యమున్
స్వర్గాధ్యక్షనుతాంఘ్రిప్రోవఁగదవే జ్ఞానప్రసూనాంబికా. 16

మ. స్థిరకీర్తిన్వెలయింగఁ జేయు నియతశ్రేయోనివాసిత్వముం
బరఁగం జేయుసువర్ణరత్నముఖసంపల్లీలలం గూర్చుదు
స్తరదుఃఖంబులఁ బాఱఁదోలిమఱి సంతానాది సౌఖ్యంబులున్
సరవి న్నించుచుమించు నీ భజనమో జ్ఞానప్రసూనాంబికా. 17

శా. చిత్తాయత్తము లైనకోరుకులవాసింగూర్చి భక్తాళికిం
దత్తాదృగ్విభవంబుఁ జేర్చి రిపుల న్దండింపఁగా నేర్చి దు
ర్వృత్తంబు ల్దొలఁగింపఁ బేర్చి ఘనసంవిన్మార్గము న్దాల్చి నీ
సత్తం దెల్లముసేసి ప్రోవఁగదవే జ్ఞానప్రసూనాంబికా. 18

శా. జంబాలంబును బోనిపాపముల నోజం దాఁకకుండంగ దూ
రంబై పోవఁగఁ జేయ మెట్టునెడఁ దీర్ఘంబై తగం జేయ శా
పంబున్స్వఃస్త్రీయుఁ దత్క్షణంబుననె చూప న్నీదుశ్రీచక్రరా
జంబర్చించుమహాత్ముఁ డోపునుగదా జ్ఞానప్రసూనాంబికా. 19

మ. ననవిల్తుం గనుమంటలో మిడుతకూనంబోలె మండింపఁజూ
చిన జేజేగమి గచ్చువిచ్చయి కడ ల్సేరంగఁ జెంతన్వసిం
చిన నీవంతనవంతలోఁ గొనక వాసిం బూచిరామేన ని
చ్చనఱి న్హ్మాత్రితి నిన్నుతింపఁదరమే జ్ఞానప్రసూనాంబికా. 20

మ. అలకాళంపట్టనసీమలో బహుళసాలాంతస్థలోద్యానపం
క్తులలో మందమరుత్కిశోరకసముద్ధూతాగ్రకాదంబవా
టిలలిం గేళిక నల్పునిన్ను గనిపాటింపంగ రాలేమి ని
చ్చలు నిందెల్లరుఁ గొల్వవచ్చిరిగదా! జ్ఞానప్రసూనాంబికా. 21

శా. చింతారత్నగృహాంతరాళమున వాసి న్బ్రహ్మవిష్ణ్వాదిమం
చాంతస్థాయినివై జగంబుల సముద్యల్లీల రక్షింప న
ట్లంతం బొందఁగఁ జేయ నీవొకతెవే యాధారశక్త్యాత్మతన్
సాంతత్యంబున నున్నదానవుగదా జ్ఞానప్రసూనాంబికా. 22

మ. మనసా చంచల మింద్రియప్రతతి దుర్మార్గప్రవృత్తంబు ని
త్యనిరాబాధతమించు నీపదసపర్యం జేయుపర్యాయ మె
ట్లునయంబంది గ్రహించువాఁడ నమరాలోకాభినంద్యప్రభాం
చనవకాంచనరత్నభూషణయుతా జ్ఞానప్రసూనాంబికా. 23

మ. చలువల్నల్లడఁ జిల్కుగట్టునకు నెంచంగూఁతురై మించునీ
వెలమి న్భక్తుల యుత్తలంబులను మాయింప న్సమస్తావనీ
తలవంద్యోజ్జ్వలభోగభాగ్యముల నందంజేయు మేల్ చూపులం
జలువ ల్గల్గఁగఁజేయు టబ్బురమొకో జ్ఞానప్రసూనాంబికా. 24

శా. కైలాసాచలసీమసంగతలసత్కల్పద్రుమాకల్పనీ
పాళీపాళివిహారకృన్మధుకరీవ్యాహారవీణాకళా
లోలీభూతవితంద్రమంద్రరవవల్లోలంబకేళీవనీ
జాలాక్రీడితకౌతుకాంచితమతీ జ్ఞానప్రసూనాంబికా. 25

మ. సరళంబైనమతంబుఁ జెంది నియమాసక్తాత్ములై సంతతాం
తరపూజాపరమాదరంబుఁగని యుద్యద్భావుకజ్ఞానులై
స్థిరయోగంబున నిన్నుఁగొల్చుసుజనుల్ శ్రేయోవిశేషాప్తి హె
చ్చ రమావాప్తనివాసులై వెలయరే జ్ఞానప్రసూనాంబికా. 26

శా. నీవేసిద్ధివి నీవెబుద్ధివనుచు న్నిర్వ్యాజభక్తిక్రియా
ప్రావీణ్యంబున సంతతంబు నినుసంప్రార్థించు ధీరు ల్సమ
స్తావన్యుత్తమసిద్ధిబుద్ధికలనావాప్తి న్సమావశ్యమో
హావశ్యాదిక లీలల న్వెలయరే జ్ఞానప్రసూనాంబికా. 27

మ. నిను జిత్తంబున సంస్మరించుచు నరణ్యానీసరణ్యాంతరం
బున నైనం జనువేళ వ్యాఘ్రచయముం బోత్రివ్రజంబుం దర
క్షునికాయంబును సింహసంతతియు బ్రముచ్చుల్బోవఁగాఁ జేసి దా
సనితాంతోన్నతిఁ జేయుదీవకదవే జ్ఞానప్రసూనాంబికా. 28

శా. పారావారము నీఁదశక్యమని చెప్పన్వచ్చు ధాత్రీధరో
ద్ధారం బౌనని యెంచవచ్చు నటులం ధాత్రీస్థలీరేణువుల్
తారావారము లెక్కపెట్టఁదగు లోఁదర్కింప నీసత్కళా
స్ఫారశ్రీగరిమల్ గణింపఁ దరమా జ్ఞానప్రసూనాంబికా. 29

మ. భవదీయాంఘ్రిసరోరుహద్వయమునం బ్రవ్యక్తభంగి న్విహా
రవిలాసస్థితినుండి యెల్లెడల సర్వప్రక్రియ ల్మానియే
కవళం బయ్యె మదీయమత్యళిని నింకం బ్రోవుమమ్మా జన
స్తవనీయోన్నతిగల్గఁజేసి యెపుడున్ జ్ఞానప్రసూనాంబికా. 30

శా. నీవే దిక్కని నీదుసన్నిధిని నే నిత్యంబు సేవార్థినై
భావం బన్యగతంబొనర్పక వసింపం బెంపు దీపింప సం
భావింపందగునమ్మ భవ్యమతి సంపత్త్యాదులన్నించి వాం
ఛావిశ్రాంతి నొనర్ప నెవ్వరిఁక శ్రీజ్ఞానప్రసూనాంబికా. 31

మ. నయమార్గంబున భూప్రజం దనుపఁగా న్యాయక్రియా సంగతిం
బ్రియసామంత మహాప్రధాన హృదయప్రేమాతిరేకంబు నే
య యశోలక్ష్మి దనర్పఁ జేయఁదగు నీయర్చల్ ప్రభుశ్రేణికు
చ్ఛ్రయసంధానసమేధమానకరుణా జ్ఞానప్రసూనాంబికా. 32

మ. వెనకయ్య న్వలచేత డాపలికయి న్వెనఁకయ్య వెనఁకయ్య లా
లనలం బుజ్జవమొప్ప నివ్రుచు మదాలస్యంబున న్నిల్చు నీ
వెనుకై యామరసుందరు ల్నిలిచి రివింగన్గొనంగంటి ని
చ్చనుం దాదృశరీతిఁ బ్రోవఁగదవే జ్ఞానప్రసూనాంబికా. 33

శా. నీనామం బొకసారి నెమ్మనమున న్నెక్కొల్పిన న్రాజన
న్మానంబు న్నిగమాగమోక్తిపదవీనానార్థనిశ్చాయక
త్వానూనప్రతిభావిశేషమును నిత్యంబే కదా భక్తదుర్
జ్ఞానోచ్చాటనపాటవస్ఫుటకథా జ్ఞానప్రసూనాంబికా. 34

శా. సారంబై న భవద్దయారసమున న్స్వాదింపఁగా వచ్చు దు
ర్వారారాతినికాయము న్సకలసంపల్లీలలు న్మున్నుగాఁ
జేరన్ హెచ్చఁగవచ్చునేరికయినన్ శ్రీకాళహస్తీశయో
షారత్నంబ మదంబ శాంబరినుతా జ్ఞానప్రసూనాంబికా. 35

మ ప్రసరచ్ఛీతలతావిశేషముల సంపాదించు మిన్నేఱు రా
త్రిసతీశాంశము నొదల న్నిలిపియుం దెంపేదుతాపంబునన్
విసపున్మ్రింతరి నీదుమోపిరసము న్వేమాఱుఁ గ్రోలంగఁదా
నసిగా నిల్చెను సర్వలోకవినుతా జ్ఞానప్రసూనాంబికా. 36

శా. లీనప్రజ్ఞులకుం బ్రకృష్టధిషణాలీలావిశేషాప్తియ
న్యూనోక్తిప్రథమానశాస్త్రపదవీప్రోజ్జృంభమాణప్రధా
ధీనశ్లాఘ్యవదావదత్వమునుసంధిల్లుంగదా తావకా
ర్చానిష్ఠాగరిమంబు గల్గుకతనన్ జ్ఞానప్రసూనాంబికా. 37

మ. నిరతి న్నీపదపద్మపూజనవిధానిష్ణాతుఁడై సంతతం
బరసాన్యామరసేవనాదరములో నల్పంబుగానైనఁ జొ
న్పరహింజూడక యేకభక్తి నిను లోనన్నిల్పువాఁడీచరా
చరసంపూర్ణజగత్త్రితి న్నిగులు నోజ్ఞానప్రసూనాంబికా 38

శా. పంచాస్త్రుండు త్వదీయసన్నిధిని నీభర్తం బ్రయత్నంబుతోఁ
బంచాస్త్రిం బెదరింపఁబోయి త్రుటిలో భస్మంబుదానయ్యె న
న్నుంచే యింతలుపుట్టెనంచు దయఁ దద్యోగంబునం గన్గొనం
జంచద్దర్పకకోటినించితివవున్ జ్ఞానప్రసూనాంబికా. 39

శా. పారావారసుతాది లేఖసుదతీపారంపరీగీతికా
పారానందపురంధ్రివర్గనియతప్రాంచద్వివాహాంగణో
దారామోదయుతాత్మబాంధవసతీతత్యాశ్రితస్వాంతిక
స్ఫారాచారకృతిప్రమోదభరితా జ్ఞానప్రసూనాంబికా. 40

శా ఆసా మిక్కిలి గల్గి యున్నది మహాహంకారమా మెండు వి
శ్వాసంబెందును లేదు పూర్ణము నృశంసత్వంబు సత్యార్థవి
న్యాసంబన్నదివాసె నిట్టిజడుని న్నక్ బ్రోవఁగాఁ ద్వత్కృపా
శ్వాసంబొక్కటి దక్క వేఱుగలదే జ్ఞానప్రసూనాంబికా. 41

శా. విశ్వాతీతపరాక్రమక్రమసమావిర్భూతనిత్యప్రభా
నైశ్వర్యాహమికావిశృంఖలవిహారాత్యంతభీతద్యుష
ద్విశ్వాన్యేతరభండఖండనదిశావిశ్రాంతజన్యప్రథా
శశ్వద్విశ్రుతశక్తి వీవకదవే జ్ఞానప్రసూనాంబికా. 42

మ. ఫలమొక్కింతయు నీనివేల్పుల భజింపన్ దానసేవా నటం
చెలమి న్నిన్నె సమగ్రభక్తిపథసాహిత్యంబుతోఁగొల్వ ని
చ్చలు నన్నుంగనకున్న నెవ్వరిఁక శశ్వల్లీలఁబోషింప ని
శ్చలకారుణ్యకటాక్షవైభవయుతా జ్ఞానప్రసూనాంబికా. 43

శా. శోణాంభోరుహజైత్రపాదయుగళీశోభాకృదుద్యన్మణి
శ్రేణీహంసకమంజుగుంజితసమాకృష్టావదాతచ్ఛద
క్వాణాకర్ణనమోదమానహృదయాగచ్ఛద్ద్యుపతికిన్నర
స్త్రైణాలోకనహృద్యమందరగతీ జ్ఞానప్రసూనాంబికా 44

మ నునుమైచాయలు దాసనంపునన చెన్నుంబూని మిన్నందఁ గ్రొ
న్ననయమ్ముంగొని తుంటవింట నెలమిన్నంటొప్పఁగాఁజేసియిం
పున ముల్లోకము గెల్చువశ్యముఖవై పొల్పొందుదీన్ గొల్చెదన్
జననీ సర్వజగత్ప్రమోదజననీ జ్ఞానప్రసూనాంబికా. 45

మ. కపురంపున్విడె మానసంబున సమగ్రస్థూలముక్తాసరా
నుపమాలంకృతి చన్గవం గటితటి న్మొంబట్టుఁబుట్టంబు స
న్నపునైపూఁత భుజంబులన్వెలయ నున్న న్నిన్నుఁగన్గొన్న న
చ్చపుఁబ్రేమం గిరిశుండు వీడఁడహహా జ్ఞానప్రసూనాంబికా. 46

శా. జేజేరాయనిరాలచెల్వమున మైచెల్వొంద బల్వేలుపుల్
రాజాస్యల్నలువంకలం గొలువులోనంగొల్వ బృందారకో
ర్వీజోద్భూతపరిస్ఫురత్తాలసగతి నీవీణాకలన్మించి వా
చాజాలాతిగవై ఖరి న్మెఱసితౌ జ్ఞానప్రసూనాంబికా. 47

మ. ఘనవృష్టి న్భువి సస్యజాతము సమగ్రప్రక్రియ న్మొల్కలె
త్తి నవోదగ్రఫలంబొసంగుగతిఁ దద్దివ్యానుకంపాకటా
క్షనికాయంబున సర్వసంపద యుదరప్రాప్తిఁగల్గించుదు
ర్జనదారాత్త్యనిరాసకారిమహిమా జ్ఞానప్రసూనాంబికా. 48

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత గ్రంథములు.

(1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నమనుమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది వైజయంతీవిలాసముకంటె మిన్న. ౪ ఆశ్వాసములు. ౭౮ పుటలు సవిమర్శమైన ౧౮ పుటలపీఠిక. వెల రు. ౦-౮-౦.

(2) జైమినిభారతము (ఆంధ్రవచనము.)

రెండువందల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁనిచే రచింపఁబడినది. భాష సలక్షణము శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు. ౦-౧౨-౦.

1917-18 సం॥ ఇంటరుమీడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము

(3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవివిరచిత మగుచుందశాస్త్రము ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేకలిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రచ్ఛందస్సుల భేదాభేదములు, లచ్చటచ్చటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగువిషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు వర్ణక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల రు. ౦-౧౦-౦.

(4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి.ఏ., బి.ఎల్. గారిచేరచింపఁబడిన సవిమర్శపీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది ఈశాసన మాంధ్రపద్యాత్మకము నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి.ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల రు. ౦-౮-౦.

(5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలయ్య విరచితము, శ్రీ వేంకటేశ్వరుల కంకితము. వెల రు. ౧-౨-౧

(6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము శ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులు బి.ఏ. ఎల్.టీ. గారిచే రచింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల రు. ౦-౮-౦

(7) **A Defence of Literary Telugu, by J Ramayya Pantulu Guru. 0-8-0.**

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, 12, అరుణాచల నాయఁక వీధి, చింతాద్రిపేట, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

---

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 12 అరుణాచల నాయఁకవీథి, చింతాద్రిపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రచురింపఁబడియెను.

చందా సం॥ కు రు. ౩—౦—౦.    విడిసంచిక రు. ౦—౮—౦

సంపుటము ౬. | పింగళనామసంవత్సరము. మార్గశిర పుష్యమాఘ ఫాల్గునములు | సంచిక. 9-10-11-12



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

ప్రతిమాసమునఁ గడపటివారములోఁ బ్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక.

మేమిదివఱకుపయోగించుచున్న కాగితములవంటి కాగితములు ఇం-
పెమ్పుటను, హెచ్చినను దొరకనివి. పింగళ సం॥ పరిషత్పత్రిక ౧–౪ సంచి-
ముగింపవలసివచ్చినది పాఠకులు మన్నింపవలయును కాళయుక్తి సం॥ నుండి, ఇం-
వేఱొకరీతి సాధారణమైన కాగితము నుపయోగించుచున్నాము

స. ఙా.

మ. జయశబ్దంబొనరించుచు న్దివిజులోజస్సుంగలన్నిల్వ ది
వ్యయమివ్రాతము సామగీతు లనయంబు న్వీనులన్నింపహ్రా
ద్దయశ్రీఁగన్నులనంకురిప సురలన్ దైన్యంబువోఁద్రోసి ని
శ్చయసౌభాగ్యమునింతు వీవకదవే జ్ఞానప్రసూనాంబికా. 49

మ. పలుమాఱున్నిను భక్తియుక్తిభజియింపంగోరి వేళాప్తినీ
కొలువుంగూటముఁజేరి తావకదృగంకూరత్కృపాపూరసం
కలితోదారతరార్థకావ్యరచనాకల్యాత్ము లౌవారిలోఁ
జలనం బేద ననున్ఘటింపఁగదవే జ్ఞానప్రసూనాంబికా. 50

మ. ముదమొప్పన్మది నిన్నుఁజేర్చిభయసమ్మోదంబు లొక్కుమ్మడిం
బొదలం దావకపాదుకార్చనకథాపూతాత్ములై నిత్యని
ర్మదవృత్తిన్భజియించువారు చెలువారంగాంతు రిష్టార్థముల్
చదువు ల్పెక్కులు చిక్కనేమిఫలమా జ్ఞానప్రసూనాంబికా 51

మ. సతతంబు న్దురితావహంబయిన సంసారంబునం బుత్రమి
త్రతరుణ్యాదివిచారయోగమున నైరంతర్యదుఃఖక్రియా
యుతుఁడై చేడ్పడుకన్న నిన్నుమదిలో నొందించినందింపఁగా
జతనంబైనను జాలునంచుఁదలఁతున్ జ్ఞానప్రసూనాంబికా. 52

మ. క్రతువుల్నూఱొనరించి యింద్రుఁడయి స్వారాజ్యంబు పాలించిసం
భృతమందారతరుప్రసూనశుభికాభిష్టుత్యకోటీరకో
టితచే మించిసుధర్మనున్నతఁడు బల్మివిం ద్వదీయాద్భుత
క్రతుశీలుంబురుడింపలేఁడుగదవే జ్ఞానప్రసూనాంబికా. 53

మ. కమలాభారతు లిర్వురు న్సురటులం గైఁ బూనవేల్పుంగొమల్
క్రమమొప్పంగొలువంది కట్టిగుటఁ జొక్కంబైనగీతప్రసం
గము సల్పం గొలువున్న నిన్నుఁగని శక్రాదుల్భజింతుర్సదా
కమలారాతికళాభియాతివదనా జ్ఞానప్రసూనాంబికా. 54

మ. చదలొక్కుమ్మడిక్రమ్మింగఁగా మనమునం జర్చించుచున్నించు దు
ర్మద నక్తంచరయోధవీరవృతనగ్రానారదుం డాట పా
టదలిర్పం గనుఁగొంగదైత్యహతిగాటంబైన తేజంబునం
గదనప్రక్రియ మింతు రెవ్వగహహా జ్ఞానప్రసూనాంబికా. 55

మ. వికలంబై చకితాక్షమై యసురరాడ్వీరాళిప్రాసాసిశ
క్తికఠారాదిక సాధనవ్రజము భీతిన్బాఱఁగావైచి నే
రక నీచేరువవచ్చినామనుచు దూరంబందఁగాఁ దోలి తౌ
సకలామర్త్యనికాయగేయచరితా జ్ఞానప్రసూనాంబికా. 56

శా. హాళిన్నీకు సభక్తికంబుగను సాష్టాంగంబు లర్పించియా
శాళీవిశ్రుతతావకీనచరితాక్రాంతశ్రుతిన్మించి య
న్యాలాపంబులమానితావకసమాఖ్యాపారముం జేయుచో
జాలం బేటికి నన్నుఁ బ్రోచుటకునై జ్ఞానప్రసూనాంబికా. 57

శా. నింద ల్సేయుదు రెందఱోధరణిలో నీరోధదోషోక్తి నా
నందం బందుదు రెందఱో సుగుణసంతానంబు లెక్కించి యీ
చందంబు ల్మదిఁ జేర్పు నీదయ మదాసక్తి న్విజృంభింపఁ ద్వ
చ్ఛందం బెట్టిదొ తెల్పవమ్మ వడిగా జ్ఞానప్రసూనాంబికా. 58

శా. ధీరశ్రేణికి మెచ్చునేయుకవితాస్థేమంబు నేమంబుతో
రారాజద్గుణరాజిరాజసభల న్రంజిల్ల వాగ్వైదుషీ
పారావారులు నీకటాక్షమహిమావాప్తిం గదాధారణిన్
స్ఫారఖ్యాతి వహింతు రెంతయును శ్రీజ్ఞానప్రసూనాంబికా. 59

మ. జగతి న్నెమ్మది నెన్న మానుషము దుష్ప్రాపంబు పై నందులో
న గణింపందగునాల్గువర్ణములలోనంబుట్టు టబ్రంబు పెం
పగుబ్రాహ్మణ్యము దానిలో నచట పర్యాయంబునన్ జ్ఞానయో
గగురుత్వంబు భవత్కటాక్షమున నౌ జ్ఞానప్రసూనాంబికా 60

మ. సమదానేకమతంగజావళియు నాజానేయవారంబు ను
త్తమరధ్యాళి రథంబులు న్సమరవిద్యాపాండితీమండితా
సమయోధావళి రత్నకాంచనసమంచత్పుత్రదారాదియో
గము నీపూజ లభించు నోజ నిజ మోజ్ఞానప్రసూనాంబికా. 61

మ. భరమా నీకు మదర్థసంఘటనశుంభద్భావసంభూతస
త్కరుణాపూరతరంగసంగసతతోదంచత్కటాక్షాంచల
స్ఫురణాపాదన మేల జాల మిఁక హెచ్చుంబల్కులేలా భవ
త్స్మరణం గల్గనిదేమిగల్గుభువిలో జ్ఞానప్రసూనాంబికా. 62

మ. తెలియ న్రాదిల నీమహామహిమ బుద్ధింజూడ బ్రహ్మాదిది
వ్యులకైన న్నిజమంచు నాగమపదవ్యక్తు ల్వచింపంగ వీ
నులలో సోఁకియుఁ గొంతవర్ణనము నేనుం జేయు దంచుం దదా
కలనాయత్తుఁడనైతి నీభరమె సూ జ్ఞానప్రసూనాంబికా. 63

మ. సమయంబిద్ది యటంచు నేనెఱిఁగి నీసాన్నిధ్యముం జెందినే
మముతో సేవయొనర్పఁజాలఁ గవితామార్గంబునం బ్రౌఢిమం
గ్రమమొప్పంగనినాఁడఁ గాను జడుఁ డింకన్వీఁడటంచు న్ననున్
సమతం గన్గొని వేగప్రోవఁగదవే జ్ఞానప్రసూనాంబికా. 64

మ. నలుమోముల్గలవేల్పుఁగన్నదొర యెన్న న్నీకుఁదోఁబుట్టు క
ల్వలరాతున్కతలంగలాఁడొడయఁ డేలంజాలు నీవిజ్జగ
మ్ములనానిమ్ముల నిన్నుఁగొల్వఁ దలఁపుంబూనందగు న్లోక ము
త్కలికామాత్ర నుతింతు నన్నుఁ గనవే జ్ఞానప్రసూనాంబికా. 65

శా. పొంగట్టున్విలుదాల్పుమేన నఱయై పొల్పొందు నిన్జూచియా
బంగార్పట్టపువేల్పురాణి యిటులై పల్వన్నె నవ్వెన్నుహా
త్తంగానంగదె యంచు ముచ్చట నెడందం జెంద మేల్గీవి సా
గంగా జాణతనంబు నూనితిగదా జ్ఞానప్రసూనాంబికా. 66

మ. వెలయు న్నీకరుణావిశేషము సదావిఖ్యాతమై భక్తకో
టులయందంచుఁ దలంచి యెందుఁబొరపాటు న్లేక నిన్వ్యాజసే
యలలిం జాలను నీవెప్రోవఁదగ వౌనగ్రస్ఫురద్దాడిమీ
కళికాగుచ్ఛసదృక్షుకాంతికలితా జ్ఞానప్రసూనాంబికా. 67

శా. ఈవే లోకములన్సృజింప నెలమి న్మాచ్చింప డిందింప ని
త్యావిఖ్యాతమహాప్రభావయుతవై యాత్మేశుని న్సౌఖ్యలీ
లావిష్టాత్ముని జేయుదంచు నిగమవ్యక్తోక్తి నేవింటి న
న్గావంజాలవొకో నమన్మునివరా జ్ఞానప్రసూనాంబికా. 68

శా. బంధూకప్రతిమాళికస్థల కనద్బాల్లీకరేఖా జగ
ద్బంధూడుప్రభుకర్ణపూరయుగళీభాస్వచ్ఛ్రుతీ సత్కృపా
బంధూరస్థితి నన్నుఁజూచుచుఁ గళాపాండిత్యముం బాణిక
ర్కంధూరీతిగ నేపఱింపఁ గదవే జ్ఞానప్రసూనాంబికా. 69

మ. తెవి వొక్కింతయు లేనివాఁడని ననుం దీలై చెడంజేయ కు
జ్జ్వలమైనట్టిభవత్కటాక్ష మిఁక నాపైఁ బర్వ సర్వంసహా
వలయస్థాఖిలసత్కవీంద్రతతిలో వర్ధిష్ణునిం జేయు ము
త్కలికావత్కమలానుతాకృతియుతా జ్ఞానప్రసూనాంబికా. 70

మ. చరణార్చాపరభక్తరక్షణపరాసక్తిన్నినుంగొల్వఁగా
నరుదా సంపద లబ్రమా ముదము లత్యాశ్చరమా పుత్రపౌ
త్రరమావత్త్వము చిత్రమా పరజనారబ్ధాంతరాయప్రతీ
కరణం బంబుజగర్భసన్నుతపదా జ్ఞానప్రసూనాంబికా. 71

మ. ధరణి న్నిశ్చలమైననీకరుణ నిర్దంభోదితంబైన య
ప్పరమాహ్లాదవినోది గాంచునియతప్రఖ్యాతి నీతిక్రమ
స్థిరతం బ్రాజ్యసమస్తసంపదలవృద్ధిం బుద్ధియోగోల్లస
త్సరసానంద్యకవిత్వసంపదయు శ్రీజ్ఞానప్రసూనాంబికా. 72

శా. శ్రీచక్రార్చనసేయుచు న్సతతనిస్సీమస్థిరత్వోదయ
ప్రాచుర్యప్రథమానభక్తినియతప్రజ్ఞావిశేషం బటుల్
వాచామాధురి నీకు నామపరనవ్యాకోచకావ్యక్రియా
సాచివ్యంబును గాంచు మందుఁడయినన్ జ్ఞానప్రసూనాంబికా. 73

మ. కలికాలంబిది దీనియందొకఁ డనేకప్రక్రియాయుక్తిని
శ్చలభక్తి న్నినుఁగొల్వ లేఁడు జనుఁ డాశాయోగమా మెండు త్రో
వలనేకంబులు విఘ్నయోగములకుం బాటిల్లు నీభక్తిలోఁ
గలుగంజేయఁగ నీవదిక్కు గదవే జ్ఞానప్రసూనాంబికా. 74

మ. అలసత్వం బధికంబు గ్రంధములు పర్యాయంబునం జూడఁగాఁ
గలనా లెక్కకురాని వెట్లయినఁ జిక్కంజేసి చూడంగ నం
దలితాత్పర్యము దుర్లభంబనుచుఁ గానం జాలకున్నాఁడఁ ద్వ
త్కలితానుగ్రహ మొక్కఁడుండఁ గొఱఁతా జ్ఞానప్రసూనాంబికా. 75

మ. పగలు న్రేయిఁ ద్వదీయసత్కరుణకై భావించి సేవించెదం
దగ నిన్నిట్లిది చూచి వీఁడు మదనుధ్యానైకతాత్పర్యని
ష్ఠగలాఁడంచు మదిం దలంచి కరుణాసాంతత్యసంబంధస
జ్జగతిం బ్రోవఁగ రావిదేమి యకటా జ్ఞానప్రసూనాంబికా. 76

మ. కలి నంతంతకు ధర్మకర్మపథసంస్కారంబు మాసె న్మహా
బలవంతంబయి కానిపించె నహహా మాన్యావమానక్రియా
కలనల్ నీకరుణాకటాక్షమున నిక్కాలంబు దోలందగుం
జలనంబింతయుఁ జెందకుండ జననీ జ్ఞానప్రసూనాంబికా. 77

మ. ప్రియము ల్వల్కిన నప్రియంబులని సంప్రీతి న్వగ న్జెందకే
మయినం జూచుచు నీయనుగ్రహముగా నాంతర్యమం దెంచుచున్
భయ మొక్కింతయు లేక నిన్ను మదిలో భావింపఁగా బుద్ధిని
శ్చయ మి మ్మొమ్మజననీ హితార్థజననీ జ్ఞానప్రసూనాంబికా. 78

మ సరసాలాపవిలాసహాసరచనాచాతుర్యసుస్థైర్యభా
స్వరది                    సంగదివ్యాంగనా
పరిపాటీగణనావినోదవిలసద్భవ్యాదరోద్యత్సిశ్రితా
చరణాంభోజనతామరవ్రజహితా జ్ఞానప్రసూనాంబికా. 79

మ. స్ఫుటతారానికరస్ఫురచ్ఛుచిమణీ శోభాంకహారావళీ
ఘటితోత్తుంగకుచద్వయోపరిలసత్కంజాతరాగారుణో
ద్భటకూర్పాసవిభాసమానకురువిందశ్రేణికాప్రోల్లస
త్కటకాలంకృతపాదపద్మయుగళీ జ్ఞానప్రసూనాంబికా. 80

మ. అగరాజాత్మజ తావకీనకరుణాయత్తంబు ముల్లోకమెం
చఁగ నీదైనమహావిభూతివశమే సర్వామరశ్రేణి కై
న గణింపన్ భవదీయసద్విభవ మీనా కెట్లు వర్ణింప నౌ
జగతీనిర్భరగర్భగోళకలితా జ్ఞానప్రసూనాంబికా. 81

శా. జల్పాకామరకామినీకృతకథాసారస్యలీలాకళా
నల్పోదంచితమందహాసలలితస్వాస్యావలోకాహిపా
కల్పాత్తేష్టసహాసికాఘటనకృత్కాదంబవాటీకన
త్కల్పోద్యానవిహారకేళిరసికా జ్ఞానప్రసూనాంబికా. 82

శా. సర్పాధీశ్వరతల్పసోదరి జగజ్జాలాభినంద్యోక్తిమ
ద్దర్పత్యాదినుతాత్మచాతురి త్రిలోకీసుప్రసిద్ధాంగనా
దర్పాపాకరణాత్మసౌందరి నినున్ ధ్యానింతు నేనెప్పుడుం
గర్పూరాగురుకుంకుమాంకితకుచా జ్ఞానప్రసూనాంబికా. 83

శా. భద్రాపాదనముఖ్యమై తనరునీభక్తి న్సమస్తార్థసం
పద్రాజిప్రద మంచు నెంచి జగతీపాలుర్ దదాయత్తులై
సద్రూఢిన్ భజియింతు రేనటులు గాంచంజాల సేవాస్థితిం
గద్రూజాతకలాపకంజనయనా జ్ఞానప్రసూనాంబికా. 84

మ. విడువన్నీపదసన్నతిక్రమగతి న్వేదార్థసూక్తిస్థితిం
గడవ న్లోకమునన్వదాన్యతతి నెకాలంబు నేమైననుం
దడవ న్సత్యముగాఁగఁ బల్కెదఁ బ్రశస్తం బైననీసత్కృపం
గడువంత ల్దొలఁగింపవమ్మ జననీ జ్ఞానప్రసూనాంబికా. 85

శా. చింతారత్ననివాసవాసరసికా శ్రీపుర్యుదారాసికా
శాంతాత్మాంతరసీమసాధువసతీ శ్యామాభిరామద్యుతీ
సంతాపాపహృతిప్రవీణచరణా శత్రుచ్ఛిదాకృద్రణా
స్వాంతాంతర్విలగజ్జత్పటలికా జ్ఞానప్రసూనాంబికా 86

మ. చెడుమార్గంబని యించుకైన మదిలోఁ జింతింప కే నెప్పుడున్
విడనాడందగుచెయ్వులన్నియును నుప్వెల్లారుచుం జేసితిం
బొడగానం దదుపారతి న్మదిని దప్పు ల్గాడ కొక్కుమడిన్
గడకంటంగని ప్రోవుమమ్మ దయతో జ్ఞానప్రసూనాంబికా. 87

మ స్ఫుటమై నీకరుణారసం బెవనిపై సోఁకు న్వెసన్ ధాత్రి వాఁ
డటవీవీథుల శత్రుమధ్యమున నుద్యద్వారిపూరాంతరో
త్కటవీథీనిచయంబునం బడిన వేగం బ్రోతు వౌ నీవె ధూ
ర్జటివామాంగనివాసభాసురతనూ జ్ఞానప్రసూనాంబికా

మ. నవకావ్యంబు రచించి ప్రాజ్ఞులును నానావృత్త్యలంకారరీ
తివిశేషంబుల మెచ్చువచ్చునటులుద్దీపింపఁగా నర్థసం
భవసారస్యముఁ దెల్పలేరిపుడు నామాటెంత యొక్కింతనా
కవితంగైకొనుమమ్మ యెట్టులయినన్ జ్ఞానప్రసూనాంబికా. 89

మ. తపముం జేయుచు నీమనంబునకు సాంతత్యంబుగా సంతసం
బెపుడుం జేయఁగఁజాల నీమనుజపం బెంతే నొనర్పందగం
గృపఁ బుట్టించుమ్మదూర్తి నేనెఱుఁగ నొక్కింతైన నీవిప్పుడో
కృపరిం జూడు మహైతుకోదితదయన్ జ్ఞానప్రసూనాంబికా. 90

మ. అమరీలోకము వేళవేళలఁ ద్వదాయత్తస్థితి న్సేవన
ల్ప మహానందముతోడఁ గొల్వయిన నీపాదంబు లర్చించు న
ట్టిమహాభాగ్యము నారదాదులకుఁ బాటింపందగుంగాక ని
క్కముగా నిన్గొలువంగఁజాల రితరుల్ జ్ఞానప్రసూనాంబికా. 91

మ. వశమా మాదృశులైనవారలకు నిన్ వాక్రుచ్చివర్ణింప నీ
యశముంబేర్కొని సంస్తుతింప మఱి నీయక్షీణకారుణ్యలే
శశతాంశం బయిన న్లభింపక జగత్సంభావ్యసృష్టిక్రియా
కశతానందశతాభినంద్యచరణా జ్ఞానప్రసూనాంబికా. 92

మ. జయ మాంతంగిమణీవిపంచివిలసత్సప్తస్వరీసజ్ఝరీ
నయసంద్రావితమేరుశైలగతనానారత్నవాఃపూరసం
చయనానారుచిమద్ధునీశతసహస్రప్రాప్తనవ్యక్రియా
జయనిర్ధూతసమస్తదైవతభయా జ్ఞానప్రసూనాంబికా 93

మ సవినోదోద్యతసంయుతాయుతకరాసక్తిస్ఫురద్వీక్షణా
దివిశేషాభిమతప్రకారమృదుగీతిస్ఫూర్తి రేఖాజవా
ధ్యవిహారాభినయప్రపంచనియతవ్యాపారరంభాదిలా
స్యవిలాసోన్నతిదర్శనాద్రుతిమతీ జ్ఞానప్రసూనాంబికా. 94

మ. దయ యొకించుక నాపయి న్నిలిపి నీదాసుండ నౌనన్ను ని
ర్భయునిం జేసి సమస్తకార్యముల నబ్రంబైనసాఫల్య మూ
న్చి యనన్యాదృశమైనతెల్వి దయసేయంజాలు నీవే కదా
జయసమ్మోదితదేవతాపటలికా జ్ఞానప్రసూనాంబికా. 95

శా. పంచాస్యంబు హయంబుగా సమదసంప్రాప్తాసురవ్రాతముల్
గొంచెం బైనను జిక్కనీక దునుమం గోదండపాండిత్యలీ
లాంచత్పాణివిలాసవై తనరు నీయబ్రంపుశక్తి న్సమి
త్సంచారాంచితశక్తిసేన లెఱుఁగున్ జ్ఞానప్రసూనాంబికా. 96

మ. కమలాదేశకృదాయతాక్షియుగళీ కల్యాణభూభృద్రుచి
క్రమనిర్మోటనపాటవోరసిజయోగశ్రీసమేతావదా
తమణీహారవిరాజమానగళ మిధ్యామధ్యమా పూర్ణిమా
కమనీయేందువిభాసమానవదనా జ్ఞానప్రసూనాంబికా. 97

మ. కలరా వేల్పులు నీకు సాటి యనఁగాఁ గన్గొంగ లే రేల ప
ల్కులు నీవే ననుఁ బ్రోవఁగావలె దొసంగు ల్బాఱఁగాఁదోలి నా
వలన న్నేరము లున్న నీమదిని జేర్పంబోక రక్షింపుమీ
జలజాతప్రభవాంగనాదివినుతా జ్ఞానప్రసూనాంబికా. 98

శా. నానాపుష్పఫలావళీసతతదానప్రోల్లసద్భవ్యసం
తానానోకహమధ్యవీథ్యుదితవిస్తార   చ్ఛాఖికా
ధీనానేకమధువ్రతీపరభృతీదివ్యశ్రీవస్సౌఖ్యద
స్వానోద్యానవిహారకేళిరసికా జ్ఞానప్రసూనాంబికా. 99

శా. సందేహం బొకయింతయేని మదిలో సంధింప కెవ్వేళ నీ
వందారువ్రజరక్షణక్షమదృశావ్రాతం బపేక్షించి యు
స్పందప్రక్రియ నున్నవాఁడ మనుపన్ భారంబు నీదేకదా
ఛందోవీథివిహారలాలసమతీ జ్ఞానప్రసూనాంబికా. 100

మ. లలితాష్టాదశపీఠికాకలితలీలారూపవై జప్యకృ
త్ఫలదానాప్రతిమప్రభావవిలసత్కారుణ్యపూరంబు దొ
ల్క లలిం దాదృశహేలలం దగు నినుం గాంతుంగదా యిందని
ష్కలుషం బై తగుభక్తియుక్తి జననీ జ్ఞానప్రసూనాంబికా. 101

శా. *శ్రీమద్దామరవేంకటక్షితిపతిక్షేమంకరప్రక్రియో
ద్దామాత్మీయదయారసప్రసరసిధ్యన్మంజుళాపాంగవీ
క్షామందస్మితసుందరాస్య మెలమిం గన్పట్టఁ బ్రత్యక్షమై
సామంజస్య మెసంగఁ బ్రోవుము ననున్ జ్ఞానప్రసూనాంబికా. 102



శా. శ్రేయస్సంతతధామ దామరకులశ్రీవేంకటేంద్రాజ్ఞఁ బ్ర
జ్ఞాయత్తౌచితి సర్వశాస్త్రి యిటు లొయ్యం జేసె జ్ఞానాంబికా
శ్రీయానుగ్రహలీలఁ బద్యశత మీరీతిం బఠింపన్ జనుల్
ధీయుక్తస్థితి నన్నివిద్యలఁ బ్రశస్తిం జెంది పెంపెక్కరే.

శ్రీలలితార్పణమస్తు.

---

* ఈపద్య మీశతకప్రారంభము నందలిదే.

శ్రీరామచంద్రాయనమః.

# ఒంటిమిట్ట-పోతనామాత్యుఁడు.

తే. కూటసంగ్రామమున రిపుకోటి గెల్వ, నుత్సహించి విజృంభించునుదురుమిడుకు
శక్రవైరిని గెలిచినసత్యరతులు, కరుణ రక్షింత్రు రామలక్ష్మణులు నన్ను.

మహాశయులారా !

బమ్మెర పోతనామాత్యుఁడు భాగవతమును రచించినస్థలము నిర్దేశింపఁ బ్రయత్నించి బ్ర॥శ్రీ॥జయంతి రామయ్యపంతులవా రోరుగంటివారివాదమును నొంటిమిట్టవారివాదమును వారికిఁ దెలిసినంత పరిశీలించి పోతరా జోరుగంటివాఁ డని చెప్పుటే సమంజస మని యభిప్రాయ మిచ్చుటయు దానికి నేను బ్రత్యుత్తర మిచ్చుచుఁ బోతరా జొంటిమిట్టవాఁ డని చెప్పుటే న్యాయ్య మని తగుకారణములు చెప్పియుండుటయు మీ రెఱింగియేయున్నారు.

ఇట్లుండ నింతలో రావుబహాదర్ కందుకూరి వీరేశలింగముపంతులవా రాంధ్రకవులచరిత్రము మఱియొకసారి క్రొత్తకూర్పు ప్రకటించిరి. అందుఁ "బోతననివాసస్థలము నైజామురాజ్యములోని ఓరుగల్లు. ఇదియే భాగవతమునం దేకశిలానగర మని చెప్పఁబడియున్నది" యని కంఠోక్తిగ సిద్ధాంతవాక్యములు వ్రాయుటేగాక "స్థలాభిమానముచేతఁ గొంద ఱిప్పటికిని పోతన జననభూమి కడపమండలమే యని వాదించువా రందందుఁ గనఁబడుచున్నారు. అందుచేత నట్టివారిభ్రాంతి నివారణార్థముగ బమ్మెర పోతననివాస మోరుగల్లని స్థాపించుటకుఁ దగినహేతువులను గొన్నిటి నిందుఁ జూపుచున్నాను" అనిప్రగల్భోక్తులు పల్కిరి. ఈరావుబహాదర్‌వా రాంధ్రకవులచరిత్ర మనుగ్రంథము వ్రాసి చిరకాలముగ నాంధ్రలోకమున వ్యాపింపఁజేసియుండుట మీ రెఱుంగనివిషయము గాదు. ఇట్టివా రిట్టిసిద్ధాంతవాక్యములను గ్రంథమునం దెక్కించినపుడు శ్రీకోదండరామస్వాములవారికృప యొంటిమిట్టపైఁ దప్పినట్టేకదా యెంచవలయును. చరిత్రములు సామాన్యముగా వ్రాయసకానియిష్టానిష్టములంబట్టి వ్రాయఁబడిన సత్యాసత్యములచేతను గల్పితములచేతను నిరాధారోహాపోహములచేతను బూరింపఁబడుట యందఱకుఁ దెలిసినవిషయమేకదా. వారియిష్టము వచ్చినట్టు వారు

వ్రాసినంతమాత్రమున వచ్చినలోటేమి యని మీ రనుకొనవచ్చును. చరిత్రశబ్దమున కింకను నొకగౌరవము కలదు. సత్యాన్వేషణపరులై విశేషవిమర్శనము చేసినవారుతప్పఁ దక్కినవారు చరిత్రములందుఁ జెప్పఁబడినవిషయములు సత్యములనియుఁ దద్గ్రంథకర్త లెంతో శోధించి పరిశ్రమించి వ్రాసిరనియుఁ దలఁచుచుందురు. సత్యమెఱిఁగినవారు నూటికి నొకరైన నుందురో యుండరో. తక్కినవారు గ్రంథస్థాల్యము వక్తృప్రతిష్ఠఁ బట్టి చరిత్రమున నున్నదంతయు సత్యమే యని నమ్మెదరు. ఆకారణముచే సత్యముతోపాటు సత్యేతరములును లోకమునఁ బ్రతిష్ఠఁ గాంచును. సత్యమును విమర్శించి తెలిసినవారిలో నూటి కొకరెవరో వానిని వెలిఁబుచ్చఁగలుగుదురు. వారిలో నెందఱో నావలె నుదాసీనులు. తెలిసినవారైనను బత్రికలందో వ్యాసములుగనో విడివిడిగఁ బ్రకటించిన యెడల నవి లోకమునసంతయు వ్యాపింపకయు వ్యాపించినను జిరకాల ముండకయు, నచిరకాలముననే విస్మృతమగును గ్రంథరూపముగ నుండునది చిరకాల ముండును. అసత్యములును నంతకాలము ప్రబలియే యుండును. కావున బ్ర॥శ్రీ॥ జయంతి రామయ్యపంతులవారి వ్యాసమునకంటె మ.రా శ్రీ. రావుబహాదర్ కందుకూరి వీరేశలింగముపంతులవారి చరిత్ర మెక్కువకీడు చేయునదై యున్నది. కావున వారు పోతనామాత్యునిగుఱించి వ్రాసినవ్రాఁత పరిశీలించి మనము సత్యమని నమ్మినదానిని లోకమునకుఁ దెలుపవలసినభారము మానయం దున్నది.

ఆర్యులారా! కడపమండలమువారిభ్రాంతిని బోఁగొట్ట దీక్షవహించినవీరు బ్ర॥శ్రీ॥ జ. రామయ్యపంతులవారి వ్యాసమును జూచువఱకుఁ దాము నిట్టి భ్రాంతికి లోనై యుంటి మనియు, వారివ్యాసమును జూచి "మహాజను లిప్పుడు కన్నులు తెఱచి తమతొంటిప్రమాదమును దెలిసికొని పూర్వాభిప్రాయము మార్చుకొనుచున్నారు" గావున వారితోపాటు నేనును గన్నులు తెఱచికొని యింతవఱకు నేను వ్రాసినదానిని గొట్టివేసి దానిమాఱు పంతులవారువ్రాసిన విషయములను సంక్షేపించి వ్రాయుచున్నానని వ్రాసియుండిన సత్యముఁ జెప్పిన వారై యుందురు. ఏలన వీరే 1911-వ సంవత్సరమున ముద్రించినకూర్పునందును దత్పూర్వపుఁగూర్పులందును "బమ్మెర పోతరాజు. ఈతనినివాసస్థలము కడపమండలములోని ఒంటిమెట్ట. ఇదియే భాగవతమం దేకశిలానగర మని చెప్పఁబడియున్నది." అని కంఠోక్తిగ వ్రాసిరి. ప్రౌఢకవి మల్లనగుఱించి వ్రాయుచు "బమ్మెర-పోతరాజువాసస్థానము కడపమండలములోని యొంటిమిట్ట" యనివ్రా

సిరి. (బ॥శ్రీ)॥జయంతిరామయ్యపంతులవారివ్యాసము వెలువడినపిమ్మట నిప్పుడు భ్రాంతిముక్తులమనుమహాభ్రాంతిలో మునిఁగి "కడపమండలములోని ఒంటిమెట్ట" అనుపదములకు మాఱుగ "నైజామురాజ్యములోని యోరుగల్లు" అని వ్రాసిరి. ఆఱుసంవత్సరములకాలములోనే తమపూర్వగ్రంథములన్నియు లోకమున నశించిన వనియు నందలితమవ్రాఁతను దాఁచి తదజ్ఞత నభినయించుటచే నిప్పుడు దమ్ము లోకులతిలోకునిగఁ దలంతు రనియు వారునమ్మి రేని యింతకంటె భ్రాంతి వేఱొం డుండదు. వీరు పురాణము హయగ్రీవశాస్త్రులవారు వ్రాసిన దానినిబట్టి పూర్వము వ్రాసిరి. ఇప్పుడు పంతులవారు వ్రాసినదానినిబట్టి వ్రాసిరి. పేరుమాత్ర మప్పు డిప్పు డెప్పుడు చెప్పినవారు గారు. ఎదుటివారివాదమును ఖండించినప్పుడుమాత్రము వారి పేరు తప్పక చెప్పుదురు.

తాము పోతనామాత్యునివాసస్థల మొంటిమిట్టయని పూర్వము వ్రాసియున్నట్టు లిప్పుడు చెప్పకుండుటకుఁ గారణము లేకపోలేదు. వీ రిప్పుడు వ్రాసిన వ్రాఁతలో "ఒంటిమెట్ట యెప్పుడును నేకశిలానగరము కాఁజాలదు. మెట్టయను దానికి శైల మర్థమగునుగాని శిల యర్థముగాదు. ఒంటిమెట్ట యన్నచో నేకశైలగ్రామము గావచ్చునుగాని యేకశిలానగరము గాదు." "ఒంటిమెట్టకు సమీపమున గోదావరినది లేకుండుటయు" "ఒంటిమెట్ట యొకచిన్నగ్రామమే" ఇత్యాదివాక్యములు కానవచ్చుచున్నవి. "ఒంటిమెట్ట" యనిన నేకశైలగ్రామమును గాగు ఏకశిలానగరమునుగాదు. అది యెట్లయిన నగునుగాక. ఈవ్యుత్పత్తిజ్ఞానము రెండుసంవత్సరములక్రిందటివఱకు మీ కేల లేకుండెను? అప్పుడు "ఇదియే భాగవతమం దేకశిలానగర మని చెప్పఁబడినది" యని యొంటిమిట్ట విషయమై యేవ్యుత్పత్తినిబట్టి వ్రాసితిరి? ఒంటిమిట్టయొద్ద గోదావరి యీనాఁడు లేదా? రెండేండ్లకు ముందును లేదా? ఆవిషయ మెప్పుడు గ్రహించితిరి? అనియు, ఒంటిమిట్ట చిన్నగ్రామ మనునది యిటీవల రైల్వేగైడులో నొంటిమిట్ట ప్రకటఁజుక్కఁజూచి తెలిసికొంటిరా యని యెవరైన నడుగుదురో యనుభీతిచేఁ బూర్వమేమియుఁ దాము వ్రాయనట్టు నిప్పుడే యవతరించినట్టు నటించిరి. శిలాశైలశబ్దములు పర్యాయములుగ వాడుట పూర్వభాగమున వచించితి. దానిని స్థాపింపఁ బంతులవారు చదివినగ్రంథములనుండి యొండు వారి స్మరణమునకుఁ దెచ్చెద.

మ. వరవక్త్రేందువిలాసకన్నవవయోవర్షావసానంబునన్
దరుణీశైశవసింధు లింకునెడఁ దత్తాటాలలక్ష్యంబు లౌ

సరసాంతస్థితగండశైలము లనన్ జందోయి యంతంతకున్ [ము.
బరఁగెన్ దత్క్రిమిశోష రేఖ లనఁ గన్పట్టెన్ వళీపుంజముల్. నరసభూపాలీయ

గీ. ధవళలోచన శ్రీపర్వతంబుమహిమఁ బ్రస్తుతింపంగ శక్యమే బ్రహ్మకైన
గండశిల లెల్ల శంభులింగంబు లిందు, సిద్ధమును లిందుఁ జరియించుచెంచు లెల్ల.
కాశీఖండము.

మీఁద ననువదించిన రావుబహదర్‌వారిప్రతిజ్ఞావాక్యములు న న్నుద్దేశించి వ్రాసినను వ్రాయకున్నను నవి నాకును నన్వయించును గావునను, నీవాదమున దిగినవాఁడ నగుటను వీరివ్రాఁతయందలి చిత్రములు లోకమునకుఁ దెలుపకుండినచో నవియే విశ్వసింపఁబడును గనుకను, వీరివాదపద్ధతి విశదీకరించినఁ గాని వీరిగ్రంథములు పఠించుటయందుఁ "గనులుతెఱచుకొని" లోకమువారు హెచ్చరికతో గ్రాహ్యముమాత్రమే గ్రహింపఁజాలకయుందురు కావునను ప్రత్యుత్తర మీయఁ గడఁగితిని.

పోతరాజోరుగంటివాఁ డని రావుబహదర్‌వారు చెప్పెడికారణములు :—

(1) ఇంటిపేరునుబట్టి పోతన పితృపితామహాదులవాసస్థానము బమ్మెరగ్రామ మయినట్టు సులభముగాఁ దెలిసికొనవచ్చును. అతఁ డాగ్రామములోనే పుట్టినవాఁడైనను ఓరుగల్లు రాజనివాస మయినమహాపట్టణమయి యుండుటచేత భాగవతరచనకాలమున కక్కడఁ జేరియుండును. ఈబమ్మెరగ్రామ మోరుగంటికి మూఁడామడదూరములో నల్లగొండమండలమం దున్నది. బమ్మెర యనుపేరుగలయూ రేదియు నొంటిమిట్టచేరువనుగాని తుదకుఁ గడపమండలములో నెక్కడనైననుగాని లేదు. అందుచేత భాగవతమందుఁ జెప్పఁబడినయేకశిలానగరము నైజామురాజ్యములోనియోరుగల్లేగాని కడపమండలములోని యొంటిమెట్ట కాదు."

(2) పర్యాచ్చరు గోలకొండదేశములోని నల్లగొండమండలమందును నారయగృహనామ మయినవెలిగందల కరీంనగరములోను రెండును బమ్మెరకు సమీపమున నున్నవి.

(3) కర్ణాటభాషలో "ఓరు" అనఁగా 'ఒక్క' కల్లుఅనఁగా 'రాయి' అని యర్థము. అందుచేత నేకశిలానగర మనఁగా నోరుగల్లుపుర మనుట స్పష్టము.

(4) ఒంటిమెట్ట యెప్పుడును నేకశిలానగరము కాఁజాలదు.

(5) ఒంటిమెట్ట యొకచిన్నగ్రామమే కాని యెప్పుడును నోరుగంటివలె నగరమైనది కాదు.

(6) ఒంటిమెట్టకుఁ బూర్వకాలమందుఁగాని మఱియేకాలమందుఁగాని యేకశిలానగర మన్న పేరు లేదు.

(7) గౌతమినిసహితము గంగయనుట కలదు. ఒంటిమెట్టకు సమీపమున గోదావరినది లేకుండుటయు గోదావరీనది యోరుగంటికే సమీపముననే యుండుటయు విచారింపఁగా బమ్మెరపోతనామాత్యునినివాసస్థల మైనయేకశిలానగర మోరుగల్లేగాని యొంటిమిట్ట గాదు.

(8) పోతనామాత్యుఁడు తనకవిత్వారంభదశలో గోలకొండసీమలోని రాచకొండదుర్గాధీశ్వరుఁ డైన(రేచర్ల)రావు సింగభూపాలునిప్రేరణముచేత రచియించిన భోగినీదండకముకూడ నీమహాకవి యోరుగల్లుప్రాంతమువాఁ డని దృఢీకరించుచున్నది.

(9) గోలకొండదేశములో వాడుకలోనున్న "పాలకుర్తినిలయా సోమయలింగా పాదములకు శరణు. వురవుగ బమ్మెరపోతరాజుకు* మీరు కోరినవరములు కృపచేసినారట । పాలకుర్తినిలయా" ॥ అనుపాట

ఇవన్నియు రావుబహదర్‌వారివాక్యములు. ఈవ్రాఁతయంతయు నామిత్రుఁ డొకరుఁడు చెప్పినట్లు "రామయ్యపంతులవారి వ్యాసమునుచ్ఛిష్ట" మని మీరు నేను జెప్పకయే గ్రహింపఁగలరు. పరులయశస్సునకు హాని లేకుండఁ బూర్వులపద్యములు ననువదించిన గణపవరపు వేంకటపతి లోనగుకవులపై గ్రంథచౌర్యదోషము మోపినరావుబహదర్‌వారివ్రాఁతలయం దంతకన్న నెక్కువ పశ్యతోహరత్వము గానవచ్చుట శోచనీయము. దీనికిఁ గారణము లేకపోలేదు. రామయ్యపంతులవారివాదము పత్రికయందు బ్రకటింపఁబడుటచే నది కొలఁది కాలములోనే యెందో మూలఁబడును. లోకమునకు గోచరింపదు. గ్రంథస్థమైయుండినఁ జిరకాల ముండును. అని రావుబహదర్‌వారియుద్దేశమై యుండవచ్చును, ఇది మంచియుద్దేశమే కాని స్వయముగ దేశాటనముచేసి మనుష్యులఁ

* మూలమునందు 'బొమ్మెరపోతరాజు' కనియే యున్నది మూలమునకు విరుద్ధము లైనయసువాదములు, నొకగ్రంథమున నుండుపద్యముల మఱియొకగ్రంథములో నున్నట్టు వ్రాయుటలు, తమవాదమున కనుకూలపడునట్లు ముందున్నవారిని వెనుకటి వారిగ వెనుకటివారిని ముందుగా నున్నట్టు వ్రాయుటలు లోనగునవి యాంధ్రకవులచరిత్రమందుఁ గానవచ్చుకరలాఘవములు. ఈపాటయందు సోమయలింగనాథుఁడు పోతరాజునకు వరమిచ్చినట్లుం డుటచేతను వీరభద్రవిజయకర్తయు సోమనాథదేవభక్తుఁ డగుటను నీపాట వీరభద్రవిజయకర్త కన్వయించును గాని భాగవతగ్రంథకర్త కన్వయింపదు.

బంపి యాధారముల సంపాదించినవారిపేరు మూలఁబడి తనపేరుమాత్రముబయటికి రావలయు నని చేయుయత్నము శ్లాఘ్యము కాదు. అయినను నీవిషయమున దొంగిలింపఁబోయిన మంగలమే దొరకిన దన్న సామెత వీరియెడ నిజమైనది.

రామయ్యపంతులవారు వ్రాసినవానినే వీరు వ్రాసినను వారివ్యాసమున సత్యమునందు దృష్టియు ఋజుపద్ధతి యున్నట్టు స్పష్టముగాఁ దోఁచుచున్నది. రావుబహాదర్‌వారివ్రాఁతయందుఁ దద్విరుద్ధము గానవచ్చుచున్నది. ఎట్లన పంతులవారు "బమ్మెరయనుగ్రామము.........చేర్యాలతాలూకాలోనున్నది. దీని నచ్చటిజనులు సాధారణముగ బొమ్మెర యని పిలుతు" రని వ్రాసిరి. దీనివలనను వారు జతపఱిచినయనుబంధమువలనను బ్రకృత ముండుగ్రామము బొమ్మెరయే కాని బమ్మెర కాదని స్పష్టపడియెఁగదా. ఈవిషయమై నేను వ్రాసినప్రత్యుత్తరము మీరు చదివియే యున్నారు.

ఇఁక రావుబహాదర్‌వారో "ఈబమ్మెరగ్రామ మోరుగంటికి రమారమి మూఁడామడదూరములో నల్లగొండమండలమం దున్నది" అని యొక్కడవ్రాసినను బమ్మెర యనుగ్రామము నేఁడున్నట్టే వ్రాసిరి. పంతులవారివ్యాసము చదువనివారికి దీనివలన నేమి యర్థ మగును? బమ్మెరగ్రామము నేఁ డున్నట్లే కదా బోధపడును. అట్టిది లే దని యెఱిఁగియెఱిఁగి యిట్లు వ్రాయుట లోకవంచనము మాట యేల ఆత్మవంచనము కాదా? వీ రుద్దేశించినట్టు పంతులవారివ్యాసము మూలఁబడి వీరిమిథ్యాగ్రంథమే లోకమున నిలిచిన నెంతయసత్యము లోకమున స్థిరపడునో యొంటిమిట్టవారివాదమున కెంతహాని ఘటిల్లునో చూచితిరా. బొమ్మెరవాసులు తమగ్రామముపేరు బొమ్మెర యనుచుండ వీరు దానిని నిరాధారముగ బమ్మెర యనుట యెంతసాహసము! ఇట్టి వాదములచేత నొంటిమిట్టవాదుల భ్రాంతిఁదొలఁగింపఁ రావుబహాదర్‌వారు పూనుకొనుట దున్నపోతుతోఁకను బట్టుకొని మహార్ణవ మీఁద యత్నించుటే.*

* బ్రహ్మశ్రీ రామయ్యపంతులవారు తమవ్యాసమునకు జతపఱిచిన అనుబంధముల "బమ్మెర పోతరాజు బొమ్మెరలో ప్రస్తుత మున్న నెల్లుట్లవారివంశీకుఁడు"

"పోతరాజుగారు బొమ్మెరనివాసియే యని ప్రశస్తికలదు."

"పోతరాజుగారిది యిదే బొమ్మెర"

"పోతరాజుగారునివాసం యిక్కడనే నని నిశ్చయం అందరు అంటారు" అనునిత్యాది వాక్యములు కానవచ్చుచున్నవి కాని యొకస్థలమందైన నీబొమ్మెరకే పూర్వకాలమందు బమ్మెర యనుపే రుండె నని చెప్పఁబడి యుండలేదు. దీనివలన బొమ్మెర యనాదిగ బొమ్మెర యనుపేరనే

"అతఁ డా గ్రామములోఁ బుట్టినవాఁడైనను, ఓరుగల్లు రాజనివాస మైనమహాపట్టణ మయియుండుటచేత భాగవతరచనాకాలమున కక్కడఁ జేరి యుండును" అని రావుబహాదర్ వారు వ్రాసిరి. "అతఁ డా గ్రామములోఁ బుట్టినవాఁడు" అని నామకరణమునాఁడు తా ముండి కనులారఁ జూచినట్టు వ్రాసినవారివ్రాఁత కెవ్వ రేమి బదులు చెప్పఁగలరు? కాని, మహాపట్టనమందుఁ గాని గ్రంధరచన సాగదు కాఁబోలు. అంతటిమహానగరమధ్యమున నుండు వారికి స్వయంకృషివలన జీవనముచేయ సాధ్యపడునా? పోతనవలె సొంతసేద్యముచే జీవించువారు మహానగరమధ్యమందు వాసము చేయుచుండుట యెందైనఁ గలదా? ఓరుగల్లు రాజనివాస మఁట. ఆకాలమున నోరుగంటిరాజుపే రేమని వారిని నడుగుచున్నాను. రావుబహాదర్ వారివాక్యమునకుఁ బ్రతిబింబముగ నే నొకవాక్యము వ్రాసెదను. "రావుబహాదర్ కందుకూరి వీరేశలింగముపంతుల వారు పూర్వము కడపమండలములో నుండి యిప్పుడు చిత్తూరుమండలములోఁ జేరినకందుకూరుగ్రామములోఁ బుట్టినవారు. అయినను గోదావరి మహానది గనుక రాజమహీంధ్రిమునఁ (రాచకొండ) జేరియుండుదురు" ఇం దెంత సత్య మెట్టియుక్తి యున్నదో యంత సత్య మట్టియుక్తియే రావుబహాదర్ వారివాక్య మందును గలదు. రాజమహీంధ్రిమన రాచకొండ. సర్వజ్ఞసింగమనాయఁ డుండినస్థలము. వేదాంతదేశికులవారి సుభాషితనీవి వ్యాఖ్యోపోద్ఘాతములో నుండు "రాజమహేంద్రవర నగరస్థితసర్వజ్ఞసింగక్షమావల్లభేన" యనుచోటను రాజమహేంధ్రి మనియే యుండనోపు. ఇది క్లిష్టముగా నుండుటచేతను రాచకొండయు

పిలువఁబడుచున్నదనియు బమ్మెర యనుపే రున్నట్టు లెవ్వ రెఱుఁగ రనియుఁ గదా గ్రహింపవలసి యుండును ఓరుగంటివాదులు తమవాదమున కేదోయొకబలము కల్పింపవలయునని నామమునఁ గలకించిత్సామ్యము నుబట్టి బొమ్మెరయే బమ్మెర యనుచున్నారు. బమ్మెరపోతరాజు బొమ్మెరయందున్నాఁ డనినంతమాత్రమున బొమ్మెర బమ్మెర కాఁజాలదు. కందుకూరి వీరేశలింగముపంతులవారు రాజమహేంద్రవరమున నున్నంతమాత్రమున రాజమహేంద్రవరము కందుకూ రగునా? నే నీయూర నున్నంతమాత్రమునఁ జెన్నపురి వావిలికొల నగునా? ఏనాఁడును గాఁజాలవు కావున నిప్పటిబొమ్మెరకుఁ బూర్వనామము బమ్మెర యని లిఖితసాక్ష్యము దొరకునంతకు రెండుభిన్నము లనియే గ్రహింపవలయును. బమ్మెర బొమ్మెర కాదని వాదించుమీరు వెలిగండ్ల వెలిగందల యొకటే యని యెట్లు వాదించెద రని వేంకటరమణకవులు నన్నాక్షేపించిరి. సత్యమును నేను వెలిగందలను వదలెదను. తాము బమ్మెరను వదలుదురుగాక. తరువాత నోరుగంటివారివాద మెన్నికాళ్ల నర్తించునో చూతము.

నికి యీప్రాంతమువారికిఁ దెలియకుండుటచేతను గాఁబోలు రాజమహేంద్రవర
మని సవరింపఁబడియుండును. బ్రి॥శ్రీ॥ సదాశివశాస్త్రులవా రీసమాధానము
తామువ్రాసినదానికిఁ జెప్పిరి. "బమ్మెర యనుపేరుగల యూరేదియు నొంటిమి
ట్టచెరువనుగాని తుదకుఁ గడపమండలములో నెక్కడనైనను గాని లేదు" అని
రావుబహదర్‌వారు వ్రాసిరి. బమ్మెర యనుగ్రామ మోరుగంటిచెరువను గూడ
లేదని నేనుజెప్పెదను నల్లచీర కట్టుకొన్నవా రందఱు నాపెండ్లాలే యన్నట్టు
బకార, మకార, రకారములు గల్గ్రామములన్నియు బమ్మెరలే యని యోరు
గంటివాదులవలె నేను వాదింపఁబూనినచో నొంటిమిట్టకు రమారమి 30మైళ్ల
దూరములోఁగల బొమ్మవర గ్రామమునే బమ్మెర యని చెప్పియుందును.
బకార మకార రకారము లందును గాననగును. ఓరుగంటివాదులవలె నేనును
గించిద్రూపసామ్యము నాధారముగఁగొని వాదింపఁ దలఁచియుండినచో బమ్మె
రయే బొమ్మరమైనదని బొమ్మర కర్థము లేదని 'హామిల్టన్ బ్రిడ్జి' 'అమటగ్‌వా
రావధి' 'సెంటుఅంద్రూస్‌పేట' చింతాద్రిపేట "గోల్డులింగ్‌హామ్" గుల్లో
లింగ మయినట్లు బమ్మెర బామ్మెర బొమ్మర బొమ్మవర మయిన దని వాదించి దానికిఁ
దగినయాధారములు కనఁబఱిచియుందును. నాయంతఃకరణమట్టి వాదమునకీయ
కొనదయ్యె.

వీరి 2,3,4,5,6,7,8 కారణములు పూర్వభాగమున ఖండించియున్నాను.

రామయ్యపంతులవారు చెప్పనికారణ మొకటి యెక్కువగ రావుబహ
హదర్‌వారు చెప్పిరి. భాగవతకర్త యగుపోతనామాత్యుఁడే వీరభద్రవిజయము
నకుఁ గర్తయని వీరు వ్రాసిరి. వీరి 10వ కారణమునుఖండించుటకు ముందు వీర
భద్రవిజయాంధ్రభాగవతగ్రంథకర్త లొక్కరా యిరువురా యనుట విమర్శింప
వలయును. ఈవిమర్శనిమిత్తమై యీవ్యాసము వ్రాయవలసివచ్చెఁగాని లేనియె
డల రావుబహదర్‌వారికిఁ బ్రత్యుత్తరమీయఁ బనియే యుండదు. రావుబహదర్
వా రాంధ్రకవులచరిత్ర పూర్వముద్రణమందు :—

"ఈకవి భాగవతము రచియించినతరువాత వీరభద్రవిజయ మనుమఱి
యొకగ్రంథమును రచియించెను, భాగవతచతుర్థస్కంధమందలి దక్షయజ్ఞకథలో
"అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మానహీనుఁడు మర్యాద లేనివాఁడు మత్త
ప్రచారుఁ డున్మత్తప్రియుఁడు" అనియు "వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు
వారు, వారికనుకూలు రగుదు రెవ్వారు వార లట్టిసచ్ఛాస్త్రపరిపంథు లైనవారు,

నవనిఁ బాపంబు లయ్యెద' రనియు శివదూషణము విశేషముగఁ జేయఁబడియుం డుటచేఁ దత్పాపపరిహారార్థమయి వీరభద్రవిజయమును జేసిన ట్లాపుస్తకములోని యీక్రిందిపద్యమునందుఁ జెప్పఁబడి యున్నది.

ఉ. భాగవతప్రబంధ మతిభాసురతన్ రచియించి దక్షుక్రు
ద్యాగకథాప్రసంగమున నల్పవచస్కుఁడ నైతిఁ దన్నిమి
త్తాగమవక్త్ర దోషపరిహారరతకై యజనైకశైవశా
స్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్కతోడుతన్"

అని రావుబహదర్ వారు వ్రాసిరి. ఇప్పటికూర్పునందును నీమాటలే యున్నవి. 'పరహారత' యనుప్రయోగమే యిది భాగవతకర్త రచించినపద్యము కాదని వే నోళ్లఁ జాటుచున్నది. ఈపద్యము వీరభద్రవిజయకర్తదఁట. దానిపై నూహ రావు బహదర్ వారిది. వీరు కొన్నిసంవత్సరములక్రిందటఁ దొలికూర్పునందు వ్రాసిన దానిని ఖండించుచు గురుజాడ శ్రీరామమూర్తిపంతులవారు "వీరభద్రవిజయ వివేక" మనియొకదీర్ఘవ్యాసము వ్రాసిరి. అది వారికవిజీవితము 622_642 పుట లయందుఁ గననగు. వా రుపసంహారమందు "కావున నీరెండుకథలను జెప్పి నవా రొకరుకాక యిరువురు వేర్వేఱుకవు లని నిర్ణయించి యీగ్రంథము నవీన మనియుఁ గల్పిత మనియు సిద్ధాంతీకరించెదను" అని వ్రాసిరి. తమవాదము పూర్వపక్షమైనపుడు మరల సిద్ధాంతము చేసికొను టొండె సవరించుకొను టొండెఁ జరిత్రకారులకు విధియై యుండ రావుబహదర్ వారు తాము ఖండింప సాధ్యమైనచో వారియితరవాదముల ఖండింప యత్నించియు నీవిషయమున మౌనము వహించి ప్రత్యుత్తర మీయక సవరించుకొనక మొదటిపాటనే యిప్పటికిఁ బాడుచున్నారు. చరిత్రకారుల కిట్టిపట్టుదల దగునా? వారు తమకుఁ దెలిసినంతవఱకు సత్యమును లోకమున కెఱిఁగింపవలయునుగాని తాము వ్రాసినది తప్పైనను నెదుటివా రాక్షేపించి రనినకారణముచేఁ దాను బట్టినకుందేటికి మూఁడే కాళ్లనవచ్చునా? అట్లు లందు రేని యిట్టితప్పులతడకను లోక మేల యాదరింపవలయును? వీరభద్రవిజయమును సాంతముగఁ జదివినపిమ్మట శ్రీరామమూర్తిపంతులవారి యభిప్రాయమే సరి యని నాకును దోఁచినది. ఆగ్రంథము చదివినవెల్లర కట్టులే తోఁపఁగలదు. దానికి నాకుఁ దోఁచినకారణములు చెప్పెదను. ఇందుఁ గొన్ని శ్రీరామమూర్తిపంతులవారివ్యాసమం దున్నవి.

అందు లేనివి కొన్ని యిందుఁ గలవు. కావున సత్యజిజ్ఞాసువులు వీరభద్రవిజయ వివేకముఁగూడఁ బఠింపఁ బ్రార్థితులు.

"అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మానహీనుఁడు మర్యాద లేని వాఁడు మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు" లోనైనవి విశేషశివదూషణములఁట.

ఆర్యులారా! యాంధ్రశ్రీభాగవతము సంస్కృతమునకుఁ బరివర్తన మనుట మఱవకుఁడు. మూలగ్రంథమున నున్నవాక్యముల నున్న దున్నట్టు చెప్పుట కవికి విధి యనుటయు మఱవకుఁడు. అట్లైనచో నందలియభిప్రాయముల కాంధ్రకవి యుత్తరవాది కాఁడనుట మీరును నంగీకరింతు రని నమ్మెద.

శ్రీభాగవతేచతుర్థస్కంధే-ద్వితీయోఽధ్యాయః.

"శ్రూయతాం బ్రహ్మర్షయో మే సహదేవా స్సహాగ్నయః
సాధూనాం బ్రువతో వృత్తం, నాజ్ఞానా న్నచ మత్సరాత్
అయంతు లోకపాలానాం యశోఘ్నో నిరపత్రపః
సద్భి రాచరితః పంథా యేన స్తబ్ధేన దూషితః
ఏష మే శిష్యతాం ప్రాప్తో య న్మే దుహితు రగ్రహీత్
పాణిం విప్రాగ్నిముఖత స్సావిత్ర్యా ఇవ సాధువత్
గృహీత్వా మృగశాబాక్ష్యాః పాణిం మర్కటలోచనః
ప్రత్యుత్థానాభివాదార్హే వాచా ప్యకృత నో చితమ్
లుప్తక్రియా యాశుచయే మానినే భిన్నసేతవే
అనిచ్ఛన్న ప్యదాం బాలాం శూద్రాయే వోశతీం గిరమ్ ౧౩
ప్రేతావాసేషు ఘోరేషు ప్రేతై ర్భూతగణై ర్వృతః
అట త్యున్మత్తవ న్నగ్నో వ్యుప్తకేశో హస న్రుదన్ ౧౪
చితాభస్మకృతస్నానః ప్రేతస్రఙ్న్రస్థి భూషణః
శివాపదేశో హ్యశివో మత్తో మత్తజనప్రియః
పతిః ప్రమథభూతానాం తమోమాత్రాత్మకాత్మనామ్ ౧౫
తస్మా ఉన్మాదనాథాయ నష్టశౌచాయ దుర్హృదే
దత్తా బత మయా సాధ్వీ చోదితే పరమేష్ఠినా ౧౬

శ్రీధరీయవ్యాఖ్యయందు ౧౩-౧౪-౧౫-౧౬ శ్లోకములకుఁ దొలుత శబ్దార్థము వ్రాయఁబడినది. ఆవల వాస్తవార్థ మని

"వాస్తవ స్త్వయ మర్థః లుప్తాః క్రియా యస్మిన్ పరబ్రహ్మరూపత్వాత్

త్ । అత ఏవ నాస్తి శుచి ర్యస్మాత్ । అమానినే అభిన్న నేతవే ఇతి ఛేదః । తస్య పరమేశ్వరస్య మదీయా మానుషీ కన్యా కథం యోగ్యా స్యా దితి లజ్జా దినా దాతు మనిచ్ఛన్నపి తత్సంబంధలోభేన దత్తవాన్ । శూద్రా యేత్యనర్హత్వమాత్రే దృష్టాంతో న హీనత్వే పూర్వాపరస్వవచన విరోధాపత్తేః । ఏత దుక్తం భవతి । యథా కశ్చి చ్ఛూద్రాయ వేద మర్థలోభేన దదాతి తద్వ దితి। ప్రేతావాసే ష్వి త్యాది సర్వం విడంబనమాత్ర మితి స్వయమే వాహ । ఉన్మత్తవ దితి. అన్య థోన్మత్త ఇత్యే వావక్ష్యత్. అశివో నాస్తి శివో యస్మాదితి. అమత్తోఽ మత్తజన ప్రియఇతి ఛేదః । పతిః ప్రమథభూతానా మితి భక్తవాత్సల్య మాహ । తామసా నపి దోష మపనీయ పాతీతి । నష్టానా మపి శౌచం శుద్ధి ర్యస్మాత్ । దుష్టేష్వ ప్యేతే మ యానుకంపా ఇదిహ్య న్మనో యస్య స దుర్హృత్తస్మై । బతేతి హర్షే । బ్రహ్మణో వాక్యా ల్లజ్జాభయాదికం పరిత్యజ్య దత్తే త్యర్థః"
యిట్లు వ్రాయఁబడినది.

మీఁదిశ్లోకములకుఁ దెలుఁగు.

తే. వినుఁడు మీరలు రోదమాని విబుధమునివరు,
శాశనాదిసురోత్తములార! మోహ
మత్సరోక్తులు గావు నామాట లనుచు,
వారి కందఱ కాపుర మైరిఁ జూపి.

సీ. పరికింప నిత్యుఁడు దికాల్పయశోపాని, కరుఁ డీక్రియాశూన్యపరునిచేతఁ
గర మొప్ప సజ్జనాచరితమార్గము దూషి, తం బయ్యె నెన్న గతత్రపుండు
మహితసావిత్రీసమానను సాధ్వి న, న్మత్తనూజను మృగశాబనేత్ర
సకలభూమీసురజనసమక్షమున మ, ర్కటలోచనుఁడు గరగ్రహణబుద్ధిఁ

గీ. జేసి తా శిష్యభావంబుఁ జెందు టాత్మఁ దలచి ప్రత్యుద్గమాభివందనము లెలమి
నడుపకుండిన మాననీ నన్నుఁగన్న, నోరిమాటకుఁ దన కేమి గోరవోయె.

సీ. అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మాన, హీనుఁడు మర్యాద లేనివాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు దిగం, బరుఁడు భూతప్రేతపరివృతుండు
దామసప్రమథభూతములకు నాథుండు, భూతిలిప్తుం డస్థిభూషణుండు
నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్ట, హృదయుఁ డుగ్రుఁడును బరేతభూని

గీ. కేతనుఁడు వితతస్రస్తకేశుఁ డశుచి, యయినయితనికి శివనాముఁ డనుప్రవాద
గలిగెఁగాని యశివుఁడని కానకెఱిఁగి, యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చినటులు.

భాగవతము.

N B 'ప్రవాద మెటులుగలిగె' నని వావిళ్లవారిపాఠము.

వ. ఇతనికి నష్టత్తనూజను విధివత్ప్రకారంబున నిచ్చితి.

N. B విధిప్రేరితుండ నయి యిచ్చితి నని వావిళ్లవారిపాఠము.

భృగుశాపఘట్ట శ్లోకములు.

" భవవ్రతధరా యేచ యేచ తా న్సమనువ్రతాః
పాషండిన స్తే భ వేయు స్సచ్ఛాస్త్రపరిపంథినః
నష్టశౌచా మూఢధియో జటాభస్మాస్థిధారిణః
విశన్తు శివదీక్షాయాం యత్ర దైవం సురాసవమ్
బ్రహ్మాచ బ్రాహ్మణాంశ్చైవ య ద్యూయం పరినిన్దథ
సేతుం విధరణం పుంసా మతః పాషండ మాశ్రితాః॥

వీనికిఁ దెనుఁగు

గీ. వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు వారు,వారి కనుకూలు రగుదు రెవ్వారు వారు
నట్టిసచ్ఛాస్త్రపరిపంథులైనవారు,నవనిఁ బాషండు లయ్యెద రని శపించె. భాగ.

రావుబహదర్ వారు పోతనామాత్యునిమీఁద మోపినశివనిందాదోషవిషయ మైనవాక్యములఁ బూర్ణముగ ననువదించితి.

తొలుత శివనింద చేసినవాఁడు దక్షుఁడు. ఆయనవాక్యముల ననువదించినఋషి వ్యాసులు. ఆవాక్యములు తెనుఁగునఁ బరివర్తనము చేయఁబడెను. ఆంధ్రకవి తనకృత్యమును నెఱవేర్చెను. శివుని దూషింపవలయు ననుతలం పాయనకు లేదు. ఆకారణముచేఁ బాప మాయన నంటఁ గారణము లేదు. కావున నాయనకుఁ బాపభీతియు లేదు. ఈవిషయమునఁ బోతనామాత్యుఁడు చేసినది పాపమేని పూర్వము సంస్కృతాంధ్రశ్రీభాగవతములు తాటాకులపై వ్రాసినవా రందఱు పాపాత్ములే. అచ్చుకూర్చినవారు పాపాత్ములే. చిత్తులు సవరించినవారు పాపాత్ములే. పౌరాణికులు పాపాత్ములే. భాగవతము పారాయణము చేయువారు పాపాత్ములే. ఆవాక్యములను మరల వ్రాయుటచే రావుబహదర్ వారును బాపాత్ములే. ఆవాక్యములందుఁ బాపశంక లేదుగావున నాకుఁ బాపభయము లేదు. రావుబహదర్ వారు తుదకు శ్రీభాగవతమును గాటేరిగాఁ దేల్చిరి. ఎదుటఁ బడినవారి నెల్లఁ బీడించునది యదియేకదా.

ఈపద్యములు పోతనామాత్యుఁడు వ్రాసినవే యనుకొన్నను నాయన శ్రీధరీయవ్యాఖ్యానము ననుసరించినవాఁ డగుటచేతను శ్రీధరాచార్యులవాక్య

ములకు స్తుతినిందగా వ్యాఖ్యానము చేసియుండుటచేతను నీపద్యములు వ్రాయునపు డు తాను దేవహేళనము చేయుచున్నతలం పాయనకుఁ బుట్టనే లేదనియాయన వ్రాసిన "ఇట్లుదక్షుండు పల్కినగర్హితవాక్యంబులు వినిందితంబులగుం గానిరుద్రునం దు ననిందితంబులై స్తుతిరూపంబుల నొప్పె." ననువాక్యములు ఘోషించుచున్నవి.

వీరరాఘవీయవ్యాఖ్యయందు శ్రీధరీయవ్యాఖ్యయందలి వాస్తవార్థ మను భాగము పూర్వపక్షము చేయఁబడి "తస్మాద్యథోక్తఏ వార్థ"అని దూషణపరము గానే యర్థము వ్రాయఁబడలేదా యని రావుబహదర్ వా రడుగుదురేని యీ వ్యాఖ్యాన మప్పటికిఁ బుట్టనే లేదనియు నద్వైతి యగుపోతరాజు శ్రీధరీయమే యాధారముగఁ గొని తనగ్రంథము రచించె ననియుఁ బ్రత్యుత్తరము.

దీనివలనఁ బోతనామాత్యునకుఁ దా నీభాగము రచించినపుడు తాను శివనింద చేయుచున్నాఁడ ననుభీతి కలుగఁ గారణము లేదాయెఁగదా ? అప్పుడు లేనిసందేహము భీతి యూవల నెప్పు డెట్లంకురించెనో. ఒకవేళఁ గలిగె నందము. అది యెప్పుడు గలిగి యుండవలయును ? వీరభద్రవిజయ మెప్పుడు రచింపఁబడి యుండవలయును? ఆంధ్రభాగవతగ్రంథ మంతయు సాంతమైన తరువాతనా? కాక ముందా? భాగవతము పూర్ణముకాకముం దందమూ యూతరువాత నాపద్యములను సవరించియే యుండునుగాని భాగవతము నావలఁ గట్టిపెట్టి వీరభద్రవిజయము రచియించి యుండఁడుగదా ? సాంతమైనతరువాత నన్నను గోరఁ బోవుదానికి గొడ్డలి తెచ్చినట్లు పద్యములు సవరించినఁ బోవుదానికి వేఱుగ్రంథము రచింపవ లయునా ? రావుబహదర్ వారి కవులచరిత్రమువలె వ్రాఁతయు ముద్రణము సమ కాలమున నడచి భాగవతము లోకమున వ్యాపించియుండెనా ? ఆయన వ్రాసిన ప్రతియే యాయనమరణానంతరము వెలుపల వచ్చి యుండఁగా గ్రంథము లోక మున వ్యాపించి యుండుటచేఁ దనప్రతిలో సవరించికొని ప్రయోజనము లేదని వీరభద్రవిజయము వ్రాసె ననుయుక్తికిఁ బ్రమేయము లేదుగదా ? అటు గాదు, సింగభూపాలుఁడు భాగవతపుస్తకమును బూడ్పించియుండుటచే దానిలో సవరిం పవలను పడ లేదందురేని యంతటిపుస్తకము పోయినదుఃఖములో మునిఁగియుం డువాని కీయల్పగ్రంథము వ్రాయ మనశ్శాంతియైనఁ గలిగియుండునా ? అప్పు డిట్టి చోట నిట్టిపద్యమువ్రాసితి నని మనస్సునకైన స్ఫురించియుండునా? స్ఫురించినచో గ్రంథముతోపాటు పద్యములు పోయినవని యూరకుండక మరలఁ గవిత్వము చెప్పియుండునా ? ఇవన్నియు నసంభవములు.

సర్వజ్ఞసింగమనాయఁడు భాగవతమును బూడ్పించె ననుమాట విశ్వాస పాత్రము కాదని నాయభిప్రాయము. ఏలయందురా? అంతటిగొప్పవిద్వాంసుఁడు ప్రభువు సత్ప్రభు వని పేరుపొందినవాఁడు దుష్టుఁ డని పేరొందనివాఁడు భాగవతమువంటిగ్రంథమును నల్పకారణముచేఁ బూడ్పించె ననుట నమ్మఁదగినది కాదు. భాగవతము తనపేర నుండవలయు ననుసంకల్ప మాయన కుండినచో దానిని దానే రచించియో రచియింపించియో వేలకొలఁది ప్రతులు సిద్ధము చేయించి పోతనభాగవతము మూలయింటనుండఁగనే లోకమున వ్యాపింపఁజేసి యుండును. ఇది యొకయోజన.

రెండవయోజన :—సింగమనాయఁ డాగ్రంథమును బూడ్పించుటకు నాగ్రంథ మాయన కెట్లు లభ్యపడెను? ఆయనను దూషించి ద్వేషించినపోతన యాయనయొద్దకుఁ దనగ్రంథమును దీసికొనిపోయియుండఁడుకదా? ఆయన యోరుగంటికిఁ బోతన యుండునింటికిఁ బోయి బలాత్కారముగ గుంజుకొని తెచ్చి పూడ్పించె నందమా. అప్పు డోరుగల్లు తురకలస్వాధీనములో నుండెను. తురకలు హిందువులు బద్ధవైరులై యుండిరి. అట్టిస్థితిలో నచ్చటి కాయన పోయియేయుండిన వా రాయనను మరల నింటికి రానిచ్చియుందురా? అంతియగాక తమరాష్ట్రములోని యొకని నందు సుప్రసిద్ధకవిని మఱియొకఁడు వచ్చి (యందుశత్రువు) బాధించుచుండిన నాప్రభు వూరక చూచుచుండునా? మనయింటిలోనైన మన మట్టికార్యము సహింతుమా? (ఈవాదమే యొంటిమిట్టవిషయమందును నన్వయించును.) కావున సింగమనాయఁ డాగ్రంథమును గనులనైనఁ జూచియుండఁడు. ఇఁకఁ బూడ్పించు టెట్లు? కవి ప్రసిద్ధుఁడుకావున నతనిగ్రంథము తనకిమ్మని సింగమనాయఁడు చెప్పిపంపియుండవచ్చును. పోతన నిరాకరించియుండవచ్చును. ఇది యెఱిఁగినలోక మాంధ్రదేశదౌర్భాగ్యముచేఁ గారణాంతరమున నాగ్రంథము శిథిలముకాఁగాఁ గాకతాళీయముగ దోషము సింగమనేనియం దారోపించియుండవచ్చును.

ఒకవేళ భాగవతము సింగమనీనిచేఁ జిక్కియుండి యాయన దానిని రూపుమాప సమకట్టెనేని వెంటనే చించివైచియో తగులఁబెట్టియో ధ్వంసముచేయక యీద్రావిడప్రాణాయామ మేల చేసియుండును? ఇది కొంగనుబట్టెడి యనువుకాదా? బెదరింపునకైనచోఁ దనపెట్టెయందే పదిలపఱిచియుంచును, భూమిలోఁ బూడ్చినఁ బత్త్రములు నాశమగునని యాయన యెఱుఁగఁడా? ఆయ

నగ్రంథము నశింపుచేసిన నన్నయ్యకు వచ్చినయపఖ్యాతి బ్రహ్మహత్య తనకు వచ్చునని తెలిసియుండఁడా ? ఆయన భార్యకలలో గోచరించినసీతాదేవి నగ్రంథము నాశమగువఱకు నేల కాచియుండెనో. ఇది మూఁడవయోజన.

ఇత్యాదికారణములచే భాగవతము తత్కాలములో శిథిలమయ్యె ననుమాట నమ్మరాదు. శిథిలమే కాకుండినచోఁ బ్రస్తావపద్యములు దుష్టములని యాయనకుఁ దోఁచియేయుండిన సవరించుకొన నేయాక్షేప ముండదు. తొలుత నాయన వ్రాసియేయుండఁడు.

పోతన జీవితకాలములో భాగవతము శిథిలము కాలేదని నీవే యంగీకరించితివికదా ? దానివలన నాయనకు మనోవ్యాకులతకుఁ గారణము లేదాయెఁగదా ? కావున స్థిరచిత్తుఁడయియే వీరభద్రవిజయము రచియించెనని యేలచెప్పరాదని రావుబహదర్‌వా రాక్షేపింతురుకాఁబోలు. పోతనామాత్యునకుఁ బాపభీతియే లేదని నావాదము కావున నీప్రశ్న కవకాశమే లేదని నాప్రత్యుత్తరము.

2. "అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మానహీనుఁడు మర్యాద లేనివాఁడు" అని వ్రాసినదానికై వగచి తద్దోషపరిహారార్థము వేఱొకగ్రంథము రచియించియుండినచో నీపోతనామాత్యుఁడే

సీ. "మాసరివాఁడవా మాపాపఁ గొనిపోవ, నేపాటిగలవాఁడ వేదివంశ
మెందు జన్మించితి వెక్కడఁ బెరిగితి వెయ్యది నడవడి యెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు మర్యాదలును లేవు మాయ గైకొనిగాని మలయరావు
నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు వసుధేశుఁడవు గావు వావి లేదు"

అని రుక్మిణీపరిణయంబున వ్రాసెఁగదా. ఇందు విష్ణుదూషణము చేసినదోషము పోవ నేగ్రంథము రచించెనో యేమిప్రాయశ్చిత్తము పెట్టుకొనెనో రావుబహదర్ వారు దయయుంచి తెలిపెదరా ?

3. "శివాద్వైతవినుతాఖండపాండిత్యుం డగుమడిగొండబ్రహ్మయలింగారాధ్యరచిత" శివరహస్యఖండమున దక్షకాండమున నీదక్షవాక్యంబులు గానవచ్చుచున్నవి.

"వంచకుండును క్రూరుం డని యెంచక తోడితెచ్చి వియచ్చరులు చూడఁ గూఁతు నిచ్చి వివాహం బొనర్చిన నీతిరుగాఁ బెండ్లికూఁతుపాణిగ్రహణంబు చేసి యశోవిహీనుండై శుభాగారంబుఁ బాసి చనెఁ దల్లిదండ్రులం గానక శ్మశాననిలయుండై యపావనుండు గావున నిట్లొప్పె నిప్పుడమిని ధూర్తుఁడై నృత్యకృ

త్యంబున వర్తిల్లినన్ శుభకర్మంబున దుర్మార్గుండై చక్కఁబోవునే యకటా మహామాయకుం డనిదూషించుచు దక్షుండు.........మఱియును వేదంబుల రుద్రమహిమానువాదంబులు వినవచ్చిన ననుమోదింపవల్వ దనత్యంబు లాశ్చర్యైఘంబులు గాల్పనే తత్తదామ్నాయంబులు విడువుఁడు. రుద్రుండు క్రూరచేతసుఁడునుం గావున నీచుండు"

సంస్కృతశివరహస్యఖండకర్త య్యేప్రాయశ్చిత్తము పెట్టుకొనెనో తెనిఁగించిన యారాధ్యుఁడు మరల నేగ్రంథము వ్రాసెనో రావుబహదర్ వారు దెలుపఁ బ్రార్థితులు.

4. భాగవతమున శివనింద చేయఁబడెననికదా పోతన వీరభద్రవిజయము వ్రాసెనని రావుబహదర్ వారు చెప్పెదరు మంచిది. ఈగ్రంథమున తరలము. "పరమసంతస మాదినాథులు భాగ్యవంతులు శ్రీయుతుల్

వరుసఁ దల్లియుఁ దండ్రియుం గలవార లిచ్చ మహావ్రతుల్
ధరణిలోఁ గులగోత్రవంతులు తజ్ఞు లెందుఁ దలంపఁగన్
దరుణి యిన్నియు నేల నీపతితల్లిదండ్రులఁ జూపుమా."

నిట్లు దక్షుఁడు శివునకుఁ దల్లితండ్రులు లే రని దూషించెఁగదా. తల్లిదండ్రులు లేరన్నతిట్టునకు నేమియర్థము? ఉండి మరణించినా రనిన దూషణము కానేరదు. స్వయంభువు అనిన నింద కానేరదు.

ఆది తెలియరానిది యనాది యిన్నట్లు వ్యుత్పత్తి చెప్పెదరేని తెలియ రానితల్లిదండ్రులు గలవాఁడనికదా యగును. అట్టివా రెవరో మీరే యూహింపుఁడు. భాగవతముఁ గాదని వీరభద్రవిజయము వ్రాసినాఁడనుట అమ్మను దిట్టెద వేమిరా లంజకొడుకా యున్నట్టు లుండలేదా?

5. ఆర్యులారా! యొకపాపము చేసి దానికై పశ్చాత్తప్తుఁడై వగచువాఁడు "నే నీపాపము చేసితిని. ఏప్రాయశ్చిత్తముచే నీపాపము దొలఁగు" నని కదా యాలోచించును. అట్టులే వీరభద్రవిజయగ్రంథకర్తయు నేను భాగవతమున శివనింద చేసితిని. ఆపాపము పోవ నేకృతి రచియింతునని కదా తొలుత దలఁచియుండవలెను ఆగ్రంథమునం దట్టివిచార మేదియుఁ గానరాదు.

సీ. ఏపుణ్యకథఁ జెప్పి యీభూమితలములోఁ బాపసంచయ మెల్లఁ బాయవచ్చు
నేపుణ్యకథ చెప్పి యితరులు పొగడఁగఁ గోటిపుణ్యంబులు గూర్పవచ్చు
నేపుణ్యకథ చెప్పి యితరలోకంబులోఁ బరమకల్యాణంబుఁ బడయవచ్చు

నేపుణ్యకథ చెప్పి యింద్రాదిసురలచేఁ బూలుపార సత్పూజఁ బొందవచ్చు
ఆ. నెట్టికథ రచించి యెవ్వరు నెఱుఁగని, యీశు నాదిదేవు నెఱుఁగవచ్చు
నేమికథ యొనర్చి యిలలోన సత్కీర్తిఁ, దనరవచ్చు నంచుఁ దలఁచితలఁచి.
వ. తదీయవిచారచిత్తుండనై తత్కథారంభం బూహించుచున్నసమయంబున"

అని వీరభద్రవిజయమునఁ గానవయ్యెడి. వాస్తవముగ భాగవతగ్రంథ కర్తకుఁ బాపభీతియే తోఁచి ప్రాయశ్చిత్తముగ వీరభద్రవిజయము వ్రాయఁదలంపు గలదేని యిట్లు డోలాయమానమానసుఁ డగుటకుఁ గారణమే కలుగదు. కావునఁ బాలపర్తి నాగేశ్వరశాస్త్రులవారు చెప్పినట్లు భాగవతప్రబంధమనుపద్యము ప్రక్షిప్తమై యుండవలయు.

6. అంతియకాదు భాగవతంబున శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై యని సంకల్పించి

"రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగుసేయుము నీకు భవబంధంబు తెగునని" భగవంతునిచే దత్తాభయుఁడై
కం. పలికెడిది భాగవత మఁట, పలికించెడివాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁట"యని నిశ్చయజ్ఞానముగలిగి "జననంబుగా సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్" అని యుపక్రమించినకవికి "సురలచే సత్పూజఁ బొందవచ్చు, నిలలోనసత్కీర్తిఁ దనరవచ్చు" నని క్షుద్రాశయములు పుట్టునా?

7. భాగవతమునఁ జెప్పినది సరిగాదని శివునిమాహాత్మ్యమే చెప్పఁబూనినచో వీరభద్రవిజయమువంటియల్పగ్రంథమా పోతనవ్రాయును. భాగవతమును మించినగ్రంథము వ్రాసియుండును. అందైనను శివునిమాహాత్మ్యము సాధారణముగఁ జెప్పెనుగాని భాగవతమందుఁ జెప్పినంతమాత్రమైనఁ జెప్పినవాఁడు గాఁడు. భాగవతంబున దాక్షాయణీవాక్యంబులు

వ. "అదియునుంగాక దేవతల కాకాశగమనంబును మనుష్యులకు భూతలగమనంబును స్వాభావికంబులయినట్లు ప్రవృత్తినివృత్తిలక్షణకర్మంబులు రాగవైరాగ్యాధికారంబులుగా వేదంబులు విధించుటంజేసి రాగయుక్తులై కర్మతంత్రు లయినసంసారులకును వైరాగ్యయుక్తులయి యాత్మారాము లైనయోగిజనులకును విధినిషేధరూపంబు లయినవైదికకర్మంబులు గలుగుటయు లేకుండుటయు నైజంబు లగుటంజేసి స్వధర్మనిష్ఠుం డగువాని నిందింపంజన దాయుభయకర్మశూన్యుండు బ్రహ్మభూతుండు నయిననసదాశివునిఁ గ్రియాశూన్యుం డని నిందించుట పాపంబగుఁ దండ్రీ సంకల్పమాత్రప్రభవంబు లగుటంజేసి మహాయోగి

జనసేవ్యంబు లయినయ స్మదీయంబు లగునణిమాద్యష్టైశ్వర్యంబులు నీకు సంభవింపవు. భవదీయంబు లగునైశ్వర్యంబులు ధూమమార్గప్రవృత్తులై యాగాన్నభోక్త లైనవారిచేత యజ్ఞశాలయందె చాలనుతింపంబడియుండుఁ గాన నీవు నంబున నేనధికసంపన్నుండ ననియుఁ జటాభస్మాస్థిధారణుం డైనరుద్రుండు దరిద్రుం డనియు గర్వింపంజన దని వెండియు నిట్లనియె." ఇవిగాక పీనికిముం దుండు పద్యములను బఠింప మిమ్ముఁ బ్రార్థించెదను. ఇంతమాత్రము శివతత్త్వము వీరభద్రవిజయమున వెల్లడింపఁబడినదేమో చూడుఁడు.

ఈకారణములచే మీఁదిపద్యములు మనపోతనామాత్యుఁడే వ్రాసియుండినను గృత్యము నిర్వహించెనేకాని ద్వేషబుద్ధిచే శివనింద చేయలేదనియు నాకారణముచేఁ బ్రాయశ్చిత్తము పెట్టుకొనవలసిన కారణము కలుగలేదనియు రూఢిపడెను.

8. "భాగవతప్రబంధ మతిభాసురతన్" అనుపద్యమువలన వీరభద్రవిజయరచనకు ముందుగదా భాగవతము రచించియుండవలసినట్లు లేర్పడుచున్నది. దీనినేకదా రావుబహదర్‌వా రంగీకరించిరి.వీరభద్రవిజయరచనకాలమునాఁటికిఁ దాను బాలుఁడనియు సంస్కారహీనుఁ డనియుఁ గవి దానే చెప్పుకొని యున్నాఁడు. రావుబహదర్‌వారు చెప్పకుండినను గ్రంథమిట్లు చెప్పుచున్నది.

ఆ. "పిన్నవాఁడ ననియుఁ బెక్కుసంస్కృతులను,విననివాఁడ ననియు వెఱపుమాని
మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైనఁ, గవిత చెప్ప లావు గలదు నీకు."

ఆర్యులారా! ౨౦-౨౨సంవత్సరములకుఁ బైపడిన 'నూనూఁగుమీసాలనూత్నయౌవనము' ప్రాయమువాఁడు పిన్నవాఁడు కాఁజాలఁడుకదా. అనేకవిధసంస్కారసామర్థ్యముల వెల్లడించునాంధ్రభాగవతము సంస్కారహీనునిచే వ్రాయఁబడినదని యెట్టిజడుఁడును జెప్పసాహసింపఁడుకదా. సంస్కృతభాగవతమందు భాషాకాఠిన్యము మెండు. అనేకస్థలములతత్త్వము దురవగాహము. అట్టిదానిని సుబోధముగఁ జేసికొని యుభయభాషాప్రావీణ్యము కేవలస్వయంకృషిచే సంపాదించి

కం. కొందఱకుఁ దెనుఁగుగుణమగుఁ,గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండున్
గొందఱకు గుణము లగు నే, నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్

అని ప్రతిజ్ఞవచించి వచించినంతనిర్వహించి యసమానముగ గ్రంథము రచించినవానికి మఱియొకఁడు వచ్చి "వెఱపుమాని మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైనఁ గవిత చెప్ప లావు గలదు నీకు" అని వీఁపుదట్టి ధైర్యము చెప్పవలయునా? ఇంత

కంటెఁ బరిహాస్యము వేఱొండుండునా? ఇది తాతకు దగ్గనేర్పినట్లు కాదా? కావున నీపద్యము వీరభద్రవిజయకవియందు సార్థకముగ నన్వయించునుగాని భాగవతగ్రంథకర్తయం దన్వయింపదు.

9. మఱియొకవిధముగఁ జూతము. ౨౦-౨౨ సంవత్సరముల పిన్నవయస్సున వీరభద్రవిజయము రచించియుండిన ౧౯-౨౦ సంవత్సరముల నాఁటికైన భాగవతరచన పూర్తియై యుండవలయునుగదా. భాగవతము ముగించుటకు ౫-౬ సంవత్సరములు పట్టినదనుకొన్నను ౧౪-౧౫-వయేఁట భాగవతరచన ప్రారంభమై యుండవలయునుగదా. ఇది యీప్రాయపుఁగుమారునిచే వ్రాయఁబడిన దనుమాట మీరు నమ్ముదురా? పోతరాజో యుదరపోషణమునకై దేవురులాడుచుఁ గృషియందుఁ గాలముగడుపుచు విరామకాలములోఁ దనంతదాను జదువుకొని యుభయభాషాప్రావీణ్యము సంపాదించినవాఁడు. ఇట్లింతవిద్య సంపాదింప నెంతకాలము పట్టియుండునో యాలోచింపుఁడు వీరభద్రవిజయము వ్రాసినప్పటికే యుభయభాషాలక్షణజ్ఞానహీనతచే నధమకవిత్వ మలవడినపుడు తత్పూర్వగ్రంథ మగుభాగవతమున మఱియెన్నిదోషము లుండవలయునో మీరే యాలోచింపుఁడు.

౧౪ యేండ్లప్రాయమునాఁటికే "శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై" యని కృతిప్రారంభించునంత భక్తివైరాగ్యములు గలవాఁడు సింగభూపాలుని నేప్రాయమున దర్శించియుండవలయును?

"కర్ణాటరాజులచేత నెప్పుడయిన నవమానితుఁ డయి పోతన్న రాజుల ద్వేషించువాఁడయియు నుండవచ్చును" అనియు రావుబహాదర్ వారు వ్రాసిరిగదా. ఈసంచారమునకు ౪-౫యేండ్లు పట్టినదనుకొన్నను తొమ్మిదవయేఁటనో పదియవయేఁటనో భోగినీదండకమును జెప్పియుండవలయును భోగినీదండక మాప్రాయమునఁ జెప్పఁబడినదని మీరు విశ్వసింతురా? ఇంతవిద్య యాంతటియల్పవయస్సులోఁ గడించె ననిన మీరు నమ్ముదురా?

10. మఱియొకవిధముగ నాలోచింతము.

"సింగమనాయని దర్శించుటకయి యౌవనారంభదశలోఁ బోయియుండును" అని రావుబహాదర్ వారు వ్రాసిరి. ఈదశ యేదో మన మూహింపవలసిన పని పెట్టక వారే "ఇతఁ డీదండకమును ౧౪౩౦-వ సంవత్సరప్రాంతమున నిరువదియైదేండ్ల లోపలివయస్సులోఁ జేసియున్నట్టు కనఁబడుచున్నది." అని వ్రాసిరి.

భోగినీదండకము ౧౩-వ యేట రచించె ననుకొనినయెడల భాగవత మెప్పుడు రచించి యుండవలయును? రావుబహదర్ వారియూహాప్రకారము కర్ణాటరాజుల సభలఁ దిరిగి భగ్నాశుఁడై యిల్లుచేరునప్పటికి ౨౮-౩౦వ సంవత్సర మైననయి యుండునుగదా? తరువాత భాగవతము పూర్తియగునప్పటికి ౩౮-౩౯ సంవత్సరములప్రాయమైన నయియుండునుగదా. ఈవయస్సువాఁడు "పిన్నవాఁడు" అని చెప్ప రావుబహదర్ వారు సాహసింతురా? భాగవతరచనకాలమునకే యాయనకు సహాయుఁడై మడక దున్నుకొడుకు నున్నట్టు లంగీకరించి యున్నారుగదా? "బ్రాహ్మణునేద్యంబు బాలవైద్యం"బన్నట్టు బ్రాహ్మణునకు మడకచాలు చక్కఁగ దున్నుటకు ౧౮-౨౦ యేండ్లకులోపల సాధ్యపడునా? ౧౬ యేండ్లకు లోపడిన కాఁపుబాలురే చక్కఁగదున్నలేరు. ౧౮ యేండ్లకొడుకునకు ౩౮ యేండ్లు గలతండ్రి యుండఁడా? అథమపక్షమున ౨౦ యేండ్లుగలకొడుకును గలతాను బిన్నవాఁడనని పోతన వ్రాసికొనెననుట రావుబహదర్వా రంగీకరించుటే యచ్చెరువుగొలుపుచున్నది. పంతులవారివ్రాఁతనుబట్టి పరిశీలింప నిట్టిపర్యవసాన మేర్పడుచున్నది. దీనిని లోకు లెంతవఱ కంగీరింతురో చూడవలయును.

11. "భాగవతమునకుఁ దరువాత రచియించినవీరభద్రవిజయమందుఁగూడఁ గొన్నిదోషములు కనుపట్టుచుండుటచేత పోతనకృతభాగవతమందును గొన్ని దోషము లున్నవని యొప్పుకొనుటే న్యాయము" అని రావుబహదర్వారు తీర్పుదిద్దిరిగాని వీరభద్రవిజయమందుఁ గానవచ్చునట్టి దోషములవంటివి భాగవతమందుఁ గలవా యని వారిని బ్రశ్నించుచున్నాను. గ్రంథవిస్తరభీతిచే వీరభద్రవిజయమందలి కొన్నిదోషములుమాత్రము కనఁబఱచుచున్నాను. ఉదాహృతపద్యములందుఁ గొన్నిగాననగు.

౧-వఆశ్వాసము.

అవనిరెండవశౌరదై

బ్రాహ్మణులుత్తమబ్రాహ్మఁడనఁగ

పిల్తుదివిజులనందఱిఁ వెలిబెట్టుదిప్పుడుభర్గునిఁ

వనజగంధి

ఎక్కుగుఱ్ఱములేదుమొద్దుగాని

పరమపంటిగాఁడు

కుండలీలోకము

నీకాంతవై ననిజముగ(నీవుకాంతవైనననుటకు)

ఇదిమహాద్భుతంబు యిందువదన

కానక కన్నకూఁతురుఁ

రాజధవళాయము (ధవళాలయమనుటకు)

పాలిభులనుమీఁదిపయ్యెద వీడంగ.(పాలిండ్లనుటకురూపాంతరము)

మేనకవుడు

విశాలసాలలో।చనవరగంధసారఘనసారయుదుంబరచూతకేతకీ.

ఉవిదారత్నము

యోగిహృద్ధ్యాంతవర్తి

౨-వ ఆశ్వాసము.

భేకములమూఁకలను వీఁకగనియూదర్వీకములు(దర్వీకరములనుటకు)

చాలఁడు సిద్ధమీపలుకు సర్వియుపాయములందు భావజుఁ

అనంతరాజ్యసిరి గొల్వుండెఁ

పోలదు నీరాక వినుము పొసఁగదయిల్లాం డ్రేలా

కరణినుండె దివిజకాంతలెల్ల

భూరికీర్తకైవారనిజగుణాలంకారుండు(కైవారశబ్దము సంస్కృత మనితలఁచిన వాఁడు శ్రీనాథుఁడు, ఆయన ననుసరించిన వాఁ డితఁడు. దీనివలన నితఁడు శ్రీనాథునకుఁబిదపటివాఁడు.)

చంద్రనజంబీరకదంబరంభఫలినీదాడిమమందార.

శారీశుఁ డనియెడిగంభీవార్ధిలోఁ నరగి మన్మథకలం బవిసె నేఁడు.

ఎఱుఁగుదు మంచుఁ జెప్పాటలు యెంతయు తథ్యము.

వీరమూకళత్ర విష్ణుపుత్ర

శంకరజోగితెచ్చి సమసారనివాసునిఁ జేయుకున్నచో (సంసారమనుటకు)

కమలాక్షులు చెలులు దన్ను గారత సేయఁ

ఇదేలనో

మెడగరళుకరుణ

ధృతిమైనుత్తమకన్యయంద్రదు మృగనేత్రింగన్న

అలరుసాయకవైరి

దండప్పుండరీకతనుకళాసములు

గారితపసి వేషధారియయ్యె.
కరుణతోయరాశి.
తండ్రికొండలరాజుయీ మొల్లగంధికి
ఎంతసిద్ధముగామ్యు మొల్లడు యేలయీయడియాస
ఖే, చరగతినొప్పువాడసమసారవుఖము.
ఒండొరసుందరాంబువులనోలిమునింగియు
లక్ష్మీనాథాదులనైన
సన్నిధివైతివి యేమిపుణ్యమో

3-వ ఆశ్వాసము.

భోగరాయడు
సప్తసంద్రములు
సకలమైనవారు
మహామూకలు-మహాలెక్కలు
క్రోటికాలరిపంక్తిచేత
దిగ్భకుంభముల్
జగతీశాయనమోనమోనమసుధాసంకాశితాంగాయ.
నన్నుగాన లేవుయిట్టినీకు
మహాగ్రవేగ్రై
నెఱజాణునిజూడగరండుయుండు (ఇట్టివి పెక్కులుగలవు)
కలకలలో సమూహములో కాఱుమెఱుంగులో కాముగీములో
ఒకతొకర్త
వచ్చితివి యేమికార్యము
వీరభద్రుండలంతలబోనేరడుసైపనేరడువృధా
కామధ్వంసుడు సర్వతంత్రములకుం గర్తారుడంచున్
పయోరుహాయ యోంకారమయాయ-నాగభూషితభూషణా శరణాగతాజ
నపోషణా
శంఖధనుస్సుచక్రధరులన్
మాంసకుప్పలైనమాంసములును
శివద్రోహగండా

ఇదిసరస్వతిముక్కు- యిదివక్షుతుండంబు

గీ. ఓంనమశ్శివాయ ఓంకారరూపాయ.

మానిత్యము(మానితమనుటకు)

పంకితనితాంతపులకాంకితయురస్థల..........పంకజదళాక్షా

యమదండనారసజముదాళిశక్తిప్రముఖ-దివ్యదివ్యాయుధ

ఇవన్నియు సాధువులని రావుబహదర్‌వారు సాధించిరేని సాధింపనిండు నేను వలదననుగాని యిట్టిప్రయోగములు భాగవతమందుఁ గలవా యనియే నాదుప్రశ్న. ఇట్టిదోషము లింకనిన్ని యున్నవి. విస్తరభీతి వదలితిని. ఆగ్రంథము పఠించువారి కవి గోచరింపఁగలవు.

మీఁద వ్రాసినవి రావుబహదర్‌వారికిఁ దెలియనివి యని నేను జెప్పసాహసింపను. తెలిసితెలిసి యొక రాక్షేపించినపిమ్మట సవరించుకొనుట మానహానియను నభిమానముచే మట్టిమెద్దైన నాయెద్దే గెలువవలయు నని తమపిడివాదము మానరైరని తలఁచెదను.

12. వీరభద్రవిజయగ్రంథకర్తయు భాగవతగ్రంథకర్తయు నొక్కరా యనువాద మున్నట్టే నన్నయభట్టీయము చాముండికావిలాస మనుగ్రంథముల వ్రాసిననన్నయభట్టు భారతమువ్రాసిననన్నయభట్టు వేఱువేఱా యొక్కరా యనువాదము జరగుచుండుట మీ రెఱిఁగియేయున్నారు. నన్నయభట్టీయచాముండికావిలాసగ్రంథకర్త భారతకవి యగునన్నయ కాఁడని రావుబహదర్‌వారియభిప్రాయము. దానిని స్థాపింప వా రాగ్రంథములు నన్నయ్యభట్టారకచరిత్రమందు విమర్శించిరి. వాని నెట్లు విమర్శించిరో వీరభద్రవిజయ మెట్లు విమర్శించిరో చూచితిరేని వారివిమర్శనమందలి చిత్రమును మీ రెఱుఁగఁగలరు. వా రా రెండుగ్రంథముల నేవిధముగవిమర్శించిరో తెలుపుచు నట్లు నేను వీరభద్రవిజయము విమర్శించెదను. పర్యవసాన మెట్లుండునో చూడుఁడు.

బాలసరస్వతి వ్యాఖ్యానముచేసినట్లు నన్నయభట్టీయపీఠికలోఁ "దెలుఁగువ్యాకరణంబు నాకొనఁగె" నని యుండ "తెలుఁగువ్యాకరణ మనుచో మొదటి దేగణము? గువర్ణ మెట్లు గురువగును?" అని మఱికొన్ని యాక్షేపించిరి. వీరభద్రవిజయమందలి కొన్నిఛందోభంగముల వ్రాయుచున్నాను.

మ. ముని నిర్నిద్రదయాత్ముఁడున్ మహితుఁడున్ మార్తాండతేజుండు.

మ. కొండికకుం డమ్ముని నమ్మనీంద్రపరుఁడై యుద్ధాత్రిఁ గీర్తింపఁగన్.

తరళము. పిల్తుదివిజుల నందఱన్ వెలి బెట్టు దిప్పుడు భర్గునిన్
వెలయ నిశ్చయమిట్టదంచు గణప్రాసభంగము

కం. కలకంఠ మిమ్ముఁ బిలువక,
తెలివించుక లేక మిమ్ముఁ దెలియక దక్షుం
డలిమలి యాగము చేయుచు
మెఱయుచునున్నాఁడు రాజమిహిరాధ్యక్షా.

మత్త. జగన్। గాలిగాఁ గలకంఠినిల్చెఁ గొలంకుభంగిఁ దలంకుచున్

సీ. హరిరాజసమమధ్య లంకించి వాలార్పఁ గరికుంభకుచలు పరాకుదెల్ప

శా. నాపిన్నచెల్లెండ్రం బిల్చియు నీవుపిల్వవు మదీయాధీశు

గీ. యిదియేమి తా నంపిలిని దక్షునింటికి

గీ. అనుచు హిమవంతు నాలోకనమ్ముచేసి

గీ. భూతినుదుటనుద్రిపుండ్ర మొప్ప
లోకములెల్లం బరిమార్చినట్టివెఱపుం దర్పంబు
అమరగంధర్వయక్షరాక్షసపిశాచ

లయగ్రాహి. తుమ్మెదలు పెక్కుమురిపెమ్ముల వెసన్మసరి ఝుమ్మురని పద్మముల

సీ. పుణ్యజనులచేత బృందారకాప్సరో గంధర్వకిన్నరగణముచేత [నమ్మహారభటిన్

మ. కలలోనైనను నొప్పనంటి భవు డాయన్ వద్దువద్దంటి

గీ. ఒనర గోడవ్రాసినట్టిరూపంబును
యేరూపములందునాదరింపుఁడునన్నున్.

సీ. కడిమిపై మూఁడులోకముల నేలెడివాని నొడలెల్ల గన్నులై వెలయువాని

సీ. ముకురంబునందున మృదువులేదు

సీ. మృడునకుఁగేలెత్తి మ్రొక్కువారు

ఆ. బహురత్నచయములఁ బడసిపోవఁగవైచి పట్టుపుట్టంబులు గట్టనిల్చి
పేరటాండ్రుచూడ గౌరిసమారిఁగై, సేయఁ దలఁచి గడఁగి చెలువుమిగుల
(సీసగీతమిశ్రము)

శా. కన్యాదానముచేసెఁ బర్వతుఁడు గంగామౌళికిన్ లగ్నమౌ
సన్నంబైన సురేంద్రమంత్రి గణఁకన్ సర్వప్రయత్నంబులన్
జెన్నారన్ సుముహూర్తమన్నఁ దెరవాసెన్ మ్రోసె వాద్యంబు ల
న్యోన్యాలోకన మయ్యె దంపతులకున్ మోహానురాగంబునన్

కం. భావజసంహారమహేశ, భావా - (వేసిని జగణము)
శా. కాలాంభోధరదీప్తి మెచ్చక భుజంగశృంగసంకాశమై
గీ. తామపాలించు నట్టిలోకముల విడిచి
కం. భావించి జగములన్నియుఁ, గావింపఁగ వానినన్ని ఖండింపఁగ బ్ర
హ్మావిష్ణుమహేశ్వరులన
కం. నాకుం దోఁచినవిధమున, నీకథఁ గైకొంటిఁగాక నీలగ్రీవా
నీకథమహిమాతిశయము, వాచస్పతికైన వశమె వనజజువశమే

ప్రాసముతప్పు-క్రియ లేదు.

"తెలుఁగువ్యాకరణం" బనునది సులభముగ నవరింపఁగూడియు దానిని దోషముగఁ బరిగణించి కృతి నన్నయభట్టుది గాదని రావుబహదర్ వా రీసడించిరి గాని వీరభద్రవిజయమం దిన్నిమహాదోషము లున్నను నిది భాగవతగ్రంథకర్త రచించినదే యన జంకరైరి పైపెచ్చు దీనిలో దోషము లుండుటచే భాగవతమునందును దోషము లున్నవనుట న్యాయమంట. ఈ న్యాయ మన్యాయపంచకమును స్మరింపఁజేయుచున్నది.

**13.** చాముండికావిలాసము నన్నయ్యభట్టారకకృతము గాదని రావుబహదర్ వారు వ్రాయుచుఁ గొన్ని కారణములు చెప్పిరి. అందుఁ బ్రథమకారణము "నన్నయ్యభట్టుకాలము మొదలుకొని యించుమించుగా తిక్కనకాలమువఱకును గలకవులు తమగ్రంథమున కాదియం దొకసంస్కృతశ్లోకమును వేసి తరువాత తెలుఁగుపద్యము వేయుట యాచారమై యున్నది" అని వ్రాసి భారతములోని శ్రీవాణీగిరిజా యనుశ్లోకమును పావులూరుమల్లన శ్రీకంఠంస గుణమనుశ్లోకము కావ్యాలంకారచూడామణిలోని శ్రీవాగాస్పదయో యను శ్లోకము తిక్కననిర్వచనోత్తరరామాయణమందలి శ్రీరాస్త్రా మనుశ్లోకము నుదాహరించిరి.

నన్నయభట్టుమొదలు తిక్కనవఱకుఁ గలదని వీరు చెప్పెడియాచారము వీరు కల్పించినట్టు తోఁచుచున్నదిగాని యవిచ్ఛిన్నముగ బూర్వకవులయం దున్నట్లు గానరాదు. ఆర్యులారా! తిక్కన భారతమును నేసంస్కృతశ్లోకముతోఁ బ్రారంభించెను? ఆచార మొకగ్రంథమున కన్వయించి వేఱొకగ్రంథమున కన్వయింపదుకాఁబోలు. అది పోనిండు "ఈదశకుమారచరిత్రములో భారతాంధ్రీకరణ విషయ మేమియుఁ జెప్పఁబడి యుండకపోవుటచేతఁ దిక్కన యీగ్రంథరచనాఁ

టికి భారతము చేయనారంభించియుండఁడు" అని రావుబహదర్ వారే వ్రాసిరి. తిక్కన నిర్వచనోత్తరరామాయణము వ్రాసినట్లును కేతన చెప్పలేదు. కావునఁ బంతులవారియూహప్రకారము దశకుమారచరిత్ర యీరెండుగ్రంథములకు ముందు పుట్టినదేకదా. ఇం దేసంస్కృతశ్లోకము వ్రాయఁబడినది : అదియుఁ బోనిండు.

"విన్నకోటపెద్దన్న యిప్పటి కయిదువందల యేఁబదిసంవత్సరములక్రిందట నన(గా నెఱ్ఱాప్రెగడకంటె కొంచెము ముందుగనో యతనికాలములోనో యున్నాఁడని నిశ్చయింపవలసియున్నది." అని రావుబహదర్ వారే వ్రాసిరి. ఎఱ్ఱాప్రెగడనుగుఱించి వ్రాయుచు "ఇతఁడు తిక్కనసోమయాజితరువాత నించుమించుగా నేఁబదిసంవత్సరములకాలమున నుండినవాఁడు" అని వ్రాసిరి. అట్టియెఱ్ఱాప్రెగడతో సమకాలికుఁ డైనపెద్దన్నను దిక్కనకుఁ బూర్వునిఁగా వ్రాసి యాధారముగ గ్రహించుట యెంతసాహసము ! అదియుఁ బోనిండు.

"ఈనన్నెచోడకవి నన్నయభట్టారకునకును తిక్కనసోమయాజికిని నడిమికాలమం దున్నవాఁడు" అని రావుబహదర్ వారే వ్రాసిరి. కుమారసంభవము మొదటిశ్లోక మేదియో తెలుప వారిని బ్రార్థించెదను. నన్నయభట్టుచరిత్రము తాము వ్రాసినప్పటికిఁ గుమారసంభవమును దాము చదువలేదందురోటు. అలైనచో నొకయసత్యమును దాఁప రెం డసత్యములు వ్రాసినట్లగు.

"నన్నయభట్టారకునికిని ఎఱ్ఱాప్రెగడకు మధ్యకాలమునందు తెలుఁగుకవులేరని భ్రమింపఁగూడదు. అథర్వణాచార్యుఁడు-భీమకవి-రంగనాథుఁడు-భాస్కరుఁడు-కేతన-మారన-పెద్దన మొదలయినవా రీమధ్యకాలములో ననేకు లున్నారు" అని రావుబహదర్ వారు వ్రాసిరి. ఇందుఁ బేర్కొనఁబడినభీమకవి రంగనాథుఁడు భాస్కరుఁడు కృతిమొదల రచించినశ్లోకము లెవ్వియో రావుబహదర్ వారుదాహరింతురుగాక. ఇందఱు వ్రాయక యొకరిద్దఱు వ్రాసినంతనే యది యాచార మనఁబడునా? వారికిమనస్సు వచ్చినచోట రావుబహదర్ వారెట్టియాధారములఁ గల్పింతురో తెలిసెనుగదా.

14. రాఘవాభ్యుదయములోని దని యొకరు చెప్పిన ట్లొకపద్యము నుదాహరించి "ఈపద్యము నన్నయభట్టారకునికవిత్వమును బోలి యుండకపోవుటచేత నీతఁ డానామము గలమఱియొక యప్రౌఢకవి యైయుండవచ్చును" అని రావుబహదర్ వారభిప్రాయ మిచ్చిరి. ఒకపద్యమును జూచి గ్రంథ మంతటిమీఁద నభిప్రాయ మిచ్చిరి కదా. పోతనామాత్యభాగవతములోని పద్యములఁ బోలినపద్య

మొక్కటియైన వీరభద్రవిజయమం దున్నదా యని రావుబహదర్‌వారిని నడుగుచున్నాను. కృతియందలి రెండవపద్యమే యేగతిగా నున్నదో యన్వయించి చూడుఁడు.

చం. సిరియును వాణి గౌరియును జెన్నుగఁ గన్యను మేను వాకురఁ జె
న్నురమును నుంకు విచ్చి ముదమొప్ప వరించి జగంబు లన్నియుం
దిరములు సేయఁ బ్రోవఁ దుదిఁ దీర్పఁ బ్రియప్రయుగక్షణుండు నై
హరియెడ శంభుమూర్తియగు నాథ్యుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

ఈపద్యము భాగవతకర్తదిగా రావుబహదర్‌వారికిఁ దోఁచెఁగదా. చిత్రము.

15. “రాజనరేంద్రునిప్రీతికయి నన్నయభట్టొకవేళ భారతాంధ్రీకరణమునకు ముందు దీనిని రచియించి యుండునేమోయని యూహింపవలసియున్నను కవిత్వవిధమునుబట్టి యాలోచింపఁగా నాయూహ కవకాశము కలుగకున్నది” అని చాముండికావిలాసమునుగూర్చి వ్రాసిరి భాగవతకవిత్వమునకు వీరభద్రవిజయకవిత్వమునకుఁ బల్లెటూళ్లయావుదూడలకుఁ జెన్నపురిగడ్డిదూడలకుఁ గల పోలికయైన నున్నదా యని రావుబహదర్‌వారి నడుగుచున్నాను.

16. చాముండికావిలాసమును విమర్శించుచు రావుబహదర్‌వారు

“నన్నయ్యసీసపద్యములకంటె భిన్నవిధమైనసీసపద్యము లిందుండుట. నన్నయ్య సాధారణముగా తనసీసపద్యమును వడితో నారంభించినపక్షమునఁ దుదవళికును వడులనే పెట్టియు ప్రాసముతో (ప్రాసయతితో) నారంభించినపక్షమునఁ దుదవళికు ప్రాసమునే పెట్టియు ఉన్నాఁడు” అనివ్రాసిరి. ఈనియతి భారతమందు రావుబహదర్‌వారికిఁ గానవచ్చెనుగాని భాగవతమందుఁ గానరాలేదు గదా. ఉన్న దున్నట్టు వ్రాయవలసిన చరిత్రకారుల కీపక్షపాతబుద్ధి యేల? పోతనరచిత భాగవతమందలి సీస, గీతములయం దీనియతి కలదు.

గీతమున కుదాహరణము :—

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని,నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ, గలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు.

ఇది భాగవతమున మొదటిగీతపద్యము.

సీ. మెఱుఁగు చెంగట నున్నమేఘంబుకైవడి, నువిద చెంగట నుండ నొప్పువాఁడు
చంద్రమండలసుధాసారంబుపోలికి, ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుతతమాలవసుమతీజముభంగి, బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు

నీలనగాగ్రసన్నిహితభానునిభంగి, ఘనకిరీటము దలఁ గలుగువాఁడు
ఆ. పుండరీకయుగముఁ బోలుకన్నులవాఁడు, వెడఁదయురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁ డొక్కరుఁడు నాకన్నుఁగవకు నెదురఁగానఁబడియె.

ఇది ప్రథమసీసము. ఈ రెండుపద్యములందు యతులుమాత్రమే కానవచ్చుచున్నవి. ప్రాసయతికుదాహరణము :—

గీ. పొగలిపొగలికాలుమగువదేహంబున, నగురుపరిమళములపొగలు వెడలె
దేహకల్మషములు శ్రీహరిముఖమునఁ, ద్రావఁబడుటఁ జేసిభూవరేంద్ర.
సీ. ఊహించిరాముఁడురోహిణికొడుకంచు, నప్పుడుయోగీంద్రచెప్పితీవు
దేవకికడుపునదేవరపునరాతఁ, డుండెనుదేహంబునొండులేక
తనతండ్రియిలువాసివనజాక్షుఁడేరీతి, నందునిఁబోయెనేమందిరమున
నుండియెయ్యదిసేయుచుండెనుదనమేన, మామఁగంసునినేలనామడఁచె
గీ. నెన్నియేండ్లుమనియెనిలమీఁదమనుజుఁడై, యెందఱైరిభార్యలెట్లుమెలఁగె
మఱియునేమిసేసెమాధవచారిత్ర, మెంతగలదునాకునేర్పరింపు

దీనిలో సీసమునఁ బ్రాసయతి. గీతమున యతి.

కొన్నిగీతములందు రెండుపాదములొకరీతి మఱిరెండొకరీతి నుంటయుఁ గలదు. ఇది క్వాచిత్కము. ప్రథమస్కంధమున సీసములుగీతములు డెబ్బది యున్నవి. ఇన్నిటియందు నీనియతి గానవచ్చుచున్నది.

ద్వితీయస్కంధమున ౯౮వ పద్యమువఱకుఁ గల ౨౦ సీసగీతములందు మీఁదినియతియే కానవచ్చుచున్నది. ౯౫వ పద్యముమీఁద "ఇదిమొదలుకొని వెలిగందలనారయకవిత్వము" అని వ్రాయఁబడియున్నది అదిమొదలీనియతికానరాదు.

తృతీయస్కంధమునఁ బోతరాజకవిత్వ మితరకవిత్వము కలసినట్లు తోఁచుచున్నది. ఆవిచార మిం దనావశ్యకము.

చతుర్థస్కంధము మొదటినుండియు నీనియతి గానరాదు. సగ్రంథ మంతయు శోధింప నీనియతికి లోఁపడిన వందందుండునవి ౩౦-౩౨ పద్యము లున్నవి. ఇందును నుభయులకవిత్వము కలసినదేమో. రావుబహదర్ వారుదాహరించిన "అనయంబు లుప్తక్రియాకలాపుఁడు" అనుపద్య మీనియతికి లోఁపడినది కాకుండుటచేతను వీరభద్రవిజయగ్రంథకర్తవంటివాఁడు ప్రయోగింపఁ దగినప్రయోగము-ప్రత్యయరహిత మైనప్రవాదము ప్రవాద యనునది కానవచ్చుటచేతను "దక్షుఁడు పల్కినగర్హితవాక్యంబులు వినిందితంబు లగుంగాని యాథార్థ్యం

బున వా స్తవంబులగు " ననుదానికి సరిపోవునట్లు సీసపద్యమునందలి కొన్ని విశేషణము లుభయార్థంబుల సరిగా వ్యాఖ్యానముప్రకారము నన్వయింపకుండుట చేతను సీపద్యము పోతరాజుది కాదని తోఁచుచున్నది. కూచిమంచితిమ్మకవి మొదలు భాగవతముశోధించినవారు చతుర్థస్కంధము పోతరాజరచితము గాద నుచుండ నుదాహృతపద్యము పోతరాజుగారి దని రావుబహదర్ వారు వ్రాయుట కేమి యాధారములు దొరకెనో లోకమున కెఱింగింప వారిని నమస్కారపూర్వముగ వేఁడుచున్నాను వీరభద్రవిజయమునకు భాగవతమునకు ముడిపెట్టవలయు నని వ్రాసినవ్రాఁతయో యేదైన నాధారము కలదో లోక మెఱుంగ వేడుకపడుచున్నది. వీరికవిజీవితచరిత్ర మెంతటిప్రమాణగ్రంధమో వీరు చెప్పెడి కారణము లఁబట్టి తెలియవలసియున్నది.

తరువాత ౫-౬ స్కంధములు పోతనవి కావు. అం దీనియతి లేదు. సప్తమస్కంధమున ౬౫సీసగీతము లున్నవి. అన్నిటియం దీనియతి గానవచ్చుచున్నది. ౩౫౨వ పద్యమున రెండవపాదమున ఆనందముద్రాక్షరశాలవారిప్రతియందు “ నవియంతరోషహా×సవిజృంభితంబైన ” యని యున్నది. వావిళ్లరామస్వామి శాస్త్రులవారిప్రతియందు “ నవియంతయునురోష×హాసజృంభితమైన” యనియున్నది. ఈపారమే సాధువు. ఇందు నియతి కాపాడఁబడినది. ఈస్కంధ మంతయుఁ బోతరాజుగారిదే.

అష్టమస్కంధమున ౧౫౧సీసగీతము లున్నవి. కొన్నిటియందుఁ గేవల ప్రాసయతులు గానవచ్చుచున్నవి. అది పోతననియతికి విరుద్ధము గాదు. ఇం దైదాఱుస్థలముల నియమభంగము కానవచ్చుచున్నది. అందుఁ గొన్ని సులభముగ సవరింపఁగూడినవి. లేఖకశోధకముద్రాపకప్రమాదాదుల నైనయీయల్పదోషములు పోతననియతిని ఖండింపఁజాలినవి కావు.

నవమస్కంధమున ౧౮౬ సీసగీతము లున్నవి. ఇందు ౬-౭ స్థలముల నియమభంగము కానవయ్యెడి.

దశమస్కంధమున ౨౩౧సీసగీతములు పూర్వభాగమున నున్నవి. ఇందును ౭-౮ తప్పఁ దక్కినవి నియమభంగము లేకయున్నవి. ఉత్తరభాగమున ౨౩౮వ పద్యమువఱ కీనియతి పోషింపఁబడినది. ఆవలఁ బోతరాజుకవిత్వము గాదు. మీఁదఁ జెప్పిననియమభంగము లెట్టివో కొన్ని సూచించెదను. వానిని బట్టి తక్కినవి మీ రూహింపవచ్చును.

I ఆచంద్రసూర్యమై యమరులంకారాజ్య, మునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె.

ఇది ముద్రితపాఠము. ద్వితీయదళమున 'నణ'లకుఁ బ్రాసయతి. యతి యుండవలయును. దీనిని

ఆచంద్రసూర్యమై యమరులంకాధిరా, జ్యమున కెవ్వఁడు విభీషణుని నిలిపె.

అని యుండవలయు నని తోఁచుచున్నది.

II. నయనయుగ్మంబు లున్నతిఁ గృతార్థములుగా, నవ్వులు సూపువా రెవ్వరింక

'నెలనవ్వు చూపువా రెవ్వరింక'నని యుండవలయును.

III. గోరూప మై బ్రహ్మఁ జేరఁబోయి.

ఇది గోరూపమై బ్రహ్మఁ గూడఁ బోయియనిన నియమభంగము లేదు.

IV. ఎందేని నలువదియెనిమిదిదివసముల్, దరియింప నొకదివసంబు రేపు

ఇందు యతిభంగము వావిళ్లవారికూర్పునఁ గానవచ్చు

"చరియింప నొకదివసంబు రేపు" అనుపాఠము సాధువు

ఇట్టులే మఱికొన్ని సవరింపఁగూడినవి యున్నవి. ఇవి సవరించిన నియమభంగపాదములు తగ్గుచున్నవి. కవీతరులవలన నైనయాదోషములు కవినియమమును జెఱుపఁజాలవు. దీనివలనఁ బోతరాజునియమము సర్వత్ర కాపాడెననుట యంగీకార్యమేకదా. ఇట్టినియతి వీరభద్రవిజయమునఁ గల దనిచెప్ప రావుబహదర్ వారు సాహసింతురా? సాహసింపఁ జాలరేని యొకచోట గ్రంథకర్తలు వేఱని స్థాపింపఁజాలినకారణము వేఱొకచోటఁ జాలకుండుటెట్లు? ఈనియతి వీరభద్రవిజయమున లేదనుటకై రెండుపద్యము లుదాహరించెద.

సీ. వేదండగమనలు వింజామరలు వీవఁ, బల్లవాంఘ్రులు వేడ్క బలసికొలువ
లలితరంభోరువుల్ వెలిగొడుగులు పట్ట, సైకతజఘనలు సన్నుతింప
హరిరాజసమమధ్య లంకించి వాలార్పఁ, గరికుంభకుచలు పరాకు దెల్ప
కమలబాహులతలు కల్యాణములు పాడ, రాజనిభాస్యలు రమణఁ గొలువ
లోలమీనభృంగలోచనల్ ధమ్మిల్ల, సతులు నొంద అతులగతుల నడువ
తల్లిఁ దండ్రిఁ జెలులు దర్శింప సమ్మహా, కాళి వచ్చె యాగశాల కడకు.

సీ. కట్టంగఁ జర్మమెకాని చీరలులేవు, పూయ గంధములేదు భూతిగాని
కాలకూటమెకాని కంఠమాలిక లేదు, ఫణిరాజుతోడుగా మణులులేవు
తగ నాకసమెకాని తలవెండ్రుకలు లేవు, తలకుఁ బువ్వులు లేవు నెలయకాని
మెక్కఁ గంచము లేదు మేఁకపుఱ్ఱియకాని, మెక్క గుఱ్ఱము లేదు యెద్దుగాని

మూఁడుమూర్తులందు మొగి నెవ్వఁడును గాఁడు, జాతిలేదు పుట్టుజాడ లేదు
పరమవంటిగాఁడు బ్రహ్మాదు లెఱుఁగరు,తిరుగ జోగిఁ దగునె దేవుఁ డనఁగ.

ఈపద్యములు పంతులవా రుదాహరించిన "ఏరాదక్షు" యనుపద్యము నకు ముందే యున్నవి. ఆపద్యమువఱకైన వారీగ్రంథమును బఠించియుందురు గదా. అట్టైనచో నిందలిఁలోలమీనచభృంగలోచనల్, ధమ్మిల్లసతులు; పరమవంటి గాఁడు, ననుదివ్యప్రయోగములు భాగవతగ్రంథకర్తవని యంతఃకరణశుద్ధిగ రావు బహదర్ వారు నిశ్చయించుకొనిరా ? విధిలేదు. ఆత్మవాదరక్షణార్థము వా రవ్వ నందురు లోక మేమనునో చూడవలయును.

పూర్వగ్రంథమున నవలంబించిననియమము పరగ్రంథమున నవలంబింప వలయు ననివిధికలదా యని యెవరైన నడుగవచ్చునుగాని వారి నాప్రశ్నమే నే నడుగుదు ననుతలఁపుతో రావుబహదర్ వారుమాత్రము నన్నడుగఁజాలరు. మఱియెవరైన నన్నడిగిరేని యిట్టి దాధారముగఁ దొలుతఁ దెచ్చిన రా॥బ॥వారి నడుగుఁ డందును.

17. "భోగినీదండకము పోతనవిరచితము కాదని చెప్పుటయే మనస్సు లో నా కిష్టమైనను భాగవతకవిత్వముతో భోగినీదండకకవిత్వమును బోల్చిచూచి నపుడు నామన స్సట్లు వ్రాయ నొప్పినది కాదు" అని రావుబహదర్ వారు వ్రా సిరి. ఆరెంటితోను వీరభద్రవిజయకవిత్వమును నందలిదండకమును బోల్చి చూచి మూఁటికవిత్వము లొకరీతి నున్నట్టు వారు నిశ్చయించుకొనిరా. భోగినీ వీరభద్రవిజయదండకములలోని కొంతకొంతభాగము నిందు వ్రాయుచున్నాను. ఈసంశయము లోకమే పరిష్కరించును గాక. "కామానలజ్వాలల న్వేఁగి చింతాభరభ్రాంత మైయున్న యింతిం బరీక్షించి తన్మాత, మాయాపరాభూతజామాత, మిథ్యానయోపేత, విజ్ఞాతనానావశీకారమంత్రౌషధవ్రాత లోకైకవిఖ్యాత, వారాంగనాధ్యక్షశిక్షాధిసంఖ్యాత సమ్మోహితానేక రాజన్యసంఘాత, వాచాలతాబద్ధనానామహాభూత యేతెంచి కూఁతుం బరీక్షించి నీతిన్విచారించి బుద్ధి న్వివేకించి బాలన్ మిళత్కుంతలవ్రాతఫాలన్ గరాంభోజరాజత్కపోలన్ సమందోష్ణనిశ్వాసతాలన్ విపర్యస్తసన్న్యాసచేలన్ మహాందోళనప్రేంఖితస్వర్ణదోలన్ మృగేంద్రావలగ్నన్ దయావృష్టిమగ్నన్ మనోజాగ్నిభగ్నన్.........విలోకించి లోనం బరాయత్తయై చిత్తజాతాసిధారాచలచ్చిత్తయై విన్నయై ఖిన్నయై యున్నభావంబు భావించి నెయ్యంబుఁ గావించి బాలా జితత్వంబు మేలా విచా

రింపవేలా వినోదింపనేలా వయోధర్మముల్ రిత్తగాఁ బుచ్చ నీవృత్తికి న్నెత్తురే వత్తురే కాముకుల్ దాయఁ గాయంబు విద్యున్నికాయోపమేయంబు ప్రాయంబు ధారాధరచ్ఛాయ మెన్నేనుపాయంబులన్ విత్తమాయత్తముం జేయుమా రిక్థ వారంబు నేరంబుగా దీవిచారంబు వంశానుచారంబు సంసారసారంబు లాభాది కారంబు"......మొ॥ భోగినీదండకము.

ఇఁక వీరభద్రవిజయమందలిదండకమునఁ గొంత యెత్తివ్రాసెదను. స మాసము లన్వయించుకొనుచుఁ జదువఁ బ్రార్థించెదను.

"శ్రీవీరరూపా శివద్రోహగండా ప్రచండప్రతాపా సుపర్వాణసంఘాత మోహానుబింబప్రదీపా । మహాకోపరూపాది వీరాంకవీరా పురారాతిసంహార ఘోరావతారా శివాచారమందార బృందారకాధీశగర్వాపహారా దయాకార నాగేంద్రహారా సనందాదియోగీంద్రచేతోవిహారా జనాధార నీదివ్యతత్త్వంబు భావింపఁగాలేక గర్వాంధకారాంధు లేమైతిమో నీదురూపంబు రూపింప నజ్ఞానబంధంబులం జిక్కి వేదప్రకారంబులన్ మించి యిచ్చోటికిన్ దక్షయాగం బు వీక్షింపఁగా నిన్ను మారాక యెల్లన్ గడుం దప్పులై యుండు సైరింపవే దేవదేవా శివద్రోహులైనట్టిమమ్మున్ విజృంభించి శిక్షించి తీపింక నీదైనవై రంబు చాలింపు మోతండ్రి‡మిముంగూర్చి యేమెంత వారమ్ము"............మొ॥

18. భాగవతమునగద్యము.

శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్రకేసనమంత్రిపుత్రసహజపాండిత్యపోత నామాత్యప్రణీతము.

వీరభద్రవిజయగద్యము.

శ్రీమన్మహామహేశ్వర యివటూరిఆరాధ్యసోమనాధదేవ దివ్యశ్రీపాదపద్మా రాధక కేసనామాత్యపుత్ర పోతయ నామధేయప్రణీతము.

రెండుగద్యముల కేమైన సంబంధ మున్నదేమో పరిశీలింపుఁడు. సహ జపాండిత్య యనువిశేషణము వీరభద్రవిజయగ్రంథకర్త వేసికొనలేదు. ఏల? తనతండ్రియొద్ద విద్యాదులు నేర్చినట్టు "జనకశిక్షితవిహితాభ్యాసుండనై" యని వ్రాసికొనినాఁడు. భాగవతకవి యట్టినోము నోఁచలేదు. జనకశిక్షిత విహితవిద్యా భ్యాసుఁడనై యని తాళపత్త్రపాఠము.

"శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర" యనుభాగవతగద్యమును

‡ గణభంగము.

బట్టియు వీరభద్రవిజయమునుబట్టియు విచారించిచూడఁగా శివప్రసాదమువలన నీతనికిఁ గవిత్వ మలవడుట కవియభిప్రాయ మయినట్టు స్పష్టమగుచున్నది " అని రావుబహాదర్ వారు వ్రాసిరి.

పోతరాజు కేవల మద్వైతి; శివకేశవుల కభేదముచెప్పువాఁడు. దీనిని జేతులారంగ శివుని బూజింపఁడేని యనుపద్యమే చాటుచున్నది. ఈయనకు విష్ణుభక్తి మెండు; అయినను శివునకు నికృష్టత చెప్పినవాఁడు కాఁడు. శైవమతమునఁ బుట్టినను వీరశైవుఁడు గాఁడు. వీరశైవుఁడు విష్ణువునకుఁ బరత్వము చెప్పఁడు. పోతరాజు భాగవతమున విష్ణువునకుఁ బరత్వము చెప్పినవాఁడు. వీరశైవుఁడు తనగ్రంథము వేఱుగతిలేక వచ్చినఁదప్ప విష్ణువున కంకిత మీయఁడు. "మదీయపూర్వజన్మసహస్రసంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణకథాప్రపంచవిరచనాకుతూహలుండను " అని వ్రాయఁడు. రావుబహాదర్ వారే శ్రీనాథునిగుఱించి వ్రాయుచు " ఈకవిచేతనే రచియింపఁబడిన నందనందనచరిత్రము లోనిదన్నపద్యము నొకలక్షణగ్రంథమందుఁ జదువుటయేకాని నాకు గ్రంథము లభించినదికాదు, పేరునుబట్టిచూడఁగా శ్రీనాథుఁ డట్టిగ్రంథమును రచియించియుండునని తోఁచదు. భీమఖండాదిశైవపురాణములలోనే విష్ణుకథవచ్చినపుడు విడిచిపెట్టిన మహానుభావుఁడు కేవలకృష్ణకథ యైననందనందనచరిత్రమును రచియించియుండునా ? అని వ్రాసిరి.

ఇఁక వీరభద్రవిజయగ్రంథకర్తయో వీరశైవుఁడు. శైవవిశిష్టాద్వైతి. విష్ణువునకు నికృష్టత నారోపింప వెనుదీయువాఁడు కాఁడు, ఆరాధ్యశిష్యుఁడు ఇతఁడు నీతనివంశమువారు శైవగ్రంథములనే రచియించిరి.

భాగవతగ్రంథకర్తయందు సార్థకమైన 'కవితావిచిత్ర' విశేషణము వీరభద్రవిజయకర్త కన్వయింపదు.

శివునిప్రసాదమునఁ బోతనకుఁ గవిత్వ మలవడెననుటకు నాధార మేదియుఁ గానరాదు. శోధించిచూచినఁ 'బలికించెడివాఁడు రామభద్రుండఁట' యని చెప్పెనుగాని శివుఁడని చెప్పలేదు. మహానుభావులు రామభద్రుఁ డనునది వీరభద్రుఁ డని దిద్దెదరేమో. పోతన "శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర" యని చెప్పెను. ఈపరమేశ్వరుఁ డెవఁ డేయూరివాఁడు ? ఇవటూరివాఁడు గాఁడు. ఇవటూరిముక్తినాగేశసద్గురుభక్తి నాదిమశైవులైనట్టివారి " నని కేసనమల్లనకవులవాక్యము. " ఇవటూరిఆరాధ్య " యని వీరభద్రవిజయగ్రంథకర్త చెప్పుటచే నా

యన కన్వయించునుగాని యీమాటలు చెప్పకొనకుండుటచే భాగవతగ్రంథకర్త కన్వయింపదు. భాగవతగ్రంథకర్త యిపటూరియారాధ్యశిష్యుఁడైనచో వీరభద్రవిజయమునఁ జెప్పినట్లు భాగవతమునఁ జెప్పియుండును. గురువు నలక్ష్యపఱిచి యుండఁడు. తొలుత లేనిగురువు నడుమ నెక్కడనుండివచ్చును? ఆయనమనస్థితి, భక్తిభావన, వైరాగ్యము నాలోచించిన గద్యమునఁ జెప్పఁబడినపరమేశ్వరుఁడు "ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం, బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దాన యైనవాఁ డెవ్వఁడు" అనుపద్యములోఁ జెప్పఁబడినపరమేశ్వరుఁడే. శ్రీపరమేశ్వరశబ్దమునకు శివుఁడనియే యర్థము నిర్ధారింప నాధారమేదియో? ఈశ్వరపరమేశ్వరశబ్దములు విష్ణుపర్యాయములుగ భాగవతమునఁ బరశ్శతస్థలములందుఁగలవు. నిఘంటువులును నీశబ్దములకు విష్ణు వనునర్థ మిచ్చుచున్నవి. ద్వితీయస్కంధమున "పరుఁడై యీశ్వరుఁడై ............ తేజరిల్లుహరికిన్" 58 పద్యము. అప్పరమేశ్వరునకు నమస్కరించెద 59. ఏపరమేశుపాదయుగము. ఇవన్నియుఁ బోతనప్రయోగించినవే. ఈశ్వరసన్నిధానంబు గల్పించుకొని. రావే యీశ్వర కావవే వరద యిత్యాదులు గజేంద్రమోక్షమునఁ గలవు. పద్మపురాణంబున "శ్రీభూనీళాపతిర్యోఽసౌ వీశ్వర స్సఉదాహృతః। తస్మా త్సర్వేశ్వరత్వంతు వాసుదేవే ప్రతిష్ఠితమ్ ॥ యోఽసౌ విరాట్త్వమాపన్నో హవిర్భోక్తా జనార్దనః । సన్తర్పయతి లోకాంస్త్రీం త్సఏవ పరమేశ్వరః॥" అని యున్నది. 'పార్వతీపరమేశ్వరౌ' అన్నప్పుడుపార్వతీశబ్దసాహచర్యబలముచేఁ బరమేశ్వరశబ్దమునకు శివుఁ డని యర్థము చెప్పునట్లు శ్రీశబ్దసాహచర్యమువలన శ్రీపరమేశ్వర యనిన విష్ణువని యర్థము చెప్పఁగూడును. కవికిఁ గలవిష్ణుభక్తియు వైష్ణవగ్రంథరచనయు దీనిని బలపఱుచును. తండ్రి శివభక్తుఁడైనంతమాత్రమునఁ గొడుకు నట్లే యుండవలయునని సిద్ధాంతము లేదు. తండ్రి శివభక్తుఁడయ్యు విష్ణునామము తనకుఁ బేరుగ (కేసన్న-కేశవన్న) నుంచుకోలేదా. కావున శ్రీపరమేశ్వరశబ్దమునకు శివుఁడే యని నిర్ధారించుటకుఁ దగినయాధారము లేదు. విష్ణువని యర్థము సిద్ధాంతీకరింపఁగూడినను నేనట్లుచేయను. ఆయన యద్వైతికావున నాయనభావమునకుఁ దగినయర్థమే చెప్పెదను. కనుకనే గజేంద్రమోక్షమునుండి యుదాహరించితి.

ఆర్యులారా! నేనిట్లు చెప్పుటకుఁ గారణము లేకపోలేదు. "విద్వత్కవయః కవయః" యన్నట్లు లోకుఁడు కవి యనుప్రఖ్యాతి వహింపవలసియుండినచో నతని

యందుఁ బాండిత్యము కవితాశక్తి రాణిల్లుచుండవలయును. ఈరెండును దనకుఁ గలవనియు నవి లభించినవిధమును బోతన గద్యములో సహజపాండిత్యయనుట చేతను బరమేశ్వరకరుణాకలితకవితావిచిత్రయనుటచేతను జెప్పెను. సహజపాం డిత్యుఁడ నని చెప్పి స్వయముగఁ గృషిచేసి గ్రంథపఠనము కావించి విద్యసంపాదిం చితినిగాని "గురుశుశ్రూషయా విద్యా" యన్నట్టు గురుముఖమున విద్య సంపాదిం చినవాఁడఁ గానని తెలిపెను. దీనివలన నాయనసామర్థ్యము వెల్లడియగుచున్నది గాని లోపము తెలియఁబడుటలేదు. గురుముఖమున విద్యనేర్చినవారికవితయందు దోషములు లేనట్టుగ గురుముఖమున విద్యనేరువమి నితనికవిత్వమందు దోషము లున్నట్టు కొందఱు వ్రాయుట సరిగా నాకుఁ దోఁపదు. అప్పకవివంటిపురోభా గియు ఆ-రలకు యతిప్రాసములమైత్రికలసినదోషముతప్ప మఱియేదోషము బమ్మె రపోతరాజకృతభాగవతమున లేదని చెప్పి వీరభద్రవిజయములో దోషము లుం డుటవలన భాగవతమునందుఁగూడ దోషము లున్నవని చెప్పునట్టివంతు రావుబ హదర్ వారికి విడిచెను.

ఇఁకఁ గవిత్వమా స్వకృషివలనవచ్చునది కాదు గురువువలన లభ్యపడు నది కాదు. "పూర్వజన్మసహస్రకృతసుకృతవిశేషంబునఁ బరమేశ్వరానుగ్రహం బున" వచ్చిననే మేలు. "కవితా వనితా చైవ స్వయ మేవాగతా వరమ్" అనియు "శక్తి, ర్నిపుణతా, లోకకావ్యశాస్త్రాద్యవేక్షణాత్, కావ్యజ్ఞశిక్షయాఽభ్యాస ఇతి హేతు స్తదుద్భవే" యనియుఁ గలదుగదా ఇందు శక్తి యనఁగా దైవ దత్తప్రతిభగాని వేఱొండు గాదు. ఇది పరమేశ్వరానుగ్రహాలబ్ధమే. ఈయర్థ మును సూచించుటకే పరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర యనిచెప్పెను. "అహం కారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే" యన్నట్టు విద్యాప్రాగల్భ్యకవితాసామ ర్థ్యగర్వదూషితచిత్తుఁడుగాక యీరెండును భగవద్దత్తములే యని యాత్మనై చ్యముఁ దెలిపెను. అంతటిభక్తుఁడు వాస్తవాద్వైతి యట్లుగాక యిఁక నెట్లుచె ప్పును. రావుబహదర్ వా రూహించినట్టు శివప్రసాదమువలనఁ గవిత్వము లభిం చియుండెనేని శివరూప సగుణబ్రహ్మమును సూచించుశ్రీమదుమామహేశ్వరేత్యాది వాక్యములనే ప్రయోగించియుండును. ఈవిధముగ నాలోచించిన భాగవతగద్యము రావుబహదర్ వారియూహ కాధార మగునంతటిశక్తి కలది కాదయ్యెఁగదా.

ఇఁక వీరభద్రవిజయగద్యమును బరిశీలించిన నందును శివప్రసాదమువలనఁ గవిత్వము లబ్ధమైనట్లు సూచించుపదజాల మేదియుఁ గానరాదు. "వీరభద్రవి

జయమునుబట్టి " యని నేను వ్రాసితినిగాని వీరభద్రవిజయగద్యమును బట్టి యని నేను వ్రాయలేదని రావుబహదర్ వా రందురేని వారివాక్యమున కాధారమైన గ్రంథస్థవాక్య మేదియో చెప్ప వారిని బ్రార్థించెదను

గీ. వెలయ మఱియుఁ గల్గువీరమాహేశ్వరా, చారవరుల వీరసత్యవ్రతుల
 వీరసచ్చరితుల వీరవిక్రములను, బరఁగ మ్రొక్కి తలఁచి భక్తితోడ.

 వ. "తత్ప్రసాదకరుణావిశేషప్రవర్ధమానకవితామహత్త్వసంపన్నుండనై " యని యొకచోనున్నది.

వేఱొకచోట " మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైనఁ గవితచెప్ప లావు గలదు నీకు " అనియున్నది.

మఱియొకచోట "వీరభద్రప్రసాదలబ్ధకవితాతిశయంబున" నని యున్నది.

ఇప్పటికి మూఁడుప్రసాదము లయినవి. వీనిలో రావుబహదర్ వారిశివప్రసాదము శివప్రసాదముగానే యున్నది.

కావున నుభయమునకు నైకమత్యము స్థాపింపనెంచిన రావుబహదర్ వారి ప్రయత్నము విఫలమయ్యెను.

" ఇది శ్రీసకలభాషావాగనుశాసన శ్రీనన్నయభట్టవిరచితంబైన చాముండికావిలాసంబునందుఁ బ్రథమాశ్వాస " మనియు " ఇది సకలసుకవిజనశ్రేష్ఠ నన్నయభట్టవిరచితంబైన చాముండికావిలాసం బనుమహాప్రబంధమునందు ద్వితీయాశ్వాసము" అనియు ఇదిసకలకవిబుధవినుత సర్వవిద్యావిచక్షణ నన్నయభట్ట విరచితంబైన చాముండికావిలాసం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాస ము*అనియు ఆశ్వాసాంతగద్యములు వేఱువేఱుగా నున్నవి. పయినిఁజెప్పఁబడిన హేతువులనుబట్టి విచారింపఁగా నీచాముండికావిలాసమును నూఱుసంవత్సరముల క్రిందట దత్తమండలములోని నందవరీకు లెవ్వరో నన్నయభట్టుపేరుపెట్టి రచియించినట్టు నాకుఁ దోఁచుచున్నది " అని రావుబహదర్ వారు వ్రాసిరి.

ఆగ్రంథమందే " ఆంధ్రవాక్యానుశాసనం బతిశయిల్లఁ, జేసి లోకోపకారార్థసిద్ధిఁ జేసి, ఘనత రాజనరేంద్రునికరుణఁ బడసి, నట్టివాఁడను నన్నయభట్ట నేను " అని విస్పష్టముగా నున్నదని రావుబహదర్ వారే యనువదించిరి. ఈగ్రంథమును నేను జూడలేదు. రావుబహదర్ వారివాక్యములనే యుదాహరించుచున్నాను. ఆముక్తమాల్యదయందలిపద్యరూపక " గద్యము " లందువలెఁ జాముం

* ఇది తృతీయాశ్వాసమని యుండవలయు నేమో.

డికావిలాసగద్యములం దీషద్భేదము కానవచ్చుటఁ జేసి యదియు నొకకారణ ముగఁ గొని చాముండికావిలాసము నన్నయభట్టకృతము కాదని సిద్ధాంతము చేసిన రావుబహదర్ వారు భాగవతవీరభద్రవిజయగ్రంథగద్యములందుఁ గవిపేరు తండ్రి పేరుతప్ప నితరసంబంధ మీషన్మాత్రము కానరాకున్నను రెండు నేకకవికృతము లనుటకు వారికి మన స్సెట్లొప్పెనో.

19. బుద్ధిబుద్ధీత్యాదిశబ్దములు గానవచ్చుటచేఁ జాముండికావిలాసము నన్నయభట్టకృతము కాదనిరి. వీరభద్రవిజయమున స్వామిద్రోహరగండేత్యాది కర్ణాటకపదములు కానవచ్చెడిని. భాగవతమున నిట్టివిగలవా?

20. వీరభద్రవిజయమునకు భాగవతమునకు గ్రంథకర్త యొకఁడే యన నొకయాధారము గానవచ్చుచున్నది. అందు నెఱసులు కానరాకుండినచో శ్రీరామమూర్తిపంతులవారివాదమును నాయొకయాధారముచేతనే రావుబహదర్ వారు ఖండించియుందురు. అట్లు చేయకుండుటచే దానియందు వారికిని విశ్వాసము లేదని గ్రహింపవచ్చును. ఈయాధార మేదన రెండుగ్రంథములయందును గవి వంశపురుషులనామములు కొంతవఱకు సరిగా నుండుట. భాగవతమందలివియు, వీరభద్రవిజయమందలివియుఁ గవివంశవర్ణనముల నుదాహరించెద.

సీ. కౌండిన్యగోత్రసంకలితుఁ డాపస్తంబసూత్రుండు పుణ్యుండు సుభగుఁ డైన
భీమనమంత్రికిఁ బ్రియపుత్రుఁ డన్నయ కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్తువరమునఁ గనియె సోమనమంత్రి వల్లభమల్లమ వారితనయుఁ
డెల్లన యతనికి నిల్లాలు మాచమ, వారిపుత్రుఁడు వంశవర్ధనుండు
లలితమూర్తి బహుకలానిధి కేసన, దానమాననీతిధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ,మనియె శైవశాస్త్రమతముఁ గనియె.

కం. నడవదు నిలయము వెలువడి, తడవదు పరపురుషుగుణముఁ దనపతి నుతువుఁ
గడవదు వితరణకరుణలు, విడువదులక్కాంబ విబుధవినరము పొగడన్.

ఉ. మానిను లీసుగారు బహుమానవినారితదీనమానస
గ్లానికి దానధర్మమతిగౌరవమంజులతాగభీరతా
స్థానికి ముద్దుసానికి సదాశివపాదయుగార్చనానుకం
పానయవాగ్భవానికిని బమ్మెరకేసయ లక్కసానికిన్

కం. ఆమానినికిం బుట్టితి, మేమిరువుర మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పన పోతన, నామవ్యక్తుండ సాధునయయుక్తుండన్. భాగవతము

రావుబహదర్ వారిమతప్రకార మిట్టికవిత కుదిరినతరువాత వ్రాసిన వీరభద్రవిజయమందలివంశవర్ణనపద్యముల నుదాహరించెద. అందలియంత్యాను ప్రాసవైఖరి, శబ్దార్థజ్ఞానసౌష్ఠవము, లక్షణాభిజ్ఞత, సామాన్యవివేక మెంతపాంక ముగా నున్నదో రసజ్ఞు లరయుదురుగాక.

మ. ధనదుం డాయతపుణ్యమూర్తి మునిమందారుండు సన్మాన్యుఁడున్
మునినిర్నిద్రదయాత్ముఁడున్ మహితుఁడున్ మార్తాండతేజుండు భూ
తనయాధీశ్వరవర్ణనీయుఁడు తపోగణ్యుండు నైనట్టికాం
డినకుం డన్ముని సన్మునీంద్రపరుఁడై యిద్ధాత్రిఁ గీర్తింపఁగన్

ఉ. మల్లయభీమనాహ్వయకుమారకుఁ డన్నయమంత్రికిన్ దయా
వెల్లికి గౌరమాంబ కరవిందదళేక్షణుఁడై జనించి వ
ర్ధిల్ల వెలుంగు సజ్జనవిధేయుఁడు సోమననామధేయుఁ డా
మల్లమయందుఁ గాంచె సుకుమారుల ధీరుల సత్కుమారులన్

ఉ. నీతియుగంధరుం డనఁగ నిర్మలుఁడై ఘననాగరీకుఁడై
ఖ్యాతత మైన రేచనయు నన్నయ మంత్రియు సర్వశైవలో
కాతురహారుఁ డెల్లనయు నయ్యలుప్రెగ్గడయున్ నయాగుణ
వ్రాతవిభూషణుండు జనవంద్యుఁడు మాచయ నాఁగ నున్నతిన్

కం. అందుల మధ్యముఁ డెల్లన, మందరధీరుండు నీతిమంతుఁడు వనితా
కందర్పుఁడు మాచాంబిక, నందంబుగఁ బెండ్లియాడె నభినవకీర్తిన్

ఉ. మానిని మాచమాంబకుఁ గుమారుఁడు యల్లనకుం బ్రసిద్ధిగా
మానుగ నుద్భవించిరి కుమారులు కేసనయున్ గుణావళిన్
మానితుఁ డైనమాధవుఁడు మాన్యుఁడు నిమ్మడి నాఁగ మువ్వురున్
భూనుతవైరితేజమునఁ బోలిరి ధర్మజభీమపార్థులన్

ఉ. భూసురవంద్యునిన్ సుగుణభూషణు నాశ్రితకల్పవృక్షమున్
దాసజనప్రసన్ను శివతత్త్వమనోరథకౌతుకోన్నతిన్
గేసనమంత్రి సత్యనిధిఁ గీర్తివిశాలచిరాయుసంపదున్
జేసి యుమామహేశ్వరులు చెన్నుఁగఁ గాతురుగాక సత్కృపన్

(అబ్బకాశీర్వచనము.)

ఉ. అట్టిఘనుండు మంచిలి దయాగుణధీమణి మాచమాంబకున్
బుట్టినలక్ష్మియో యనఁగఁ బొల్పగుగోపనకూర్మిచెల్లెలిన్

నెట్టన పెండ్లియాడె మహనీయుఁడు కేసనమంత్రి శ్రీసతిన్
దట్టపువేడ్కఁ గేశవుఁడు దాను వరించినభంగిఁ బొంగుచున్

ఉ. పావనగంగ భోగశచి భాగ్యవుగౌరి గభీరభూమిసం
భావనకుంతి రూపగుణభారత సంపదలక్ష్మిదేవి సం
సేవితసంజ్ఞ నిశ్చలవిశేషయరుంధతి యైనలక్కమ దాఁ
గేవలకన్యయే తలఁపఁ గీర్తనసేయఁ దగున్ధరాస్థలిన్

కం. ఆదంపతులకు సంతత, మోదితచిత్తులకు మిధునముఖ్యులకు దయా
పాదితగుణులకు శంకర, పాదయుగాంభోజభక్తిపారీణులకున్

శా. సారాచారుఁడు వైభవోన్నతగతిన్ సంపూర్ణచంద్రుండు భూ
భారాహీంద్రసమానదక్షుఁడు సదాభర్మాకరుం డర్థిమం
దారుం డంచితరూపరేఖలను గందర్పుండు భూరామాయశ
శ్శ్రీరమ్యుం డగుతిప్పనార్యుఁడు జనించెన్ వంశవర్ధిష్ణుఁడై.

వ. తదనుజుం డనై యేనుజన్మించి పోతయనామధేయుండనై పరఁగి జన
కశిక్షితవిహితాభ్యాసుండనై వీరభద్రప్రసాదలబ్ధకవితాతిశయంబున

ఉ. భాగవతప్రబంధ మతిభాసురతన్ (అనుపద్యమున్నది.)

ఈపద్యములు చదివినంతమాత్రన (లక్షణజ్ఞానము శోధింపవలసినంత పనియు లేదు) భాగవతగ్రంథకర్త వీరభద్రవిజయగ్రంథకర్త కాఁడని శైలీతారతమ్యజ్ఞు లెఱుఁగఁగలరు. భాగవతగ్రంథకర్త భీమనతోఁ దన వంశవృత్తమును బ్రారంభింప వీరభద్రవిజయకర్త యాయనతండ్రిపేరును వ్రాసెను. తొలుతఁ దెలియనితనవంశమూలపురుషునినామ మావల నెట్లెఱిఁగెనో. అంతియగాదు. భాగవతమున లేనిపేర్లిందుఁ బెక్కులు గానవచ్చుచున్నవి. ఇందుఁ దిప్పయ్య వైభవోన్నతుఁ డని ధనవంతుఁడని చెప్పఁబడెను. పినతండ్రియిమ్మడియు ధనవంతుఁడే. నిజమైనచోఁ బోతరాజు దరిద్రుఁ డెట్లుకాఁగలఁడు? "హాలికు లైన నేమి? "ఆఁకటఁగ్రాసముకోసరంబు" అని చెప్ప నేమి కారణముగలిగెను ? ఈవిరుద్ధ విషయసమ్మేళనాదులు చౌర్యమును జాటించుచున్నవి.

ఇందు సంశయాస్పదము లైనవి మఱికొన్ని కలవని పైవంశవృత్తమును శోధించువా రెఱుఁగఁగలరు. వీనినన్నిటిని బర్యాలోచింపఁ బరయశోధనపశ్య తోహరుఁ డై వీరభద్రవిజయగ్రంథకర్తయు నామసామ్యమునుబట్టి భాగవత గ్రంథకర్త యశస్సును దా నపహరింపఁగోరి "భాగవతప్రబంధ మతిభాసురతన్"

అని వ్రాసి దాని కాధారముగఁ దనవంశము పోతరాజువంశము కలిపి యీాద
బ్బిలిపద్యముల వ్రాసెనని తోఁచుచున్నది. లేదా భాగవతప్రబంధమనునది
ప్రక్షిప్తమేమో.

21. కాశీఖండము సప్తమాశ్వాసములోని

సీ. శితికంఠునకును నెచ్చెలికాఁడు కాఁడొకో, యటమటీఁ డైనయీాయక్షభర్త
యహికంకణునకు మూఁడవకన్ను గాఁడొకో, పాల్మాలునట్టి యీాపావకుండు
పురవైరి కవతంసపుష్పంబు గాఁడొకో, నిర్భాగ్యుఁ డైనయీానీరజారి
గంగాధరునకు లెంకలలెంక గాఁడొకో, పెనుగూళ యైనయీాయనిమిషేంద్రుఁ

గీ. డేమిగుడువంగవచ్చినా రిండ్లువిడిచి, హరుని వెలివెట్టినట్టి యీాయాగమునకుఁ
బంచవదనునికను జేవుతించెనేని, తత్క్షణమునంద తమయాంధ్ర త్రాళ్లుదెగవె?

అనుపద్యము వీరభద్రవిజయమునఁ జతుర్థాశ్వాసమున నాసందర్భమునందే

సీ. నీలకంఠునకును నెచ్చెలికాఁడొకో, యటమటీఁ డైనయీాయంబుజాక్షుఁ
డహికంకణునకు మూఁడవకన్ను గాఁడొకో, పాలుమాలినయట్టిపావకుండు
గంగాధరునకు సంగడికాఁడు కాఁడొకో, పెనుకూళ్లమా రైనయనిమిషపతి
పురవైరికిని తలపుష్పంబు గాఁడొకో, నిర్భాగ్యుఁ డైనయీానీరజారి

తే. యేమిగుడువంగ వచ్చితి రింకుమీారు, తాము పాలించునట్టిలోకముల విడిచి
పంచవదనునికను జేఁగురించెనేని, తత్క్షణంబున తమయాండ్రతాడు దెగదె.

ఈవిధముగఁ గానవచ్చుచున్నది. ఆయాకవులవాక్యములప్రకారము పిన్నవయసున రచియింపఁబడినది వీరభద్రవిజయము. ప్రాయి మింతకు మిగులఁ గైవ్రాలకుండునపుడు రచింపఁబడినది కాశీఖండము. రావుబహదర్ వారిసిద్ధాంతప్రకారమిరువురు సమకాలికులు. ఇందు దొంగ యెవరో? భాగవతగ్రంథకర్త యీాపద్యమును దొంగిలె ననుటకంటె దురాపదమింకొండుండదు వీరభద్రవిజయకర్త శ్రీనాథునియనంతరమువాఁడని నాభ్రాంతి రావుబహదర్ వారు స్వప్రతిజ్ఞప్రకారము తమజ్ఞానజ్యోతిచే నాభ్రాంతి నణఁచి యుద్ధరింతురుగాక. పూర్వకవి పద్యము నుదాహరించినవాఁడు వానికివెనుకటివాఁడని రా॥బ॥వారే కొన్నిచోటుల సిద్ధాంతీకరించియున్నారు.

22. దాక్షాయణీవివాహకృతికర్త లైన కేసనమల్లనలు భాగవతగ్రంథకర్తయైనపోతనామాత్యునిమునిమనుమలని రావుబహదర్ వారు వ్రాసిరి. వీరు వీరభద్రవిజయగ్రంథకర్తమునిమనుమ లేమో యని తలంచెద. వీరభద్రవిజయమందు

"ఇవటూరిసోమనాథదేవదివ్యశ్రీపాదపద్మారాధక" యని యుండుటచేతను దాక్షాయణీవివాహకృతికర్తలు తాము "ఇవటూరిముక్తినాగేశసద్గురుభక్తినాదిమశైవుల" మనివ్రాసికొని యుండుటను నుభయులు వీరశైవులగుటను నే నట్లూహించితి. రావుబహదర్ వా రుదాహరించినపద్యమందుఁ బోతరాజుమనుమఁడు ప్రౌఢసరస్వతి యనిరి. "పోతనామాత్యునిమనుమఁ డగునారాయణకవికృతవజ్రాభ్యుదయము" అని శేషాద్రిరమణకవులు 7-4-17గల కృష్ణాపత్రికయందుఁ బ్రకటించిరి దీనివలనఁ బ్రౌఢసరస్వతితాత పోతరా జొకఁడు, నారాయణకవితాత పోతరాజొకఁడు నిరువు రున్నట్టు లేర్పడెనుగదా రావుబహదర్ వా రిరువురు మనుమలు నొక్కరే యందురేని సిద్ధాంతముచేయవలసినభారము వారియందున్నది. అంతియకాక భాగవతకవికి మనుమలు మునిమనుమలు కవీశ్వరులైనచో శిథిలభాగములితరులచేఁ బరిపూరితము లేల కావలసివచ్చెనో తెలియఁజెప్పవలసియుండును. కేసనమల్లనలు తమపితామహుని భాగవతగ్రంథకర్త యని కొనియాడలేదు. వారంతటియభిమానహీనులా? సామాన్యవీరభద్రవిజయకర్త యగుటచేత నామము మాత్రము వక్కాణించిరి. ఎఱ్ఱాప్రెగడమనుమఁ డాయన నెట్లు పొగడెనో తెలియదా? అట్టిస్తుతికి భాగవతకర్త యర్హుఁడు కాఁడా?

23. దాక్షాయణీవివాహమును బంపుఁడనియు దానినిజూచి మూఁడవనాఁడే మరలఁ బంపెద ననియు రావుబహదర్ వీరేశలింగముపంతులవారిని బ్రార్థించి యుత్తరము వ్రాసితిని. నాకుఁ బ్రత్యుత్తరమైన నీయ వారికి మనస్సొప్పినది కాదు. గుండ్రాయి దాఁచి పెండ్లినిలుప యత్నించిరేమో. కానిండు. అది మరల లోకమునకు గోచరించుట కలిగెనా రావుబహదర్ వారి విప్రవినోదవిద్యయుఁ గొంత వెలువడునను నమ్మకము నాకుఁ గలిగించినయాధారము నాయొద్దఁ గలదు. అది నావాదమునుబలపఱచుచు రావుబహదర్ వారు వ్రాసినదానిని ఖండించుచున్నది. ఆయాధారము నా కొసఁగినవారు దాని నిప్పుడే ప్రకటింప సమ్మతింపమిని దాఁపవలసివచ్చినది. కేసనమల్లనలగుఱించి వారి చరిత్రము వ్రాయునపు డేమి వ్రాయుదురో చూచి తరువాత బయలుపెట్టవలసియుండినఁ బెట్టెదను. రావుబహదర్ వారియనువాదములయందు గ్రంథములలోని తమకనుకూలవాక్యములు గ్రహించుట ప్రతికూలవాక్యములు విడుచుట కానవచ్చుటకలదు. ఇదియే నాసందేహమునకుఁ గారణము. పోతరాజుమనుమలు కేసనమల్లనలు గురుజాలమల్లనసోమయాజికి దాక్షాయణీపరిణయకృతి నిచ్చిరి.

ఈగురుజాల కిప్పటిపేరు ఆచంట. కేసనయల్లుఁడు అజ్జరపుఁబేరయలింగకవి. ఈ యజ్జరము తణుకుతాలూకాలోఁ దణుకునకు రెండుమైళ్లదూరములోనున్నది. దీనినిబట్టి పోతరాజుసమీపబంధువు లీప్రాంతమువారే కాని గోలకొండవారు కారనుట స్పష్టము. సమీపబంధువు లీదేశమువారైనపుడు పోతరాజీదేశము వాఁడని యూహించుట యసమంజసమా? ఈపోతరాజు భాగవతగ్రంథకర్తయైనను వీరభద్రవిజయగ్రంథకర్తయైనను రావుబహదర్‌వారివాదము నిర్మూలితము, ఇప్పటి కీమాత్రము చాలును. దీనివలననే బమ్మెర యనునింటిపేరున్నంతమాత్రముననే యాయింటిపేరు గలవారందఱు సృష్ట్యాదిగ నేఁటివఱకు బమ్మెరయందే పుట్టిపెరిఁగి మరణించి నారనుట విశ్వాసపాత్రము కాదనునావాదము బలపడినది.

24. ఆర్యులారా! రావుబహదర్‌వారియభిప్రాయమున భాగవతకర్తయే వీరభద్రవిజయకర్తయును. శ్రీరామమూర్తిపంతులవారియభిప్రాయమున వారిరువురు భిన్నులు, అందు వీరభద్రవిజయకర్త నవీనుఁడునని. నాయభిప్రాయ మిదియే. అట్లైనచో నీయిరువురకుఁ గాలభేదమెంత యని మీరడుగుదు రని నాకుఁ దెలియును. కావున నావిషయము నాకుఁదెలియవచ్చినంత చర్చించెదను. నేను బహుగ్రంథశోధకుఁడను గాను. కావున రావుబహదర్‌వారివ్రాఁతయే నాకు శరణము. వారు వ్రాసినదానినిబట్టియే నాలెక్కల నేను జెప్పెదను. న్యాయమైక దృష్టిచే మీ కేదియుక్తమని తోఁచిన నది గ్రహింపుఁడు.

బమ్మెరపోతనకాలమును రావుబహదర్‌వారు నూతనముగ నిట్లు నిర్ణయించిరి.

| దాక్షాయణీవివాహకృతిపతి | మల్లనసోమయాజికిఁగృతియిచ్చినవాఁడు |
|---|---|
| మల్లనసోమయాజి—1596 | కేసన—1596 |
| లింగన్న—1636 | ఇతనితండ్రి |
| యజ్ఞన్న—1676 | ప్రౌఢసరస్వతి—1556 |
| పార్వతీశ్వరుఁడు—1716 | ఇతనితండ్రి |
| పేరమంత్రి—1756 | మల్లయ్య—1516 |
| | ఇతనితండ్రి. |
| | బమ్మెరపోతన—1476 |

దీనిలో రావుబహదర్‌వారు ధర్మార్థము వ్రాసివేసినది 16ఏండ్లు పోఁగా పోతన్న

1460 వఱకైన జీవించియుండవలయు నని
యు 1400లోఁ బుట్టియుండవలయునినియు ననిరి.

పూర్వము 1378లోఁ బుట్టి 1435లో మరణించియుండవలయు ననిరి. భేదము (1476-1435)=41సంవత్సరములు. తరమునకు ౪౦-సంవత్సరములవంతున గణించిరి.

దీనిలో నాకుఁ గలసందేహము విన్నవించెదను.

(1) కేసనకే ప్రౌఢసరస్వతి యనిపేరా. లేక కేసన ప్రౌఢసరస్వతికుమారుఁడా? కుమారుఁడైనచోఁ బ్రౌఢసరస్వతికి నిజమైననామ మేది? ప్రౌఢసరస్వతి యనునది బిరుదనామ మని పంతులవారు ఒడయనంబివిలాసములో నుండి యుదాహరించిన యీపద్యమువలన నేర్పడుచున్నది.

ఉ. బమ్మెరవంశమందునను బ్రౌఢసరస్వతి పద్దుగాంచి తా
నెమ్మె దలిర్పఁ డప్పమనామసాధ్వియం
దిమ్మహిఁ గూర్మిఁ గన్నసుతయెల్లమయందును బేరయాఖ్యుఁడౌ
సమ్మతిఁగంటి వీరనరసమ్మను గంగనమంత్రి యుగ్రముల్.

రావుబహదర్వారు వ్రాసిన "ప్రౌఢసరస్వతి యనుబిరుదందిన కేసనకవి (పోతనమనుమఁడు) యొక్క దౌహిత్రుఁడు అజ్జరపు పేరయలింగము తెలుఁగున నొడయనంబివిలాస మనుకావ్యమును జేసెను" అనువాక్యములు పైపద్యమునకు నేనపార్థము చేయలేదనియుఁ బ్రౌఢసరస్వతి యనునది కేసనకు బిరుదనామమే యనియుఁ బ్రౌఢసరస్వతియే కేసన యనియు రూఢపఱుచుచున్నది గానిపేరయలింగము కేసనకవి దౌహిత్రుఁ డని రావుబహదర్వారు వ్రాసిరి. అల్లుఁడని నా కర్థమగుచున్నది. ఈరెంటిలో నేది సరియో ప్రాజ్ఞులే నిశ్చయింపవలయును. నావాదమున కది ముఖ్యముగాదు కావున విడిచితిని

(2) కేసనయే ప్రౌఢసరస్వతి యైనచో "మల్లనసోమయాజికిని పోతనకును నడుమ మూఁడుపురుషాంతరములు గడచినందున" అనువాక్య మెట్టుసాధువు? పోతనమనుమఁడేకదా కేసన. అప్పుడు రెండుపురుషాంతరములుగాక మూఁడుపురుషాంతరము లెట్లగును? తాతకు మనుమనికి నడుమ 120 సంవత్సరములనురావుబహదర్వారిలెక్క యెట్లు సరియగును?

పోతన్న తనకుఁ బితామహుఁ డని కేసనయే వ్రాసినట్టు రావుబహదర్వారుదాహరించిన యీపద్యమువలనఁ దెలియుచున్నది.

చ. నెరిగుఁటి గల్లునన్నయమనీషినిఁ దిక్కన శంభుదాసునిన్
బరువడి మత్పితామహుని బమ్మెరపోతన భాస్కరాహ్వయున్
వరకవి సార్వభౌముని నవారితభక్తి నుతింతు మెప్పడున్
గురుకరుణాఢ్యు లంధ్రకవికుంజరులం దగభూతిశోభిలన్.

బమ్మెరపోతన తనకుఁ బితామహుఁ డని కేసనమల్లనలు వ్రాసినను వారి తాతపేరు వారికిఁ దెలియనట్లెంచి రావుబహదర్ వారు "పయిపద్యములోఁ గవులు బమ్మెరపోతనామాత్యునిఁ దమపితామహుఁ డని చెప్పుకొన్నను నాశ్వాసాంతగద్యములనుబట్టి యతఁడు ప్రపితామహుఁ డైనట్టు తెలియవచ్చుచున్నది"

"ఇది శ్రీమద్భవానీశంకర పర్వతాలగురుప్రసాదాసాదిత సారస్వత బమ్మెరకులపవిత్ర కౌండిన్యమునిగోత్ర పోతయామాత్యపౌత్ర మల్లయామాత్యపుత్ర సంస్కృతాంధ్రభాషాచమత్కారకవితాధురీణతా బుధవిధేయప్రౌఢసరస్వతి కవి నామధేయ వరతనూభవ కేసనకవిమల్లనకవి ప్రణీతం బైనదాక్షాయణీవివాహంబనుమహాప్రబంధంబునందు" అని వ్రాసిరి.

ఇందు రావుబహదర్ వారు పౌత్రపుత్రశబ్దములు ప్రౌఢసరస్వతితో నన్వయించిరి. 558-వ పుటలోఁ గడపట ని ట్లన్వయించివ్రాసినవారు 560వ పుటలో "ప్రౌఢసరస్వతి యనుబిరు దందిన కేసనకవి (పోతనమనుమఁడు)" అని యెట్లు స్వవచనవ్యాఘాతము గావించిరో యెఱుఁగను. ౪౦ పంక్తులలోఁ బరస్పరవిరుద్ధముగ వ్రాసినప్పుడు దేనిని బ్రమాణముగఁ గొనవలయును? ఈసందేహమును రావుబహదర్ వారే "ఒక్కొక్కచోట నెందేని పూర్వాపరవిరుద్ధాంశములుసహిత మిందు పడియున్నవి. అట్టివే వేని కనఁబడినపక్షమున మొదటఁ జెప్పఁబడినదానికంటెఁ దరువాతఁ జెప్పఁబడినది యధికప్రమాణమని చదువరులు గ్రహింతురుగాక" అని పీఠికయందు వ్రాసియుండుటచేఁ బోతనకుఁ గేసన మునిమనుమఁ డనుటకంటె మనుమఁడనుటే యధికప్రమాణమని రావుబహదర్ వారియభిప్రాయమని గ్రహింపవచ్చునుగదా.

అట్లైనచో "పోతనమునిమనుమని కాలములో నుండినమల్లనసోమయాజికిని పోతనకును నడుమ నాలుగుపురుషాంతరములును మల్లనసోమయాజికిని పోతనకును నడుమ మూఁడుపురుషాంతరములును మొత్తము ౧౭౫౬-వ సంవత్సరమందుండిన గురుజాల పేరమంత్రికిని బమ్మెరపోతనామాత్యునికిని నడుమ నేడుపురుషాంతరములు గడచినందున నొక్కొక్కతరమునకు నలుబదేసిసంవత్సరములచొప్పునఁ

జూచినచో నేడునలుబదులునిన్నూటయెనుబది సంవత్సరములు ౧౭౬౯నుండి తీసి వేయఁగా ౧౪౮౯ సంవత్సరప్రాంతమువఱకును బమ్మెరపోతనామాత్యుఁడు జీవించి యుండవలయును" అను రావుబహదర్ వారి వాక్యములో "మునిమనుమనికాలములో" అనుదానిని మనుమనికాలములోననియు "మూఁడుపురుషాంతరములు" అనుదానిని "రెండుపురుషాంతరములు" అనియు "ఏడుపురుషాంతరములు" అనుదానిని "ఆఱుపురుషాంతరములు" అనియు "ఏడునలుబదులునిన్నూటయెనుబది" అనుదానిని "ఆఱునలువదులునిన్నూటనలువది" యనియు '౧౪౮౯' అనునది "౧౫౧౯" అనియు సవరించి పఠింపవలసియుండును. దీని సారాంశమే మన ౧౪౦౦ సంవత్సరములోఁ బుట్టినపోతరాజు ౧౫౧౯వఱకు అనఁగా ౧౧౯సంవత్సరములు జీవించియుండెననుటే.

పైననువదించినవాక్యమునకు మూఁడుపంక్తులక్రిందనే "ప్రౌఢసరస్వతి యనుబిరుదందిన కేసనకవి (పోతనమనుమఁడు)" అని సవరించుకొని వీరికలో నుత్తర మధికప్రమాణమనుటకంటె నొక్కవుటలోనే యుండునీస్వోక్తివ్యాఘాతములను నచ్చుచిత్తుసవరించునపుడైన సవరించియుండినఁ జదువరులకుఁజాల నుపకారము చేసినవారై యుందురు, అచ్చుచిత్తులు తాము చూడలేదందురు కాఁబోలు. ఇప్పటి పద్ధతిప్రకారము గ్రంథమంతయుఁ జదివినఁగాని వీరియభిప్రాయమేర్పడదు.

రావుబహదర్ వారు పోతనమనుమఁడు కేసన యని యంగీకరించియుండుటచేతను, గవులు చెప్పుకొనియుండుటచేతను, పోతనమనుమఁడే కేసనయని నిశ్చయించినచో రావుబహదర్వా రుదాహరించినగద్యమున కిట్లన్వయము చెప్పవలయును. పౌత్ర-పుత్ర-కవితాధురీణ-(ధురీణతాయనునదిదుష్టము) బుధవిధేయ, ప్రౌఢసరస్వతి-కవి-నామధేయ (బిరుదనామధేయము లనియర్థము. క్రమాన్వయము) వరతనూభవ-అనునది యెల్లఁగేసనకవిమల్లనకవి యనువానితో నన్వయింపవలయును. ఇట్లన్వయించినచో రావుబహదర్ వారు సృష్టించినగందరగోళము నకుఁ గారణముగలుగదు.

రావుబహదర్ వారు తరమునకు ౪౦సంవత్సరములని గణించిరి. తరమునకు ౪౦సంవత్సరములు గణించునియతి మనదేశమందే కాదు పాశ్చాత్యులందైనఁ గలదా యని నాప్రశ్నము. మనదేశచరిత్రకారుల విచారింపఁగా మనదేశమునఁ దరమనఁగా నథమపక్షమున ౨౫సంవత్సరములనియు నధికపక్షమున ౩౦సంవత్స

రము లనియుఁ జెప్పిరి. ఇది యుక్తముగానే తోఁచుచున్నది. ఈకాలపువారి యందుఁ దరము ౨౦-౨౨ సంవత్సరములే.

ఈనియతిని దప్పి రావుబహదర్ వారు ౪౦సంవత్సరములు చెప్పుటకు నాధారమెద్దియో. తరమునకు ౪౦సంవత్సరములే యని రావుబహదర్ వా రందురేని అజ్జరపుపేరయ లింగముగుఱించి వ్రాయుచు "కవి కొండన కేడవపురుషుఁడై నందున నొక్కొక్క పురుషునికి ముప్పదేసి సంవత్సరములచొప్పునఁ జూచినచో నీపేరయ కవి ౧౭౫౦-వ సంవత్సరప్రాంతములయం దుండియుండును."అని యెట్లు తరమునకు 3౦ వర్షములుగా గణించిరి. నియతి వీరియిష్టముచొప్పున మాఱుచుండును గాఁబోలు ?

"In reckoning historically by generations the word is taken to mean the interval of time between the birth of the parents and that of their children, usually computed at thirty years or three generations to a century."—*James A.H. Murray*

"Thus the word is also used of the age or person of a generation usually taken as about thirty years or three generations to a century."—*Encyclopedia Britanica.*

తరములు తెలిసి కాలమెంచవలసినపుడు తరమునకు 3౦ సంవత్సరములు. శతాబ్దములు తెలిసి తరములు చెప్పవలసినచోట శతాబ్దమునకుఁ బ్రాయికముగా 3 తరములు. అని లెక్కింతురు. విశేషకారణములు స్పష్టముగఁ దెలియ రానిచోట నిదివిధి.

ఈయాధారములఁబట్టి రావుబహదర్ వారు తరమునకు 3౦సంవత్సరములు చెప్పుట యంగీకరింపవచ్చును. ఒకచోట నేడుతరములకు ౨౧౦ సంవత్సరములని మఱియొకచోట నేడుతరములకు ౨౮౦ సంవత్సరములని చెప్పుట కాధారమేమియో వినఁగోరెదను.

ఆధారము వారిస్వచ్ఛందతయే కాని వేఱేదియుఁ గాదు. వీరభద్రవిజయకర్తకు భాగవతకర్తకు ముడిపెట్టుట యుద్దేశ్యము. న్యాయ్యప్రకారము తరమునకు 3౦ సంవత్సరములవంతునఁ జూచిన వీరభద్రవిజయకర్త ౧౭౫౬లో ఆఱు ముప్పదులు నూటయెనుబది సంవత్సరములు పోఁగా వచ్చు ౧౫౭౬లో నున్నట్టు లేర్పడుచున్నది. భాగవతకర్తయో రావుబహదర్ వా రిదివఱకు వ్రాసినట్టు ౧౪౩౫లో మరణించియుండినయెడల నిరువురకు ౧౪౧ సంవత్సరము లెడ మేర్పడుచున్నది.

ఇది పూరించుటకుఁగాను ౬×౩౦=౧౮౦ మఱియు ౭×౪౦=౨౮౦ భేదము ౧౦౦
మృతసంవత్సరము తొలుత ౧౪౩౫ను ౧౪౭౬గాఁ జేయుటచే ౪౧

౧౪౧

నీయుపాయములఁ బన్నుటయేగాక దీని కనుగుణముగ నుండునట్లు పేరయ్యను ౧౧౪ సంవత్సరములు ముందఱకీడ్చిరి. “ పదునేడవశతాబ్దమునందలి కవులగ్రంథములలోని పద్యములనుజూచి యటువంటిపద్యములను జేసియుండుటచేతను మఱికొన్నికారణములచేతను బేరయకవి పదునెనిమిదవ శతాబ్దమువాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును” అని ౧౭౫౦ప్రాంతమున నతఁడున్నట్టుమున్నువ్రాసిరి. ఇప్పుడు ౧౬౩౬ అనుటకు నీకారణములన్నియు నెందుఁబోయెనో. సరళమార్గమును వదలి వక్రమార్గమునఁ బోవుటచే నెన్నికంటకములు ద్రొక్కవలసివచ్చెనో చూడుఁడు. రావుబహాదర్ వారి యిష్టప్రకార మేడుతరములుగ లెక్కించినను నిరువురుపోతన్నలకు నడుమ నూఱేండ్లకుమించి యెడము గలదు.*

*తండ్రికొడుకులపుట్టువునకు నడిమికాలము పురుషాంతరముగ గ్రహించుటకు రావుబహద్దరువా రంగీకరించినట్టు లెఱ్ఱాప్రెగడవిషయమై వారు వ్రాసిన “ ఒక్కొక్కఁడు తండ్రికి నలుబదేసి సంవత్సరములయీడునఁ బుట్టుచువచ్చినచో భీమనకొడుకు బొల్లన ౧౧౯౫వ సంవత్సరమునఁ బుట్టియుండవలెను , తరువాత నాతనికొడుకు కెఱపోతన ౧౨౩౫వ సంవత్సరమునఁ బుట్టియుండవలెను ; అటుపిమ్మట నాతనికొడుకు సూరన ౧౨౭౫వ సంవత్సరమునందుఁ బుట్టియుండవలెను ; పిదప సూరనకొడుకు మనకవియెఱ్ఱాప్రెగడ ౧౩౧౫-వ సంవత్సరమునందుఁ బుట్టియుండవలెను వెలనాటిచోడునివలన మిగులమన్ననఁ బొందిన భీమనమంత్రి వెలనాటిచోడునికాలమునాఁటికే ముప్పదినలువది యేండ్లప్రాయము గలవాఁడయి యుండునుగాన నాతనిపుత్రునిజననమున కటుతరువాత నలువది యేండ్లు వేయుట న్యాయ్యము కాదు అందుచేత నిరువదేసిసంవత్సరములు తగ్గించుచు వచ్చినచో మనకవి జననకాలము ౧౨౯౫వ సంవత్సరప్రాంతములకుఁబోవును.” అనువాక్యములవలనస్పష్టపడియె

తరమునకు నలుబదిసంవత్సరములు చెప్పిన రాఁగలయనర్థ మేమనిన ప్రథమభార్యయందు బిడ్డలులేక ద్వితీయభార్యయందో తృతీయభార్యయందో బిడ్డకలిగెనేని యట్టియెడఁ దండ్రికిబిడ్డకు నలుబదిసంవత్సరములభేద ముండిననుండవచ్చునుగాని తక్కినసందర్భముల నంతభేద ముండుట, యందు నేడుతరములవఱకు వరుసగ నుండుట యసంభావ్యము. నేనుసూచించిన యీయుపాయముచే రావుబహాదర్ వారు తప్పించుకొనఁ జూచిరేని యట్టివిశేషసందర్భముల నిరూపింపవలయును ఈయేడువురిలో నలుబదవయేఁటఁ బుత్రలాభముగనినవాఁడుండిన నుండవచ్చును లోకసామాన్యరీతి ౨౫-౩౦ సంవత్సరములయీడున బిడ్డలుగనినవారు పెక్కు రుందురు. ఒకనికి ౨౫వ యేఁటఁ బుత్రుఁడు జనించిన మఱియొకఁడు (౪౦+౧౫=౫౫) ౫౫వయేఁట బిడ్డను గనియుండినఁ గాని లెక్క సరిపోదుగదా ఇట్టివారేడుతరములలో నొకరిద్దఱైన నుండవలసివచ్చును. ఇది స్వభావ

25. కాశీఖండములోనిపద్యము వీరభద్రవిజయమందుఁ గానవచ్చుచున్న దని యాపద్యమును ముం దనువదించితినిగదా. కాశీఖండము ౧౪౪౦ ప్రాంతమున రచింపఁబడినట్లు రావుబహదర్ వారు వ్రాసిరి. వీరభద్రవిజయకర్త తాను పిన్ననాఁటనే వీరభద్రవిజయము రచించితినని చెప్పెను. అనఁగా రావుబహదర్ వారి లెక్కప్రకారముగ ౧౪౨౦ వ సంవత్సరమునకులోపుగ రచించియుండవలయును గదా. ౧౪౩౫ వ సంవత్సరములోఁ బుట్టినగ్రంథములోని పద్యము ౧౪౨౦ సంవత్సరములోఁ బుట్టినగ్రంథములో నెట్లు రాఁగలిగెనో. ఈనాసందేహము రావుబహదర్ వారే తీర్ప సమర్థులు. శ్రీనాథునియందు గ్రంథచౌర్యము మోపుదురేమో.—పూర్వము వీరు వ్రాసినలెక్కప్రకారమైనచో ౧౩౯౯ లోపుగ రచించియుండవలయును. అనఁగాఁ గాశీఖండము పుట్టుటకు ౩౫సంవత్సరములకు

---

ముని తలంపవచ్చునా? రాబహదర్ వా రఱువదవయేఁటఁ బుత్త్రుఁడుజనించినట్టు లెక్కించియున్నారు కావున ౫౫-వ యేఁడుస్వభావమే యనియందురు మీఁద ననువదించినవాక్యముఁ జూడుఁడు భీమనమంత్రి వెలనాటిచోడునికాలమునకే ౩౦-౪౦యేండ్లవాఁడఁట. ఆపల నలువదియేండ్లకుఁ గుమారునిఁ గనెనని చెప్పుటన్యాయ్యము కాదని యిరువదియేండ్లు తగ్గించిరఁట అనఁగా ౨౦వయేఁట బిడ్డపుట్టెనని చెప్పుటన్యాయ్యము గాదని ౬౦వ యేఁటఁ బుట్టెనని చెప్పిరి అనఁగాఁ దల్లికిఁ ముట్లుడిగినతరువాత శిశూత్పత్తి!!

తా మఱువదవయేఁట బిడ్డజనించినట్టు వ్రాసినవారు " రణతిక్కన ౧౨౦౧వ సంవత్సరమున యుద్ధములోఁ జచ్చి ౧౧౩౦లోనో ౧౧౪౦లోనో ౧౧౫౦లోనో తనతండ్రి కఱువదవపడిలోనో యెప్పుడో పుట్టియుండవచ్చుననియు,...... .....ఊహలమీఁగ యూహలతో బయలఁబందిరి వేసిరి " అని యేనాఁడో మరణించిన శ్రీరామమూర్తిపంతులవారిని గుఱించి పరిహాస్యవాక్యములు రావుబహదర్ వారు వ్రాసిరి తండ్రికి ౫౦వ ౬౦వయేఁట బిడ్డపుట్టినట్టు వారు వ్రాసిరో లేదోగాని వీరిప్పుడు వ్రాసినది యాఱవపడా? అఱువదవపడా యని నాసందేహము? వీరిసోల్లుంఠనములకు వీరిప్పుడు పాత్రులు గారోటు. పురుషాంతరముల గణించుటయందు నియతి లేకుండుటయే వీరికి నియతి కాఁబోలు. తిలకింపుఁడు.

" ఈకవికిని తిక్కనసోమయాజికిని నడుమ ముగ్గురుపురుషులు మాత్రమే యున్నారు. ఒక్కొక్కపురుషాంతరమునకు నలువదియైదేసిసంవత్సరములు చూచినను సోమయాజులు ౧౩౦౦సంవత్సరప్రాంతమువఱకును జీవించియుండెనని తేలుచున్నది." (116వపుట. ఆంధ్రకవులచరిత్రము.)

" ఈకవికిని తిక్కనసోమయాజికిని నడుమను మూఁడుతరములుమాత్రము చెల్లినవి. ఒక్కొక్కతరమునకంతయు నలుబదేసిసంవత్సరముల చొప్పునఁ జూచినను తిక్కనసోమయాజి ౧౩౦౦ సంవత్సర ప్రాంతమున నుండియుండవలెను." (ఆంధ్రకవులచరిత్రము. 118వపుట) వీనికి రావుబహదర్ వా రేవ్యాఖ్యానము వ్రాయవలయును ఎటుతిరిగి యేత్రోవనైనఁ దమ రనుకొన్నదాని కనుకూలపడునట్లు విషయమును ద్రిప్ప యత్నింతురేకాని యున్న దున్నట్టు వ్రాసి దీనిఫలితార్థ మిది యని చెప్పరు. తమవాదమున కనుకూలపడునెడలఁ దరమునకు నూ ఱేండ్లయిన గణింతురు.

ముందు వీరభద్రవిజయము పుట్టియుండవలయును. ఏవిధముగఁ జూచినను రావుబహాదర్ వారివాదమునకు బాధయే.

26. ప్రౌఢసరస్వతి బిరుదాంకితుఁడు—కవి మనుమఁడైనవో భాగవత మేల పరులపాలు కావలసివచ్చెను? కేసనమల్లనలు తమతాత భాగవతమును రచించిన ట్లేల చెప్పరైరి? ఎఱ్ఱాప్రెగడమనుమని కున్నయభిమానము వీరికి లేదా? పేరయలింగకవి యేల భాగవతమును బూరింపఁడయ్యె? ఇన్ని సందేహ ములు నన్ను బాధించుచున్నవి. స్థలాభిమానముచే నాకు జనించిన భ్రాంతిని రావుబహాదర్ వారు తత్త్వజ్ఞానోపదేశముచేఁ దొలఁగింతురుగాక. అటు చేయలేని నన్నయభట్టీయ విమర్శనాంతమున వారు వ్రాసిన "పుస్తకములోనియంతస్సాక్ష్య మును నిరాకరించి యీపీఠికలోఁ జెప్పఁబడినదానినే వేదవాక్యమునుగా నంగీకరిం చుటయిూకల్లపలుకులను నమ్మియా" యను వాక్యమున "యీపీఠికలో" ననుటకు మాఱుగ "రావుబహాదర్ వారు వ్రాసిన చరిత్రమున" అని వ్రాసి వారికర్పింప వలసివచ్చును.

పాలపర్తి నాగేశ్వరశాస్త్రులవారును వీరభద్రవిజయము భాగవతకర్తృ కృతముగాదని వ్రాసియున్నారు. గ్రంథవిస్తరభీతి ననువదింపనైతి. ఎవ రెంతవ్రా సిననేమి? రావుబహాదర్ వారు తమయభిప్రాయమును సవరించుకొనరని నే నెఱుఁగు దును. ఈనాశ్రమము వారికై కాదనియు నిష్పక్షపాతబుద్ధులు సత్యైకదృష్టులు ఋజువాదులు నగుమధ్యవర్తుల యాలోచనమున కనియు లోక మెఱుఁగునుగాక.

ఆర్యులారా! 'భాగవతప్రబంధ మతిభాసురతఁ' అనుపద్యము వీరభద్రవి జయగ్రంథకర్త వ్రాసిన దని రావుబహాదర్ వారు వ్రాయుటచే వారిమాటను విశ్వసించి యట్లే గ్రహించినను వీరభద్రవిజయగ్రంథకర్తయు భాగవతగ్రంథ కర్తయు భిన్నులే గానియొక్కరుగా రని నిరూపించితిని గాని యాపద్యము వీరభద్ర విజయగ్రంథకర్త వ్రాసినది కాదను సందేహము నన్ను బాధించుచుండినను దానిని స్థాపింపఁదగిన యాధారములు దొరకమిని నందందు సందిగ్ధముగా నే వ్రాసితిని. పర కృతగ్రంథముల స్వకృతము లని ప్రకటింప యత్నించువారును బ్రకటించువారును నీకాలమునను బూర్వకాలముననను నుండుటచే వీరభద్రవిజయకర్తయు నామ సామ్యముచే భాగవతగ్రంథకర్త యశస్సును గ్రుచ్చిలింప నకార్యమునకు లోప డెనని యాయనను నిష్ఠురమాడి పాపకార్య మొనర్చితిని. భగవంతుఁడు నన్ను క్షమించునుగాక. ఈవ్యాస మింతవఱకు ముద్రిత మగునప్పటికి భాగవతప్రబం

ధ మనుపద్యము ప్రక్షిప్తమని నమ్మఁదగిన యాధారములు లభించెను. ఈప ద్యము పరిషత్కార్యాలయమున నుండుప్రతులలో నొకదాని యందైన లేదు. అవి యన్నియు భిన్నప్రదేశముల సేకరింపఁబడినవి. మఱియు బ్ర॥శ్రీ॥కాశీభట్ల కృష్ణరాయశాస్త్రిగా రనువారు తమయొద్ద వీరభద్రవిజయప్రతి యున్నదని యాంధ్రపత్రికయందుఁ బ్రకటించిరి. వీరభద్రవిజయమందలి కవివంశమును దెలుపుపద్యములను భాగవతప్రబంధ మనుపద్యముతోడ షష్ఠ్యంతములవఱకు వ్రాసిపంపుఁ డని వారిని గోరితిని. వారు నాయందు దయయుంచి వ్రాసిపంపుచు "భాగవతప్రబంధమతిభాసురతక్ అనుపద్య మీతాళపత్రగ్రంథస్థముగా లేదను టకుఁజింతిల్లుచున్నాఁడ" నని వ్రాసిరి.

నాగేశ్వరశాస్త్రులవా రీపద్యము ప్రక్షిప్త మని పూర్వమే వ్రాసియుం డుటచేతను, నాపద్య మాకవి వ్రాయఁ జెప్పెడి కారణము విశ్వాసపాత్రము కా కుండుటచేతను, అది యుండినచోఁ బూర్వోత్తరసందర్భములకు సామరస్యము కుదురకపోవుటచేతను, గొన్ని తాళపత్రగ్రంథములం దాపద్యము లేకుండుటచేతను, నుదాహృతపద్యముప్రక్షిప్తమనుట సిద్ధాంతితమయ్యెను. ఇప్పుడు రావుబహాదర్ వారి వాదముగతి యేమో మీరే యెఱుంగుఁడు.

ఎవఁడో విచారదూరుఁడైన శైవాభిమాని దూర్చిన యాపద్యమును మ.రా.రా. వీరేశలింగముపంతులవారు విమర్శములేక గ్రహించి వీరభద్రవిజయ కర్తను నిష్కారణముగ రచ్చకీడ్చుటయే కాక భాగవతగ్రంథకర్తపై లేనిదోష ము మోపి యాయనకపకీర్తి మెడఁగట్టిరి. వీ రనాలోచితముగ నుభయకవులపై వ్యాపింపఁజేసిన యపవాదములు శ్రీమదొంటిమిట్టకోదండరాములకృపచే నేఁ టితో సమయునుగాక.

కడపమండలస్థలాభిమానుల "భ్రాంతినివారణార్థముగా బమ్మెర పోతన నివాసమోరుగల్లని స్థాపించుటకుఁదగిన హేతువులను గొన్నింటినిందుఁ జూపుచు న్నాను" అనిరావుబహదర్ వారు వ్రాసిరి ఆకొన్నిటిని ఖండించితిని. కొన్నిటి యనునది చమత్కారవాక్య మగునేని పోనిండు కాదేని యన్నిటిని వారు వెడలఁబెట్టుదు రుగాక.మఱియెవరైన నెందైన వ్రాసినవిమ్మటఁగాని యవి వెడలిరావు కాఁబోలు.

రావుబహదర్ వారు గ్రంథమును బూర్ణముగఁ బఠింపక పర్యాలోచిం పక తోఁచినదెల్లఁ జరిత్రము లనుపేర వ్రాయుట శోచనీయము. విషయమెఱుఁ గక, స్థలజ్ఞానములేక, పరులువ్రాసినదానిని వ్రాసికొను తాము లోకము కన్నులు

మూసికొని యున్నదనియు స్థలజ్ఞులు భ్రాంతులనియు, వారిభ్రాంతి నివారణార్థము తామాచార్యపురుషత్వము వహించినట్లును వ్యర్థవాక్యములు వ్రాయుట యంతకంటె సంతాపకరము.

ఇఁకముందు వ్రాయుచరిత్రములందైనను హారశరవాదములఁబొంతఁబోక, పరులనుల్లసమాడక, ఋజుపద్ధతి నవలంబించి వ్రాయుచుఁ దమయశస్సు శ్రేయస్సుఁగోరు నస్మాదృశులకెల్ల వృథామనస్తాపము కలిగింపకుందురుగాక.

వీరిఁక దాక్షాయణీపరిణయమును బదిలముగ దాఁచుకొందురుగాక.

"సత్య మేవ జయతి నానృతమ్"

వావిలికొలను సుబ్బరావు.

— అనుబంధము —

ఈవ్యాసము 432-వ పుటయందు "సమీపబంధువు లీదేశమువారైన పుడు పోతరాజీదేశమువాఁడని యూహించుట యసమంజసమా" యని వ్రాసితిని. ఇది యూహామాత్రము కాదు. వీరభద్రవిజయకర్త "యివటూరి ఆరాధ్యసోమనాథదేవ పాదపద్మారాధక" యని వ్రాసియుండుటచేతను, వీరభద్రవిజయమున 16-వ వచనముఁబట్టి యతఁ డివటూరియందే యున్నట్టు తేర్పడుటచేతను, నీతనిమనుమలు ఇవటూరిముక్తి నాగేశసద్గురుభక్తి నాదిమశైవులైనట్టివారి నని వ్రాసియుంపుటను, నీయివటూరె విజయనగరప్రాంతమం దున్నదని తెలియవచ్చుటచేతను, వీరభద్రవిజయకర్తగూడ గోలకొండదేశము వాఁడు గాఁడు. 395-వ పుటలో (9) లోని దబ్బిలిపాటను రామయ్యపంతులువారు ప్రమాణముగ గ్రహింపలేదు. రావుబహదర్ వీరేశలింగము పంతులవారు గ్రహించుట వింతగాదు. అందలి బొమ్మెరపోతరాజు మున్ను నేను సూచించిన కేసపోతురాజో, ఆఁబోతురాజో యున్నపోతురాజో వీరభద్రవిజయ కర్తయునుగాఁడు.

వా॥ సు॥

— గతసంచిక శేషము. —

“వేదాధ్యాయరతో విప్ర” అనేవాక్యంబులు మనంబులం దలంచుకొని శ్రీసిద్ధేశ్వ
రుని శ్రీమన్మహాదేవుని యెదురుగా నిలిచి చెయ్యెత్తిచాచి యీకాంత విప్రకాం
త యనిపలికి యాయంగన వడ్డించినలవణమును తమరు పచనంబుచేసిన అన్నం
బును వడ్డించుకొని అందరు సంతుష్టిగా నారగించినయాసమయంబున సకలజ
నులు చూచుచుండ ఆవిప్రులపై పుష్పవర్షంబు గురియుటయు అది యంతయు
(చూచి)కటకవల్లభుండుదళంబులు గజగజవణంకి గజపతికెరింగించిన ఆవిప్రుల
రావించి వారల కపారధనకకవస్తువాహనంబు లొసంగి వారల ననిపి తాను
కటకంబునకున్ పోవుచు నానాదేశంబులకు సిరియాలదేవిని వెదకపంపుటయు.

— మాధవవర్మజననము —

అంతనిక్కడ మంచిముహూర్తంబున సిరియాలదేవి ప్రసూతియై సర్వ
లక్షణసంపన్నుండైనకుమారునిం గాంచుటయు ఆవిప్రులు ఆవేళ లెరింగి యిబ్బా
లుండు సర్వంసహాచక్రంబు ఏకచక్రంబుగా గర్భాష్టకంబున ధరాచక్రంబుగా
మహామహిమతో పాలింపంబోయెడు నని పటకుటయు; అబ్బాలునకు విధ్యుక్తం
బుగా పుణ్యాహవాచనంబు చేసి నామకరణంబు చేయుటకు సిరియాలదేవిని
చూచి నీఅభీష్టం బెట్టిది పలుకుమనుటయు ఆదేవి విప్రజనంబుల కిట్లనియె. ఈ
మాధవశర్మయే దైవంబు దాతయు తల్లియు తండ్రియు. ఇతనినామకరణంబు
నాకు అభీష్టంబని పలుకుటయు ఆవిప్రు లట్లకాక యని మాధవవర్మయని యబ్బా
లునకు నామకరణంబు సేయుటయు.

ఆరాజకుమారుని విప్రదంపతులు పోషింపుచుండ శుక్లపక్ష సుధాకరుం
డునుబోలె దినదినప్రవర్ధమానుం డయి పెరుగుచున్నయెడ గర్భాష్టకం
బున నుపనయనంబు చేసి ఒజ్జలువద్ద పద్మాక్షీదేవిసన్ముఖంబున చదువుచుండె.
అంత ఒక్కనాడు చదువుబాలురును తానును ఆడుదమని పలకయుపుస్తకం
బును పద్మాక్షీదేవిచేరువం బెట్టి గుడితలుపులు బెట్టి విహరించి అస్తమయంబగుటయు
అంత ఇంటికింజని మజ్జనభోజనాదులుదీర్చి రాత్రిచదువునకు పలకయు
పుస్తకంబును లేకుండుటయు, మాధవశర్మ తన్ను నెక్కడకోపించునో యని
పద్మాక్షీదేవిసన్ముఖంబునకు తానొక్కరుండును చనునెడ ఆదేవి భయంకరా
కారంబై భూత ప్రేత బ్రహ్మరాక్షస యక్ష సిద్ధ శాకినీ ఢాకినీ భేతాళపరివృతయై
సింహాసనంబున కొలువుండుటం జేసి మాధవవర్మ జీవమాత్రంబు చలింపక
భూతగణంబుల పారనడుచుచు అద్దేవిసన్ముఖంబున నున్నపలకయు పుస్తకంబును

తీసుకొనుటయు అబ్బాలునిధైర్యంబునకు వెరగంది యతనిధైర్యంబు చూచుటకు అతిభయంకరంబుగా దాల్చి. అబ్బాలుండు నావంతయు చలింపకనిల్చి ముకుళిత హస్తుండై బహువిధంబుల స్తుతించి యద్దేవిపాదపద్మంబులకు ప్రమొక్కి లేవక యున్నంగని అత్యంతదయార్ద్రమానసయై లెమ్మా వత్సాయని, నీభక్తిధైర్యంబు లకుమెచ్చితి నీకు ఇష్టమైనవరంబును వేడు మనుటయు. అబ్బాలుండు తనచే ననిమొ. తండ్రిచందంబంతయు నెరింగినవాడై కటకవల్లభుని సాధించి మగోధనం బును మరల్చునట్టిబలము కృపసేయు మనుటయు.

— మాధవవర్మకు దేవి దివ్యాయుధము లిచ్చుట. —

అద్దేవియు కరుణించి అట్లనే కృపసేయు కునని యొక్కదివ్యఖేటకంబును ఒక్క దివ్యఖడ్గంబును కృపచేసి యీఖడ్గఖేటకంబులు నీచేతనున్న శస్త్రంబులు నిన్నుం జేరవు నీకు ఎదిరినశత్రులు హతు లౌదురు. అని ఆనతిచ్చి సహస్రవర్షంబులు రాజ్యంబు సేయు మని పల్కి తనసమీపంబున నున్న ఒక్కబిలంబు చూపి యీ బిలంబుజొచ్చి పశ్చిమముఖుండవై ఒక్కరమ్యప్రదేశంబున వెడనిల్చి యున్న సమయంబున సూర్యోదయపర్యంతంబును బిలమార్గంబువెడలి చతురంగబలం బులు నీయింటసింహాసనంబున వెయ్యేండ్లు ఉండునని యానతిచ్చి గోబ్రాహ్మణ పూజయు శ్రీలక్ష్మీనారాయణపూజయు ఉమామహేశ్వరపూజయు మరువకుమని చెప్ప నబ్బాలుడు పునఃపునఃప్రణామంబు లాచరించి యద్దేవిచే ఎఱుంగంబడు బిలంబుదూరి పోరుచేయుట, పెక్కువిఘ్నంబులు భూతప్రేతపిశాచ బ్రహ్మరాక్షస శాకినీ ఢాకినీ వ్యాఘ్రభల్లూకసర్పాదులు గనుపట్టిన స్థానంబున చలింపక అన్నియు నివారింపుచు నబ్బిలంబు వెలువడి గజతురంగాదివీరభటులు పిక్కటిల్ల వాద్య ఘోషంబులును భేరీభాంకృతులును కాహళనిస్సాణంబులును, శంఖనాదంబులును వీరభటార్భటంబులును గజఘీంకారంబులును తురంగఘోషంబులును ఏకంబై ప్రళయకాలమేఘగర్జితంబులునుబోలి దిక్కులు పిక్కటిల్లుచు సూర్యో దయపర్యంతంబు అబ్బిలమార్గంబువెడలి మాయాబలంబులు అరువయివేలమద గజంబులు ౧౨౦౦౦౦ ఉత్తమాశ్వంబులును ౧౭౦౦౦౦ పదాతివర్గంబులును మణి మయాంబరదివ్యాంబరంబులును పదికోటులసువర్ణంబులును చేకొని యీమాధవ వర్మను చేరుటయును. ఆకొమారుండు ఆబలంబుల మన్నించి వారలచే నమస్కా రంబులుగైకొని యీబలంబులతోగూడా హనుమకొండకు జేరవచ్చి వార లందరిని నిలిపి తానొక్కరుండు పురంబునం జొచ్చుసమయంబున హనుమకొండ

యేలుమెరుకురాజులు అంతకుమున్నే సేనాకలకలంబువిని వెరగుపడి గౌనులు వేయించి మహాభీతచిత్తులై యిదియెక్కడిసేన వచ్చెనోయని మహాభీతచిత్తులై చింతింపుచు యెటకేనియు పారిపోవువారై యున్నసమయంబున ఆరాజపుత్రుండు ఖడ్గఖేటకంబులతోను హాస్యకొండజొచ్చి వచ్చుసమయంబున తల్లి కొడుకునుం గానక అన్నిదిక్కులు వెతకి నేలబడి పొరలుచున్న వృద్ధభూసురుల దంపతులను సిరియాలదేవిని గాంచి మ్రొక్కి నిలిచిన, వారలు పెన్నిధిగన్న పేద చందంబున వెచ్చియుజుమీరి యక్కొమారుని అక్కునంజేర్చి శిర మాఘ్రాణించి అన్న రాత్రి నొక్కరుండవు ఎక్కడనుంటివి. బాలండవు ఒంటిగా నుండుట ఆశ్చర్యంబు గాదా. నిన్ను ఎడబాసి, యీ రేయి నాల్గు జాములు మాముువ్వురియెడల ప్రాణంబు నిల్చియుండుట పరమాశ్చర్యంబు అని తలంచి శోకమోహంబులు బెనంగొన నబ్బాలుని కౌగలించుకొని విస్మయంబొందుచు భానులంబంబు పొదుదువుకొన్న మూర్తిత్రయంబునుం బోలె ఆబాలుని ఆముువ్వురు ఒక్కయామంబు శోకమోహాసంతోష విస్మయానందంబుల మునుంగుటయు. అబ్బాలునుద్దేశించి మాయన్న యీరేయి యెక్కడ నుంటివి. బాలుండవు యెరుంగంబలుకు మనుటయు ఆకుమారుండు తాను పద్మాక్షీదేవి నగరికిం జనుటయును, మొదలుగా వారలడుగుట త్వరగా సర్వంబును నెరుంగం బలుకుట విని విస్మయానందభరితులై యున్నసిరియాలదేవి వృద్ధదంపతులను జూచి రాకొమారుం డిట్లనియె. ఈరాజ్యభోగంబులు మీరనుభవింపుం డని, మీసమీపంబున వసుంధరాచక్రంబు పాలించువాడ నని పలికిన ఆవృద్ధు లిట్లనిరి. ఓకుమారకా మేము వృద్ధులము. నేత్రములు పొరలు గప్పిఉన్నవి. శ్రుతిపుటంబులకు నిజశక్తి చాలదు. కాలు చెయ్యాడుటకు నానాటికి బలంబు తక్కువపడుచున్నది. నీభోగంబులే మాకు సహస్రగుణితంబులు భోగంబు లనిన, విని వారలంజూచి అనేకనిట్టూర్పులు బుచ్చి తత్క్షణంబే పద్మాక్షీదేవినగరికిం జని నిలచి, ఓపరమేశ్వరి మాతాత మాధవశర్మకును, మదంబికకును, మాతల్లిసిరియాలదేవికిని గానియీరాజ్యభోగంబులు నేనొల్ల నని, ఖడ్గఖేటకంబులు అదుగో యని అచటంబెట్టి చనుచున్నసమయంబున అబ్బాలుని యాధైర్యంబులకు నెంతయు మెచ్చి యద్దేవి యతని జేరబిలిచి మీతాతముత్తవ్వలగు వృద్ధభూసురదంపతులును, మీతల్లి సిరియాలదేవియు నీవు రాజ్యంబుపాలించునంతకాలంబు నవయౌవనప్రాయంబుల ఉండగలవారలని అనతిచ్చి నీవు ధరాచక్రంబు నూటడెభ్భయి

అయిదేండ్లు పాలించి, అటుమీఁదట దివ్యకన్యకాపరివృతుండవై యీకొండబిలంబులో దివ్యాంగనలతోఁ గూడి దివ్యభోగంబు లనుభవింపుచు అమరత్వంబును నిర్జరత్వంబును గలిగి యుండుదువు. అని ఆనతిచ్చియదేవికి నమస్కారంబులు చేసి ఖడ్గఖేటకంబులు మగుడ గైకొనివచ్చి మాధవశర్మకు తనవృత్తాంతంబంతయు నెఱుంగంబల్కుటయు ఆముప్పూరు నవయావను లాటయు.

— మాధవవర్మ రాజ్యాభిషిక్తుండై దిగ్విజయము సేయుట. —

ఆవృత్తాంతం బంతయు ఎరుకురాజులు విని మాధవవర్మపాలికిం జనుదెంచి అతనికి సాష్టాంగంబుగ నమస్కరించి నీవు మాకురాజువు గల్గితివి. మాతపంబుఫలించె. ఏమిపనులు చేయుదుమని కరంబులు ముకుళించియున్న వారల మన్నించి మాధవవర్మ యెరుకురాజులకు అమరావతిరాజ్యం బిచ్చి పంపుటయు. ఆబాలుండు దేవీకల్పితంబు లయిననేనల హానుమకొండకు రావించి మంచిముహూర్తంబున దేవభూదేవపూజలు గావించి భూసురాశీర్వాదపూర్వకంబుగా “శాలివాహనశకవర్షంబులు ఇన్నూటముప్పయిఆరగు తారణనామసంవత్సర మాఘ శు॥౫ గురువారంబున శ్రవణానక్షత్రంబున మాధవవర్మరాజేంద్రుండు సింహాసనం బెక్కుటయు. మరియు సేనాధిపతులు సేనలు నమస్కారంబుచేసిన. వారికి దేవి అనుజ్ఞ గైకొని తండ్రిని జంపిన పగ దీర్చుటకై తనమనంబునం దలంచి పూర్వసామంతబలంబులం బిలుపించుకొని వారల మన్నించి తమశత్రుండైనకటకవల్లభునిపై దండయాత్ర గదలవయు నని వారితో విచారించి ప్రయాణభేరి వేయించి పద్మాక్షీదేవీదత్తం బైనబలంబులును తనపూర్వబలంబులును గొలువ కటకంబునకుం బోయి చుట్టుముట్టడివేసి ఒకమాసంబు అఘోరయుద్ధంబు జేసి దేవిదత్తం బైనఖడ్గఖేటకంబులు ఇరుగేలం బూని కటకవల్లభునితల ద్రుంచుటయు. అప్పుడు “మేదినీకరవాలవల్లభునితలగుండగండం” డనుబిరుచు చెల్లించుకొని వానిసుతునకు పట్టంబు గట్టి వానిని తనయాజ్ఞకు లోనుచేసుకొని తమగోధనంబులు పదమూఁడువేలయేనూరుమందలు మగుడ తోలించుని మూఁడుకోట్లసువర్ణంబులు అప్పనంబులు పుచ్చుకొని మరల హాన్మకొండకు వచ్చుటయు. తమగోధనబులు కృష్ణానదీనీరంబున శ్రీనగరంబుపై మందలు వేయించి అమరావతి నున్నయెరుకురాజులకు ఒప్పన జేయుటయు. మరియు దిగ్విజయంబు సేయుటకు ప్రయాణభేరి వేయించి సకలసేనాసమేతుండై అష్టదిక్కులును గెలిచి విజయంబు గైకొని చోళదేశాధీశ్వరుని కూతురును వివాహంబై హానుమద్గిరి ప్రవే

శించి సింహాసనాసీనుండై రాజ్యంబేలుసమయంబున. అంతట ఆపురినున్నవి ప్రులు మాధవవర్మసమ్ముఖంబున కేతెంచి వేదోక్తంబులుగా నాశీర్వాదంబులు చేసిన, వారలకు సాష్టాంగంబుగా నమస్కరించి వారల పూజించి మీరు కార్యార్థులై వచ్చినవారలని నామనంబున తోచుచున్నది. మీయభీష్టంబుల నెరుంగంబలుకు డనుటయు ఆవాక్యంబునకు సంతోషించి యావిప్రు లిట్లనిరి. కటకవల్లభుండు మీతల్లిని సిరియాలదేవిని గొనిపోవుసమయంబున ఆయాపదగని మీతల్లిగారిచేత లవణదధి గుడిచితిమి (అది) ఆయాపదనివారణార్థంబయ్యె. శివప్రసాదమని యనుభవించితిమి ఇంతియెకాక కలియుగంబున క్షత్త్రియులచేత కుడువరాదు. అగ్రజన్ములకు అన్యదోషంబులు చెందరాదు. అదికారణంబున మామనంబుల నెప్పుడు మెరమెర బాయుక ఉన్నది. మాకు సప్తగోదావరిమధ్యప్రదేశంబున కొన్నిగ్రామంబులు అగ్రహారంబు లిచ్చిన అచట స్నానజపతపహోమస్వాధ్యాయ దేవపూజా దేవ ఋషి పితృతర్పణాతిథిపూజలును, క్రతువులు గావించి పుణ్యలోకంబులు వడసెద మనిన, ఆతత్క్షణంబె వారికి సప్తగోదావర మధ్యంబున అగ్రహారంబులు ఇచ్చి అనుపుటయు. మరియు మాధవవర్మ పెద్ద కాలంబు రాజ్యంబుచేసి పద్మాక్షీవరంబున నొక్కసుతునింగని పద్మసేనుండను పేరు పెట్టుటయు.

ఈవిధంబున సమాధానక్షేత్రంబుల మాధవదేవుండు రాజ్యంబు పాలించి. అంత పద్మాక్షీదేవిపూలతోటలో గలనానావిధ పుష్పంబులు హానుమకొండ బిలంబులో వెడలి దేవకన్యకలు రాత్రి గొనిపోవుటగని తోటకావలివారలు ఆపుష్పంబులు పోవుటకు వెరగంది ఒకరాతిరి కావలియుండి ఆరాత్రి దేవకన్యకలు వచ్చుతెరంగును పుష్పంబులు గోసుకొని మగుడి,యాకొండబిలంబు దూరిచనుటయు తోటకావలివారలు ఆపుష్పంబులు పోవుటకు వెరగుపడి మాధవదేవునికి ఎరింగించిన. ఆరాజు పద్మాక్షీదేవివరంబు దలంచి రాజ్యంబునకు సుతుం డగు పద్మసేనుని పట్టాభిషిక్తుం జేసి యారాత్రి తానొక్కరుండును ఆపూలతోటలో నున్న ఆబిలంబు వెడలి దేవకన్యకలు చనుదెంచి మాధవదేవుని బహువిధంబుల స్తుతియించి, పద్మాక్షీదేవిసమ్ముఖంబునకు దోడ్కొని చనుటయు.

తత్పరోక్షంబున పద్మసేనుండు తండ్రియట్ల రాజ్యంబు మహామహిమతో పెద్దకాలంబు పాలించి తనకు సంతానంబు లేమికి చింతించి బుధానుమతంబుగ సిద్ధేశ్వరుని శ్రీమన్మహాదేవుని నిత్యంబును కూష్మాండఫలంబుల పూజించుటయు,

తత్ప్రసాదంబున నొక్కసుతుం గాంచి, తనకు మరలబద్ధకటకవల్లభుని సాధించి వానిపుత్రునికి పట్టంబు గట్టి, యెప్పటియట్ల మూఁడుకోట్లసువర్ణటంకంబులు అప్పనంబులు గైకొని హనుమకొండ ప్రవేశించి యాపద్మసేనుండు ఎనుబది వర్షంబులు రాజ్యంబు పాలించి వెన్నమరాజును పట్టాభిషిక్తుంజేసి తాను శివలోకంబున కరుగుటయు.

ఆవెన్నమరాజు వివాహంబై పెద్దకాలంబు రాజ్యంబు చేసి సిద్ధేశ్వరశ్రీమన్మహాదేవుని ప్రసాదంబున నొక్కసుతునింగని గుండమరాజు అనుపేరు నిడి, కటకవల్లభునిమీఁదికి జని అఘోరయుద్ధంబు మాసత్రయంబు చేసి కటకవల్లభునిశిరచ్ఛేదనము చేసి వానిసుతునికి పట్టంబు గట్టి యెప్పటియట్ల మూఁడుకోట్లసువర్ణటంకంబులు అప్పనంబులు పుచ్చుకొని, అష్టదిక్కుల జయస్తంభంబులు వేయించుటయు. మరియుఁ డెబ్బదివర్షంబులు పృథివిపాలించి గుండమరాజును పట్టాభిషిక్తుంజేసి తాను శివలోకంబున కేగుటయు.

తదనంతరం బాగుండమరాజు ఒకసుతునిం గని యెరుకుదేవరాజు అని పేరుపెట్టుటయు. తదనంతరం బాగుండమరాజు డెబ్బదిఅయిదువర్షంబులు పృథివిపాలించి అన్నిదిక్కుల అప్పనంబులుగైకొని యెరుకుదేవరాజును పట్టాభిషిక్తుంజేసి తాను శివలోకంబున కేగుటయు. ఆయెరుకుదేవరాజు బాలుం డగుటంజేసి అతనిమేనత్త కుంతలిదేవి రాజ్యం బేలుటయు. గుజరాష్ట్రమహారాష్ట్రంబులపై వెడలి వారిని సాధించి వారలచే అప్పనంబుల గైకొని మగిడి పురంబునకు వచ్చితనకు మరల బద్ధకటకవల్లభునిపై చతురంగబలంబులగూర్చుకొని కాణాంగిదేవిని దళవాయింజేసి పంపిన, అతఁడు కటకవల్లభునితో మహాయుద్ధంబు చేసి కటకవల్లభుని దునిమి వానిసుతునికి పట్టంబు గట్టి యెప్పటియట్ల మూఁడుకోట్లసువర్ణటంకంబులు అప్పనంబులు గొని హనుమద్గిరిప్రవేశించిన. అంత కుంతలిదేవి నవవర్షంబులు రాజ్యంబుజేసి యెరుకుదేవరాజునకు రాజ్యభారంబు తెరంగంతయు నెరింగించి తాను శివలోకంబున కేగుటయు.

## —— భువనైకమల్లునిచరిత్రము ——

యెరుకుదేవరాజు సర్వలక్షణసంపన్నుండై దేవగిరిపై దండువెడలి దేవగిరిరాజుకూతురును వివాహంబై వారలచే కానుకలు గయికొని మరల పురంబు ప్రవేశించి. అంత ఎరుకుదేవరాజుకు ఒక్కసుతుం డుద్భవించిన భువనైకమల్లుం డను నామకరణంబు చేసి చతురంగబలంబులతో విజయనగరంబుపై వెడలి

యప్పరంబేలు వీరనృసింహరాయుల గెల్చి ఆతనితో అప్పనంబులు గొని మగిడి హనుమద్గిరి ప్రవేశించి డెబ్బదిఆరుయేండ్లు రాజ్యంబు పాలించి భువనైకమ ల్లుని సింహాసనాసీనుం గావించి తాను శివలోకంబున కేగుటయు. ఆభువనైక మల్లుడు కటకవల్లభునిమీాదికి దండయాత్రవెడలి వానిని మహాయుద్ధంబున సం హరించి వానిసుతునికి పట్టంబుగట్టి యెప్పటియట్ల మూడుకోట్లసువర్ణటంకం బులు అప్పనంబులు గయికొని హస్తకొండ ప్రవేశించి. అంతట దేశంబులు వీరనృసింహరాయులు సకలచమార్యగండబిరుదులును, అసహాయకరణనారా యణాంకబిరుదులును, ధరణీవరాహాంకబిరుదులును, పొగడించుకొనుటయు చారు లచే నెరింగి చతురంగబలంబుల గూర్చుకొని పద్మాక్షీదేవీవరదత్తంబైన ఖడ్గఖేట కంబులతో నృసింహరాయులను ఏకాంతయుద్ధంబునకు భటులచే పిలుపించుట యు, బలంబు లప్పరంబువెలుపల నుంచి తా నొక్కరుండును నిర్భయంబున పురంబు జొచ్చిన కొనియాడి అతనిభువనైకమల్లుండను నామంబు సమాజం బౌ నని, కొలువునుండి దిగ్గున లేచి అంతఃపురంబు ప్రవేశించి తనపత్నియు తానునువాని పాదంబులు గడిగి తనసింహాసనంబుమీాద కూర్చుండ నియమించి హస్తంబులు ము కుళించి నృసింహరాయులు భువనైకమల్లునకు ఇట్లనియె. ఓమహాత్మ నీవంటిని శ్శంకవీరునకు గాక యీబిరుదు మాబోటివారలకు తగదు. ఈబిరుదులు మీారె గయికొనుడీ. మీారు గెలిచితిరి. (అని) బిరుదులు సువర్ణపులకాంకితంబులుగా వ్రాయించి భువనైకమల్లునకు గానుకగా బట్టిన గయికొని, తనచెల్లెలు శ్రీరంగ దేవిని సర్వాభరణభూషితగా జేసి విలాసవతియును కాంతిమతియును ననునిద్దరు చెలికత్తెలతోగూడ భువనైకమల్లునకు వివాహంబు జేసి. మూడుమాసంబులు భువనైకమల్లుండు నిలుచుటయు. మరియు ఉత్తరపుగవినినుండి రాయులకు చెల్లి నడుత్తరపుదేశంబు భువనైకమల్లునకు నృసింహరాయులు అరణం బిచ్చుటయు, శ్రీరంగమదేవికి కంచీపురంబు అదికాక చోళరాజ్యంబు పసుపునకు చదివించు టయు దేవీయుక్తంబుగా చీనిచీనాంబరంబులును, గజతురగగోగణంబులును, దాస దాసీపరిజనంబులును, ఇచ్చి పంపునమయంబున, మీారు మాయింటిముందర తరాతరంబులకు విరోధంబు లేదని ప్రమాణంబు చేసుకొని సువర్ణపులకాంకి తంబులు వ్రాసుకొని తర్లుసమయంబున, శ్రీరంగమదేవిని గైకొని పురంబునకు వచ్చి అచట మీనాంబరుం డనుఋషిచే మహామహిమతో నూరుగుళ్లు గట్టించి, మరియు చెన్నరాయుని ప్రతిష్ఠచేసి అచట ఒక్కకోనేరు గట్టించి యెనిమిదితు

లాభారంబులు దేవియుక్తంబుగా తూగి కోటిధనంబులు విప్రులకు దానంబు చేసి హన్మద్గిరి ప్రవేశించుటయు, అంతట భువనైకమల్లుండు శ్రీరంగమదేవి యందు త్రిభువనైకమల్లుని, పాంచాలియనుకొమార్తెను గని పరమసంతోషం బున నున్నసమయంబునందు ; కొన్నిదినంబులకు నక్కడ వీరనృసింహరాయుల కొమారుడు వేంకటనాథుం డను(వాడు)విజయనగరంబు ఏలుచు నొకనాడు పరిజనసమేతంబుగా స్వారివెళ్లి "పూర్వదక్షిణపశ్చిమద్వారంబుల రాజప్రజాన్యా యంబుగలదు. ఉత్తరద్వారంబున రాజప్రజాన్యాయము గానరాదు. (ఏల)"అని యడిగిన తొల్లి మీపెద్దలు ఉత్తరపుగమినినుండి మీతండ్రి వీరనృసింహరాయులు భువనైకమల్లునకు అరణంబిచ్చుటయు. తద్వృత్తాంతం బంతయు విని భువనైక మల్లుని అట్లానే హనుమకొండకు పోయి యుద్ధంబునకు పిలిచెద నని ప్రయాణ భేరి వేయించి చనుచున్నసమయంబున భువనైకమల్లునితో ఏకాంతయుద్ధంబున కు పిలిచెద నని వచ్చుటయు. ఈవృత్తాంతంబంతయు భూపాలుడు చారులచే విని సర్వదళంబుల గూర్చుకొని దేవిదత్తం బైన ఖడ్గఖేటకంబులు ఇరుగేలం బూని వేంకటనాథుండు తనమీదికి చనుచున్నాడని శ్రీరంగమదేవికి చెప్పబోవుసమ యంబున, శ్రీరంగమదేవి పతికి నీరాజనం బిచ్చుచోట కన్నీరు దిగిచుకొనిన భువనైకమల్లుం డిట్లనియె. నీవు పుణ్యాంగనవై నాకు నీరాజనం బిచ్చి దీవించు సమయంబున నీవు కన్నీరు దిగుచుకోను కారణంబేమని యడిగిన రాజుతో శ్రీరం గమదేవి యిట్లనియె. తొల్లి మీరు మాయన్న యగువీరనృసింహరాయులతో సఖ్యంబు చేసితిరి. బ్రాహ్మణాగ్నిహోత్రసమక్షంబున సువర్ణపులకాంకితము లుగా వ్రాలు బెట్టితిరి. అట్టిసత్యంబు దాటితిరి. మీజిహ్వకు అసత్యంబు దొర్లె నని ; మాయన్న వీరనృసింహరాయులకు వేంకటనాథుండు ఒక్క(డే)సుతుం డు. దేవివరం బైనఖడ్గఖేటకంబులు ధరియించినమీకు ఎదురునడచి బ్రతుక శక్తుండు గాడని కన్నీరువొడిచె నని పలికె నవిని శ్రీరంగమదేవి నీతి గంభీరవ చనంబులకు సంతోషించి యతనితో వైరంబు చాలించి బుధజనులతో కార్యం బూహించి యతడు తనరాజ్యంబుపై రాకుండునట్లుగా రాజ్యంబున చక్రాకా రంబుగా వేయుగ్రామంబులు భూసురులకు అగ్రహారంబులుగా నిచ్చి అంపు టయు భూసురోత్తములుఅతిత్వరితంబుగానం జని నెల్లూరికడకు వచ్చియున్న వేంకటనాథునిం గని యివిమావిప్ర (ప్ర)ముఖుల కొసంగిన అగ్రహారంబులు, మాభూములు తొక్కవలదని అరికట్టుటయు. అంతట వేంకటనాథుండును

— పరిషత్పుస్తకభాండాగారము. —

27. శివలీలావిలాసము. 497.

ఇది ప్రసిద్ధసత్కవి యగుకూచిమంచి తిమ్మకవిచే రచియింపఁబడినది. ఇందుఁ గవి తాసీగ్రంథమునకుఁ బూర్వము రచించినగ్రంథములను ;

సీ. ప్రౌఢిమై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుంగురామాయణంబు
సారంగధరనరేశ్వరచరిత్రంబు సప్తార్ణవసంగమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహమును సర్పపురస [ర్చి
మంచితక్షేత్రకథనంబు మఱియుఁ బెక్కుశతకదండకసత్కృతుల్ ప్రతిభఁగూ
యుల్లమలరారఁ బార్వతీవల్లభునకుఁ, భక్తినర్పణచేసినభవ్యమతిని.

వ. ఇట్టినేను మదభీష్టదైవతంబైనకుక్కుటేశ్వరశ్రీమన్మహాదేవున కంకితంబుగా మఱియు నొకప్రబంధంబు రచియింపం దొణంగి. (షష్ఠ్యంతములు)

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన శివలీలావిలాసం బనుశృంగారప్రబంధంబునకుం గథావిధానం బెట్టిదనిన —అని పేర్కొనినాఁడు.

పైగ్రంథముల వరుస యిదియే యైయుండునో లేక "వచియింతు వేములవాడభీమనభంగి" వంటిదో తెలియదు. ఈక్రమమే సరియైనచోఁ దిమ్మకవిగారికి మిశ్రకవిత్వము చెప్పుట చేతఁగాదని యెవ్వరో యాక్షేపించినట్లును దానికై రసికజనమనోభిరామము వ్రాసి దానిలో "పరిపరిపీలుకర్బురపురక్షు ?' ణోత్యాది సీసపద్యమును గఠినముగ రచియించె ననియుఁ జెప్పకొనునది కింవదంతి కావలయును. చక్కఁగా నాలుగైదీకవివర్యుగ్రంథములు చదివినవారికి మొత్తమున నచ్చతెనుఁగుపై నధికాదరమున్నట్లు చెప్పకతీరదు. ఈగ్రంథము మాయొద్ద నొకటవయాశ్వాసమును రెండవయాశ్వాసములోఁ గొంతయు నున్నది. శైలికై కొన్ని పద్యములు—

(అర్జునుండు భీష్ము నీకథ యడుగుచున్నాఁడు.)—

క. నీవెఱుఁగని పుణ్యకథల్, క్ష్మావలయమునందు లేవు గద యేనైనన్
భావింపఁగ నఖిలజగ, త్పావని యగుగంగమహిమఁ బ్రతిభం జెపుమా.

గీ. శివుఁడు గంగ నేల శిరమున నిడుకొనె, గంగ విష్ణుపాదకమలమున జ
నించు టెట్లు తాత నిక్కంబుగా నిది, తేటపడఁగ నాకుఁ దెలుపవలయు.

గీ. గంగ కొండఱు జాలరికన్నె యనుచు, నెన్నుచుందురు రమ్మాట యేర్పడంగ

వినఁదలంచెద నమ్మహాదేవి కీవు, కూర్మిపట్టివిగద లసద్గుణకలాప.

సీ. బొమ్మపెండ్లిండ్లు సొంపుగఁజేసి గుజ్జనగూఁటి యామెత లనుంగులకుఁబెట్టు
బలితంపు టపరంజిపంజరంబులనిడి చిలుకబోంట్లకు మేఁత లెలమి నొసఁగు
నాడెంపు నెలజాల మేడలపై నిల్చి లీలమై తూఁగుటుయ్యాల లూఁగు
పరువంపునెత్తావి విరిబొండుమల్లెక్రొంబొదలకు నీరెత్తి ప్రోదిచేయు
బోటులనుగూడి కిన్నెరమీటి యింపు, నాటుకొలుపుచు జిలిబిలిపాటపాడు
హొలిదైవాఱఁ జెంగల్వ కేళకుళుల, నోలలాడి చెలంగు నవ్వాలుగంటి.

సీ. మినువాకతెలినీరునినిచినకుండిక పసిఁడిచాయలగేరు పల్లజడలు
వెన్నెలనిగ్గులు వెదచల్లు నెమ్మేను చక్కనిపటికంపు జపసరంబు...(నారదవర్ణనము)

సి. గడితంపుటపరంజిగట్టుసింగిణివిల్లు గాలిబోనవుఁదిండి కాఁడు నారి
యీరేనుమేనుల నేవుచూపు లకోరియార్మాడుతునియలై యలరునరద
మిరుదుగమొగముల దొరతేసు పూన్పరి పగటివేలుపునెల బండికండ్లు..

మ. కరికిన్ మర్కటకీటపోతములకుం గాలాహికి న్మాలపో
టరికిం జెంచుకొలంపుబత్తునకు వేడ్కన్ మోక్షసామ్రాజ్యసు
స్థిరసౌఖ్యం బొనఁగూర్చి ప్రోచినకృపాసింధుండ వాహా బళీ
సరియే యీకుజకుజ్జవేల్పుదొర లెంచ న్నీకు శ్రీకంధరా.

## 28. రామకృష్ణవిలాసము. 3416.

శేషభట్టరు అప్పలాచార్యుఁ డనుకవివర్యునిచే రచియింపఁబడిన యీ గ్రంథము ౫ అశ్వాసములు గలది.

గద్యము—తిరుమాల్యశైలనృహరికరుణాకటాక్ష లబ్ధకవిత్వచాతుర్యధుర్య శ్రీరంగరాజభట్టారక గురుపాదారవింద మిళిందాయమానమానస కౌండిన్యస గోత్రపవిత్రాపస్తంబసూత్రవిశేష శేషభట్టారకవంశ పయఃపారావారసుధాకర నృసింహార్యకుమారాప్పలార్యవిరచితం బైన రామకృష్ణవిలాసంబు. అని—

దీనికి మాయొద్ద 3 ఆశ్వాసములుగల తాళపత్రగ్రంథమింకొకటి కూడఁ గలదు. మొదటిపద్యము—

శా. శ్రీవిద్యుల్లతికాసమంచితలసజ్జీమూతదివ్యాంగునిన్
దేవాధీశకిరీటరత్నసుమకాంతివ్యాప్తిసత్త్వాదునిన్
సౌవర్ణాధికపీఠ మధ్యనివసచ్ఛంచన్ముఖాంభోజునిన్
సేవింతు న్వరమాల్యశైలనృహరిన్ శృంగారవాఙ్మాధురిన్.

ఇది కాగితపుఁబుస్తకములోనిపాఠము. తాటియాకులపుస్తకములో "జీమూతనీలాంగునిన్" అనియు "సౌవర్ణాధికపీఠమధ్యనివసత్సామ్రాజ్యధౌరేయునిన్" అనియున్నపాఠముల నెవ్వరో కాగితములో సీసపుఁగలముతో లుప్తపూర్ణము గావించినారు తాళపత్రగ్రంథములో రెండవపద్యములో "లాలిత్యంబగుశబ్దసంగతులసల్లావణ్యయుక్తంబుగా" ననుదానిని కాగితప్రతిలో "లాలిత్యంబుగ శబ్దసంగతులు కొల్లల్గాఁగఁజెల్వారఁగా" యని పూర్తిచేసినారు, కాగితపుఁబ్రతికంటెఁ దాళపత్రప్రతి ప్రాచీనమువలె నున్నది. పాఠభేదములిట్లే ప్రతిగ్రంథమున నుప్పతిల్లుచున్నవి.

సీ. శ్రీమించు గుడశైలసీమలో దొడ్లేటిపట్టనవాసుండు భాసురుండు
ఘన మట్టివంశాబ్ధికమనీయచంద్రుండు గురుతర మృదునూళ్ల గోత్రజుండు
నగు వేరనాయుండు నతిముదంబున నన్నుఁ బిలిపించి పల్కె సంప్రీతితోడ
నందనందనుకథానందంబుగా రామకృష్ణవిలాసమ న్కృతియొకటి
భద్రగిరివాసుఁడగు రామభద్రునకును నంకితంబుగరచియింపు మనిన నేను
సమ్మతించుచు ధరమహితమ్ముగాఁగ, నలరు వేరయవంశంబు నభినుతింతు.

అను నిత్యాదిపద్యములవలనఁ బేరయనాయఁడీకృతికిఁ బ్రోత్సాహముచేసి చేయించె నని తేలుచున్నది. ఈనాయని మట్టివంశ మతివిపులముగా వర్ణింపఁబడినది.

"అనిమఱియును బల్లవపత్రఫలభరిత శాఖాస్ఫుటంబగు నవ్వటవిటపిఫలంబు హరి సుతపునకిచ్చి యీఫలంబు నీసతికొసంగుము, దీనివలన నొక్కకుమారుండు జన్మించు మున్ను సూర్యవంశంబున రఘువు గల్గినకతంబున రఘువంశం బనియును జంద్రవంశంబునఁ గురుపాండురాజులు గలిగిన కతంబున కురుపాండవవంశంబు లని ప్రసిద్ధంబులయ్యె. తద్విధంబున వటఫలసంభవుం డగుకుమారుని నామవంశంబు లట్లనే ప్రశస్తంబగు నని చెప్పి హరి తిరోహితుండయ్యె.

గీ. మట్టిఫలమున జన్మించుమహిమచేత, మట్టిరాజన నితనినామంబు చెల్లు
నితనిపేరనె వంశంబు నతిశయిల్లు, ననుచుఁ బల్కిరి యేకవాక్యంబుగాఁగ.

ఇత్యాదికారణకల్పనము చేయఁబడినది.

ఇక్కవికవిత్వములో నందందుఁ బ్రయోగవిరోధములు గలవు గాని శైలిమంచిదియే.

ఉ. వ్యాసమునీంద్ర హాస్తిపురి వద్దిగిలుండుట కేమికారణం
బీసకలావనీతలము నెల్లధరించిన రాజధానియై

భాసిలు దీనిపూర్వకథ బాగుగఁ జెప్పవె సావధానివై
దానఫలప్రదాత శ్రుతిధర్మవిధాత మునీంద్రవందితా.

చ. అధిగతవేదశాస్త్రపరమార్థమె నావయుఁగాఁగఁ గిల్బిషో
దధిఁదరియించి చిత్తము లుదారత నిల్పియు భక్తిసేయు న
య్యధికులు కొంద ఱుర్వి భవదాకృతిఁగాంతురు వారియందె నీ
వధిప సమస్తకాలములయందును నిల్తువు నెల్లభంగులన్.

చ. నగవునఁ బూసెఁ బొన్న చరణస్ఫురితం జిగిరించె మోవు లుం
బొగలు భుజోపగూహనముతో ఫలియించెను గుజ్జుమావులున్
ఎగచినకింశుకంబులును వారిజముల్వికసించెఁ జూచినం
బొగడ సిగిర్చె నిట్లువిరిబోఁణు లొనర్చుటచేత నత్తఱిన్.

29. కవిసర్పగారుడము. 3575.

ఇది యొకఛందస్సు ఇందుఁ గృత్యాదియించుకంతయు లేదు.

" కావున జగదుపకారంబుగా శారదాతిలకంబును వాతూలంబును లక్షణసారంబును లక్షణదీపికయు సాహిత్యచూడామణియును గవికంఠపాశంబును గవిగజాంకుశంబును ఛందోలంకారంబులు మొదలుగాఁ గలసకలలక్షణగ్రంథంబులును సంధించి బంధురవిచిత్రసంధానబంధం బనవద్యంబుగా లక్షణంబువీక్షించి యక్షయాత్మురద్రవై లక్షణ్యాం బమర వీక్షించి గణంబులకు నుత్పత్తియును, ఫలంబులును, రాసులును, యోనులును, నక్షత్రంబులును.........శృంగారాది రసభావంబులు సాధనంబు లెఱింగించెద " అనిప్రారంభించి వ్రాయఁబడినది.

ప్రథమాశ్వాసాంతమున నికటి గద్యమిట్లున్నది.

ఇది శ్రీమన్నందవరకులకలశపారావారాత్రేయసగోత్ర పవిత్ర సుజనవిధేయ, కుకవికాద్రివేయవైనతేయ, కాచనబసవననామధేయ ప్రోక్త శ్రీగిరిమల్లికార్జుననామాంకితం బైనకవిసర్పగారుడంబున గణాక్షరలక్షణం బన్నది ప్రథమాశ్వాసము.

రెండవయాశ్వాసమున గురులఘునిర్ణయము, గణములు, యతిప్రాసములు తెల్పఁబడినవి.

నజభజజల్ జరేఫలఁ బెనంగి, భానుసమానవిస్ఫురనభార
సారాచారవిశారదాయినయతిన్, ఇత్యాదిపద్యము లీకవివాడినాఁడు.
పెద్దిరాజునలంకారములోని పద్దెము లున్నవి.

శసలకుఁ ప్రాసమైత్రి-లక్ష్యం-అమృతనాథుఁడు—

క. వసుమతిచిర కాలంబును, మశకంబై మసుటకంటె మదకరికుంభ
గ్రసనంబగు సింహంబై, మసలుట యొకగడియచాలు మైలముభీమా.

ఈరెండాశ్వాసములు మాత్రమే యున్నవి. విశ్వావసు స॥ ఫాల్గునబ 3 గురువారము యిందుర్త్రి రామయ్యగారు ఖాసాకు వ్రాసికొనినది.

30. విడిపద్యములు-పాటలు. 3432.

ఇందనేకవిధములైన వేదాంతపద్యములు కీర్తనలు పాటలు, గలవు. కొన్ని అల్లమప్రభుశతకములోని పద్యము లున్నది. పరమశైవాచారసాంప్రదాయముల శ్లోకములు మంత్రములు గలవు. కొన్ని శైవపూజావిషయకమైన కర్ణాటాంధ్రసంస్కృతమిళితవాక్యములు గలవు. వీనికుదాహరణము—

"హాసరుజోలిగిపండితారాధ్యరూ, మీాశిబిడబెక్కు, విశ్వాచార్యడు పట్టదేవరూపంచవన్నెలభగె, పృథివిఆకాశదిక్కు-సువర్ణదకళిశ......హేమధారా" ఏకాక్షరమంత్రం అయితనక్కె మరదేవరుకర్తు దీక్షకై ........

చిత్తమాయని మకుటముగల కొన్నిపద్యములు (30 వఱకుఁ) గలవు. దీనిలో—

ఉ. దీనుఁడు భూసురాన్వయుఁడు ధీరుఁడు కౌశికగోత్రజుండు సు
జ్ఞానుఁడు మాడపాటికులజన్ముఁడు సింగనసుబ్బమాంబకున్
సూనుఁడు నారసింహకవి సొంపుకవిత్వపటుత్వపద్యముల్
ధ్యానము చేసి దర్పకవిదారుని గొల్చి తరించు చిత్తమా.

అనుకడపటిపద్యముంబట్టి మాడపాటి నరసింహకవిరచితము లని తెల్లము. పద్యములు భక్తిరసప్రధానములు. వినుండు :—

చ. మితము శతాయువంచుఁ బరమేష్ఠిలిఖించిన కల్లవ్రాఁతసం
గతు లెఱుఁగిట్లు వ్యర్థముగఁ గాలము పోకడవెట్టి మత్తదు
ర్మతిని జరించి సద్గతికి మార్గముగానక పోయి నీ వధో
గతిని బడంగనేమిటికిఁ గామవిరాముని జేరు చిత్తమా.

ఇది శతకము కాదని మొదటి పద్యములోని—"విఘ్నపతిపేరు నుతించి జగత్ప్రసిద్ధిగా భీమచరిత్రచెప్పెద" నని చెప్పినమాట తెల్పుచున్నది. గురుశిష్యసంభాషణపద్యములు గలవు. శబ్దమంజరిలోని కొన్ని శబ్దములున్నవి. వీనిలోఁ గాల్వకోటప్పరచియించిన పద్యములు పదములును గలవు.

౧. చింతలపూఁడివాస నాగభూషణధవళాంగయోగలింగ । ౨. భక్తభవనాశశ్రీశైలపార్వతీశ. 3. భానునిభతేజలక్కమాంబాతనూజమనుజమందారసింగనమంత్రిధీర ౪ మన్మనోరాజశ్రీసిద్ధబసవరాజ. ౫. బీబీనగరనివాసుఁడగుమరిబసవదాసకవీశహృదయనివేశ ఇట్టిమకుటములుగలపద్యములతోఁ, గీర్తనలతో నిండియున్నది. వ్రాఁతగిలినపుస్తకము.

31 లక్షణగ్రంథము 3488.

దీనిపేరు తెలియవచ్చుటలేదు. అప్పకవీయమువలె లక్ష్యలక్షణములతో వ్రాయఁబడినది. ఇందుఁ గవిసర్పగారుడము, కవిజనాశ్రయము, కవిగజాంకుశము, గోకర్ణచ్ఛందము మొదలగువానిలోని లక్షణపద్యములుగలవు. ఇందుదాహరించిన లక్ష్యపద్యములం గొన్నింటిఁ దెల్పుచున్నాము. అసమగ్రగ్రంథము. 40 పత్రములున్నవి. అతిశిథిలమైనప్రతి మాయొద్దనున్నది ఇది నందిగామలో సంపాదింపఁబడినట్లు కానవచ్చుచున్నది ఆశ్వాసాద్యంతము లెందునను గానరావు. సంధిలక్షణము, విభక్తినిర్ణయము, గణలక్షణము, గణమైత్రి, అష్టగణలక్షణము, అక్షరస్థానములు, క్రూరసౌమ్యగ్రహలక్షణము, రాశిపొంతనము, పంచతత్వలక్షణము దివసవారలక్షణములు, మొదలగు ననేకవిషయము లిందుఁదెల్పఁబడినవి.

యుక్కయ్యా—

క. యొక్క యని పలుకనేటికి, నక్కజముగ రాముకార్య మనవష్ఠియగుట్

చిక్కెను రాముని శరముల, నక్కటిలుం డైనదైత్యుఁ డనఁగ ధరిత్రిన్.

నామాఖండయతికి—ద్విపద విప్రనారాయణచరిత్రము.

శ్రీంకరగుణసాంద్ర చిరయశోరుంద్ర, ఆకారరేఖ, రామయభాస్కరేంద్ర.

అనునాసికయతికి—పగారపరాజుపరమయోగి విలాసము.

నిగమచోరకునుఖ డించిన యుల్లఁతియో యబ్ధిలో గిరిమోచినట్టి యుల్లఁతో.

నాచనసోమునివసంతవిలాసము. క. అత్తఱివిటనాగరకుల.—

అభేదయతి వకారమునకు- నీతిభూషణములో—

వలవదు చూడ దుర్జనునవశ్యము చూచినవాని ముందట, న్నిలువ.

లకారమునకు విశ్వేశ్వరశతకము—

లీలాలాలితసంపదల్పయియుపయిన్ లేకున్న లేకుండనీ, గ్రాలుంగన్నులు.

సుబ్బయగారిపద్యము లని కీర్తనలలోనుండియు— (అధ్యాత్మరామాయణకీర్తనలురచించిన సుబ్రహ్మణ్యకవి కావచ్చును)

వేషిద్రుంచినట్టి... .. ..ప్రెంచియెండ, నీడకన్నెఱుఁగఁడమ్మనీకుఁగాను  
శ్రీమగఁగపులనెల్లఁదోడి తెచ్చిదంమగూర్చి, నాఁడెయబ్ధిగట్టెనమ్మనాతినీకు.

(అరసున్నగుఱుతులిందులో "గ" ఇట్లువాడినాఁడు.)

దధప్రాసములు—భీమన్నగారు రవ పాదమున—

క కాదన్న వాఁడెకరణము, వాదఁడచినవాఁడె పేడి వసుధేశుకడన్  
లేదన్నవాఁడె చనవరి, గాథలుపెక్కాడువాఁడె కావ్యుఁడు సుమతీ.

సుమతీశతకము భీమన్నగారిదా? ఏభీమన్నయో ?

సమలఘుప్రాసము—రాఘవవాసు దేవీయములో

క. ఆవానరపతిబలముల్, వ్యావృత్తిని మిన్నునడిచి-నధృతిచే  
నావలరామాఖ్యుఁడు చని, యావాసవముఖ్యులలర నభినుతినుండెన్

(ఆవలరామాఖ్యుఁడు==అబలరామాఖ్యుఁడు అనివాసుదేవీయార్థము. (వబలక భేదము)

సంశయప్లుతమునకు విజయసేనచరిత్రములో—

ఉ. వల్లభుఁడేగె దుర్లభుఁడు వాసదెసం దగులూఁది యిమ్మెయిన్  
దల్లడమంద నేల యుచితస్థితికి నన్నుఁబాపఁ జూచినం  
దల్లియు బంధులోకమును దండ్రియు నేమనువా రెటెంగిరే  
నుల్లము నీకు నట్లు దగునో తగదో పరికించి చూడుమా.

దూరాహ్వానము—పండితారాధ్యుల, శివతత్త్వసారము.

క అయుతి త్రిపురాంతకదే, వాయని పిలుచుటయుఁ గటకమంతయు వినఁగాఁ  
బాయక కిన్నెరబ్రహ్మయు, కోయని యెలుఁగిడియెఁ దొల్లి యురగాభరణా.

సంయుక్తాక్షరయతికి :—నీతిభూషణము.

మ. సకలస్థాణుశిరఃప్రవృత్తినురుపక్షద్వంద్వశుక్లాభిరం  
జకుఁడన్ సర్వదిగంతగామి ససకృత్సంసేవ్యమీనుండనై  
ప్లిసుఁడన్ గావునమత్సమానమగునే శీతాంశుఁడం చెప్పుచున్  
బకమిందుం బ్రహసించుచూడ్కి సుగుణుంబల్కున్ దురాత్ముండిలన్.

ఈపై రీతిని నీలక్షణగ్రంథములోఁ గొన్నియపూర్వగ్రంథములు దెల్పఁబడినవి. అవియెవ్వరురచించిరో యెక్కడనున్నవో.

# విషయసూచిక.

పింగళసంవత్సరపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసముల

శీర్షికలు, తత్కర్తలు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు, చెన్నపురి.

(1911 సం॥న స్థాపింపఁబడినది.)

ప్రతిష్ఠాపకులు :—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి
సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరి రాజాగారగు మహారాజా సర్ వెలుగోటి శ్రీరాజగోపాల
కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీ మన్సబ్దార్.

ఉద్ధారకులు.

శ్రీఉయ్యూరు జమీందారువారగు శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహదర్ వారు.

పింగళ సంవత్సరమునఁ బరిషదధ్యక్షులు.

రావు బహదర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్య పంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

లు

1. మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణం పంతులుగారు, ఏం. ఏ., బి. ఎల్.
2. „ రాయిసాహెబు గుమ్ముడూరి వేంకటరంగరావుగారు, ఎమ్. ఏ.
3. „ ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.

కోశాధ్యక్షులు (ట్రస్టీలు.)

దివాన్ బహదర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,
రావుబహదర్ పిట్టి త్యాగరాయ సెట్టిగారు, బి. ఏ.

పరిషదుద్దేశము :—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించు లక్షణశాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును బ్రమాణపూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్రికనొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రవాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

## చందానిర్ణయము.

| | | |
|---|---|---|
| 1. ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. పోషకులకు | „ | 1000. |
| 3. యావజ్జీవసభ్యులకు | „ | 100. |
| 4 సాధారణసభ్యులకు సంవత్సరమునకు | „ | 6. |
| ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక చందా | „ | 3. |

ఏకేటుగాఁ జందానీయనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేర వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత గ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నమనుమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది వైజయంతీవిలాసముకంటె మిన్న. ౪ ఆశ్వాసములు. ౨౮ పుటలు సవిమర్శమైన ౧౮ పుటలపీఠిక. వెల రు. ౦-౮-౦.

## (2) జైమినిభారతము (ఆంధ్రవచనము.)

రెండువందల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకునిచే రచింపఁబడినది. భాష సలక్షణము శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు. ౦-౧౨-౦.

1917-18 సం॥ ఇంటరుమీడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము

## (3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవి విరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేకలిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రచ్ఛందస్సుల భేదాభేదములు లచ్చుటచ్చుటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగువిషయము లనేకములుగల విపులమగుపీఠికయు, విషయసూచికయు వనుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల రు. ౦-౧౦-౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి.ఏ., బి.ఎల్. గారిచే రచింపఁబడిన సవిమర్శపీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది ఈశాసన మాంధ్రపద్యాత్మికము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి.ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల రు. ౦-౮-౦.

## (5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలయ్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల రు. ౦-౨-౦.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థళము కృష్ణమాచార్యులు బి.ఏ. ఎల్.టీ. గారిచే రచింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల రు ౦-౮-౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Guru. 0-8-0.

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

---

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 12 అరుణాచల నాయఁకవీథి, చింతాద్రిపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రచురింపఁబడియెను.